# విశ్వదర్శనం

## పాశ్చాత్య చింతన



నండూరి
రామమోహనరావు

విక్షిత ప్రచురణలు

# VISWA DARSANAM

An outline of western Philosophy

By
Dr. NANDURI RAMAMOHANA RAO

Published by
**LIKHITHA PRACHURANALU**
VIJAYAWADA - 520 002.

First Edition
August - 1988

Second Edition
December - 1996

Cover Design
BAPU

Price Rs : **175-00**

Printed at
Sai Offset Printers

Sole Distributors
**PALLAVI PUBLICATIONS**
Eluru Road, Vijayawada-520 002.
Ph : 67070



సోక్రటీస్ విషపానం చేస్తున్న దృశ్యం
చిత్రకారుడు : జాక్వియస్ లూయిస్ డేవిడ్ (1787)

కవి, పండితుడు, పరిశోధకుడు,
నాకు పరమాప్తుడు
ఆరుద్రగారికి
సగౌరవంగా
అంకితం

# అధ్యాయ సూచిక

# ముందుమాట

ప్రాచ్య, పాశ్చాత్య విభేదం లేకుండా తత్వశాస్త్రంపట్ల నాకు కల అభి రుచి, ఆసక్తి ఈ రచనకు ప్రేరణ.

చాలా ఏళ్లనాటి సంగతి. బహూశా 1950-51 నాటి విషయం. బెర్ట్రాండ్ రస్సెల్ వ్రాసిన "హిస్టరీ ఆఫ్ వెస్టర్న్ ఫిలాసఫీ" చదివాను. ఆ పద్ధతిలో అంత సరళంగా తెలుగులో పాశ్చాత్య తత్వ సిద్ధాంతాలనే కాక, భారతీయ దర్శనాలను కూడా వ్రాయాలని ఒక ఉబలాటం మనసు లోపలి పొరలలో దోబూచులాడింది.

అయితే, అది ఉబలాటపడినంత తేలిక కాదని తెలుసు. తత్వశాస్త్రం జటిలమైనది. కాగా, పాశ్చాత్య తత్వశాస్త్రం మరీ కొరకరాని కొయ్య. ఎంత అర్థమైనా, అర్థం కావలసింది ఇంకా మిగిలే వుంటుంది. అది అలా వుంచి, అర్థమైనదాన్ని తెలుగులో వివరించడానికి భాషపై ఎంతో ప్రభుత్వం కావాలి. దాన్ని చివరి వరకు కొనసాగించడానికి ఎంతో ఓర్పు, పట్టుదల కావాలి. అందు చేత ఆ ఉబలాటంతో చెలగాటం అలా మనసు లోపల పొరలలోనే మణిగిపోయింది.

అలా కొన్ని దశాబ్దాలు దొర్లిపోయిన తర్వాత విశ్వరూపం, నరావతారం రచనల అనుభవం పిదప, తత్వశాస్త్ర రచన మీదికి మనసు మళ్లీ మళ్లింది. మొదటి నుంచివున్న వేపకాయంత వేదాంతం ప్రేరణగా ఈ రచనకు ఉపక్రమిం చాను. వృత్తి గత కారణాలవల్ల ఒకేసారి గ్రంథ రచన నావల్ల కాగల పని కాదు కనుక, పూర్వపు సైన్సు గ్రంథాలవలెనే "విశ్వదర్శనం" అని పేరు పెట్టిన ఈ తత్వశాస్త్ర రచన కూడా సీరియల్‌గానే మొదలు పెట్టాను. మధ్య మధ్య అనివార్య, సుదీర్ఘ అంతరాయాలతో 1980 చివరి నుంచి 1987 మార్చి వరకు ఆరేళ్లకు పైగా ఆంధ్రజ్యోతి వారపత్రికలో ధారావాహికగా రచన సాగింది. మరికొన్ని అనివార్య కారణాలవల్ల ఇప్పటికిగాని అది పుస్తక రూపంలో వెలుగు చూడడం తటస్థించలేదు.

ఈ రచనకు "విశ్వదర్శనం" అని పేరు పెట్టడానికి కారణం దీని తర్వాత వచ్చే ఉపోద్ఘాతంలో వివరించాను. ప్రాచ్య, పాశ్చాత్య దర్శనాలు రెండింటిని రెండు భాగాలుగా వ్రాయాలన్నది నా కోరిక. మరి ఈ రెండింటిలో మొద టిదిగా పాశ్చాత్య తత్వ శాస్త్రాన్నే ఎందుకు ఎంచుకున్నానంటే, ఏదో ఒక దానితో మొదలు పెట్టాలి కనుక అని తప్ప వేరే సమాధానం లేదు. అ మొదలు పెట్టేది భారతీయ తత్వ శాస్త్రాలతోనే మొదలు పెట్టవచ్చు కదా

అంటే, నిజమే కాని, ఒక మాట : భారతీయ దర్శనాలపై-ఉపనిషత్తులు, షడ్దర్శనాలు, భగవద్గీత, శంకరాద్వైతం ఇత్యాదులపై-తెలుగులో అసంఖ్యాకంగా గ్రంథాలున్నాయి. కాగా, పాశ్చాత్య తత్వశాస్త్రంపై చాలా కొద్దిగానే తెలుగు రచనలున్నాయి. కీర్తిశేషులు శ్రీ గోపీచంద్, శ్రీ జి.వి. కృష్ణారావు మొదలైన వారు వివిధ పాశ్చాత్య దార్శనికులపై వ్రాశారు గాని, అటు గ్రీకు తత్వవేత్తల నుంచి ఇటు జీన్ పాల్ సార్త్రే వరకు ప్రధాన పాశ్చాత్య దార్శనికుల గురించి ఎవరూ ఒకే గ్రంథంలో వ్రాసినట్టు లేదు. అందువల్ల ముందుగా పాశ్చాత్య తత్వ విభాగం పూర్తిచేయడం మంచిదని ఎంచి, అందుకు ఉపక్రమించడం జరిగింది.

ఒక ధర్మ సందేహం రావచ్చు. మన తత్వశాస్త్రం ప్రపంచంలో కల్లా గొప్పది కదా, మన దర్శనాల కంటె పాశ్చాత్య దర్శనాలు పొడిచేసింది ఏమి వుంది; అదీ కాక, తెలుగువారు పాశ్చాత్య తత్వశాస్త్రం గురించి తెలుసుకోవలసిన అవసరం వుందా, తెలియ జెప్పవలసిన అవసరం వుందా అని కొందరు అడగవచ్చు. అయితే, ఒకటే గమనించాలి–భారతీయ దర్శనాలు గొప్పవే. అంతమాత్రాన పాశ్చాత్య తత్వశాస్త్రాన్ని తక్కువ చేయడం తెలివి తక్కువ. జిజ్ఞాసువులకు భారతీయ దర్శనాలు ఎంత ఆసక్తి కలిగిస్తాయో, పాశ్చాత్య సిద్ధాంతాలు కూడా అంతే ఆసక్తి కలిగిస్తాయి. వాటివలె వీటిని కూడా పరిచయం చేసుకోవడం, వీలైతే అధ్యయనం చేయడం అవసరం.

అదీకాక, ఈ రోజున ప్రపంచాన్ని అమితంగా ప్రభావితం చేస్తున్నవి–పాశ్చాత్య సంస్కృతి, పాశ్చాత్య నాగరికత. ఈనాడు పాశ్చాత్య నాగరికత వాసన కూడా తగలకుండా తలుపులు, కిటికీలు బిడాయించుకుని కూర్చోగల దేశం ప్రపంచంలో లేదు. అది అసాధ్యం, అవాంఛనీయం కూడా. ఇది అన్ని దేశాలకు వలె ఇండియాకు కూడా వర్తిస్తుంది.

మరి, ఇంతగా మనల్ని ప్రభావితులను చేస్తున్న పాశ్చాత్య సంస్కృతీ సభ్యతా, నాగరికతల మూల బీజాలు ఎక్కడ వున్నాయి? వారి తాత్విక చింతనలో వున్నాయి. వారి తాత్విక చింతననుంచే వారి జీవన దృక్పథం, వారి సాంఘిక, ఆర్థిక, రాజకీయ, కళా, సాంస్కృతిక వ్యవస్థలన్నీ పుట్టుకు వచ్చాయి. అసలు ఆధునిక విజ్ఞాన శాస్త్రాల పునాదులే పాశ్చాత్య తత్వచింతనలో వున్నాయి. అందుచేత దాన్ని గురించి కొద్దిగానో, గొప్పగానో తెలుసుకోవడం అవసరం, అభిలషణీయం.

మరొక విషయం : ప్రాచ్య, పాశ్చాత్య తత్వచింతనలలో మౌలిక భేదాలున్న మాట నిజమే. కాని కొన్ని పోలికలు కూడా వున్నాయి. వీటిని ప్లేటో, కాంట్, హెగెల్, షోపెన్‌హూవర్ మొదలైన వారి తత్వ సిద్ధాంతాలలో చూడ

వచ్చు. ఆ పోలికలను చూచాయగా, సందర్భానుసారంగా ఈ గ్రంథంలో అక్కడక్కడ ఉటంకించడం జరిగింది. సహృదయులకు ఇది ఆసక్తి కలిగిస్తుందని ఆశిస్తున్నాను.

మన దర్శనాలు అర్థమైనంత సులభంగా పాశ్చాత్యుల సిద్ధాంతాలు అర్థం కావని, అంత బుర్ర బద్దలు కొట్టుకుని పాశ్చాత్యుల ఫిలాసఫీ చదవకపోతేనేం అనే వారున్నారు. నిజమే. ఫిలాసఫీ చదవకపోయినా పరవాలేదు. ఏదీ చదవక పోయినా పరవాలేదు. ఫిలాసఫీ పట్ల ఆసక్తి కలవారికోసం, లేని వారికి ఆసక్తి కలిగించడంకోసం ఈ రచన ఉద్దిష్టమైంది. ఇక విషయ జాటిల్యం అంటారా? లోకంలో ఏది జటిలం కాదు? జువాలజీ, బోటనీ, మెడిసిన్, ఫిజిక్సు, కెమిస్ట్రీ, గణితం, ఎకనామిక్సు—ఏ శాస్త్రమైనా తీసుకోండి. జటిలంగా వుందనుకుంటే జటిలమే. అలాగని ఆ శాస్త్రాలను అధ్యయనం చేయకుండా వుండలేము కదా? ఆ మాటకు వస్తే కవిత్వం కూడా జటిలమే. తెలుగులో ప్రాచీన కావ్యాలే కాదు, అధునిక కవిత్వం కూడా అయోమయమేనని భయపడి ఓ నమస్కారం పడేసేవారు ఎందరో వున్నారు. చాలామందికి తెలుగు సిని మాలు, వాటికోసం వ్రాసే నవలలు తప్ప ఏవైనా జటిలంగానే వుంటాయి. అలాకాక అభిరుచి, ఆసక్తి వుంటే ఏదైనా సులభంగాను, అవి లేకపోతే ఏదైనా గహనంగాను వుంటుంది.

అయితే, ఫిలాసఫీలో అసలే గహనత లేదని కాదు. చాలామంది ఫిలాస ఫర్లు, ఫిలాసఫీ వ్యాఖ్యాతలు, తాము చెప్పదలచినదాన్ని సరళంగా చెప్పడం కుదరకనే కఠినంగా చెబుతారు. అన్ని శాస్త్రాలకువలె తత్వశాస్త్రానికి కూడా ఒక పరిభాష వుంది. ఆ విషయాన్ని ఆ పరిభాషలోనే చెప్పాలి. దానికితోడు ప్రతి తత్వవేత్త తనకోసం ఒక ప్రత్యేక పరిభాషను నిర్మించుకుంటాడు. దానితో సామాన్య విషయం కూడా జటిలంగా తయారవుతుంది.

ఒక్కొక్క తత్వసిద్ధాంతాన్ని ఎంత తన్నుకున్నా సులభంగా చెప్పడం కుద రదు. ఐన్‌స్టయిన్ సాపేక్ష సిద్ధాంతాన్నిగాని, లేదా క్వాంటమ్ మెకానిక్స్‌లాంటి సిద్ధాంతాలనుగాని గహనమైన గణిత సూత్రాలలోతప్ప చెప్పడం కుదరదు. అవి మన సాధారణోహలకు, మానసిక దృశ్య చిత్రణకు అందవు. కొన్ని తత్వ సిద్ధాం తాలు కూడా అంతే. వాటిని క్లిష్ట పరిభాషలోతప్ప చెప్పడం కుదరదు. ఆ క్లిష్టతను తొలగించి, లేదా తగ్గించి చెబితే— సైన్సులలోవలెనే ఫిలాసఫీలో కూడా — అసలు సిద్ధాంతానికి అపచారం కలగవచ్చు కూడా.

అయినా, సాధారణ పాఠకులకు తత్వశాస్త్రాన్ని పరిచయం చేయాలన్నా, దానిపై ఆసక్తి కలిగించాలన్నా, పరిభాషా జటిలత్వాన్ని తగ్గించే చెప్పవలసి

వుంటుంది. అక్కడికీ ఈ రచన అక్కడక్కడ నారికేళపాకంలవలె వున్నదని పించే ఘట్టాలు లేకపోలేదు.

ఫిలాసఫీపట్ల చాలామందికి అపోహలు, అదంతా చాదస్తమనే చిన్నచూపు వున్నందువల్ల. ఈ రచనను సమర్థించుకుంటూ అపాలజెటిక్‌గా ఈ ముక్కలు వ్రాయవలసి వస్తున్నది. కొందరి దృష్టిలో సైన్సులు గొప్పవి. అందులోను ఫిజికల్ సైన్సులు. విశ్వరహస్యాన్ని, ప్రపంచ సత్యాన్ని సైన్సులు పూర్తిగా ఆవిష్కరించగలవని, తక్కినవన్నీ దండుగ అని, మనిషికి సైంటిఫిక్ దృక్పథం వుంటే చాలునని కొందరు నమ్ముతారు. ఇది పొరపాటు. సైన్సులు అవ సరమే. సైంటిఫిక్ దృక్పథం అవసరమే. కాని, సత్యావిష్కారానికి సైన్సు ఒక్కటే సాధనం కాదు, అదొక్కటే చాలదు. సైన్సుకు అందని ప్రపంచం, సైన్సు అర్థం చెప్పలేని ప్రపంచం ఎంతో వున్నది.

ఉదాహరణకు సైన్సుకు విలువలతో సంబంధం లేదు. యథార్థాన్ని, అంటే వాస్తవంగా వున్నదాన్ని పరిశీలించి సైన్సు వర్ణిస్తుంది. విలువలు (Values) దాని పరిధిలోకి రావు. విలువలకు సంబంధించినంతవరకు అది తటస్థంగా వుండి పోతుంది. ఏది మంచి, ఏది చెడు? ఏది నీతి, ఏది కాదు? ఏది కర్తవ్యం. ఏది కాదు? ఏది రమణీయం, ఏది కాదు? ఏది ప్రేమాస్పదం, ఏది కాదు? మొదలైన విలువల నిర్ణయం (Value judgments) తో సైన్సుకు ప్రమేయం లేదు. అలాగే మానవోద్రేకాలు, ఆవేశాలు, అనుభూతులు కూడా. వాటిని సైంటిఫిక్‌గా విశ్లేషించడానికి వీలున్నది. అయినా, విశ్లేషణకు అందని విశేషం వాటిలో ఎంతైనా వున్నది. అది వైయక్తికమైన విలువలపై ఆధారపడిన విశేషం.

ఉదాహరణకి— ఒక గొప్ప గాయకుని గానం వింటాము. గానం అంటే ఒకానొక క్రమంలో అమరిన అహ్లాదకరమైన ధ్వనుల సముదాయం. దాన్ని శాస్త్రజ్ఞుడు విశ్లేషించి, రకరకాల ఫ్రీక్వెన్సీలు, దీర్ఘతలు కలిగిన ధ్వని తరంగా లుగా తేలుస్తాడు. కాని, మనకు అహ్లాదం కలిగించే శక్తి ఆ వాయుతరంగాలకు ఎలా వచ్చిందో అతడు చెప్పలేడు. అవే వాయుతరంగాలు ఆ సంగీత సంప్రదా యంతో పరిచయం లేనివాడి చెవికి సోకినప్పుడు అతడికి అహ్లాదం కలిగించలేకపో వచ్చు. అంటే అహ్లాదకారక గుణం వస్తుగతం కాక వ్యక్తిగతమైన దన్నమాట. దాన్ని సైన్సు విశ్లేషించి చూపలేదు.

అలాగే ఒక జోక్ — హాస్యోక్తి — విన్నప్పుడు మనకు నవ్వు కలుగుతుంది. శాస్త్రజ్ఞుడు దాన్ని విశ్లేషించి ఏయే కండరాల కదలికవల్ల నవ్వు కలిగిందో చెబుతాడు. కృత్రిమంగా అవే కండరాలను అదే పద్ధతిలో కదిలించి నవ్వు పుట్టించగలడు కూడా. కాని, ఆ నవ్వు వేరు, హాస్యోక్తి విన్నప్పుడు మనలో

కలిగిన భావాలు పుట్టించే నవ్వు వేరు. ఈ రెండవరకం నవ్వు (హాస్యోక్తి వల్ల పుట్టేది) సైన్సుకు ప్రమేయంలేని నవ్వు. హాస్యోక్తివల్ల ఎందుకు నవ్వు కలిగిందో తెలుసుకొనడానికి హాస్యోక్తిని విశ్లేషించడం మొదలు పెడితే, విశ్లేషణ మిగులుతుందితప్ప హాస్యం మిగలదు– గులాబీపువ్వులో అందం ఎక్కడున్నదో కనుగొనడానికి రేకులన్నీ తుంపిచూస్తే, రేకులు మిగిలి అందం మిగలనట్టు.

రామణీయకం సైన్సు పరిధిలోకి రావట్టే నైతికత్వం (Morality) కూడా రాదు. ఏది మంచి, ఏది చెడు అనేది సైన్సు చెప్పలేదు. అది "వేల్యూ జడ్జిమెంటు"కు సంబంధించింది. ఉదాహరణకు అణ్వస్త్ర ప్రయోగంవల్ల జరిగే విధ్వంసాన్ని సైన్సు వర్ణించగలదు కాని, ఆ విధ్వంసం మంచి, చెడులను గురించి చెప్పలేదు. అణ్వస్త్ర విస్ఫోటనంవల్ల కలిగే భౌతికమైన మార్పులతోనే సైన్సుకు ప్రమేయం తప్ప అది అసలు విధ్వంసం అవునో కాదో కూడా చెప్పదు. అలాగే మిగిలిన విలువల నిర్ణయం కూడా.

అందుచేతనే సైన్సు మానవాళికి, మానవ జీవితానికి ఎంత ముఖ్యమైన దైనా అదొక్కటే పరమార్థం కాదు. తత్వశాస్త్రం అలా కాదు. సైన్సుల సహాయం తీసుకుంటుంది. సైన్సులలో వస్తున్న కొత్త కొత్త మార్పులను పరిగణనలోకి తీసుకొని తన వాదానికి ఉపయోగించుకుంటుంది. అయితే, కేవలం భౌతికశాస్త్రాలతోనే తత్వశాస్త్రం ఆగిపోదు. భౌతిక విశ్వంతో పాటు మొత్తం మానవజీవిత వ్యాపారమంతటిని తన పరిధిలోకి తెచ్చుకుని సర్వసమగ్రమైన సిద్ధాంత సౌధాన్ని నిర్మించడానికి ప్రయత్నిస్తుంది. మానవ జీవితానికి సంబంధించిన సకల వ్యాసంగాలను తీసుకుని సమన్వయం చేయడానికి, ఆ సమన్వయంలోనుంచి సత్యాన్ని ఆవిష్కరించడానికి ప్రయత్నిస్తుంది.

తత్వశాస్త్రాన్ని శాస్త్రాలకు రాణి (Queen of sciences) అని, దాని పరిధిలోకి రాని సైన్సుగాని, ఏ ఇతర మానవ వ్యాసంగంగాని లేదని పండితులు చెబుతారు. అయితే పాశ్చాత్య తత్వశాస్త్రంలో ముఖ్యమైన విభాగాలు కొన్ని వున్నాయి. ఒకటి– లాజిక్ (తర్కం), రెండు– మెటఫిజిక్స్ (పారభౌతికశాస్త్రం), మూడు– ఎపిస్టెమాలజీ (జ్ఞానమీమాంస), నాలుగు– ఎథిక్స్ (నీతిశాస్త్రం), అయిదు– ఈస్తటిక్స్ (రామణీయక మీమాంస, లేదా అలంకారశాస్త్రం), ఆరు– సైకాలజీ (మనస్తత్వ శాస్త్రం), ఏడు– పోలిటిక్స్ (రాజనీతిశాస్త్రం), ఎనిమిది– హిస్టరీ (చరిత్ర). ఇవన్నీ దేనికవే ముఖ్యమైనవి. అయినా, ఆసక్తి కారకగుణంరీత్యా, ప్రాధాన్యంరీత్యా ఈ గ్రంథంలో మెటఫిజిక్సును, ఎపిస్టెమాజీలని ఎక్కువగా స్పృశించడం జరిగింది. అయితే మిగిలిన విభాగాలు కూడా సందర్భానుసారంగా ప్రస్తావనకు వస్తూనే వుంటాయి.

మెటఫిజిక్స్ (పారభౌతికశాస్త్రం) అంటే ఇంద్రియగోచరమవుతున్న భౌతిక విశ్వానికి ఆధారభూతంగా, దానికి అతీతంగా వున్న పరమ సత్యాన్ని కనుగొనడానికి ప్రయత్నిస్తూ వివేచన చేసే శాస్త్రం. ఎపిస్టెమాలజీ (జ్ఞానశాస్త్రం) అంటే ప్రపంచాన్ని గురించిన జ్ఞానం (knowledge) మనకు ఏవిధంగా కలుగుతున్నదో వివేచించే శాస్త్రం. పాశ్చాత్య తత్వశాస్త్రంలో ఇవే ముఖ్యమైనవి, ఎక్కువ ఆసక్తికరమైనవి.

ప్రముఖ గణిత- భౌతిక శాస్త్రవేత్త సర్ జేమ్స్ జీన్స్ వైజ్ఞానిక తత్వవేత్త (సైంటిఫిక్ ఫిలాసఫర్) కూడా. ఆయన ఫిజిక్స్ అండ్ ఫిలాసఫీ అనే గ్రంథంలో ఒక విభాగంలో యాథార్థ్యాన్ని ((Reality) లోతైన నదీప్రవాహంతో పోల్చాడు. మనకు ఇంద్రియగోచరమయ్యే ఈ భౌతిక ప్రపంచం ఆ నదీప్రవాహపు ఉపరితలం వంటిది. మనకు కనబడేది, తెలిసేది ఉపరితలం మాత్రమే. పైనుంచి చూస్తే దాని అడుగున ఏమివున్నదో తెలియదు. ప్రవాహం అడుగున జరిగే సంఘటనల కారణంగా ఉపరితలంమీదికి బుడగలు వస్తూవుంటాయి, పోతూవుంటాయి. నీరు సుడులు తిరుగుతుంది. ఇంకా రకరకాలుగా ఉపరితలం మారుతూ వుంటుంది. ఉపరితలం అడుగున ఏమి జరుగుతున్నదో అనుమాన ప్రమాణం (inference) ద్వారా ఊహించవలసిందేతప్ప ఒడ్డునుంచి ప్రత్యక్షంగా చూడలేము. ఆ విధంగా అనుమాన ప్రమాణం ద్వారా యాథార్థ్యాన్ని కనుగొనడానికి ప్రయత్నించే ఒక సాధనం సైన్సు. మరొక సాధనం ఫిలాసఫీ. మొత్తంమీద ఫిజిసిస్టువలె మెటఫిజిసిస్టు కూడా ఇంద్రియగోచరమయ్యే నది ఉపరితలం మాత్రమే అసలు ప్రపంచమని, అది తప్ప మరేమీ లేదని, ఉపరితలమే మొత్తం సత్యమని అంగీకరించడు. నిజానికి, ఉపరితలం కంటె దాని అడుగుభాగమే ఎక్కువ యథార్థమని ఉభయులు భావిస్తారు. ఈ భావన నుంచే ఫిలాసఫీ అంతా- అది భారతీయ వేదాంతమైనా, పాశ్చాత్య తత్వశాస్త్రమైనా— వచ్చింది. అందుచేతనే ఫిలాసఫీ పరమ లక్ష్యం "అంతిమ సత్యాన్వేషణ" అయింది.

"విశ్వదర్శనం" రచనా ప్రణాళికను గురించి రెండు ముక్కలు : పాశ్చాత్య తత్వశాస్త్రానికి ఆద్యుడుగా థేలీస్ (Thales) ను పేర్కొంటారు. అతనితో మొదలు పెట్టి సోక్రటీస్, ప్లేటో, అరిస్టాటిల్ వంటి ప్రాచీనయుగ తత్వవేత్తలను గురించి, దెకార్త్, స్పినోజా, లైబ్నిజ్, కాంట్, హెగెల్ మొదలైన ఆధునిక యుగ తత్వవేత్తలను గురించి వ్రాస్తూ అస్తిత్వవాది జీన్ పాల్ సార్త్రతో ఈ గ్రంథం ముగించాను. గ్రంథ విస్తరణ భీతివల్ల కొందరు ప్రముఖతత్వవేత్తలను— ఫిక్టే, స్పెన్సర్, కామ్టే మొదలైన వారిని, వైట్‌హెడ్, విట్‌జెన్‌స్టయిన్ వంటి వారిని, ఫ్రాయిడ్, యాడ్లర్, యూంగ్ వంటి మనస్తత్వ శాస్త్రజ్ఞ

లను, అస్తిత్వానికి చెందిన హైడెగ్గర్, కామూ మొదలైనవారిని, శాంతాయన, డ్యూయీ వంటి అమెరికన్ తత్వవేత్తలను పలువురిని వదలివేయక తప్పలేదు. వారిని గురించి కూడా వ్రాస్తే గ్రంథం చాలా విస్తరిస్తుంది. అయినా, పాశ్చాత్య చింతనా ప్రపంచాన్ని ప్రభావితం చేసిన ప్రముఖులందరిని (ఇద్దరు ముగ్గురు మినహా) పరిచయం చేయగలిగాననే అనుకుంటున్నాను.

పాశ్చాత్య తత్వవేత్తల సిద్ధాంతాలతో తెలుగు పాఠకులకు ప్రథమ పరిచయం కలిగించడం మాత్రమే ఈ రచన ఉద్దేశం. అందుచేత ఆయా సిద్ధాంతాలను సంగ్రహంగా, తలస్పర్శిగా మాత్రమే వివరించడం జరిగింది తప్ప కూలంకషంగా కాదు. అలా విస్తృతంగా వ్రాస్తే తిరిగి ఈ గ్రంథం ఇంతకు ఇంత అయి వుండేది. అలాగే ఆయా సిద్ధాంతాల పరామర్శతోనే సరిపుచ్చాను తప్ప, తులనాత్మక పరిశీలనలోకి, విమర్శాత్మక సమీక్షలోనికి పోలేదు. అలాచేస్తే అదికూడా గ్రంథాన్ని పెంచేది. ఇవన్నీ సాధ్యంకాక ఆయా సిద్ధాంతాల ముఖపరిచయం అనే పరిమిత లక్ష్యంతోనే గ్రంథ రచన చేశాను.

కేవలం తాత్విక సిద్ధాంతాలను మాత్రమే వివరిస్తే అది అంత ఆసక్తికరంగా వుండదేమోనని ఆయా తత్వవేత్తల జీవిత కథలను కూడా ఇందులో సంగ్రహంగా పొందుపరచాను. సాధారణంగా తత్వవేత్త జీవిత ప్రభావం అతని సిద్ధాంతం మీద వుంటుందని అంటారు. అందువల్ల ఆ రెండింటిని కలగలిపి ఇవ్వడానికి ఈ రచనలో ప్రయత్నించాను. దీనివల్ల ఈ గ్రంథం పఠనీయత (readability) పెరిగిందని ఆశపడుతున్నాను.

ఈ గ్రంథం రచనకు ఆధారంగా నేను తీసుకున్న వివిధ పుస్తకాల పట్టికను గ్రంథాంతంలో ఇచ్చాను. ఇందులో క్లుప్తంగా వ్రాసిన ఆయా తత్వవేత్తల సిద్ధాంతాలను మరికొంత వివరంగా తెలుసుకోగోరినవారు ఆ పుస్తకాలను చదువుకోవచ్చు.

—నండూరి రామమోహనరావు




# 1
# ఉపోద్ఘాతం

శ్రీరాముడు నూనూగు మీసాల నూత్న యౌవనంలో వున్నప్పటి ఉదంతం. ఆయన విద్యాభ్యాసం పూర్తి అయింది. దేశాలన్నీ తిరిగి, పుణ్యక్షేత్రాలన్నీ సేవించుకుని అయోధ్యకు మరలి వచ్చాడు.

మరలి వచ్చిన నాటి నుంచి శ్రీరాముని మనస్సు ఎందుకో చింతాక్రాంతమైపోయింది. ఏ సుఖాలమీదికి మనస్సు పోవడంలేదు. ఏవేవో ఆలోచనలు ముసురుతున్నాయి. ఏదో అశాంతి, అసంతృప్తి ఆయనను నిలవనీయడంలేదు.

రాముడి దిగులుచూసి, తండ్రి దశరథుడికి దిగులు పట్టుకుంది. “ఏమిటి నాయనా! ఎందుకిలా దిగులుగా వున్నావు?” అని అడిగాడు. రాముడు “ఏమీలేదు నాన్నగారూ!” అనడం తప్ప, ఎన్నిసారులు అడిగినా తన చింతా కారణం చెప్పలేదు. దశరథుడికి భయంవేసింది. కులగురువైన వశిష్ఠుడికి కబురు పెట్టాడు. ఆయన వచ్చి రాముడిని సంగతేమిటో చెప్పమని గుచ్చి గుచ్చి అడిగాడు. గురువుగారు అడగడంతో రాముడు సమాధానం చెప్పక తప్పలేదు.

ఈ లోకంలో శాశ్వతమైనదేదీ కనిపించడంలేదు. అన్నీ అస్థిరమైనవే. మనుషులు పుడతారు, చనిపోతారు; మళ్లీ పుడతారు, మళ్లీ... ఈ నిరంతర వలయం నుంచి మానవుడికి విముక్తి లేదా? ఈ ప్రపంచం ఎందుకిలా వుంది? ఇదంతా మన మనస్సు కల్పిస్తున్న భ్రమేనా? నిత్యమైనది, సత్యమైనది ఏదీ లేదా?...

తన శిష్యుడి సందేహాలన్నీ విని, వాటిని నివృత్తి చేయడానికి వశిష్ఠుడు పూనుకున్నాడు. ఆయన శ్రీరాముడికి బోధించాడంటూ వాల్మీకి పేరిట ఎవరో వ్రాసిన వేదాంత సిద్ధాంత సంగ్రహం "యోగవాసిష్ఠం" అనే పేరుతో ప్రసిద్ధికెక్కింది.

## ధమ్మపదం

కపిలవస్తుపురాధీశుడైన శాక్యవంశపు రాజు శుద్ధోదనుడి ఏకైక పుత్రుడు సిద్ధార్థుడు. అతడు పుట్టినప్పుడే దైవజ్ఞులు హెచ్చరించారు: 'దుఃఖమయ దృశ్యాలేవైనా అతని కంటబడితే విరక్తిచెంది సన్యాసం స్వీకరించే ప్రమాదం కలదు సుమా' అని.

అందుచేత శుద్ధోదనుడు తన కుమారుడికి ఎటువంటి అసహ్య దృశ్యాలు కనబడ కుండా జాగ్రత్తగా, భోగభాగ్య విలాసాల మధ్య పెంచాడు. యశోధర అనే అతిలోక రూపవతినిచ్చి వివాహం చేశాడు. సిద్ధార్థునికొక కుమారుడు కలిగాడు కూడా.

శుద్ధోదనుడు ఎంత జాగ్రత్తపడినా, సిద్ధార్థుడికి కొన్ని దుఃఖకారక దృశ్యాలు కంటపడక మానలేదు. ఒకనాడు పురవీథులలో దేహమంతా ముడుతలుపడి నడుం వంగి నడవలేక నడవలేక నడుస్తున్న ఒక వృద్ధుడిని చూశాడు. మరొకసారి భయంకర రోగగ్రస్తుడైన వ్యక్తిని చూశాడు. వేరొకసారి అతనికి బంధుమిత్రుల రోదనల మధ్య శ్మశానానికి వెడుతున్న వ్యక్తి శవం ఎదురైంది. ఆ తర్వాత సర్వసంగ పరిత్యాగియైన ఒక సన్యాసి అతనికి తటస్థపడ్డాడు.

సిద్ధార్థుడు దీర్ఘంగా ఆలోచించాడు. ప్రపంచం అంతా దుఃఖమయంగా కన బడుతున్నది. ఎందువల్ల లోకంలో ఇంతటి దుఃఖం? దీనినుంచి తప్పించుకునే మార్గం లేదా? శాశ్వతానంద సాధనకు, జనన మరణవలయం నుంచి విముక్తికి ఉపాయమే లేదా?

ఈ ప్రశ్నలకు సమాధానాలను అన్వేషించడానికే సిద్ధార్థుడు ఒకనాటి రాత్రి భార్యాపుత్రులను, తండ్రిని, రాజ్యాన్ని, సకల భోగభాగ్యాలను త్యజించి అడ

వికి వెళ్లిపోయాడు; సన్యసించాడు. కొన్ని సంవత్సరాల దీర్ఘాన్వేషణ తర్వాత అతడికి సత్యస్వరూప సంబుద్ధి కలిగింది. తాను కనుగొన్న సత్యాన్ని లోకానికి చాటడానికై బుద్ధుడైన సిద్ధార్థుడు 45 సంవత్సరాలపాటు దేశాటనంచేస్తూ ధర్మచక్ర ప్రవర్తనం కావిస్తూ తన 80 వ ఏట మహాపరినిర్వాణం చెందాడు.

## విషాదయోగం

ధర్మక్షేత్రమైన కురుక్షేత్రంలో కౌరవ, పాండవ చతురంగ బలాలు ఎదురెదురుగా మోహరించి వున్నాయి. వాటి మధ్య శ్రీకృష్ణుడు సారథిగా అర్జునుడు రథారూఢుడై వున్నాడు. కౌరవ బలాన్ని తేరి చూడగా, తాతలు, తండ్రులు, గురువులు, సోదరులు, కుమారులు, స్నేహితులు ఎందరో కనబడ్డారు. కేవలం రాజ్యలాభం కోసమని ఇందరు బంధు మిత్రులను సంహరించడమా అనే ధర్మసందేహం అర్జునుడికి కలిగింది. విషాదంతో విహ్వాలుడయ్యాడు. యుద్ధ విముఖుడై ఆయుధాలు కింద పడవేశాడు. అప్పుడు అర్జునుడి విషాదాన్ని పోగొట్టి కర్తవ్యోన్ముఖుడిని చేయడానికి శ్రీకృష్ణుడు గీతోపదేశం చేశాడు.

## సో క్ర టీ స్

గ్రీసు దేశంలో డెల్ఫీ అనేచోట ఒక ఆలయంలో ఒక గణాచారి వుండేది. ఎవరైనా ప్రశ్నలడిగితే అక్కడి దివ్యవాణి (ఆరకిల్) గణాచారి ద్వారా సమాధానాలు చెప్పేది.

ఒకసారి ఏథెన్సు నగర పౌరుడైన సోక్రటీస్ డెల్ఫీ వెళ్ళాడు.

"ఎవరు నీవు? ఏమి కావాలి?" అని దివ్యవాణి గణాచారి ద్వారా ప్రశ్నించింది.

"నేను సోక్రటీస్‌ను, నాకు తెలిసింది ఒక్కటే —నాకు ఏమీ తెలియదని. ఏమి చేయమంటావు?"

"నిన్ను నీవు తెలుసుకో," అని దివ్యవాణి సమాధానమిచ్చింది.

## తత్త్వ విచారం *

ఈ కథలు చెప్పడంలో రచయిత ఉద్దేశం ఇది :— లోకంలో కొందరు శ్రీరాముని వంటివారు, కొందరు సిద్ధార్థునివంటివారు వుంటారు. సమస్త భోగభాగ్య విలాసాలను అనుభవిస్తున్న సమయంలో వారికి వాటిపై విముఖత కలుగుతుంది. సౌఖ్యాల నశ్వరత్వం, భౌతికప్రపంచపు అశాశ్వతత్వం వారిని అవ్యయానందంకోసం అర్రులు చాచేటట్టు చేస్తుంది. దాన్ని కనుగొనడానికి తత్త్వ వివేచన ప్రారంభిస్తారు.

ప్రతిమనిషి ఒక అర్జునుడు. అతడి మనస్సు ఒక కురుక్షేత్రం. కొన్ని క్లిష్ట సమయాలలో అర్జునుడికివలెనే ప్రతిమనిషి విషాదగ్రస్తుడవుతాడు. ఏది ధర్మం? ఏది అధర్మం? ఏది సత్యం, ఏది అసత్యం? ఏది నిత్యం, ఏది అనిత్యం? ఏదిహింస, ఏది అహింస? ఏది నీతి, ఏది అవినీతి?— ఇటువంటి సందేహ సందోహంతో మనస్సు వికలమౌతుంది. ఈ సందేహ నివృత్తి కోసం ప్రతి వ్యక్తికి తత్వవివేచన అవసరమవుతుంది.

డెల్ఫిక్ దివ్యవాణి (ఒరకిల్) "నిన్ను నీవు తెలుసుకో!" అని సోక్రటీస్‌కు సలహా ఇచ్చింది. దీనికోసం అతడు తత్వాన్వేషణ ప్రారంభించాడు.

ఏథెన్సు నగర వీథులలో కనబడిన ప్రతి పరిచితుడిని నిలబెట్టి వాదనలోకి దింపేవాడు. అతడి సంభాషణ ప్రశ్నలు, సమాధానాల రూపంలో సాగేది.

నీకు అన్యాయం జరిగిందంటున్నావా? న్యాయం అంటే నీ నిర్వచనం ఏమిటి?

నీవు ప్రజాస్వామ్యవాదివా? ప్రజాస్వామ్యం అంటే నీ ఉద్దేశం?

నీతి అంటే ఏమిటి? సత్యం అంటే ఏమిటి? సౌందర్యం అంటే ఏమిటి? ప్రేమ అంటే ఏమిటి? మంచితనం అంటే ఏమిటి?

ఇలాగ సోక్రటీస్ ప్రశ్నలువేసి, సమాధానాలు రాబట్టేవాడు. ఆ సమాధానా లలోని లోపాలను చర్చించి వాటిని తిరస్కరించి, సరైన నిర్వచనాల కోసం మళ్లీ ప్రశ్నించేవాడు.

సోక్రటీస్ సంభాషణ సాధారణంగా "టో టీ" అనే గ్రీకు మాటతో ప్రారంభ మయ్యేది. అంటే "ఏమిటీ?" అని అర్థం. "నీవు న్యాయవాదివా? న్యాయం అంటే ఏమిటీ? నీవు ప్రేమిస్తున్నావా? ప్రేమ అంటే ఏమిటీ? టో టీ?..."— ఇలా సాగేది అతని సంభాషణ.

టో టీ? ఏమిటీ? ఎందుకూ? ఎలా? ఎప్పుడు? ఎక్కడ?— ఇటువంటి ప్రశ్నలతోనే తత్వవిచారం ప్రారంభమవుతుంది. ఈ ప్రశ్నలు లేనిదే మానవ నాగరికత లేదు. మానవ మేధా వికాసం లేదు. మానవ పురోగతి లేదు. మానవుడే లేదు.

## తాత్విక జంతువు

ప్రస్తుతం భూమండలంపై నివసిస్తున్న మానవజాతికి లిన్నేయస్ అనే శాస్త్ర వేత్త "హోమో సెపియన్స్" అని పేరు పెట్టాడు. అంటే 'బుద్ధిజీవులైన

మానవులు' అని అర్థం. దీనివల్ల బుద్ధిజీవులుకాని మానవజాతికూడా వుండవచ్చుననే అర్థం వస్తుంది. నిజమే. ఒకప్పుడు కేవలం తిర్యగ్జంతువులను పోలిన అనేక మానవ జాతులు పరిణామ క్రమంలో ఉద్భవించి కొంతకాలం వుండి అంతరించాయి. చివరికి ప్రధానంగా బుద్ధిని ఉపయోగించి మనుగడ సాగించే ఇప్పటి మానవజాతి పరిణామం చెంది అభివృద్ధి అయింది.

ఆలోచన మానవ సహజమైన వ్యాపారం. ఆలోచన అంటే ఏదో అడ్డదిడ్డమైన ఆలోచన అని కాదు. హేతుబద్ధమైన ఆలోచన అని అర్థం. తాత్వికాలోచన అని కూడా నిస్సంశయంగా చెప్పవచ్చు. "మ్యాన్ ఈజ్ బై నేచర్ ఎ పొలిటికల్ యానిమల్" (మనిషి స్వభావతః రాజకీయ జంతువు) అని అరిస్టాటిల్ అన్నాడు. నిజానికి "మ్యాన్ ఈజ్ ఎ ఫిలసాఫికల్ యానిమల్" (మనిషి తత్వవిచారం చేసే జంతువు) అని కూడా చెప్పవచ్చు. ఏ కొద్దిగానైనా సంగీతం రానివాడు, వైద్యం రానివాడు వుండడని అంటారు. అలాగే ఎంతో కొంత తత్వాలోచన చేయని మనిషి కూడా వుండడు.

## జ్ఞా నా స క్తి

"ఫిలాసఫీ" అనే ఇంగ్లీషు మాట ఫిలియా, సోఫియా అనే రెండు గ్రీకు మాటల కలయికనుంచి ఏర్పడింది. ఫిలియా అంటే ప్రేమ, సోఫియా అంటే జ్ఞానం. కనుక ఫిలాసఫీ అంటే జ్ఞానాసక్తి, జ్ఞానపిపాస అని అర్థం.

ఫిలాసఫీ అనేదాన్ని తెలుగులో తత్త్వశాస్త్రం, తత్త్వ విచారం అనవచ్చు. "తత్" అంటే "అది." "త్వమ్" అంటే స్వభావం. తత్త్వం అంటే "దాని యొక్క స్వభావం" అని అర్థం. దేనియొక్క స్వభావం? మనం దేని గురించి ఆలోచిస్తున్నామో దానియొక్క స్వభావం.

తత్వ జిజ్ఞాస బాల్యంలోనే ప్రారంభమవుతుంది. "వాన కురిస్తే, మెరుపు మెరిస్తే, ఆకసమున హరివిల్లు విరిస్తే..." ఏమిటీ వాన ? ఎందుకీ మెరుపు ? ఆ హరివిల్లు ఎలా ఏర్పడింది? అని బాలుడు తల్లినో, తండ్రినో ప్రశ్నిస్తాడు. సూర్యుడు, చంద్రుడు రోజూ ఒక దిక్కునే ఉదయిస్తారేం? ఒక దిక్కునే అస్తమిస్తారేం? అని ప్రశ్నిస్తాడు. నక్షత్రాలు పగలు కనబడ వేమిటని అడుగుతాడు. పక్షులు గాలిలో ఎలా ఎగురుతున్నాయని అడుగుతాడు. ఈ ప్రశ్నలన్నీ తత్వాన్వేషణ క్రిందికే వస్తాయి. బాలుడికి అర్థమయ్యే రీతిలో వీటికి సమాధానాలు చెప్పాలంటే తలప్రాణం తోకకు వస్తుంది. ఏవో కథలు కల్పించి సమాధానాలు చెప్పడం జరుగుతుంది. కాని, బాలుడు పెద్దవాడవుతున్నకొద్దీ పిట్టకథలతో సంతృప్తి పడడు. శాస్త్రీయ సమాధానాలకోసం అన్వేషిస్తాడు. సైన్సు అలాగే అభివృద్ధి అవుతుంది.

## పుక్కిటి పురాణాలు

నిజానికి మానవజాతి కూడా తన బాల్యదశలో ప్రకృతిలోని వింతలను, విశేషాలను చూసి, తన సందేహాలకు సమాధానాలుగా ఏవేవో పిట్టకథలను, పుక్కిటి పురాణాలను చెప్పుకున్నది. సూర్య, చంద్ర గ్రహణాలకు రాహు కేతువుల కథ ఇందుకొక ఉదాహరణ. కాని, మానవమేధ పరిణత మవుతున్నకొద్దీ ఆ పిట్టకథలు సంతృప్తి కలిగించడం మానివేశాయి. అప్పుడు మానవుడు సహేతుక శాస్త్రీయ సమాధానాల కోసం అన్వేషణ ఆరంభించాడు. నిరంతరంగా జరుగుతున్న ఆ అన్వేషణ ఫలితమే వివిధ విజ్ఞానశాస్త్రాలు, వాటి క్రమాభివృద్ధి.

## రెండు కథలు

ఒక ఉదాహరణ... ఒక బరువైన వస్తువును, ఒక తేలికైన వస్తువును ఒకే ఎత్తునుంచి ఒకే క్షణంలో నేలమీదకు జారవిడిస్తే, బరువైన వస్తువు ముందుగా నేలపై పడుతుందని, తేలిక వస్తువు ఆ తరవాత పడుతుందని అరిస్టాటిల్ నమ్మాడు. అతడు గొప్ప తాత్వికుడు, విజ్ఞానవేత్త. కనుక అతడు చెప్పింది నిజమా, కాదా అని ఆలోచించినవారు కొన్ని శతాబ్దాలపాటు ఎవరూ లేకపోయారు. చివరికి గెలీలియో అనే శాస్త్రవేత్త అరిస్టాటిల్ చెప్పినంత మాత్రాన ఆ విషయం గుడ్డిగా ఎందుకు నమ్మాలి అనుకున్నాడు. అతడు పీజా గోపురం నుంచి ఎక్కువ, తక్కువ బరువులున్న రెండు లోహ గోళాలను ఒకేసారి జారవిడవడం, రెండూ ఒకేసారి నేలను తాకడం - ఇది అందరికీ తెలిసిన కథే.

అలాగే, అరిస్టాటిల్‌దే మరొక నమ్మకం : పొగ పైకి పోతుంది, ఎందుకంటే దాని సహజ స్థలం ఆకాశం. రాయి కింద పడుతుంది. ఎందుకంటే దాని సహజస్థలం నేల! చాలా కాలంపాటు ఈ నమ్మకాన్ని హేతుబద్ధంగా విచారించిన వారెవరూ లేకపోయారు. న్యూటన్ ఒకనాడు చెట్టునుంచి యాపిల్ పండు నేలపై పడడం చూశాడు. అది అతడు గురుత్వాకర్షణ సూత్రాన్ని కనుగొనడానికి ప్రేరకమైంది.

ఈ విధంగా విజ్ఞాన శాస్త్రాల చరిత్రనుంచి ఎన్ని ఉదాహరణలైనా ఇవ్వవచ్చు. భౌతికవస్తు తత్వాన్వేషణే సైన్సు. అంతేకాదు, మానవుని ఆలోచనా ప్రపంచం అంతా తత్వ వివేచన పరిధిలోకే వస్తుంది.

## ప్రతిదీ ఫిలాసఫీయే

ఉదాహరణకు–కవిత్వం వ్రాయడం ఒక కళ. కాని, కవిత్వం అంటే ఏమిటి? కవిత్వ ప్రయోజనం ఏమిటి? ఏది ఉత్తమ కవిత్వం? ఏది

అధమ కవిత్వం? ఇత్యాది ప్రశ్నలు వేసుకుని వివేచించడం మొదలుపెడితే అది కవిత్వతత్వ విచారం (ఫిలాసఫీ ఆఫ్ పొయిట్రీ) అవుతుంది. అలాగే చిత్ర లేఖనం, సంగీతం, నాట్యం మొదలైన కళలకు కూడా దేని తత్వశాస్త్రం దానికి వున్నది. ఇవే కాదు. పిపీలికాది బ్రహ్మపర్యంతం ఏ విషయాన్ని గురించి పరి శోధించి, చర్చించి, తర్కించి, నిగ్గు తీయడానికి మొదలుపెట్టినా అది దానికి సంబంధించిన తత్వ విచారమే అవుతుంది. అందుచేతనే విశ్వవిద్యాలయాలు పరిశోధనా వ్యాసాలు వ్రాసే వారికిచ్చే బిరుదుకు "డాక్టర్ ఆఫ్ ఫిలాసఫీ" అనే పేరు స్థిరపడిపోయింది.

యూరోపియన్ తత్వశాస్త్రానికి పుట్టినిల్లు గ్రీసు. తొలి రోజులలో గ్రీకుల తత్వ శాస్త్రానికి (ఫిలాసఫీ), విజ్ఞాన శాస్త్రానికి (సైన్సు)కు భేదం వుండేది కాదు. వారికి ఆ రెండూ ఒకటే. కొంతకాలం తర్వాత గాని ఫిలాసఫీ, సైన్సు దేనికి అదిగా విడిపోలేదు. చాలా కాలంపాటు ఫిజిక్సు, కెమిస్ట్రీ, బోటనీ మొద లైన శాస్త్రాలన్నిటికీ "నాచురల్ ఫిలాసఫీ" అనే పేరుండేది. ఆ తర్వాత కొంతకాలానికి వాటికి "నాచురల్ సైన్సెస్" అనే పేరు వచ్చింది. అప్పుడు ఫిలాసఫీ అనే మాటను కేవలం తత్వశాస్త్రానికే ఉపయోగించడం మొదలు పెట్టారు.

ఫిజిక్సు వస్తువుల భౌతిక లక్షణాలను పరిశీలిస్తుంది. కెమిస్ట్రీ వస్తువుల రసాయనిక లక్షణాలను పరిశోధిస్తుంది. బోటనీ అంటే వృక్ష శాస్త్రం. జువా లజీ అంటే జంతు శాస్త్రం. అస్ట్రానమీ అంటే ఖగోళ శాస్త్రం. సైకాలజీ అంటే మనస్తత్వ శాస్త్రం. ఈ విధంగా విజ్ఞాన శాస్త్రం శాఖోపశాఖలుగా విక సించింది. ఒక్కొక్క శాఖ ఒక్కొక్క విషయాన్ని తన తత్వ విచార వస్తువుగా తీసుకుని పరిశోధన జరుపుతుంది.

కాని, తత్వశాస్త్రం (ఫిలాసఫీ)గా ఈనాడు మనం అర్థం చేసుకుంటున్న మానవ మేధావ్యాపారం అలాకాదు- మొత్తం ప్రపంచాన్ని, మొత్తం అస్తిత్వాన్ని, మొత్తం విజ్ఞానాన్ని తన పరిధిగా పరిగణిస్తుంది. ప్రపంచపు మూల తత్వంలోకి పోయి సత్యాన్వేషణ చేస్తుంది. ఇది ఏ ఒక్క సైన్సుగాని, మొత్తం అన్ని సైన్సుల సముదాయంగాని చేయలేనిపని. ఇది కేవలం తత్వశాస్త్రం మాత్రమే చేయగలిగిన పని.

## ప్రశ్నోపనిషత్తు

నేనెవరిని? ఎక్కడినుంచి ఈ లోకంలోకి వచ్చాను? ఇక్కడినుంచి ఎక్క డికి పోతాను?

జననానికి ముందు నేనున్నానా? మరణానికి తర్వాత నేను వుంటానా? అసలు నాలోని ఈ "నేను" ఎవరు?

ఈ జీవితానికి గమ్యం ఏమిటి? అర్థం ఏమిటి? అసలు జీవితానికి గమ్యం, అర్థం వున్నాయా?

ఈ ప్రపంచం ఏమిటి? దీని తత్త్వం ఏమిటి? ప్రపంచానికి సంబంధించిన జ్ఞానం మనకు ఎలా లభిస్తోంది? ఇంద్రియాల ద్వారానా? మనస్సు ద్వారానా? లేక ఆ రెండింటి ద్వారానా? అది సరైన జ్ఞానమేనా? అసలు బాహ్య ప్రపంచం అనేది వుందా? లేక అది మన అజ్ఞానంవల్ల, మాయావరణం వల్ల ఏర్పడుతున్న ఆభాస మాత్రమేనా? ఇదంతా మన మనస్సు కల్పిస్తున్న భ్రాంతి మాత్రమేనా? అయితే, ఇంతకుమించి పరమ సత్యం వేరే ఏదైనా వున్నదా?

మానవుడు స్వతంత్రుడా? అస్వతంత్రుడా? అతడికి నిర్ణయ స్వేచ్ఛ (ఫ్రీ విల్) వున్నదా? లేక విధి చేతిలో కీలుబొమ్మ మాత్రమేనా?

ఏది మంచి, ఏది చెడు? ఏది పాపం, ఏది పుణ్యం? ఏది న్యాయం, ఏది కాదు? ఏది సత్యం, ఏది నిత్యం? ఏది ఉత్తమ జీవిత విధానం? ఏది ఉత్తమ నైతిక వ్యవస్థ? ఏది ఉత్తమ రాజకీయ వ్యవస్థ?

ఇటువంటి ప్రశ్నలకు ఏ భౌతికశాస్త్రం సమాధానాలు చెప్పదు. చెప్పడం దాని పని కూడా కాదు. ఇందుకు తత్వశాస్త్రం మాత్రమే తగినది. లేదా, వీటిని వివేచించేదాన్నే తత్వశాస్త్రం అని అంటాము.

## ఎందరో మేధావులు

ఈ ప్రశ్నలను గురించి మానవచరిత్రలో ఎందరో మేధావులు లోతుగా ఆలోచించారు. వివిధ కాలాలలో, వివిధ దేశాలలో ప్లేటో, అరిస్టాటిల్, దెకార్త్, లాక్, బెర్కిలీ, హ్యూమ్, కాంట్, హెగెల్, మార్క్స్, నీషే, సార్త్రి వంటి యూరోపియన్ తత్వవేత్తలు - చైనాలో కన్ఫ్యూసియస్, ఇండియాలో ఉపనిషత్కారులు, బుద్ధుడు, నాగార్జునుడు, శంకరుడు, రామానుజుడు, ఇటీవలికాలంలో అరవిందుడు—ఇంకా ఎందరెందరో తాత్వికులు తమ జీవితాలను తత్వాన్వేషణకు అంకితం చేశారు. వారి జీవిత కథలు చదవడం, వారి సిద్ధాంత సుధలు ఆస్వాదించడం ఎంతైనా ఆసక్తికరంగా వుంటుంది.

తత్వశాస్త్రం అనగానే ఇదేదో మెట్టవేదాంతం కాబోలని, లేదా మత సంబంధమైనదని కొందరు భావించే అవకాశం లేకపోలేదు. నిజమే, తత్వశాస్త్రంలో

కొంత మెట్టవేదాంతం వుంటుంది. మరి కొంత గట్టి వేదాంతం వుంటుంది. మెటఫిజిక్స్ (పారభౌతిక తత్వ జిజ్ఞాస) అనబడే తత్వశాస్త్ర విభాగం మెట్ట వేదాంతం వలె కనబడవచ్చు. కాని నిజానికి మెటఫిజిక్స్ అధ్యయనం అత్యంత కుతూహలకరమైనది. మానవ మేధాశక్తి ఎంత ఉన్నత శిఖరాలను అందుకో గలిగిందో మెటఫిజిక్స్‌లో చూడవచ్చు.

## మార్క్స్ మందలింపు

"తత్వవేత్తలు ప్రపంచానికి రకరకాలుగా భాష్యం చెప్పారు కాని, ప్రపంచాన్ని ఎలా మార్చాలన్నది అసలు విషయం" Philosophers have variously interpreted the world. The point, however, is to change it. అని కార్ల్ మార్క్స్ ఈసడించింది మెటఫిజిక్స్‌నే కావచ్చు. అయనతో ఏకీభవిస్తూనే, ఒక విషయం చెప్పక తప్పదు. తత్వవేత్తలలో చాలామంది తమ సమకాలిక వ్యవస్థతో రాజీపడలేకపోయినవారే. అంతకంటె మెరుగైన వ్యవస్థకోసం పరితపించినవారే. ఆ పరితాపమే వారి జిజ్ఞాసకు మూలకందం. మార్క్స్ చెప్పినట్టు ప్రపంచాన్ని మార్చడం అవసరమే. కాని ప్రపంచతత్త్వం ఏమిటో తెలిస్తేతప్ప దాన్ని మార్చడానికి మార్గం దొరకదు. మానవ సమాజం కమ్యూనిజంవైపు పురోగమిస్తున్నదని మార్క్స్ భావించాడు. అది గతకాలపు సమాజ వ్యవస్థలను, ముఖ్యంగా తన కాలపు పెట్టుబడిదారీ వ్యవస్థను, దాని "తత్వాన్ని" క్షుణ్ణంగా అధ్యయనం చేయడంవల్లనే కాదా మార్క్స్‌కు స్ఫురించింది?

పోతే మతానికి తత్వ శాస్త్రానికి సంబంధం లేదు. మతం విశ్వాసంపై ఆధార పడిన విషయం. "భగవంతుడు వున్నాడు. ఆయన ఈ ప్రపంచాన్ని సృష్టించాడు"... వగైరావగైరా విశ్వాసాలను ప్రశ్నించకుండా ఆమోదించడంపైనే మతం ఆధారపడి వుంది. తత్వ వివేచన అలా కాదు. అది ప్రతివిషయాన్ని ప్రశ్నించడంపై, తరచి తరచి నిగ్గు తీయడంపై ఆధారపడింది. ఈ వివేచనలో మనకు శతాబ్దాలుగా అత్యంత ప్రియతమమైన–మన నరనరాలలో జీర్ణించుకుపోయిన– గాఢ విశ్వాసాలను తిరస్కరించడానికి కూడా తత్వశాస్త్రం వెనుతీయదు. సత్య స్వరూప సందర్శనం దాని ఏకైక లక్ష్యం.

## తత్వ చింతనామృతం

తత్వశాస్త్రాధ్యయనం వల్ల ప్రయోజనం ఏమిటి? ఈ రోజులలో-ముఖ్యంగా భౌతిక శాస్త్రాలు అతి వేగంగా పురోగమిస్తూ మానవ జీవిత విధానాన్ని మార్చి వేస్తున్న ఈ కాలంలో--ఎవరికి కావాలి తత్వ మీమాంస? అని కొందరు ప్రశ్నించవచ్చు.

కాని, ఇది అనాలోచితమైన వైఖరి. తత్వ జిజ్ఞాస- ఇంతకు ముందే పేర్కొన్నట్టు- మొత్తం మానవ వాగరిక జీవన విధానానికే పునాది వంటిది. ఇంతేకాదు, వివిధ కాలాలలో మానవ సమాజాల మీద, ప్రజల మత, సాంఘిక, నైతిక, రాజకీయ, ఆర్థిక వ్యవస్థలమీద, విశ్వాసాలమీద ఆయా కాలాలనాటి తత్వవేత్తల చింతనా ప్రభావం ఎంతో వున్నది.

ప్లేటో, అరిస్టాటిల్ వంటి గ్రీకు తత్వవేత్తల భావాలు కొన్ని శతాబ్దాలపాటు యూరోపియన్ జాతుల ఆలోచనా సరళిని ప్రభావితం చేశాయి. ఉదాహరణకు ప్లేటో తత్వ చింతనలో ఆ తర్వాతకాలపు సోషలిజం, కమ్యూనిజం సిద్ధాంతాల బీజాలు కనిపిస్తాయి. ఇక అరిస్టాటిల్ ప్రభావం చెప్పనక్కరలేదు. అనేక విజ్ఞాన శాస్త్రాలకు అతడు మూలకర్త. ముఖ్యంగా "లాజిక్" (పాశ్చాత్య తర్కశాస్త్రం) యూరోపియన్‌లకు అతడు పెట్టిన భిక్షే. ఆధునిక కాలంలోకి వస్తే హబ్స్, లాక్, రూసో, వోల్టేర్, హెగెల్, నీషే, మార్క్స్ మొదలైన వారెందరో యూరోపియన్ రాజకీయ వ్యవస్థలను, విశ్వాసాలను ప్రభావితం చేశారు.

మన దేశంలో ఉపనిషన్మీమాంస, భగవద్గీత, శంకరాద్వైతం, రామానుజ విశిష్టాద్వైతం వంటి వాటి ప్రభావం మన సమాజంపై ఎంత గాఢంగా, విస్తృతంగా వున్నదో అందరికీ తెలిసిందే. ఆ సిద్ధాంతాలు మన జీవన స్రవంతి గమనాన్ని నేటికి కూడా మంచికో, చెడుకో శాసిస్తూనే వున్నాయి.

అందువల్ల తత్వశాస్త్రాధ్యయనం దండగ అని, విలువ లేనిదని భావించరాదు. రూపాయి పైసలలో ప్రయోజనం వుండకపోవచ్చు. కాని, ఆయా ప్రపంచ మేధావుల చింతనామృతపానం మనలో నవ్యాలోచనా ప్రపంచాన్ని జాగరితం చేస్తుంది; మన జీవిత గమనాన్ని నిర్దేశిస్తుంది.

## పేరులోని పెన్నిధి

ఈ గ్రంథానికి "విశ్వదర్శనం" అనే పేరును ద్వంద్వార్థ ప్రతిపాదకంగా పెట్టడం జరిగింది. దర్శనం అంటే చూడడం. విశ్వదర్శనం అంటే విశ్వాన్ని చూడడం. అయితే భౌతిక నేత్రాలతో కాక, తాత్విక చక్షువులతో విశ్వాన్ని చూడడం అనే నిర్దిష్టార్థంలో ఈ పేరు పెట్టడం జరిగింది.

దర్శనం అంటే సంస్కృతంలో తత్వ దర్శనం అనే అర్థం కూడా వుంది. సాంఖ్యం, యోగం, వైశేషికం, న్యాయం, పూర్వ మీమాంస, ఉత్తర మీమాంస– ఈ ఆరింటికి షడ్దర్శనాలనే పేరున్నది. అయినా, ఏ తత్వ సిద్ధాంతానికైనా

దర్శనం అనే మాట వాడే ఆనవాయితీ కూడా వున్నది. అందుచేతనే ప్రపంచం లోని వివిధ దేశాల, వివిధ కాలాల తత్వవేత్తలు చేసిన దార్శనిక సిద్ధాంతాలను వివరించే ఈ గ్రంథానికి "విశ్వ దర్శనం" అనే పేరు పెట్టడం జరిగింది.

ఈ గ్రంథం వ్రాయాలని ఎన్నో ఏళ్లుగా ఒక నిరాకారమైన ఆలోచన నా మనస్సును దొలుస్తున్నది. ఇప్పటికి అది కార్యరూపం ధరిస్తున్నది. తెలుగులో భారతీయ తత్వశాస్త్ర గ్రంథాలు అసంఖ్యాకంగా వున్నాయి. పాశ్చాత్య తత్వసిద్ధాంత వివరణ గ్రంథాలు మాత్రం బహుస్వల్పంగా వున్నాయి. ఏమైనా మొత్తం ప్రపంచ తత్వవేత్తలందరి సిద్ధాంతాలను ఒకే ప్రణాళిక క్రింద ఒకే గ్రంథంలో వివరించే యత్నం ఇంతకుముందు జరగలేదనుకుంటాను. ఆ లోటును పూరించడానికి, ఆధునిక పాఠకులకు, సరళమైన, సులభ గ్రాహ్యమైన ఆధునిక పరిభాషలో ప్రపంచ తత్వ సిద్ధాంతాలను దిఙ్మాత్రంగా పరిచయం చేయాలన్న లక్ష్యంతో ఈ రచనకు ఉపక్రమిస్తున్నాను.

## ఆహ్వానం

ఈ రచన ప్రౌఢ నిర్భర వయః పరిపాకంలో వున్నవారినే కాక, యువతరం దృష్టిని కూడా ఆకర్షించగలదని ఆశపడుతున్నాను. తత్వశాస్త్రాధ్యయనం చేసిన వ్యక్తి మనస్సు మరింత పరిణతం, మేధ మరింత సశితం, హృదయం మరింత విశాలం అవుతాయని నాకు అనిపిస్తున్నది.

విల్ డ్యురాంట్ తన "ప్లెజర్స్ ఆఫ్ ఫిలాసఫీ"లో పేర్కొన్నట్టు తత్వశాస్త్రాధ్యయనంలో ఒక అనిర్వచనీయానందం కూడా వున్నది. అధ్యయనానంతరం పఠిత తనకు తానుగా, పూర్తిగా తనదే అయిన ఒక నూతన జీవిత దృక్పథాన్ని ఏర్పరచుకొనగల శక్తిని సముపార్జించుకోగలడని కూడా నాకొక నమ్మకం. నా ఆశయం, నా నమ్మకం వృథా కాబోవనే అనుకుంటున్నాను.

ప్రపంచ మేధావుల మనఃకుహరాంతరాల లోనికి— వారి మనోవల్మీకాలలోనికి, వారు సృష్టించిన మంత్ర నగరి సరిహద్దులలోనికి ఈ సాహస యాత్ర కొలంబస్ అమెరికా ఖండ యాత్రకు, ఆర్మ్‌స్ట్రాంగ్ చంద్రలోక యాత్రకు తీసిపోదు. ఈ సాహసయాత్రలో పాల్గొనవలసిందిగా పాఠకులను ఆహ్వానిస్తున్నాను.

ఈ గ్రంథంలో ముందుగా పాశ్చాత్య దర్శనకారుల సిద్ధాంతాలను పరిచయం చేయడం జరుగుతుంది. పాశ్చాత్య తత్వశాస్త్రానికి పుట్టినిల్లు గ్రీసు కనుక, గ్రీకుల తత్వవిచారంతో ఈ గ్రంథం ప్రారంభమవుతుంది.



# 2
# గ్రీకుల పూర్వరంగం

పాశ్చాత్య తత్వశాస్త్రానికి పుట్టినిల్లు గ్రీసు అని చెప్పుకున్నాము. మరి గ్రీకు తత్వ శాస్త్రానికి మూలబీజాలు ఎక్కడివి ?

ఏ శాస్త్రమైనా, ఏ సాహిత్యమైనా, ఏ కళ అయినా వున్నట్టుండి ఒక్కసారిగా గాలిలో నుంచి పుట్టుకు రాదు. దానికిముందు ఎంతో చరిత్ర నడుస్తుంది. ఎన్నో సాంఘిక, రాజకీయ, ఆర్థిక, చారిత్రక ప్రభావాలు దానిపై ప్రసరిస్తాయి.

గ్రీకు తత్వశాస్త్రం కూడా అంతే. అది వున్నట్టుండి ఆయా తత్వవేత్తల మెదడులో నుంచి పుట్టుకు రాలేదు. గ్రీకు నాగరికతపై అంతకుముందు వర్ధిల్లిన ఎన్నో ప్రాచీన నాగరికతల, సంస్కృతుల ప్రభావం వున్నది. అందు వల్ల గ్రీకులకు ముందు వర్ధిల్లిన కొన్ని ప్రసిద్ధ నాగరికతలను గురించి ఇక్కడ టూకీగా తెలుసుకుందాము.

మానవ నాగరికతలకు జన్మ స్థలాలు ఈజిప్టు, మెసపొటేమియా, ఇండియా, చైనాలు. ఇవన్నీ నదీతీరాలలో వర్ధిల్లిన నాగరికతలే. నైలునదీతీరం ఈజిప్షియన్

నాగరికతకు పుట్టినిల్లు. టైగ్రిస్- యూఫ్రెటీస్ నదుల మధ్య మెసపొటేమియాలో సూమెరియన్ నాగరికత, సింధునదీతీరాన హరప్పా - మొహెంజొదారో నాగరికత, యాంగ్‌ట్జీ తీరాన చైనీస్ నాగరికత ప్రభవించి పరిఢవిల్లాయి. నదీతీరాలు స్థిర నివాసానికి, వ్యవసాయానికి అనువైన స్థలాలు. మానవుని స్థిర నివాసం వల్లనే స్థిరమైన సాంఘిక, రాజకీయ, ఆర్థిక వ్యవస్థలు ఏర్పడ్డాయి. వ్యాపారం, కళలు, లిపి వృద్ధి అయ్యాయి.

## సూమెరియన్‌లు

మెసపొటేమియాలో మొదట వర్ధిల్లిన నాగరికత సూమెరియన్‌లది. క్రీస్తు పూర్వం 4000 - 3000 సంవత్సరాల మధ్య వారు గొప్ప నగరాలు నిర్మించారు. ఆ రోజులలోనే వారు లోహాల వాడకాన్ని కనిపెట్టారు. ప్రయాణ సాధనాలుగా చక్ర శకటాలు తయారుచేశారు. అంకగణితం, రేఖాగణితం వారికి తెలుసు. రోజును 24 గంటలుగా విభజించారు. వృత్తాన్ని 360 డిగ్రీలుగా విభజించారు. సూర్య, చంద్ర గ్రహణాలు 18 ఏళ్ల 7 నెలల కొకసారి తిరిగి తిరిగి వస్తాయని వారు కనిపెట్టారు. "చిత్రలిపి"తో మట్టి పలకలపై వ్రాయడం నేర్చుకున్నారు.

సూమెరియన్‌ల తర్వాత మెసపొటేమియాను సెమిటిక్ జాతివారైన అక్కేడియన్‌లు జయించారు. క్రీస్తుపూర్వం 2400 ప్రాంతంలో సూమెరియన్ నగరాలన్నిటిని కలుపుతూ సార్గన్ అనే రాజు చరిత్రలో మొట్టమొదటి సామ్రాజ్యం స్థాపించాడు. ఆ తర్వాత మొదటి బాబిలోనియన్ సామ్రాజ్యం. అది క్రీస్తు పూర్వం 1792 ప్రాంతాలలో హమురాబీ చక్రవర్తి పరిపాలనలో ఉచ్ఛస్థితికి వెళ్లింది. దాని తర్వాత అస్సీరియన్ సామ్రాజ్యం చరిత్రకెక్కింది. ఇంకా కాల్డియన్‌లు, మీడులు, పర్షియన్‌లు మహాసామ్రాజ్యాలు స్థాపించారు.

## ఈ జి ప్టు

మరొక వైపున నైలు తీరాన ఈజిప్టులో మరొక గొప్ప నాగరికత వర్ధిల్లింది. క్రీస్తుపూర్వం 4000 - 3000 సంవత్సరాల మధ్య ఈజిప్షియన్‌లు నిర్మించిన బ్రహ్మాండమైన పిరమిడ్లు నేటికి కూడా ఆశ్చర్యం గొలుపుతున్నాయి. క్రీస్తు పూర్వం 2700 నాటికి ఈజిప్టులో కేంద్ర ప్రభుత్వం ఏర్పడింది. కళలు వృద్ధి అయ్యాయి. ఒక రకం కాగితాన్ని కనిపెట్టారు. దానిపై సిరాతో "చిత్రలిపి"లో వ్రాసేవారు. ఖగోళ పరిశోధన చేశారు. దీనితో 365 రోజులు ఒక సంవత్సరంగా పరిగణించి పంచాంగాన్ని తయారుచేశారు. వైద్యం, శరీర శాస్త్రం, గణితం నేర్చుకున్నారు. వారి రాజులను ఫేరో లనేవారు. ఫేరోలు రాజులే



క్రీస్తుపూర్వం ఆరవ శతాబ్దినాటి గ్రీసు,
దాని పరిసర ప్రాంతాలు

కాక మతాధిపతులు కూడా. తమ రాజులు దేవుని అవతారమూర్తులని ప్రజలు విశ్వసించేవారు.

## క్రీట్ నాగరికత

ఈ నాగరికతలన్నీ ఒక ఎత్తు. తూర్పు మధ్యధరా సముద్రంలో క్రీట్ ద్వీపంలో క్రీస్తుపూర్వం 2500 నాటికే అత్యుచ్చస్థితి అందుకున్న మినోవన్ నాగరికత ఒక ఎత్తు. క్రీట్ చాలా చిన్న ద్వీపం. అయినా, అద్భుతమైన నాగరికతకు అది పుట్టినిల్లు. గ్రీకు నాగరికత చాలవరకు దాని నుంచి పరిణామం చెందినదే.

ఈజిప్టు రాజులను ఫేరోలని అన్నట్టే క్రీట్ రాజును మినోస్ అనేవారు. ఆ రాజుల పేరుమీదుగానే వారిది మినోవన్ నాగరికత అనే పేరు పొందింది. వారి నాగరికతకు కేంద్రాలు గొప్ప వాస్తు శిల్ప నైపుణ్యంతో నిర్మించిన రాజప్రాసాదాలు. సర్ ఆర్థర్ ఇవాన్స్ అనే బ్రిటిష్ పురావస్తు శాస్త్రవేత్త 1900 ప్రాంతాలలో క్రీట్‌లో నాసస్ అనేచోట జరిపిన త్రవ్వకాలవల్ల మినోవన్ నాగరికతా విశేషాలు బయల్పడ్డాయి. మినోవన్‌లు ఈజిప్టుతో నౌకా వ్యాపారం చేసేవారు. ఎంతో కళాత్మకంగా అందమైన వస్తువులు తయారుచేసేవారు. అందాన్ని, ఆనందాన్ని, వారు ఆరాధించేవారు. నృత్యం, సంగీతం, చిత్రలేఖనం మొదలైన కళలను వారు అభ్యసించారు. వారి మతంలో దిగులుకు, దుఃఖానికి తావులేదు. వారిది జీవితంపట్ల ఆశావాదంతో కూడిన మతం. వారి దేవతలందరు స్త్రీ దేవతలే. ముఖ్యంగా భూమాతను ఆరాధించేవారు.

మినోవన్‌లు గ్రీకులు కారు. సెమెటిక్ జాతులకు చెందినవారు, కాని, గ్రీకులతో వారికి సంబంధాలుండేవి. గ్రీకు వీరుడైన థీసియస్ క్రీట్ వెళ్లి అక్కడ మినోస్ రాజుకు చెందిన మినోటార్ అనబడే నర వృషభాన్ని సంహరించినట్టు ఒక పురాణ కథ వున్నది. దీనివల్ల గ్రీసుకు, క్రీట్‌కు మధ్య రాకపోకలు వుండేవని తెలుస్తుంది.

మినోవన్ నాగరికత క్రీస్తుపూర్వం 1400 ప్రాంతానికి ఆకస్మికంగా అదృశ్యమైంది. దీనికి కారణం ఇదమిత్థమని ఎవరూ చెప్పలేకపోతున్నారు. గొప్ప భూకంపాలు సంభవించి మినోవన్ రాజప్రాసాదాలు ధ్వంసమైపోయి వుండవచ్చు, లేదా ఉత్తరం నుంచి గ్రీకులు వరసగా దండయాత్రలు చేస్తూ చేస్తూ ఆ నాగరికతను నేలమట్టంచేసి వుండవచ్చు. ఏమైనా క్రీస్తుపూర్వం 1400 తర్వాత మినోవన్ నాగరికత చరిత్ర పుటల నుంచి మాయమైపోయింది.

## మైసినీయన్‌లు

ఆ తర్వాత రంగస్థలం గ్రీసుకు మారింది. అప్పటిలో గ్రీసులో వర్ధిల్లిన నాగరికతను మైసినీయన్ నాగరికత అంటారు. అది క్రీస్తుపూర్వం 1500-900 మధ్య కాలం నాటిది. దక్షిణ గ్రీసులో మైసినీ అనే నగరం దానికి కేంద్రం కనుక చరిత్రకారులు దానికి ఆ పేరు పెట్టారు. మైసినీయన్‌లు ఒకవైపు మినోవన్‌ల నుంచి, మరొకవైపు ఈజిప్టు నుంచి నాగరికతను ఎరువు తెచ్చుకున్నారు.

హోమర్ పేరు విననివారు వుండరు. మనకు వాల్మీకి, వ్యాసుడు ఎటువంటి వారో గ్రీకులకు అంధ కవి అయిన హోమర్ అటువంటివాడు. మనకు రామాయణ, భారతాలు ఎటువంటివో గ్రీకులకు హోమర్ రచించిన ఇలియడ్, ఒడిస్సీ ఇతిహాసాలు అటువంటివి. ఈ రెండు మహాకావ్యాలలోను హోమర్ చెప్పిన కథలు మైసినీయన్ నాగరికతా కాలానికి సంబంధించినవేనని చారిత్రకులు ఊహిస్తున్నారు.

## ట్రోజన్ యుద్ధం

మైసినీ నగరం రాజు అగమెమ్నోన్. అతని తమ్ముడు స్పార్టా నగర రాజు మెనిలేయస్. ఇతని భార్య హెలెన్. ఆసియా మైనర్ (ఇప్పటి టర్కీ) పశ్చిమ తీరాన గల ట్రాయ్ నగరపు యువరాజు పారిస్ ఒకసారి అతిథిగా వచ్చి హెలెన్‌ను అపహరించుకుపోతాడు. ఆమెను విడిపించడానికి గ్రీసులోని రాజులందరు అగమెమ్నోన్ నాయకత్వాన ఏకమై వెయ్యి నౌకలతో ఈజియన్ సముద్రం దాటి వెళ్లి ట్రాయ్ నగరాన్ని ముట్టడిస్తారు. పదేళ్లపాటు యుద్ధం జరుగుతుంది. చివరకు ట్రోజన్‌లు ఓడిపోతారు. గ్రీకులు ట్రాయ్ నగరాన్ని దగ్ధంచేస్తారు. ఇది ఇలియడ్ కావ్యంలోని కథ.

## ఒడీసియస్ కథ

పదేళ్ల ట్రోజన్ యుద్ధంలో పాల్గొన్న గ్రీకు వీరుడు ఒడీసియస్ మరొక పదేళ్లపాటు ప్రపంచాటనం చేసి చివరికి తన రాజ్యమైన ఇథాకా ద్వీపం చేరుకుంటాడు. అతని సాహసయాత్రా గాథలతో కూడిన కావ్యం ఒడిస్సీ. చాలకాలం వరకు ఇవి పుక్కిటి పురాణాలు కావచ్చునని పలువురు భావించారు. కాని 1874 ప్రాంతాలలో హెన్రిక్ ష్లీమన్ అనే జర్మన్ పురావస్తు శాస్త్రవేత్త టర్కీలో జరిపిన త్రవ్వకాలలో ప్రాచీన కాలపు ట్రాయ్‌నగరం బయల్పడింది. అందుచేత ట్రోజన్ యుద్ధం నిజంగా జరిగిందేనని, అది క్రీస్తుపూర్వం 1200 ప్రాంతాలలో జరిగి వుండవచ్చునని చరిత్రకారులు భావిస్తున్నారు.

ఇలియడ్, ఒడిస్సీలు హోమర్ రచనలని వాడుక. కాని, హోమర్ అంటూ ఒక కవి లేడని, పెక్కుమంది హోమర్లు వున్నారని కొందరి భావన. ఆ రెండు కావ్యాలు అనుశ్రుతంగా వస్తున్న వీరగాథలని, వాటిని కవి గాయకులు పాడుతూ వుండే వారని, క్రీస్తుపూర్వం 750-700 నాటికి వాటికి ఇప్పటి లిఖిత కావ్య రూపం సిద్ధించిందని చరిత్రకారులు భావిస్తున్నారు. (ఇటువంటి వివాదమే మనకూ వున్నది. వ్యాసుడనే మహర్షి వేదాలను విభజించి, భారతం, అష్టాదశ పురాణాలు ఇంకా ఎన్నెన్నో వ్రాశాడని మన సంప్రదాయం. కాని, వ్యాసుడు ఒకడు కాడని, ఎందరో వ్యాసులున్నారని వేరొక వాదం వున్నది.)

## గ్రీకు జాతీయత

ఏమైనా, (భారతీయులు ఏ భాషవారైనా ఏ ప్రాంతం వారైనా వారికి రామాయణ, భారతాల వలె) గ్రీకులకు ఇలియడ్, ఒడిస్సీలు సమష్టి వారసత్వం. అవి వారి జాతీయ వాఙ్మయం. గ్రీకులలో ఎన్నో తెగలున్నాయి. కాని, వారిని ఒక జాతిగా ఏకీకరించినవాటిలో ఒకటి గ్రీకు భాష. రెండవది క్రీస్తుపూర్వం 776 నుంచి నాలుగేళ్ల కొకసారి చొప్పున వెయ్యేళ్లకు పైగా వరసగా జరిగిన ఒలింపిక్ క్రీడోత్సవం. మూడవది ఇలియడ్, ఒడిస్సీ కావ్యద్వయం. వాటిని గ్రీకులు పాఠ్యగ్రంథాలుగా ఉపయోగించేవారు. వారి మత విశ్వాసాలకు కూడా చాలా వరకు అవే మూలం.

గ్రీకులు ఇండో–యూరపియన్ తెగలకు చెందినవారు. క్రీస్తుపూర్వం 1400-900 సంవత్సరాల మధ్య కాలంలో ఉత్తరం నుంచి మూడు విడతలుగా దండెత్తివచ్చి ఆ తెగల వారు గ్రీసును ఆక్రమించుకున్నారు. మొదటగా ఐయోనియన్లు వచ్చారు. తర్వాత అకియన్లు, చివరగా డోరియన్లు దండెత్తి గ్రీసును జయించారు. వీరిలో డోరియన్లతోనే సిసలైన గ్రీకు నాగరికత ప్రారంభమవుతుంది.

గ్రీసు చిన్న ద్వీపకల్పం. అది లోయలతో, పర్వతాలతో, ద్వీపాలతో కూడిన భూభాగం. ఒకచోటినుంచి మరొక చోటికి రాకపోకలు అంత సులభం కాదు. అందుచేత ఎక్కడికక్కడే నగరాలు, నగర రాజ్యాలు ఏర్పడ్డాయి. ఒక నగరం, దాని చుట్టూ వ్యవసాయ భూములు. అదే నగర రాజ్యం (సిటీ స్టేట్). భూమి సారవంతమైనది కాదు. జనాభా పెరిగితే తిండి కొరత ఏర్పడేది. ప్రజలు వలస పోయేవారు. ఆ విధంగా ఆసియా మైనర్ (టర్కీ) పడమటి కోస్తా ప్రాంతం పొడవున తీరంలోను, ఈజియన్ ద్వీపాలలోను ఎన్నో గ్రీకు నగరాలు వెలిశాయి. ఇటు ఇటలీ దక్షిణ భూభాగంలోను, సిసిలీలోను కూడా గ్రీకు వలసలు వెలిశాయి.

## గ్రీకు నాగరికత

ఈ నగరాలు నౌకా వ్యాపారం చేసేవి. దానితో ఒకరినుంచి ఒకరు ఎన్నో కొత్త విశేషాలు నేర్చుకొనడం, ఆ విధంగా వారి నాగరికత, కళలు, విజ్ఞానం వృద్ధి కావడం జరిగింది. ఫినీషియన్‌ల నుంచి వారు లిపి నేర్చుకున్నారు. దీనితో వారికి వాఙ్మయం పెరిగింది. అప్పటికే కంచుయుగం ముగిసి, ఇనుపయుగం ప్రారంభమైంది. దానితో వారి నాగరికత మరింతగా పురోగమించింది. అప్పటి వరకు వచ్చిన నాగరికత లన్నిటికి తలమానికమైన, మహోజ్వలమైన నాగరికతను అనాటి గ్రీకులు నిర్మించారు. ఈనాటి యూరోపియన్ నాగరికత పునాదులు గ్రీకులు నిర్మించినవే.

గ్రీకులకు మతమని చెప్పదగింది పెద్దగా వున్నదా అనిపిస్తుంది. వారికి దేవ తలు లేకపోలేదు. కాని, ఆ దేవతలు చాలా విషయాలలో మానవులను పోలిన వారే. కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాలలో వారు మానవులకు తీసిపోనివారే. ఎటొచ్చీ గ్రీకు దేవతలు అమరులు. అమితశక్తి సంపన్నులు, మహిమాన్వితులు - అంతే. గ్రీకులు తమను పోలిన దేవతలనే కల్పించుకున్నారు. (ఈ విషయంలో మన ఇంద్రుడు మొదలైన పౌరాణిక దేవతలు కూడా ఇంతే.)

## గ్రీకు దేవతలు

మన శివుడి నివాసం కైలాసపర్వతం అయినట్లు, గ్రీకు దేవతల నివాసం ఒలింపస్ పర్వతం. మన దేవతల రాజు ఇంద్రుడైనట్టు వారి దేవతల రాజు జూస్ (జూపిటర్). ఇంద్రునికి వజ్రాయుధంవలె జూస్ ఆయుధం పిడుగు. ఇంద్రునివలె ఇతడు కూడా మానవకాంతలను మోహించడంలాంటి తప్పుడు పనులు చాలా చేసేవాడు. ఇతడుకాక ఇతని భార్య హీరా, పొసీడన్, హేడిజ్, ఎథీనా, అపోలో, ఆఫ్రొడైటీ, హెర్మీస్ మొదలైన పలువురు ఒలింపియన్ దేవత లుండేవారు.

తక్కిన మతాలలో లోకానికి సృష్టికర్త అయిన ఒక దేవుడంటూ వుండే వాడు. కాని గ్రీకులకు అటువంటి దేవుడెవడూ లేడు. అసలు వారికి సృష్టికర్త అనే వాడే లేడు. మొదట అంధకార బంధురమైన అవ్యవస్థ (కేయాస్) వుండేది. దానిలో నుంచి కాస్మాస్ (విశ్వం) వచ్చింది. అప్పుడు స్వర్గం, భూమి ఏర్పడ్డాయి. ఈ రెండింటి సంయోగంవల్ల టైటన్‌లు (దైత్యులు?) అనే అత్యంత శక్తిమంతులైన జాతి జన్మించింది. వారు చాలా కాలంపాటు లోకాన్ని పాలించారు. వారిలో క్రోనస్ (శాటర్న్) అనేవాడికి జూస్ అనేవాడు పుట్టాడు. జూస్ ఇతర దేవతల సహాయంతో క్రోనస్‌ను జయించి లోకాన్ని స్వాధీనం చేసుకున్నాడు.

ఒలింపియన్ దేవతలను బట్టి వచ్చిన మతంకాక, గ్రీకులకు మరి రెండు మతశాఖ లుండేవి. వాటిలో ఒకటి ఇల్యూసినియన్ మతం. రెండవది ఆర్ఫిక్ మతం. నిజానికి ఇవి మతాలు కాదు; మన తాంత్రిక వామాచారాలను, విశ్వాసాలను పోలినవి.

## తాంత్రిక మతాలు

ఏథెన్సు వద్ద ఇన్యూసిస్ అనే చోట క్రీస్తుపూర్వం ఏడవ శతాబ్దంలో వర్ధిల్లిన దాన్ని ఇల్యూసినియన్ మతం అంటారు. ఇందులో డిమీటర్ అనే సస్యదేవత ప్రధాన పాత్రధారిణి. డిమీటర్ కుమార్తె పెర్సిఫోని. ఆమెను హేడిస్ అనె పాతాళ లోకాధిపతి అపహరించాడు. కుమార్తె కోసం డిమీటర్ ఏడుస్తూ ప్రపంచమంతా వెదికింది. ఆమె లేకపోయేసరికి భూలోకంలో పంటలన్నీ పాడైపోయాయి; మంచులో కూరుకుపోయాయి. కరువు కాటకాలు ప్రబలాయి. అప్పుడు దేవతలు కలుగజేసుకుని పెర్సిఫోని ఏడాదికి ఆరునెలలు భూమిపైన తల్లి డిమీటర్‌వద్దను, మరొక ఆరునెలలు పాతాళంలో హేడిస్ వద్దను గడిపేటట్టు ఏర్పాటుచేశారు. అందుకే ఏడాదికి ఆరు నెలలు భూలోకానికి ఆకురాలు కాలం, శీత ఋతువు వచ్చి అంతా హిమావృతం అవుతుంది. మిగిలిన ఆరు నెలలు సస్యశ్యామలంగా వుంటుంది.

ఈ కథ ఆధారం చేసుకుని గ్రీకులు కొన్ని విశ్వాసాలు పెంచుకున్నారు. రహస్యంగా కొన్ని క్రతువులు (మిస్టరీస్), జాతరలు జరిపేవారు. ఆ జాతరలు ఎటువంటివో. ఎవరికీ తెలియదు. వాటిలో పాల్గొనేవారికి అమరత్వం సిద్ధిస్తుందని నమ్మేవారు.

## ఆర్ఫిక్ మతం

రెండవ మతాన్ని ఆర్ఫిజం అంటారు. డైయనైసస్ అనేవాడు వృక్షదేవత. ముఖ్యంగా ద్రాక్ష మొదలైన లతలకు, ద్రాక్షసారాయానికి అధిదేవత. ఇతడికి చాకస్ అనే మరొకపేరు కూడా వున్నది. ఇతడు జూస్‌కు, పెర్సిఫోనీకి పుట్టినవాడు. అతడు-వృషభాకృతిలో వుండగా టైటన్‌లు సంహరించి వాడి మాంసం భుజిస్తారు. కాని, జూస్ అతడి గుండెకాయను మాత్రం రక్షించి దాన్ని తాను భుజిస్తాడు. ఆ తర్వాత డైయనైసస్ జూస్‌కు, సెమిలీ అనే మానవ స్త్రీకి జన్మిస్తాడు. సెమిలీ తనను కామించిన దేవతల రాజు జూస్‌ను కనులారా చూడ గోరుతుంది. జూస్ ఆమెకు తన అద్భుత విశ్వరూపం చూపిస్తాడు. ఆమె అది చూస్తూనే భస్మమైపోతుంది. కాని, ఆమె గర్భంలోవున్న డైయనైసస్ పిండాన్ని జూస్ రక్షించి తన తొడలో పెట్టి కాపాడుతాడు. కొన్నాళ్లకి జూస్

తొడ నుంచి డైయనైసస్ జన్మిస్తాడు. తన కుమారుడైన డైయనైసస్‌ను చంపి ఆరగించిన టైటన్‌లను జూస్ తన వజ్రాయుధంతో సంహరించి భస్మం చేస్తాడు. వారి భస్మం నుంచి మానవులను సృష్టిస్తాడు.

ఈ కథను బట్టి మానవులలో దైత్యులవంటి టైటన్‌ల అంశ కొంత, వారు ఆరగించిన దేవత డైయనైసస్ అంశ కొంత వున్నదనే విశ్వాసం ఏర్పడింది. అంటే కొంత దైత్యాంశ, కొంత దేవతాంశ అన్నమాట. మానవ శరీరంలో వున్నది టైటన్‌ల అంశ అయితే, ఆత్మలో వున్నది దేవతాంశ. శరీరం నుంచి దేవతాంశను విముక్తం చేస్తే మానవుడు మోక్షం పొందుతాడు. అంతవరకు మనిషి చస్తూ, పుడుతూనే వుంటాడు. ఈ జనన, మరణ చక్రంనుంచి మనిషి విముక్తుడు కావాలంటే కొన్ని తాంత్రిక కర్మ కాండలు చేయాలి. ఈ కర్మ తతంగాన్ని ఆర్ఫియస్ అనే గ్రీకువీరుడు ప్రచారం చేశాడు. అందుచేతనే దానికి ఆర్ఫిక్‌మతం అని పేరు వచ్చింది. ఆర్ఫిక్ తంత్ర కర్మలలో పాల్గొనేవారు తొలిరోజులలో తమ పురోహితుడిని వధించి భుజించేవారట. నాగరికత పెరిగిన తర్వాత ఆ క్రూరాచారాన్ని మానివేసి, ఒక వృషభాన్ని వధించి తినేవారట. ఆ వృషభంలో తమ దేవత అయిన డైయనైసస్ వున్నాడని, అతడి మాంసభక్షణ ద్వారా తమకు అమరత్వం సిద్ధిస్తుందని గ్రీకులు నమ్మేవారు.

## తాంత్రిక ప్రభావం

ఈ ఆర్ఫిక్ తాంత్రిక కర్మకాండ ప్రభావం గ్రీకులపై ఎంతో వున్నది. మానవుడి లక్ష్యం అమరత్వాన్ని సాధించడం; మానవుడి ఆత్మ వేరు, దేహం వేరు, దేహం నుంచి ఆత్మను విముక్తం చేయడానికి నైతిక, నియమబద్ధ జీవితాన్ని గడపడమే మార్గం - ఇటువంటి భావాలు ఆర్ఫిజమ్ నుంచే వచ్చాయి. వీటి ప్రభావం ముఖ్యంగా పితాగరస్ అనే గ్రీకు తత్వవేత్తపై చాలా వున్నది. సోక్రటీస్ ప్లేటోలవంటి తత్వవేత్తలపై కూడా దాని ప్రభావం వున్నదని చరిత్రకారులు పేర్కొంటున్నారు.

ఇప్పుడు చరిత్రలో వెనుతిరిగి చూస్తే మహోన్నతమైన గ్రీకు తత్వభావాలకు ఇంతటి వెర్రిమొర్రి కథలనుంచి పుట్టిన విశ్వాసాలు ఏ విధంగా కారణమైనాయని ఆశ్చర్యం కలుగుతుంది. ఆ అంధ విశ్వాసాలు ఎటువంటి పరిణామాలు చెంది సిసలైన తాత్విక చింతనకు దారితీశాయో మనకు తెలియదు. కాని ఆ చింతనకు మూలబీజాలు ఆనాటి గ్రీకుల పురాణ గాథలలోను, వారి ఆర్ఫిక్, ఇల్యూసినియన్ మత విశ్వాసాలలోను కనబడతాయి.

ఇంతవరకు మనం గ్రీకుల నాగరికతకు పూర్వ రంగాన్ని తెలుసుకున్నాము.

ప్రపంచ నాగరికతా క్రమాన్ని పరిశీలిస్తే గ్రీకుల నాగరికత దాదాపు చిట్టచివరిది. దానికి ముందు సూమెరియన్, ఈజిప్షియన్, బాబిలోనియన్, క్రీటన్, మైసినీయన్ తదితర నాగరికతలెన్నో సినిమా తెరపై మాంటేజ్ దృశ్యాలవలె వచ్చి పోయాయి. వీటన్నిటి నేపథ్యంలోనుంచి గ్రీకు నాగరికత వచ్చింది.

క్రీస్తుపూర్వం సుమారు నాలుగైదు వేల యేళ్లనాడు నాగరికత కథ ప్రారంభమైంది. ఇప్పుడు మనం గ్రీకు నాగరికతను వెంబడిస్తూ వచ్చి క్రీస్తుపూర్వం ఆరవ శతాబ్దంలో ప్రవేశించాము. గ్రీకు తత్వచింతన ఆ శతాబ్దంలోనే ప్రారంభమైంది. దానికి మూలపురుషుడు మైలీటస్ అనే గ్రీకు నగరానికి చెందిన థేలీస్.



# 3
# తొలి గ్రీకు తత్వవేత్త థేలీస్

గ్రీకుల తత్వశాస్త్రానికి మూల పురుషుడు థేలీస్ అని వాడుక. అతడు క్రీస్తుపూర్వం ఆరవ శతాబ్దం నాటి వాడు.

ఆ శతాబ్దాన్ని మానవ చరిత్రలో అసాధారణ శతాబ్దమని హెచ్.జి.వెల్స్ తన హిస్టరీ ఆఫ్ ది వరల్డ్‌లో పేర్కొన్నాడు. ఎందుకంటే దేశ దేశాలలో ఎందరెందరో మహానుభావులు కూడబలుక్కున్నట్టు ఆ శతాబ్దంలో జీవించారు.

గ్రీసులో మొట్టమొదటి తత్వవేత్త థేలీస్ క్రీస్తుపూర్వం ఆరవ శతాబ్దినాటి వాడు. ఇండియాలో బుద్ధుడు, మహావీరుడు ఆ శతాబ్దానికి చెందినవారు. చైనాలో కన్‌ఫ్యూసియస్, లౌ చే అనే ఇరువురు గొప్ప తాత్వికులు అనాటివారు. పర్షియాలో ఒక నూతన మతాన్ని ప్రవచించిన జరతూస్త్ర (జొరాస్టర్) అప్పటివాడు.

వీరు తమ తమ దేశాలలో గొప్ప భావ విప్లవాలను ప్రారంభించి తమ జాతులకు మార్గదర్శకులైనట్టివారు. కొన్ని వేల ఏళ్లపాటు అనేక మూఢ విశ్వా

సాలలో, మతాధిపతుల ప్రాబల్యంలో అణగి మణగి వున్న మానవ మేధా విహంగం ఆ శతాబ్దంలో ఒక్కసారిగా సంప్రదాయపంజర విముక్తమై, విశృంఖలంగా, నిర్భయ్యంగా ఒక నూతన భావ విహాయసంలో విహారం ప్రారంభించింది.

గ్రీసు అనగానే మనకు యూరప్ దక్షిణాన మధ్యధరా సముద్రంలోనికి చొచ్చుకు పోయిన ఒక చిన్న ద్వీపకల్పం మాత్రమే గుర్తుకు వస్తుంది. కాని, ఒకానొకప్పుడు గ్రీకులు తమకు తూర్పున ఆసియా మైనరులో, పశ్చిమాన దక్షిణ ఇటలీలో, సిసిలీలో, దక్షిణాన క్రీట్ లో వలసలు ఏర్పరచుకుని తమ నాగరికతా దీప దీధితులను అన్ని వైపులా వ్యాపింపజేశారు.

## యవన నాగరికత

ఆసియా మైనర్ అంటే ఇప్పటి టర్కీ. దీని పడమటికోస్తా పొడవున, ఇంకా దానికి, గ్రీసుకు మధ్య ఈజియన్ సముద్రంలోని చిన్న చిన్న దీవులలోను ఆనాడు ఎన్నో గ్రీకు వలసలు వుండేవి. వాటన్నిటిని కలిపి ఐవోనియా అనేవారు. వాటిలో నివసించిన గ్రీకులను ఐవోనియన్ లు అనేవారు. మన పూర్వులకు తెలిసిన గ్రీకులు వీరే కావచ్చు. కనుకనే, గ్రీకు జాతీయులందరిని మనవారు యవనులనే పేరుతో వ్యవహరించేవారు.

ఆసియా మైనర్ కోస్తాలోని గ్రీకువలసలలో మైలీటస్ అనే ఐవోనియన్ నగరం ఒకటి. అది పరిసర నగరాలతోను, ఈజిప్టు, బాబిలోనియావంటి దూర ప్రాంతాలతోను వాణిజ్యం-ముఖ్యంగా నౌకా వాణిజ్యం-చేస్తూ భాగ్యవంతమైన నగరమయింది. దేశ దేశాలనుంచి వ్యాపారస్థులు, పండితులు, ఇతర యాత్రికులు వచ్చేవారు. ఈ రాకపోకల కారణంగా, ఒకరి సంస్కృతిని మరొకరు తెలుసుకొనడం ద్వారా మైలీటస్‌లో కళలు, విజ్ఞాన, సాంకేతిక శాస్త్రాలు కూడా బాగా వృద్ధిచెందాయి. మొత్తంపై మైలీటస్ ఆ నాటి గ్రీకుల నాగరికతా కేంద్రాలలో ముఖ్యమైనదిగా భాసించింది.

## మైలీషియన్ దార్శనికులు

గ్రీకుల తత్వశాస్త్రానికి అంకురార్పణ జరిగింది కూడా మైలీటస్ నగరంలోనే. ఇంతకుముందు పేర్కొన్న థేలీస్ ఆ నగర పౌరుడే. అతని శిష్యుడు అనక్జిమాండర్, అతని శిష్యుడైన అనక్జిమెనీస్ కూడా ఆ నగరానికి చెందిన తత్వవేత్తలే. ఆ నగరం పేరుమీదుగానే ఈ ముగ్గురు తత్వవేత్తల సిద్ధాంత సంప్రదాయానికి "మైలీషియన్ స్కూల్ ఆఫ్ ఫిలాసఫీ" అనే పేరు వచ్చింది.

ఈనాడు తత్వశాస్త్రం (ఫిలాసఫీ), విజ్ఞానశాస్త్రం (సైన్సు) అనే మాట

లను వేరు వేరు అర్థాలలో ఉపయోగిస్తున్నాము. కాని ప్రాచీనకాలపు గ్రీకులకు ఈ రెండు శాస్త్రాలు ఒకటే. వారి తొలి తత్వవేత్తలే వారి విజ్ఞానవేత్తలు. ఎందుకంటే వారు ప్రపంచాన్ని మిథ్య (ఇల్యూజన్) గానో, ఆభాస (అపియరెన్స్) గానో భావించలేదు. దృశ్యమాన జగత్తు యథార్థమనే భావనతోనే వారు దాన్ని పరిశీలించారు.

## రెండు ప్రశ్నలు

వారు తమకు తాము రెండు ప్రశ్నలు వేసుకున్నారు: ఒకటి—ఈ ప్రపంచానికి మూలకారణం ఏమిటి? రెండు—ఆ మూలకారణమైన పదార్థంనుంచి జగత్తు ఎలా పరిణామం చెందింది? ఈ రెండు ప్రశ్నలకు సమాధానాలు చెప్పడానికి వారు చేసిన ప్రయత్నాలతోనే గ్రీకుల తత్వశాస్త్రానికి అంకురార్పణ జరిగింది.

అంతకుముందు ఈజిప్టు, బాబిలోనియా మొదలైన దేశాలలో ప్రపంచాన్ని ఏ దేవుడో సృజించాడనే నమ్మకం వుండేది. కాని, క్రీస్తుపూర్వం అరవ శతాబ్దపు గ్రీకు తత్వవేత్తలు అలా కాక, ప్రపంచం ఆవిర్భావానికి, పరిణామానికి భౌతికమైన ప్రకృతిసిద్ధమైన కారణాలను అన్వేషించారు. "ఎవ్వనిచే జనించు జగమెవ్వనిలోపల నుండు లీనమై, ఎవ్వని యందు డిందు..." అని మతం వితర్కించగా, ఈ గ్రీకు తత్వవేత్తలు మాత్రం ప్రపంచానికి మూలకారణాన్ని ప్రపంచంలోనే అన్వేషించారు.

ఇది ఈనాడు సర్వసాధారణ విషయంగా కనబడవచ్చుగాని, ఆ ప్రాచీన శతాబ్దాలలో అది గొప్ప సాహసమేనని చెప్పాలి. గ్రీకులలో ఇలాంటి సాహసోపేతమైన ఆలోచనాధోరణికి అనేక విలక్షణ పరిస్థితులు తోడ్పడ్డాయి. ముఖ్యంగా తక్కిన జాతులకువలె గ్రీకులకు ప్రత్యేకించి మతాధిపతులంటూ లేరు- మతాధికారులు తప్ప, మరెవ్వరూ విద్యాబుద్ధులు నేర్వరాదనే నియమం వుండేది కాదు. ఎవరైనా చదువుకోవచ్చు. ఎవరైనా విజ్ఞానార్జన చేయవచ్చు.

## భావస్వాతంత్ర్యం

గ్రీకులకు దేవతలపై విశ్వాసం లేకపోలేదు. వారికి మన వైదిక దేవతలతో దగ్గర పోలికలుగల దేవత లనేకులు వుండేవారు. కాని, తక్కిన ప్రాచీన జాతుల వారిలోవలె గ్రీకులకు సృష్టికర్త అయిన దేవుడొకడు వుండేవాడు కాదు. అలాగే వారికి రాజాలున్నప్పటికీ, ఆ రాజులు ఈజిప్టు మొదలైన దేశాలలోవలె దేవుని అపరావతారాలు కారు. గ్రీకుల రాజులు సామాన్య మానవుల వంటి

వారే. పైగా గ్రీకులు ఒక్క రాజరికంతోనే కాక, రకరకాల రాజకీయ వ్యవస్థలతో ప్రయోగాలు చేశారు. అరిస్టాక్రసీ (ఉన్నత వంశీయుల పాలన), డెమోక్రసీ (ప్రజాస్వామ్యం), ఆలిగార్కి (కొద్దిమంది చేతులలో పాలనాధికారం), టిరనీ (ఏకవ్యక్తి ఇష్టారాజ్యం)– ఇవన్నీ వారికి తెలుసు.

ఏమైనా, తక్కిన ప్రాచీన జాతులవలె కాక, వారి రాజకీయ, సాంఘిక, మత వ్యవస్థల వైలక్షణ్యం కారణంగా, గ్రీకులకు స్వేచ్ఛగా తత్వచింతన చేసే అవకాశం లభించింది. దైవాంశ సంభూతుడైన రాజుగారు ఫలానా సంప్రదాయాన్ని, విశ్వాసాన్ని పాటించాలన్నాడు కనుక, దాన్ని త్రోసిపుచ్చరాదనే నియమం వారికి లేదు. ఫలానా దేవత ఇలా శాసించాడు కనుక దాన్ని ఉల్లంఘించడానికి వీలులేదనే సంప్రదాయపు సంకెళ్లు వారికి లేవు. ఆఖరికి తమ దేవతలను వేళాకోళం చేయడానికి కూడా వారు వెనుదీసేవారు కారు. దేవతలు, దయ్యాలు లేవనే భౌతిక వాదాన్ని, నాస్తికవాదాన్ని ప్రచారం చేయడానికి కూడా వారికి కావలసినంత స్వేచ్ఛ వుండేది.

## గ్రహణ జోస్యం

అటువంటి స్వేచ్ఛా వాతావరణంలో నుంచి వచ్చిన తత్వవేత్త థేలీస్. అతడు క్రీస్తుపూర్వం 624 లో జన్మించాడని, 58వ ఒలింపియాడ్ (548-545) కాలంలో– బహుశా 546 లో చనిపోయాడని ప్రాచీన చరిత్రకారుల వ్రాతలనుబట్టి తెలుస్తున్నది.

ఇంతేకాక, అతని జీవితకాలాన్ని నిర్ణయించడానికి తోడ్పడిన ఒక చారిత్రక సంఘటన క్రీస్తుపూర్వం 585 మే 28 వ తేదీన సంభవించిన సంపూర్ణ సూర్య గ్రహణం. దాన్ని థేలీస్ ముందుగా లెక్కకట్టి జోస్యం చెప్పాడట. బహుశా ఇందుకే కావచ్చు అతడిని గ్రీకులు తమ ప్రాచీన సప్త విజ్ఞానుల (సెవెన్ వైజ్ మెన్) లో ఒకడని పేర్కొంటారు.

అయితే, గ్రహణాలు ఎప్పుడు వస్తాయో కనుగొనే ఖగోళ, గణిత శాస్త్రపద్ధతి గ్రీకుల కంటె ఎంతో ముందుగా బాబిలోనియన్‌లు కనిపెట్టారు. సుమారుగా 18 ఏళ్ల 7 నెలల వ్యవధిలో వచ్చిన గ్రహణాలే మళ్లీ మళ్లీ వస్తూవుంటాయని బాబిలోనియన్‌లకు తెలుసు. దీన్నే "గ్రహణ చక్రం" (సెరాస్) అంటారు. థేలీస్ ఈజిప్టు, బాబిలోనియా మొదలైన దేశాలలో పర్యటించినవాడు. కనుక, ఆయా దేశాల వారి నుంచి ఖగోళ, గణిత శాస్త్రాలను నేర్చుకొని వుంటాడు. ఇంతే కాక, అతడు స్వయంగా కొన్ని రేఖా గణిత సూత్రాలను (ఉదాహరణకు వృత్తాన్ని సగం చేస్తే దాని వ్యాసం వస్తుంది) కనుగొన్నాడని, వాటి సహా

యంతో ఈజిప్షియన్ పిరమిడ్‌ల ఎత్తును గుణించాడని, సముద్రంలోని నౌకలు ఒడ్డునుంచి ఎంత దూరంలో వున్నాయో లెక్కకట్టేవాడని ప్రతీతి.

## జగమంతా జలమయం

థేలీస్‌ను తత్వవేత్తగా ప్రసిద్ధుడిని చేసిన సిద్ధాంతం ఒకటి వున్నది. ప్రపంచానికి మూల పదార్థం నీరు అని అతడు ప్రవచించాడు. మన పూర్వులు జగత్తును పాంచ భౌతికం అన్నారు. అంటే నేల, నీరు, అగ్ని, వాయువు, ఆకాశం (పృథ్వ్యాపస్తేజోవాయురాకాశః) అనే పంచభూతాల కలయికతో సమస్త ప్రపంచం ఏర్పడిందని వారు భావించారు. థేలీస్ అలాకాక ప్రపంచాన్ని ఏకభౌతికం అన్నాడు. ఆ ఏక మూలపదార్థం నీరు అన్నాడు.

నిజానికి మనవారి పంచభూతాలు గాని, థేలీస్ చెప్పిన ఏకభూతం గాని ప్రపంచానికి కారణాలు కాదు. సృష్టిలో ఉదజని, హీలియం, నత్రజని, ఆమ్లజని, ఇనుం, బంగారం, సీసం, యురేనియం మొదలైన 92 మూలపదార్థాలున్నాయని, వాటి రకరకాల సంయోగాలవల్లనే విశ్వం ఏర్పడిందని ఆధునిక విజ్ఞానవేత్తలు కనుగొన్నారు. కనుక థేలీస్ ప్రపంచమంతా నీటిలోనుంచి వచ్చిందని ప్రతిపాదించడం మనకు ఈనాడు నవ్వు పుట్టిస్తుంది.

నిజమే. కాని, అంతమాత్రాన థేలీస్ సిద్ధాంతాన్ని చులకన చేయడం కూడా తగదు. న్యూటన్ అన్నాడట— "నేను ఎక్కువ దూరం చూడగలిగానంటే నా పూర్వులైన ఎందరో మహామహుల భుజాలపై ఎక్కి చూసే అవకాశం నాకు కలగడమే దానికి కారణం" అని. న్యూటన్ పేర్కొన్న ఎందరో పూర్వ మహామహులలో మొదటివాడు థేలీస్ అనే విషయం మనం మరచిపోరాదు.

## అప్పటికి అదే గొప్ప

థేలీస్ సిద్ధాంతం తప్పే. కాని, అతడు ప్రపంచానికి మూలకారణాన్ని మూఢ విశ్వాసాలలో కాకుండా ప్రకృతిలోనే అన్వేషించడం అనేది మానవ మేధా చరిత్రలో ఒక గొప్ప ముందడుగు.

అయితే, థేలీస్ ఏ తార్కిక ప్రక్రియ ద్వారా ప్రపంచాన్ని జలోద్భవంగా పేర్కొన్నాడో మనకు ఈనాడు తెలియదు. అతడి రచనలేవీ లభ్యం కావడం లేదు. అతడి తర్వాతి గ్రీకు తత్త్వవేత్తలలో ప్రముఖుడైన అరిస్టాటిల్ తన రచనలలో ఉదాహరించిన విషయాల ద్వారానే థేలీస్ సిద్ధాంతం కొంతమేరకు తెలియవస్తున్నది.

నీరు ఆవిరిగా, అంటే వాయుపదార్థంగా మారుతున్నది. నీటిని సూర్యుడు పీల్చుకుంటున్నాడు. అంటే నీరే అగ్నిగా మారుతున్నది. తిరిగి ఆవిరి చల్లబడి వర్షంగా కురిసి నేలలోకి పోతున్నది. అంటే నీరు మట్టిమట్టిగా మారుతున్నది. నీరు గడ్డకట్టి మంచు అవుతున్నది. మంచు కరిగి నీరు అవుతున్నది. అప్పు డప్పుడు నేలలోనుంచి నీటి బుగ్గలు వస్తాయి. అంటే నేల అడుగున నీరు వుంది. బహుశా నీటిపై భూమి తేలుతున్నది. నీరు లేనిదే ప్రాణికోటి మనుగడే లేదు... ... ఇలాగ నీరు అనేక విధాలుగా పరిణామం చెందుతుండడం చూసి థేలీస్ దాన్ని ఏకైక మూల పదార్థంగా భావించి వుంటాడు.

ఇంతేకాదు, భూమండలాన్ని పరివేష్టించి "ఓషియానస్" అనే నది ప్రవహి స్తున్నదని గ్రీకుల నమ్మకం. ఇది థేలీస్ ఊహకు మరొక ఆధారమై వుండవచ్చు.

## వటపత్రశాయి

పంచభూతాలలో నీటికి అధిక ప్రాధాన్యమిచ్చే సంప్రదాయం మనకీ వున్నది. మన పూర్వులు చెప్పినదాన్నిబట్టి కల్పాంత కాలంలో జల ప్రళయం వస్తుంది. సమస్త ప్రపంచం సముద్రంలో మునిగిపోతుంది. విష్ణుమూర్తి ఆ సముద్రంలో వటపత్ర శాయియై యోగనిద్రలో వుంటాడు. ఆ తర్వాత ఎప్పుడో సముద్రం నుంచి భూమి పైకి లేచి సృష్టి పునః ప్రారంభమవుతుంది. ఇది మన పురా ణాల కథనం.

ఆధునిక విజ్ఞానం ప్రకారం చూసినా మొట్టమొదటగా భూమి ఉపరితల మంతా సముద్రమయమై వుండేది. దానిలోనుంచి కొంతకాలానికి భూఖండాలు పైకి తేలాయి. ఇప్పటికీ భూమి ఉపరితలంపై మూడింట రెండు వంతులు సముద్రమే. ఇంతే కాదు. అసలు జీవం (లైఫ్) అనేది మొట్టమొదటగా సముద్రంలోనే ప్రారంభమైందని ఆధునిక విజ్ఞానశాస్త్రం చెబుతున్నది. ఇంకొక విషయంకూడా ఇక్కడ పేర్కొనాలి. ఉదజని (హైడ్రోజన్) అన్నిటిలోకి ప్రాథమికమైన మూలపదార్థం (ఎలిమెంట్). దానిలోనుంచే తక్కిన హీలియం, ప్రాణ వాయువు, బంగారం, సీసం మొదలైన అన్ని మూలపదార్థాలు ఏర్ప డ్డాయి. విశ్వంలో ఇప్పటికీ అత్యధిక భాగం--అంటే నూటికి 90 వంతుల భాగం ఉదజనే. ఇంత ముఖ్యమైన ఉదజని నీటిలో మూడింట రెండు వంతులు (హెచ్ టు ఓ) వున్నది.

## జాతీయాహంకారం ?

అందుచేత అన్నిటికీ మూలపదార్థం నీరేనని థేలీస్ చేసిన సిద్ధాంతాన్ని

మనం పూర్తిగా హాస్యాస్పదమని కొట్టివేయనక్కరలేదు. అంతమాత్రాన అతడు పైన పేర్కొన్నంత ఆధునికంగానూ ఆలోచించి అటువంటి నిర్ధారణకు వచ్చాడని చెప్పడం కూడా తప్పు.

ఇదే మన ఛాందసులైతే "అన్నీ వేదాల్లోనే వున్నా"యని అంటారు. ఈనాడు ఆధునిక శాస్త్రవేత్తలు కనిపెట్టినవన్నీ మన పూర్వులకు ఇదివరకే కరతలామలకాలని అంటారు. ఉదాహరణకు ఆ మధ్య ఒక ప్రబుద్ధుడు ఐన్‌స్టయిన్ కనిపెట్టిన సాపేక్ష సిద్ధాంతం మన వ్యాస మహర్షికి తెలుసునని వ్రాశాడు. అలాగే కడచిన రెండు శతాబ్దాలలో మాత్రమే పాశ్చాత్య శాస్త్రజ్ఞులు కనుగొనగలిగిన యురేనస్, నెప్ట్యూన్, ప్లూటో గ్రహాలు మనవారికి భారత కాలం నాటికే తెలుసునని మరొక భారతీయ శాస్త్రవేత్త ఈమధ్యనే ప్రకటించాడు. ఇలాంటి వెర్రి మొర్రి అభిప్రాయాలు మన హిందూ జాతీయాహంకారానికి, లేదా మన ఆత్మన్యూనతా భావానికి (ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్‌కు) చిహ్నాలు.

వేదాలలో, ఇతర ప్రాచీన భారతీయ వాఙ్మయంలో ఎన్నోచోట్ల ఆధునిక వైజ్ఞానిక విశేషాలకు సన్నిహితంగా వచ్చే భావాలు సూత్రప్రాయంగా, బీజప్రాయంగా వచ్చేవి వున్నాయన్న మాట నిజమే. ఉపనిషత్తులు మొదలైన వాఙ్మయంలో కొన్ని భావాలు ఎంత ఆధునికమైనవిగా వున్నవో చూస్తే ఆశ్చర్యం కలుగుతుంది. కాని, అంతమాత్రాననే, ఈనాడు విజ్ఞానశాస్త్రవేత్తలు కొత్తగా కనుగొన్నదేమీ లేదని, ఈ విజ్ఞాన శాస్త్రాలన్నీ మనవారికి ఇదివరకే తెలుసునని వాదించడం అసంబద్ధం.

## శాస్త్రీయ పద్ధతి

పాశ్చాత్యులు జాతీయాహంకారంలో ఎవరికీ తీసిపోరు. నిజానికి వారి జాతీయ దురహంకారం నుంచి మనలను మనం రక్షించుకొనడానికే స్వాతంత్ర్యోద్యమ కాలంలో మన బాలగంగాధర తిలక్ వంటి పండితులు ఆర్య నాగరికతా ప్రాచీనత, దాని ఆధిక్యం గురించి కొన్ని సిద్ధాంతాలు చేయడం జరిగింది.

అయితే, పాశ్చాత్యులు శాస్త్రీయంగా, సోపపత్తికంగా ఆలోచిస్తారు. వారి సిద్ధాంతాలు తప్పుకావచ్చు కాని, వారి ఆలోచనాపద్ధతి శాస్త్రీయమైనది. తమ పూర్వులువేసిన ఎన్నో తప్పటడుగులలో నుంచి, ఒక క్రమ పరిణామ ఫలితంగా తమ విజ్ఞాన శాస్త్రాలన్నీ పెంపొందాయని వారు భావిస్తారు తప్ప, అన్నీ తమ పూర్వులకు ఇదివరకే తెలుసునని చెప్పరు. ఇప్పటికైనా సృష్టిరహస్య సమస్తం తమ గుప్పిట్లో వున్నదని వారు చెప్పడం లేదు.

ఈ విషయాంతరాన్ని వదిలిపెట్టి మళ్లీ థేలీస్ వద్దకు వద్దాము. అతడికి మరి కొన్ని విశ్వాసాలుండేవి. అయస్కాంతం ఇనుమును అకర్షించడం చూశాడు. అందువల్ల అయస్కాంతం సజీవ పదార్థమనుకున్నాడు. నీరు ఆవిరై పైకి పోతుంది. అందువల్ల నీరు సజీవ మనుకున్నాడు. ఇలాగ మొత్తం ప్రకృతి సజీవమని, పైగా దానికి ఆత్మ అనేది వుందని, అదంతా దేవతామయమని భావించేవాడట. అయితే, ఈ మూఢ విశ్వాసాలతో పాటు సృష్టికి ప్రాకృతిక (నేచురల్) కారణాల్ని అన్వేషించిన ఘనత కూడా అతనిదే.

## కట్టుకథా ? గట్టికథా ?

థేలీస్ ఎప్పుడూ తాత్వికాలోచనలో మునిగి వుండేవాడు. సాధారణంగా పైకి చూస్తూ నడిచేవాడట. ఒకసారి అలా నడుస్తూ ఒక నూతిలో పడ్డాడని, అతడి కేకలు విని ఎవరో రక్షించారని ఒక కథ వున్నది. ఇది కట్టుకథో, నిజమో తెలియదుగాని అతనికి జీవితంపట్ల, ధన సంపాదనపట్ల ఏమంత శ్రద్ధ వుండేది కాదట. అందరు అతడిని అప్రయోజకుడని వేళాకోళం చేసేవారు. ఇది నిజం కాదని నిరూపించడానికి అతడు ఒక పనిచేశాడని ఈ క్రింది కథ అరిస్టాటిల్ ద్వారా ప్రచారంలోకి వచ్చింది.

ఒక ఏడాది మైలీటస్‌లో ఆలివ్ పంట పండలేదు. థేలీస్ ఏవో లెక్కలు కట్టి వచ్చేయేడు ఆలివ్ పంట పుష్కలంగా పండుతుందని ఊహించాడు. తనవద్ద గల కొద్దిపాటి డబ్బుతో చుట్టుప్రక్కలగల మొత్తం ఆలివ్ నూనెమిల్లు లన్నిటిని కారుచౌకగా అద్దెకు తీసుకున్నాడు. అందరూ అతడు చేసింది పిచ్చిపని అనుకున్నారు. కాని, ఆ మరుచటి ఏడు నిజంగానే ఆలివ్ పంట సమృద్ధిగా పండింది. దానితో థేలీస్ వద్ద గల నూనె మిల్లులకు విపరీతమైన గిరాకీ వచ్చింది. తన కిష్టం వచ్చిన హెచ్చురేటు చెప్పి ఆలివ్ నూనె ఆడించి, బ్రహ్మాండంగా డబ్బు సంపాదించాడు. దానితో అంతా తెల్లబోయారట.

ఇదికూడా కట్టుకథో, నిజంగా జరిగిందో తెలియదుగాని, వేదాంతులు, తత్వవేత్తలు కావాలనే ప్రాపంచిక విషయాలను అశ్రద్ధ చేస్తారని, ధనసంపాదన లాంటి వాటిపట్ల వారు బుద్ధిపూర్వకంగానే వ్యామోహ రహితులుగా వుంటారని, తలుచుకుంటే వారు తమ బుద్ధికుశలత వల్ల అందరి కంటే ఎక్కువ ప్రయోజకులే కాగలరని చెప్పడానికి ఈ కథను బెర్ట్రాండ్ రస్సెల్ తన "హిస్టరీ ఆఫ్ వెస్టర్న్ ఫిలాసఫీ" లో ఉటంకించాడు.

అయితే అరిస్టాటిల్, రస్సెల్ ఇరువురు కూడా తత్వవేత్తలే కనుక తత్వవేత్తలను సమర్థించుకొనడం వారి ఉద్దేశమని మనం అనుమానిస్తే తప్పులేదు.

# 4
# థేలీస్ శిష్య ప్రశిష్యులు

గ్రీకు ప్రథమ తత్వవేత్త థేలీస్ గురించి క్రిందటి అధ్యాయంలో తెలుసుకున్నాము. ఇప్పుడు అతని శిష్య ప్రశిష్యులైన మరి ఇద్దరు ముగ్గురు తత్వవేత్తల సిద్ధాంతాలను పరిచయం చేసుకుందాము.



థేలీస్ శిష్యుడు అనగ్జిమాండర్. అతనివలె ఇతడుకూడా మైలీటన్ నివాసి. ఇతడు కూడా క్రీస్తుపూర్వం ఆరవ శతాబ్దివాడు. మైలీటన్ నగరంలో క్రీస్తుపూర్వం 610 లో జన్మించాడు. 546 లో చనిపోయాడు. అతడు తన కాలంనాటికి తెలిసిన భూగోళం మ్యాపును, ఖగోళ పటాన్ని తయారు చేశాడని ప్రతీతి. పెక్కు గ్రంథాలు రచించాడట కాని "ఆన్ నేచర్" (ప్రకృతి శాస్త్రం) అనే పుస్తకంలో చెదురుమదురు భాగాలు మాత్రమే లభ్యమైనాయి. గ్రీకు భాషలో అతనివే మొట్టమొదటి వచన రచనలని అంటారు.

## ఏకైక కారణం

అనగ్జిమాండర్ కూడా థేలీస్‌వలె ప్రపంచానికి ఒకే ఒక భౌతిక కారణాన్ని కనుగొనడానికి యత్నించాడు. బహుశా శాస్త్రవేత్తలకు, తత్వవేత్తలకు ఇదాక

సర్వసాధారణ లక్షణ మనిపిస్తుంది. విశ్వ సమస్తాన్ని ఒకే ఒక సూత్రపరిధిలోనికి తీసుకురావాలని వీరు ప్రయత్నిస్తారు.

ఇటీవలి ఐన్‌స్టయిన్‌నే తీసుకోండి. భౌతిక ప్రపంచానికి మూలాధారమైన గురుత్వాకర్షణ శక్తిని, విద్యుదయస్కాంత శక్తిని, అణుకేంద్రక శక్తిని- అన్నిటిని ఒకే ఒక గణితసూత్ర సమాహారం క్రిందికి తీసుకురావాలని తన జీవితం చివరి పాతిక సంవత్సరాలలోను ఆయన ప్రయత్నించాడు. ఆయన ఈ విషయంలో చేసిన ప్రయత్నాన్నే "యూనిఫైడ్ ఫీల్డ్ థియరీ" అంటారు. ఆ ప్రయత్నాన్ని ఆయన తర్వాతివారు కొనసాగించినప్పటికి ఇప్పటికీ పూర్తిగా సఫలం కాలేదుకాని, మొత్తంపై అలనాటి గ్రీకులనుంచి నేటి శాస్త్ర, తత్వ వేత్తల వరకు అందరికీ ప్రకృతి రహస్యాలను ఈ విధంగా ఒకే సూత్రం పరిధిలోకి తీసుకువచ్చి– ఇ= ఎమ్ సి$^2$ లాంటి దేదో ఒక బోర్డును విశ్వానికి తగిలించగోరడమనేది సామాన్య లక్షణమని చెప్పవచ్చు.

## అజ్ఞాత పదార్థం

థేలీస్ విశ్వానికి మూలాధారం నీరు అన్నాడు. దీన్ని అతని శిష్యుడు అనగ్జిమాండర్ ఖండించాడు. ఏదో ఒక అనిశ్చిత, అనిర్దిష్ట, అజ్ఞాతపదార్థం సమస్త స్థలాన్ని ఆవరించి, ఆవహించి వుండేదని, అది అనంతం, అనశ్వరం అని అతడు ప్రవచించాడు. దానికి గ్రీకు భాషలో Apeiron (ఎపీరాన్) అని అతడు పేరు పెట్టాడు. అది మనకిప్పుడు తెలిసిన ఏ పదార్థం వంటిది కాదు. ఎందుకంటే మనకి తెలిసిన అన్ని పదార్థాలు దానిలోనుంచే వచ్చాయి. అది నిర్గుణం. ఎందుకంటే మనకి తెలిసిన అన్ని పదార్థ గుణాలకు అదే మూలం.

అది తొలుత ఏకపదార్థంగా వుండేది. తర్వాత అది ఉష్ణం- శీతలం, తడి-పొడి ఇలాంటి ద్వంద్వ పదార్థాలుగా విడిపోయింది.

ఈ ద్వంద్వాల మధ్య నిత్యం సంఘర్షణ జరుగుతుంది. ఉదాహరణకి ఉష్ణం శీతలాన్ని జయించడానికి, తడి పొడిని ఆక్రమించటానికి ప్రయత్నిస్తూ వుంటుంది. కాని, ప్రకృతిలో అన్ని ద్వంద్వాలు ఒకానొక నిష్పత్తిలో వుండాలి. అది న్యాయ్యం (Law). ఈ న్యాయ్యాన్ని అతిక్రమించడానికి ఏ పదార్థం ప్రయత్నించినా, ప్రకృతి కలుగజేసుకుని తిరిగి సమతూకాన్ని, యథా నిష్పత్తిని స్థాపిస్తుంది.

ప్రపంచంలో నిప్పు, నీరు ఒక నిష్పత్తిలో వుండాలి. కాని, థేలీస్ చెప్పినట్లు అంతా జలమయమేనని అనుకోండి. అది న్యాయ్య విరుద్ధం అవుతుంది. కనుక నీరు ప్రపంచానికి ఆదిమ మూల పదార్థం కావడం అసంభవం. అలాగే నిప్పు, లేదా వాయువు, ఇవేవీ మూలపదార్థాలు కావు. వీటికన్నిటికీ మూలమైన ఏదో అజ్ఞాత పదార్థం నుంచి ఇవన్నీ వచ్చాయి. తిరిగి దానిలోకే వెళ్లిపోతాయి. ఆ పిదప కొంత కాలానికి మళ్లీ ద్వంద్వాలతో కూడిన సృష్టి ప్రారంభ మవుతుంది.

## వేరుపడిన ద్వంద్వాలు

ఆదిమ పదార్థం నిత్య చలనశీలం. ఈ చలనం వల్లనే దానిలోనుంచి ద్వంద్వ పదార్థాలన్నీ వేరుపడతాయి. మొదట ఉష్ణం వేరుపడింది. తర్వాత శీతలం వేరు పడింది.

శీతల పదార్థాన్ని ఉష్ణ పదార్థం ఆవరించి వుండేది. ఆ వేడిమికి శీతల పదార్థం నీరైంది. పిదప ఆవిరిగా మారింది. అప్పుడు అది వ్యాకోచించి తనను ఆవరించి వున్న అగ్ని వలయాన్ని ఛేదించింది. అలా ఏర్పడిన ముక్కలు అగ్నిచక్రాలవలె పరిభ్రమిస్తూ వుంటాయి. వాటి మధ్య అక్కడక్కడ రంధ్రాలుంటాయి. అవే నక్షత్రాలు, సూర్యుడు, చంద్రుడు. ఇవి తమ చుట్టూ వున్న గాలి ఒత్తిడి శక్తివల్ల భూమి చుట్టూ ప్రదక్షిణం చేస్తూ వుంటాయి. అప్పుడప్పుడు ఆ రంధ్రాలను గాలి మూసివేస్తుంది. దానితో గ్రహణాలు వస్తాయి.

భూమి సమస్త విశ్వానికి కేంద్రం. అది ఒక సిలిండర్ ఆకారంలో ఆధార రహితంగా నిలబడి వున్నది. అంటే భూమికి పైన, క్రింద అనేవి లేవన్నమాట. విశ్వంలో మనదొక్కటే కాదు. ఇలాంటి ప్రపంచాలు అనేకంగా వున్నాయి. సూర్యుడు భూమికంటే 26 లేదా 27 రెట్లు పెద్దవాడు.

## జీవజాతుల పరిణామం

ఇదంతా భౌతిక విశ్వానికి సంబంధించి అనక్జిమాండర్ చేసిన సిద్ధాంతం. ఇక జీవజాతులను గురించి కూడా అతడు కొన్ని ఊహాగానాలు చేశాడు. జీవజాతులు సృష్ట్యాదినుంచి ఇప్పుడున్న రూపాలలో లేవని, అవన్నీ పరిణామ ఫలితాలని అతడి ఉద్దేశమైనట్టు కనబడుతుంది. ఒక తేమ పదార్థంనుంచి సమస్త జీవజాతులు ఉద్భవించాయట. ఆ తేమ సూర్యుని వేడిమికి ఇగిరిపోగా జీవజాతులు ఒక చెట్టు బెరడు వంటి పదార్థాన్ని ఛేదించుకుని బయటపడ్డాయట.

మానవులు ఇప్పటివలె వుండేవారు కారు. ఎందుకంటే ఇప్పుడు మానవ శిశువు పుట్టగానే తనంతటతాను ఆహారం సంపాదించుకోలేదు. దానికి కొంత కాలం పాటు తల్లి సంరక్షణ అవసరం. పెరిగి పెద్దయిన తర్వాతనే మానవుడు తన ఆహారం తాను సంపాదించుకుని, తన్ను తాను రక్షించుకోగలుగుతాడు. మరి మొదటి నుంచి ఇదే విధంగా నిస్సహాయంగా వుండి వుంటే అసలు మానవజాతి ఎప్పుడో అంతరించి వుండేది. అందువల్ల మొదట మానవులు చేపలవంటి జీవుల లోపల వుండి, పెరిగి పెద్దయిన తర్వాత బయటికి వచ్చేవారు. క్రమంగా తమంతట తాము ఆహారం సంపాదించుకొనడం నేర్చుకొన్న తర్వాత నీటిని వదిలిపెట్టి నేలమీదికి వచ్చారని, అప్పుడు వారికి ఇప్పటి రూపం సిద్ధించిందని అనక్జిమాండర్ ఊహ.

## చిత్రమైన ఆధునికత

ఇదంతా మనకు అసందర్భపు ఊహాగానంగా కనిపిస్తుంది. అయితే, ఈనాటి కొన్ని శాస్త్రీయ సిద్ధాంతాలకు మూలబీజాలు అనగ్జిమాండర్ ఊహలలో కని పిస్తాయి. అదే అతడి ఘనత. ఉదాహరణకు— అతడు ప్రపంచానికి మూలం మనకు ఈనాడు తెలిసిన ఏ పదార్థమూ కాదని, అది మన ఊహకు అందని అజ్ఞాత పదార్థమని అన్నాడు. ఇది ఆధునిక శాస్త్రవేత్తల ఊహలకు దగ్గరగా వస్తున్న ఆలోచన.

ఉదాహరణకు— ఆధునిక సిద్ధాంతం ప్రకారం సృష్టి జరగడానికి ముందు విశ్వ పదార్థం అంతా ఒక పరమాణు రూపంలో వుండేది. దానిలోని అస్థి రత్వం కారణంగా అది ప్రేలిపోయింది. దాన్నే బిగ్ బ్యాంగ్ (big bang) అంటారు. ఆ ప్రేలుడుతో సృష్టి ప్రారంభమైంది. స్థలం, కాలంతో సహా ప్రోటాన్లు, ఎలక్ట్రాన్లు, న్యూట్రాన్లు మొదలైన వన్నీ ఏర్పడ్డాయి. క్రమంగా నక్షత్రాలు, గాలక్సీలు ఏర్పడ్డాయి.

ఈ గాలక్సీలు మొదటి ప్రేలుడు నాటి చలన వేగం వల్ల ఒకదానినుంచి ఒకటి దూరంగా పోతూ విశ్వాన్ని విస్తరింపజేస్తున్నాయి. ఎప్పటికో అవి తిరిగి తమ మధ్య గురుత్వాకర్షణ శక్తివల్ల తిరిగి దగ్గరగా చేరడం, చివరికి మళ్లీ ఒకే అణువుగా విలీనమైపోవడం జరుగుతుంది. ఈ సృష్టి, స్థితి, లయం మరల మరల జరుగుతూ పోతాయి.

అనగ్జిమాండర్ కూడా ఇలాగే ఏ తర్క ప్రక్రియ ద్వారా ఊహించాడోగాని ఆదిమ కాలంలో ఏదో అజ్ఞాత పదార్థం నుంచి ద్వంద్వ పదార్థాలు వేరువ డ్డాయని, సృష్టి అంతంలో తిరిగి ఆ అజ్ఞాత పదార్థంలోకే అవి వెళ్లిపోతాయని అన్నాడు.

మన సాంఖ్య దర్శనం కూడా సమస్త సృష్టి ఏ ఊహకు అందని ప్రకృతి అనబడే ఒకానొక అజ్ఞాత పదార్థం నుంచి పరిణామం చెందిందని చెబుతున్నది.

## సిలిండర్ వంటి భూమి

ఇక భూమి ఒక సిలిండర్ ఆకారంలో వున్నదనడంబట్టి అది బల్లపరుపుగా లేదని, దాదాపు గోళాకారంగా వుందని ఊహించాడు. అలాగే, జీవపరిణామ సిద్ధాంతపు ప్రథమ చ్ఛాయలు కూడా అనగ్జిమాండర్ చింతనలో కనిపిస్తాయి. జీవసృష్టి తేమ పదార్థంలో ప్రారంభమైందన్నాడు. ఇది నిజమేకదా? జీవ రాశి సముద్రాలలోనే ఉద్భవించింది. మానవులు ఇప్పటి రూపంలో వుండేవారు కాదని, ఇతర జంతురూపాల నుంచి వారు పరిణామం చెందారని అన్నాడు. ఆధునిక జీవశాస్త్రం ప్రకారం ఇదీ నిజమే కదా? మనకు తెలిసిన ప్రపంచం లాంటివి ఎన్నో వున్నాయని అతడు అన్నాడు ఇదీ యథార్థమేకదా!

అయితే థేలీస్ విషయంలో చెప్పినట్టే అనగ్జిమాండర్ కూడా తన సిద్ధాంతాలన్నిటినీ నేటి శాస్త్రవేత్తలవలె ప్రయోగాలు, పరిశోధనలు చేసి ఊహించాడని దీని అర్థం కాదు. అతడి సిద్ధాంతాల వెనుక ఒక శాస్త్రీయాలోచన వున్నదని మాత్రమే మనం చెప్పగలిగింది.

## అనగ్జిమెనీస్

మైలీషియన్ తత్వ సంప్రదాయం (స్కూల్ ఆఫ్ ఫిలాసఫీ) లో మూడవ వాడు అనగ్జిమెనీస్. ఇతడు అనగ్జిమాండర్ శిష్యుడని, మైలీటస్ నివాసి అని, క్రీస్తుపూర్వం 588 నుంచి 524 వరకు జీవించాడని ప్రతీతి.

ఇతడు తన గురువుతోను, గురువు గురువుతోను విభేదించాడు. ఇతడు నీరూకాదు, అజ్ఞాత పదార్థమూ కాదు- అన్నిటికి మూలపదార్థం గాలి అన్నాడు. తత్వశాస్త్రంలో ఇదే విచిత్రం. ఏ ఇద్దరు తత్వ వేత్తలు ఏకీభవించరు. సైంటిస్టులు అలా కాదు. ఒక సైంటిస్టు ప్రయోగరీత్యా ఒక విషయం కనుగొంటే, లేదా ఒక గణిత సూత్రం ద్వారా ఒక సిద్ధాంతాన్ని నిర్మిస్తే దాన్ని మిగిలిన వారు ఆమోదిస్తారు. అనుమానం కలిగితే తాము కూడా ప్రయోగాలు చేసి, లెక్కలు వేసి అది నిజమైతే అంగీకరిస్తారు. లేకపోతే లేదు. ఉదాహరణకు న్యూటన్ కనిపెట్టిన గురుత్వాకర్షణ సూత్రం $f = \frac{g(m_1 m_2)}{d^2}$ గాని, ఐన్‌స్టయిన్ కనిపెట్టిన శక్తి పదార్థాల ఏకత్వ సూత్రం ($E = mc^2$) గాని తిరుగులేని సార్వకాలిక సూత్రాలు. కాంతి వేగం సెకండుకు 186 వేల మైళ్ల చిల్లర అనేది కూడా అంతే. దాన్ని ఎవరూ కాదనలేరు.

కాని, తత్వశాస్త్రం ప్రపంచానికి ఆధారభూతమైన సత్యాన్ని అన్వేషిస్తుంది. ఒక్కొక్క తత్వవేత్త ఒక్కొక్క విధంగా సత్యాన్ని దర్శిస్తాడు. అందుచేత తత్వాన్వేషణకు అంతం అంటూ వుండదు. అనంతంగా సాగుతూనే వుంటుంది. అదే తత్వశాస్త్రంలోని ముఖ్యాకర్షణ కూడా.

ఇంతకీ అనగ్జిమెనీస్ ప్రపంచానికి మూల పదార్థం వాయువు అని ఏ విధంగా ఊహించాడో మనకు తెలియదు. వాయువు బాగా పలచబడితే అగ్నిగా మారుతుంది. చిక్కబడితే గాలి అవుతుంది. ఇంకా చిక్కబడితే మేఘాలు ఏర్పడతాయి. మరింత చిక్కబడితే నీరు, అదీ దట్టమయితే మట్టి, అది ఇంకా గట్టిపడితే రాయి ఏర్పడతాయి. ఇదీ అతని సిద్ధాంతం. వాయువు పల్చబడడం, చిక్కబడడంపై ప్రపంచం అంతా ఆధారపడి వుందని అతడు అంటాడు.

## వాయుజన్యం

వాయువు గట్టిపడడంవల్ల మట్టి, రాయి ఏర్పడి భూమి రూపొందింది. అది

బల్లపరుపుగా వున్నదని, దాన్ని గాలి మోస్తున్నదని అనగ్జిమెనీస్ ఊహించాడు. గాలి పల్చబడడంవల్ల వచ్చిన అగ్నినుంచి నక్షత్రాలు ఏర్పడ్డాయి.

ఆ నక్షత్రాలు భూమిచుట్టూ తిరుగుతున్నాయి. అయితే, సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు రాత్రుళ్లు ఎందుకు కనబడడం లేదు? అవి భూమి క్రిందికి పోవడంవల్ల కాదు. భూమిమీదనే ఎత్తయిన ప్రాంతాలు కొన్ని వుంటాయి. వాటి చాటుకు పోవడం వల్లనే సూర్య చంద్రాదులు రాత్రిళ్లు కనబడడం లేదు.

మెరుపు అనేది గాలి ఆకస్మికంగా పల్చబడడంవల్ల వస్తుంది. నీరు కింద పడినప్పుడు అది చిక్కబడి వడగళ్లు ఏర్పడతాయి. నీటిలో కొంతగాలి ఇరుక్కుపోతే మంచు అవుతుంది. చిక్కబడిన ఆవిరిమీద సూర్యకిరణాలు పడితే ఇంద్రధనుస్సు కనబడుతుంది. అతివృష్టివల్ల, అనావృష్టివల్ల, భూమి తడిగానో, పొడిగానో మారిపోయినందున భూకంపాలు వస్తున్నాయి. ఇవన్నీ అనగ్జిమెనీస్ ఊహలు.

ఇవేవీ నిజంకాదని వేరే చెప్పనక్కరలేదు. కాని, మెరుపు అనేది దేవతల రాజు జూస్ ఆయుధమని, ఇంద్రధనుస్సు ఐరిస్ అనే దేవత అని, భూకంపాలు పోసీడన్ అనే దేవత ఆగ్రహ చిహ్నమని ప్రజలు భావించే రోజులలో /వాటిని ఉత్తుత్తి కథలుగా జమకట్టి, వాటికి ప్రాకృతిక కారణాలను వెదకబోవడమే గొప్ప. ఆ కాలానికి అదే మహా సాహసం.

## నెబ్యులా సిద్ధాంతం

వాయువు గట్టిపడడంవల్ల భూమి ఏర్పడిందని కదా అనగ్జిమెనీస్ ఊహ? దీన్ని ఆధునిక శాస్త్రవేత్తల సిద్ధాంతంతో పోల్చడం అప్రస్తుతం కాదనుకుంటాను.

ఒకానొక కాలంలో ఒకానొక బ్రహ్మాండమైన వాయుమేఘం (నెబ్యులా) కుదించుకు పోగా సూర్యుడు, అతని చుట్టూ గ్రహాలు ఏర్పడ్డాయని 1755 లో జర్మన్ మేధావి కాంట్ ఒక వాదాన్ని లేవదీశాడు. ఈ వాదం విషయం తెలియకుండానే 1796 లో లాప్లేస్ అనే ఫ్రెంచి గణిత శాస్త్రజ్ఞుడు దాదాపు ఇదే వాదాన్ని ప్రకటించాడు. దానికి "కాంట్-లాప్లేస్ థియరీ" అనే పేరు వచ్చింది. చాలా కాలంపాటు దాన్ని శాస్త్రవేత్తలు ఆమోదించలేదు.

కాని, 1943 లో కార్ల్‌వీజాకర్ అనే జర్మన్ శాస్త్రవేత్త ఇదే వాదాన్ని సోపపత్తికంగా ప్రతిపాదించాడు. సూర్యుడు, గ్రహాలే కాదు, విశ్వంలోని నక్షత్రాలు, గాలక్సీలు అన్నీ ఒకానొక కాలంలో బ్రహ్మాండమైన వాయుధూళి మేఘాలు గురుత్వాకర్షణ కారణంగా అంతకంతకు కుదించుకుపోయి, ఇంకా

ఇంకా దట్టమైపోగా యేర్పడ్డాయని వీజాకర్ వాదం. ఈ సిద్ధాంతాన్ని ఈనాడు మినహాయింపు లేకుండా ఆధునిక వైజ్ఞానిక లోకమంతా ఆమోదించింది.

అయితే ఒక తేడా. అనగ్జిమెనీస్ వాయువు గట్టిపడితే భూమి, పల్చబడితే అగ్ని పుట్టాయని ఊహించాడు. కాని, ఆధునిక సిద్ధాంతం ప్రకారం వాయువు గురుత్వాకర్షణ శక్తివల్ల మరీ మరీ కుదించుకుపోగా, కేంద్రంలో పదార్థపు ఒత్తిడివలన అపారమైన వేడి పుడుతుంది. ఆ ఉష్ణశక్తి కాంతిగా, ఇతర విద్యుదయస్కాంత శక్తులుగా మారుతుంది. అప్పుడు అది నక్షత్రంగా ప్రకాశించడం మొదలు పెడుతుంది.

ఈ ముఖ్య భేదాన్ని క్షమిస్తే, రెండున్నరవేల ఏళ్లనాడు వాయుపదార్థం నుంచే సమస్త విశ్వం ఏర్పడిందని ఊహించిన అనగ్జిమెనీస్‌కు జోహార్లు చెప్పవలసిందే కదా?

ఇతడు మైలీషియన్ తత్వవేత్తలలో ఆఖరివాడు.

## జె నో ఫె నీ స్

కాని, మైలీటస్ నగరానికి చెందినవాడు కాకపోయినా, థేలీస్, అనగ్జిమాండర్, అనగ్జిమెనీస్‌ల తత్వసంప్రదాయాన్ని కొనసాగించిన మరొక ఐవోనియన్ తత్వవేత్త వున్నాడు. అతడి పేరు జెనోఫెనీస్. అతడు క్రీస్తుపూర్వం 570లో జన్మించి, 480 వరకు జీవించాడు. ఇతడు చిన్నతనంలో అనగ్జిమాండర్ వద్ద చదువుకున్నాడని, కనుకనే ఇతనిపై మైలీషియన్ తత్వవేత్తల చింతన ప్రభావం పడిందని అంటారు. ఇతడు ఐవోనియాలో జన్మించినా, సిసిలీలో చాలా కాలం నివసించాడు.

జెనోఫెనీస్‌ను ప్రత్యేకించి తత్వవేత్తగా కాక సమకాలిక మూఢ విశ్వాసాలను ఖండించిన మేధావిగా మాత్రమే పలువురు చరిత్రకారులు పరిగణిస్తున్నారు. ఇతడు వ్యంగ్యకవి. విలాసమయమైన భోగజీవితాన్ని నిరసించిన సంఘ సంస్కర్త. మొత్తంపై చాలా సాహసోపేతంగా ఆలోచించిన వ్యక్తి.

గ్రీకుల మతానికి ప్రధానమైన ఆధారం హోమర్ వ్రాసిన రెండు మహాకావ్యాలు (ఇలియడ్, ఒడిస్సీ) అని ఇంతకు ముందు అనుకున్నాము. అలాగే క్రీస్తుపూర్వం ఎనిమిదవ శతాబ్దికి చెందిన హీసియాడ్ అనే మరొక మహాకవి రచనలు మరొక ముఖ్యాధారం. వీరిరువురిని, వీరు ప్రచారం చేసిన దేవతల కథలను, ఇతర మత సంప్రదాయాలను జెనోఫెనీస్ చాలా ధైర్యంగా నిరసించాడు, వేళాకోళం చేశాడు.

## అద్భుత సవాళ్ళు

"ఒలింపస్ పర్వత శిఖరాన నివసించే దేవతలు అతిలోకవీరులు కావచ్చు. కాని, వారు వట్టి చోరులు, జారులు, నీచులు అని నిరూపించే కథలు గ్రీకు పురాణాలలో వున్నాయి. అటువంటివారు మానవులకు ఆదర్శప్రాయులు ఎలా అయ్యా"రని జెనోఫెనీస్ ప్రశ్నించాడు. నిజానికి మానవులు తమను పోలిన దేవతలనే కల్పించుకున్నారు తప్ప మరేమీకాదని అతడు వాదించాడు.

తన వాదాన్ని బలపరచడానికి అతడు ఇలా వ్రాశాడు : "ఎద్దులకు, సింహాలకు, గుర్రాలకు చేతులుంటే, ఆ చేతులతో అవి బొమ్మలు వేయగలిగితే గుర్రాలు తమ దేవతలను అద్భుత శక్తిగల గుర్రపు రూపాలలో చిత్రిస్తాయి. ఎద్దులు తమ దేవతలను మహా వృషభాలుగా చిత్రిస్తాయి..."

ఇథియోపియా దేశస్థులు తమ దేవతలను తమవలె నల్లగాను, చట్టి ముక్కులు కలవారుగాను ఊహించుకున్నారు. కాని, థ్రేస్ దేశస్థులు తమ దేవతలను నీలికళ్ళు, తామ్రవర్ణ శిరోజాలు కలవారుగా, అందమైన వారుగా చిత్రించుకున్నారు.

ఇంతకీ అసలు దేవతలు ఎలా వుంటారో ఎవరికీ తెలియదు. ప్రతివారు తమ కల్పనా ప్రతిభనుబట్టి తమ దేవతలను ఊహించుకున్నారు.

## ఒకే దేవుడు

నిజానికి ఒకే దేవుడు- దేవతల కంటె, మానవుల కంటె గొప్పవాడు వున్నాడు. అతడు ఆకారంలో గాని, ఆలోచనలో గాని మానవులను పోలిన వాడు మాత్రం కాడు. అతడు అన్నీ చూస్తాడు, అన్ని వింటాడు, అన్నీ ఆలోచిస్తాడు. తను కదలకుండా తన మనశ్శక్తితోనే అన్నిటిని కదిలించగలడు—

ఇది జెనోఫెనీస్ వాదం- చూడడానికి అతడు ఏకేశ్వరవాదిగా కనిపిస్తాడు. కాని, అతడు పేర్కొన్న దేవుడు నిజంగా దేవుడు కాడని, అతనికి ముందున్న అనగ్జిమాండర్ మొదలయిన మైలీషియన్ తత్వవేత్తలు పేర్కొన్న ఆదిమ మూలపదార్థం లాంటిదాన్నో, లేదా మొత్తం విశ్వాన్నో, ప్రకృతినో దేవుడనే పేరుతో అతడు సంభావించాడని కొందరు చరిత్రకారులు వ్యాఖ్యానిస్తున్నారు.

అన్ని వస్తువులు మట్టినుంచి ఉద్భవించాయని, తిరిగి మట్టిలో కలుస్తాయని, మట్టి, నీరు ఇవే సమస్తానికి ఆధారమని, చివరకు భూమి సముద్రంలో కలిసి పోయినప్పుడు మానవులందరు అంతరిస్తారని జెనోఫెనీస్ ఊహించాడు.



# 5
# భావవాద పితామహుడు పితాగరస్

రామభక్తుడు "అంతా రామమయం ! జగమంతా రామమయం !" అని గానం చేస్తాడు.

గ్రీకుతత్వవేత్త పితాగరస్ "అంతా అంకమయం! జగమంతా అంకమయం!" అన్నాడు. అతడు సంగీత శాస్త్రజ్ఞుడు. అందుకని పైన పేర్కొన్న పల్లవిని తన భాషలో గానం చేసి వుంటాడు కూడా.

ఇంతకుముందు మనం తెలుసుకున్న గ్రీకు తత్వవేత్తలలో ఒకడు ప్రపంచానికి మూల పదార్థం నీరు అన్నాడు. మరొకడు వాయువు అన్నాడు. మరొకడు ఒక అనంత, అనిర్దిష్ట పదార్థం అన్నాడు.

పితాగరస్ ప్రపంచానికి మూలం అంకెలన్నాడు. అంకెలలోనుంచి సమస్తం వచ్చిందని. అంకెలు లేనిదే ప్రపంచమే లేదని అతడు సిద్ధాంతీకరించాడు.

## గణిత సూత్రం

ఇది చాలా విచిత్రమైన సిద్ధాంతంగా కనిపిస్తుంది. కాని, ముఖ్యంగా మనం

అంతగా విస్తుపోనక్కరలేదు. మన పూర్వులు ఓంకారం నుంచి సమస్త జగత్తు ఉద్భవించిందని భావించలేదా?

సోక్రటీస్‌కు ముందు గ్రీకు తత్వవేత్త లందరిలోకి పితాగరస్ సుప్రసిద్ధుడు. అతడి కీర్తి- సుమారు రెండున్నర వేల ఏళ్ల తర్వాత ఈనాటికి కూడా-అ క్షరాలా దిగంత విశ్రాంతం. నేటి సభ్య ప్రపంచంలో పితాగరస్ పేరు వినని హైస్కూలు కుర్రవాడు కూడా వుండడు.

"లంబకోణ త్రిభుజము నందు కర్ణముపై చతురస్రము మిగిలిన భుజ ములపై చతురస్రముల మొత్తమునకు సమానము-" ఏ లెక్కల పుస్తకములో చూచినా కనబడే ఈ సుప్రసిద్ధ, ప్రాథమిక గణిత సిద్ధాంతాన్ని కనిపెట్టినవాడు పితాగరస్. ఇది అతని ఖ్యాతికి గల అనేక కారణాలలో ఒకటి మాత్రమే.

పితాగరస్ క్రీస్తుపూర్వం 582 లో జన్మించి 500 లో చనిపోయాడు. అతడి జన్మస్థలం ఈజియన్ సముద్రం (గ్రీసు, టర్కీల మధ్య) లోని సేమాస్ అనే చిన్న ద్వీపం. అది కూడా ఐవోనియాకు చెందిన భూభాగమే.

ఆ రోజులలో మైలీటస్ ఎంత సుప్రసిద్ధ నగరమో, ఎంత భాగ్యవంతమైన నగరమో సేమాస్ కూడా అంతే సుప్రసిద్ధం, అంతే భాగ్యవంతం. ఆ రాజ్యం ఒకసారి పోలిక్రటీస్ అనే నిరంకుశుని పరిపాలన క్రిందికి వెళ్లింది. పితాగరస్‌కు అతగాడి రాజకీయాలు నచ్చలేదు. దానితో సేమాస్ ద్వీపాన్ని వదలిపెట్టి ఇటలీ దక్షిణాన క్రోటన్ అనే నగరానికి బహుశా క్రీస్తుపూర్వం 530 ప్రాంతా లలో— వలస వెళ్లాడు. అక్కడ స్థిరపడ్డాడు. ఒక నూతన మతాన్ని, దానికి అలంబనగా ఒక సంఘాన్ని స్థాపించాడు.

## భారతీయ ప్రభావం

గ్రీకు తత్వవేత్తలలో ప్రముఖులయిన థేలీస్, ఎంపిడోక్లీస్, అనక్సాగరస్, డెమోక్రిటస్ వంటివారు ప్రాచ్యదేశాలలో పర్యటించి, ప్రాచ్యదేశాల తత్వ సిద్ధాంతాలను అభ్యసించారని గ్రీకు చరిత్రకారుల అభిప్రాయం. ఈ విషయం ఎ. ఎ. మాక్డొనెల్ పండితుడు తన "హిస్టరీ అఫ్ శాన్‌స్క్రిట్ లిటరేచర్" లో వ్రాశాడు.

పితాగరస్ కూడా ఆ విధంగా ఇండియావరకు కాకపోయినా, పర్షియావర కయినా వచ్చి వుండవచ్చునని, అక్కడ భారతీయ తత్వ చింతనతో అతనికి పరిచయం కలిగి వుండవచ్చునని మాక్డొనెల్ ఊహాగానం. పితాగరస్ ప్రవచిం చిన మత, తాత్విక, గణిత సిద్ధాంతాలన్నీ క్రీస్తు పూర్వం అరవ శతాబ్దిలో

ఇండియాలో వ్యాప్తిలో వున్నవేనని, ముఖ్యంగా పునర్జన్మ వాదాన్ని పితాగరస్ భారతీయులనుంచి సంగ్రహించి వుండవచ్చునని మాక్డొనెల్ అభిప్రాయపడ్డాడు.

ఇది మాక్డొనెల్ అభిప్రాయం కాగా, అసలు పితాగరస్ భారతీయ మహర్షి అని, ఇండియానుంచి ఐవోనియా వలస వెళ్లాడని ఊహాగానం చేసినవారు కూడా లేకపోలేదు. మన మహర్షులవలె అతడు కూడా అద్భుతశక్తులు కలవాడని, మహిమలు చూపించేవాడని ఎన్నో కథలున్నాయి. సేమాస్‌లో నెజార్కస్ అనే ధనికుని కుమారుడని కొందరి కథనం. కాదు సాక్షాత్తు గ్రీకు దేవత అపోలో పుత్రుడని కొందరి విశ్వాసం. దీనికి తోడు పితాగరస్ కూడా తనను తాను దైవాంశ సంభూతుడుగా సంభావించుకున్నట్టు కనిపిస్తుంది. "కొందరు మనుషులు, కొందరు దేవతలు, కొందరు పితాగరస్ లాంటి వారు" అని పితాగరస్ స్వయంగా చెప్పుకున్నాడట.

## సంఘం శరణం గచ్ఛామి

ఏమైనా, పితాగరస్ బోధలకు, భారతీయ తత్వ సిద్ధాంతాలకు దగ్గర పోలికలు కనిపిస్తాయి. అతడు దక్షిణ ఇటలీలో క్రోటన్‌లో స్థాపించిన సంఘం బుద్ధుని సంఘం వంటిది కావచ్చు. లేదా బౌద్ధుల విహారాలవంటిది. లేదా మన ఋషుల గురుకులాలను పోలినది కావచ్చు. ఆ సంఘంలోని సభ్యులందరు ఒకే కుటుంబంవలె కలసిమెలసి జీవించేవారు. ఒకే విధమైన భోజనం ఆరగించేవారు. మన సన్యాసులందరు కాషాయాంబరాలే ధరించినట్టు వారు ఒకే మాదిరి దుస్తులు ధరించేవారు.

స్త్రీలకు కూడా ఆ సంఘంలో సభ్యత్వం వుండేది. తమ ఆస్తి పాస్తులను ఉమ్మడిగా, తమ కందరికీ చెందినవిగా భావించేవారు. అఖరికి ఎవరైనా ఒక కొత్త శాస్త్రీయ సూత్రాన్ని కనిపెడితే దాన్ని తమ సంఘం కనిపెట్టినట్టు ప్రచారం చేసేవారు తప్ప వ్యక్తుల పేర్లు పైకి రానిచ్చేవారు కారు. కళలలో, ముఖ్యంగా సంగీతంలో, చేతిపనులలో వారు నిపుణులు. వైద్య, గణిత శాస్త్రాలలో నిష్ణాతులు. ఈ సంఘం తన కాలంలో గ్రీకులపై విశేషమైన ప్రభావం కలిగి వుండేదని, పితాగరస్ శిష్యులు ప్రభుత్వాధికారం కూడా చెలాయించేవారని అంటారు.

## జనన, మరణ చక్రం

ఇక పితాగరస్ సిద్ధాంతాలను పరికిద్దాము. ఆత్మ నిత్యం, దానికి చావు లేదు. అందుచేత జన్మించిన ప్రతిజీవి మరణానంతరం మళ్లీ జన్మిస్తుంది. మనిషికి

పూర్వ జన్మవలె పునర్జన్మ వుంటుంది. "పునరపి జననం, పునరపి మరణం" అన్నట్టు జీవాత్మ ఈ సంసార చక్రంలో పరిభ్రమిస్తూ వుంటుంది. అయితే, నైతికంగా విశుద్ధమైన, నియతమైన జీవితం గడుపుతూ వుంటే, ఎప్పటికో ఏదో జన్మలో మానవుడికి ముక్తి, జన్మ రాహిత్యం సిద్ధిస్తాయి.

మరి ఏది విశుద్ధ జీవనం? ఈ ప్రశ్నకు సమాధానంగా పితాగరస్ తన సంఘ సభ్యులకు కొన్ని నియమాలు, నిబంధనలు ఏర్పాటు చేశాడు. బెర్ట్రాండ్ రస్సెల్ తన "హిస్టరీ ఆఫ్ వెస్టర్న్ ఫిలాసఫీ"లో పేర్కొన్న ఈ నియమ నిబంధనలు కొన్ని ఆదిమ సమాజాలలో విధి నిషేధాలను పోలి వుంటాయి.

## విధి నిషేధాలు

ఉదాహణకు- చిక్కుడు కూర తినరాదు. కిందపడిన వస్తువును తీసుకోరాదు. తెల్ల కోడిని ముట్టుకోరాదు. రొట్టెను విరవరాదు. రోడ్డుపై నడవరాదు. ఇంటిలో పక్షులను గూడు కట్టుకోనివ్వరాదు. జంతువు గుండెకాయను తిన రాదు. దీపం పక్కనుంచి అద్దంలో చూసుకోరాదు. నిప్పులపైనుంచి కుండను తీసినప్పుడు దాని గుర్తులు మిగలకుండా బూడిదను కలిపివేయాలి. పక్కమీద నుంచి లేవగానే దుప్పటిపై మన శరీరాకృతి అచ్చు మిగలకుండా సరిచేయాలి...

మనిషి నిస్వార్థ జీవనం గడపాలి. నిస్వార్థత అంటే ఏమిటి? సాధారణ భౌతిక జీవితంలో, అంటే వృత్తి వ్యాపారాలు మొదలైన వాటిలో వ్యక్తికి స్వార్థం వుంటుంది. కాని, మేధా సంబంధమైన జీవితంలో స్వార్థానికి తావులేదు.

ఉదాహరణకు తాత్విక సత్యాలను, గణిత సూత్రాలను అన్వేషించడంలో స్వార్థం ఏముంటుంది? అందుచేత ధ్యానంలో, సత్యాన్వేషణలో విశుద్ధ జీవనం వున్నది. (మన ఋషుల తపో జీవితానికి ఇది దగ్గర). దీనివల్ల మానవునికి ముక్తి లభిస్తుంది. ఇటువంటి విశుద్ధ జీవితం గడిపేవారే తత్వవేత్తలు. మిగిలిన వారికంటే వీరు గొప్పవారు. (ప్లేటోపై అనేక విధాలుగా పితాగరస్ ప్రభావం వున్నదని చెబుతారు. దానికొక ఉదాహరణ ప్లేటో తత్వవేత్తలకు— ఫిలాసఫర్లకు— తన రిపబ్లిక్‌లో ఇచ్చిన ప్రాధాన్యం).

పైన పేర్కొన్న పితాగరస్ విశ్వాసాలను బట్టి అతనిపై భారతీయ తాత్విక ప్రభావం చాలా వున్నదని అనిపిస్తుంది. ముఖ్యంగా పునర్జన్మ (ట్రాన్స్‌మైగ్రేషన్ లేదా మెటెమ్‌సైకోసిస్) వాదానికి గ్రీకుల మతంలో ఎక్కడా ఆధారంలేదని మాక్డొనెల్ పండితుడు వ్రాశాడు. పితాగరస్ దేశదేశాల పర్యటన సందర్భంలో ఈజిప్టు కూడా వెళ్లాడు. కాని, ఈజిప్షియనులకు కూడా ఇటువంటి విశ్వాసం

లేనందున వారి వద్ద నుంచి అతడు దాన్ని సంగ్రహించి వుంటాడనడానికి వీలు లేదు. బహుశా భారతీయుల నుంచే అతడు పునర్జన్మ వాదాన్ని తీసుకుని వుండవచ్చునని మాక్డొనెల్ అభిప్రాయం.

## ఆర్ఫిజం ప్రభావం

కాని, రస్సెల్‌తోసహా పాశ్చాత్య తత్వశాస్త్ర చరిత్ర వ్రాసిన పండితులందరు పితాగరస్ మత సిద్ధాంతాలకు ఆధారాలు గ్రీకుల ఆర్ఫిక్ మతంలో కనిపిస్తాయనే వ్రాశారు. ఈ కారణంవల్లనే రెండవ అధ్యాయంలో ఆర్ఫిక్ మతాన్ని గురించి కొంత సమాచారం ఇవ్వడం జరిగింది. అయితే డైయనైసస్ అనే దేవత ఆరాధన గ్రీకుల అనాగరిక, జానపద జీవిత దశకు చెందినది. దాన్ని బాగా సంస్కరించగా ఏర్పడినట్టిది ఆర్ఫిక్ మతం. దాన్ని మరింత నాగరికంగా సంస్కరించినవాడు పితాగరస్. అతడు స్థాపించిన నూతన మతాన్ని అవలంబించిన వారికి ఇష్టదైవం మద్యపానీయానికి ప్రతీక అయిన డైయనైసస్ (బాకస్) కాదు. వారి ఇష్టదైవం ఒలింపిక్ దేవతలలో ఒకడైన అపోలో. బహుశా ఈ కారణంగానే పితాగరస్‌కు అపోలో కుమారుడని పేరు వచ్చిందేమో.

అయితే, పితాగరస్ పునర్జన్మ సిద్ధాంతానికి పునాదులు గ్రీకుల ఆర్ఫిక్ మతం లోనే కలదని చరిత్రకారులు అంటున్నప్పటికీ, అది ఆనాటి గ్రీకులకు కూడా వింతగానే, కొత్తదిగానే కనిపించి వుండాలి. ఇందుకు నిదర్శనంగా పితాగరస్‌పై (క్రిందటి అధ్యాయం చివరలో పేర్కొన్న వ్యంగ్య కవి, తత్వవేత్త) జెనోఫెనీస్ జోక్ ఒకటున్నది. ఒకసారి పితాగరస్ పురవీధిలో వెడుతుండగా ఒకచోట కొంత మంది చేరి ఒక కుక్కను చావగొడుతున్నారట. అది కుయ్యో మొర్రోమని అరుస్తున్నది. అప్పుడు పితాగరస్ వారివద్దకు వెళ్లి "ఆ కుక్కను కొట్టకండి బాబూ! అది పూర్వజన్మలో నా మిత్రుడు. దాని అరుపు విని గుర్తుపట్టాను" అన్నాడట.

## సంఖ్యాదర్శనం

భారతీయ దర్శనాలలో ప్రముఖమైనది, ప్రాచీనమైనది సాంఖ్య దర్శనం. అది 24 లేదా 25 తత్వాలను పేర్కొంటున్నది. కనుక దానికి సాంఖ్యం అని, దాన్ని ప్రచారంచేసిన తత్వవేత్తలకు సాంఖ్యులని పేరు వచ్చింది.

పితాగరస్ కూడా ఒకవిధంగా సాంఖ్యుడే. అయితే, అతడి సిద్ధాంతానికి మన సాంఖ్యానికి ఎక్కడా పోలిక లేదనుకోండి. కనుక అతడి సిద్ధాంతానికి "సంఖ్యా దర్శనం" అని పేరు పెడదాము. దీనికి కారణం ఇది :

మొదటనే పేర్కొన్నట్టు పితాగరస్ జగమంతా అంకెల మయం అన్నాడు.

అంకెలు తప్ప ఇంకేమీ లేవన్నాడు. మన తాంత్రికులు కొన్ని అక్షరాలకు ప్రత్యేక శక్తులను ఆపాదించి వాటిని బీజాక్షరాలుగా పరిగణించారు. అలాగే పితాగరస్అం కెలలో కొన్నింటికి ప్రత్యేక శక్తులు కలవని అన్నాడు. (ఇది వెర్రినమ్మకమని ఆధునికులు అనుకోనక్కరలేదు. అంకెల మహత్యంపట్ల ఎందరికి ఎంత నమ్మకం లేకపోతే న్యూమరాలజీ అనే ప్రత్యేకశాస్త్రం బయలుదేరింది?)

## పితాగరస్ థీరం

పితాగరస్ థీరం అందరికి తెలిసిందే. అసలు లంబకోణ త్రిభుజాన్ని (రైట్ యాంగిల్డ్ ట్రయాంగిల్) కనుగొన్నది ఈజిప్షియనులని అంటారు. ఒక త్రిభుజంలో ఎబి పొడవు మూడు, బిసి పొడవు నాలుగు వుంటే ఎసి పొడవు అయిదు అవుతుంది. ఎబి, బిసి అనే భుజాల మధ్య విధిగా లంబకోణం (90 డిగ్రీలు) ఏర్పడుతుంది. ఇది సరే. కాని, ఎబి వర్గాన్ని (స్క్వేర్), బిసి వర్గాన్ని కలిపితే ఎస్ వర్గానికి సమానమవుతుందని ($AB + BC^2 = AC^2$) కనిపెట్టింది పితాగరస్.

ఈ సూత్రం అతనికి ఆశ్చర్యం కలిగించి వుంటుంది. ప్రకృతిలో ఒక క్రమం ఒక పద్ధతి, వస్తువుల మధ్య ఒక నిష్పత్తి వున్నాయి. ప్రతి వస్తువుకు పొడుగు, వెడల్పు, ఎత్తు అనే మూడు కొలత లున్నాయి. వీటివల్లనే వస్తువులకు ఆకృతులు ఏర్పడుతున్నాయి. ఆకృతి (form) లేనిదే వస్తువు లేదు. ఈ ఆకృతిని అంకెలలో వ్యక్తం చేయవచ్చు; పైగా ఆకృతిని అంకెలలో తప్ప వ్యక్తం చేయడానికి వీలులేదు. కనుక అంకెలు లేనిదే వస్తువులు లేవు. అంకెలే సత్యం. వస్తువులు మిథ్య, అంకెలకు ప్రతిరూపాలే వస్తువులు. కనుక అంకెలకు సంబంధించిన సూత్రాలను కనుగొంటే సత్యం తెలిసిపోతుంది.

## ద్వంద్వాలు

పితాగరస్ ఆలోచన ఈ విధంగా సాగివుండాలి. దీనితో తన అంకసిద్ధాంతాన్ని విశ్వమంతటికి వర్తింపజేశాడు. ఉదాహరణకు అంకెలు రెండు రకాలు- సరి, బేసి. వీటిలో బేసి సంఖ్యను రెండుచేత భాగించలేము. సరిసంఖ్యను రెండుచేత భాగించవచ్చు. అందుచేత బేసి సంఖ్య పరిమితి (లిమిట్) అవుతుంది. సరిసంఖ్య అపరిమితం (అన్‌లిమిటెడ్) అవుతుంది. బేసి, సరి - పరిమితం, అపరిమితం— ఇవి ద్వంద్వాలు, పరస్పర విరుద్ధాలైన ద్వంద్వాలు. ఇలాంటి ద్వంద్వాలను మరి ఎనిమిదింటిని పితాగరస్ ప్రతిపాదించాడు. ఏకం, అనేకం—కుడి, ఎడమ—మగ, ఆడ--చలనం, నిశ్చలనం—ఋజురేఖ, వక్రరేఖ—వెలుగు, చీకటి--మంచి, చెడు--చతురస్రం, దీర్ఘచతురస్రం, అంటే మొత్తం పది ద్వంద్వాలు. ఇలాంటి ద్వంద్వాల చేతనే విశ్వం ఏర్పడింది.

క్రిందటి అధ్యాయంలో మనం అనగ్జిమాండర్ అనే తత్వవేత్తను గురించి తెలుసుకున్నాము. అతడు కూడా జగత్తును ద్వంద్వమయం అన్నారు. ఈ అనగ్జిమాండర్ వద్ద పితాగరస్ చదువుకున్నాడని ప్రతీతి. దీనికి ఆధారం అనగ్జిమాండర్ వలె పితాగరస్ కూడా ద్వంద్వాల సిద్ధాంతాన్ని ప్రతిపాదించడం కావచ్చు. అయితే మన పూర్వులు కూడా జగత్తును ద్వంద్వమయంగానే భావించారు. బ్రహ్మ పదార్థాన్ని మాత్రమే "ఏకమేవాద్వితీయమ్" అని వారు నిర్వచించారు.

పోతే— మొట్టమొదటగా "అపరిమితం" అనే ఒక్క తత్వమే వుండేదట. దానిలో ఒక బిందువు, లేదా ఒకటి అనే అంకె ఏర్పడింది. దానితో "అపరిమితం" అనే ఆదిమ తత్వం "పరిమితం" కావడం మొదలుపెట్టింది. అలా అలా మిగిలిన అంకెలు, లేదా బిందువులు ఏర్పడి అపరిమితం నుంచి పరిమిత ప్రపంచం ఉద్భవించింది.

## ఆకృతుల వాదం

అపరిమితం (అన్‌లిమిటెడ్) అనేది పరిమితి (లిమిట్) కలిగినదిగా ఎలా మారుతున్నది? ఆకృతివల్ల. ఆకృతులలో ఎన్నో రకాలున్నాయి. బిందువు ఒక ఆకృతి (దీని సంఖ్య ఒకటి). రేఖ మరొక ఆకృతి (దీని సంఖ్య రెండు). తలం (ఫిగర్) మరొకటి (దీని సంఖ్య మూడు). ఇలా ఎన్నో ఆకృతులున్నాయి. వీటికి వస్తువులతో ప్రమేయం లేదు. వస్తువులు లేని ఆకృతులుంటాయి. కాని ఆకృతిలేని వస్తువు లేదు. ఈ ఆకృతిని వర్ణించడానికి అంకెలు అవసరం. ఆకృతులన్నీ అంకెలే. అవే అన్నిటికీ మూలాధారం. (ప్లేటో భావవాదానికి పునాది పితాగరస్ ప్రతిపాదించిన ఈ ఆకృతుల సిద్ధాంతమే.)

అపరిమితం అంటే అనంతమైనది. అన్‌లిమిటెడ్, ఇన్‌ఫినిట్. సాధారణంగా మనం పరిమితి కలదానికంటే పరిమితి లేనిది గొప్పదని అనుకుంటాము. పితాగరస్ దీన్ని అంగీకరించలేదు. అపరిమితం అనేది మనస్సుకు అందని అస్పష్ట భావన. పరిమితి అనేది స్పష్టతకు, నిర్దిష్టతకు చిహ్నం. కనుక అదే గొప్పదట.

ప్రాచీనకాలపు గ్రీకులకు సున్నా అనేది లేదు. అది భారతీయులు కనిపెట్టిన గణిత విశేషం. సున్నా లేనందున కూడిక, తీసివేత, హెచ్చవేత, భాగహారం మొదలైన లెక్కలు చేయడానికి అంక గణితాన్ని కాక గ్రీకులు రేఖాగణితాన్ని ఉపయోగించారు.

## రేఖాంక గణితం

ఉదాహరణకు పది అంకెను వేయాలంటే మనం ఒకటివేసి పక్కన సున్నా

పెడతాము. కాని, పితాగరస్ దాన్ని త్రిభుజాకృతిలో వేసేపద్ధతిని కనిపెట్టాడు. ఎలాగంటే త్రిభుజంలో భూరేఖ స్థానంలో నాలుగు చుక్కలు పెట్టాలి. దాని పైన మూడు చుక్కలు, దానిపైన రెండు చుక్కలు, దానిపైన ఒకచుక్క. ఆ చుక్కలు త్రిభుజాకృతిగా ఏర్పడతాయి. ఇప్పుడు కూడితే 4 + 3 + 2 + 1 = 10 అవుతుంది. పదిహేను వేయాలంటే భూరేఖలో అయిదు చుక్కలు, అలా ఒక్కొక్క అంకె తగ్గించుకుంటూ వరసలు వేస్తే మరొక త్రిభుజం వస్తుంది. కూడితే 5 + 4 + 3 + 2 + 1 = 15 అవుతుంది. అలాగే భూరేఖలో ఆరు వేస్తే 6 + 5 + 4 + 3 + 2 + 1 = 21 ఇలా త్రిభుజాకారంలో వేయడానికి వీలైన 10, 15, 21 మొదలైన సంఖ్యలను త్రిభుజ సంఖ్యలు (ట్రయాంగ్యులర్ నంబర్స్) అంటారు.

ఇలాగే చతురస్ర సంఖ్యలు (స్క్వేర్ నంబర్స్), దీర్ఘచతురస్ర సంఖ్యలు (రెక్టాంగ్యులర్ నంబర్స్) కూడా వున్నాయి. బేసి అంకెల మొత్తాలను కూడితే వచ్చే సంఖ్యలను చతురస్రాకారంలో చూపించవచ్చు. ఉదాహరణకు 1 + 3 = 4 దీన్ని రెండు చుక్కలతో రెండు వరుసలుగా వేయాలి. 1 + 3 + 5 = 9 దీన్ని మూడేసి చుక్కలతో మూడు వరుసలుగా వేయాలి. 1 + 3 + 5 + 7 = 16 దీన్ని నాలుగేసి చుక్కలతో నాలుగు వరుసలుగా వేయాలి. ఇలాగే బేసి అంకెలను పెంచుకుంటూపోతే వాటిని కలిపితే వచ్చే సంఖ్యలన్నీ స్క్వేర్ (చతురస్ర) సంఖ్యలే అవుతాయి.

కాగా, సరి అంకెలతో దీర్ఘ చతురస్ర సంఖ్యలు వస్తాయి. 2 + 4 + 6 = 12. దీన్ని వేయడానికి నాలుగేసి చుక్కలతో మూడు వరుసలు పెట్టాలి. 2 + 4 + 6 + 8 =20. దీన్ని వేయడానికి అయిదేసి చుక్కలతో నాలుగు వరుసలు పెట్టాలి. అంటే చుక్కల సంఖ్య కంటే వరుసల సంఖ్య ఎప్పుడూ ఒకటి తక్కువగా వుండాలి. ఇలా వచ్చే సంఖ్యలన్నీ రెక్టాంగ్యులర్ (దీర్ఘచతురస్ర) సంఖ్యలు.

ఈ విధంగా పితాగరస్ గాని, అతని శిష్యులుగాని గణితశాస్త్రానికి సంబంధించిన ఎన్నో చిత్ర విచిత్రాలను అన్వేషిస్తూ పోయారు. వాటిని సమస్త విశ్వానికి వర్తింపజేశారు. ప్రతి వస్తువును అంకెలలో వ్యక్తం చేయవచ్చు నన్నారు. మనిషికి ఒక సంఖ్య. గుర్రానికొక సంఖ్య. ఇలా అన్నిటికి సంఖ్యలను ఇచ్చారు. (ఆఖరికి "న్యాయం" లాంటి ఒక భావనకు కూడా ఒక సంఖ్యను ఇచ్చారు. అది చతురస్ర సంఖ్యట. ఎందుకంటే హాని చేసినవాడికి తిరిగి హాని చేయడమే కదా న్యాయ శాసనం?

దీన్ని మనం విడ్డూరంగా భావించనక్కరలేదని ఫుల్లర్, మెక్‌మరిన్ అనే తత్వశాస్త్ర రచయితలు తమ "హిస్టరీ ఆఫ్ ఫిలాసఫీ"లో పేర్కొన్నారు. ఎందు

కంటే అధునిక భౌతిక, రసాయనిక తదితర శాస్త్రాలు అంతకంతకు అధికంగా గణితసూత్రాలపై అధారపడుతుండడం చూస్తూనే వున్నాము. ఉదాహరణకు గురుత్వాకర్షణ శక్తిని న్యూటన్, సాపేక్ష సిద్ధాంతాన్ని ఐన్‌స్టయిన్ గణితసూత్రాలలోనే వర్ణించారు. వివిధ మూలపదార్థాలను సూచించడానికి అంకెలే ఆధారం. యురేనియంను 235 అనో, 238 అనో దాని అణుభారంతో పేర్కొనవలసిందే. రేడియో యాక్టివ్ స్ట్రాన్షియంను 90 అనే అంకెతో పేర్కొనవలసిందే. అలాగే వివిధ రసాయనిక పదార్థాలను వాటి కెమికల్ ఫార్ములాలతో పేర్కొనవలసిందే. విశ్వ స్వరూపాన్ని, లేదా అణు స్వరూపాన్ని వర్ణించడానికి ఈక్వేషన్లు కావలసిందే!

## ఖగోళ సిద్ధాంతాలు

పితాగరస్ భూమి బల్లపరుపుగా కాక, గోళాకృతిలో వున్నదని ఊహించాడు. భూమి విశ్వకేంద్రమని, దానిచుట్టూ చంద్రుడు, గ్రహాలు, నక్షత్రాలు పరిభ్రమిస్తున్నాయని అన్నాడు. ఈ గోళాలన్నీ అలా పరిభ్రమిస్తూ సంగీత ధ్వనులు చేస్తాయని పితాగరస్ ఎందుకోగాని ఊహించాడు. దీన్నే ఇంగ్లీషులో "మ్యూజిక్ అఫ్ ది స్ఫియర్స్" అంటారు.

ఇక్కడ ఒక ముఖ్య విషయం చెప్పాలి. పితాగరస్ స్వయంగా వ్రాసిన గ్రంథాలేవీ లభ్యం కాలేదు. అతడి సిద్ధాంతాలన్నీ అతడి శిష్యుల రచనల ద్వారా అరిస్టాటిల్ వంటి తత్వవేత్తల వ్యాఖ్యలద్వారా మనకు లభిస్తున్నాయి. ఇంతే కాక పితాగరస్ శిష్యులు అతని సిద్ధాంతాలలో ఎన్నో మార్పులు, చేర్పులు చేశారు. కాని, అన్నిటిని తమ గురువుకే ఆపాదించారు. అందుచేత ఏవి పితాగరస్ చెప్పినవో, ఏవి ఇతరులవో మనం చెప్పలేము.

ఏమైనా, ఆ తర్వాత కాలంలో పాశ్చాత్య దార్శనికులపై పితాగరస్ ప్రభావం ఇంతింతని చెప్పలేనిది. ప్లేటో, అరిస్టాటిల్ మాత్రమే కాదు. ఇటీవలి వారి వరకు ఎందరో పాశ్చాత్య తత్వవేత్తల సిద్ధాంతాలలో పితాగరస్ సిద్ధాంతాల ఛాయలు కనిపిస్తాయని అంటారు.

పాశ్చాత్య తత్వ చింతనలో రెండు ప్రధాన శాఖలున్నాయి. ఒకటి భౌతిక వాదం (మెటీరియలిజం), రెండవది భావవాదం (ఐడియలిజం), థేలీస్ మొదలైన వారు భౌతిక వాదానికి ఆద్యులు కాగా, పితాగరస్ నిస్సందేహంగా భావవాదాన్ని మేల్కొలిపిన వాడు. ఈ రెండు వాదాల మధ్య శతాబ్దాలుగా సంఘర్షణ సాగుతూనే వున్నది. బహుశా అది అలా ఎంతకాలమైనా కొనసాగుతూనే వుంటుంది. నాస్తిక, ఆస్తిక వాదాల మధ్య సంఘర్షణలాగే దానికి అంతం అనేది లేదు.



# 6
# నిరంతరపరివర్తనవాది హెరాక్లిటస్

"ఒకే నదిలో రెండుసార్లు నీవు స్నానం చేయలేవు"—

ఈ సుభాషితం పలువురికి పరిచితమే.

"పైకి వెళ్లేదారి, క్రిందికి వచ్చేదారి రెండూ ఒకటే"– ఇది కూడా చాల మందికి సుపరిచితమైన సుభాషితమే. ఎటొచ్చి ఆ "సుభాషిత భర్తృహరి" ఎవరో తెలిసి వుండకపోవచ్చు.

అతడు గ్రీకు తత్వవేత్తలలో మరొక ముఖ్యుడైన హెరాక్లిటస్. ఐవోనియా లోని ఎఫిసస్ నగరంలో క్రీస్తుపూర్వం 535 లో జన్మించాడు; 475 లో చనిపోయాడు.

ఇతడితో గ్రీకు తత్వ చింతన మరికొంత ప్రౌఢ గంభీరం అవుతున్నది. ఇత నికి ముందువారైన మైలీషియన్ తత్వవేత్తలు ప్రపంచానికి ఏది మూలతత్వం

అని ప్రశ్న వేసుకున్నారు. ఏ మౌలిక తత్వం నుంచి ప్రపంచం పరిణామం చెందిందని విచికిత్స చేశారు. అంతేతప్ప అసలు పరిణామం అంటే ఏమిటి, ఒక వస్తువు మరొక వస్తువుగా ఎందువల్ల, ఎలా మారుతున్నది అని గాఢంగా వితర్కించలేదు. ఎందుకో వారికి అట్టి ఆలోచన తట్టలేదు.

అట్టి ఆలోచన స్ఫురించినవారిలో ఒకడు థేలీస్‌కు నూరేళ్ల తర్వాతివాడైన హెరాక్లిటస్. అతడు ప్రపంచ తత్వాన్ని గురించి ఆలోచించి, ఆలోచించి, చివరికి ఒక నిర్ణయానికి వచ్చాడు :– ఈ ప్రపంచంలో సత్యమైనది, నిత్యమైనది ఏదీ లేదు - మార్పుతప్ప.

## అగ్నిహోత్రావధాన్లు

హెరాక్లిటస్ కులీన కుటుంబంలో జన్మించినవాడు. సహజంగానే అరిస్టొక్రసీని (ఉన్నతవర్గాల పరిపాలనా వ్యవస్థను) అభిమానించాడు. ప్రజాస్వామ్యాన్ని ఏవగించు కున్నాడు. అంతేకాదు. ప్రజాసామాన్యంపట్ల, వారు అవలంబించిన ఆర్ఫిజం వంటి మతాలపట్ల, వారి దేవతలు, కర్మకాండలు, ఆచార వ్యవహారాలు, విశ్వాసాల పట్ల ఏమాత్రం సదభిప్రాయం అతనికి లేదు.

దీనికితోడు అతనికి స్వోత్కర్ష కూడా ఎక్కువని తోస్తుంది. హోమర్‌ను పట్టుకుని తన్నాలన్నాడు. మరొక గొప్ప గ్రీకు కవి హెసియాడ్‌ను గడ్డిపోచవలె తీసిపారేశాడు. జెనోఫెనీస్‌ను నిరసించాడు. పితాగరస్‌తో సహా తనకు ముందు ఏ తత్వవేత్త అర్థం చేసుకోలేకపోయిన అమూల్య సత్యాలను తాను దర్శించానని గొప్పగా చాటుకున్నాడు. ఈ నాటి వరకు మిగిలిన అతని రచనా శకలాలనుబట్టి చూస్తే అతడు వ్యక్తిగా కూడా ఎప్పుడూ ఎవరో ఒకరిమీద చిర్రుబుర్రులాడే అగ్నిహోత్రావధానుల్లాగా కనిపిస్తాడు. (అన్నట్టు అతడు నిజంగానే ప్రపంచమంతా అగ్నిలోనుంచి వచ్చిందని సిద్ధాంతీకరించాడు.)

## "పాషాణ పాకప్రభూ !"

పైగా అతని శైలి, భావాలు పాషాణ పాకం. చెప్పదలచినదాన్ని సరళంగా, సూటిగా చెప్పడు. అల్పాక్షరాలలో అనల్పార్థాన్ని ఇమిడించి వ్రాశాడు. అతని ప్రతి వాక్యం ఒక పేరడాక్స్‌గా, విరోధాభాసాలంకారానికి ఉదాహరణగా, ఒక సుభాషితంలాగా భాసిస్తుంది. ఇంచు మించుగా మన పూర్వుల సూత్రవాఙ్మయాన్ని (బ్రహ్మ సూత్రాలు, వ్యాకరణ సూత్రాలు వగైరా) అతని రచనలు జ్ఞప్తికి తెస్తాయి. క్లుప్తంగా, దుర్భేద్యంగా వుండంవల్ల వాటికి ఎవరికి తోచిన వ్యాఖ్యానం వారు చేయడానికి అవకాశం కలిగింది. ఒక్కొక్కసారి పరస్పర విరుద్ధ వ్యాఖ్యానాల కారణంగా అసలు హెరాక్లిటస్ ఏమి చెప్పాడన్నది కూడా తేలకుండాపోయింది.

అనక్షిమేండర్, పితాగరస్‌లవలె ఇతడు కూడా ద్వంద్వాల సిద్ధాంతాన్ని అంగీకరించాడు. ఎటొచ్చీ ద్వంద్వాలనేవి పరస్పర విరుద్ధతత్వాలు కావు. ఒకటేనన్నాడు. అంటే ఒకటి లేనిదే మరొకటిలేదు; ఒకదానిలోనే రెండవది వున్నది.

భిన్నత్వం, ఏకత్వం రెండూ నిజమే కాని భిన్నత్వంలోనే ఏకత్వం వున్నది. ఏకత్వంలోనే భిన్నత్వం వున్నది. అందుచేత ఆ రెండూ ఒకటే.

## పాత నది, కొత్త నది

హెరాక్లిటస్ సిద్ధాంతాలలో ముఖ్యమైనది మొట్టమొదట పేర్కొన్న సుభాషితానికి సంబంధించినది. ఏ వ్యక్తీ ఒకే నదిలో రెండుసార్లు స్నానం చేయలేడు. ఒకసారి మునిగి లేచేసరికి నదిలోకి కొత్త నీరు వచ్చేస్తుంది. అందుచేత అది కొత్త నది అవుతుంది.

ప్రతి రోజూ ఒకకొత్త సూర్యుడు ఉదయిస్తున్నాడు. ఎందుకంటే నిన్నటి అస్తమయానికి, నేటి ఉదయానికి మధ్య సూర్యుడు పూర్తిగా మారిపోతాడు.

విశ్వంలో స్థిరమైనది ఏదీ లేదు. ప్రతిది మరొక దానిగా మారిపోతున్నది. మార్పునకు లోనుకాని వస్తువంటూ లేదు. అన్నీ చలిస్తూ, మారిపోతూ వుంటాయి. All things are in flux - (అన్నీ మార్పునకు లోనౌతున్నాయి) అనేది అతని ప్రధాన సిద్ధాంతం. మారనిది మార్పు ఒక్కటే.

అంటే ఒక వస్తువు తాను అయివుండి, తాను కాకుండాపోతూ వుంటుంది. తాను తనుగానే వుంటూ తాను కానిదిగా మారుతూ వుంటుంది.

విశ్వంలో ఏకత్వం వున్నది. కాని, అది వైరుధ్యాల సంయోగంవల్ల ఏర్పడిన ఏకత్వం.

అన్ని వస్తువులు ఒక వస్తువు నుంచి వస్తాయి. కాని ఆ ఒకవస్తువు అన్నిటి నుంచి వస్తుంది.

కనుకనే మంచి, చెడు రెండూ ఒకటే. పైకి పోయేదారి, క్రిందకు వచ్చే దారి ఒకటే.

ప్రతిది దాని వ్యతిరేక తత్వంగా మారుతుంది. అంటే ప్రతిది వ్యతిరేక తత్వాల సంయోగం అన్నమాట. ప్రతిది ద్వంద్వాల ఏకత్వంవల్ల ఏర్పడుతుంది. ప్రతిది ద్వంద్వాలలో వున్నది. ద్వంద్వాలు ప్రతి దానిలోను వున్నాయి.

## సంఘర్షణ వాదం

దీని నుంచి హెరాక్లిటస్ మరొక అడుగు ముందుకువేసి యుద్ధాన్ని, సంఘ

ర్షణను సమర్థించాడు. "యుద్ధం అన్నిటికి తండ్రి, అన్నిటికి రాజు" అనేది ఇతని సుభాషితాలలో మరొకటి.

"దేవతలలోను, మానవులలోను యుద్ధమనస్తత్త్వం అంతరించాలని హోమర్ వ్రాశాడు. కాని, అది పూర్తిగా పొరపాటు. యుద్ధం, సంఘర్షణ అనేవి లేకపోతే ప్రపంచం మిగలదు. యుద్ధం మానవ సహజ వ్యాపారం. సంఘర్షణే న్యాయం. సంఘర్షణవల్లనే అన్నీ జన్మిస్తాయి, అంతరిస్తాయి" అని హెరాక్లిటస్ ప్రబోధించాడు.

అతడు ప్రపంచాన్ని ఒక స్థిరమైన తత్త్వంగా కాక, నిరంతర పరివర్తన తత్త్వంగా (అంటే becoming గా) సిద్ధాంతీకరించాడు కదా? ఇది చాలా అస్పష్టమైన, దురవగాహమైన భావన. మన బ్రహ్మపదార్థంలాంటిది. నిర్గుణ పరబ్రహ్మ అనేది అందరికి గ్రాహ్యం కాగల భావం కాదు. కనుక సగుణోపాసనను మనవారు అంగీకరించారు. అలాగే హెరాక్లిటస్ కూడా తాను కనుగొన్న తన "నిత్య పరివర్తన" అనే కేవల తత్త్వానికి ప్రత్యక్ష ప్రతీక నొకదాన్ని ఊహించాడు. అతడు అలా ఊహించిన మూలతత్త్వమే అగ్ని.

## అంతా అగ్నిమయం

థేలీస్ సమస్తం నీరు అన్నాడు. అనక్జిమెనీస్ వాయువు అన్నాడు. హెరాక్లిటస్ అంతా అగ్నిమయం అన్నాడు.

అగ్నిశిఖ చూడండి. స్థిరంగా, నిలకడగా వుండదు. క్షణక్షణం చలిస్తుంది. ప్రతిక్షణం జ్వలిస్తుంది. నిత్యచలనం, నిత్యజ్వలనం దాని స్వభావం. అంటే అది నిత్య పరివర్తన శీలం కలిగినట్టిది.

అగ్ని అన్నిటిని మండిస్తుంది. తను తానుగానే వుంటూ, అన్నిటిని తానుగా మారుస్తుంది. దీనికి హెరాక్లిటస్ ఇచ్చిన ఉదాహరణ ఇది :- బంగారాన్ని ఏ వస్తువుతోనైనా కొనవచ్చు. ఏ వస్తువునైనా బంగారంతో కొనవచ్చు. అలాగే అగ్ని ఏ వస్తువునైనా తనలాగా మార్చుతుంది. తాను అన్ని వస్తువులుగాను మారుతుంది. అది గప్పుమంటుంది. తగ్గిపోతుంది. వెలుగుతుంది, ఆరుతుంది. మళ్లీ రాజుకుంటుంది. అయినా అగ్నిగానే వుంటుంది.

## ఎన్నో పోలికలు

ఇంతవరకు చదివినదాన్నిబట్టి హెరాక్లిటస్ సిద్ధాంతాలతో ఎన్నో పోలికలు పాఠకులకు స్ఫురించి వుంటాయి. ఉదాహరణకు మన వేద ఋషులు మన దేవతా శ్రేణిలో అగ్నికి అమిత ప్రాధాన్యమిచ్చారు. రెండు వందలకు పైగా

ఋక్కులలో అగ్నిని కీర్తించడమే కాదు, అసలు ఋగ్వేదాన్ని అగ్నిస్తోత్రం తోనే ప్రారంభించారు. "అగ్నిమీళే పురోహితమ్ యజ్ఞస్యదేవమ్ ఋత్విజమ్ హోతారమ్ రత్నధాతమమ్" అనేది ఋగ్వేదంలో మొదటి ఋక్కు.

హెరాక్లిటస్‌వలె ప్రాచీనకాలపు పర్షియనులు కూడా అగ్నిని దైవంగా భావించారు. వారి ప్రవక్త జొరోస్టర్ ప్రతి ఆలయంలోను నిత్యాగ్నిహోత్రం వుండాలని ఆదేశించాడు.

## ఆధునిక విజ్ఞానం

ఆధునిక కాలానికి వస్తే ఉష్ణశక్తి, చలనశక్తి పర్యాయపదాలు. ఉష్ణశక్తిగాని, చలన శక్తిగాని లేనిదే పదార్థం (మేటర్) అనేది లేదు. కెల్విన్ టెంపరేచరు స్కేల్‌లో అబ్సల్యూట్ జీరో అనేది మైనస్ 273 సెంటిగ్రేడ్ డిగ్రీలకు సమానం. ప్రతి వస్తువులోను కొంత ఉష్ణం వుంటుంది. ఎంతోకొంత ఉష్ణం ఉన్నంతకాలం ఆ వస్తువులోని కణాలు చలిస్తూనే వుంటాయి. ఆ వస్తువులోని ఉష్ణాన్ని పూర్తిగా తొలగించి దాని ఉష్ణోగ్రతను అబ్సల్యూట్ జీరోకు (మైనస్ 273 డిగ్రీలకు) తీసుకురాగలిగితే కణాల చలనం ఆగిపోతుంది. అప్పుడు హెరాక్లిటస్ వాదం తప్పు అవుతుంది. కాని కణాల ఉష్ణోగ్రతను అబ్సల్యూట్ జీరోకు-అంటే మైనస్ 273 సెంటిగ్రేడ్‌కు తగ్గించడం ఇంతవరకు సాధ్యం కాలేదు. ఇకపైన కూడా సాధ్యం కాకపోవచ్చు. కనుక చలనాన్ని మూలతత్వంగా భావించిన హెరాక్లిటస్ వాదానికి విపర్యయం ఎన్నటికీ లేనట్టే.

## అనిత్య వస్తు విచారం

హెరాక్లిటస్ ప్రపంచంలో ఏదీ స్థిరంగా, శాశ్వతంగా వుండదని, ప్రతిది మార్పునకు లోనవుతున్నదని అన్నాడు కదా? ఇలాంటి అనిత్య వస్తు విచారం మనకి కొత్తకాదు. మన బౌద్ధ దార్శనికులు, వేదాంతులు కూడా ప్రపంచాన్ని దానిలోని సమస్త వస్తువులను క్షణభంగురాలని వర్ణించారు. క్రీస్తుశకం 950 ప్రాంతాలలో జీవించిన రత్న కీర్తి అనే బౌద్ధ దార్శనికుడు ఈ నశ్వరత్వ సిద్ధాంతాన్ని మరీ తీవ్రస్థాయికి తీసుకుపోయాడు. అతడిది క్షణికవాదం. ప్రతి వస్తువు ప్రతి క్షణం మారుతున్నదని (ప్రతిక్షణమ్ భేదః) అని అతడన్నాడు. హెరాక్లిటస్ నది ఉపమానాన్ని తీసుకుంటే రత్నకీర్తి ఘటం (కుండ) ఉపమానం తీసుకున్నాడు. "ఇప్పుడున్న కుండ ఇదివరకు వున్నది కాదు. ఇక ముందు వుండబోయేది కూడా కాదు" అన్నది అతని సిద్ధాంతం. ఆత్మ శాశ్వతత్వాన్ని కూడా బౌద్ధులు ఒప్పుకోలేలేదు. ఆత్మ అనేది క్షణక్షణం మారిపోయే భావాల, ఉద్రేకాల, వాసనల మూట మాత్రమేనన్నారు. ఒకటి పోతే మరొకటి వస్తుంది. కనుక దేనికీ నిత్యత్వం అనేది లేదన్నారు.

## బెర్గ్‌సన్, జేమ్స్

ఇక అధునిక కాలంలో హెరాక్లిటస్ పేరు చెప్పగానే వెంటనే జ్ఞాపకం వచ్చే యిద్దరు గొప్ప తత్వవేత్తలలో ఒకరు హెన్రీ బెర్గ్‌సన్. ఇతడు సరిగా హెరాక్లిటస్ వలె All is flux– అంతా ప్రవాహమే, పరివర్తనే అన్నాడు. హెరాక్లిటస్ నదిని ఉదాహరణగా తీసుకున్నట్లు బెర్గ్‌సన్ నిశ్చలంగా వున్నట్టు కనబడే ఏదో ఒక వస్తువును ఉదాహరణగా తీసుకుంటాడు. ఒక క్షణం క్రిందట ఆ వస్తువు దృశ్యానికి, వర్తమాన క్షణంలో అదే వస్తువు దృశ్యానికి తేడా వున్నదని, దీనికి కారణం గతించిన క్షణం కంటే వర్తమాన క్షణం తర్వాతిది కావడమేనని అంటాడు. బాహ్య వస్తువులేకాక మన అంతశ్చేతన కూడా క్షణ క్షణం మారిపోతూ వుంటుందని కూడా అతడు అంటాడు.

బహుశా అలనాడు హెరాక్లిటస్ ఉదాహరించిన నదీ ప్రవాహమే ఆధునిక కాలంలో బెర్గ్‌సన్, విలియమ్ జేమ్స్ (అమెరికన్ తత్వవేత్త)ల చైతన్య ప్రవంతి (stream of consciousness) గా మారి వుండవచ్చు. ఈ చైతన్య ప్రవంతి సిద్ధాంతం అధునిక పాశ్చాత్య సాహిత్యాన్ని ఎంతగా ప్రభావితం చేసిందో అందరికీ తెలిసిందే.

## హెగెల్, మార్క్స్

హెరాక్లిటస్ ఛాయలు కనబడే మరొక యూరోపియన్ తత్వవేత్త హెగెల్. హెరాక్లిటస్ ద్వంద్వాల ఏకత్వాన్ని ప్రతిపాదించినట్టే హెగెల్ ప్రతి వాదం (థీసిస్) తన ప్రతివాదాన్ని (యాంటీ థీసిస్‌ను) సృష్టిస్తుందని, చివరికి వాద ప్రతివాదాల సంఘర్షణ నుంచి సమన్వయం (సింథెసిస్) ఉద్భవిస్తుందని ప్రతిపాదించాడు. హెగెల్ పద్ధతిని గతితర్కం (డయలెక్టిక్స్) అంటారు.

కార్ల్‌మార్క్స్ కూడా వైరుధ్యాల మధ్య సంఘర్షణ ద్వారానే ప్రపంచం పురోగమిస్తుందని అన్నాడు. ఈ వాదం ఆధారంగానే రెండు వర్గాల (పెట్టుబడిదారులు, శ్రామికులు) సంఘర్షణ ద్వారా వర్గరహిత సమాజం ఆవిర్భవిస్తుందని సిద్ధాంతం చేశాడు. ఈ విధంగా సంఘర్షణ లేనిదే ప్రపంచమే లేదని హెరాక్లిటస్ చేసిన వాదం ప్రభావం మార్క్స్‌పై కూడా పడిందనే చెప్పాలి.

హెరాక్లిటస్ అంతా మార్పేనన్నాడు. కాగా అతని సమకాలికుడైన పార్మెనిడీజ్ దీన్ని పూర్తిగా వ్యతిరేకించాడు. ప్రపంచంలో మార్పు అనేది లేనేలేదన్నాడు.



# 7
# పారభౌతికతాత్వికుడు పార్మెనిడీస్

"ప్రపంచంలో మార్పు చెందని పదార్థం అంటూ లేదు. ప్రతిది మార్పు చెందుతుంది. అగ్ని నీరుగా, నీరు మట్టిగా మారుతుంది. తిరిగి మట్టి నీరుగా, నీరు అగ్నిగా మారుతుంది. ప్రపంచానికి మూల సూత్రం మార్పు. మారనిదే ప్రపంచం మనజాలదు."

—ఇది క్రిందటి అధ్యాయంలో మనం చదివిన గ్రీకు తత్వవేత్త హెరాక్లిటస్ సిద్ధాంతం. అతని సమకాలికుడైన మరొక గ్రీకు తాత్వికుడు పార్మెనిడీస్ ఈ సిద్ధాంతాన్ని శీర్షాసనం వేయించాడు.

"ప్రపంచంలో మార్పు లేనేలేదు. ఏదీ మారదు. మారుతుందని అనుకోవడం భ్రమ"—ఇది పార్మెనిడీస్ సిద్ధాంతం.

అసలైన ఫిలాసఫీ పార్మెనిడీస్‌తో ప్రారంభమైందని హెగెల్ అన్నాడు. మొత్తంపై పాశ్చాత్యుల మెటఫిజిక్స్—పారభౌతిక తత్వమీమాంస—మాత్రం పార్మెనిడీస్‌తోనే ప్రారంభమైంది.

ఇతడు దక్షిణ ఇటలీలో, ఇప్పటి నేపుల్స్ దిగువన ఈలియా అనే పట్టణంలో రాజకీయంగా పలుకుబడిగల ఒక ధనిక కుటుంబంలో జన్మించాడు. క్రీస్తుపూర్వం 540-470 సంవత్సరాల మధ్య జీవించి వున్నాడని కొందరు చరిత్ర పరిశోధకుల అభిప్రాయం. అంటే సోక్రటీస్ జన్మించిన ఏడాదే ఇతడు చనిపోయాడన్నమాట. కాని, క్రీస్తుపూర్వం 450 ప్రాంతాలలో పార్మెనిడీస్ ఏథెన్స్ వెళ్లాడని కొందరి కథనం. అప్పటికి యౌవనంలోవున్న సోక్రటీస్ ఇతడితో వాదం వేసుకున్నాడని, ఎన్నో విషయాలు నేర్చుకున్నాడని ప్లేటో వ్రాశాడు. ప్లేటో రచనలలో ఒకదాని పేరు "పార్మెనిడీస్." ఏమైనా ఇతడు క్రీస్తుపూర్వం అయిదవ శతాబ్దికి చెందిన వాడనడం మాత్రం ఖాయం.

## శిష్య ప్రశిష్యులు

థేలీస్‌కువలె పార్మెనిడీస్‌కు కూడా శిష్య ప్రశిష్యులున్నారు. ఇతడి జన్మస్థలమైన ఈలియా పేరుమీదుగా ఇతడి సిద్ధాంత సంప్రదాయానికి "ఈలియాటిక్ స్కూల్ ఆఫ్ ఫిలాసఫీ" అని పేరు వచ్చింది. పార్మెనిడీస్ శిష్యులందరిలోకి సుప్రసిద్ధుడు జీనో. పార్మెనిడీస్ ఎంత గొప్ప తాత్వికుడో జీనో అంత గొప్ప తార్కికుడు. గురువును మించిన శిష్యుడుగా అతడు పేరుపొందాడు. గతితర్కం అనే వాద ప్రక్రియ (డయలెక్టిక్స్)ను ప్రారంభించినవాడు జీనో అని అరిస్టాటిల్ పేర్కొన్నాడు.

పితాగరస్ ప్రభావం పార్మెనిడీస్‌పై ఎంతో వున్నది. బహుశా అతడు పితాగరస్ శిష్య పరంపరలో ఒకరి శిష్యుడై వుండవచ్చునట. పితాగరస్ సంప్రదాయంలోని వారివలె ఇతడుకూడా భావవాది (ఐడియలిస్ట్) మాత్రమే కాక, స్వయంగా గణితశాస్త్రవేత్త కూడా.

ఆ రోజులలో ప్రతి గ్రీకు తాత్వికుడు ఒక పుస్తకం వ్రాసి "ఆన్ నేచర్" (ప్రకృతి తత్వం) అని పేరు పెట్టడం అలవాటువలె కనిపిస్తుంది. పార్మెనిడీస్ కూడా ఒక "ఆన్ నేచర్" వ్రాశాడు. ఇది ఛందోబద్ధమైన పద్య గ్రంథం.

## "మార్పు లేదు"

ఇందులో రెండు భాగాలున్నాయి : ఒకటి- "సత్యపథం" (వే ఆఫ్ ట్రూత్). ఇది పూర్తిగా తత్వ వివేచనతో కూడినది. రెండవది "అభిప్రాయ పథం" (వే ఆఫ్ ఒపీనియన్). ఇందులో అతడు ప్రాకృతిక ప్రపంచపు స్వభావాన్ని వివరిస్తాడు.

పార్మెనిడీస్‌కు ముందు గ్రీకు తాత్వికులందరు మార్పు అనేదాన్ని యథార్థ

మనే భావించి తమతమ సిద్ధాంతాలు రూపొందించారు. కాని, ఈ సిద్ధాంతాలను, ముఖ్యంగా హెరాక్లిటస్ సిద్ధాంతాన్ని– పార్మెనిడీస్ సవాలు చేశాడు.

మార్పు ఎలా సాధ్యం? ఒక వస్తువు ఒకసారి వుండి తరువాత లేకపోవడం ఎలా జరుగుతుంది? ఇది తార్కిక వైరుధ్యం కాదా?

ఒక వస్తువుకు గల కొన్ని లక్షణాలు మరికొన్ని భిన్న లక్షణాలుగా ఎలా మారుతాయి? అలా మారుతాయంటే ఒక వస్తువు వున్నదని, అదే సమయంలో లేదని అనవలసి వస్తుంది. ఆ వస్తువు శూన్యంనుంచి వస్తుందని, శూన్యంగా మారగలదని అంగీకరించవలసి వస్తుంది. ఇది ఎలా సాధ్యం? శూన్యం నుంచి ఏదైనా ఎలా వస్తుంది?

ఒక వస్తువు వుండనైనా వుండాలి. లేదా లేకుండానైనా పోవాలి. అంతే కాని మధ్యమ మార్గం లేదు.

ఏదైతే వున్నదో అది మారదు. అది యథార్థమై వుంటుంది. నిత్యమై, నిరవధికమై, అవిచ్ఛిన్నమై, సజాతీయమై, వైవిధ్యరహితమై, చలనరహితమై, మార్పులేనిదై వుంటుంది. ఇది ఒక్కటే తర్కబద్ధమైన సిద్ధాంతం. తర్కవిరుద్ధమైనదేదీ ప్రపంచంలో వుండటానికి వీలులేదు.

అయితే ప్రపంచంలో మార్పు, వైవిధ్యం, అనేకత్వం, పుట్టడం, గిట్టడం- ఇవన్నీ కనిపిస్తున్నాయికదా? ఇవన్నీ ఏమిటి?

"ఇంద్రియజాలం"

అవన్నీ అసత్యమైనవి. భ్రాంతివల్ల అలా కనిపిస్తున్నాయి. ఇంద్రియ జగత్తు (sensible world) నిజంగా లేదు. అది ఆభాస (appearance) మాత్రమే.

ఏదైతే వున్నదో దాన్ని ఎవరూ సృష్టించలేరు. ఎవరూ నశింపజేయలేరు. అది పూర్ణం, అపరిమితం, నిశ్చలం. అది ఇదివరకు వుండేది అనిగాని, ఇక ముందు వుండగలదనిగాని అనకోరాదు. ఎందుకంటే అది ఈ క్షణంలో ఉన్నది. మొత్తంగా, అవిచ్ఛిన్నంగా, ధారావాహికం (continuous) గా వున్నది.

లేనిదానినుంచి- అంటే అసత్‌నుంచి- అది రావడానికి వీలులేదు. పైగా ఇప్పుడు అది వున్నది కనుక భవిష్యత్తులో వుండడం ఎలా సంభవం? అది అసలు ఉనికిలోనికి రావడం ఎలా సంభవం? అలా వచ్చి వుంటే దాని ఇప్పటి ఉనికి నిజం కాదన్నమాట. ఇకముందు అది వుంటుందంటావా? అంటే ఇప్పుడు అది లేదన్న మాట.

## సత్యం అవిభాజ్యం

అది అవిభాజ్యం. దాన్ని భాగించడానికి వీలులేదు. అది మొత్తం సజాతీయ (homogenous) మైనది. అంటే దానిలో అదికానిది ఏమీలేదు. అది అవిచ్ఛిన్నంగా వుంది. దాని తర్వాత కూడా అదే వున్నది.

అది కదలదు కూడా. ఒకేచోట స్థాణువుగా వుంటుంది. తనలో తానే వుంటుంది.

(పార్మెనిడీస్ పరిభాష చూస్తే మన ఉపనిషత్తులు, మన దర్శనాలు జ్ఞాపకం రాక మానవు- భౌతిక ప్రపంచానికి అతీతమైన యాథార్థ్యాన్ని గురించి ఆలోచించే దాన్ని మెటఫిజిక్స్-పారభౌతిక మీమాంస అంటారు. అటువంటి మీమాంస చేసే సందర్భంలో ఆ యాథార్థ్యాన్ని మనవారు "తత్" అని సూచించినట్టే పార్మెనిడీస్ "దట్" (అది) అని సూచిస్తాడు. మన "తత్", అతని "దట్" ఒకటే.)

## ఆలోచన, దాని వస్తువు

ఆలోచన అనేది వున్నదాన్ని గురించే అయివుంటుంది. కనుక వస్తువు వేరు, దాన్ని గురించిన ఆలోచన వేరు కాదు. వస్తువు లేనిదే దాన్ని గురించిన ఆలోచన వుండదు. ఏదీలేకుండా శూన్యమైన ఆలోచన సాధ్యం కాదు. అందుచేత తర్కసహితమైన ప్రతి ఆలోచన, దాని వస్తువు యథార్థమై వుండవలసిందే. లేనిదాన్ని గురించి తెలుసుకోలేవు, తలుచుకోలేవు. ఎందుకంటే తలుచుకోగలిగినది, నిజంగా వున్నది ఒకటే.

ఇదే సమయంలో పార్మెనిడీస్ కూడా తక్కిన గ్రీకు తత్వవేత్తలవలె "పగుణోపాసకుడే." అంటే తాను దర్శించిన "యాథార్థ్యాన్ని" సాకారమైనదిగానే ఊహించాడు. దానికి విస్తృతి (Extension) ఉన్నదన్నాడు. అది అవిచ్ఛిన్నం, అవిభాజ్యం, పూర్ణం మాత్రమేగాక గోళాకృతి కలదై వుంటుందన్నాడు. గోళంలో మాత్రమే కేంద్రబిందువు నుంచి అది అన్ని వైపులకు సమానంగా విస్తరించి వుంటుంది. ఒక చోట ఎక్కువ, మరొకచోట తక్కువ వుండదు. దాని తర్వాత శూన్యం అనేది లేదు; అదే వున్నది.

## "చలనం లేదు"

హెరాక్లిటస్ ప్రపంచం నిత్యచలనశీల మన్నాడు కదా? పార్మెనిడీస్ చలనం అసంభవ మన్నాడు. ఒక వస్తువు తను లేనిచోటికి వెళ్లడం కదా చలనం అంటే?

తాను లేనిచోటు లేదు కనుక చలనం సాధ్యం కాదు. తాను వున్నచోటికే వెళ్లడం కూడా సాధ్యం కాదు. తనకు తానే అడ్డు వస్తుంది. శూన్యం అంటే లేనిది కనుక శూన్యం లోనికి వెళ్లలేదు. కనుక చలనం అసాధ్యం.

[ఈశావాస్యోపనిషత్తులోని గొప్ప శ్లోకం "తదేజతి తన్నైజతి..." (అది కదులుతుంది, అది కదలదు...) ఈ సందర్భంలో జ్ఞాపకం వస్తుంది.]

## గురువును మించిన శిష్యుడు

పార్మెనిడీస్ సిద్ధాంతాలు సమకాలికులలో గొప్ప సంచలనం కలిగించినవని, ముఖ్యంగా పితాగరస్ అనుయాయులు వాటిని ఖండించడానికి ప్రయత్నించారని చరిత్రకారులు చెబుతున్నారు. అస్తిత్వం లేదా, "సత్తా" (being) ఒకటేనని, దానిలో బాహుళ్యం (Multiplicity) లేదని పార్మెనిడీస్ అన్నాడు కదా? ఇది గణితరీత్యా తర్కానికి నిలవదని నిరూపించడానికి వారు ప్రయత్నించారు.

కాగా, తన గురువును ఈ విమర్శలనుంచి కాపాడడానికి పార్మెనిడీస్ శిష్యుడు జీనో ప్రయత్నించాడు. ఇతడు కూడా ఈలియా పట్టణానికి చెందినవాడే. క్రీస్తుపూర్వం 490-430 సంవత్సరాల మధ్య జీవించినవాడు.

## గతితార్కికుడు

మార్క్సిజంతో పరిచయం వున్నవారికి డయలెక్టిక్స్ అనేమాట సుపరిచితమై వుంటుంది. దీన్ని తెలుగులో గతితర్కం అంటున్నారు. తర్కంలో ఇదొక వాద పద్ధతి. ప్రత్యర్థి వాదాన్ని ఒప్పుకున్నట్టే ఒప్పుకుని వాదనద్వారా ప్రత్యర్థి వాదంలోని వైరుధ్యాలను బహిర్గతం చేయడం ఈ గతితర్క పద్ధతిలోని విశేషం. దీన్ని మొదటగా ఉపయోగించినవాడు జీనో కాగా, సోక్రటీస్ దానికి మరింత పదును పెట్టాడు. ప్లేటో దానికి సాహిత్య గౌరవాన్ని చేకూర్చాడు.

తన గురువు సిద్ధాంతాలను సమర్థించడానికి జీనో నాలుగు పేరడాక్స్‌లను ఉదాహరించాడు. (ఒక ప్రతిపాదన స్వయం విరుద్ధంగా, అసంబద్ధంగా కనిపిస్తే దాన్ని పేరడాక్స్ విరోధాభాస - అంటారు) ఇవి పాశ్చాత్య తత్వశాస్త్ర చరిత్రలో సుప్రసిద్ధాలైన పేరడాక్స్‌లు. కడచిన 2400 సంవత్సరాలుగా ఇవి తత్వవేత్తలను తికమక పెడుతున్నాయి. వాటిని మింగడానికి వీలు లేదు, కక్కడానికీ వీలు లేదు; పచ్చి వెలక్కాయవలె గొంతుకకు అడ్డుపడుతున్నాయి.

పార్మెనిడీస్ చెప్పినట్టు యాథార్థ్యం (reality) అనేది ఒకటిగా, అవిభాజ్యంగా లేదు అనుకోండి. అప్పుడు యాథార్థ్యం సావధికం (finite), నిరవధికం (infinite) కూడా అవుతుంది. ఇది అసంబద్ధం కాదా అని జీనో ప్రశ్నించాడు.

దీన్ని నిరూపించడానికి అతడు పేర్కొన్న పేరడాక్సులు ఇవి :

## మొదటి పేరడాక్స్

1. ఒక నిర్ణీత స్థలంనుంచి మరొక నిర్ణీత స్థలానికి వెళ్లడం అసాధ్యం. ఉదాహరణకు నూరు మీటర్ల పరుగుపందెం మనం ఏర్పాటు చేశామనుకోండి. పందెంలో పాల్గొనే వ్యక్తి "నిర్ణీతకాలంలో నూరు మీటర్లను పరుగెత్తడానికి ముందు 50 మీటర్లు పరుగెత్తాలి. దానికి ముందు 25 మీటర్లు పరుగెత్తాలి. దానికి ముందు పన్నెండున్నర మీటర్లు పరుగెత్తాలి. దానికి ముందు అందులో సగందూరం దాటాలి. ఇలాగ స్థలాన్ని అంతులేనన్ని భాగాలు చేయడానికి వీలున్నది కనుక, వాటిలో ప్రతి భాగాన్ని అతడు దాటితే తప్ప అడుగు ముందుకు వేయలేడు. కనుక, అతడు ఎన్నడూ కాలు కదపలేడు. అతని కిచ్చిన కాలం పరిమితమైనది. కాని దాటవలసిన స్థలంలో అనంతమైన-పరిమితిలేనన్ని-విభాగాలున్నాయి. కనుక పరిమిత కాలంలో అపరిమితంగా వున్న స్థల విభాగాలను దాటడం సాధ్యం కాదు."

## అకిలీస్, తాబేలు

2. హోమర్ వ్రాసిన ఇతిహాస కావ్యం "ఇలియడ్"లో అకిలీస్ అనే మహావీరుడున్నాడు. ఉదాహరణకోసం జీనో అతడికి, ఒక తాబేలుకు పరుగు పోటీ పెట్టాడు. తాబేలు మెల్లగా నడుస్తుందని ప్రతీతి కనుక అకిలీస్ తాబేలును తన కంటే పదిగజాల ముందు నిలబెట్టి పోటీ ప్రారంభిస్తాడు. ఈసప్ కథలోనైతే కుందేలు - తాబేలు పరుగు పందెంలో కుందేలు దారిమధ్యలో ధీమాగా నిద్రపోవడంవల్ల తాబేలు దాన్ని దాటిపోయి పందెం గెలుస్తుంది. జీనో పేరడాక్స్‌లో అలా కాదు. అకిలీస్ ఎంత పిక్కబలం కలవాడైనా తాబేలును అసలు ఎన్నటికీ దాటిపోలేడని జీనో అంటాడు.

పోటీ ప్రారంభంలో తాబేలు అకిలీస్‌కంటే పది గజాలముందు వున్నది కదా? అకిలీస్ ఆ పది గజాల దూరాన్ని దాటేలోగా తాబేలు కొంత దూరం ముందుకు పోయి వుంటుంది. ఆ స్థలాన్ని అకిలీస్ చేరుకునేలోగా తాబేలు అక్కడినుంచి మరికొంత దూరం ముందుకు పోతుంది. అది వున్న చోటికి అకిలీస్ వెళ్లేలోగా తాబేలు ఇంకా ముందుకు జరిగి వుంటుంది... ఈ విధంగా అకిలీస్ తాబేలును ఎన్నటికీ దాటి ముందుకు పోలేడని జీనో అంటాడు.

## కదలని బాణం

3. మూడవ పేరడాక్స్ చాలా ఆసక్తికరమైనది. ఇది ప్రపంచంలో చలనం అనేది లేదని చెప్పడానికి ఉద్దేశించినట్టిది. దీనికి ఉదాహరణగా కదులుతున్న బాణం నిజంగా కదలడంలేదని జీనో అంటాడు.

మనం బాణం వేశామనుకోండి. ఆ బాణం ఏ నిర్దిష్ట క్షణంలోనైనా తన పొడవుతో సమానమైన స్థలంలో వుండవలసిందేకదా? అంటే ఆ క్షణంలో అది ఆ స్థలంలో నిశ్చలంగా, కదలకుండా వున్నదన్నమాట. ఆ క్షణంలో దాని వేగం గంటకు సున్నా మైళ్లు. మరు క్షణంలో కూడా అంతే. అది తన పొడవుతో సమానమైన స్థలంలో నిశ్చలంగా వుంటుంది. అప్పుడు కూడా దాని వేగం గంటకు సున్నా మైళ్ళు. ఈ విధంగా ఆ తర్వాత వచ్చే అన్ని క్షణాలలోను కూడా దాని వేగం సున్నా మైళ్లే. అయితే ఎన్ని సున్నాలను కలిపినా వచ్చేది సున్నా మైళ్ల వేగమే కదా? అంటే బాణం కదలడం లేదన్నమాట.

(ఆధునిక పరిభాషలో చెప్పాలంటే చలనచిత్రం [సినిమా] అనేది- నిజంగా నిశ్చలన చిత్రం. విల్లునుంచి బయలుదేరిన బాణాన్ని సినీ కెమేరాతో ఫోటో తీశామనుకోండి. బాణం ప్రయాణకాలాన్ని కెమెరా కొన్ని క్షణాలుగా విభజించి ఆ క్షణాలలో బాణాన్ని ఫోటో తీస్తుంది. అలా తీయగా వచ్చే ఏ ఫ్రేములో చూసినా బాణం చలనరహితంగానే వుంటుంది. అయినా తెరపై బాణం కదులుతున్నట్టు కనిపిస్తున్నదంటే జీనో వాదం ప్రకారం అది మన ఇంద్రియాలు కల్పిస్తున్న భ్రాంతి మాత్రమే.)

దీన్నే సి. ఇ. ఎం. జోడ్ మరికొంత సులభంగా వివరించాడు. అతడి వివరణ ప్రకారం మనం వేసిన బాణం తన ప్రయాణ కాలంలో ఏ క్షణంలో నైనా సరే తను వున్నచోటనైనా వుండాలి. లేదా లేనిచోటనైనా వుండాలి. ఉన్నచోటే వున్నదంటే అది ఆ క్షణంలో కదలడంలేదన్న మాటేగా? ఎందుకంటే అది కదులుతున్నపక్షంలో వున్నచోట వుండలేదు కదా? పోనీ లేనిచోట వున్నదని అనుకుందామంటే అది ఎలా సాధ్యం? ఒక వస్తువు తను లేనిచోట ఎలా వుంటుంది? కనుక ఆ నిర్దిష్ట క్షణంలో బాణం కదలడం లేదన్న మాటే. ఇదే చలనరాహిత్యం దాని తర్వాత వచ్చే క్షణాలన్నిటికి వర్తిస్తుంది. కనుక ఏ క్షణంలో చూచినా బాణం చలనరహితంగానే వుంటుంది. మొత్తంపై కదులుతున్నదని మనం అనుకుంటున్న బాణం కదలడంలేదని స్పష్టమవుతుంది.

(నాల్గవ పేరడాక్స్‌లో జీనో సగం సమయం రెట్టింపు సమయానికి సమానమని వాదిస్తాడు. గ్రంథ విస్తర భీతిచేత దాన్ని ఇక్కడ వివరించడం లేదు.)

## కామన్ సైన్స్

జీనో కల్పించిన ఈ పేరడాక్సులు వింతగా, విడ్డూరంగా కనిపిస్తాయి. ప్రపంచంలో కదలిక లేకపోవడమేమిటి? అకిలీస్ తాబేలును దాటిపోలేక పోవడమేమిటి? ఇవన్నీ కామన్ సెన్సుకు, ప్రత్యక్షంగా కనబడుతున్నదానికి వ్యతిరేకం కాదా? అనే ప్రశ్నలు సహజంగానే వస్తాయి.

కాని, భౌతిక శాస్త్రజ్ఞులవలె పారభౌతిక శాస్త్రజ్ఞులు (మెటఫిజిషియన్స్) కూడా కామన్ సెన్సును పరిగణనలోకి తీసుకొనకుండా వాదించడం పరిపాటి. నిజానికి భౌతిక శాస్త్రవేత్తలు కనిపెట్టిన అనేక సత్యాలు మొదట్లో కామన్ సెన్సుకు విరుద్ధంగానే కనిపిస్తాయి.

ఉదాహరణకు- భూమి బల్లపరుపుగా కనిపిస్తుంది. అయితే, నిజంగా అది గోళాకృతి కలిగినట్టిది. భూమి కదలనట్టు కనిపిస్తుంది. కాని, నిజంగా అది తన చుట్టూ తాను గంటకు వెయ్యిమైళ్ల వేగంతో ప్రదక్షిణం చేస్తున్నది. సూర్యుని చుట్టూ సెకండుకు సుమారు 19 మైళ్ల వేగంతో పరిభ్రమిస్తున్నది. ఇవి నేరుగా మన ఇంద్రియాలకు గోచరం కాని యథార్థాలు. అలాగే నక్షత్రాల సమీపంలో స్థలం (space) వంపు తిరుగుతుందనేది, విశ్వం అమిత వేగంతో విస్తరిస్తున్నదనేది కూడా ఇంద్రియ గోచరం కాని గణిత శాస్త్రీయ సత్యాలు మాత్రమే.

అందుచేత ప్రతిది కామన్ సెన్స్‌కు అనుగుణంగా వుండాలన్న వాదం కుదరదు. జీనోవంటి పారభౌతికవాదులు సిద్ధాంతాల కేవలం తర్కాన్ని ఆధారం చేసుకున్నట్టివి. అవి అసంబద్ధంగా వున్నవనితోస్తే వాటిని తిరిగి తర్కంతోనే పూర్వ పక్షం చేయాలి. ఏమైనా చాలా శతాబ్దాల పాటు కొరుకుడుపడని జీనో పేరడాక్సుల పద్మవ్యూహాన్ని ఈ శతాబ్దంలో అభివృద్ధి అయిన నూతన గణితశాస్త్రాన్ని ఉపయోగించి ఛేదించడం సాధ్యమైందని అంటున్నారు.

ప్రపంచంలో చలనం అనేది లేదని కదా జీనో వాదం?

ఉభయులకు పోలిక లేనప్పటికి ఎంగెల్స్ కూడా జీనోవలె గతితార్కికవాది. ఆయన జీనో పేరడాక్సును ప్రస్తావించలేదు గాని, "యాంటీ డూరింగ్" అనే తన గ్రంథంలో చలనం అనేదాన్ని ఒక వైరుధ్యం (కాంట్రడిక్షన్)గా నిర్వచించాడు. "ఒక వస్తువు ఒకచోటి నుంచి మరొక చోటికి మారాలంటే అది ఏకకాలంలో ఒకేచోట, మరొకచోట కూడా వుండాలి. ఒకే సమయంలో ఒకచోట వుండాలి, వుండకూడదు కూడా. ఈ వైరుధ్యం ధారాసదృశంగా ఉత్పన్నం కావడం, అదే సమయంలో పరిష్కారం కావడమే చలనం అంటే" అని ఎంగెల్స్ సిద్ధాంతీకరించాడు. "చలనం లేనిదే పదార్థం లేదు. పదార్థం లేనిదే చలనం లేదు" అని కూడా ఆయన ఉద్ఘాటించాడు.

## మరొక అనుయాయి

ఈలియాటిక్ తత్వవేత్తలలో, అంటే పార్మెనిడీస్ అనుయాయులలో ఆఖరి

ప్రముఖుడు మెలిసస్. ఇతడి జన్మస్థలం సేమాస్ ద్వీపం. జీనో వృద్ధాప్యంలో ఇతడు యువకుడు. ఆ కాలంలో ఇతడు ప్రముఖ రాజకీయవేత్త. ఎథీనియన్ సామ్రాజ్యంపై సేమాస్ ప్రజలు తిరుగుబాటు చేసినప్పుడు మెలిసస్ నౌకాదళాధిపతిగా వుండి పోరాడి శత్రుసేనలను ఓడించాడు.

ఇతడు జీనోవలెనే పార్మెనిడీస్ సిద్ధాంతాలను సమర్ధించడానికే రచనలు చేశాడు. ముఖ్యంగా పార్మెనిడీస్ సిద్ధాంతాలలో కొన్ని వైరుధ్యాలున్నవనే భావనతో వాటిని సమన్వయం చేయడానికి ప్రయత్నించిన ఎంపిడోక్లిస్, అనగ్జాగరస్ అనే తత్వవేత్తలను ఖండిస్తూ వ్రాశాడు.

మెలిసస్ ఒక విషయంలో మాత్రం పార్మెనిడీస్‌తో విభేదించాడు. యాథార్థ్యం (reality) గోళాకృతిలో వుండడానికి వీలులేదన్నాడు. ఏ వస్తువుకైనా ఆది, అంతం అనేవి వుంటే అవి శాశ్వతం గాని, అనంతం గాని కాజాలవు కదా? యాథార్థ్యం అనేది స్థలం (space) లో నిరవధికంగా విస్తరించి వుంటుంది. దాని వెలుపల శూన్యం అనేది వుండదు. అసలు శూన్యం అనేది లేదు. కనుకనే యాథార్థ్యం కదిలేందుకు స్థలమే లేదు. దాన్ని పరిమితం చేసేందుకు దాని తర్వాత శూన్యం లేదు... ఇదీ అతని సిద్ధాంతం.



# 8
# బహుసత్తావాదులు : ఎంపిడోక్లీస్, అనగ్జాగరస్

ఇంతవరకు మనం పరిచయం చేసుకున్న గ్రీకు తత్వవేత్తలందరు ఇంచుమించుగా ఏకసత్తావాదులే. అంటే ప్రపంచానికి మూలపదార్థం ఏదో ఒకటేనని వారి విశ్వాసం.

థేలీస్ ప్రపంచానికి మూలపదార్థం నీరు అన్నాడు. (అతడు ఒకసారి పైన నక్షత్రాలకేసి చూస్తూ నడుస్తూ ఒక నూతిలో పడ్డాడని, అతని కేకలు విని ఎవరో అతడిని రక్షించారని ఒక కథ వున్నది కదా? తప్పిపోయిన ఈ జలగండం వల్లనే ప్రపంచానికి మూలపదార్థం నీరు అనే విషయం అతనికి స్ఫురించి వుంటుందని ఒక తత్వశాస్త్ర రచయిత ఛలోక్తి.) అనగ్జిమెనీస్ వాయువును, హెరాక్లిటస్ అగ్నిని మూలపదార్థాలుగా పేర్కొన్నారు.

కాగా, క్రీస్తుపూర్వం 490-435 సంవత్సరాల మధ్య జీవించివున్న ఎంపిడోక్లీస్ బహుశా మొట్టమొదటి బహుసత్తావాది. అంటే అతని దృష్టిలో ప్రపం

చానికి మూలపదార్థం ఏదో ఒకటే కాదు; వేర్వేరు మూలపదార్థాలున్నాయని అతడన్నాడు. నీరు, నిప్పు, వాయువులతోపాటు అతడు పృథ్విని కూడా పేర్కొన్నాడు. ఈ నాలుగింటి కలయికవల్లనే ప్రపంచం ఏర్పడిందని ప్రవచించాడు.

ఎంపిడోక్లీస్ సిసిలీలో అగ్రిజెంటమ్ అనే పట్టణంలో జన్మించాడు. ఇతనిది కులీన, ధనిక కుటుంబం. అతని తండ్రి అక్కడి గణతంత్ర ప్రభుత్వ నాయకులలో ఒకడు. ఎంపిడోక్లీస్ కూడా రాజకీయ ప్రముఖుడే. పైగా అతడు వైద్యుడుగా, శాస్త్రజ్ఞుడుగా, తత్వవేత్తగా పేరుపొందాడు. మతరీత్యా పితాగరస్ అనుయాయి. పితాగరస్‌వలె తాను కూడా దేవతాంశ సంభూతుడనని అతడి నమ్మకం. అతడికి అలౌకిక శక్తులుండేవని ప్రతీతి. అందుకే అతడు మామూలుగా చనిపోలేదట. స్వర్గం నుంచి పిలుపు రాగానే మాయమైపోయాడని ఒక కథ. సిసిలీలోని ఎట్నా అగ్నిపర్వత బిలంలో దూకి అంతర్ధానమైపోయాడని మరొక కథ. జెనోఫెనీస్‌వలె ఇతడు కూడా ఒలింపియన్ దేవతలను తిరస్కరించాడు. దేవుడికి మానవ రూపాన్ని అంటకట్టడం తగదన్నాడు. మొత్తం విశ్వమే దేవుడని అతను భావించాడు.

పితాగరస్‌వలె ఇతడు కూడా పునర్జన్మ వాదాన్ని విశ్వసించాడు. జన్మరాహిత్య స్థితిని పొందడానికి ముందు జీవులు అనేక రూపాల జన్మలెత్తాలని అతడి నమ్మకం.

## చతుర్భూతాలు

ఆకాశం మినహా మిగిలిన చతుర్భూతాలను అంటే పృథ్వ్యాపస్తేజో వాయువులను అతడు అంగీకరించాడు. వీటితోనే సమస్త విశ్వం ఏర్పడిందని అతడి భావన. ఈ నాలుగు భూతాలు (ఎలిమెంట్స్) తప్ప మరేమీ లేదని, ఆకాశం అనేది- అంటే శూన్యం అనేది- లేదని అతడు అన్నాడు.

అయితే, ఈ నాలుగు భూతాల సంయోగానికి, లేదా వియోగానికి కారణమైన ఏవో శక్తులుండాలి కదా? అవి ప్రేమ, ద్వేషం అనే శక్తులని అతడు భావించాడు.

## చతుర్యుగాల ఆవృత్తం

భారతీయులవలె ఎంపిడోక్లీస్ కూడా నాలుగు యుగాల ఆవృత్తాన్ని ఊహించాడు. ఒక యుగంలో ప్రేమశక్తి బలీయంగా వుంటే రెండవ దానిలో ద్వేషశక్తి బలీయంగా వుంటుంది. ప్రేమ శక్తి బలీయంగా వున్న యుగంలో అది ద్వేషశక్తిని నెమ్మదిగా తరిమివేస్తుంది. ఆ సమయంలో నాలుగు భూతాల

కలయిక జరుగుతుంది. విశ్వసృష్టి జరుగుతుంది. రెండవ యుగంలో ద్వేషశ క్తిది పైచెయ్యి అవుతుంది. ప్రేమను క్రమంగా తరిమివేసి ద్వేషం ప్రపంచాన్ని ఆక్రమించుకుంటుంది. అప్పుడు చతుర్భూతాలు క్రమంగా విడిపోతాయి. విశ్వం అంతరిస్తుంది. మళ్లీ మూడవ యుగంలో ప్రేమశక్తి ద్వేషాన్ని జయిస్తుంది.

పార్మెనిడీస్‌వలె ఎంపిడోక్లీస్ కూడా భౌతిక విశ్వం ఒక మహాగోళమని భావించాడు. అయితే, పార్మెనిడీస్ చలనం అనేదాన్ని ఒప్పుకోలేదు. కాగా ఎంపిడోక్లీస్ చలనం అనేది కలదని, అది రాగ, ద్వేషాలనే శక్తులవల్ల కలుగు తుందని చెప్పాడు. చతుర్యుగాలలో మొదటిది స్వర్ణయుగం. ఆ యుగంలో ప్రేమ విశ్వగోళం (బ్రహ్మాండం) లోపల వుంటుంది. ద్వేషం దాని వెలుపల ఉంటుంది. అప్పుడు చతుర్భూతాలు పూర్తిగా సమ్మిళితమైపోతాయి. ఆ యుగాంతంలో ద్వేషం విశ్వగోళంలో ప్రవేశించి ప్రేమను తరిమి వేస్తుంది. అప్పుడు చతుర్భూతాలు క్రమంగా విడిపోతాయి. కొంత కాలానికి స్వర్ణయుగం తిరిగి ప్రారంభమవుతుంది.

## ఖగోళ సిద్ధాంతాలు

చంద్రుడికి స్వయంప్రకాశం లేదని ఎంపిడోక్లీస్‌కు తెలుసు. అయితే సూర్యు డికి కూడా స్వయంప్రకాశం లేదని అతడు భావించాడట. కాని సూర్యగ్రహణానికి కారణం భూమికి, సూర్యునికి మధ్యగా చంద్రుడు రావడమని అతడు సరిగానే ఊహించాడు. కాంతి ప్రయాణం చేయడానికి కొంత సమయం పడుతుందని, అయితే, అది మనం కనిపెట్టలేనంత వేగంగా ప్రయాణం చేస్తుందని అతడు అన్నాడు. వాయువులో ఒత్తిడి పెరిగి నీటిని పిండినట్టు కాగా వాన కురుస్తుంది. మబ్బులలో ఒత్తిడివల్ల అగ్నిని పిండినట్టు అయి మెరుపులు వస్తాయి. విశ్వంతో పాటు భూమి తిరుగుతున్నది. మొత్తం విశ్వం అతి వేగంగా తిరగడంవల్లనే భూమి, ఆకాశం తమ స్థానాలలో నిలకడగా వుండగలుగుతున్నాయి. దీనికి ఉదాహరణగా ఎంపిడోక్లీస్ ఒక పొడుగాటి తాడు చివర నీటితో నిండిన గిన్నెను కట్టి గిరగిర తిప్పితే నీరు ఒలికిపోక పోవడాన్ని పేర్కొన్నాడు.

## జీవోత్పత్తి

రాగద్వేషాలు కలిసి చతుర్భూత మిశ్రమాన్ని మథించగా ఏర్పడిన సేంద్రియ సంయుక్త పదార్థం నుంచి అన్ని జీవులు పుట్టాయని ఎంపిడో క్లీజ్ సిద్ధాంతం. మొదటగా వృక్షజాతులు ఉద్భవించా యన్నాడు. తర్వాత జంతువులు, మనుష్యులు.

విశ్వగోళంనుంచి ప్రేమను ద్వేషం తరిమివేస్తున్న యుగంలో జీవ పరిణామం ఒక విధంగాను, ఆ తర్వాత యుగంలో మరొక విధంగాను వుంటుందట. మొదట్లో మెడలు లేని తలలతో, భుజాలు లేని చేతులతో, నుదురులేని కళ్లతో జీవులు జన్మిస్తాయి. అలా మొండి అవయవాలతో పుట్టిన జీవులు తమకు తగిన రూపాలకోసం వెతుకుతూ తిరుగుతాయి. కొంతకాలానికి అయా అవయవాలు తమకు తగిన జంటలు దొరకగానే వాటికి అతుక్కుపోతాయి. అయితే ముఖం ఒక వైపు, రొమ్ము మరొక వైపు వున్న జీవాలు, ఎద్దుతల, మనిషి శరీరం కల జీవాలు, మనిషి తల, ఎద్దు శరీరంకల జీవాలు, స్త్రీ పురుష లక్షణాలు సమంగాకల జీవాలు, ఇలా ఎన్నో రకాల రూపాలు బయలుదేరుతాయి. చివరికి ఈ జీవ రూపాలలో పరిసరాలకు అనుగుణంగా వున్నవి మిగులుతాయి. మిగిలినవి అంతరిస్తాయి. ఎంపిడోక్లీస్ ఇలా యథేచ్ఛగా జీవ పరిణామాన్ని గురించి ఊహాగానం చేస్తూనే ఒకరకం "నాచురల్ సెలెక్షన్"ను ఊహించడం గమనించవచ్చు.



## అనగ్జాగరస్

ఎంపిడోక్లీస్ వలె మరొక బహు సత్తావాది అనగ్జాగరస్. ఇతడు ఐవోనియాలో క్లాజ్ మెనీ పట్టణంలో క్రీస్తుపూర్వం 500 ప్రాంతాలలో జన్మించాడు. కాని ఎక్కువ కాలం గ్రీసులోని ఏథెన్సులో గడిపాడు.

అవి ఏథెన్సు నగరం అన్ని విధాల ఉచ్చదశలో ఉన్న రోజులు. పెరిక్లీస్ (క్రీస్తుపూర్వం 495–429) నాయకత్వాన ఏథెన్సు ఒక పెద్ద సామ్రాజ్యానికి

కేంద్రం కావడమే కాక, సాంస్కృతికంగా కూడా అది గ్రీకు జాతికి కేంద్రమై వుండేది. పెరిక్లీస్ కాలాన్ని స్వర్ణయుగం అంటారు. అతడు తన కాలంనాటి గొప్ప కళాకారులను, మేధావులను తనచుట్టూ చేర్చుకున్నాడు. ఫిడియాస్ అనే మహాశిల్పి అప్పటివాడు. పాశ్చాత్య వైద్యశాస్త్ర పితామహుడు హిపోక్రటీస్ అనాటివాడు. సాఫోక్లీస్, యురిపిడీస్ అనే మహాకవులు, హెరడోటస్, థూసిడిడీస్ అనే చరిత్రకారులు పెరిక్లీస్ ఆస్థానంలోనివారు. ఎస్కిలస్ అనే విషాదాంత నాటకకర్త, అరిస్టోఫనీస్ అనే సుఖాంత నాటకకర్త ఆ కాలపువారే. అలాగే ఐవోనియాకు చెందిన మేధావి అనగ్జాగరస్‌ను కూడా పెరిక్లీస్ తన రాజధాని ఏథెన్సుకు పిలిపించుకున్నాడు.

అయితే, కొంతకాలానికి పెరిక్లీస్‌పై ఏథెన్సు నగర పౌరులకు అవిశ్వాసం ఏర్పడింది. పెరిక్లీస్ స్నేహితులను, సన్నిహితులను వేధించడం ద్వారా పెరిక్లీస్‌పై వారు తమ ద్వేషాన్ని ప్రకటించేవారు.

## కారాగార శిక్ష

అలా వారి ద్వేషానికి గురి అయిన వారిలో తత్త్వవేత్త అనగ్జాగరస్ ఒకడు. ఇతడు సంప్రదాయ విరుద్ధమైన తాత్విక సిద్ధాంతాలను ప్రచారం చేశాడు. దీనితో మతరీత్యా మితవాదులు, సంప్రదాయవాదులు అయిన ఏథెన్సు పౌరులు అతడికి కారాగారశిక్ష విధించారు. (ఆ తర్వాత కొంతకాలానికి ఏథెన్సు పౌరులు ఇలాగే సోక్రటీస్‌కు మరణ శిక్ష విధించారు) అయితే పెరిక్లీస్ సహాయంతో అనగ్జాగరస్ కారాగారంనుంచి తప్పించుకొని తన మాతృదేశమైన ఐవోనియాకు పారిపోయాడు. అక్కడ లాంప్సాకస్ అనే చోట ఒక గురుకులాన్ని స్థాపించుకుని జీవితాంతం అక్కడే నివసించాడు. థేలీస్ మొదలైన హేతువాదు లనేకులకు లభించినట్టే ఐవోనియాలో అనగ్జాగరస్‌కు కూడా గొప్ప గౌరవం లభించింది.

పార్మెనిడీస్ సిద్ధాంతాలలో కొన్నిటిని అనగ్జాగరస్ అంగీకరించాడు. సత్య పదార్థాన్ని ఎవరూ సృష్టించలేదు. అది మొదటినుంచి వున్నది. ఎల్లప్పుడూ వుంటుంది. అది అనశ్వరం. అది పూర్ణ పదార్థం. దానిలో శూన్యం అనేది లేదు, దాని లోపల మార్పు అనేది జరగదు.

## ఒక తేడా

కాని, పార్మెనిడీస్‌కు, అనగ్జాగరస్‌కు ఒక ముఖ్య భేదం వున్నది. సత్య పదార్థం ఒకటేనని, అది గోళాకృతి కలిగినదని పార్మెనిడీస్ అన్నాడు. అనగ్జాగరస్ అలాకాక ఆ విశ్వగోళాన్ని అసంఖ్యాక సూక్ష్మగోళాలుగా "బ్రద్దలు కొట్టాడు,"

ప్రతి శకలానికి పార్మెనిడీస్ పేర్కొన్న అనాదిత్వం, అనశ్వరత్వం, పూర్ణత్వం, శూన్యరాహిత్యం, పరివర్తన రాహిత్యం వంటి లక్షణాలను ఆపాదించాడు.

అసంఖ్యాక శకలాల కలయికతో, వేర్పాటుతో, రకరకాల అమరికతో ఈ ప్రపంచం ఏర్పడుతున్నదని, అందుకే లోకంలో ఇంత వైవిధ్యం, ఇంత నిరంతర పరివర్తన కనిపిస్తున్నాయని అనగ్జాగరస్ అన్నాడు. ఒక రకంగా అతడు హెరాక్లీటస్ పరివర్తనవాదాన్ని, పార్మెనిడీస్ పరివర్తనరాహిత్య వాదాన్ని సమన్వయం చేశాడని చెప్పవచ్చు.

అనగ్జాగరస్ వాదం ప్రకారం ప్రతివస్తువును అనంతంగా విభజిస్తూ పోవచ్చు. అలా విభజించగా వచ్చిన ప్రతి శకలంలోను ఎంపిడోక్లీస్ పేర్కొన్న నాలుగు మూల పదార్థాల లక్షణాలన్నీ కలిసి వుంటాయి. కాని, అగ్ని లక్షణాలెక్కువగా వున్న శకలాలు కలిస్తే అగ్ని ఏర్పడుతుంది. నీటి లక్షణాలు ఎక్కువగావున్న శకలాలతో నీరు ఏర్పడుతుంది. అలాగే పృథ్వి, వాయువు కూడా...

## విశ్వమానసం

అయితే, నిర్జీవ పదార్థాలలో మనస్సు అనేది వుండదు. సజీవ పదార్థాలలో మాత్రం మనస్సు విధిగా వుంటుంది. సజీవ, నిర్జీవ పదార్థాలమధ్య భేదాన్ని కల్పించేది మనస్సే. చలనానికి కారణం మనస్సే. విశ్వచలనానికి కారణం విశ్వమానసం. మానవుడికి చేతులుండడం వల్ల అతడు జంతువులకంటే అధికుడయ్యాడు.

## "సూర్యుడు దేవుడు కాదు"

చంద్రుడికి స్వయం ప్రకాశం లేదని, సూర్యకాంతి పడి ప్రతిఫలించడంవల్లనే చంద్రుడు ప్రకాశిస్తున్నాడని అనగ్జాగరస్ సిద్ధాంతీకరించాడు. సూర్య, చంద్ర గ్రహణాలకు కారణాలను కూడా ఇతడు సరైన విధంగానే ఊహించాడు. సూర్యుడి కంటె భూమికి దగ్గరగా చంద్రుడున్నాడని, సూర్యుడు దేవుడు కాడని, అగ్నిశిల అని, అలాగే నక్షత్రాలు కూడా అగ్ని శిలలేనని అన్నాడు. నక్షత్రాలు అపార దూరాలలో వుండడం వల్లనే వాటి వేడి మనకు తెలియడం లేదన్నాడు. చంద్రుడు దేవత కాదని, భూమిలాగానే మట్టి, రాళ్లతో కూడిన ప్రదేశమని చెబుతూ అక్కడ జీవరాశి కలదని ఊహించాడు.

ఇవన్నీ ఆ కాలపు మత విశ్వాసాలకు విరుద్ధం కనుకనే ఏథెన్సు ప్రజలు అసహనంతో అనగ్జాగరస్‌కు కారాగారశిక్ష విధించారు.



# 9
# డెమొక్రిటస్ అణువాదం

క్రిందటి అధ్యాయంలో పేర్కొన్న ఎంపిడోక్లిస్, అనగ్జాగరస్‌ల బహుసత్తా సిద్ధాంతాలు క్రమంగా భౌతికవాదానికి, అణువాదానికి దారితీశాయి.

అణువాదానికి పితామహుడు డెమోక్రిటస్. ప్రపితామహుడు ల్యూసిప్పస్.

ల్యూసిప్పస్ గురించి పెద్దగా తెలియదు. ఐనోనియాలోని మైలీటస్‌కు చెందిన వాడని, ఈలియా వెళ్లి అక్కడ జీనోవద్ద శిష్యరికం చేశాడని అంటారు. చివరికి థ్రేస్ రాజ్యంలోని అబ్డేరా నగరంలో స్థిరపడి అక్కడొక గురుకులం స్థాపించాడట. అతడి శిష్యుడే డెమోక్రిటస్.

అయితే, ఎపిక్యూరస్ అనే తాత్వికుడు (క్రీస్తుపూర్వం 342-270) ల్యూసిప్పస్ అనే వ్యక్తి లేనేలేడని అభిప్రాయపడ్డాడు. కాగా అరిస్టాటిల్ మాత్రం ల్యూసిప్పస్ చారిత్రక వ్యక్తేనని వ్రాశాడు.

ఇక డెమోక్రిటస్ క్రీస్తుపూర్వం 460 లో అబ్డేరాలో జన్మించాడు. 370 లో చనిపోయాడు. విజ్ఞానాన్వేషణలో దేశ దేశాలు తిరిగాడు. అరిస్టాటిల్ వలె ఇతడు కూడా సజీవ విజ్ఞానకోశం. ఇతడు వ్రాయని విషయం లేదు. భౌతిక, గణిత; ఖగోళశాస్త్రాలు, జీవశాస్త్రం, మనోవిజ్ఞానశాస్త్రం, వ్యవసాయం, సంగీతం, చిత్రలేఖనం, న్యాయశాసనం- ఇలా అన్ని విషయాలపై సిద్ధాంత గ్రంథాలను రచించాడు. ఆఖరికి జ్వరం, దగ్గువంటి విషయాలపై కూడా వ్రాశాడు. బహుముఖ విజ్ఞానంలో అరిస్టాటిల్‌తోను, సాహిత్య శైలిలో ప్లేటోతోను ఇత

డిని పోలుస్తారు. ఇతడు మానవుల మానసిక దౌర్బల్యాలను చూసి ఎప్పుడూ నవ్వుతూ వుండేవాడట. దీనితో అతనికి "లాఫింగ్ ఫిలాసఫర్" అనే పేరు వచ్చింది.



అయితే, ఇతని పేరుతో వున్న సిద్ధాంతాలు నిజంగా ఇతనివో, లేక గురువు ల్యూసిప్పస్‌వో నిహో తెలియదు. ఏమైనా అణువాదం పేరు చెప్పగానే ల్యూసిప్పస్ కంటె ఎక్కువగా డెమోక్రిటస్ పేరే జ్ఞాపకం వస్తుంది. చాలా శతాబ్దాలపాటు మరుగున పడిన ఇతని అణువాదంపట్ల 19వ శతాబ్ది ప్రారంభంనుంచి తిరిగి శ్రద్ధాసక్తులు పెరిగాయి. అసంఖ్యాకమైన శకలాలతో ప్రపంచం ఏర్పడిందని, ఆ శకలాలకు చలనం కలిగించే శక్తులు ప్రేమ, ద్వేషం అని ఎంపిడోక్లీస్ అన్నాడు. విశ్వమనశ్శక్తి వాటిని కదిలిస్తుందని అనగ్జాగరస్ అన్నాడు. కాగా, అణువాదులు చలనం అనేది శకలాల స్వతస్సిద్ధ లక్షణమని ఉద్ఘాటించారు.

పృథ్వి, జలం, అగ్ని, వాయువు మూల పదార్థాలు కావు. అవి తమకంటే సూక్ష్మ శకలాలతో తయారవుతాయి. అవి కంటికి కనబడనంత సూక్ష్మమైనవి. అవి ఘనపదార్థాలు. వాటిలోపల శూన్యం అనేది లేదు. అందుచేత వాటిని వాటికంటె చిన్నవిగా ఛేదించడానికి వీలుకలగదు.

ఆ సూక్ష్మ శకలాలనే atoms (యాటమ్స్)- అణువులు-అంటారు. గ్రీకు భాషలో atomos (యాటమస్) అంటే ఛేదించ వీలులేనిది. అవి అచ్ఛేద్యాలు, అవిభాజ్యాలు. వాటిలోపల శూన్యం లేకపోయినా, వాటి వెలుపల ఒక అణువుకు మరొకదానికి మధ్య శూన్యస్థలం వుంది. సమస్తజగత్తు అణువులతోను, శూన్యంతోను నిర్మితమైంది.

అణువులకు రంగు, రుచి, వాసన, శబ్దం వగైరా గుణాలేవీ లేవు-కాని, వాటికి ఆకృతి, బరువు, పరిమాణం మాత్రం వున్నాయి. అణువులు అనంతంగా వున్నాయి. అంతకంటె సూక్ష్మ వస్తువులు లేవు. ఒక వస్తువును ముక్కలుగా ఛేదించుకుంటూ పోగా పోగా ఇక ఛేదించ వీలు లేనంత చిన్న శకలాలు మిగులుతాయి. అవే అణువులు.

పార్మెనిడీస్ చెప్పినట్లు యాథార్థ్యం (reality) అనాద్యనంతమని, అది మార్పు చెందదని అణువాదులు అంగీకరిస్తారు. ఎటొచ్చీ వీరి దృష్టిలో

యాథార్థ్యం అంటే అణువులే. అవి శాశ్వతంగా వుంటాయి. వాటిలోపల ఎటువంటి మార్పు జరగదు.

## అభావం వున్నది

కాని, బాహిరమైన మార్పు తప్పదు. ప్రతి వస్తువుకు, ఆఖరికి అణువులకు కూడా—చలనం వున్నది. పార్మెనిడీస్ శూన్యం లేదన్నాడు గాని, శూన్యం వున్నది. ఆ శూన్య స్థలంలోనే అణువులు చలిస్తున్నాయి.

శూన్యం అంటే ఏమీ లేకపోవడం కదా? "ఏమీ లేకపోవడం" ఎలా వుంటుంది అని పార్మెనిడీస్ ప్రశ్న. కాని అణువాదుల దృష్టిలో "ఏమీ లేకపోవడం" అనేది వుంది. అయితే, ఆ "ఏమీ లేకపోవడం" ఒక వస్తువుకాదు. అది అభావం మాత్రమే. అది కూడా యాథార్థ్యమే. యాథార్థ్యం (reality) అనేది ఒక వస్తువు కానక్కరలేదు.

అణువులు, శూన్యం ఇవే పరమసత్యాలు, చరమసత్యాలు. అణువు అనేది పూర్ణం. అది కానిది శూన్యం. పూర్ణం, శూన్యం ఈ రెండే లోకంలో వున్న నిత్యసత్యాలు.

అణువులలో వేర్వేరు రకాలు లేవు. వాటిలో గుణ విభేదాలు లేవు. కాని, వాటి ఆకృతులలో, పరిమాణాలలో, బరువులలో తేడాలున్నాయి. ఈ తేడాలవల్లనే వస్తువులలో వైవిధ్యం కలుగుతున్నది.

## అణువుల రకాలు

ఉదాహరణకు కొన్ని అణువులకు కొక్కేలుంటాయి. కొన్నిటికి కళ్లుంటాయి. కొన్నిటికి ఎత్తులుంటే, కొన్నిటికి లోతులుంటాయి. కొన్నిటిలో గాడులుంటాయి. ఇలాంటి ఆకార భేదాలవల్ల ఒక అణువు మరొక అణువుతో గడియ పడడానికి, రకరకాలుగా అతుక్కొనడానికి వీలుకలుగుతుంది.

అణువులకు స్వతశ్చలనం ఉన్నది. అణువులకువలెనే, అణువుల చలనానికి కూడా బాహ్యకారణం ఏదీ లేదు. అణువులు స్వతస్సిద్ధాలు; స్వయంభువులు. అవి ఒకదానినొకటి ఢీకొట్టుకుని సుడి తిరుగుతాయి. అలా సుడి తిరగడంలో ఒకే ఆకృతి, పరిమాణంగల అణువులు దగ్గర దగ్గరగా చేరి సంయోగం చెందుతాయి. ఆ విధంగా అగ్ని, మట్టి, వాయువు, నీరు ఏర్పడుతాయి. అనేక ప్రపంచాలు ఏర్పడుతాయి. కొన్ని ప్రపంచాలకు సూర్యుడు, చంద్రుడు వుండరు. కొన్నిటికి అనేక సూర్యచంద్రులుంటారు.

భూమి తేమగా వుండే రోజులలో జీవం ప్రారంభమైంది. జీవుల శరీరాలలో వేడికి కారణం అగ్ని అణువులు దేహమంతటా సమంగా వ్యాపించివుండడమే. మానవుడి ఆత్మలో అగ్ని అణువులు ఎక్కువ. రెండు ఇతర అణువుల మధ్య ఒక ఆత్మాణువు చొప్పున దేహమంతటా వుంటాయి. మన ఉచ్ఛ్వాస నిశ్వా

సాలు ఆత్మాణువులతో కూడినవి. శ్వాస వున్నంతవరకే ప్రాణం వుంటుంది. మనిషి చనిపోయినప్పుడు ఆత్మాణువులు చెల్లాచెదరవుతాయి.

ఇంద్రియజ్ఞానం ఎలా కలుగుతోంది? రంగు, రుచి, వాసన, శబ్దం వంటి గుణాలు ఆయా వస్తువులలో లేవు. ఆయా వస్తువులు మన జ్ఞానేంద్రియాలపై కలిగించే మార్పులవల్ల ఆ గుణాలు వస్తువులలోనే వున్నవనే భ్రాంతి కలుగుతున్నది. అందుచేత ఇంద్రియజ్ఞానం సరైనది కాదు, నమ్మదగింది కాదు.

## బౌద్ధిక జ్ఞానం

బుద్ధిద్వారా వచ్చేదే అసలైన విజ్ఞానం. అయితే ఇంద్రియాలతో ప్రమేయం లేని బౌద్ధిక జ్ఞానం వుండదు. ఇంద్రియ వ్యాపారం ఆగిపోయిన చోట బౌద్ధిక వ్యాపారం ప్రారంభమవుతుంది. ఆలోచన కూడా భౌతికమైనదే.

విశ్వంలో ఏదీ యాదృచ్ఛికంగాజరగదు. ప్రాకృతిక నియమాలప్రకారమే అన్నీ జరుగుతాయి. కాని, విశ్వానికి ఒక ప్రయోజనం అంటూ లేదు.

డెమొక్రిటస్ భౌతికవాదే అయినా దేవతల ఉనికిని అంగీకరించాడు. అయితే దేవతలు కూడా అణువుల కలయికతో ఆవిర్భవించిన వారన్నాడు. వారికి కూడా చావుపుట్టుక లున్నాయి. కాని, వారు మానవుల కంటే దీర్ఘాయుష్కులు. స్వప్నాలలోను, ఇతర విధాలుగాను వారు మనకి కనిపిస్తారు. కాని మన జోలికి రారు. అందువల్ల వారిని చూసి మనం భయపడనక్కరలేదు. వారిని బలులద్వారా, నైవేద్యాలద్వారా ప్రసన్నులను చేసుకోగలమన్నది కూడా భ్రమే.

## సుఖవాదం (హెడొనిజం)

మనిషి ఏమిచేసినా సుఖాన్ని కోరి చేయాలి, అయితే, అది ఇంద్రియ సుఖమే కానక్కరలేదు. మేధా వ్యాపారంవల్లవచ్చే సుఖం ఇంద్రియసుఖంకన్న మిన్న. మానసిక ప్రశాంతివల్ల, నిర్భయత్వంవల్ల సుఖం ప్రాప్తిస్తుంది. దైహిక సౌఖ్యాలవల్ల, సంపదలవల్ల మానసికానందం లభించదు. అటువంటి సుఖాలు క్షణికాలు. వాటిని పొందినకొద్దీ కావాలనిపిస్తాయి. కోర్కెలు వీలైనంతగా తగ్గించుకుంటే ఆశాభంగం కలగదు.

ఏది మనకు సుఖాన్ని కలిగిస్తుందో అదే సత్ప్రవర్తన. న్యాయం, ధర్మం, సౌజన్యం ఇవన్నీ అటువంటి సుఖాన్ని కలిగిస్తాయి. అసూయ, ద్వేషం వంటి గుణాలవల్ల దుఃఖం కలుగుతుంది.

శిక్ష పడుతుందేమోనన్న భయంవల్ల చెడుపని మానడంకాక, అది మన కర్తవ్యం అనే జ్ఞానంతో మంచి పనులు చేయాలి. చెడుపనులు చేయకపోవటం చాలదు. చెడుచేయాలన్న తలపు సయితం రాకూడదు. మంచి పనులు చేసేవాడికి భయం, అశాంతి కలగవు. నిత్య సంతోషిగా వుంటాడు.

రాజ్యపాలన సక్రమంగా వుంటే అన్నీ సక్రమంగా వుంటాయి. రాజ్యం అధ్వాన్నమైతే అన్నీ అధ్వాన్నంగానే వుంటాయి. పరిపాలన బాగావున్న రాజ్యాన్ని మనం సమర్థించాలి.

భౌతిక ప్రపంచం పట్ల, నీతినియమాల పట్ల ఇవీ డెమోక్రిటస్ తాత్వికాభిప్రాయాలు. థేలీస్ మొదలైనవారితో ప్రారంభమైన శాస్త్రీయ దృక్పథం డెమోక్రిటస్‌తో పరాకాష్ఠ అందుకున్నది. ఇతడు అనాడు ప్రారంభించిన అణువాదం ఈనాటి అణుశాస్త్రానికి ఆధారభూతమైంది. గుణాలరీత్యా అణువులలో తేడాలు లేవని, వాటి ఆకృతులలో పరిమాణంలో బరువులలో మాత్రం తేడాలున్నాయని డెమోక్రిటస్ ఊహించాడు.

## ఈనాటి సైన్సు

ఇప్పటి సైన్సు ప్రకారం కూడా ఇది నిజమే. అణువుల బరువులలో తేడాలను బట్టి వివిధ మూలపదార్థాలు ఏర్పడుతున్నాయి. ఉదాహరణకు నత్రజని, ప్రాణవాయువు, వెండి, బంగారం, ఇనుము, సీసం మొదలైన మూలపదార్థాల లోని అణువులలో గుణాత్మకమైన తేడా లేమీ లేవు:

ఉదాహరణకు నత్రజని అణువులో ఏడు ప్రోటానులు, ఏడు ఎలక్ట్రానులు వుంటాయి. ఆమ్లజని (ఆక్సిజన్) అణువులో ఎనిమిది ప్రోటానులు, ఎనిమిది ఎలక్ట్రానులు వుంటాయి. అదీ వాటిమధ్య తేడా. బంగారం అణువులో 79 ప్రోటానులు, 79 ఎలక్ట్రానులు వుంటాయి. ఇనుములో 26 ప్రోటానులు, 26 ఎలక్ట్రానులు వుంటాయి. అదీ వాటిమధ్య తేడా. ఇలాగే ప్రోటానులు, ఎలక్ట్రానుల సంఖ్యను బట్టి ఒక మూల పదార్థానికి మరొకదానికి తేడాలు ఏర్పడుతున్నాయి. అందుచేతనే అణుగర్భంలోని ప్రోటానుల సంఖ్యను మార్చగలిగితే ఒక మూల పదార్థం మరొకటిగా మారిపోతుంది.

వేర్వేరు మూలపదార్థాల అణువులు రకరకాలుగా రసాయనికంగా కలియడం వల్ల సమస్త ప్రపంచం రూపొందుతున్నది.

డెమోక్రిటస్ చేసిన పొరపాటు ఊహలలో ఒకటి ఇది : అణువులు అచ్ఛేద్యాలని అతడు భావించాడు. కాని, ఆధునికశాస్త్రం ఇది తప్పు అని తేల్చింది. అణువులు అంతకంటే సూక్ష్మమైన ప్రోటాన్లు, న్యూట్రాన్లు, ఎలక్ట్రాన్లు వంటి సూక్ష్మ శకలాల కలయికవల్ల ఏర్పడుతున్నాయి.

పోతే, మనకు అణువాదం కొత్తది కాదు. షడ్దర్శనాలలో ఒకటైన వైశేషికం అణుసంయోగం వల్లనే జగత్తు ఏర్పడిందని చెబుతున్నది. వైశేషికదార్శనికుడు, కణాదుడు. ఈయనది కణవాదం కనుక కణాదుడని, కణభుక్ అని పేర్లు వచ్చాయి. అలాగే బౌద్ధ జైన తత్వ సిద్ధాంతాలలో కూడా అణువాదం వున్నది.



# 10
# సోఫిస్టుల వాద బ్రహ్మోపాసన

"మానవుడే అన్నిటికీ కొలమానం"- ఇది గ్రీకు తత్వశాస్త్ర చరిత్రలో సుప్రసిద్ధమైన ఒక సుభాషతం. దీన్ని ప్రవచించినవాడు సోఫిస్టు తాత్వికుడైన ప్రోటాగరస్.

ఈ సుభాషితంతో గ్రీకు తత్వచింతన ఒక మలుపు తిరిగింది.

థ్రేస్‌లోని అబ్దేరా నగరంలో ప్రోటాగరస్ జన్మించాడు. క్రిందటి అధ్యాయంలో మనకు పరిచయమైన డెమోక్రిటస్ కూడా ఆ నగర పౌరుడే. గ్రీకు తాత్వికులు అందరు తమ జన్మస్థానాలుగా ఏవో కొన్ని పట్టణాలనే ఎంచుకున్నట్టు కనబడుతుంది. థేలీస్ మొదలైన తాత్వికులు ఐవోనియాలోని మైలీటస్ నివాసులు. పార్మెనిడీస్ వంటి కొందరు దక్షిణ ఇటలీలోని ఈలియా నగరవాసులు. అలాగే డెమోక్రిటస్, ప్రోటాగరస్‌వంటి ప్రసిద్ధ తాత్వికుల జన్మస్థానం అబ్దేరా. కాగా సోక్రటీస్, ప్లేటోల జన్మస్థలం ఏథెన్సు.

ప్రోటాగరస్ క్రీస్తుపూర్వం 481 లో జన్మించి 411 లో చనిపోయాడు.

డెమోక్రిటస్‌కంటె వయసులో ఇతడు పెద్దవాడు. డెమోక్రిటస్ ధనిక కుటుంబం నుంచి వచ్చినవాడు. ఇతడు పేద కుటుంబానికి చెందినవాడు. చిన్ననాట కూలీగా పనిచేశాడట. కాని ఆ తర్వాత వ్రాత, చదువునేర్చి అధ్యాపక వృత్తిని అవలంబించాడు. క్రమంగా విజ్ఞానార్జన చేసి గొప్ప విద్వాంసుడయ్యాడు.

## ప్రోటాగరస్ విజయఢంకా

తన ముప్పదవ ఏట అబ్డేరా నగరం నుంచి బయలుదేరి సిసిలీ, ఇటలీలలోని గ్రీకు నగరాలన్నీ పర్యటించాడు. అతడి ప్రతిభా విశేషాలకు ప్రజలు ముగ్ధులై ఎక్కడికి వెళ్లినా అతనికి నీరాజనాలర్పించేవారు. చివరికి విజయఢంకా మ్రోగిస్తూ ఏథెన్సు చేరుకున్నాడు. అతడికి ఏథెన్సు నగరం బ్రహ్మరథం పట్టింది. అక్కడ స్థిరపడ్డాడు. పెరిక్లీస్‌ను ఆశ్రయించిన కవి పండితుల, కళాకారుల బృందానికి సన్నిహితుడయ్యాడు. శిష్యులను చేర్చుకుని వారికి విద్యాబోధ చేసి అపారంగా ధనార్జన చేశాడు.

కాని, చివరి రోజులలో అతని భావాలు, ఉపదేశాలు ఏథెన్సు ప్రజలకు నచ్చలేదని, అతడిని వారు వెళ్లగొట్టారని, సిసిలీ వెడుతుండగా సముద్రంలో నౌక మునిగి చనిపోయాడని ఒక కథ. అతని రచనలు కూడా అంతకు ముందే పరశురామప్రీతి అయినా యంటారు.

## దేవతలున్నారా? లేరా?

ప్రోటాగరస్ రచనలలో ఏవో కొద్దిపాటి భాగాలు తప్ప భావితరాలకు ఏమీ మిగల లేదు. అలా మిగిలిన వాటిలో ఒకటి దేవతలను గురించినది. "దేవతలు వున్నారని చెప్పలేము! లేరనీ చెప్పలేము. వారి ఆకారాలు ఎలా వుంటాయో మనకు తెలియదు. ఎందుకంటే వారిని గురించి ఖచ్చితమైన జ్ఞానాన్ని పొందడానికి అనేక అవరోధాలున్నాయి. అదొక అయోమయ సమస్య. దాన్ని భేదించడానికి మానవుడి ఆయుర్దాయం చాలదు."

సమకాలికుల మత విశ్వాసాలను కించపరచే ఇటువంటి అభిప్రాయాలను ప్రచారం చేసే వ్యక్తిని ఏథెన్సు ప్రజలు గౌరవించగలరని అనుకోలేము. అన గ్జాగరస్‌ను కారాగారంలో పెట్టినట్టే (8వ అధ్యాయం) ప్రోటాగరస్‌ను కూడా వారు నగరంనుంచి తరిమివేసివుంటే ఆశ్చర్యం లేదు.

అయితే మరొక కథనం ప్రకారం ప్రోటాగరస్ జీవితాంతంవరకు ఏథెన్సులో గౌరవ మర్యాదలతో నివసించాడని, అతని మరణానంతరం కూడా చాలాకాలం పాటు అతని రచనలను ప్రజలు పఠిస్తూనే వున్నారని తెలుస్తున్నది.

## మానవుడే మహనీయుడు

ఏమైనా అతడు గ్రీకు తత్వ చింతన చరిత్రలో ఒక మలుపు తీసుకువచ్చిన వాడని ప్రతీతి. దీనికి ఆధారం మొదట పేర్కొన్న ఇతని సుభాషితం- "మానవుడే అన్నిటికీ కొలమానం" (Man is the measure of all things).

ఇలా భావించడానికి కారణం ఇది :-

అంతకుముందు థేలీస్‌నుంచి వరుసగా గ్రీకు తాత్వికులందరు ప్రపంచ తత్వం గురించి ఆలోచించారు. విశ్వ రహస్యాన్ని అన్వేషించారు. కాని మానవుడిని విస్మరించారు. మానవుడి మనస్సును అలక్ష్యం చేశారు. ప్రపంచ మూల పదార్థం నీరు అని ఒకరు, అగ్ని అని మరొకరు- వాయువు అని వేరొకరు, మార్పు వున్నదని ఒకరు, మార్పు లేదని మరొకరు- ఇలా రకరకాలుగా పరస్పర విరుద్ధాభిప్రాయాలను వెల్లడించారు. ఇన్ని విరుద్ధ సిద్ధాంతాలలో మానవుని స్థానం ఎక్కడ? ఈ ప్రశ్న వారికి స్ఫురించలేదు.

సరిగ్గా ఆ సమయంలో ప్రోటాగరస్ రంగప్రవేశం చేశాడు. "ఆకాశపు దారులంట హడావుడిగ వెళిపోయే" తత్వచింతన రథ చక్రాలను భూమార్గం పట్టించాడు. వాటిని మానవుని వద్దకు తీసుకువచ్చాడు. మానవునికే పట్టాభిషేకం చేశాడు.

## వ్యక్తికి పట్టాభిషేకం

మానవుడంటే ప్రోటాగరస్ ఉద్దేశం మానవజాతి అనికాదు; వ్యక్తి అని మాత్రమే. అంతకుముందు తాత్వికుల దృష్టిలో మానవవ్యక్తి విశ్వసాగర తీరాన ఒక ఇసుక రేణువు లాంటివాడు. వారి దృష్టి ఎంతసేపూ విశ్వతత్వాన్వేషణమీదనే. వ్యక్తిని గురించి వారు పట్టించుకోలేదు. ప్రోటాగరస్ అలాకాక వ్యక్తిని విశ్వకేంద్రంలో నిలిపాడు. యూరప్‌లో ఆ తర్వాత కాలపు వైయక్తిక వాదానికి (Individualism) మూలపురుషుడు ప్రోటాగరస్ అని చెప్పవచ్చు.

## డబ్బుకోసం ఫిలాసఫీ

ఇతనికి, అంతకుముందు తాత్వికులకు మరొక తేడా వుంది. వారందరు ప్రవృత్తిరీత్యా తాత్వికులు ప్రోటాగరస్ వృత్తి రీత్యా తాత్వికుడు. అంటే అతని పూర్వులు తత్వం కోసమే తత్వం, జ్ఞానం కోసమే జ్ఞానం అని విశ్వసించారు. ఉచితంగా తత్వబోధ చేసేవారు. కాని, ప్రోటాగరస్ అలాకాక డబ్బుకోసం తత్వం, జీవిక కోసం విజ్ఞానం అన్నట్టుగా ప్రవర్తించాడు

ఈనాడు మనకు ఇందులో ఏమంత తప్పు పట్టదగినది కనబడదు. అధ్యాపకత్వమే కాదు. ఈనాడు కళలు, కవిత్వం, తత్వం, సైన్సు, రాజకీయాలు అన్నీ ధనంతో ముడిపడి వున్నవే. వీటిని వృత్తులుగా స్వీకరించడం మన దృష్టిలో తప్పుకాదు. కాని, ఆనాటి గ్రీసులో అలా తత్వబోధచేసి ధనార్జన చేయుడం చాలా జుగుప్సాకర వృత్తిగా పరిగణించేవారు.

ప్రోటాగరస్ సోఫిస్టులనబడే తాత్విక వర్గానికి చెందినవాడు. గార్జియస్ అనే మరొక తాత్వికునితోపాటు ఆ వర్గంలోకెల్లా ప్రసిద్ధుడుగా, ప్రముఖుడుగా చెలామణీ అయ్యాడు.

సోఫిస్టులంటే విజ్ఞానులని అర్థం. కాని, ఆ రోజులలో ఈ మాట దాదాపు ఒక తిట్టుగా తయారైంది. డబ్బు కక్కుర్తికి, వట్టి వాద చాపల్యానికి, కృత్రిమత్వానికి సోఫిజం ఒక పర్యాయపదమైంది. సోఫిస్ట్రి (Sophistry) అనే మాట అతి తెలివి చూపించి ఎదుటివాడిని బోల్తా కొట్టించడానికి ఉపయోగించే కుహనా తర్కానికి మారుపేరైంది. ఇందుకు కారణం లేకపోలేదు.

## వాద విద్య

అప్పటిలో ఏథెన్సులో ప్రజాస్వామ్య వ్యవస్థ వుండేది. అయితే అది బానిసతనంపై ఆధారపడిన ప్రజాస్వామ్యం. బానిసలను, స్త్రీలను మినహాయించి మిగిలిన వారికే పౌరత్వపు హక్కులను ప్రసాదించిన ప్రజాస్వామ్యం. ఆ ప్రజాస్వామ్యం కూడా ధనికవర్గం పలుగుబడిలో వుండేది. పేదలకు, ధనికులకు నిరంతర ఘర్షణ వుండేది. ఆ వ్యవస్థలో వ్యక్తి పైకిరావాలంటే, లేదా తన హక్కులను, తన ఆస్తిపాస్తులను, లేదా ప్రాణ మానాలను రక్షించుకోవాలంటే వాద చాతుర్యం, వాద పాటవం అవసరమయ్యేవి. ప్రత్యేకించి న్యాయవాదులుండేవారు కాదు. న్యాయస్థానాలలో ఎవరికివారే తమ వాదాన్ని వినిపించుకోవలసి వుండేది. ఎవరు బాగా వాదించగలిగితే వారే నెగ్గేవారు.

అందువల్ల ఏథెన్సు పౌరులకు వాద విద్యాభ్యాసం అవసరమైంది. ఇందుకోసం వారు తమకు ఆ విద్యనేర్పే అధ్యాపకులను నియమించుకునేవారు. అటువంటి అధ్యాపకులే సోఫిస్టు తాత్వికులు. వారికి బాగా జీతాలిచ్చి వాద విద్య నేర్చుకునే వారు.

సోఫిస్టులకు కావలసింది సత్యనిరూపణ కాదు, సత్యాన్వేషణ కాదు. వారు జ్ఞానాన్వేషణ చేసేవారు, జ్ఞానబోధ చేసేవారు. కాని, వారి జ్ఞానార్జన లక్ష్యం సంఘంలో పైకి రావడం, ప్రభుత్వంలో మంచి ఉద్యోగం సంపాదించడం, న్యాయ

స్థానాలలో దావాలు నెగ్గడం. ఇందుకోసం వారు వాద విద్యను ఒక లలితకళగా అభ్యసించేవారు. వాగ్ధాటిని నేర్చుకునేవారు. తర్కం, తత్వం, వ్యాకరణం, భాషా పాండిత్యం, రాజ్యాంగ నిర్మాణం, సివిల్, క్రిమినల్ చట్టాలు ఇవన్నీ నేర్చుకునేవారు, ఇతరులకు నేర్పేవారు.

## ఏది తిమ్మి, ఏది బమ్మి

సోఫిస్టులు తమ వాద పటిమతో తిమ్మిని బమ్మి, బమ్మిని తిమ్మి చేసే వారు. వాదంలో నెగ్గడమే వారికి కావలసింది. ఆ వాదంలోని సారాంశం నిజమా కాదా అనేది వారికి అక్కర్లేదు. ముఖ్యంగా ఏథెన్సులోని ధనిక యువకులు బాగా జీతాలు చెల్లించి ఈ వాదవిద్య నేర్చుకునేవారు. సోఫిస్టులు ధనార్జనే లక్ష్యంగా పెట్టుకున్నారు కనుక వారు ధనిక స్వామ్యాన్ని బలపరిచేవారు. వారివల్ల సోఫిజం అనే తత్వశాఖ అంతటికీ చెడ్డపేరు వచ్చింది.

అయితే, ప్రోటాగరస్, అతనితోపాటు గార్జియస్ అనే మరొక సోఫిస్టు మాత్రం ఇంత చౌకబారుగా ప్రవర్తించేవారు కాదు. వారు నిజంగా మహాపండితులు, జిజ్ఞాసువులు. వారి వాదాలను ఇక్కడ పరిశీలిద్దాము :

ప్రోటాగరస్ "మానవుడే అన్నిటికీ కొలమానం" అని కలగానం చేయడంలో ఉద్దేశం ఇది :-

## ఏది సత్యం ఏదసత్యం?

సార్వజనీనం, సార్వకాలికం అయిన సత్యం లేదు. ఎవడి సత్యం వాడిది. ఎప్పటి సత్యం అప్పటిది.

ఒకడికి ఏది సత్యమని తోస్తే అదే సత్యం. అది వాడికే సత్యం. మరొకడికి కాదు, ఆ మరొకడికి ఏది సత్యమని తోస్తుందో వాడికి అదే సత్యం. వాడికి ఏది అసత్యమని తోస్తుందో అది వాడికి అసత్యం.

నీవు చెప్పేది నీకు సత్యమైతే, నేను చెప్పేది నాకు సత్యం. ఈరెండింటిలో ఏది అసలు సత్యమో నిర్ణయించగల విశ్వజనీన ప్రమాణం ప్రపంచంలో లేదు. నీ సత్యంకంటె నా సత్యం ఎక్కువ సత్యమని చెప్పడానికైనా వీలులేదు.

అలాగే కాలక్రమాన సత్యం మారిపోతుంది. నీకు నిన్న నిజమనిపించింది ఇవాళ నిజం అనిపించకపోవచ్చు. కనుక అది నీకు నిన్న నిజం, ఇవాళ 'అనిజం'. ఏదైనా ఒకటి నిజం అంటున్నామంటే అది నిజం అనిపించినంత సేపే నిజం. ఆ తర్వాత 'అనిజం'.

కనుక సత్యం మనిషి మనిషికీ మారిపోవడమే కాదు. రోజురోజుకీ, గడియ గడియకీ మారిపోతుంది. ఇలా క్షణ క్షణం, వ్యక్తి వ్యక్తికీ సత్యం మారిపోతుంటే ఇక సత్యాన్వేషణ దేనికి? తత్వమీమాంస దేనికి? దండగ కాదా?

తత్వవేత్తలు రకరగాలుగా సత్య నిర్ణయం చేశారు. వాటిలో ఏది - నిజం? రెండు భిన్న, విరుద్ధ వాదాలుంటే రెండూ నిజమే కావచ్చు. వాటిలో ఒకటి మరొక దానికంటే ఎక్కువ నిజం అని చెప్పడానికి వీలులేదు.

## ఏది ఎక్కువ మంచిది?

కాని ఒక అభిప్రాయంకంటె మరొకటి ఎక్కువ నిజం కాకపోయినా, దానికంటె ఇది ఎక్కువ ఆమోదయోగ్యం కావచ్చు. ఉదాహరణకు కామెర్ల వ్యాధి వచ్చిన వాడికి అన్ని వస్తువులు పచ్చగా కనిపిస్తాయి. వాడి దృష్టికి ఆ పచ్చదనమే నిజం.

అయితే కామెర్లరోగం రావడంకంటె కామెర్లరోగం రాకపోవడం వాంఛనీయం కనుక, అన్ని వస్తువులు పచ్చగా వున్నాయనే అభిప్రాయంకంటె అన్ని వస్తువులు రకరకాల రంగులలో వున్నాయనే అభిప్రాయం ఎక్కువ వాంఛనీయం, ఎక్కువ ఆమోదయోగ్యం. అంటే అధిక సంఖ్యాకులు అంగీకరించే అభిప్రాయం ఎక్కువ నిజం కాకపోయినా, ఎక్కువ మంచిదని అర్థం చేసుకోవాలి. ("పదుగురాడు మాట పాడియై ధరజెల్లు.")

మొత్తంపై ప్రోటాగరస్ సిద్ధాంతం వట్టి వితండవాదంగా, పిడివాదంగా కనిపిస్తుంది. ఇతని గురించిన ఒక కథను బెర్ట్రాండ్ రస్సెల్ తన "హిస్టరీ ఆఫ్ వెస్టర్న్ ఫిలాసఫీ"లో ఉదాహరించాడు. ప్రోటాగరస్ ఒక యువకుడికి వాదవిద్య నేర్పాడట. ఆ యువకుడు చదువు పూర్తయిన తరవాత మొట్టమొదటి వ్యాజ్యంలో గెలిస్తే గురుదక్షిణ ఇచ్చుకోవాలి. గెలవకపోతే ఇవ్వనక్కరలేదు. ఇదీ షరతు. కాని, ఆ యువకుడు చదువు పూర్తయిన తర్వాత ఎంతకాలానికీ గురుదక్షిణ ఇవ్వలేదట. దానితో ప్రోటాగరస్‌కు కోపం వచ్చి తనకు అతడు బాకీ వున్నాడంటూ న్యాయస్థానంలో దావా వేశాడు. అందులో ఆ యువకుడు తన తరఫున తానే వాదించుకున్నాడు. అదే అతని మొదటి వ్యాజ్యం. షరతు ప్రకారం ప్రోటాగరస్‌కు గురుదక్షిణ వస్తుందా రాదా? ఆలోచించండి.

## గార్జియస్

ప్రోటాగరస్ తర్వాత సోఫిస్టు తాత్వికులలో గట్టివాడు గార్జియస్. ఇతడు క్రీస్తు పూర్వం 483 లో జన్మించి 375 వరకు - అంటే నూరేళ్లకు పైగా

- జీవించాడని ప్రతీతి. సిసిలీలో లియోంటినీ నగరంలో పుట్టాడు. గొప్ప వక్త, వాద చతురుడు. అందంగా, అద్భుతంగా వాదించి శ్రోతలను ముగ్ధులను చేసేవాడట.

ఒకసారి సిరక్యూజ్ నగర రాజ్యానికి, లియోంటినీ రాజ్యానికి పోరాటం సంభవించగా, సహాయం కోరవలసిందిగా ఏథెన్సు నగరానికి ఒక రాయబార బృందాన్ని లియోంటినీ వాసులు పంపించారట. ఆ బృందం నాయకుడు గార్జియస్. అతడు ఏథెన్సు వెళ్లి దాని శోభను చూసి ముగ్ధుడై అక్కడే స్థిరపడ్డాడట.

వాద చాతుర్యంలో ఇతడు ప్రోటాగరస్‌ను మించిపోయినట్టు కనిపిస్తుంది. ఇతడు కూడా తన పూర్వులవలె ఒక "ఆన్ నేచర్" గ్రంథం వ్రాశాడు. పరమ సత్యాలు, అంతిమ సత్యాలు, కేవలసత్యాలు లేవన్నది ఇతని సిద్ధాంతం. ఇంద్రియాలద్వారా లభించే జ్ఞానం ప్రామాణికం కాదు. అది నిరంతరం మారిపోతూ వుంటుంది. అలాగే మనస్సు ద్వారా లభించే జ్ఞానం కూడా విశ్వసనీయమైంది కాదు. మనస్సు వున్నదాన్ని, లేనిదాన్ని కూడా ఊహించగలదు. అందులో ఏది సత్యమో తెలుసుకోగల శక్తి మనస్సుకు లేదు.

"లేదు సుమా, ఏదీ లేదు సుమా!"

అందుచేత సత్యం అనేది లేదు. అంతేకాదు, అసలు ఏదీ లేదు- Nothing exists అని గార్జియస్ నిర్ధారణ చేశాడు.

ఒకవేళ ఏదైనా సత్యం వున్నప్పటికీ దాన్ని మనం తెలుసుకోలేమని, అది అజ్ఞేయమని అతడు చెప్పాడు.

ఇంకా కొంచెం ముందుకుపోయి, సత్యాన్ని ఒకవేళ మనం తెలుసుకున్నప్పటికి, దాన్ని ఇతరులకు తెలియజేయలేమన్నాడు.

ఎందుకంటే మనం తెలుసుకున్నదాన్ని ఇతరులకు తెలియజెప్పాలంటే దానికి భాష కావాలి. భాష అంటే శబ్దాలు. శబ్దం కాని సత్యాన్ని శబ్దం ఇతరులకు ఎలా తెలియజేయగలదు? అని గార్జియస్ ప్రశ్నించాడు.

ఉదాహరణకు "ఎరుపు" అనే మాట మనం ఉచ్చరించినప్పుడు ఒకానొక శబ్దం చెవికి వినిపిస్తుంది. కాని, ఎరుపు అనేది కంటికి కనబడే ఒక రంగు కదా? చెవికి వినబడే శబ్దం ద్వారా కంటికి కనబడే రంగును ఎలా తెలియజేయగలం? శబ్దం రంగు కాజాలదు కదా? ఒకవేళ తెలియజేస్తే ఎరుపు అనే శబ్దం ద్వారా మనం దేన్ని ఉద్దేశించామో, దాని యొక్క జ్ఞానమే అవతలివాడిలో కలుగుతున్నదని ఎలా చెప్పగలం?

## వాగర్థా వివ సంపృక్తౌ...?

శబ్దం ద్వారా శబ్దార్థాన్ని స్ఫురింపజేయజాలమని గార్జియస్ చెప్పినదాన్ని మరొక విధంగా కూడా నిరూపించవచ్చు. ఉదాహరణకు ఒక జనుషాంధుడిని— అంటే పుట్టుగుడ్డివాడిని— తీసుకుందాము. ఒక వస్తువు ఎర్రగా వున్నదని, అతని వద్ద ఎంత సేపు, ఎన్ని విధాలుగా వర్ణించినా ఎరుపురంగును గురించిన జ్ఞానాన్ని అతనికి కలుగ జేయడం సాధ్యమా? కనుక శబ్దంవేరు, శబ్దార్థంవేరు అన్నమాటే కదా!

శబ్దానికి, దాని అర్థానికి మధ్య అగాధం ఆధునిక కాలానికి చెందిన మనకు వాడగా వాడగా, అరిగిపోయి అర్థాన్ని కోల్పోయిన విషయం మనకు తెలిసినదే.

ఉదాహరణకు ప్రజాస్వామ్యం, సోషలిజం వంటి వివిధ పదాలు నిర్దిష్టార్థం కోల్పోయాయి. ప్రజాస్వామ్యం అనేదాన్ని సోవియట్ యూనియన్‌లో ఒక అర్థంలో ఉపయోగిస్తే అమెరికాలో మరొక అర్థంలో ఉపయోగిస్తారు. వ్యక్తి స్వేచ్ఛ అనే మాట కూడా అంతే. చాలా మాటలు ఒక్కొక్కరికి ఒక్కొక్క విధంగా అర్థం అవుతాయి. దీనివల్ల గందరగోళం ఏర్పడుతుంది.

ఈ గందరగోళం ఆధునిక కాలపు "అస్తిత్వవాదం" (Existentialism)లో ఒక ముఖ్య సిద్ధాంతం. ప్రపంచానికి, జీవితానికి అర్థం లేదని, అవి అసంబద్ధ మైనవని (L' absurdite) సార్త్రె, కామూస్ వంటి అస్తిత్వవాదుల ప్రవచనం.

ఈ అసంబద్ధతా వాదానికి సాహిత్య రూపమిచ్చినవారు శామ్యూల్ బెకెట్, యూజీన్ అయనెస్కో వంటి అసంబద్ధ నాటకాల (Plays of the absurd) రచయితలు. బెకెట్ వ్రాసిన "వెయిటింగ్ ఫర్ గోడో", అయనెస్కో వ్రాసిన "హౌ టు గెట్ రిడ్ ఆఫ్ ఇట్" వంటి నాటకాలలో శబ్దార్థాలమధ్య అగాధాన్ని (alienation) స్పష్టంగా చూడవచ్చు. "నిర్దేశించిన భావాలను వాక్యాలు బట్వాడా చెయ్యవు" అని ఆరుద్ర వ్రాసింది ఈ అగాధాన్ని దృష్టిలో పెట్టుకునే.

మొత్తంపై సోఫిస్టు తాత్వికులు తమ పిడివాదం ఎక్కడికి తీసుకుపోతే అక్కడి వరకు పోయారు. ఇంద్రియజ్ఞానం నమ్మడానికి వీలులేనిదన్నారు. కేవల జ్ఞానం (Absolute knowledge) అనేది అసాధ్యమన్నారు. కేవల సత్యం (Absolute truth) అనేది లేదన్నారు. సత్యం, అసత్యం అనేవి సాపేక్షమని (relative), ఒకరికి సత్యమైంది మరొకరికి అసత్యం కావచ్చునని, ఒకప్పుడు సత్యమైంది మరొకప్పుడు అసత్యం కావచ్చునని వాదించారు.

## సాపేక్ష నీతి

అంతటితో వారు ఆగలేదు. ఇదే సాపేక్షసూత్రాన్ని నీతి నియమాలకు

కూడా వర్తింపచేశారు. ఒకరికి నీతి అనిపించింది మరొకరికి నీతి కాకపోవచ్చు. ఒకప్పుడు నీతి అనిపించింది మరొకప్పుడు నీతి కాకపోవచ్చు. కేవల నీతి (Absolute virtue) అనేది లేదు.

మరి నీతిని కూడా ఇలా సాపేక్షంచేస్తే వైయక్తికం చేస్తే సంఘం ఎలా నడుస్తుంది? అంతా గందరగోళంగా తయారుకాదా?

ప్రోటాగరస్ ఇంత అడ్డగోలుగా వాదించలేదని బెర్ట్రాండ్ రస్సెల్ అభిప్రాయపడ్డాడు. అధిక సంఖ్యాకులు ఏది నీతి అంటే అది నీతి అవుతుందని సంప్రదాయ ప్రామాణ్యాన్ని ప్రోటాగరస్ ఒప్పుకున్నాడని రస్సెల్ వ్రాశాడు.

## అ తి వా దు లు

కాని, సోఫిస్టులలో మరీ తీవ్ర వాదులు కొందరున్నారు. వారు నీతి నియమాల ప్రామాణికతను, సార్వజనీనతను అంగీకరించలేదు. కాలిక్లీస్ అనే సోఫిస్టు తాత్త్వికుని సిద్ధాంతం ప్రకారం నీతి అనేది బలవంతులైన కొద్దిమందిని నిగ్రహించి అదుపులో వుంచడానికిగాను బలహీనులైన అధిక సంఖ్యాకులు కలిసి ఏర్పరచిన కట్టుబాటు. (ఆధునిక కాలంలో జర్మన్ తత్వవేత్త నీషే (1884-1900) భావాలకు ఇది దగ్గర.)

థ్రేసిమేకస్ అనే మరొక సోఫిస్టు వున్నాడు. అతని సిద్ధాంతం ప్రకారం నీతి అనేది బలహీనులైన అధిక సంఖ్యాకుల నిర్మాణం కాదు. అది కొద్దిమంది బలవంతులు అధిక సంఖ్యాకులైన బలహీనులను అణచి వుంచడానికి నిర్మించిన వ్యవస్థ. అంటే బలవంతుడు లేదా అధికారంలో వున్నవాడు ఏది నీతి అంటే అదే నీతి. ఏది అవినీతి అంటే అదే అవినీతి.

క్రీస్తు పూర్వం అయిదవ శతాబ్ది రెండవ అర్ధభాగంలో ఏథెన్సులోను, మిగిలిన గ్రీకు నగర రాజ్యాలలోను తత్వ మీమాంస ఇంత అడ్డ దిడ్డంగా తయారైంది. సోఫిస్టుల ఉపదేశాలు, వాదోపవాదాలతో సత్యం, జ్ఞానం, నీతి, నియమం వంటివన్నీ విలువను కోల్పోయాయి. ఈ అవ్యవస్థలోనుంచి ఒక వ్యవస్థను, ఒక పద్ధతిని సృష్టించి తత్వచింతనను పూర్వంకంటె పై స్థాయిలోకి తీసుకువెళ్లడానికి ప్రయత్నించినవారు సోక్రటీస్, అతని శిష్యుడు ప్లేటో.

## కొన్ని సత్ఫలితాలు

సోఫిస్టుల తత్వాన్వేషణ వట్టి వాచాలత్వంగా, శుష్క క్రీడగా, కోడిగుడ్డుకు ఈకలు పీకడంగా తయారైనప్పటికి వారు ప్రారంభించిన ఉద్యమంవల్ల తాత్విక

ప్రపంచంలో కొన్ని సత్ఫలితాలు కలుగకపోలేదు. సోఫిస్టులు ప్రతిదానిని ప్రశ్నిం చారు. ఎవరి ప్రమాణాన్ని కూడా వారు అంగీకరించలేదు. సంఘం ప్రమాణాన్ని సయితం వారు అంగీకరించలేదు. సార్వకాలికమైన సత్యంగాని, నీతిగాని లేవన్నారు.

ఒక ఆచారం, లేదా ఒక విశ్వాసం, ఒక వ్యవస్థ లేదా ఒక మతం తరతలాలుగా వస్తున్నంతమాత్రాన దాన్ని, ప్రశ్నించరాదని, ధిక్కరించరాదని, ఎక్కడా నిబంధన లేదన్నారు. ఇది విజ్ఞానశాస్త్రాల పురోగతికి, సాంఘిక, రాజకీయ వ్యవస్థలలో మార్పులకు దోహదంచేసిన ధోరణి అనడంలో సందేహం లేదు. అయితే ఈ ధోరణిని మరీ విపరీత స్థాయికి తీసుకపోవడమే సోఫిస్టులు చేసిన తప్పు.

## వ్యక్తి స్వేచ్ఛావాదం

వ్యక్తిని వారు విశ్వకేంద్రంలో నిలబెట్టారు. ఇది సమర్థించదగిందే. వ్యక్తి విలువను, వ్యక్తి శ్రేయస్సును మించిన సంఘ శ్రేయస్సు లేదు. అయితే ఈ వైయక్తిక వాదాన్ని (Individualism) మరీ విపరీత స్థాయికి తీసుకుపోవడమే సోఫిస్టులు చేసిన తప్పు. సోఫిస్టుల తాత్విక సిద్ధాంతాలను తూచా తప్పకుండా అనుకరిస్తే సంఘం అరాజకం కాకతప్పదు.

చారిత్రకంగా చూస్తే సోఫిస్టులను స్వేచ్ఛాలోచనా (free thinking) ధోరణికి ప్రోదిచేసినవారుగా గుర్తించవలసివస్తుంది. ఏది సత్యం, ఏది అసత్యం, ఏది నీతి ఏది అవినీతి అని మౌలికమైన ప్రశ్నలే వారు వేశారు.

ఇవే ప్రశ్నలను వేసి, సత్యాన్వేషణను నిర్మాణాత్మకమైన మార్గానికి మళ్లిం చిన మహామనీషి సోక్రటీస్.



# 11
# సోక్రటీస్ ఉజ్జ్వల జీవితగాథ

ధీరోదాత్తంగా జీవించినవారు ప్రపంచ చరిత్రలో అనేకు లున్నారు. కాని, ధీరోదాత్తంగా జీవించి, ధీరోదాత్తంగా మరణించిన వారు అరుదు. అట్టి అరుదైన మహా వ్యక్తులలో సోక్రటీస్ ఒకడు.

సోక్రటీస్ జీవితం ఎంత ఉత్తేజకరమైందో, మరణం అంత ఉత్తేజకరమైంది, అంత ఉజ్జ్వలమైంది. యోగివలె జీవించి, త్యాగివలె మరణించాడు. అతని వలె తమ విశ్వాసాల కోసం ప్రాణాలు తృణప్రాయాలుగా త్యజించగలవారు నూటికొకరు, కోటికొకరు కూడా వుండరు.

సోక్రటీస్ క్రీస్తు పూర్వం 470 లో ఏథెన్సులో జన్మించాడు. అప్పటికి ఏథెన్సు గ్రీకు రాజ్యాలన్నింటిలోకి ఉచ్చస్థితిలో వున్నది. అంతకు ఇరవై ఏళ్ల ముందు పర్షియనుల నుంచి గ్రీకు ప్రాంతాలను విముక్తం చేయడానికి జరిగిన యుద్ధాలలో అది గ్రీకులకు నాయకత్వం వహించి విజయం సాధించింది. ఆ తర్వాత పదేళ్లకు జరిగిన యుద్ధాలలో కూడా అది పర్షియన్‌లను తన నౌకా బలాధిక్యంతో ఓడించి, గ్రీకు రాజ్యాలలో తన ఉన్నత స్థానాన్ని నిలబెట్టుకున్నది. పెరిక్లీస్ నాయకత్వాన ఏథెన్సు గ్రీకులకు రాజకీయ, వాణిజ్య,

సాంస్కృతిక కేంద్రంగా భాసిల్లింది. సోక్రటీస్ యౌవనం పెరిక్లీస్ కాలంలోనే గడిచింది.

అప్పటివరకు ఏథెన్సు నగరానికి, తత్వచింతనకు సగమెరుక. అది ప్రధానంగా వాణిజ్య కేంద్రంగా వుండేది, మొదటిసారిగా అనగ్జాగరస్‌తోనే ఏథెన్సు పౌరులకు తత్వశాస్త్ర వాసన తగిలింది. అయితే అనగ్జారస్ ఏథెన్సులో పుట్టి పెరిగినవాడు కాదు. పెరిక్లీస్ ఆహ్వానంపై ఐవోనియానుంచి వచ్చి ఏథెన్సులో స్థిరపడినవాడు.

## గ్రీకు ఋషులు

కాగా, ఏథెన్సులో పుట్టి, పెరిగి, జీవించి మరణించిన మొదటి తత్వవేత్త సోక్రటీస్. అతనితో గ్రీకు తత్వశాస్త్రానికి ఏథెన్సు ప్రధాన కేంద్రమైంది. అతని శిష్యుడు ప్లేటో కూడా ఏథెన్సులో పుట్టి పెరిగినవాడే. ప్లేటో శిష్యుడు అరిస్టాటిల్ జన్మస్థలం ఏథెన్సు కాకపోయినా ఏథెన్సులో స్థిరపడి అక్కడే తన తత్వాధ్యయన కేంద్రాన్ని స్థాపించుకున్నాడు. పాశ్చాత్య తత్వశాస్త్రానికి ఈ ముగ్గురు మూల స్తంభాలవంటివారు. మీ ఋషులెవరని అడిగితే పాశ్చాత్యులు ఈ ముగ్గురి పేర్లే చెబుతారు. సోక్రటీస్ ప్లేటో, అరిస్టాటిల్ - అది వారి దార్శనికుల ప్రవర.

సోక్రటీస్ తండ్రి సోఫోనిస్కరస్ వృత్తి రీత్యా శిల్పి. తల్లి ఫీనారెటీ మంత్రసాని. పెద్దగా కలిగినవారు కాదు కాని, లేనివారు కూడా కాదు. తండ్రివలె సోక్రటీస్ కూడా శిల్పం అభ్యసించాడు. కాని అతనికి శిల్పవృత్తిపై మనసు పోలేదు. రేఖా గణితం, ఖగోళశాస్త్రం అధ్యయనం చేశాడు. కాని, అతనికి మైలీషియన్, ఇటాలియన్ తాత్వికుల విశ్వజిజ్ఞాస ఏమంత ఆసక్తి కలిగించలేదు. సోఫిస్టులవలె అతనికి కూడా మానవ జీవితమే అధ్యయన విషయమైంది.

ముఖ్యంగా సోక్రటీస్ జీవిత లక్ష్యాన్ని, జీవిత విధానాన్ని మార్చివేసిన సంఘటన ఒకటున్నది. ఒకసారి ఒక మిత్రుడితో కలిసి డెల్ఫీవద్ద గల అపోలో దేవాలయానికి వెళ్లాడు. అక్కడ అపోలో తనను ఉపాసించే గణాచారి ద్వారా ప్రశ్నలకు సమాధానాలు చెబుతాడని, తన సందేశాలు వినిపిస్తాడని ప్రతీతి.

## ఎవరు మహా జ్ఞాని ?

గణాచారి (Oracle) "ఎవరు మీరు?" అని ప్రశ్నించింది.

"నేను సోక్రటీస్‌ను. నాకు తెలిసింది ఒకటే- నాకు ఏమీ తెలియదని-" అన్నాడు సోక్రటీస్.

"ప్రపంచంలోకెల్లా మహాజ్ఞాని ఎవరు?" అని అతని మిత్రుడు ప్రశ్నించాడు.

"నిన్ను నీవు తెలుసుకో (Know thyself). మానవులలో సోక్రటీస్ కంటె మహాజ్ఞాని లేడు" అని గణాచారి దైవ సందేశం వినిపించింది.

ఈ సమాధానానికి సోక్రటీస్ నివ్వెరపోయాడు. తనకేమీ తెలియదనే విషయం తనకు తెలిసినందుకే తనను మహాజ్ఞానిగా గణాచారి వర్ణించిందా? లేక నిజంగా తాను అందరిలోకి తెలివైనవాడా? ఈ సంశయం అతనిని పీడించింది.

ఇక, ఆనాటి నుంచి తన కంటె జ్ఞానిని వెదికి పట్టుకోవాలని, డెల్ఫీ గణాచారి మాట నిజం కాదని రుజువు చేయాలని పట్టుదలతో సోక్రటీస్ అన్వేషణ ప్రారంభించాడు. ఆ నిరంతరాన్వేషణే అతని విషాద మరణానికి దారితీసింది.

తెలతెల వారుతుండగా వీధులలోకి బయలుదేరేవాడు త్రోవలో ఎవరు కని పిస్తే వారితో వాదం పెట్టుకునేవాడు. అతని వాద పద్ధతిని "డయలెక్టిక్" (గతి తార్కిక పద్ధతి) అంటారు. దీనిని ఈలియా నగరానికి చెందిన జీనో ప్రారంభించాడని మనం ఇంతకుముందు తెలుసుకున్నాము. ఆ పద్ధతిని ఒక గొప్ప కళగా పెంపొందించినవాడు సోక్రటీస్.

ప్రశ్న వేయడం, సమాధానం రాబట్టి దాన్ని పూర్వపక్షం చేసి మరొక ప్రశ్న వేయడం– ఈ విధంగా ఆ ప్రక్రియ నడుస్తుంది.

ఎంతటి మేధావినైనా అతడు వాదంలో చిత్తు చేసేవాడు. వాదంలో అతడిని ఓడించినవారు లేరు. తనకంటే మహాజ్ఞానిని కనుగొనాలన్న అతని జీవితాశయం నెరవేరలేదు.

## ఏ మి టి ది ?

"టో టి?" (to ti) అనే గ్రీకు మాట సోక్రటీస్ ఊతపదం. దాని అర్థం "ఏమిటిది?" అని.

"నీతి అంటే నీకు తెలుసునంటున్నావుకదా? నీతి అంటే నీ నిర్వచనం?"

స్నేహం అంటే ఏమిటి? ప్రేమ, న్యాయం, ధర్మం, జ్ఞానం, సౌందర్యం, సత్యం, దేశభక్తి, మతం, దేవతలు–ఒకటేమిటి? దేని ప్రసక్తి వస్తే దాన్ని ముందు స్పష్టంగా నిర్వచించమనేవాడు.

ఏ విషయమైనా సరిగా నిర్వచించడమే జ్ఞానం అనేవాడు. "జ్ఞానమే నీతి" (Virtue is knowledge) అనేవాడు. అంటే ఏది నీతి అనేది తెలుసుకుంటే మాన

వుడు అవినీతిని పరిహరించి నీతిమంతుడై జీవించగలడని అతని భావం. ప్రేమ, స్నేహం, ధైర్యం మొదలైన సద్గుణాల మౌలిక స్వభావాన్ని గుర్తెరిగితే మాన వుడు వాటిని తప్పక అలవరచుకుంటాడని, ఉత్తమ జీవితాన్ని గడపగలడని అతని నమ్మకం. కనుక సరియైన జ్ఞానానికి అతడు అధిక ప్రాముఖ్య మిచ్చేవాడు.

జ్ఞానం అనేది నేర్చుకుంటే వచ్చేది కనుక, జ్ఞానమే నీతి కనుక, నీతిని నేర్ప వచ్చునని అతని ఉద్దేశం.

## జోరీగ, మంత్రసాని

సోక్రటీస్ తనను తాను జోరీగ [Gadfly] గా వర్ణించుకున్నాడు. జోరీగ లాగా తోటి మానవులను కుట్టి వారిని ఆలోచించేటట్టుగా, సత్యాన్ని అన్వేషిం చేటట్లుగా చేయవలసిందని దేవుడు తనను ఆదేశించాడని అతడు చెప్పకున్నాడు.

అతడు తనను తాను మంత్రసానిగా కూడా వర్ణించుకున్నాడు. "మా అమ్మ మంత్రసాని-నేనూ అదే వృత్తిని స్వీకరించాను. నాతోటి మానవుల మనస్సులు ఉదాత్తమైన భావాలను ప్రసవించేటట్లు చేయడమే నా వృత్తి" అనేవాడు.

సోక్రటీస్ కురూపి అని ప్రతీతి. పొట్టిగా, లావుగా వుండేవాడు. బట్టతల, బానపొట్ట, వెడల్పాటి ముక్కు, వెడద నోరు, మిడిగుడ్లు, గుండ్రని ముఖం--ఇదీ అతని రూపం.

## దే శి కో త్త ము డు

అయితేనేం, అతడిని మానవోత్తముడుగా సమకాలికులు, తరువాతివారు కీర్తిం చారు. ఏథెన్సు నగరంలో అతనికి అనేకులు శిష్యులయ్యారు. వారిలో ఆనాటి కులీన కుటుంబాలకు చెందిన ధనికయువకు లనేకులుండేవారు. వారు అత డిని ప్రాణాధికంగా ప్రేమించేవారు, దేశికోత్తముడుగా గౌరవించేవారు. అతడు పురవీథులలో బయలుదేరితే వారు అతని వెంట నడిచేవారు. ఆనాడు మేధా వులుగా, రాజకీయ ప్రముఖులుగా, కళాకారులుగా, కవులుగా పేరుపొందినవారిని అతడు వాదంలో అవలీలగా తలకిందులు చేస్తుండగా శిష్యులు సంతోషాతిరే కంతో చప్పట్లు చరిచేవారు. అతని వాగమృత ధారలను వారు తనివి తీరా ఆస్వాదించేవారు. అతని వాగ్ఝరిలో వారు సుస్నాతులై పునీతులమైనామని భావించేవారు. అతడు నోరు విప్పి మాట్లాడ మొదలు పెడితే అతని రూపం ఎవరికీ స్ఫురణలో వుండేది కాదు.

అతనికి రేపటి గురించిన చింతలేదు. కోరికోరి పేదరికాన్ని వరించాడు.

ప్రభుత్వోద్యోగాలు దొరకక కాదు. ఉద్యోగం చేస్తే తన నీతి నిజాయితీలకు తిలోదకాలివ్వవలసి వస్తుందని అతని భయం.

"ఇతరులు తినడానికిబ్రతుకుతారు. నేను బ్రతకటానికితింటాను"అనేవాడు.

## గయ్యాళి గంప

ఆలస్యంగా పెళ్లి చేసుకున్నాడు. భార్య పేరు జాంతిప్పీ. ఆమె గయ్యాళి గంపగా పేరు పొందింది. భర్తను అస్తమానం సాధించేది. కాని ఇందుకు ఆమెను తప్పు పట్టడానికి లేదు. బహుశా భర్త ఉద్యోగం సద్యోగం లేకుండా బలాదూరుగా తిరగడం, తన గతి, తన ముగ్గురు పిల్లల ఆలనాపాలనా చూడ కుండా తాను నిర్విచారంగా కూర్చోడం చూస్తే ఆమెకు అరికాలిమంట నెత్తి కెక్కేది. దానితో అతడు కనిపిస్తే తిట్టిపోసేది.

అందుకనే అతడు సాధారణంగా ఇంటిపట్టున వుండేవాడు కాడు. ఏ నాలుగు వీథుల కూడలిలోనో, ఏ దేవాలయం మెట్ల మీదనో, ఎవరింటిలోనో, ఎవరితోనో, జీవిత సత్యాలను నిర్వచిస్తూ, వాదిస్తూ, భేదిస్తూ రోజంతా గడిపేవాడు. ఎవరైనా ఆహ్వానిస్తే వారితోవెళ్లి కడుపునిండా భోజనం చేసేవాడు. లేకపోతే అంతే నిర్విచారంగా పస్తు పడుకునేవాడు. "ఆహారానికి రుచి కలిగించేది ఆకలి" అనేది అతని మరొక సూక్తి.

## తత్వ మధుపాన గోష్ఠి

కాని, అతని శిష్యులు, అభిమానులు అతడు తమ ఇంటికి వచ్చి తమతో విందారగించడమే మహాభాగ్యంగా భావించేవారు. అతనికి మద్యపానం అలవాటు లేదు. కాని, ఎప్పుడైనా మిత్రులు మొగమాట పెడితే తాగేవాడు. వాగడంలో వలె తాగడంలో కూడా అతనితో పోటీలో ఎవరూ నెగ్గేవారుకారు. ఎంత తాగినా చెక్కు చెదిరేవాడు కాడు. విందు తర్వాత పానగోష్ఠి, దానితోపాటు తత్వగోష్ఠి—అలా రాత్రి బాగా పొద్దుపోయేవరకు కాలక్షేపం చేసేవాడు. ఒకరి తర్వాత ఒకరు మత్తెక్కి పడిపోయిన తర్వాత, వారిని సరిగా పడుకోబెట్టి, దుప్పట్లు కప్పి తన దారిన తను పోయేవాడు. మళ్లీ తెల్లవారుతూనే తనతో వాదించేవారిని వెదుకుతూ ఊళ్లోకి బయలుదేరేవాడు. అతని జీవితం నిరంతర సత్యాన్వేషణోత్సవ యాత్రగా గడిచేది.

అతనికి ఒకే ఒక పాతకోటు వుండేది. వేసవికానీ, చలికాలంకానీ అదే తొడిగేవాడు. లోపల చొక్కా వుండేది కాదు. కాలికి జోళ్లు వుండేవి కావు. ఎంత చలికాలమైనా అలాగే తిరిగేవాడు. స్థితప్రజ్ఞతకు మూర్తీభవన్నిర్వచనంలా

వుండేవాడు. అతడు ఒకప్పుడు సైనికుడుగా యుద్ధాలలో పాల్గొన్నాడు. ఒకసారి చలికాలంలో జోరుగా మంచు కురుస్తుండగా, తోటి సైనికులంతా వంటినిండా దుస్తులు వేసుకుని, దుప్పట్లు కప్పుకుని, కాళ్ళకి జోళ్లు తొడుక్కుని కూడా మంచుమీద నడవలేక, నడవలేక నానా అవస్థలు పడుతూ నడుస్తున్నారు. సోక్రటీస్ మాత్రం వంటిపై చింకి కోటు తప్ప మరేమీ లేకుండా, జోళ్లులేని కాళ్లతో మంచుమీద ఏమీ ఎరగనట్టు చిద్విలాసంగా మైళ్లకి మైళ్లు నడిచాడు.

## అంతర్వాణి

అతనికి అంతర్వాణి ప్రబోధం వినబడేదట. అది అతనికి ఏమిచేయాలో చెప్పేది కాదు కాని, ఏమి చేయకూడదో చెప్పేదట. ఏదైనా ఒక పని చేయబోతుండగా అది మంచిదైతే అంతర్వాణి మౌనం వహించేది. చెడు పని అయితే వద్దుసుమా అని హెచ్చరించేది. అంతే, ఇక ఎవరు ఎంత బలవంతం చేసినా ఆ పని చేసేవాడు కాడు.

ఉండి వుండి సోక్రటీస్ ధ్యానసమాధిని పోలిన మైమరపులోనికి వెళ్లేవాడు. ఒకనాడు అతడు ఊరి వెలుపల ఒకచోట తూర్పు తెల్లవారుతున్న వేళ, టక్కున వున్నచోటనే నిలబడిపోయాడు. ఏదో జటిలతాత్త్విక సమస్య మెదడును బాధపెడుతున్నదో ఏమో, దాన్ని గురించి ఆలోచిస్తూ అలాగే వుండిపోయాడు. గంటల తరబడి స్థాణువులాగ, రాతి బొమ్మలాగ నిలబడ్డాడు. ఆ దృశ్యం చూసి జనం నెమ్మదిగా అతని చుట్టూ పోగయ్యారు. అతని కిదేమీ తెలియదు. ఇంకా ఆలోచిస్తున్నాడు. పొద్దు వాటారింది. ఆ వింతను తుదివరకు చూడడానికి జనం ఇళ్లకు వెళ్లి చాపలు తెచ్చుకుని రాత్రి అంతా ఆరుబయట పడుకుని, కూర్చుని జాగారం చేశారు. తెల్లగా తెల్లవారిన తరవాత అతడు సమాధి స్థితినుంచి మేల్కొని ఎవరినీ పలకరించకుండా తన దారిన తాను వెళ్లిపోయాడు.

ఇటువంటివే అతని గురించి ఎన్నో కథలున్నాయి. ఏథెన్సులో అగాతన్ అనే విషాదాంత కవి వున్నాడు. అతడు వ్రాసిన నాటకానికి పోటీలో ప్రథమ బహుమతి వచ్చింది. ఆనాడు అతడు మిత్రులందరికి విందు చేశాడు. సోక్రటీస్‌ను కూడా పిలుచుకురమ్మని అరిస్టోడెమస్ అనే మిత్రుడిని పంపించాడు. అతడు సోక్రటీస్‌ను వెంటపెట్టుకుని వస్తున్నాడు. మధ్యలో ఒకచోట సోక్రటీస్ ఏదో ఆలోచనలోపడి ఒకరి ఇంటి గుమ్మం ఎదుట ఆగిపోయాడు. అరిస్టోడెమస్ అది గమనించకుండా అగాతన్ ఇంటికి వెళ్లాడు. "సోక్రటీస్ ఏడీ?" అని అగాతన్ ప్రశ్నించాడు. వెనుకకు తిరిగి చూస్తే సోక్రటీస్ లేడు. విందు సగం వరకు అయిపోయాక గాని సోక్రటీస్ రాలేదు.

## "ప్రేమ యన నేమి?"

ఆనాటి విందులో ఏథెన్సులోని కవులు, కళాకారులు, తాత్వికులు ఎందరో పాల్గొన్నారు. "ప్రేమ" అనే విషయమై చర్చ జరిగింది. "మధ్యమధ్యే పానీయం సమర్పయామి" అన్నట్టు అగాతన్ అందరికి మద్యం అందిస్తుండగా రసవద్గోష్ఠి కొనసాగింది. ప్రేమను ఎవరికి తోచినట్టు వారు నిర్వచించారు. సోక్రటీస్ అన్ని నిర్వచనాలను పూర్వపక్షం చేశాడు.

"ప్రేమ అంటే దివ్య సౌందర్యానుభూతికోసం మానవాత్మ అర్రులుచాచడం. ప్రేమికుడు సౌందర్యాన్ని దర్శించడమే కాక, దాన్ని సృజించాలని, శాశ్వతీకరించాలని, భౌతిక దేహంలో అమరత్వబీజాన్ని ప్రతిష్ఠించాలని తహతహలాడుతాడు. అందువల్లనే స్త్రీ పురుషులు పరస్పరం ప్రేమించుకుంటారు. అందుకే తల్లిదండ్రులు తమ సంతానాన్ని ప్రేమిస్తారు. వారు కనేది కేవలం సంతానమే కాదు. నిరంతర సౌందర్యాన్వేషణలో తమ భాగస్వాములను, తమ వారసులను, అన్వేషకులను కంటారు."

ప్రేమ ద్వారా మనం శాశ్వతీకరించగోరుతున్న ఈ సౌందర్యం ఏమిటి? అది వివేకం, సచ్ఛీలం, ఆత్మగౌరవం, ధైర్యం, న్యాయం, విశ్వాసం, ఒక్క మాటలో చెప్పాలంటే సౌందర్యం అంటే సత్యం. "దేవుని వద్దకు మనలను సరాసరి చేర్చేదే సత్యం."

ఈ విధంగా సోక్రటీస్ ఆనాటి విందులో ప్రేమను గురించి, సత్యం, శివం, సుందరం గురించి తన అభిప్రాయాలను విశదీకరించాడు. అతని శ్రోతలలో ఒకడు ప్రసిద్ధ సుఖాంత నాటక రచయిత అరిస్టోఫనీస్. ఇతడు అంతకు ముందు సోక్రటీస్‌ను వ్యంగ్యంగా విమర్శిస్తూ "ది క్లౌడ్స్" (మేఘాలు) అని ఒక నాటకం వ్రాశాడు కూడా. అయినా, అతనికి సోక్రటీస్ పట్ల అభిమానం లేకపోలేదు.

మరొకశ్రోత యువకుడు, ధనికుడు స్ఫురద్రూపి అయిన ప్లేటో. తత్వశాస్త్రప్రపంచంలో అజరామరకీర్తిపొందిన ప్లేటో సోక్రటీస్‌కు భాష్యకారుడు, ప్రియశిష్యుడు.

## డైలాగ్ రచయిత ప్లేటో

సోక్రటీస్ తన తాత్విక భావాలను స్వయంగా గ్రంథస్థం చేయలేదు. ఆ పని ప్లేటో చేశాడు. తన గురువు భావాలను, జీవిత విశేషాలను అతడు గ్రంథస్థం చేశాడు. ప్లేటో మహా రచయిత. "డైలాగ్స్" (సంభాషణలు, లేక

సంవాదాలు) అనే ప్రక్రియను అతడు ఎంచుకున్నాడు. ఆ ప్రక్రియను సోక్రటీస్ భావాలను భావితరాలకు అందజేయడానికి ఉపయోగించుకున్నాడు.

ప్లేటో వచనశైలి అద్భుతమైనదని, అది కావ్య పరిమళాలను వెదజల్లుతూ వుంటుందని, అంతటి ఉదాత్త గంభీర రచనలు ప్రపంచ సాహిత్యంలో అరుదని పాశ్చాత్య విద్వాంసులు పేర్కొంటారు.

## గొప్ప డైలాగులు

సోక్రటీస్ జీవిత విశేషాలను తెలియజేసే డైలాగులలో ముఖ్యమైనవి నాలుగున్నాయి. ఒకటి "సింపోజియం." ఇందులో వస్తువు పైన పేర్కొన్న విందు, ప్రేమ తత్వ విచారం. రెండవది "అపాలజీ". దీనిలో సోక్రటీస్ తనపై ఆరోపణలకు సమాధానం చెబుతాడు. మూడవది "క్రిటో." దీనిలో మరణశిక్ష పడిన సోక్రటీస్‌కు క్రిటో అనే శిష్యుడు దేశాంతరానికి పారిపొమ్మని సలహా ఇవ్వడం, సోక్రటీస్ నిరాకరించడం వర్ణితమైంది. నాల్గవది "ఫీడో." దీనిలో సోక్రటీస్ మరణ సన్నివేశం. ఇది ఒక గొప్ప విషాదాంత కావ్యస్థాయిలో నడుస్తుంది. సోక్రటీస్ ధీరోదాత్త వ్యక్తిత్వం దానిలో అద్భుతంగా ఆవిష్కృతమైంది.

ఇక మిగిలిన డైలాగులలో ప్లేటో తన గురువును అడ్డం పెట్టుకుని ఆయన పేరుతో చాలవరకు తన స్వీయ తాత్విక సిద్ధాంతాలనే ప్రవచించాడని పండితులు అభిప్రాయపడుతున్నారు. అన్నిటిలోకి "రిపబ్లిక్" అనే డైలాగు జగత్ప్రసిద్ధమైంది. దానిలో సోక్రటీస్ ముఖతః ప్లేటో తన దృష్టిలో ఆదర్శ రాజ్య వ్యవస్థ ఏ విధంగా వుండాలో వర్ణించాడు. (దీన్ని ప్లేటో గురించిన అధ్యాయాలలో చూద్దాము.)

సోక్రటీస్ వాదప్రియుడని, వాద ప్రవీణుడని, వాదంలో అతడిని ఓడించగలవారు లేరని ఇంతకుముందు చెప్పుకున్నాము. అతనితో వాదంలో ఓడిపోయినవారందరు అతనిపట్ల ద్వేషం పెంచుకోవడంలో ఆశ్చర్యం లేదు. నలుగురిలో పరాభవం పొంది వూరుకోగలవారు ఎందరుంటారు? అతడు వారిని వాదంలోకి దింపి తమ అజ్ఞానాన్ని, తమ నైతిక, మేధా దౌర్బల్యాలను తమకు, ఇతరులకు కూడా బట్టబయలు చేయడం వారికి సహించరానిదైంది.

## నిర్వచనోత్తరుడు

పైగా అతడు ఇతరులను "ఈ విషయమై నీ ఉద్దేశం చెప్పు. ఈ మాటకు నీ నిర్వచనం ఏమిటో చెప్పు" అని వారిచేత చెప్పించి దాన్ని పూర్వపక్షం చేయడం తప్పితే తన నిర్వచనాలను చెప్పేవాడు కాదు. "నేను నిర్వచించ

గలిగితే మిమ్మల్ని ఎందుకు అడుగుతాను? నాకు తెలిసింది ఒక్కటే– నాకేమీ తెలియదని" అనేవాడు. కాని, ఇది గడుసుగా అన్నమాట. నిజానికి అతడు మహాజ్ఞాని. ఇతరుల నుంచి వారి అభిప్రాయాలను రాబట్టి, వారి చేత సత్యాన్వేషణ చేయించడానికే అతడు ఈ వాదప్రక్రియను అలంబనం చేసుకున్నాడు.

సోక్రటీస్ పట్ల ఏథెన్సులోని రాజకీయ నాయకులకు, పౌరులకు కూడా క్రోధ ద్వేషాలు కలగడానికి మరికొన్ని ముఖ్య కారణాలున్నాయి. అతడు ఏథెన్సు పౌరులకు ఆరాధ్యులైన ఒలింపియన్ దేవతలను విమర్శించేవాడు. దీనితో అతనికి నాస్తికుడని పేరు వచ్చింది. కాని, నిజానికి అతడు నాస్తికుడు కాడు. ఒకే దేవుడున్నాడని, ఆత్మ అనశ్వరమని అతడు విశ్వసించాడు. అయినా, అది ఆనాటి మతవిశ్వాసాలకు విరుద్ధం కనుక ఏథెన్సు ప్రజలు అతడిని సహించలేకపోయారు.

అతడు ఊరికే ఊసుపోకగా ప్రశ్నలు వేయడం కాదు. నాటి రాజకీయ, సాంఘిక, మత విశ్వాసాల పునాదులను కదలించివేసే ప్రశ్నలు వేసేవాడు. ఆ విశ్వాసాలు ఎంత పనికిమాలినవో నిరూపించేవాడు. ముఖ్యంగా అతడు అప్పటి ప్రజా స్వామ్య వ్యవస్థకు వ్యతిరేకి. ప్రజాస్వామ్యం అంటే గుంపు బలంపై ఆధారపడిన వ్యవస్థ కనుక, ఆ వ్యవస్థలో క్షుణ్ణంగా ఆలోచించి సరైన నిర్ణయాలు చేయడం జరగదని, ఆవేశంతో కూడిన అవివేక నిర్ణయాలకు మాత్రమే ఆస్కారం కలదని అతని నమ్మకం.

ఆనాటి రాజకీయ పరిస్థితి కూడా అతనిపట్ల ప్రజల క్రోధానికి కారణమైంది. అప్పటివరకు గ్రీకు రాజ్యాలలో ఏథెన్సుకు ప్రబల ప్రతిద్వంది స్పార్టా. ఏథెన్సు నౌకాబలంలో మిన్న కాగా స్పార్టా కాల్బలంలో మిన్న. ఉభయరాజ్యాల స్పర్ధలు రాజుకుని, రగులుకుని యుద్ధంగా పరిణమించాయి. దాన్నే పెలోపొన్నీసియన్ యుద్ధం అంటారు.

ఆ యుద్ధంలో చివరికి (క్రీస్తు పూర్వం 404) ఏథెన్సు ఓడిపోయింది. ఏథెన్సులోని ప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని పడగొట్టి "30 మంది నిరంకుశులు" (thirty tyrants) అధికారానికి వచ్చారు. కాని, వారి ప్రభుత్వం కూడా ఎక్కువకాలం కొనసాగలేదు. వారిపై ప్రజలు తిరుగుబాటు చేసి తిరిగి ప్రజాస్వామ్య ప్రభుత్వం అధికారానికి వచ్చింది. రావడమే తడవుగా తన విరోధులైన వారందరిని మట్టు పెట్టడానికి ప్రభుత్వం నిశ్చయించింది.

## సోక్రటీస్‌పై ఆరోపణ

ఆ విధంగా దాని దృష్టిలో పడిన ప్రబల విరోధులలో సోక్రటీస్ ఒకడు. ఈ

జోరీగను వదిలించుకోవాలని ప్రజలు, ప్రభుత్వం కూడా భావించారు. క్రీస్తు పూర్వం 399 లో ఒకానొక రోజున సోక్రటీస్ అలవాటు ప్రకారం బజారులోకి వచ్చేసరికి అతనిపై ఈ క్రింది ఆరోపణ జరిగింది.

"సోక్రటీస్ నేరస్తుడు. మన నగరానికి ఆరాధ్యులైన దేవతలను అతడు నిరాకరించడం, కొత్త దేవతలను ఆరాధించడం ఒక నేరం. కాగా మన యువ తరాన్ని పాడుచేయడం మరొక నేరం. ఇందుకు శిక్ష మరణశిక్షే."

# సోక్రటీస్ ఉజ్జ్వలతర మరణగాథ

సోక్రటీస్‌పై అభియోగం తీసుకువచ్చిన వాడు అనీటస్. ఇతడు ఏథెన్సులో కొత్తగా అధికారానికి వచ్చిన ప్రజాస్వామ్య ప్రభుత్వ నాయకుడు. అతని కుమారుడు సోక్రటీస్ శిష్యుడు. అతడు తండ్రినే ధిక్కరించాడు. దానితో అనీటస్‌కు సోక్రటీస్ పట్ల ద్వేషం మరింతగా పెరిగింది.

అయిదువందల మంది న్యాయనిర్ణేతలతో కూడిన న్యాయస్థానంలో సోక్రటీస్‌పై చరిత్రాత్మకమైన విచారణ జరిగింది. ప్రభుత్వం తరపున ప్రాసిక్యూషన్ నడిపించినవాడు మిలేటస్.

చివరికి తీర్పు వచ్చింది. సోక్రటీస్‌కు మరణదండన విధించాలని 280 మంది, అతడు నిర్దోషి అని 220 మంది అభిప్రాయపడ్డారు. మరణశిక్ష ఖాయమైంది. హెమ్‌లాక్ అనే విషం త్రాగించడం ద్వారా మరణశిక్ష అమలు చేయాలని నిశ్చయించారు.

ఈ ఓటింగ్‌పై వ్యాఖ్యానిస్తూ సోక్రటీస్ "చాలాకొద్ది తేడాతో న్యాయస్థానం నాకు మరణదండన విధించింది. నేను ఇంకా ఎక్కువమందే నాకు వ్యతిరేకులని అనుకున్నాను. ఒక్క 30 మంది ఇటుకాక అటు ఓటు చేసి వుంటే నేను విడుదల అయి వుండేవాడిని" అన్నాడు.

## స్వచ్ఛంద శిక్ష

అనాటి ఏథెన్సు శాసనం ప్రకారం మరణదండన పొందినవాడు తనకు మరొక శిక్ష కోరుకొనడానికి అవకాశం వుండేది. ఉదాహరణకు సోక్రటీస్ కారాగారశిక్ష కోరుకుని వుండవచ్చు. లేదా తగినంత జుల్మానా చెల్లించి విడుదల అయి వుండవచ్చు, లేదా దేశాంతరవాసాన్ని కోరుకుని ఏథెన్సును విడిచిపెట్టిపోయి వుండవచ్చు. కాని, వీటిలో దేన్నీ అతడు కోరుకోలేదు. ఇచ్ఛాపూర్వకంగా మరణశిక్షనే కోరుకున్నాడు.

న్యాయస్థానంలో సోక్రటీస్ తనను తాను నిర్దోషిగా సమర్థించుకుంటూ చేసిన సుదీర్ఘవాదాన్ని ప్లేటో "అపాలజీ" అనే డైలాగ్‌లో గ్రంథస్థం చేశాడు. విచారణ సమయంలో ప్లేటో కూడా వున్నాడు కనుక, సోక్రటీస్ మరణానంతరం కొన్నాళ్లకే అది వ్రాశాడు కనుక, "అపాలజీ" చాలవరకు చారిత్రకంగా వాస్తవమైనదేనని పరిశోధకులు అభిప్రాయపడుతున్నారు.

ప్రత్యామ్నాయ శిక్షలేవీ తనకు సమ్మతం కావని చెబుతూ సోక్రటీస్ "మరణం మంచిదో చెడ్డదో నాకు తెలియదు. కాని జుల్మానా చెల్లించడం, కారాగారాన్ని లేదా దేశ బహిష్కారాన్ని కోరుకోవడం నిస్సందేహంగా చెడ్డవి. అయినప్పుడు చెడ్డవాటిని తెలిసి తెలిసి నేనెందుకు కోరుకుంటాను?" అని ప్రశ్నిస్తాడు.

## సోక్రటీస్ వాదం

"నేను ఏథెన్సులో పుట్టి పెరిగి జీవించిన వాడిని. మీరు, నేను సహపౌరులం. నా సంగతి మీకు తెలుసు, మీ సంగతి నాకు తెలుసు. పొద్దస్తమానం వాదించే నా స్వభావాన్ని మీరే భరించలేకపోతే ఇక అన్య దేశాలవారు ఎందుకు సహిస్తారు? మీరు వెళ్లగొట్టినట్టే వారూ నన్ను వెళ్లగొడతారు. నేను వయోవృద్ధుడిని, ఈ వయస్సులో నేను దేశంనుంచి దేశానికి ప్రవాసినై తిరగగలవనే మీరు అనుకుంటున్నారా" అని ప్రశ్నిస్తాడు.

"పోనీ నోరు మూసుకుని పడి వుండరాదా? అని మీరు అనవచ్చు. కాని, అది నాకు నచ్చదు. సూక్ష్మ పరిశీలనకు గురికాని జీవితం వృథా కాదా?" అంటాడు.

సాధారణంగా న్యాయస్థానంలో మరణశిక్ష పడినవారు తమ పిల్లలను హాజరు పెట్టి వారిని చూపించి దయాభిక్ష కోరుకుంటారని, కాని అలాంటి నీచపద్ధతిని తాను అవలంబించబోనని సోక్రటీస్ అంటాడు. లేదా తానే స్వయంగా ఏడ్చి, మొత్తుకుని, కాళ్లపై పడి క్షమాపణ కోరుకుని వుండవచ్చు. కాని, అది తనలాంటివాడు చేయవలసిన పనికాదని, ఆ పద్ధతిని కూడా అతడు తిరస్కరిస్తాడు. "నా పద్ధతిలో వాదించి మరణించడానికైనా సిద్ధపడతాను కాని, మీ పద్ధతిలో వాదించి జీవించడానికి అంగీకరించను. అయినా, మరణించడానికి మానవులు ఎందుకు భయపడతారో నాకు అర్థం కాదు. మరణశిక్షను తప్పించుకుంటే శాశ్వతంగా జీవించవచ్చునని వారి ఉద్దేశమా?" అని ప్రశ్నిస్తాడు.

## మృత్యు నిర్వచనం

మృత్యువుకు సోక్రటీస్ ఇచ్చిన నిర్వచనం చాలా ఆసక్తికరమైంది. "మృత్యు

వంటి చైతన్య రహితమైన శూన్యస్థితి అయినా కావాలి. లేదా మానవాత్మ ఇహలోకం నుంచి పరలోకానికి పయనించడమైనా కావాలి."

చైతన్య రహితస్థితే మృత్యువనుకోండి. అంటే అది కలలురాని గాఢ సుషుప్తి వంటి స్థితి కావచ్చు. మానవులకు అటువంటి సుషుప్తి ఎప్పుడోగాని రాదు. సాధారణంగా కలలతో కూడిన కలత నిద్రపోయే రాత్రులే ఎక్కువ. ఈ రెండింటిలో గాఢసుషుప్తినే ఎవరైనా కోరుకుంటారు. మృత్యువంటే తిరిగి మెల కువరాని శాశ్వత గాఢ సుషుప్తి అయితే అంతకంటే కోరదగిన దేముంది?

అలాకాక మానవాత్మ పరలోకానికి చని పోవడమే చావు అంటారా? అపుడు ఆత్మ అనశ్వరమవుతుంది. పరలోకంలో హోమర్, హిసియాడ్ ఇంకా ఎంద రెందరో మహామహులుంటారు. వారితో అనంతంగా వాదిస్తూ గడపడంకంటె కావలసినదేముంది? మొత్తంపై ఏ విధంగా చూసినా మృత్యువు కోరదగిందే అవుతున్నది."

## ఏది మంచిది ?

ఈ విధంగా న్యాయస్థానంలో సోక్రటీస్ వాదన సాగింది. చివరగా "ఇక నిష్క్రమించవలసిన సమయం ఆసన్నమైంది. నేను మరణాభిముఖంగా, మీరు జీవితంవైపుగా... ఈ రెండింటిలో ఏది మంచిదో ఆ దేవుడికే తెలియాలి..." అని తన వాదాన్ని ముగిస్తాడు సోక్రటీస్.

మరణశిక్ష పడిన తర్వాత అది వెంటనే అమలు కాలేదు. అప్పుడు గ్రీసులో ఒక నెలపాటు పరవడి రోజులు. ఆ నెల రోజులు రక్తపాతం జరగరాదు. ఎవరికి మరణశిక్ష అమలు జరపరాదు. అందుచేత సోక్రటీస్ మరణశిక్షకు ఎదు రుచూస్తూ కారాగారంలో ఒక నెల గడపవలసి వచ్చింది.

ఈ నెల రోజులలోను సోక్రటీస్ స్నేహితులు అతడిని దేశాంతరం పారిపో వలసిందిగా ఎన్నో విధాలుగా బ్రతిమాలారు. కాని వారి సలహాను సోక్రటీస్ తిరస్కరించాడు.

ఈ ఉదంతాన్ని "క్రిటో" అనే డైలాగ్‌లో ప్లేటో వివరించాడు. అది అచ్చుగా ఒక నాటకంవలె నడుస్తుంది. స్థలం కారాగారం. సమయం తెలతెల వారు తుండగా. పాత్రధారులు సోక్రటీస్, క్రిటో.

జైలు అధికారులకు, కాపలాదార్లకు, తాను లంచాలిస్తానని, వారు సుర క్షితంగా జైలునుంచి తప్పించుకోనిస్తారని క్రిటో చెబుతాడు. సోక్రటీస్ కనుక శిక్ష ప్రకారం మరణిస్తే, తానొక ఉత్తమ స్నేహితుడిని కోల్పోవలసి రావడం

అటుంచి జనాపవాదం కూడా భరించవలసి వస్తుందని క్రిటో అంటాడు. సోక్రటీస్‌కు ఎందరో ధనికులైన స్నేహితులు, శ్రేయోభిలాషులు వున్నారు కదా! వారు జైలు కావలా వారికి లంచమిచ్చి తప్పించగలిగి కూడా డబ్బు ఖర్చుకు వెనుకాడి సోక్రటీస్‌ను చనిపోనిచ్చారని జనం నిందిస్తారని, తామెంత చెప్పినా జైలు నుంచి పారిపోవడానికి సోక్రటీస్ ఒప్పుకోలేదంటే జనం నమ్మరని క్రిటో ఎన్నో రకాలుగా చెబుతాడు.

## "మరణం మేలు"

కాని, అతని వాదాలన్నిటిని సోక్రటీస్ పూర్వపక్షం చేస్తాడు.

"నేను నా జీవితంలో కొన్ని సిద్ధాంతాలకు, నీతి నియమాలకు కట్టుబడి వున్నాను. వాటిని ప్రచారం చేశాను. వాటి కారణంగానే నాకు మరణదండన విధించారు. ఇప్పుడు ప్రాణాలపై తీపితో నేను శిక్షనుంచి పారిపోతే నా సిద్ధాంతాలను, నీతి నియమాలను నేనే కాలదన్నినట్టు కాదా? దానివల్ల కలిగే అప్రతిష్ఠకంటె మరణమే మంచికాదా?" అని సోక్రటీస్ వాదిస్తాడు.

ఆ తర్వాత అతడు తనకు మరణశిక్ష విధించిన ఏథెన్సు నగర పౌరుల తరపున వకాల్తా పుచ్చుకుని శిక్షనుంచి పారిపోవడం ఏవిధంగా దేశద్రోహం కాగలదో నిరూపిస్తాడు. ఆ నగరంలో తను పుట్టి పెరిగాడు. ఆ నగరం, దాని శాసనాలు, ప్రభుత్వం తన నింతవరకు కాపాడాయి. కనుక, ఆ శాసనాలు, ప్రభుత్వం అన్యాయమైనవైనా సరే, అవి తనకు మరణశిక్ష విధించినవైనా సరే వాటిని ధిక్కరించడం దేశద్రోహం అవుతుందని అంటాడు. వ్యక్తికంటె దేశం గొప్పదంటాడు. దేశంకోసం వ్యక్తి త్యాగం చేయాలంటాడు.

సోక్రటీస్ తాను ఎందుకు మరణశిక్షను తప్పించుకోరాదో అంత బలంగా, సుదీర్ఘంగా వాదించడంతో క్రిటో నిరుత్తరుడవుతాడు. నిజమే, సోక్రటీస్ మరణించ వలసిందేనని అంగీకరిస్తాడు.

## మరణ సన్నివేశం

ఆ తరవాత కథను "ఫీడో" అనే డైలాగ్‌లో ప్లేటో ఎంతో రసవంతంగా వివరిస్తాడు. సోక్రటీస్ మరణ సన్నివేశం ఒక గొప్ప కథా కావ్యంవలె కరుణ రసభరితంగా దానిలో వర్ణితమైంది. ఇది ఫీడో అనే మరొక శిష్యుడు తన మిత్రులకు చెబుతున్నట్టుగా వ్రాసినట్టుంది.

...అతడు లేచాడు. క్రిటోతో కలిసి స్నానాల గదిలోకి వెళ్లాడు. మమ్మల్ని

అక్కడే వుండమన్నాడు. మేము గురు వియోగ దుఃఖాన్ని గురించి మాట్లాడుకుంటూ, ఆలోచిస్తూ వేచివున్నాము.

అతడు మాకు తండ్రి వంటివాడు. అటువంటివాడిని మేము శాశ్వతంగా కోల్పోబోతున్నాము. మా శేష జీవితాలను అనాథలవలె గడపబోతున్నాము.

సూర్యాస్తమయ సమయం ఆసన్నమవుతోంది. అతడు లోపల చాలాసేపు వున్నాడు.

## జైలర్ దుఃఖం

బయటికి వచ్చాడు. మమ్మల్ని కూర్చోమన్నాడు. ఎవరం ఏమీ మాట్లాడలేదు... ఇంతలో జైలర్ వచ్చాడు. అతని ప్రక్క నిలబడి "సోక్రటీస్! ఈ జైలుకి వచ్చిన వారందరిలోకి నీవు ఉత్తముడివి, ఉదాత్తుడివి, సజ్జనుడివి. సాధారణంగా నేను మరణ శిక్ష విధింపబడినవారిని అధికారుల ఆజ్ఞానుసారం విషం త్రాగాలని కోరినప్పుడు వారు నన్ను దూషిస్తారు. తమ కోపమంతా నాపై చూపిస్తారు. నువ్వు అలా చేయవని నాకు తెలుసు. నీకు నాపై ఎట్టికోపం లేదని నేనెరుగుదును. నీ శిక్షకు కారణం నేను కాదని, ఇతరులని నీకు తెలుసు. ఇక నేను వెడతాను. జరగవలసిన దాన్ని విచార రహితంగా అనుభవించడానికే ప్రయత్నించు. నా కర్తవ్యం నీకు తెలిసిందే కదా!" అంటూ అతడు కన్నీరు ఆపుకోలేక ముఖం పక్కకు తిప్పుకున్నాడు.

సోక్రటీస్ అతనితో "నీకు కూడా మేలుకలగాలని కోరుతున్నాను. నీవు చెప్పినట్టే చేస్తాను" అని మాకేసి తిరిగి ఇలా అన్నాడు :

"చూడండి, పాపం అతడెంత మంచివాడో, నేను ఈ కారాగృహానికి వచ్చినప్పటినుంచి అతడు తరుచుగా నన్ను చూడడానికి వస్తూనే వున్నాడు... ఇప్పుడు చూడండి, నాకోసం ఎంత బాధపడుతున్నాడో - కాని, క్రిటో! అతడు చెప్పినట్టు చేయాలి మనం. విషం కనుక సిద్ధమైతే పాత్రను తీసుకు రమ్మనండి. తయారు కాకపోతే తయారు చేయమని నౌకరుతో చెప్పండి" అన్నాడు.

ఇది విని క్రిటో "తొందరేముంది? సూర్యుడింకా పడమటి కొండపైనే వున్నాడు. చాలామంది మరణశిక్ష పడినవాళ్లు బాగా పొద్దు పోయాకగాని విషం తీసుకోరు. విషం త్రాగాలని ఆజ్ఞాపించిన తరవాత కూడా శుభ్రంగా తినడం, తాగడం, అన్ని భౌతిక సుఖాలు అనుభవించడం పరిపాటి. అందుచేత తొందరవద్దు. ఇంకా వ్యవధి వుంది" అన్నాడు.

కాని సోక్రటీస్ దీనికి ఒప్పుకోలేదు. "నిజమే క్రిటో! కొందరు నీవు చెప్పి

నట్టే చేస్తారు. వారికది తగినపనే. ఏమంటే, ఆలస్యం చేసినకొద్దీ ఏదైనా మేలు జరగవచ్చునని వారి ఆశ. కాని, నా దృష్టిలో నేను తొందరగా విషం పుచ్చుకోవడమే మంచిది. విషపానం ఏ కొద్దిగానో ఆలస్యం చేసినంత మాత్రాన నాకు ఒనగూడే మేలు ఏమీ లేదు. ఎలాగూ నా జీవితం అంతమైంది. ఆలస్యం చేస్తే దాన్ని కొద్ది సేపు పొడిగించడం మాత్రమే జరుగుతుంది. అలా చేయడం నాకు హాస్యాస్పదంగా కనిపిస్తుంది. కనుక నేను చెప్పినట్టు చెయ్యి, కాదనకు," అన్నాడు.

## విష కలశం

క్రిటో సరేనన్నాడు. నౌకరుకు సైగచేశాడు. నౌకరు లోనికి వెళ్లాడు. కొంచెం సేపు అయ్యాక విషపాత్ర తీసుకొని జైలరుతో కలిసి వచ్చాడు.

సోక్రటీస్ అన్నాడు : "స్నేహితుడా! నీవు ఇలాంటి వెన్నో చూసి వుంటావు. ఏమి చేయాలో చెబుతావా!"

అతడన్నాడు : "నీ కాళ్లు బరువెక్కేవరకు నీవు అటూ ఇటూ పచార్లు చేయాలి. తర్వాత పడుకోవాలి. అప్పుడు విషం దాని పని అది చేస్తుంది" ఇలా అంటూ అతడు సోక్రటీస్‌కు విషకలశం అందించాడు.

సోక్రటీస్ తొణకలేదు, బెణకలేదు, జంకలేదు, వెనుకంజ వేయలేదు. అతని ముఖకవళిక మారలేదు. ముఖం వెలవెల పోలేదు. తన అలవాటుకొద్దీ జైలరును ఒళ్లంతా కళ్లు చేసుకుని చూస్తూ పాత్ర అందుకుని "ఇందులో కొంత ఏ దేవతకైనా నైవేద్యంగా ఇస్తే..." అన్నాడు.

"కాని సోక్రటీస్! మేము సరిగా ఎంత అవసరమో అంతేతయారుచేస్తాము."

"ఓ, అలాగా? అయితే, నేను దేవతలను ప్రార్థిస్తాను. ఇక్కడినుంచి పరలోకానికి నా యాత్ర సుఖంగా జరిగేటట్టు చేయవలసిందని కోరుతాను. ఈ ప్రార్థనను వారు మన్నిస్తారని ఆశిస్తాను."

—ఇలా అంటూ అతడు పాత్రను పెదవులకు ఎత్తి నిర్భయంగా, మందహాస పూర్వకంగా విషం త్రాగాడు.

## "ఎవరూ ఏడ్చేది?"

అప్పటి వరకు మేము దుఃఖాన్ని ఎలాగో ఆపుకున్నాము. కాని, సోక్రటీస్ విషపానం చేయడం చూడగానే ఇక నిగ్రహించుకోలేకపోయాము. నేను ఎంత ఆపుకోవాలన్నా నా కన్నీళ్లు బొట బొట కారిపోతున్నాయి. ముఖం కప్పుకుని

ఏడ్చాను. అతడికోసం కాదు. అలాంటి గొప్ప స్నేహితుడిని కోల్పోతున్న నా దురదృష్టానికి ఏడ్చాను. నేనే కాదు, క్రిటో కూడా దుఃఖం అపుకోలేక, లేచి అవతలికి వెళ్లిపోయాడు. నేను అతడిని అనుసరించాను. అపోలోడొరస్ అంతసేపు తనలో తాను దుఃఖిస్తున్నాడు. ఇప్పుడు ఒక్కసారిగా పెద్దపెట్టున ఏడ్చాడు. దానితో మేమూ బావురుమన్నాము.

సోక్రటీస్ మాత్రమే నిబ్బరంగా వున్నాడు. "ఎవరూ ఆ ఏడ్చేది? ఇదిగో. ఇలా ఏడుస్తారనే నేను ఆడవాళ్లందరినీ ముందే పంపించేశాను. మానవుడన్న వాడు నిశ్చలచిత్తుడై, ప్రశాంతంగా మరణించాలని పెద్దలు చెప్పగా విన్నాను. అందువల్ల ఎవరూ ఏడ్వవద్దు. నిబ్బరంగా వుండండి. ధైర్యంగా వుండండి."

అతని మాటలు వినగానే మేము సిగ్గుపడ్డాము. కన్నీళ్లు ఆపుకున్నాము.

అతడు అటూ ఇటూ పచార్లు చేశాడు. కాళ్లు బరువెక్కినట్టున్నాయి. ఇక నడవలేక జైలరు చెప్పినట్టే వెల్లకిలా పడుకున్నాడు. అతనికి విషం ఇచ్చిన వ్యక్తి వుండుండి అతని పాదాలకేసి, కాళ్లకేసి చూస్తున్నాడు. కొంతసేపు అయ్యాక పాదాన్ని గట్టిగా నొక్కాడు. "నొప్పి తెలుస్తోందా?" అని అడిగాడు. "లేదు" అని సోక్రటీస్ సమాధాన మిచ్చాడు.

తర్వాత కాలు నొక్కాడు. అలా క్రమంగా పైవరకు నొక్కుతూ పరీక్షించాడు. కాళ్లు చల్లబడి కొయ్యబారుతున్నట్టు మాకు చెప్పాడు.

### తుది పలుకులు

అప్పుడు సోక్రటీజ్ తన కాళ్లను తానే నొక్కుకున్నాడు. "విషం గుండె వద్దకు చేరడంతో అంతా అయిపోతుంది" అన్నాడు. గజ్జలవరకు అతనివళ్లు చల్లబడింది. అప్పటివరకు అతడు తన ముఖం కప్పుకుని వున్నాడు. ఇప్పుడు ముసుగు తొలగించి ఆఖరు సారిగా ఇలా అన్నాడు :

"క్రిటో! నేను అప్పుడెపుడో నా ప్రాణాలు కాపాడిన ఎస్‌కేపియస్ దేవతకు ఒక కోడిపుంజు బాకీ వున్నాను. అది తీర్చేస్తావా?"

"అలాగే తీరుస్తాను. ఇంకేమైనా వుందా చెప్పాల్సింది?" అన్నాడు క్రిటో.

దీనికి జవాబు రాలేదు. మరొక నిమిషానికి అతడు కొద్దిగా కదిలినట్టు చప్పుడైంది. నౌకరు అతని ముఖంపై ముసుగు తొలగించాడు. కళ్లు తెరిచి వున్నాయి. క్రిటో అతని కనురెప్పలు, నోరు మూసివేశాడు.

"మన స్నేహితుడు ఆ విధంగా అస్తమించాడు. అంతటి మహాజ్ఞానిని, న్యాయ నిరతుడిని, ఉత్తమ వ్యక్తిని మరొకడిని నే నెన్నడూ చూడలేదు."



# 12
# స్వాప్నికసమ్రాట్టు, ఆదర్శవాది ప్లేటో

క్రిందటి అధ్యాయంలో మనం సోక్రటీస్ ఉజ్వల జీవిత గాథను అంతకంటె ఉజ్వలమైన అతని మరణ గాథను చదివాము. కాని, పాశ్చాత్య ప్రపంచంలో అతని అజరామర కీర్తికి ఆధారమైన అతని తాత్విక బోధలగాథ వాటిలో మనకు పరిచయం కాలేదు.

దీనికి కారణం : సోక్రటీస్ తన సిద్ధాంతాలను గ్రంథస్థం చేయలేదు. ఎంత సేపు ఎదుటివాడితో వాగ్వాదం వేసుకోవడమే తప్ప తన వాదాన్ని భావితరాలకోసం వ్రాసిపెట్టి పోలేదు. ఇంతకుముందే చెప్పినట్టుగా ఆ పని చేసినవాడు అతని ప్రియ శిష్యుడు ప్లేటో.

ఇటీవలి రామకృష్ణ పరమహంస, స్వామి వివేకానందల గురుశిష్య సంబంధం ఎటువంటిద్లో అలనాటి సోక్రటీస్, ప్లేటోల గురుశిష్య సంబంధం అటువంటిది. రామకృష్ణునికి శిష్యులనేకులున్నారు. అందరిలోకి అగ్రగణ్యుడు వివేకానందుడు. అతడు విద్యాధికుడు. ప్రాచ్య, పాశ్చాత్య విజ్ఞానాన్ని అవలోడన చేసిన మేధావి. అతి సాధారణంగా, నిరాడంబరంగా కనిపించే రామకృష్ణుని అసాధారణ వ్యక్తి

త్వానికి అతడు ముగ్ధుడై, శిష్యుడై, ఆరాధకుడై, చివరికి తన గురువు ఉపదేశాలకు ప్రచారకు డయ్యాడు. రామకృష్ణుని వేదాంతోపదేశాలను విస్తరించి ఆధునిక పరిభాషలో ఆధునిక పాఠకునికోసం వివేకానందుడు గ్రంథస్థం చేశాడు.

## ప్రియ శిష్యుడు

ప్లేటో కూడా అంతే. సోక్రటీస్‌కు ఎందరో శిష్యులు. అందరిలోకి అగ్రగణ్యుడు ప్లేటో. అతడు శిష్యుడే కాదు. ఆరాధకుడు, ప్రజారకుడు కూడా. సోక్రటీస్ ఒక మహా వ్యక్తిగానేకాక మహా తాత్వికుడుగా చరిత్రలో చిరస్థాయిగా నిలిచిపోవడానికి ఏకైక కారకుడు ప్లేటో.

అయితే, ఒక విషయం ఇక్కడ చెప్పాలి, సోక్రటీస్‌ను ప్రధాన పాత్రగా తీసుకుని ప్లేటో "డైలాగ్స్" అనే తాత్విక రచనలు చేశాడు. సోక్రటీస్‌లో బీజప్రాయంగా వున్న తాత్విక సిద్ధాంతాలను ఆ 'డైలాగ్స్' లో అతడు విపులీకరించాడు.

ఇంతేకాదు, సోక్రటీస్ కంటె ముందుకుపోయి- స్వీయ తాత్విక భావాలను కూడా ఆ 'డైలాగ్స్'లో అతడు ప్రవచించాడు. చివరికి ఏవి సోక్రటీస్ మౌలిక భావాలో, ఏవి అతని నోట ప్లేటో పలికించిన తన సొంత తాత్విక భావాలో వేర్పాటుచేయడం పరిశోధకులకు ఒక క్లిష్ట కార్యంగా పరిణమించింది.

కాని, మరొకటి కూడా చెప్పాలి. సోక్రటీస్ ప్రధానంగా నైతికవాది. అంటే నీతికి, సత్ప్రవర్తనకు. మానవుని శ్రేయస్సుకు సోక్రటీస్ అగ్రప్రాధాన్య మిచ్చాడు. కాగా, ప్లేటో వీటితోపాటు పారభౌతిక వివేచన, జ్ఞాన మీమాంస (Metaphysical and epistemological enquiry) కూడా చేశాడు. నిజానికి ప్లేటో తన గ్రంథాలలో చర్చించని విషయం లేదు. అనేక ఆధునిక భావాలకు మూల పురుషుడుగా ప్లేటోను చారిత్రకులు పేర్కొంటారు.

## జీవిత సంగ్రహం

ఏథెన్సులో క్రీస్తుపూర్వం 427 లో ప్లేటో జన్మించాడు. ఆ నగరంలోని అత్యున్నత కులీన కుటుంబాలలో ప్లేటో కుటుంబం ఒకటి. అతని తల్లిదండ్రులు అపార భాగ్యవంతులు. ప్లేటోకి మంచి చదువు చెప్పించారు.

ప్లేటో అనేది అసలు పేరు కాదని అంటారు. అతని విశాల వక్షస్థలం, దృఢ శరీరం చూసి ఎవరో అతనికి ఆ "నిక్ నేమ్" తగిలించి వుంటారని చరిత్రకారుల ఊహ. మనిషి చాలా అందగాడు, వస్తాదు, మంచి క్రీడాకారుడు. సంగీతం, చిత్రలేఖనం, భౌతికశాస్త్రాలు, తర్కం మొదలయినవి అభ్యసించడమే కాక, చిన్నప్పుడు కవిత్వం కూడా వ్రాశాడు.

అతనికి దగ్గర బంధువులైన క్రిటియాన్, కార్మెడీస్ అనేవారు ఆనాటి రాజకీయాలలో ప్రముఖులు. క్రీస్తుపూర్వం 404 లో ఏథెన్సులో ప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని కూలద్రోసిన "30 మంది నిరంకుశుల" బృందంలో వారూ వున్నారు. వారు సోక్రటీస్ శిష్యులు కూడా, వారినిబట్టి తాను కూడా రాజకీయ రంగంలో ప్రవేశించాలని మొదట్లో ప్లేటో అనుకునేవాడట. అతని కుటుంబీకులు కూడా ఇందుకు ప్రోత్సహించారు.

## గురు పరిచయం

కాని, ఇంతలో ప్లేటోకి సోక్రటీస్ పరిచయమైంది. అప్పటికి అతనికి ఇరవై ఏళ్లు. సోక్రటీస్‌ను చూసి అతడు ముగ్ధుడైపోయాడు. అతని మేధా నైశిత్యాన్ని చూసి అతడిని ఆరాధించడం మొదలుపెట్టాడు. ఇతర శిష్యులతో కలిసి సోక్రటీస్ వెంట అతని తత్వచర్చలు వింటూ ఏథెన్సు పురవీధులలో సంచరించేవాడు. క్రమంగా అతనికి రాజకీయాలపట్ల వైముఖ్యం, తత్వశాస్త్రంపట్ల అభిముఖ్యం ప్రబలమైనాయి. తాను కూడా గురువువలె తాత్వికుడు కావాలనుకునేవాడు.

చివరికి సోక్రటీస్‌కు క్రీస్తుపూర్వం 399 లో ఏథెన్సు ప్రభుత్వం మరణశిక్ష విధించడంతో ప్లేటో మనసు పూర్తిగా మారిపోయింది. సోక్రటీస్ భావాలను ప్రచారం చేయడం, ఆ విధంగా అతని స్మృతిని ప్రపంచ చరిత్రలో శాశ్వతం చేయడం తన జీవిత లక్ష్యంగా పెట్టుకున్నాడు.

## ప్రవాస జీవితం

కాని, ఏథెన్సులోని సోక్రటీస్ వ్యతిరేక వాతావరణం సోక్రటీస్ శిష్యులకు కూడా ప్రమాదకరంగా పరిణమించింది. ఏథెన్సులో వుండడం శ్రేయస్కరం కాదని వారు నిశ్చయించుకున్నారు. సమీపంలోని మెగరా నగరానికి వారు పారిపోయారు. అక్కడ సోక్రటీస్ శిష్యుడైన యూక్లిడ్ గృహంలో వారు తలదాచుకున్నారు. వారితోపాటు ప్లేటోకూడా ఏథెన్సు విడిచిపెట్టి యూక్లిడ్ ఇంటిలో ఆశ్రయం పొందాడు. అప్పటికి అతనికి 28 ఏళ్లు.

ఆ తర్వాత సుమారు పన్నెండేళ్లపాటు ప్లేటో విజ్ఞానార్జనచేస్తూ దేశాటనం చేశాడు. ఇటలీ, సిసిలీ, ఈజిప్టులలో పర్యటించాడు. ఆనాటి ప్రసిద్ధ తాత్వికులను కలుసుకున్నాడు. వారినుంచి అనేక తత్వ రహస్యాలను తెలుసుకున్నాడు. ఆయా దేశాల ప్రజల జీవన సరళిని, మత, వైజ్ఞానిక విశేషాలను ఆకళించుకున్నాడు. ఆ పర్యటనల సందర్భంలో ప్లేటో భారతదేశం కూడా సందర్శించాడని, గంగానదీ తీరాన భారతీయ ఋషులను కూడా కలుసుకుని ఆర్ష విజ్ఞాన సముపార్జన చేశాడని చెబుతారు. ఇందుకు చారిత్రకాధారాలులేవు.

కాని, ప్లేటో సిద్ధాంతాలకు, భారతీయ చింతనకు కొన్ని పోలికలు కనబడే మాట మాత్రం నిజం.

పితాగరస్ ప్రవచించిన తాత్త్విక సిద్ధాంతాలను అధ్యనం చేయాలనే కోర్కెతో ప్లేటో ఇటలీ సందర్శించాడు. టారెంటమ్ నగరంలో దాని పరిపాలకుడు ఆర్కిటస్‌తో స్నేహం చేశాడు.

## బానిసగా ప్లేటో

ఆ రోజులలో సిరక్యూస్ నగరాన్ని మొదటి డైయనీసస్ పరిపాలిస్తున్నాడు. అతని బావమరది డైయన్ తత్త్వశాస్త్రాభిమాని. అతని ఆహ్వానంపై ప్లేటో సిరక్యూస్ వెళ్లాడు. కాని, డైయనీసస్ నిరంకుశ పద్ధతులు అతనికి నచ్చలేదు. ఇరువురూ ఘర్షణ పడ్డారు. డైయనీసస్ ఆగ్రహించి ప్లేటోను బంధించి ఈజినా నగరానికి పంపించాడు. అక్కడ ప్లేటోను బానిసగా విక్రయించారు. అదృష్టవశాత్తు ప్లేటోను ఎరిగినవా రెవరో తటస్థపడి అతడిని తామే కొనుక్కొని విడిపించి ఏథెన్సు నగరానికి సురక్షితంగా పంపివేశారు.

అప్పటికి ప్లేటో వయసు 40 ఏళ్లు. సోక్రటీస్ మరణించి పదమూడే ళ్లయింది. అతని ఉదంతం ప్రజలు మరచిపోయారు. అందుచేత ప్లేటోకి ఏథెన్సులో ఎట్టి ఇబ్బంది కలగలేదు.

## అకాడెమీ పేరు ఎలా వచ్చింది?

ప్లేటో బాగా స్థితిమంతుడు కదా? ఊరవతల అతనికి ఒక విశాలమైన అందమైన, ఉద్యానవనం, దానిమధ్య ఒక పెద్ద ఇల్లు వుండేవి. ఆ ప్రాంతం ఒకప్పుడు అకాడెమస్ అనే గ్రీకు వీరునికి చెందినది. అతని పేరు మీదుగా ఆ ప్రాంతాన్ని అకాడెమస్ అనేవారు. అక్కడ ప్లేటో ఒక విద్యాలయాన్ని స్థాపించాడు. ఆ స్థలం పేరుమీదుగా ప్లేటో విద్యాలయానికి "అకాడెమీ" అనే పేరు వచ్చింది. నాటి నుంచి విద్యాలయాలకు అకాడెమీ అనే పేరు స్థిరపడిపోయింది.

బహుశా ఇటలీలో పితాగరస్, ఆ తర్వాత అతని అనుయాయులు స్థాపించిన గురుకులాశ్రమాలను ప్లేటో తన అకాడెమీకి ఒరవడిగా తీసుకుని వుండవచ్చు. అక్కడ ప్రధానంగా రాజనీతిశాస్త్రం నేర్పేవారు. ఇంకా గణితం, తర్కం, ఖగోళాది శాస్త్రాలను కూడా బోధించేవారు. ప్లేటో తన అకాడెమీలో స్త్రీలకు కూడా స్థానాన్ని, పురుషులతో సమాన ప్రతిపత్తిని కల్పించడం ఒక విశేషం.

## శిష్యుడుగా అరిస్టాటిల్

దేశ దేశాలనుంచి రాజకుమారులు, ధనిక యువకులు ఏథెన్సు వచ్చేవారు.

ప్రభుత్వ నిర్వహణలో శిక్షణకోసం అకాడెమీలో విద్యార్థులుగా చేరేవారు. అలా చేరిన వారిలో సిరక్యూస్ పాలకుని బావమరది డైయన్ ఒకడు. మాసిడోనియాకు చెందిన అరిస్టాటిల్ మరొకడు. సోక్రటీస్‌కు ప్లేటోవలె, ప్లేటోకి అరిస్టాటిల్ ప్రియశిష్యుడు.

అకాడెమీ పేరు దేశ దేశాలలో మ్రోగి పోయింది. ఎక్కడెక్కడి రాజులు రాజ్యాంగ సమస్యలపై ప్లేటో సలహాలు కోరుతూ దూతలను పంపించేవారు. ఒక ఇరవై ఏళ్లు ఎట్టి ఒడుదుడుకులు లేకుండా ప్లేటో జీవితం గడిచిపోయింది. ఆ ఇరవై ఏళ్లలో అతడు తన తాత్విక భావాలను "డైలాగ్స్" పేరుతో అనేక రచనలలో నిక్షిప్తం చేశాడు. అతని బోధన పద్ధతి సోక్రటీస్ అవలంబించిన "డయలెక్టిక్" శైలిలో వుండేది. అదే సంవాద శైలిని "డైలాగ్స్" లో కూడా అనుసరించాడు. ప్లేటో గొప్ప భావుకుడు, స్వాప్నికుడు (dreamer), ఆదర్శవాది. అతని భావాలకు, స్వప్నాలకు ఆదర్శాలకు పరిపూర్ణరూప మనదగిన "రిపబ్లిక్" అనే గ్రంథం, మరెన్నో ముఖ్యమైన "డైలాగ్స్" అనాటివే.

క్రీస్తుపూర్వం 357 లో సిరక్యూస్‌లో మొదటి డైయసీసస్ చనిపోయాడు. అతని కుమారుడు రెండవ డైయసీసస్ రాజ్యానికి వచ్చాడు. అతనికి చిన్నతనంలో చదువు అబ్బలేదు. పైగా మందబుద్ధి. అతని మేనమామ డైయన్ అతనికి విద్యాబుద్ధులు చెప్పించాలని, రాజ్యపాలనలో శిక్షణ ఇప్పించాలని అందుకు తనకు కూడా గురువు, మిత్రుడు అయిన ప్లేటోను ఎంచుకున్నాడు. రాజగురువుగా ప్లేటోను ఆహ్వానించాడు.

ప్లేటో చాలా సంతోషపడ్డాడు. అతని "రిపబ్లిక్" గ్రంథంలో ఆదర్శరాజ్యం ఎలా వుండాలో, ఆదర్శ పరిపాలకులు ఎలా వుండాలో చాలా వివరంగా వర్ణించాడు. ఆ సిద్ధాంతాలను అమలు చేయడానికి తగిన రాజ్యంకోసం, తగిన రాజుకోసం అతడు అన్వేషిస్తున్నాడు. కనుక ఈ అవకాశం పోనివ్వకూడదని డైయన్ ఆహ్వానాన్ని అంగీకరించి సిరక్యూస్ వెళ్లాడు.

## ఆశాభంగం

కొంతకాలంపాటు ప్లేటో గురుత్వం, డైయసీసస్ శిష్యరికం చక్కగా సాగాయి. కుర్రవాడు దారిలో పడుతున్నా డనుకున్నాడు. కాని రాజాస్థానంలో ప్లేటో, డైయన్‌లపట్ల అసూయ పెరిగింది. వారి ప్రాముఖ్యాన్ని ఇతర రాజోద్యోగులు సహించలేక పోయారు. రాజుకు చాడీలు చెప్పారు. ప్లేటోపట్ల డైయసీసస్ అభిమానం ఎనలేనిది. అతడిని ఏమీ అనలేక తన మేనమామ డైయన్‌ను రాజు నగరంనుంచి బహిష్కరించాడు. తన అనుయాయి, శిష్యుడు అయిన

డైయన్‌ను అలా వెళ్లగొట్టడం ప్లేటోకు మనస్తాపం కలిగించింది. తాను కూడా స్వదేశం వెళ్లిపోతానన్నాడు. డైయనీసస్ అంగీకరించలేదు. ఇంతలో ఏదో యుద్ధం తటస్థించి చదువుకు అంతరాయం కలిగింది. ఇదే అదను అను కుని ప్లేటో యుద్ధానంతరం తిరిగి వచ్చే షరతుపై ఏథెన్సుకు తిరిగి వచ్చేశాడు.

మళ్లీ తన అకాడెమీ, తన శిష్యులకు చదువుచెప్పడం, మరికొన్ని ముఖ్య మైన "డైలాగ్స్" రచించడం-ఇలా అయిదేళ్లుగడిచింది. తిరిగి డైయనీసస్‌నుంచి ఆహ్వానం వచ్చింది. కాదనలేక మళ్లీ సిరక్యూస్‌వెళ్లాడు. ఈసారికూడా రోజులు సుఖంగా గడవలేదు. డైయనీసస్‌తో అభిప్రాయ భేదాలు వచ్చాయి. ప్లేటో పారిపోతాడేమోనని ఒక ఏడాదిపాటు రాజోద్యానవనంలో బందీగావుంచారు. చివరికి విడుదలచేశారు.

మళ్లీ అకాడెమీ, మరికొన్ని 'డైలాగ్స్' రచన, విద్యాబోధన...

## చరమాంకం

ప్లేటోకి ఎనభై ఏళ్లు నిండాయి. చివరివరకు వ్రాస్తూ, చర్చిస్తూ, పాఠాలు చెబుతూనే గడిపాడు. "రిపబ్లిక్" గ్రంథంలో తాను చిత్రించిన ఆదర్శ రాజ్యాన్ని భూలోకంలో స్థాపించలేక పోయానే అనే చింత ప్లేటోను క్రుంగదీసింది. Between the idea and the reality falls the shadow అని టి. ఎస్. ఇలి యట్ అన్నట్టు ఆదర్శానికి, వాస్తవానికి మధ్య నిరంతరం పడే నీడ అతడిని నిరాశోపహతుడిని చేసింది.

ఒకనాడు ఒక స్నేహితుని గృహంలో వివాహ సందర్భంగా గొప్ప విందు జరిగింది. అందరూ తిని, తాగి తందనాలు తొక్కుతున్నారు. వారి కేరింతలు అతనికి విసుగు కలిగించాయి. కొంచెం అవతలగా వున్న ఒక గదిలో విశ్రాంతి తీసుకుందామని వెళ్లాడు. నిద్రపట్టింది. ఆ నిద్ర కలతలులేని, కలలు రాని దీర్ఘ నిద్రగా పరిణమించింది. పాశ్చాత్య ప్రపంచానికి తత్వభిక్షపెట్టి దాన్ని తరతరా లుగా ప్రభావితం చేసిన మహా దార్శనికుడు, మహా వ్యక్తి ప్లేటో శాశ్వతంగా కన్నుమూశాడు. అది క్రీస్తుపూర్వం 347 లో.

ప్లేటో తర్వాత అతని అకాడెమీ ఎనిమిదిన్నర శతాబ్దాలపాటు అవిచ్ఛిన్నంగా విరాజిల్లింది. క్రీస్తుశకం 529 లో రోమన్ చక్రవర్తి జస్టీనియన్ తన సామ్రా జ్యంలోని తత్వశాస్త్ర విద్యాలయాలన్నిటిని నిషేధించడంతో ప్లేటో అకాడెమీ కూడా మూతపడింది.

ప్లేటో పేరిట మొత్తం 42 "డైలాగ్స్" ప్రచారమైనాయి. కాని, వాటిలో

కొన్ని ప్రక్షిప్తాలని, ఎవరెవరో వ్రాసి అతని పేరు పెట్టారని, అతనివిగా చెప్ప దగినవి 27 లేదా 28 మాత్రమేనని పరిశోధకులు నిర్ణయించారు.

## "కవిర్మనీషీ..."

అన్నిటిలోకి మకుటాయమానమైన గ్రంథం "రిపబ్లిక్." ప్లేటో తన ఆదర్శ రాజ్యంనుంచి కవులను బహిష్కరించాడు. కాని, అతడు తాత్వికుడై వుండక పోతే మహాకవిగా శాశ్వతకీర్తి పొందివుండే వాడంటారు. అతని వచనశైలి పెక్కుచోట్ల గొప్ప కవిత్వంవలె భావనా సౌందర్యంతో భాసిస్తూ వుంటుందని, కావ్య పరిమళాలను వెదజల్లుతూ వుంటుందని పండితులు కీర్తించారు. కవి అంటే సంస్కృతంలో జ్ఞాని, ఋషి, ద్రష్ట అని అసలు అర్థం. ప్లేటోకు కవి అనేమాట పూర్తిగా వర్తిస్తుంది. అతనిలో తత్వం, కవిత్వం పడుగుపేక వలె ఏకమైనాయి.



ముఖ్యంగా "రిపబ్లిక్" అతని చింతనకు పరిపూర్ణ గ్రంథరూపం. అమెరికన్ మేధావి ఎమర్సన్ "ప్రపంచంలోని గ్రంథాలయాలన్నిటిని తగలబెట్టినా ఫరవాలేదు. వాటన్నిటి సారం ఈ ఒక్క గ్రంథంలో నిక్షిప్తమై వున్నది" అని ప్రస్తుతించాడు.



తాత్వికులు రాజులైతే తప్ప, లేదా రాజులు తాత్వికులైతే తప్ప - ఇటు జ్ఞాన నేతృత్వం, అటు రాజకీయ నేతృత్వం ఒకేవ్యక్తిలో సమ్మిళితమైతే తప్ప- మానవజాతి బాగుపడదన్నది ప్లేటో గాఢ విశ్వాసం. ప్రపంచంలో రకరకాల రాజ్యవ్యవస్థ లున్నాయి. కాని, అన్నీ లోప భూయిష్ఠమైనవే. ముఖ్యంగా ప్రజాస్వామ్యం- డెమోక్రసీ - అది వట్టి సమూహ స్వామ్యం- "మాబోక్రసీ". మహాద్రష్ట, మహా జ్ఞాని సోక్రటీస్‌ను అది మట్టుపెట్టింది. నిజానికి అతడిని పోలిన జ్ఞానులే రాజ్యాధికారం నెరపడానికి అర్హులు. అది ఈ లోకంలో ఎన్నటికీ సంభవం కాకపోవచ్చు. కాని ఊహాలోకంలోనైనా అది సంభావ్యం కావచ్చుకదా?

ఆ ఊహాలోకంలో తానొక అందమైన ఆదర్శరాజ్యాన్ని, ఎందుకు నిర్మించ రాదు? దాన్ని పాలించడానికి తాత్వికరాజులను- ఫిలాసఫర్ కింగ్స్‌ను- ఎందుకు ఊహించుకోరాదు? "రిపబ్లిక్" అనే గ్రంథంలో ప్లేటో చేసిన పని అదే.

## రా జ ర్షు లు

ప్లేటో 'ఫిలాసఫర్ కింగ్స్' అని పేర్కొన్న తాత్విక రాజులు మనకు కొత్తకాదు. ప్రాచీన భారతదేశంలో అట్టివారిని రాజర్షులుగా వ్యవహరించేవారు.

ఉదాహరణకు 'బృహదారణ్యకోపనిషత్తు'లో వచ్చే విదేహరాజు జనకుడు రాజర్షి. అతడు తరచుగా ఋషులను సమావేశపరచి తత్వగోష్ఠులు నిర్వహించేవాడు. అతడు యాజ్ఞవల్క్యుడినుంచి బ్రహ్మజ్ఞానం ఉపదేశం పొందాడు.

నిజానికి ఆ రోజులలో తత్వశాస్త్రజ్ఞానంలో బ్రహ్మర్షుల కంటె అధికులైన రాజర్షు లుండేవారని ఉపనిషత్తులు పేర్కొంటున్నాయి. బృహదారణ్యకంలోనే ఒక కథ ప్రకారం గార్గ్యుడనే ఋషి తనకు తెలియని తత్వరహస్యం లేదని విర్రవీగుతుండగా కాశీరాజు అజాతశత్రుడు అతనికేమీ తెలియదని నిరూపించి చివరికి బ్రహ్మవిద్య ఉపదేశిస్తాడు. ఛాందోగ్యోపనిషత్తులో శ్వేతకేతువు అనే మునికుమారునికి తత్వోపదేశం చేసిన పాంచాలరాజు ప్రవాహణ జైబలి, అదే ఉపనిషత్తులో ఉద్దాలక అరుణికి తత్వబోధ చేసిన అశ్వపతి కైకేయుడు క్షత్రియులే, రాజర్షులే.

ప్లేటో తన జీవితకాలంలో తాత్విక రాజులను చూడలేకపోయినప్పటికి కొన్ని శతాబ్దాల తర్వాత యూరప్‌లో ఒక గొప్ప రాజర్షి వర్ధిల్లాడు. అతడు రోమన్ చక్రవర్తి మార్కస్ అరీలియస్ (క్రీస్తుశకం 121-180). ఒక మహాసామ్రాజ్యాన్ని పరిపాలిస్తూ, రాజ్యరక్షణకై గత్యంతరంలేక యుద్ధాలు చేస్తూ, ఆ యుద్ధ సమయ మధ్య విరామంలోనే గొప్ప తాత్విక రచనలు చేశాడు. "మెడిటేషన్స్" అనే అతని రచనలు ఎందరినో ప్రభావితం చేశాయి.

### భా వ వా ద పి త

ఈ విషయాంతరాన్ని అటుంచి ప్లేటోవద్దకు వద్దాం. అతనితో గ్రీకు తత్వచింతన మహోన్నత శిఖరాలు అందుకున్నది. నిజానికి ఇంతవరకు మనం చదివిన తాత్వికుల సిద్ధాంతాలన్నీ ప్లేటో ఆవిర్భావానికి భూమికను సిద్ధంచేశాయి. పితాగరస్, పార్మెనిడీస్, హెరాక్లిటస్ - సరే సోక్రటీస్ - మొదలైన వారందరినుంచి అతడు ఎంతో కొంత స్వీకరించాడు. వాటిని తన మేధాపాత్రలో రంగరించి ఒక గొప్ప తాత్విక రసాయనాన్ని తయారుచేశాడు. ఇంతకుముందు పితాగరస్‌ను భావవాద పితామహుడుగా పేర్కొనడం జరిగింది. యూరోపియన్ భావవాదానికి (ఐడియలిజం) పితాగరస్ తాత అయితే, ప్లేటో తండ్రి.

## ప్లేటో కలలుకన్న ఆదర్శ రాజ్యం

ఒకనాడు ఏథెన్సు నగరానికి అయిదు మైళ్ల దూరంలో పిరియస్ రేవు సమీపాన సెఫాలస్ అనే వర్తకుని గృహంలో కొందరు స్నేహితులు సమావేశమయ్యారు. వారిలో సోక్రటీస్ ఒకడు. గృహ యజమాని సెఫాలస్, అతని కుమారుడు పోలిమార్కస్, సోఫిస్టు తత్వవేత్త థ్రేసిమేకస్, ప్లేటో సోదరులైన గ్లాకస్, అడీమాంటస్ వీరు సదస్యులు. వీరుకాక మరి అయిదుగురు శ్రోతలు.

సోక్రటీస్ ఎక్కడవున్నా తత్వ చర్చ తప్పదు కదా? ముందుగా వార్థక్యం గురించిన చర్చ జరిగింది. కాని, అదేమంత ఉత్సాహంగా సాగలేదు. దానితో చర్చ "న్యాయం అంటే ఏమిటి?" (What is justice?) అనే ప్రశ్న పైకి మళ్లింది. ఒక్కొక్కరు ఒక్కొక్క విధంగా న్యాయాన్ని నిర్వచించారు.

## ఇష్టా గోష్ఠి

సెఫాలస్ వర్తకుడు కనుక అతడు "నిజం చెప్పడం, ఎవరి బాకీని వారికి తీర్చివేయడం—ఇదే న్యాయం అంటే" అని నిర్వచిస్తాడు.

అతని కుమారుడు పోలిమార్కస్ "ఇతరులకు న్యాయంగా ఇవ్వవలసింది ఇచ్చివేసి మిత్రులను ఆదుకోవడం, శత్రువులను శిక్షించడం— ఇదే న్యాయానికి నిర్వచనం" అంటాడు.

థ్రేసిమేకస్ కోపిష్ఠి; సోఫిస్టు తాత్వికులలో ఉగ్రవాది. బలవంతుడైన రాజు ఏది చేస్తే అదే న్యాయం; బలమే న్యాయం (Might is right); రాజ్యం వీర భోజ్యం - అంటాడు.

ఇప్పుడు ప్లేటో సోదరులైన గ్లాకన్, అడీమాంటస్‌ల వంతు. "ఏ పని చేస్తే మనకు లాభిస్తుందో, మంచి ఫలితాలు సిద్ధిస్తాయో అదే న్యాయం" అని వారి నిర్వచనం.

ఇక మిగిలింది సోక్రటీస్. అతడు పై నిర్వచనా లన్నింటిని పూర్వపక్షం చేస్తాడు. సెఫాలస్ తన పనిపై తాను వెళ్లిపోతాడు. థ్రేసిమేకస్ చిర్రు బుర్రు లాడుతూ నీతో వాదించే దేమిటని మధ్యలోనే నిష్క్రమిస్తాడు. మిగిలిన వారితో సోక్రటీస్ గోష్ఠి సాగిస్తాడు.

ఏది న్యాయమో నిర్ణయించడానికి ఒక వ్యక్తిని కాకుండా ఒక రాజ్యాన్ని ఉదాహరణగా తీసుకోవడం మంచిదని అతడు సూచిస్తాడు. ఎందుకంటే ఒక వాక్యాన్ని చిన్న అక్షరాలలో చదవడం కంటె పెద్ద అక్షరాలలో చదవడం సులభం కదా? అలాగే న్యాయాన్ని ఒక రాజ్యమంత పెద్ద పరిమాణంలో పరిశీలిస్తే దాని స్వభావం బాగా అర్థమవుతుందని సోక్రటీస్ అంటాడు. తన దృష్టిలో ఆదర్శప్రాయమైన, న్యాయబద్ధమైన రాజ్యం ఎలా వుండాలో వర్ణిస్తాడు.

## రిపబ్లిక్

ప్లేటో డైలాగ్స్ అన్నిటిలోకి సుప్రసిద్ధమైన "రిపబ్లిక్" ఈ సన్నివేశంతో ప్రారంభ మవుతుంది. పది పరిచ్ఛేదాలు (books) కల ఈ ఉద్గ్రంథాన్ని "ది రిప

బ్లిక్" అని ఇంగ్లీషులో వ్యవహరిస్తున్నప్పటికి అది సరైన పేరు కాదు. దానిలో సోక్రటీస్ పాత్రద్వారా ప్లేటో వర్ణించిన ఆదర్శ రాజ్యంలో రిపబ్లికన్ లక్షణా లేమీ లేవు. రిపబ్లిక్ అంటే గణతంత్ర రాజ్యం. కాని, ప్లేటో ఊహా రాజ్యం "అరిస్టాక్రసీ" అనే రాజ్య వ్యవస్థకు దగ్గరగా ఉంటుంది. అరిస్టాక్రసీ అంటే ఉత్తముల పరిపాలన. దానిలో స్వేచ్ఛగా పౌరులందరు ఓటుచేసే ఎన్నకలంటూ వుండవు. ప్లేటో తన గ్రంథానికి పెట్టిన గ్రీకుపేరు "పొలిటియా" (Politiea) దీన్ని "కామన్వెల్త్" అని ఆంగ్లీకరించడం సముచితమని కొందరు పండితుల అభిప్రాయం.

ఊహా రాజ్యాలను చిత్రించిన గ్రంథాలలో ప్లేటో "రిపబ్లిక్" మొదటిది. అతని తర్వాత ఎందరో మేధావులు ఎవరికి తోచిన ఊహా రాజ్యాన్ని వారు తమ గ్రంథాలలో చిత్రించారు. ఇలాంటి ఊహా రాజ్యానికి "యుటోపియా" (Utopia) అని రూఢనామం ఏర్పడింది. ఎందుకంటే ఈ పేరుతో మొదటగా ఒక ఆదర్శ రాజ్యాన్ని ఆంగ్ల మేధావి సర్ థామస్‌మోర్ [1516] వర్ణించాడు. యుటోపియా అంటే "ఎక్కడా లేని దేశం" (Nowhere land) అని అర్థం.

ఇప్పుడు ప్లేటో 'రిపబ్లిక్' ను చూద్దాము.

## త్రి వ ర్గా లు

మానవులను అతడు మూడు వర్గాలుగా విభజించాడు. కొందరిని బంగా రంతో, మరికొందరిని వెండితో, మిగిలినవారిని ఇనుము, లేదా ఇత్తడితో పోల్చుతాడు. అంటే ఉత్తములు, మధ్యములు, అధములు.

వీరిలో ఉత్తములైన వారు తత్వజ్ఞానులు, రాజ్యపాలన చేయడానికి అర్హులు. మధ్యములు రాజ్యరక్షణకు అంకితులైన వీరసైనికులు. మిగిలినవారు సామాన్య ప్రజలు. వీరిలో రైతులు, వర్తకులు, చేతి వృత్తుల కార్మికులు వుంటారు. ఈ విభజన ఒక వర్గం తక్కువగా మన దేశంలోని చతుర్వర్ణ వ్యవస్థను పోలిన దని వేరే చెప్పనక్కరలేదు. "చాతుర్వర్ణ్యం మయాసృష్టం" అని గీతాకారుని ప్రవచనం.

## త్రి గు ణా లు

అలాగే ప్లేటో కూడా మానవులలో స్వతస్సిద్ధంగా మూడు ప్రవృత్తులు కల వారుంటారని, ఎవరి ప్రవృత్తికి తగిన వృత్తిని మాత్రమే వారు అవలంబించాలని అభిప్రాయపడ్డాడు. అతడు పేర్కొన్న మూడు ప్రవృత్తులు మన దర్శనాల లోని సత్వ రజస్తమోగుణాల వంటివని చెప్పవచ్చు. కొందరు సాత్వికులు.

వారు రాజర్షులవుతారు. కొందరు రజోగుణ ప్రధానులు. వారు సైనిక వృత్తి స్వీకరించాలి. మిగిలిన వారు తమోగుణులు. వారు భుక్తికి, సంపద సృష్టికి అవసరమైన వృత్తులను చేపట్టాలి.

అయితే ఎవరు సాత్వికులో, ఎవ రెవరు రజ స్తమోగుణులో ఎలా నిర్ణయించడం ?

ప్లేటో తన ఆదర్శరాజ్యంలో విద్యావిధానానికి అమిత ప్రాధాన్య మిచ్చాడు. దాన్ని ముఖ్యంగా రాజ్యపాలకులకు, రాజ్య రక్షకులకు అవసరమైన శిక్షణ ఇవ్వడానికే అతడు ఉద్దేశించాడు. ఈ రెండు అగ్రవర్ణాలలోకి రానివారిని మూడవ వర్గంగా— అంటే వ్యవసాయాది వృత్తులు అవలంబించే సామాన్య ప్రజలుగా— పేర్కొన్నాడు.

కాని, ఇవి ఏమాత్రం మార్పులేని శాశ్వత వర్గాలు కావు. అగ్రవర్గంలో పనికిరాని వారిని మూడవ వర్గంలోకి మార్చవచ్చు. అలాగే మూడవ వర్గంలో ప్రతిభావంతులైనవారుంటే వారిని అగ్ర వర్గాలలోకి పంపించవచ్చు.

## ప్లేటో ప్రణాళిక

మొదటగా— ఆదర్శ రాజ్యంగా తీర్చి దిద్దదలచుకున్న నగరంలోనుంచి పదేళ్లకు పైబడిన వారందరిని దూరంగా పంపించివేయాలి. అంటే తల్లిదండ్రుల ప్రభావంనుంచి పిల్లలను దూరంగా వుంచాలి. ఇలా చేయడానికి అవకాశం జ్ఞాని అయిన ఏ రాజో కలగజేయకపోడని ప్లేటో ఆశించాడు.

ప్రారంభ దశలో— ప్రవృత్తితో నిమిత్తం లేకుండా ప్రతి బాలుడికి, ప్రతి బాలికకు విద్యలో సమానావకాశం కల్పించాలి. ఎందుకంటే ఏ పుట్టలో ఏ పాము వుందో ఎవరికి తెలుసు? ఎవరిలో ఏ ప్రతిభ దాగివున్నదో మొదటనే తెలియదు కదా? వారిలో ఎవరైనా రాజర్షి పదవికి తగి వుండవచ్చు కదా?

మొదటి పదేళ్లు ఆటపాటలతో చదువు సాగుతుంది. ప్రతి పాఠశాలలోను విధిగా ఒక వ్యాయామశాల, ఒక క్రీడాంగణం వుండాలి. పిల్లలు ఆరోగ్యవంతులుగా, దృఢగాత్రులుగా, ధీరులు, వీరులు, సాహసికులుగా తయారయ్యేటట్టుగా అన్ని విధాల వ్యాయామం, క్రీడలు నేర్పాలి. యుటోపియా అనేది మానవ శరీర దార్ఢ్యంతోనే ప్రారంభం కావాలి. అప్పుడిక వైద్యులూ అక్కరలేదు, ఔషధాలూ అక్కరలేదు.

## ఆటతోపాటు పాట

కాని, శరీరదార్ఢ్యం మాత్రమే పరిపూర్ణ మానవుడిని రూపొందించలేదు

కదా? మానసిక దార్ఢ్యాన్ని కూడా పెంపొందించాలి. ఇందుకోసం పిల్లలకు సంగీతం నేర్పాలి. మ్యూజిక్ అనేదానికి గ్రీకు భాషలో విస్తృతార్థం వున్నది. అన్ని లలిత కళలు దాని క్రిందికి వస్తాయి. దానికి "సంస్కృతి" [culture] అని అర్థం చెప్పకోవచ్చు.

కాని, ఒక జాగ్రత్త తీసుకోవాలి. పిల్లలను ఏ సాహిత్యం పడితే ఆ సాహిత్యాన్ని చదవనివ్వరాదు. ధీర వీర శూర గాథలే చదవనివ్వాలి. పిల్లలకు పిరికివారి కథలు చెప్పరాదు. ఉదాహరణకు హోమర్, హిసియాడ్ వంటివారి కావ్యాలలో అటువంటివి వున్నాయి. పైగా హోమర్ తన కావ్యాలలో దేవతలను నీతిబాహ్యమైన, నీచమైన పనులు చేసేవారుగా వర్ణించాడు. అట్టి గాథలవల్ల దేవతలపట్ల పిల్లలకు ఏహ్యాభావం కలుగుతుంది. మరొకటి– ధీరోదాత్తులైనవారు బిగ్గరగా నవ్వరు కదా? కాని హోమర్ కావ్యాలలో దేవతలు బిగ్గరగా వికటాట్టహాసం చేస్తారు. అతడు విందులు, తాగి తందనాలు తొక్కడంవంటి సంఘటనలు వర్ణించాడు. ఇటువంటివాటిని పిల్లలకు తెలియనిస్తే చెడిపోతారు. అందువల్ల హోమర్ కావ్యాలవంటి వాటిని నిషేధించాలి.

## కవుల బహిష్కారం

పోతే, ఏ నాటక రచయిత దుష్టపాత్రలు, స్త్రీ పాత్రలు, బానిసల పాత్రలు లేకుండా నాటకం వ్రాయలేదు. మరి ఆ పాత్రలను ఉత్తములైనవారు ధరించరాదు కదా? కనుక నాటకాలను కూడా నిషేధించాలి. ఈ విధంగా ఆలోచించి ప్లేటో తన రిపబ్లిక్ నుంచి కవులను, నాటక రచయితలను బహిష్కరించాడు.

సంగీతాన్ని కూడా సెన్సార్ చేయకుండా అతడు వదలిపెట్టలేదు. పిల్లలకు ఏ సంగీతం పడితే ఆ సంగీతం నేర్పరాదు. కొన్ని బాణీల సంగీతం విషాదమయంగా వుంటుంది. కొన్ని బాణీలు వెకిలిగా వుంటాయి. అటువంటివి పిల్లలకు తగవు. ధైర్యసాహస ప్రేరకంగా వుండే ధీరోదాత్త సంగీతమే వారికి అనువైనది.

## సెక్స్, యూజెనిక్స్

స్త్రీ పురుష సంబంధాల విషయంలో సయితం ప్లేటో ఒక పద్ధతి సూచించాడు. దృఢగాత్రులు, పరిపూర్ణారోగ్యవంతులు మాత్రమే సంతానోత్పత్తికి అర్హులు. ఉత్తమ సంతానం కోసమే వారు సంగమించాలి. వికలాంగులు, దుర్బలాంగులు అయిన పిల్లలు జన్మిస్తే వారిని ఏ అజ్ఞాత ప్రదేశంలోనో వదిలివేయాలి. పిల్లలు

పుట్టగానే తల్లిదండ్రులు వారిని ప్రభుత్వానికి స్వాధీనం చేయాలి. ప్రభుత్వమే వారి పెంపకం, విద్యా బుద్ధుల బాధ్యత వహిస్తుంది.

ఇరవై ఏళ్లు వచ్చేవరకు అందరికీ ఒకే విద్య. శరీర సౌష్ఠవానికి వ్యాయామం, మానసిక సౌష్ఠవానికి సంగీతం. హృదయంలో సంగీతం లేనివాడిని నమ్మకూడదు. సంగీతాభ్యాసంవల్ల న్యాయాన్యాయ విచక్షణ అలవడుతుంది. జీవితంలో ఒక క్రమ బద్ధత (harmony), ఒక లయబద్ధత [rhythm] కలుగుతాయి.

ఆడ, మగపిల్లలు కలిసి చదువుకోవాలి. అంతా కలిసి సిగ్గుపడకుండా నగ్నంగా వ్యాయామం చేయాలి. ఒకరి నగ్న శరీరాలను చూసి ఒకరు హేళన చేయరాదు. విద్య విసుగు పుట్టించేదిగా వుండకూడదు. వినోదంతో దాన్ని మేళవించాలి.

## మొదటి పరీక్ష

ఇరవై ఏళ్లు రాగానే యువతీ యువకులకు పరీక్ష పెట్టాలి. వారి శ్రమ సహిష్ణుతను వీలైనంత కఠోరంగా పరీక్షించాలి. ఆ పరీక్షలో ఓడిపోయినవారు తదుపరి విద్యాదశకు పనికిరారు. వారిని కలుపు మొక్కల వలె ఏరి వేయాలి. అలా ఏరివేసినవారే మూడవ వర్గంగా వివిధ వృత్తులలో స్థిరపడతారు.

ఆ పిదప మరొక పదేళ్లు ఉన్నత విద్యాభ్యాసం కొనసాగుతుంది. అంక గణితం [Arithmetic] రేఖాగణితం [Geometry] ఖగోళాది శాస్త్రాలు బోధించాలి. అయితే, వీటిని ప్రాపంచిక ప్రయోజనాలకు ఉద్దేశించి నేర్పరాదు. అదే సమయంలో శరీర వ్యాయామం కొనసాగుతుంది.

ఈ దశ పూర్తికాగానే మరొకసారి కలుపుతీత జరుగుతుంది. మళ్లీ కఠోర పరీక్ష జరుగుతుంది. దానిలో నెగ్గలేక పోయినవారిని సైనికులుగా, అంటే రాజ్య రక్షకులుగా నియమించాలి. వారు తమ రాజ్యాన్ని రక్షించుకొనడానికే యుద్ధం చేయాలి కానీ, పరరాజ్య దురాక్రమణకు కాదు. యుద్ధనివారణకే ఉత్తమ సైన్యం అవసరం.

అప్పటికి మన విద్యార్థులకు 30 ఏళ్లు వస్తాయి. రెండవదశ పరీక్షలో ఏరివేయగా మిగిలినవారు అనంతర విద్యాభ్యాసానికి సంసిద్ధులవుతారు. వారిని రాజ్యపాలనకు తయారుచేయాలి. మొదటిరెండువర్గాలలో వలె ఇందుకు కూడా స్త్రీలు, పురుషులు సమానంగా అర్హులే.

## తుది పరీక్ష

అలా మరొక అయిదేళ్లు శిక్షణ కొనసాగుతుంది, ఆ అయిదేళ్లలో యువతీ యువకులకు పారభౌతిక తత్వబోధ చేయాలి.

కాని, అది కూడా చాలదు. అందుచేత మరొక పదిహేనేళ్లపాటు- అంటే 50 ఏళ్లు వచ్చేవరకు వారికి రాజ్యపాలనలో వాస్తవ శిక్షణ [Practical training] ఇవ్వాలి. పారభౌతిక తత్వ శిఖరాగ్రాలనుంచి వారిని నేలమీదకు తీసుకువచ్చి న్యాయసమ్మతంగా రాజ్యాన్ని పాలించడంలో తర్ఫీదు ఇవ్వాలి. ఆ దశలో దైనందిన జీవితమే వారికి విద్యాలయం అవుతుంది. వారు పౌరులందరితో కలసి మెలసి తిరగాలి. జీవితంలో తటస్థించే ప్రతి సమస్యను ధైర్యస్థయిర్యాలతో ఎదుర్కోగలగాలి. సమస్త విద్యలలో తమ పరిజ్ఞానం, నైపుణ్యం ఏపాటిదో వారు పరీక్షించుకోవాలి. తక్కిన రెండు తరగతుల ప్రజల కంటె తాము అన్నిటి లోను అధికులమని నిరూపించుకోవాలి. అప్పుడు తిరిగి పరీక్ష. దానిలో కూడా నెగ్గినవారినే రాజ్యపాలనకు అర్హులుగా నిర్ణయించాలి. పరిపాలనా బాధ్యతలను వారు స్వీకరిస్తారు. వారే Philosopher kings-రాజర్షులు- అవుతారు. వారికి మిగిలిన రెండు వర్గాలవారు విధేయులుగా వుండాలి.

మరి ఆ విధంగా రాజ్యపాలకులైనవారు అవినీతిపరులు కాబోరని హామీ ఏమిటి?

## ప్లేటో కమ్యూనిజం

రాజ్యపాలకులకు ప్లేటో సొంత ఆస్తి (private property) నిషేధించాడు. వారికి "న్యాయేన మార్గేణ మహీం మహీశాం..." అన్నట్టు ధర్మ సంరక్షణం తప్ప ఇతర స్వీయ ప్రయోజనాలు వుండవు. రాజ్యానికి వారు ధర్మకర్తలు మాత్రమే. కనీసపు అవసరాలకు మాత్రమే వారికి సొంత వస్తువు లుంటాయి. వారికి ఏడాదికి సరిపడిన భుక్తిని, తదితర వస్తువులను సామాన్య ప్రజలు సమకూరుస్తారు.

రాజ్యపాలకులు చిన్న చిన్న కుటీరాలలో నిరాడంబరంగా, నియమబద్ధమైన కఠోర జీవితం గడుపుతారు, ఒకేచోట పడుకుంటారు, ఒకేచోట భుజిస్తారు. ఆయురారోగ్యాలకు అవసరమైన సాధారణాహారం మాత్రమే తీసుకుంటారు. వారికి సొంత కుటుంబాలు వుండవు. సంసారం చేయరని కాదు. కాని వారికి ప్రత్యేకించి స్వీయభార్యలంటూ వుండరు. స్త్రీలందరు పురుషు లందరికి భార్యలే. వారికి జన్మించే పిల్లలు అందరికి పిల్లలే. ఎవరు ఎవరి సంతానమో తెలియకుండా వారిని వేరుగా పెంచుతారు. స్వీయకుటుంబాలు లేనప్పుడు ఇక వారికి ధనవ్యామోహం ఎందు కుంటుంది? వెండి, బంగారాలపట్ల వారికి ప్రలోభం ఎందు కుంటుంది? ఆస్తి సంపాదించి తమ వారసులకు మూటకట్టి ఇవ్వాలనే ఆసక్తి ఎందుకుంటుంది?

అటువంటి వ్యవస్థలో అవినీతికి అవసరం లేదు. లంచగొండితనానికి తావు లేదు. నీతి నిటారుగా సగర్వంగా నిలబడుతుంది. ధర్మం నాలుగు పాదాలపై నడుస్తుంది.

స్థూలంగా ప్లేటో, చిత్రించిన ఆదర్శ రాజ్యం ఇదే.

## ఎవరు ఉత్తములు ?

ఇది అరిస్టాక్రసీ కాదా అనవచ్చు. అరిస్టాక్రసీ అంటే ఉత్తముల పరిపాలన. దాన్ని కోరనివారు ఎవరు వుంటారు? జన్మచేత, వంశంచేత, ధనబలం, దేహబలం చేత ఎవరూ ఉత్తమ శ్రేణికి చెందరు. తమ జ్ఞానబలంచేత, న్యాయ నిరతిచేత, సద్గుణ సంపత్తిచేత, సత్ప్రవర్తనచేత మాత్రమే ఎవరైనా ఉత్తము లవుతారు.

అందరు ఒకేచోట ప్రారంభమవుతారు. వివిధదశలలో ఒకే విధమైన పరీక్ష లకు నిలబడతారు. వాటిలో నెగ్గినవారే పరిపాలకు లవుతారు. తత్వం అంటే అమూర్త జ్ఞానం (Abstract knowledge) మాత్రమే కాదు- లౌకిక వివేకం కూడా. తాత్వికరాజులు జ్ఞానవీరులేకాక కార్యశూరులు కూడా అయివుంటారు.

ఇప్పుడు మళ్లీ మొదటికి వెడదాము. న్యాయం అంటే ఏమిటనే నిర్వచనం కోసం అన్వేషణతో కదా ఈ చర్చ ప్రారంభమైంది? న్యాయం అంటే ఎవరి శక్తి సామర్థ్యాలకు తగిన పని వారు చేయడం. ప్రకృతి ఎవరికి ఎట్టి స్థానాన్ని ఏర్పాటు చేసిందో దాన్ని వారు స్వీకరించడం, తమ విధ్యుక్తధర్మాలను నిర్వ ర్తించడం.

## అసత్య ప్రచారం

రాజ్యాధికారాన్ని ఎవరో కొందరుమాత్రమే చెలాయించగోరితే మిగిలినవర్గా లవారు సహిస్తారా? అని ప్రశ్న రావచ్చు. అందుకై ఒక అసత్యాన్ని ప్రజలలో ప్రచారంచేయాలని ప్లేటో ప్రతిపాదించాడు. దానికి Royal lie అని అతడు పేరుపెట్టాడు. అసత్యప్రచారం తప్పే కాని, ఆదర్శరాజ్య నిర్మాణంకోసం అది అనివార్య మంటాడు.

సహజ సిద్ధంగా మానవులలో మూడు రకాలవా రుంటారని, ఎవరిప్రకృతికి, ప్రవృత్తికి తగిన వర్గాన్ని వారు స్వీకరించాలని నచ్చచెప్పాలి. మొదటితరంలో ఈ ప్రచారాన్ని ప్రజలంతా విశ్వసించకపోవచ్చు. కాని, విద్యావిధానంవల్ల, నిరం తర బోధవల్ల కొన్ని తరాలలోనే ఇది తథ్యమవుతుందని, చివరికి మూడువర్గాల

వ్యవస్థ స్థిరపడిపోతుందని ప్లేటో భావించాడు. (నిజానికి ఇది అవాంఛనీయం కావచ్చుగాని, అసాధ్యం మటుకు కాదు. మనదేశంలో అసమానత్వంపై ఆధారపడిన అగ్రవర్ణాలు, నిమ్నవర్ణాల వ్యవస్థ కొన్నివేల ఏళ్లుగా "మూడు పువ్వులు, ఆరు కాయలు"గా వర్ధిల్లుతూ వుండడం దాన్ని దేవుడే స్వయంగా సృష్టించాడని ప్రచారంచేయడం మనకు తెలుసు.)

ఇంతేకాదు. మతాన్ని ప్లేటో పూర్తిగా సమర్థించాడు. దేవునిపై విశ్వాసం లేనిదే ఏ జాతి సక్రమంగా నడవదు. మానవుల భక్తి ప్రపత్తులకు, ఆశలకు, ధైర్యానికి, త్యాగబుద్ధికి ప్రోద్బలకంగా ఒక సాకార దైవాన్ని కల్పించాలి. దైవం ఆగ్రహిస్తాడు, అనుగ్రహిస్తాడు, సన్మార్గులను రక్షిస్తాడు, దుర్మార్గులను శిక్షిస్తాడు.

## ఆత్మ నిత్యత్వం

అలాగే ఆత్మ నశించదనే ధైర్యాన్ని నూరిపోయాలి. అప్పుడు మానవులు నిబ్బరంగా మృత్యువును ఎదుర్కొంటారు. సోక్రటీస్ ఆత్మ అనశ్వరమని విశ్వసించాడు. ఆ విశ్వాసంతోనే నిశ్చలంగా మృత్యువును ఆహ్వానించాడు. తనకోసం విలపిస్తున్న శిష్యులతో "పాతిపెట్టేది నా శరీరాన్నేకాని, నా ఆత్మను కాదు" అని ధైర్యం చెప్పాడు.

ఈ విశ్వాసానికి తార్కికాధారం లేకపోవచ్చు. కాని, అది మానవులకు అవసరమని, శ్రేయస్కరమని ప్లేటో చెప్పాడు. ఈ విధమైన దైవభీతి కూడా మానవులు ఎవరికి తగిన తరగతిని వారు అంగీకరించేటట్టు చేస్తుంది.

ఇంతచేసినా క్రిందివర్గంవారు పై వర్గంవారిని చూసి అసూయపడరా? అని ప్రశ్నరావచ్చు కాని, అట్టి అసూయకు తావులేదు. ఉత్తమవర్గం వారికి రాజ్యాధికారం తప్ప ఏమీ వుండదు. వారు ధనార్జన చేయడానికి వీలులేదు. యోగులవలె, విరాగుల వలె నిరాడంబరంగా జీవిస్తారు. కాగా, మిగిలినవారు భోగభాగ్యాలతో విలాసజీవితం గడపవచ్చు. అయితే, వారిధనాశ మరీ మితిమీరకుండా ప్రజల సగటు ఆదాయానికి నాలుగురెట్లు మించి ఏ ఒక్కరు ఆస్తిని కూడబెట్టరాదని నిబంధన విధించాలి.

మరొక ప్రశ్న : స్త్రీలకు సమష్టి భార్యాత్వం విధించడంవల్ల తగవులు రావా? ఉహూ. రావు, ఎందుకంటే ఈ పద్ధతిని పై రెండు వర్గాలకే పరిమితం చేయాలని, వారు అన్ని రాగద్వేషాలకు అతీతులై వుంటారని, కాగా, సామాన్య ప్రజా బాహుళ్యం ఏకపత్నీకులుగా కొనసాగవచ్చునని ప్లేటో అంటాడు.

ఇదంతా ఆచరణ సాధ్యమా అన్న సందేహం సహజంగానే కలుగుతుంది. అయితే, ప్లేటో ఊహించిన ఆదర్శరాజ్యం పూర్తిగా అతని స్వకపోల కల్పితం కాదని బెర్ట్రాండ్ రస్సెల్ అభిప్రాయపడ్డాడు.

## స్పార్టా ఒరవడి

ముఖ్యంగా అతనికి ఒరవడి పెట్టింది స్పార్టా. ఈ గ్రీకు నగర రాజ్యం దాదాపుగా ప్లేటో రిపబ్లిక్ వలెనే వుంటుంది. క్రీస్తుపూర్వం ఎనిమిదవ శతాబ్దిలో లైకర్గస్ అనే రాజనీతివేత్త స్పార్టాకు ఒక రాజ్యాంగం ప్రసాదించాడు. అది వీరుల రాజ్యం, సైనిక రాజ్యం. కొద్దిమంది చేతిలో పరిపాలనాధికారం వుండేది. వారు నిరాడంబరంగా జీవించేవారు. కలిసి ఒకేచోట భుజించేవారు, శయనించేవారు. వీరు సంతానం కోసమే సంగమించేవారు. దుర్బల శిశువులను నిర్దయగా అంతమొందించేవారు. పిల్లలను ప్రభుత్వపు ఆస్తిగా పరిగణించేవారు. మొత్తం ప్రజల ఏకైక ధ్యేయం మహా పరాక్రమవంతులను తయారుచేయడం, రాజ్యాన్ని రక్షించుకోవడం. ఇందుకోసమే వారి మనుగడ.

స్పార్టా ఆ విధంగా కొన్ని శతాబ్దాలపాటు ఒక సైనిక శిబిరంవలె కొనసాగింది. చుట్టుప్రక్కల గ్రీకు నగర రాజ్యాలు (City states) ఎన్నో మార్పులకు, విప్లవాలకు, విభిన్న రాజ్యాంగ ప్రయోగాలకు లోనవుతుండగా స్పార్టా మాత్రం ఎట్టి మార్పు లేకుండా, శత్రు దుర్నిరీక్ష్యంగా వర్ధిల్లింది. ఆ కాలపు గ్రీకులందరికీ స్పార్టా దాదాపు ఒక ఆదర్శ రాజ్యంగా వుండేది. ప్లేటోకు సయితం అంతే. స్పార్టాను దృష్టిలో పెట్టుకునే అతడు తన రిపబ్లిక్‌ను ఊహించి వుండాలి. అయితే, స్పార్టా నియంతృత్వ రాజ్యం, కాగా, ప్లేటో యుటోపియా అరిస్టాక్రసీని పోలినది. దాని ధ్యేయం న్యాయబద్ధ పరిపాలన. దాని రాజులు రాజర్షులు. అదీ తేడా.

## గ్రీకుల విశ్వాసాలు

ప్లేటో రిపబ్లిక్‌ను సానుభూతితో అర్థంచేసుకోవడం మనకు ఈనాడు చాలా కష్టం. దానిలో చాలా అంశాలు మనకు అసంబద్ధాలుగా, అభివృద్ధినిరోధకాలుగా కనిపిస్తాయి. అయితే, దాన్ని ప్లేటో కాలపు గ్రీకులవిశ్వాసాలను, సంఘపరిస్థితులను దృష్టిలోపెట్టుకుని పరిశీలించాలి. గ్రీకు నాగరికత మొత్తం బానిసలవ్యవస్థ (slavery) పై ఆధారపడినట్టిది. బానిసలులేనిదే గ్రీకుల అరిస్టాక్రసీ, అలిగార్కీ (ధనికస్వామ్యం), డెమోక్రసీ (ప్రజాస్వామ్యం), టిరనీ (నిరంకుశపాలన) ఏదీ లేదు. కొందరు కాయకష్టం చేస్తుండగా- కొందరు అధికారం చెలాయించేవారు, భోగజీవితం గడిపేవారు, కళారాధన చేసేవారు, లేదా తాత్త్వికచింతన

చేసేవారు. అన్నిటిలోకి తాత్త్వికచింతన పరమోత్కృష్టమైనదని, శ్రమైకజీవనం తక్కువ శ్రేణికి చెందినదని వారి విశ్వాసం.

పోతే సోక్రటీస్ సుభాషితాలలో ఒకటి knowledge is virtue (జ్ఞానమే నీతి) అనేది వుంది. మనిషి సరైన జ్ఞానంవల్లనే సత్ప్రవర్తన అలవరచుకోగలడని దీని అర్థం. చెడుమార్గం పడితే, దుర్మార్గంగా, అన్యాయంగా ప్రవర్తిస్తే అందువల్ల దుఃఖం కలుగుతుంది. దుఃఖాన్ని కోరి కోరి ఎవరూ వరించరు కదా? అయిన ప్పుడు దుఃఖదాయకమైన అన్యాయ ప్రవర్తనను ఎవరూ అలవరచుకోరు కదా? కనుక ఏది మంచి, ఏది చెడు అనే విచక్షణా జ్ఞానాన్ని కనుక మనిషి సాధిస్తే అతడు విధిగా న్యాయవర్తను డవుతాడు. ఇది సోక్రటీస్, ప్లేటోల విశ్వాసం. నిజమే కాని, వారు మానవునిలో స్వభావ సిద్ధమైన మానసిక దౌర్బల్యాలను తక్కువ అంచనా వేశారు. కేవల జ్ఞానంవల్లనే అవి తొలగిపోగలవని భావించ లేము. ఎంత జ్ఞానదాయకమైన విద్యా విధానంవల్ల కూడా వాటిని పూర్తిగా అంత మొందించలేము. కనుకనే ఎంత ఉత్తమ, నిర్దుష్ట రాజ్యాంగమైనా ఆచరణలో కొద్దికాలానికే భ్రష్టమైపోవడం మనం ఎరిగినదే.

## ఆదర్శవాదం

అయినా, మానవుడు ఆశావాది, ఆదర్శవాది, సహజ స్వాప్నికుడు. ఉత్తమ రాజ్య వ్యవస్థ కోసం కలలు కనడం అతడు మానలేదు. అందని అందానికై అఱ్ఱులు చాచడం, తన "ఆకాశాలను లోకానికి చేరువగా" తీసుకురావా లనుకో వడం అతని స్వభావం. అందుకే అలనాటి ప్లేటో నుంచి ఇటీవలి మార్క్స్ వరకు ఆదర్శరాజ్యం కోసం. 'మరో ప్రపంచం' కోసం పరితపించనివారు లేరు. అది ఎన్నటికీ అందనిదని తెలిసి కూడా అందుకొనడానికి ప్రయత్నించడంలోనే, ఏ కొద్ది సాఫల్యమైనా సాధించడంలోనే మానవజాతి మనుగడ, పురోగతి.

విల్ డ్యురాంట్ తన "స్టోరీ ఆఫ్ ఫిలాసఫీ"లో మరొకందుకు ప్లేటోను సమర్థించాడు. మానవులను ఉత్తములని. అనుత్తములని వర్గీకరించడం తప్పు కావచ్చు కాని, అది ప్రజాస్వామ్యమైనా, మరే స్వామ్యమైనా, రాజ్యపాలన బాధ్యతను తగు శిక్షణ పొందిన వారికే అప్పగించడం మంచిపద్ధతి కాదా? అన్ని వ్యవస్థలలోకి ప్రజాస్వామ్యం ఉత్తమం కావచ్చు. కాని, దానిలో ఎన్ని దారుణ లోపాలు లేవు? కేవలం ధనబలంతో, కులబలంతో, ప్రజల ఓట్లు సంపాదించిన ప్రతివాడు శాసన నిర్మాత, రాజ్యపాలకుడు అయిపోతున్నాడు. విద్యాశూన్యు డికీ, అక్రమ వర్తనుడికి సయితం మనం అధికారాన్ని అప్పగిస్తున్నాము. ప్లేటో సూచించినట్టు రాజ్యపాలనకు అర్హతలను నిర్దేశించడం ఈ లోపానికి పరిష్కా రమార్గం కాదా?

ప్లేటో దృష్టిలో పాలకులకు ఇవ్వవలసిన జ్ఞాన శిక్షణ ఎట్టిదో ఇప్పుడు పరి శీలిద్దాము.

# సత్యం శివం సుందరం

భారతీయ తత్వ చింతనలో ఎన్నో శాఖోపశాఖ లున్నాయి. అన్నిటిలోకి శిఖరాయ మానంగా నిలబడింది శంకరుని అద్వైతం. అది వెయ్యేళ్లకు పైగా హిందూ జీవిత దృక్పథాన్ని ప్రభావితం చేసింది, ఇంకా చేస్తున్నది.

అదేవిధంగా పాశ్చాత్య చింతనా ధోరణులను అమితంగా ప్రభావితం చేసి నట్టిది ప్లేటో తత్వ మీమాంస. అతడు అనాడు (క్రీస్తుపూర్వం నాల్గవ శతాబ్ది) లేవనెత్తిన అనేక తాత్విక సమస్యలు నేటికి కూడా వివిధ రూపాలలో దార్శనికులను వెన్నాడుతూనే వున్నాయి. చాలాకాలంపాటు అతని పేరును "ది డివైన్ ప్లేటో" అని వ్యవహరించడం పరిపాటిగా వుండేది.

అంతమాత్రాన ప్లేటోను ఆ కాలంలోగాని, ఆ తర్వాతగాని అందరూ యథా తథంగా అంగీకరించారని దీని అర్థం కాదు. అతని చింతనలో అనేక వివాదగ్రస్త విషయాలూ లున్నాయి. ప్లేటో ప్రథమ విమర్శకుడు అతని ప్రియ శిష్యుడైన అరిస్టా టిలే. ఇక ఈనాటి లిబరల్ హ్యూమనిస్టు (ఉదార మానవతావాదం) దృక్పథంతో చూస్తే దానిలో పరిహరించదగినవి, అభివృద్ధినిరోధకమైనవి ఎన్నో కనబడతాయి.

కనుక, ఒకవైపు అతడిని తాత్విక చక్రవర్తిగా కీర్తించిన వారిని, మరొక వైపు అతడిని నియంతృత్వవాదిగా (totalitarian)గా తెగనాడిన వారిని సమ న్వయం చేసుకుంటూ ప్రపంచ తత్వ శాస్త్ర పరిణామ చరిత్రలో అతని సము న్నత స్థానాన్ని అతనికి ఇవ్వవలసిందే తప్ప వేరొక మార్గం లేదు. ఈ పని బెర్ట్రాండ్ రస్సెల్‌వంటి ఆధునికులు చేశారు.

ఇప్పుడిక అతని తత్వ చింతనవద్దకు వద్దాము. క్రిందటి అధ్యాయంలో మనం చదివినట్టుగా ప్లేటో తన ఆదర్శరాజ్యానికి పరిపాలకులు కావడానికి తాత్వికులే అర్హులన్నాడు. అయితే ఎవరు తాత్వికులు? ఏది తత్వ జ్ఞానం?

ప్లేటో తత్వ మీమాంస అతి గహనమైనది. దాన్ని క్లిష్టంగా చెప్పడమంత సులభం మరొకటి లేదు. సులభంగా చెప్పడమంత కష్టం మరొకటి లేదు. దాన్ని క్షుణ్ణంగా వివరించడానికి ఒక ప్రత్యేక గ్రంథమే అవసర మవుతుంది. ఇక్కడ దాన్ని సంగ్రహంగా, సాధ్యమైనంత సరళంగా పరిచయం చేయడానికి ప్రయత్నిస్తాను.

## ప్లేటో పునాదులు

తన పూర్వ తాత్వికులనుంచి ప్లేటో కొన్ని విషయాలు స్వీకరించాడు.

హెరా క్లిటస్ ప్రపంచంలో మార్పు చెందనిది ఏదీ లేదని, జగత్తు క్షణక్షణ పరివర్తన శీలమైనదని ప్రతిపాదించాడు. దీన్ని ప్లేటో అంగీకరించాడు. "ఒకే నదిలో రెండుసార్లు స్నానం చేయలే"వని హెరాక్లిటస్ వాదం. సోక్రటీస్ శిష్య బృందంలో చేరడానికి ముందు హెరాక్లిటస్ అనుయాయి అయిన క్రేటిలస్‌వద్ద ప్లేటో కొన్నాళ్లు శుశ్రూష చేశాడట. ఈ క్రేటిలస్ అనే తత్వవేత్త "ఒక నదిలో రెండుసార్లు కాదు, ఒకసారి కూడా స్నానం చేయలేవు" అనేవాడట. అంత త్వరగా ప్రపంచం మార్పు (becoming) చెందుతున్నదని అతని భావం.

పోతే, పార్మినిడీస్ అసలు మార్పు లేదు పొమ్మన్నాడు. ప్రపంచానికి మూలమైన యాథార్థ్యం (reality)నిత్యం, పరిపూర్ణం, అచలం, కేవలం అని నిర్వచించాడు. దీన్ని కూడా ప్లేటో అంగీకరించాడు.

పితాగరస్ ప్రపంచం సంఖ్యామయమన్నాడు. ఇది భావవాదానికి పునాది వేసింది. ఆత్మ అనశ్వరమని, పూర్వజన్మ, పునర్జన్మ కలవని అతడు చెప్పాడు. కాగా సోక్రటీస్ నైతిక ధర్మభావానికి (the moral good) పరమోత్కృష్ట స్థానం ఇచ్చాడు. వీటిని కూడా ప్లేటో అంగీకరించాడు.

## ప్లేటో దోహదక్రియ

కాని, చివరికి వీటి నన్నిటిని దాటిపోయి పూర్తిగా తనదే అయిన ఒక భావ వాదాన్ని (theory of ideas) ప్లేటో ప్రతిపాదించాడు. ప్రపంచ తత్వశాస్త్రానికి అతడు చేసిన మౌలికదోహదం (original contribution) అదే. అతని దోహదంతోనే పాశ్చాత్య తత్వ తరుశాఖలు పల్లవించి, పుష్పించాయి.

ప్రపంచంలో ప్రతిదీ క్షణ క్షణం మారిపోతున్నది. ఈ నిమిషంలో వున్నది మరొక నిమిషంలో వుండదు. ఇవాళ వున్నది రేపు వుండదు. ఇంతగా నిరంతర పరివర్తన చెందే ప్రపంచం గురించి మనకు నిజమైన, నిశ్చితమైన జ్ఞానం ఎలా సాధ్యం ?

## సాపేక్ష ప్రపంచం

పైగా, ఇంద్రియ గోచరమయ్యే వస్తువులన్నీ సాపేక్షాలు (relative). అంటే ఒకరికి సుందరంగా కనబడే వస్తువు మరొకరికి వికృతంగా కనబడవచ్చు. అప్పుడు అది అందంగా వున్నట్టా, లేనట్టా? ఒకరికి న్యాయంగా కనబడినది మరొకరికి అన్యాయంగా కనబడవచ్చు. మరి అది న్యాయమా, అన్యాయమా? ఇలాగే సౌజన్యం, ధైర్యం, నీతి, ధర్మం, ప్రేమవంటి నైతిక గుణాలు కూడా. సాధారణ వ్యవహారంలో ఇవన్నీ సాపేక్షాలే. అలాగే అధికత్వం, అల్పత్వం; వేగం,

మాంద్యం; చలి, వేడి; కాఠిన్యం, మార్దవం; ఇంకా రంగు, రుచి, ధ్వని మొదలైన వాటికి సంబంధించినవి-అన్నీ సాపేక్షాలే. మొత్తంపై ఐంద్రియ జగత్తు (sensory world)లో అన్నీ సాపేక్షాలే. ఇటువంటి వస్తువుల గురించి నిజమైన, నిశ్చితమైన జ్ఞానం ఎలా సాధ్యం?

"మహిత భావాభావ మధ్యంబు లోకంబు"

నిజమైన జ్ఞానం నిజంగా, నిశ్చితంగా వున్నదాన్ని గురించే సాధ్యం. కాని, మనకు ఇంద్రియ గోచరమయ్యే ప్రపంచంలోని వస్తువులన్నీ ఎప్పటికప్పుడు మార్పు చెందు తున్నాయి. ఏ వస్తువు తను తానుగా వుండడంలేదు. మరొకటిగా మారుతున్నది. అంటే ఏ వస్తువూ 'ఇది' అని చెప్పడానికి వీలులేకుండా పోతున్నది. కనుక ఆ వస్తువు కాసేపువున్నట్టు కనబడుతున్నది తప్ప నిజంగా లేదన్నమాట.దానికి ఆభాస (appearance) తప్ప అస్తిత్వం (existence) లేదన్నమాట. ఇంద్రియగోచర వస్తువులు, అలాగే మనో గోచరమైన గుణాలు వుండడానికి, లేక పోవడానికి మధ్య- అస్తిత్వానికి, నాస్తికత్వానికి మధ్య-వూగిసలాడుతున్నాయి. వీటిని గురించి ఎవరి అభిప్రాయాలు వారికి వుండవచ్చు తప్ప నిజమైన, నిశ్చితమైన జ్ఞానం (true knowledge) సాధ్యంకాదు. వీటిని గురించి అభిప్రాయం (opinion) మాత్రమే సాధ్యం.

అయితే, మనకు జ్ఞానం (knowledge) అసాధ్యమని చెప్పడానికి వీలులేదు. జ్ఞానం నిస్సందేహంగా మనకు లభిస్తున్నది. లేకపోతే ఒక వస్తువును చూసినప్పుడు అది అందంగా వున్నదనో, లేదనో మనం ఎలా చెప్పగలుగుతున్నాము? అంటే ఏది సౌందర్యమో మనకు లీలగానైనా తెలుసు నన్నమాట. అలాగే ఒక పని న్యాయమైనదో, కాదో ఎలా చెప్పగలుగుతున్నాము? ఏది న్యాయమో కనీసం అభిప్రాయ ప్రాయంగానైనా మనకు తెలుసు నన్నమాట. ఒక చెట్టును చూసినప్పుడు అది చెట్టు అని ఎలా చెప్పగలుగుతున్నాము? ఏది చెట్టో, ఏది కాదో మనకు తెలిసివుంటేనే అది సాధ్యం.

అయితే ఇవన్నీ అభిప్రాయాలు. నిరంతరం మారిపోయే వస్తువులను గురించి, సాపేక్షమైన గుణాలు మొదలైనవాటి గురించి సాపేక్షం, తాత్కాలికం అయిన అభిప్రాయాలు తప్ప, నిజమైన జ్ఞానం కలగడానికి వీలులేదు. నిజమైన జ్ఞానం నిజంగా వున్నదాన్ని గురించే సాధ్య మనుకున్నాముకదా?

మరి ఆ విధంగా నిజంగా, నిశ్చితంగా అస్తిత్వం కలిగినవి ఏవైనావున్నాయా? నిస్సందేహంగా వున్నాయి. నిజానికి అవే వున్నాయి. తక్కినవి వున్నట్టు కనబడుతున్నాయి. అలా నిజంగా అస్తిత్వం, యాథార్థ్యం కలిగిన

వాటిని ఆకృతులు అని (forms), భావాలు అని (ideas) ప్లేటో పేర్కొన్నాడు. సంస్కృతంలో కూడా భావం అంటే "ఉన్నది," అభావం అంటే "లేనిది", అని ఈ సందర్భంలో గమనించవచ్చు.

## "ఏది కైవల్యం"

ఉదాహరణకు ఒక సుందరమైన వస్తువును తీసుకోండి. దాని అందం అశాశ్వతమే, సాపేక్షమే. కాని, సౌందర్యం అనేభావం (idea) శాశ్వతం, నిరపేక్షం. అలాగే న్యాయం అనేదికూడా. ఒకరికి న్యాయమైంది మరొకరికి అన్యాయం; ఇప్పుడు న్యాయమైంది మరొకప్పుడు అన్యాయం అవుతున్నప్పటికి న్యాయం అనే భావం (idea of justice) శాశ్వతం, నిరపేక్షం. ఈ శాశ్వత, నిరపేక్ష భావాలవల్లనే మనకు తాత్కాలిక, సాపేక్ష అభిప్రాయాలు కలుగుతున్నాయి. ఆ భావాలే ఈ అభిప్రాయాలకు ఆధారం.

ఈ భావవాదాన్ని ప్లేటో ఇంద్రియ గోచరమవుతున్న సమస్త ప్రపంచానికి వర్తింపజేశాడు. దీనిలోనే అతని మౌలిక ప్రతిభ (originality) కనబడుతుంది. దీన్ని "సార్వత్రిక సిద్ధాంతం" (theory of universals) అంటారు. ఇంద్రియ గోచరమయ్యే వస్తువులన్నీ ప్రత్యేక వస్తువులు (particulars). కాని, వాటికి సంబంధించిన భావాలు సార్వత్రికాలు (universals). ఇది నేటికి కూడా పండితులను తికమక పెడుతున్న ఆసక్తికర సిద్ధాంతం.

ఉదాహరణకి మనం మొదటిసారిగా గోవు అనే జంతువును చూశా మనుకోండి. అది మనకు ఒక భౌతిక పదార్థంగానే అవగాహన అవుతుంది తప్ప మరేమీ స్ఫురించదు. ఆ తర్వాత మరికొన్ని గోవులను చూస్తాము. వాటిలో సామాన్యం (common) గా కనబడే లక్షణాలనుబట్టి అవన్నీ ఒకే జాతికి చెందినవిగా గుర్తిస్తాము. అప్పుడు వాటిని ఈ గోవు, ఆ గోవు, వేరొక గోవు అని విడివిడిగా కాక అన్నిటిని గోవులుగానే గుర్తిస్తాము. వాటిలో సమానంగా వున్న గోత్వాన్ని (cowness) గుర్తిస్తాము. ఇక ఆ పిదప ఎప్పుడు ఎక్కడ ఎన్నిరకాల గోవులను చూపినా వాటిలోని గోత్వమే మనకు కనిపిస్తుంది. ఒక ప్రత్యేకమైన గోవు నశించినా, లేదా అన్ని గోవులు నశించినా, గోభావం మాత్రం నశించదు. ప్రత్యేకమైన గోవులు తాత్కాలికాలు, సాపేక్షాలు కాని గోభావం నిత్యమైనది, నిరపేక్షమైనది. అది సార్వత్రికం (universal) అవుతుంది.

అలాగే తక్కిన ప్రాపంచిక వస్తువులు కూడా. బల్లలు, కుర్చీలు, కలాలు, పుస్తకాలు, పట్టణాలు, పల్లెలు, కొండలు, నదులు-ఇలాగ ప్రపంచంలోని వస్తువులన్నిటికీ సార్వత్రిక భావాలుంటాయి. కొండ అనగానే మనకు ఈ కొండ, ఆ

కొండ అని కాక కొండ స్వభావం స్ఫురిస్తుంది. అలాగే బల్ల అనే మాట వినగానే ఇది, అది అని కాక సార్వత్రికమైన బల్ల అనే భావం స్ఫురిస్తుంది. ఏయే వస్తువులైతే కొన్ని సామాన్య లక్షణాలను కలిగివుంటాయో వాటిని వాటి వర్గాల (classes) క్రిందికి తీసుకువచ్చి వ్యవహరిస్తాము. రస్సెల్ చెప్పినట్టు ఇటువంటి వర్గీకరణ (classification) లేనిదే భాష నడవదు. మానవుడు అన గానే ఎల్లయ్య, పుల్లయ్య, రామారావు, సుబ్బారావు అనికాక మానవభావం మనస్సుకు స్ఫురిస్తుంది. ప్రత్యేక మానవులు (particular persons) అంతరించినా మానవభావం (Idea of man) కొనసాగుతుంది.

అదే విధంగా సుందరవస్తువులు నశించినా సౌందర్యభావంనశించదు. ప్రత్యేక సత్యవాక్కు మనకు వినబడడం మానివేసినా సత్యవాగ్భావం నశించదు. ప్రత్యేక వస్తువులవలె ఈ భావాలు ఒకప్పుడువుండి మరొకప్పుడు వుండకుండాపోవు. అవి ఎల్లప్పుడువుంటాయి. ఎందుకంటే అవి అశరీరమైనవి. అభౌతికమైనవి (non-material).

## ఆ ద ర్శా లు

పైగా ప్రత్యేక వస్తువులలో ఎన్నో లోపా లుండవచ్చు. సాధారణంగా మనం అందంగా వున్న దనుకున్న వస్తువులో ఎక్కడో, ఏదో లోపం కనిపిస్తుంది. కాని, కేవల సౌందర్యం(absolute beauty) అనే భావంలో లోపానికి తావులేదు. అది నిర్దుష్ట మైనది (perfect) . కనుక అది ఆదర్శ (ideal) ప్రతిపత్తి కలిగి వుంటుంది. అలాగే ఈ ఆదర్శ ప్రతిపత్తి కొండ, నది, బల్ల, కుర్చీ, మాన వుడు మొదలైన అన్ని భావాలకు వుంటుంది.

ఈ సార్వత్రిక భావాలతో కూడినదే యథార్థ జగత్తు (real world). ప్రత్యేక వస్తువులతో కూడినది ఐంద్రియజగత్తు. అది ఆభాస మాత్రమే కనుక దాన్ని గురించి అభిప్రాయం మటుకే కలుగుతుంది. జ్ఞానం అనేది అప్పుడు, ఇప్పుడు, ఎల్లప్పుడు వుండేదాన్ని గురించే, అంటే భావజగత్తును గురించే కలుగుతుంది. కనుక ఆ భావజగత్తును తెలుసుకోవడమే నిజమైన జ్ఞానం. భావాలు అభౌ తికం, అగోచరం కనుక బుద్ధి ద్వారానే వాటిని గుర్తించగలము. వివేచనతోనే వాటిని తెలుసుకోగలము. ఇందుకు దోహదపడేదే తత్వజ్ఞానం. అది గతి తార్కిక పద్ధతి ( dialectic) ద్వారా మాత్రమే సాధ్యపడుతుంది. ఇది నిజం కాదు, ఇది నిజం కాదు— "నేతి, నేతి"— అని తర్కించడమే ఆ తర్కపద్ధతి.

ఇక్కడ ఒక ప్రశ్న వస్తుంది. అసలైన సత్పదార్థాలు (real things) భావాలే అయితే ఈ దృశ్య జగత్తు ఎక్కడినుంచి వచ్చింది? అది నిజంగా వున్నట్టే కనబడుతున్నది కదా?

## భావాలనుంచే అన్నీ

అంటే భావాలనుంచే ఈ ఇంద్రియ వస్తువులన్నీ వచ్చాయని ప్లేటో సమాధానం చెబుతాడు. వృక్షత్వం (treeness) అనే భావంనుంచే ఈ చెట్టు, ఆ చెట్టు, అని ప్రత్యేక వృక్షాలు వచ్చాయి. వృక్షభావం ప్రత్యేక వృక్షాలలో అభివ్యక్తం (manifest) అవుతుంది. ప్రత్యేక వృక్షాలు వృక్షత్వం అనే భావంలో భాగస్వామ్యం (participation) కలిగి వుంటాయి. వృక్షత్వం లేకపోతే ప్రత్యేక వృక్షాలే వుండవు.

దీన్ని ఒక దృష్టాంతం ద్వారా అర్థం చేసుకోవచ్చు. మట్టితో బొమ్మలు తయారు చేసేవాడివద్ద ఒక మూస వుంటుంది. దానిలో మెత్తటి మట్టి నొక్కుతాడు. బొమ్మ తయారవుతుంది. కాని మూస మూసగానే వుంటుంది. ఎన్ని వందల బొమ్మలు తయారుచేసినా అది మారదు. బొమ్మలు విరిగిపోయినా, సరిగా రూప రేఖలు రాకపోయినా మూసమాత్రం అలాగే వుంటుంది. బొమ్మలు అశాశ్వతం. మూస శాశ్వతం.

భావం మూసవంటిది కనుక అది శాశ్వతం. దానిలోనుంచి ఉత్పన్నమయ్యే ప్రత్యేక భౌతిక వస్తువులు అశాశ్వతాలు. భావం నిర్దుష్టం, పరిపూర్ణం, ఆదర్శకం. వస్తువులు లోపభూయిష్టాలు, అపరిపూర్ణాలు. (Inperfect)

భావాలనుంచి ప్రత్యేక వస్తువులు ఎలా వస్తున్నాయి? ఇక్కడ ప్లేటో దేవుడిని ప్రవేశపెట్టక తప్పలేదు. దేవుడు భావాలు అనే మూసలను తీసుకుని వాటి సహాయంతో వివిధ వస్తువులను నిర్మిస్తున్నాడు. అయితే ఆ భావాలు దేవుడు సృజించినవి కావు. దేవుడి మనస్సులోనివి కావు. దైవం, భావాలు సమాన ప్రతిపత్తి కలిగినవి. వాటిని దేవుడు సృజించనట్టే, అవి దేవుడిని సృజించలేదు.

## "అసద్వా ఇద మగ్ర ఆసీత్"

ఇప్పటికి నాలుగు తత్వాలు తయారైనాయి. దేవుడు, భావాలు, అవ్యక్త భౌతిక పదార్థం (featureless, unmanifest matter), ఈ మూడింటితోను ఏర్పడుతున్న ప్రత్యేక వస్తువులు (particular and sensible objects).

భావాలు దేవుడు సృజించినవి కానట్టే మన మనస్సులో పుట్టినవి కూడా కావు. అనేక గోవులను చూడడం వల్లకాదు మనకు గోవు భావం కలిగేది. గోవు భావంవల్లనే మనం వివిధ గోవులను చూడగలుగుతున్నాము. గోభావం, అలాగే ఇతర భావాలు స్వయంభువులు, స్వయంసిద్ధాలు, మనోతీతాలు. తర్క వివేచనకు మాత్రమే అవి అందుతాయి.

అన్ని భావాలు సమానమైనవే కాని, కొన్ని ఎక్కువ సమానమైనవి. అంటే జార్జి ఆర్వెల్ పరిభాషలో (All ideas are equal but some ideas are more equal) అన్నమాట. వాటి ప్రాధాన్య క్రమాన్ని ప్లేటో నిర్ణయించాడు. భౌతిక వస్తువుల భావాలకంటె (బల్ల, కుర్చీ, గోవు, చెట్టు మొదలైనవి) గణిత భావాలు గొప్పవి. ఆ భావాలను గ్రహించడానికి భౌతిక వస్తువులు అక్కరలేదు. రెండు రెళ్లు నాలుగు అనేది త్రికాలాబాధితం. దాన్ని భౌతిక వస్తువులను చూడకుండానే బుద్ధితో గ్రహించ వచ్చు. గణిత సూత్రాలన్నీ ఇంతే. గురుత్వాకర్షణ సూత్రాన్ని (Law of universal gravitation) కింద పడుతున్న యాపిల్ పండును చూసి న్యూటన్ కనిపెట్టాడన్నది వట్టి కట్టుకథ మాత్రమే. కేవలం ఆలోచన ద్వారానే అతడు దాన్ని కనిపెట్టాడు. అలాగే ఇ = ఎమ్‌సి$^2$ అనే సూత్రాన్ని ఐన్‌స్టయిన్ తన గదిలో తలుపులు బిడాయించుకొని రోజులతరబడి కూర్చొని కనుగొన్నాడు ఇలాంటివి బుద్ధి గోచర భావాలు కనుక వాటికి ప్లేటో కొంత ఉన్నతస్థానం ఇచ్చాడు.

## సత్యం, శివం, సుందరం

అన్నిటికంటె ఉన్నత స్థానంలో సత్యం (Truth), శివం (Goodness), సుందరం (Beauty) అనే మూడు భావాలను నిలిపాడు. తిరిగి వీటిలో "శివం" (the good) అనే భావానికి అత్యున్నత స్థానమిచ్చాడు. తైత్తిరీయోపనిషత్తు 'ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్' అని ఆనందాన్ని (Bliss) బ్రహ్మ పదార్థంగా పేర్కొన్నట్టుగా ప్లేటో "శివం" భావానికి అగ్రతమ స్థానం కల్పించాడు. సూర్యుడు లేకపోతే వస్తువులు లేవు. సూర్యకాంతివల్లనే వస్తువులు దృగ్గోచరమవుతున్నాయి. అలాగే శివం వల్లనే తక్కిన భావాలు, వాటినుంచే ఐంద్రియ జగత్తు వచ్చాయి. శివం వల్లనే తక్కిన భావాలను, వాటివల్ల ఐంద్రియ వస్తువులను గ్రహించగలుగుతున్నాము.

అయితే మనం భావాలను ఎలా తెలుసుకోగలుగుతున్నాము? జ్ఞానం అనేది వున్నదాన్ని గురించే సాధ్యమని అనుకున్నాము కదా? అంటే జ్ఞాన విషయం (object of knowledge) అదివరకే వున్నదన్నమాట. లేనిదాన్ని గురించి జ్ఞానం ఎలా అసంభవమో, కొత్తదాన్ని గురించి కూడా జ్ఞానం అసంభవం. ఎందుకంటే ప్రపంచంలో కొత్త విషయం అనేది లేనే లేదు. మనకు ఒక విషయం గురించి నిశ్చిత జ్ఞానం లభించిందీ అంటే ఆ విషయం అదివరకునుంచే వుండి వుండాలి. లేకపోతే దాన్ని గురించిన జ్ఞానం మనకు కలిగేదే కాదు.

ఈ జ్ఞానం మనకు ఎలా కలుగుతున్నది? అంటే మన ఆత్మ భౌతికశరీ

రంలోకి ప్రవేశించడానికి ముందు భావజగత్తులో భావాలతో సహజీవనంచేస్తూ వుండివుండాలి. భౌతిక ప్రపంచంలోకి మనం శరీరధారులమై వచ్చాక పూర్వ స్మృతి పోతుంది. జ్ఞానం విస్మృతం అవుతుంది. దాన్ని తిరిగి మనకు జ్ఞాపకం చేసేదాన్నే విద్య అంటాము. విద్యవల్ల మనం కొత్త విషయాలను నేర్చుకోవడం లేదు. మన ఆత్మ భౌతిక శరీరం ధరించడానికి ముందు దానికి స్వతహాగా వున్న జ్ఞానాన్నే విద్య మనకు జ్ఞాపకం చేస్తుంది. ఎంత బాగా జ్ఞాపకం చేయగలిగితే అంత మంచి విద్య అన్నమాట.

## ఆత్మ రథికుడు

దీన్ని సుబోధకం చేయడానికి ప్లేటో ఒక కథలాంటిది చెప్పాడు. దాని సారాంశం ఇది. మొదట్లో ఆత్మలన్నీ భావాల స్వర్గంలో భావాలతో సహజీవనం చేస్తూ వుండేవి. ప్లేటో ఇక్కడ ఆత్మను రథికుడుగా పోల్చాడు. ఆత్మ ఎక్కిన ఆ రథానికి కోర్కె (desire) అనే ఒక గుర్రం, ఉద్వేగం (spirit) అనే మరొక గుర్రం పూన్చి వున్నాయి. ఆ రథంపై ఆత్మ అత్యున్నతమైన "శివం" అనే భావం వున్న స్వర్గానికి పోవాలని ప్రయత్నిస్తుంది. కొన్ని ఆత్మలు 'శివ' స్వర్గానికి వెడతాయి. కాని, చాలా ఆత్మలు గుర్రాలను నిగ్రహించలేక భూలోకానికి పడిపోయి జన్మలెత్తుతాయి. తమ పూర్వస్మృతిని కోల్పోతాయి.

ఈకథకు కఠోపనిషత్తులోని ఒక శ్లోకంతో వున్న పోలిక ఆశ్చర్యం కలగ జేస్తుంది. ప్లేటో నిజంగానే గంగానదీ తీరంవరకు వచ్చి మన ఋషులవద్ద ఉపనిషత్తులు చదువుకొని వెళ్లాడా అని అనుమానం కలుగుతుంది.

"ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవతు

బుద్ధింతు సారథిం విద్ధి మనః ప్రగ్రహామేవచ"

అదీ ఆ శ్లోకం. "ఆత్మ రథికుడు. శరీరం రథం. బుద్ధి సారథి, మనస్సు వగ్గం అని దాని అర్థం."

## ప్రపంచం ఒక చీకటిగుహ

మరొక్క కథతో ఈ అధ్యాయం ముగిస్తాను. ఆదర్శ రాజ్యాన్ని పాలించడానికి తత్వజ్ఞానులే అర్హులనికదా ప్లేటో అన్నాడు? మరి మిగిలినవారు ఎందుకు అర్హులు కారు? ఈ ప్రశ్నకు సమాధానంగా ప్లేటో 'గుహాదృష్టాంతం' అనే పేరుతో శతాబ్దాలుగా తత్వ చరిత్రలో ప్రఖ్యాతి పొందిన ఒక కథ కల్పించి చెబుతాడు.

అనగనగా విశాలమైన ఒక చీకటి గుహ. దాని ముఖద్వారం వద్ద గుహ గోడ వైపు తిరిగి వరసగా కొంతమంది ఖయిదీలు కూర్చున్నారు. జన్మించినదాదిగా వారు అక్కడే వున్నారు.

వారు అటూ ఇటూ కదలడానికి, వెనక్కి తిరిగి చూడడానికి వీలులేకుండా కాళ్లు, చేతులు, మెడ కట్టివేసి వున్నాయి. వారు అంతా ఎదుటివైపే చూస్తున్నారు. ఎదురుగా కొంత దూరంలో గుహ గోడ వుంది. వారి వెనుక ఒక పిట్టగోడ వుంది. ఆ గోడవెనుక ఒక పెద్ద నెగడు మండుతున్నది. దాని మసక వెలుతురు గుహలోకి వస్తున్నది. ఆ నెగడు ముందు ఆరుబయట కొందరు మనుషులు అటూ ఇటూ తిరుగుతున్నారు. వారి చేతులలో ఏవేవో వస్తువులున్నాయి. వారి నీడలు, ఆ వస్తువుల నీడలు గుహలోపల ఖయిదీల కెదురుగా వున్న గోడమీద పడుతున్నాయి. ఆ నీడలను చూసి ఖయిదీలు అవే అసలు వస్తువులని భ్రమిస్తున్నారు. వారికి అదే సత్యజగత్తుగా కనబడుతున్నది.

కాని, వారిలో ఒకడు ఎలాగో తప్పించుకుని గుహ బయటికి- సూర్యకాంతిలోకి- రావడం సాధ్యమైం దనుకోండి. మొదట వాడికి కళ్లు మిరుమిట్లుగొలిపి ఏమీ కనబడదు. క్రమంగా వాడు సూర్యకాంతికి అలవాటు పడతాడు. గుహ బయట అసలు మనుషులు, వారి చేతులలోని వస్తువులు నెమ్మదిగా కనబడడం ప్రారంభిస్తాయి. దూరంగా అందమైన సరస్సు, దానిఒడ్డున చక్కని చెట్లు, పువ్వులు, పిట్టలు మొదలైనవి కనబడతాయి. అప్పుడు వాడికి తెలుస్తుంది- తాను ఇంతకాలం అజ్ఞానాంధకారంలో వున్నట్టు, నీడలను చూసి అసలు వస్తువులు అని భ్రమపడినట్టు.

అప్పుడు తన తోటివారికి కూడా అలాగే జ్ఞానోదయం కలిగించాలని బుద్ధి పుడితే గుహలోకి తిరిగి వెడతాడు. మళ్లీ వాడి కళ్లు మసక చీకటికి అలవాటు పడడానికి కొంతసేపు పడుతుంది. చివరికి తోటి ఖయిదీలకు "మీరు చూస్తున్నవి నీడలు! అసలు వస్తువులు బయట వున్నాయి. మిమ్మల్ని విడిపిస్తాను. నాతో రండి చూపిస్తాను" అని చెబుతాడు. వాళ్లు వాడి మాటలు నమ్మరు. "బయట ఇంకొక ప్రపంచం వున్నదంటాడేమిటి? ఇదేకదా అసలు ప్రపంచం?" అనుకుంటారు. వాడిని పిచ్చి వాడుగా జమకడతారు. హేళన చేస్తారు. ఇంకా వాడు అవే మాటలు చెబుతుంటే కోపం పట్టలేక చంపేసినా ఆశ్చర్యం లేదు.

## జీవన్ముక్తులు

"మాయామేయ జగంబె నిత్యమని సంభావించే" ఆ ఖయిదీల వంటిది మానవజాతి. ఆ గుహలాంటిది ఈ జగత్తు. దాని నిజస్వభావం గ్రహించిన

ఖయిదీలాంటి జీవన్ముక్తులు (సోక్రటీస్‌వలె) తత్వ జ్ఞానులు. అసలు సత్యాన్ని గ్రహించిన తర్వాత, మనం చూస్తున్నది అసత్య, అనిత్య ప్రపంచమని గ్రహించిన పిదప- తత్వ జ్ఞానులకు ఐహిక వస్తువులపై, లౌకిక సుఖాలపై వ్యామోహం ఎందుకు కలుగుతుంది? అటువంటివారే కాదా ఆదర్శ రాజ్య పాలకులు కాదగినవారు?

భారతం మధ్యలో భగవద్గీత వస్తుంది. అనర్గళంగా సాగిపోతున్న కథా రథాన్ని కాసేపు ఆపుచేసి శ్రీకృష్ణుడు అర్జునుడికి గీతోపదేశం చేశాడు.

అలాగే ప్లేటో "రిపబ్లిక్" అనే తన మహాగ్రంథంలో ఆదర్శరాజ్యాన్ని వర్ణిస్తూ మధ్యలో ఇప్పటివరకు మనం చదివిన తత్వజ్ఞాన రహస్యాలను వివరించాడు. రాజ్య పాలనకు ఎటువంటివారు అర్హులో, వారు అలవరచుకోవలసిన తత్వజ్ఞానం ఎటువంటిదో కవితా శైలిలో ఉల్లేఖించాడు. అతని భావవాదంతో మనం ఏకీభవించలేకపోవచ్చు. కాని, అతని అసాధారణ మేధాశక్తికి, తత్వ వ్యవస్థా నిర్మాణ నైపుణ్యానికి జోహార్లు అర్పించకుండా వుండలేము.

# 13
# సజీవ విజ్ఞాన సర్వస్వం అరిస్టాటిల్

ప్లేటో నడుపుతున్న అకాడెమీకి ఒక రోజున ఒక యువకుడు వచ్చాడు. అతనికి 17-18 ఏళ్లుంటాయి. స్ఫురద్రూపి. నడకలో ఠీవి, మాటలో మర్యాద, భంగిమలో గాంభీర్యం, ముఖంలో విజ్ఞాన వర్చస్సు ఉట్టిపడుతున్నాయి. ఖరీదైన దుస్తులు ధరించి మనిషి దర్జాగా వున్నాడు. అతని పేరు అరిస్టాటిల్.

అతడిని ప్లేటో తన అకాడమీలో విద్యార్థిగా చేర్చుకున్నాడు. సోక్రటీస్ శిష్యులలో ప్లేటో అగ్రగణ్యుడు. ప్లేటో శిష్యులలో అరిస్టాటిల్ అగ్రగణ్యుడు. ఎటొచ్చీ అరిస్టాటిల్ శిష్యులలో ఒకడైన అలెగ్జాండర్ తత్వవేత్త కాలేదు. చక్రవర్తి అయ్యాడు.

ప్రాచీన పాశ్చాత్య ప్రపంచంలో అరిస్టాటిల్‌ను మించిన మేధావి లేడని ప్రతీతి. "కవి" అనే సంస్కృత పదానికి గల అర్థాలలో ఒకటి వాల్మీకి. కవి, వాల్మీకి పర్యాయపదాలు. అలాగే పాశ్చాత్య ప్రపంచంలో "ది ఫిలాసఫర్" తత్వవేత్త - అనే మాట అరిస్టాటిల్‌కు పర్యాయపదమైంది.

పాశ్చాత్యుల తత్వశాస్త్రాన్ని ప్లేటో విశేషంగా ప్రభావితం చేశాడని ఇంతకు ముందు తెలుసుకున్నాము. కాని, ప్లేటో కంటె మిన్నగా ఒక్క తత్వశాస్త్రం

లోనే కాక అనేక శాస్త్రాలలో, దాదాపు రెండువేల ఏళ్లపాటు ఏకచ్ఛత్రాధిపత్యం నెరపినవాడు అరిస్టాటిల్. క్రైస్తవ దేశాలన్నిటిలోను సుమారొక వెయ్యేళ్లపాటు అతని రచనలను పాఠ్యపుస్తకాలుగా ఉపయోగించేవారు; వాటిని విద్యార్థులచేత బట్టీ పట్టించేవారు. మానవ విజ్ఞానం అతనితో ఆరంభమై, అతనితో ఆగిపోయిందని భావించేవారు. అతడిని కాదనడం మతద్రోహమని క్రైస్తవులు పరిగణించేవారు.

## సర్వతోముఖ విజ్ఞానం



విజ్ఞానరంగంలో అరిస్టాటిల్ స్పృశించని విషయం లేదు. అగస్త్యుడు సముద్రాన్ని అపోశన నిహ పట్టినట్టు, అరిస్టాటిల్ ఖగోళ, భౌతికశాస్త్రాలు—వృక్ష, జంతు శాస్త్రాలు—తర్క, తత్వశాస్త్రాలు—నీతి, రాజనీతి శాస్త్రాలు—మనస్తత్వ, కావ్య తత్వ శాస్త్రాలు—ఇంకా ఎన్నిటినో అతడు అపోశన పట్టాడు. అరిస్టాటిల్ సుమారొక వెయ్యి గ్రంథాలు రచించాడని అంటారు. కాని, వాటిలో చాలాభాగం కాలగర్భంలో కలిసిపోయాయి. కొన్ని మాత్రమే ఇప్పుడు లభిస్తున్నాయి. వాటిలోనైనా అతని పేరిట ఎవరో వ్రాసినవి కొన్ని, అతడు పాఠాలు చెబుతుండగా శిష్యులు వ్రాసుకున్న నోట్సు నుంచి కూర్చినవి మరికొన్ని వున్నాయని పండితులు నిర్ధారణ చేశారు. కాని, ఎంత తీసివేసినా, అరిస్టాటిల్ స్వయంగా రచించిన గ్రంథ సముచ్చయం ఆశ్చర్యం కలిగిస్తుంది.

## గురు శిష్యులు

ప్లేటో వద్ద విద్యాభ్యాసం చేసినప్పటికి, గురువుతో దాదాపు ఏ విషయంలోను అరిస్టాటిల్ ఏకీభవించలేదు. విద్యార్థిగా వున్న రోజులలో కూడా—మొదట కొన్నాళ్లుతప్ప—అన్నిటికి ఎడ్డెం అంటే తెడ్డెం అనేవాడు. పాఠం పూర్తి అయి, శిష్యులందరు ఎవరిదారిన వారు వెళ్లిపోయాక, గురువుతో అరిస్టాటిల్ వాదం వేసుకునేవాడు. వారిరువురి గురు శిష్య సంబంధం విచిత్రమైనది. గురువుపై శిష్యునికి విశేష గౌరవం. శిష్యునిపై గురువుకు అశేష వాత్సల్యం. అరిస్టాటిల్ తన అకాడమీకి మెదడు వంటివాడని ప్లేటో మెచ్చుకునేవాడు.

కాని, ఎప్పుడో ఇరువురికి తిక్క రేగేది. అరిస్టాటిల్ భాగ్యవంతుడు కనుక కనబడిన ప్రతి పుస్తకం కొనేవాడు. తన గ్రంథాలయంలో భద్రపరిచేవాడు. అతని నిరంతర పఠనం చూసి ప్లేటో అతడిని "పుస్తకాల పురుగు" అనేవాడు. అరిస్టాటిల్ కూడా వూరుకునేవాడు కాడు. "విజ్ఞానం ప్లేటోతోనే ఆఖరు కాబోదులెండి" అని చాటుమాటున అనేవాడు. "ప్లేటో ప్రేమాస్పదుడే. కాని, సత్యం అంతకంటే ప్రేమాస్పదమైనది."(Plato is dear; but truth is dearer still) అనేది అరిస్టాటిల్ సుభాషితాలలో ఒకటి.

అరిస్టాటిల్ క్రీస్తుపూర్వం 384 లో గ్రీసు ఉత్తరాన మేసిడోనియా రాజ్యంలో స్టజీరా అనే నగరంలో కులీన, ధనిక కుటుంబంలో జన్మించాడు. మేసిడోనియా రాజు అమిన్‌టాస్‌వద్ద అరిస్టాటిల్ తండ్రి నికొమేకస్ ఆస్థాన వైద్యుడు. అరిస్టాటిల్ బాల్యమంతా భోగభాగ్యాలమధ్య దర్జాగా గడిచింది. అయితే విలాసాలతోపాటు విజ్ఞానార్జనపట్లకూడా అతనికి అపారమైన ఆసక్తి. అందుకే అతడిని బంధువులు ప్లేటో అకాడెమీలో ఉన్నత విద్యాభ్యాసానికి ఏథెన్సు పంపించారు.

## ఆశాభంగం

ప్లేటో క్రీస్తుపూర్వం 347 లో కాలధర్మం చెందాడు. అప్పటికి అరిస్టాటిల్ వయస్సు 37 ఏళ్లు. అకాడెమీకి తనను అధిపతిగా చేస్తారని అతడు ఆశించాడు. కాని, పరదేశీయుడనే వంకతో అతడిని తిరస్కరించారు. అకాడెమీ ఆధిపత్యం ప్లేటో సమీప బంధువు స్ప్యూసిప్పస్‌కు లభించింది.

దానితో అరిస్టాటిల్‌కు ఆశాభంగం కలిగింది. ఏథెన్సులో వుండి చేసేదేమీ లేదనుకున్నాడు. జెనోక్రటీస్ అనే సహాధ్యాయితో కలిసి ఆసియా మైనర్ వెళ్లాడు. అస్సస్ అనే పట్టణంలో ఒక విద్యాలయం స్థాపించాడు. అక్కడ హెర్మియాస్ అనే సామంతరాజు తటస్థపడ్డాడు. అతడు అరిస్టాటిల్‌తోపాటు అకాడెమీలో చదువు కున్నవాడే. అతడు అరిస్టాటిల్‌ను తన రాజ్యానికి ఆహ్వానించాడు. పైగా తనకు వరుసకు సోదరి అయిన పిథియాస్ అనే యువతిని అరిస్టాటిల్‌కిచ్చి పెండ్లి చేశాడు. ఆమె తెచ్చిన కట్నాలు కానుకలతో అరిస్టాటిల్ గొప్ప భాగ్యవంతుడయ్యాడు.

ఇంతలో అరిస్టాటిల్‌కు మేసిడోనియా రాజు ఫిలిప్‌నుంచి ఆహ్వానం వచ్చింది- తన కుమారుడైన అలెగ్జాండరుకు విద్యాబుద్ధులు చెప్పడానికి రావలసిందని.

ఫిలిప్ జీవితాశయం ఒకటే. అంతఃకలహాలతో మునిగిపోయిన గ్రీకు నగర రాజ్యాలన్నిటిని జయించి గ్రీసు దేశానికి తాను ఏకచ్ఛత్రాధిపతి కావాలని అతని పేరాస. అయితే, తన జీవిత కాలంలో అది నెరవేరకపోవచ్చు. తన కుమారుడైన అలెగ్జాండర్‌ను తనకు తగిన వారసునిగా తీర్చిదిద్దాలి. అతని ద్వారానైనా తన ఆశ నెరవేరాలి.

## యువనాశ్వం

కాని, అలెగ్జాండరుకు అప్పటికి నిండా పదమూడేళ్లయినా లేకపోయినా, పచ్చి పొగరుబోతు, వదరుబోతు, తిరుగుబోతు, తాగుబోతు. అడవి గుర్రాలను అవలీలగా మచ్చిక చేసేవాడు. కాని, తానే ఒక అడవి గుర్రంగా తయారయ్యాడు. విశృంఖలంగా ప్రవర్తించేవాడు. అతడిని దారిలో పెట్టడానికి అరిస్టాటిల్ ఒక్కడే తగినవాడని ఫిలిప్ తన కుమారుడిని అతనికి అప్పగించాడు. ఒక భావి సార్వభౌముడిని సమస్త విద్యాపారంగతుడుగాచేసే అవకాశం లభించినందుకు అరిస్టాటిల్ పొంగిపోయాడు.

కాని, అరిస్టాటిల్ బోధలు అలెగ్జాండర్ తలకెక్కలేదు. అతని తల దొలుస్తున్న ఆలోచన ఒక్కటే. ఎప్పుడు సింహాసనంపై కూర్చుందామా. ఎప్పుడు ప్రపంచాన్ని జయిద్దామా, చక్రవర్తిగా చరిత్రలో తన పేరు చిరస్థాయిగా ఎలా చేసుకుందామా- ఇదే అతని ఆలోచన.

ఫిలిప్ గ్రీకు రాజ్యాలన్నిటిని వరసగా జయించాడు. మొత్తం గ్రీసు అతని పాదాక్రాంతమైంది. ఏథెన్సు కూడా అతని కైవసమైంది. ఇంతలో (క్రీస్తు పూర్వం 336) ఎవరో అతడిని హఠాత్తుగా హత్య చేశారు. తండ్రి మరణంతో అలెగ్జాండర్ రారాజు అయ్యాడు. అప్పటికి అతనికి ఇరవై ఏళ్లు. చదువుకు స్వస్తి, గురువుకు ఉద్వాసన చెప్పాడు. ప్రపంచంమీద విరుచుకుపడ్డాడు.

అరిస్టాటిల్‌కు ఏమి చేయాలన్న సమస్య మళ్లీ ఎదురైంది. ఏథెన్సుపై దృష్టి మళ్లింది. ఆ నగరం చేరుకున్నాడు. డబ్బుకు కొరత లేదు. భార్య తెచ్చిన కట్నం డబ్బు బోలెడుంది. అలెగ్జాండర్‌కు చదువుపై శ్రద్ధ అంతంతమాత్రమైనా గురువుపై గౌరవ ప్రపత్తి తక్కువ కాదు. అతడు గురువుగారి విజ్ఞాన పరిశోధనల నిమిత్తం 800 నాణాలు ఇచ్చాడు. ఆ ధనం విలువ ఇప్పటి రోజులలో 40 లక్షల డాలర్లకు తక్కువ వుండదని అంచనా.

## విద్యాలయ స్థాపన

ఈ అపార ధనంతో అరిస్టాటిల్ తన మాజీ సహాధ్యాయి జెనోక్రటీస్ అధ్వర్యాన గల ప్లేటో అకాడెమీకి పోటీగా మరొక విద్యాలయం స్థాపించాడు. నిజానికి అది విద్యాలయం కాదు. విశ్వవిద్యాలయం. దానిపేరు "లైసియం", ప్లేటో అకాడెమీలో గణితశాస్త్రం, తత్వశాస్త్రం, రాజకీయశాస్త్రం ఇవే ముఖ్యంగా నేర్పేవారు. లైసియంలో వీటితోపాటు తక్కిన శాస్త్రాలు కూడా బోధించేవారు.

ఒకవైపు విద్యా బోధన, మరొకవైపు విజ్ఞాన శోధన- ఇదీ అరిస్టాటిల్ నిత్య వ్యాసంగం. తన కాలం వరకు ప్రపంచంలోని మేధావులందరు కనుగొన్న విజ్ఞానమంతా సేకరించి, క్రోడీకరించి, భావితరాల కోసం భద్రపరచాలన్నది అతని

జీవితాశయం. ఎక్కడెక్కడినుండో వ్రాతప్రతులు తెప్పించేవాడు. ఒక క్రమపద్ధతిలో అమర్చేవాడు. వేటగాళ్లను, పల్లెకారులను, పరిశోధకులను దేశదేశాలకు పంపించి అపురూపమైన జంతువులను, మొక్కలను, పురాతన వస్తువులను తెప్పించేవాడు. అనేక ఇతర విజ్ఞాన శాస్త్రాలతోపాటు బహుశా లైబ్రరీ సైన్సుకు కూడా అతడే ఆద్యుడు. ప్రపంచంలో మొదటి జూను, బొటానికల్ గార్డెన్‌ను స్థాపించింది కూడా అతడే కావచ్చు.

తన పరిశోధనలకు కావలసినవాటిని సేకరించడానికి ఒకానొక సమయంలో అతనిక్రింద వెయ్యిమంది మనుషులు వుండేవారట. నైలునదికి ఏటేటా వరదలు ఎందుకు వస్తున్నాయో అప్పటివరకు ఎవరికీ అంతుచిక్కని విషయం. అది కనుగొనడానికి అరిస్టాటిల్ కోర్కెపై అలెగ్జాండర్ కొందరిని ఈజిప్టు పంపించాడట. అబిసీనియాలోని కొండలపై కురిసిన మంచు కరిగి ప్రవహించి ప్రతి సంవత్సరం నిర్ణీత ఋతువులో నైలునదికి వరదలు వస్తున్నాయని వారు కనుగొన్నారట.

## పచార్లు, పాఠాలు

"లైసియం" విద్యాలయం విశాలమైన ఒక ఉద్యానవనంలోని భవనాలలో వుండేది. దేశదేశాల నుంచి విద్యార్థులు వచ్చేవారు. ఉదయంపూట విజ్ఞాన పాఠాలు చెప్పేవాడు. సాయంత్రంపూట సామాన్య విషయాలపై ప్రసంగాలు.

అప్పటికి అతడికి యాభై ఏళ్లు దాటాయి. ఒకచోట స్తిమితంగా కూర్చోలేక పోయేవాడు. ఉద్యానవనంలోని చెట్లబారుల నీడలలోనో, సౌధ స్తంభాల బారుల మధ్యనో అటూ ఇటూ పచార్లు చేస్తూ పాఠాలు బోధించేవాడు; సందేహాలకు సమాధానాలు చెప్పేవాడు. శిష్యులు గురువుతో పాటు పచార్లు చేస్తూ పాఠాలు వినేవారు; నోట్సు వ్రాసుకునేవారు.

ఇలా పచార్లు చేస్తూ పాఠాలు చెప్పడంవల్ల అరిస్టాటిల్ విద్యాలయాన్ని "పెరిపాటెటిక్ స్కూలు" అని వేళాకోళం చేసేవారు. "పెరిపాటస్" అనే గ్రీకు మాటకు 'నడక' అని అర్థం. పెరిపాటెటిక్ స్కూల్ అంటే పచార్లుకొట్టే పాఠశాల. చివరికి తత్వశాస్త్ర చరిత్రలో అరిస్టాటిల్ దర్శనానికి "పెరిపాటెటిక్ స్కూల్ అఫ్ ఫిలాసఫీ" అనే పేరు స్థిరపడిపోయింది. "ఉద్యానం" (ఉత్ + యానం) అంటే ఒక అర్థం "నడవడం". కనుక అరిస్టాటిల్ తన ఉద్యానవనంలో బోధించిన తత్వశాస్త్రాన్ని తెలుగులో మనం "ఉద్యాన దర్శనం" అని సార్థకంగా అనవచ్చు.

## అలెగ్జాండర్ జైత్రయాత్ర

మరొకవైపు అలెగ్జాండర్ దండయాత్ర నిరాఘాటంగా సాగిపోతున్నది. ఇటు గురువు విజ్ఞాన జైత్రయాత్ర. అటు శిష్యుని ప్రపంచ జైత్రయాత్ర. ఈజిప్టులో, మధ్య ప్రాచ్యంలో, పర్షియాలో ప్రతిచోట అలెగ్జాండర్ జయపతాకాలు ఎగురుతున్నాయి. భారతదేశంలో ప్రవేశించాడు. పెషావర్ వద్ద పురుషోత్తముడితో యుద్ధం జరిగింది. పంజాబును జయించాడు. ఇంకా ముందుకుపోయి ఆర్యావర్తమంతా కబళించాలని అత్యాశకు పోయాడు. కాని, అప్పటికే పదేళ్లుగా స్వదేశం విడిచివచ్చిన సైనికులు ఒక్క అడుగైనా ముందుకుపోమని నిరాకరించారు. అలెగ్జాండర్ చేసేదిలేక వెనుదిరిగాడు.

అప్పటికి అతడు సువిశాల భూభాగానికి రాజాధిరాజు అయ్యాడుగాని, సమస్త వ్యసనాలకు బానిసగా తయారయ్యాడు. అహంకారం నరనరాన జీర్ణించుకుపోయింది. ఎవరో అతడిని సాక్షాత్తు జూపిటర్ దేవత కుమారుడని కీర్తించారు. ఆ మాట పట్టుకుని తానే దేవుడినని ప్రకటించుకున్నాడు. అంతా నీవే దేవుడివన్నారు. ఒకడు మాత్రం అతడిని దేవుడుగా గుర్తించడానికి నిరాకరించాడు. అతడు అరిస్టాటిల్ సమీప బంధువైన కాలిస్తెనీస్ అనే తత్వవేత్త. తన దండయాత్రా చరిత్రను ఎప్పటి కప్పుడు వ్రాయడానికి కాలిస్తెనీస్‌ను అలెగ్జాండర్ వెంటపెట్టుకుని వెళ్లాడు. అతనిపై ఆగ్రహించి చిత్రహింస పెట్టి ఉరి తీయించాడు.

## అలెగ్జాండర్ మృతి

చివరికి అలెగ్జాండర్ తన సామ్రాజ్యానికి నూతన రాజధాని అయిన బాబిలోన్ నగరంలో నిరంతర సురాపానంతో జ్వరగ్రస్తుడయ్యాడు. క్రీస్తుపూర్వం 323 లో తన 33 వ ఏట మరణించాడు.

అతని మరణంతో అతని సామ్రాజ్యం పేకమేడవలె కూలిపోయింది. అతడు వివిధ రాష్ట్రాలకు నియమించిన సామంతులు ఎక్కడి కక్కడ స్వాతంత్ర్యం ప్రకటించుకున్నారు. ఏథెన్సు ప్రజలు కూడా మేసిడోనియన్ పార్టీపై తిరుగుబాటుచేసి స్వాతంత్ర్యం ప్రకటించుకున్నారు. వారి దృష్టి అరిస్టాటిల్ పైకి పోయింది. అతడు అలెగ్జాండర్ గురువు కదా? అతడిని అలెగ్జాండర్ గూఢచారిగా జమకట్టారు. పైగా దైవద్రోహిగా- అంటే తాము పూజించే దేవతలను తృణీకరించినవాడుగా- అభియోగం మోపారు.

## అరిస్టాటిల్ మృతి

ఇక సోక్రటీస్‌కు పట్టిన గతి పట్టడమే తరువాయి. కాని, అరిస్టాటిల్

జాగ్రత్త పడ్డాడు. "తత్వశాస్త్రంపై రెండవసారి అత్యాచారం జరగనివ్వను" అంటూ ఏథెన్సు నుంచి నిష్క్రమించాడు. తన తల్లి జన్మస్థలమైన చాల్సిస్ నగరానికి వెళ్లాడు. ఒక ఏడాది ప్రవాస జీవితం తర్వాత అనారోగ్యంతో బాధపడుతూ క్రీస్తుపూర్వం 322 లో కాలధర్మం చెందాడు.

అదీ అరిస్టాటిల్ జీవిత కథ. ఇక అతని తాత్విక, వైజ్ఞానిక సారస్వ తాన్ని సమీక్షించాలంటే- ప్లేటోకు వలె- వేరే ఒక గ్రంథమే అవసరం. ఇక్కడ స్థూలంగా, సంగ్రహంగా మాత్రమే అది సాధ్యం.

## రచనా బాహుళ్యం

అరిస్టాటిల్ రచనలను కొన్ని శీర్షికల క్రింద పండితులు విభాగించారు. 1. ఆర్గనాన్- ఇది అతని తర్కశాస్త్ర రచనల క్రోడీకరణ. 2. సైన్సులు- భౌతిక, ఖగోళ, వాతావరణ, వృక్ష, జంతుశాస్త్రాలు. 3. మనస్తత్వశాస్త్రం. 4. మెటఫిజిక్సు- పారభౌతిక తత్వశాస్త్రం. 5. ఎథిక్స్- నీతిశాస్త్రం. 6. పోలిటిక్స్- రాజకీయశాస్త్రం. 7. పొయటిక్స్, రెటరిక్- కవిత్వ తత్వవిచారం, భాషాపాటవశాస్త్రం.

ఇంతకుముందు చెప్పినట్టు- ఒక వ్యక్తి ఇన్ని శాస్త్రాలలో కృషి చేయడం, మార్గదర్శకుడు కావడం దాదాపు మానవాతీత కార్యంగా కనిపిస్తుంది. అయితే, అదే సమయంలో అతని వైజ్ఞానిక కృషి - స్వల్పంగా తప్ప- చాలావరకు ఈనాడు నిరుపయోగం. అది కాలం పరీక్షకు నిలవలేదు. ప్రతి సైన్సుకు అతడు రాజమార్గం వేశాడు. కాని, ప్రతి సైన్సులోను శాస్త్రవేత్తలు చేయరాని పొర పాట్లు చేశాడు.

కాని, ఒకటి దృష్టిలో పెట్టుకోవాలి. అతని మెదడే అతని ప్రయోగశాల. అప్పటికి టెలిస్కోపు లేదు. మైక్రోస్కోపు లేదు. సరైన గడియారం లేదు. బెరామీటరుగాని, థర్మామీటరు గాని లేవు. నిర్దుష్టమైన తూనికలు, కొలతలు లేవు. పైగా ఇలాంటి పరికరాల సహాయంతో నూత్న విశేషాలు కనుగొనడం ఆనాటి గ్రీకు విజ్ఞానులకు నామర్దా. అన్నీ మెదడుతోనే కనుగొనాలన్నది వారి ఆదర్శం.

ఆధునిక శాస్త్రవేత్తలు అరిస్టాటిల్ కంటె అధిక మేధావంతులు కారు. కాని, వారికి ఆధునిక పరికరాల సహాయం వున్నది. గలీలియో తయారుచేసిన టెలిస్కోపు ఆధునిక ఖగోళ శాస్త్రానికి ప్రధాన సాధనం.

## విజ్ఞాన దీపిక

క్రీస్తుశకం 15 వ శతాబ్ది చివరిదాకా అన్ని సైన్సులలోను అరిస్టాటిల్ దే

ఆఖరు వాక్యం. యూరప్‌లో మధ్యయుగాల అంధకారానికి అతడు వెలిగించిన విజ్ఞాన దీపం సరిపోయింది. కాని, "రినేజాన్స్" ప్రారంభమయ్యేసరికి, నూతన విజ్ఞాన ప్రపంచానికి ద్వారాలు తెరుచుకున్నాయి. ఆ ద్వారాల ద్వారా ప్రసరించిన ఆధునిక విజ్ఞాన కాంతిలో అరిస్టాటిల్ సిద్ధాంతాలలోని అనేక లోపాలు బయటపడ్డాయి. నిజానికి అతని పరోక్ష ప్రభావం వల్ల శాస్త్ర విజ్ఞానం వెయ్యేళ్లకు పైగా స్తంభించిపోయింది.

తర్కశాస్త్రంలో ఫ్రాన్సిస్ బేకన్ కొత్తపుంతలు త్రొక్కాడు. ఖగోళ, భౌతిక శాస్త్రాలలో కొపర్నికస్, గలీలియో, కెప్లర్, న్యూటన్ కొత్త తలుపులు తెరిచారు. అరిస్టాటిల్ సిద్ధాంతాలతో వారు హోరాహోరి పోరాడవలసి వచ్చింది. ఈనాడు అరిస్టాటిల్‌ను చాలవరకు చారిత్రక దృష్టితోనే చూడాలి. చూసి, ఒక నమస్కారం పెట్టి, ముందుకు సాగిపోవాలి.

ప్లేటోతో అరిస్టాటిల్ అనేకవిషయాలతో విభేదించాడని ఇంతకుముందు తెలుసుకున్నాము. గురు, శిష్యుల స్వభావాలు పరస్పర విరుద్ధమైనవి. ప్లేటో ఆదర్శవాది. అరిస్టాటిల్ వాస్తవికవాది. అతడు స్వాప్నికుడు, ఇతడు వైజ్ఞానికుడు. ఆఖరికి ఉభయుల రచనా శైలులు కూడా పరస్పర వ్యతిరేకాలు. ప్లేటో వచనశైలి కవితా మాధుర్య ధుర్యమని, అరిస్టాటిల్ శైలి వచనం కాని వచనం అని పండితుల అభిప్రాయం.

ఉభయుల స్వభావాలలోని ఈ పరస్పర వైరుధ్యం వారి సిద్ధాంతాలలో పూర్తిగా ప్రతిబింబించింది. ప్లేటోను ఖండించడానికే అరిస్టాటిల్ తన సిద్ధాంతాలను ప్రతిపాదించాడా అనిపిస్తుంది. కాని చిట్టచివరి వరకు వెళ్లగా వెళ్లగా అటుతిప్పి ఇటు తిప్పి మళ్లీ ప్లేటో భావసిద్ధాంతాన్నే ఇతడు సొంత భాషలో చెప్పినట్టు కూడా కనిపిస్తుంది. చివరికి అతడు చేసింది ప్లేటోలోని లోపాలను పూరించడం మాత్రమేనని అనిపిస్తుంది.

ముందుగా అరిస్టాటిల్ మెటఫిజిక్స్‌ను సమీక్షించుదాము.

## అరిస్టాటిల్ వర్ణించిన దేవుడు

అరిస్టాటిల్ తన కాలం వరకు వచ్చిన తాత్విక, వైజ్ఞానిక సిద్ధాంతా లన్నింటిని క్రోడీకరించడం తన జీవితాశయంగా పెట్టుకున్నాడని ఇంతకుముందు చదివాము. అతడు కష్టపడి అలా సేకరించడం వల్లనే మనకు పూర్వకాలపు గ్రీకుల తత్వ విజ్ఞానమంతా లభించింది. లేకపోతే అది ఖిలమైపోయేదే.

అయితే తన పూర్వుల సిద్ధాంతాలను పూర్వపక్షం చేయడానికే అతడు వాటిని సేకరించినట్టు కనిపిస్తుంది. చివరకి తన గురువు ప్లేటో సిద్ధాంతాలను కూడా ఖండించాడు. అసలు ప్లేటో ఖండనతోనే తన తత్వ మీమాంసకు ప్రాతిపదిక వేసుకున్నాడు.

ఆకృతులు (forms), భావాలు (ideas) ఇవే నిజంగా వున్నాయని, ఇంద్రియ గోచరమవుతున్న జగత్తు ఒక ఆభాస (appearance) మాత్రమేనని ప్లేటో సిద్ధాంతీకరించాడు. కాగా, అణువులు, శూన్యం- ఇవి తప్ప ఇంకేమీ లేవని డెమొక్రిటస్ ప్రతిపాదించాడు. అరిస్టాటిల్ ఈ రెండు వాదాలను తిరస్కరించాడు. కాని, రెండింటిని తిరిగి సమన్వయం కూడా చేశాడు. అతని తత్వ మీమాంసలో అటు భావవాదం (idealism) ఇటు భౌతికవాదం (materialism) సమ్మిళితమయ్యాయి. “విశిష్టాద్వైతం” అన్నట్టు, అతనిది “విశిష్ట భావవాదం” (qualified idealism) అనవచ్చు.

ప్లేటో ఇంద్రియ వస్తువులను వాటి సామాన్య లక్షణాలను బట్టి కొన్ని తరగతులు (classes) గా వర్గీకరించాడు; ఆ తరగతులను భావీకరించాడు. ఆ భావాలకు శాశ్వత, స్వతంత్ర ప్రతిపత్తి ఆపాదించాడు.

## గోవులు, గోత్వం

దీన్ని అరిస్టాటిల్ ఖండించాడు. గోవులలో గోత్వం అనే సామాన్య లక్షణం వున్నమాట నిజమే కాని నేల విడిచి సాము లేనట్టు గోవులను విడిచి గోత్వం విడిగా వుండదు. గోత్వం అయా ప్రత్యేక గోవులలోనే వుంటుంది.

ఒక ఎర్రని వస్తువున్నది. ఎరుపు అనేది ఆ వస్తువులలోనే వుంటుంది తప్ప విడిగా లేదు. ఆ వస్తువు లేకుండా ఎరుపు దానంతట అది మనకు అనుభవంలోకి రాదు. అలాగే, ఒక బల్ల వున్నది. బల్ల ఆకృతి (form) బల్లలోనే వుంటుంది తప్ప, విడిగా ఎక్కడో భావాల స్వర్గం (heaven of ideas) లో వుండదు.

ప్లేటో ప్రతిపాదించినట్టు సార్వత్రికాలు (Universals), ఆకృతులు (Forms), భావాలు (Ideas) విడిగా మన ఇంద్రియానుభవంలోకి రావు. అవి ఆయా ప్రత్యేక వస్తువుల (Particulars) తోనే కలిసి మన అనుభవంలోకి వస్తాయి.

అంతమాత్రాన సార్వత్రికాలు, ఆకృతులు, భావాలు అసలు లేవనికాదు. అవి నిస్సందేహంగా వున్నాయి. ఎందుకంటే అవి మన కంటికి విడిగా కనబడకపోయినా, ఆలోచనకు అందుతాయి. కాని, వస్తువులతో కలిపి మాత్రమే

వాటిని గురించి ఆలోచించగలము. ఎందుకంటే ప్రత్యేకమైన ఎర్రని వస్తువుతో సంబంధం లేకుండా ఎరుపు అనే భావం ఎక్కడో విడిగా వుండదు.

ఇంతేకాదు. భావాలు, ఆకృతులు, అమూర్త (abstractions) మైనవి. అంటే ప్రత్యేక వస్తువులలోని సామాన్య లక్షణాలకు అవి సాధారణీకరణాలు (Universalisations). ప్రత్యేక వస్తువులను చూసిన తర్వాతనే అవి మన మనస్సుకు స్ఫురిస్తాయి తప్ప, అంతకుముందు కాదు. అయినప్పుడు అవి ప్రత్యేక వస్తువులకు కారణం ఎలా అవుతాయి?

ఇక డెమొక్రిటస్ అణువుల కలయిక వల్లనే సమస్త జగత్తు ఏర్పడుతున్నదని అన్నాడు. కాని, దీన్ని కూడా అరిస్టాటిల్ ఖండించాడు.

## వస్తువు, ఆకృతి

వస్తువు లేకుండా ఆకృతి వుండదన్న మాట నిజమే. కాని, ఆకృతి లేకుండా వస్తువు కూడా వుండదు.

యథార్థంగా వున్నవి ప్రత్యేక వస్తువులే. అంటే ఈ బల్ల, ఆ బల్ల--ఈ గోవు, ఆ గోవు--ఇవే యథార్థంగా వున్నాయి. అయితే వాటి ప్రత్యేకత (individuality) వాటి ఆకృతివల్లనే సిద్ధిస్తున్నది. బల్లకు బల్ల ఆకృతి లేకపోతే అది మరొక వస్తువేదో అవుతుందితప్ప బల్ల కాదు. దాన్ని బల్లగా చేసేది దాని బల్ల ఆకృతే.

అందుచేత, ఒకవిధంగా చూస్తే బల్లలోని ద్రవ్యం (matter) కంటే బల్ల ఆకృతే (form) ప్రధానమైంది. దాన్ని మనం బల్ల అని ఎందుకు పిలుస్తున్నాము? బల్లఆకృతిని బట్టేకదా? అయినప్పుడు బల్ల ఆకృతి నుంచి బల్ల అనే ప్రత్యేక వస్తువు వచ్చినట్టే కదా? ఈ విధంగా డెమొక్రిటస్ భౌతికవాదాన్ని ఖండించడానికి బయలుదేరి చివరికి ప్లేటో ఆకృతి వాదం (theory of forms) వద్దకే అరిస్టాటిల్ చేరుకున్నాడు.

కాని, ఒక తేడా వున్నది. ప్లేటో ప్రత్యేక వస్తువు నిజంగా లేదన్నాడు. ఉన్నట్టు కనిపిస్తున్నదన్నాడు. కాని, అరిస్టాటిల్ ప్రత్యేక వస్తువే నిజంగా వున్నదన్నాడు. ఎందుకంటే బల్లలోని ద్రవ్యం (matter) లేనిదే బల్ల ఆకృతి (form) కి ఆలంబనం ఏది?

## ద్వైతం

కనుక, ద్రవ్యం, దాని ఆకృతి రెండూ నిజంగా ఉన్నాయి. రెండూ

యథార్థాలే. వాక్కు లేనిదే అర్థం లేనట్టు, అర్థం లేనిదే వాక్కు లేనట్టు, వాగర్థాలు రెండూ అవినాభావ సంబంధం కలిగి వున్నట్టు ప్రత్యేక వస్తువులో (ఉదాహరణకు బల్ల, లేదా కుర్చీ, లేదా మనిషి, లేదా మరొక జంతువు) ద్రవ్యం, ఆకృతి రెండూ కలిసిపోయి వుంటాయి. ఆ రెండింటి కలయికతో ప్రత్యేక వస్తువు ఏర్పడుతున్నది.

## మార్పు సంగతి

ఇక మార్పు సంగతి చూద్దాము. ప్రపంచంలో ప్రతి వస్తువు మారిపోతున్న మాట నిజమే. ఒక వస్తువుకు ఇప్పుడొక ఆకృతి వుంటుంది. తరవాత మరొక ఆకృతి వస్తుంది.

మొదట విత్తు. అది మొక్క అవుతుంది. తర్వాత అది చెట్టుగా, పువ్వులు కాయలుగా మారుతున్నది. ఇన్ని మార్పులలోను మారనిది ద్రవ్యం (matter). ఆ ద్రవ్యమే ఒకసారి ఒక ఆకృతి, మరొకసారి మరొక ఆకృతి ధరిస్తున్నది.

అయితే, ఒక వస్తువు మార్పు చెందుతున్నదంటే, దాని ఆకృతి మరొక ఆకృతిగా మారుతున్నదని కాదు. ఏ ఆకృతి మరొక ఆకృతిగా మారదు. ఒక ఆకృతి పోయి, మరొక ఆకృతి వస్తున్నది—అంతే. వివిధాలైన ఆకృతులు అప్పటి కప్పుడు పుట్టుకు రావు. అవి ఎప్పుడూ వుంటాయి. ద్రవ్యంగాని, ఆకృతిని కొత్తగా పుట్టుకు రావు. అవి శాశ్వతంగా ఎల్లప్పుడు వుండేవే.

## రెండు సూత్రాలు

ఈ సిద్ధాంతాన్ని అర్థం చేసుకొనడానికి గర్భితస్థితి (Potentiality), వాస్తవ స్థితి (Actuality) అనే సూత్రాలను (principles) అలంబనం చేసుకోవాలి. ప్రపంచంలోని ప్రతి వస్తువులోను ఈ రెండు స్థితులు ఏకకాలంలో ఉంటాయి.

మామిడిటెంక మామిడిచెట్టుగా మారుతున్నది అంటే మామిడి టెంకలో మామిడిచెట్టు గర్భితం (potential)గా వున్నదన్నమాట. అలా లేకపోతే ఆ టెంక నుంచి ఏ వేపచెట్టో, రావిచెట్టో రావచ్చు కదా? మామిడిటెంక గర్భితస్థితి అయితే, మామిడిచెట్టు వాస్తవస్థితి.

కోడిగుడ్డునుంచి కోడిపిల్ల వస్తున్నది. అంటే కోడిగుడ్డులో కోడిపిల్ల గర్భితస్థితిలో మొదటినుంచి వున్నదన్నమాట. అలా లేకపోతే బాతుపిల్ల లేదా మరొక పక్షిపిల్ల రావచ్చుకదా? కోడిగుడ్డు గర్భితస్థితి కాగా, కోడిపిల్ల వాస్తవస్థితి.

మామిడిటెంక తన వాస్తవ స్థితిని మామిడిచెట్టులో పొందుతున్నది. కోడిగుడ్డు తన వాస్తవ స్థితిని కోడిపిల్లలో సిద్ధింపజేసుకుంటున్నది.

ఒకచోట కొన్ని ఇటుకలున్నాయి. వాటిని కొన్ని వరుసలలో పేర్చితే గోడ తయారవుతుంది. చెల్లాచెదరుగా వున్న ఇటుకలు తమ వాస్తవ స్థితిని గోడలో అభివ్యక్తం (realise) చేసుకుంటున్నాయి.

ఇలాగే ఏ వస్తువును చూసినా దానిలో గర్భితస్థితి (potentiality), వాస్తవ స్థితి (Actuality) రెండూ వుంటాయి. మామూలు మట్టికి ఇటుకలు వాస్తవ స్థితి. ఇటుకలకు గోడ వాస్తవ స్థితి. కోడిగుడ్డులోని పదార్థానికి కోడిగుడ్డు వాస్తవ స్థితి. కోడిగుడ్డుకు కోడిపిల్ల వాస్తవ స్థితి.

## సాపేక్ష స్థితులు

అంటే ఒక వస్తువును మరొక వస్తువుతో పోల్చితే గర్భిత స్థితిలో వుంటుంది. వేరొకదానితో పోల్చితే వాస్తవ స్థితిలో వుంటుంది. కనుక ఈ రెండు రకాల స్థితులు సాపేక్ష స్థితులే ( relative states).

విత్తుకు చెట్టు వాస్తవ స్థితి. మరి ఆ చెట్టు దేనికి గర్భిత స్థితి? చెట్టుకొయ్యనుంచి మేజాబల్ల తయారవుతుంది. కనుక మేజాబల్లకు చెట్టు గర్భిత స్థితి. అలాగే, తక్కినవి.

గర్భిత స్థితినుంచి వాస్తవ స్థితికి పోతున్నకొద్దీ వస్తువులో ఆకృతి (form) ప్రాధాన్యం పెరుగుతూ పోతుంది. చివరికి ఒక వస్తువు పూర్తి పెరుగుదలను (development) పొందినప్పుడు దాని ఆకృతి, దాని ప్రయోజనం పూర్తిగా సిద్ధిస్తాయి. దానిలోని గర్భిత ప్రయోజనాలన్నీ వాస్తవ స్థితిని పొందుతాయి.

విత్తు చెట్టుగా పరిణామం చెందడానికి ముందు అనేక ఆకృతులు ధరిస్తుంది. చివరికి చెట్టు ఆకృతి పొందినప్పుడు విత్తు ధరించిన వివిధాకృతుల గర్భిత ప్రయోజనాలన్నీ వాస్తవం అవుతున్నాయి. అందువల్ల విత్తుకంటే, దాని పరివర్తన దశలన్నింటికంటే చెట్టు ఎక్కువ వాస్తవం (actual). ఎందుకంటే విత్తు, దాని వివిధ పరిణామ దశలు తమకంటె ఉన్నత ప్రయోజనాన్ని చెట్టులో సాధించ గలిగాయి కనుక.

సరే. ప్రతి వస్తువు మార్పు చెందుతున్నది; పరిణామం చెందుతున్నది. అంటే చలిస్తున్నది. మరి ఈ మార్పులకు, చలనానికి కారణం ఏమిటి?

## నాలుగు కారణాలు

ఒకటి కాదు - నాలుగు కారణాలను అరిస్టాటిల్ పేర్కొన్నాడు.

1. భౌతిక కారణం (material cause) : ఏ ద్రవ్యం (matter) నుంచి

ఒక వస్తువు ఆకృతి ధరిస్తున్నదో ఆ ద్రవ్యం భౌతిక కారణం. ఉదాహరణకు : ఒక కంచుముద్ద వున్నది. దాన్ని కరిగించి శిల్పి ఒక విగ్రహాన్ని తయారుచేస్తాడు. కనుక, కంచు విగ్రహానికి భౌతిక కారణం కంచుముద్ద.

*2.* ఆకృతిక కారణం (formal cause) :శిల్పి కంచుతో ఒక మనిషి విగ్రహాన్ని తయారుచేయా లనుకున్నా డనుకోండి. అతని మనస్సులో మనిషి తల, కళ్లు, చెవులు, మెడ, చేతులు, కాళ్లు మొదలైన వాటితో కూడిన మానవాకృతి మెదులుతూ వుంటుంది. కనుక ఆ భావన (plan) ఆకృతిక కారణం.

*3.* నిమిత్త కారణం (efficient cause) : కంచు విగ్రహాన్ని తయారు చేయడానికి శిల్పి వుండాలి. అతనికి కొన్ని పనిముట్లు కావాలి. ఇవన్నీ నిమిత్త కారణం.

*4.* అంతిమ కారణం (final cause) : శిల్పి ఆ విధంగా పనిచేయడానికి ఏదో ఒక లక్ష్యం, ప్రయోజనం ఉండాలి కదా! ఆ లక్ష్యం విగ్రహ సృష్టి. కనుక పూర్తి అయిన విగ్రహం అంతిమ కారణం. ఆ విగ్రహం కోసమే తక్కినవన్నీ అవసరమవుతాయి. కనుక, ఆ విగ్రహం వాటన్నిటికి కారణమైంది.

ప్రపంచంలో ప్రతి పనికి, ప్రతి సంఘటనకు, ప్రతి పరిణామానికి ఈ నాలుగు కారణాలు విధిగా వుంటాయని అరిస్టాటిల్ భావించాడు. వాటిని మానవుని కళా సృష్టితో సహా సమస్త చరాచర జగత్తుకు వర్తింపజేశాడు.

## నవలలకు ముడిసరుకు

మరొక ఉదాహరణ : ఒక నవలా రచయిత బజారులో ఒక సంఘటన చూశాడు. అది తనకు ముడి సరుకు (raw material)గా ఉపయోగిస్తుందనుకుంటాడు. ఆ సంఘటన భౌతిక కారణం. అతని మదిలో ఒక కథా సంవిధానం మెదులుతుంది. అది ఆకృతిక కారణం. రచయిత, అతని కలం, కాగితాలు, రచన ఇవన్నీ నిమిత్త కారణం. ఆఖరికి పూర్తి అయిన నవల అంతిమ కారణం. అయితే, పూర్తి అయిన నవలకోసమే అతడు కథా సంవిధానాన్ని సంభావించడం, కలం చేతపట్టి వ్రాయడం జరుగుతుంది. కనుక చివరికి మిగిలేవి రెండు కారణాలే. ఒకటి భౌతిక కారణం, రెండవది ఆకృతిక–నిమిత్త కారణాలతో కూడిన అంతిమ కారణం. తమసా నదీ తీరాన ఒక బోయవాడు క్రౌంచమిథునంలో ఒక దాన్ని బాణంతో కూల్చివేయడం భౌతిక కారణమైతే, వాల్మీకి విరచిత రామాయణం అంతిమ కారణం.

భౌతిక పదార్థం, ఆకృతి - ఈ రెండూ కలిసేసరికి చలనం కలుగుతుంది.

ప్రతి వస్తువులోను చలనం కలదన్నమాట నిజమే. కాని, ఆ చలనం లక్ష్యరహితం కాదు. అర్థరహితం కాదు. భౌతిక పదార్థం తన ఆకృతిని, లేదా తన వాస్తవ స్థితిని చేరుకోవడానికి ఆసక్తి చెందడంవల్ల చలనం అనేది ఉద్భవిస్తున్నది. అంటే, ఆకృతే భౌతిక పదార్థంలో చలనం కలుగజేస్తున్నది.

ఇది ఎలా? భౌతిక పదార్థం తనంతట తాను చలించలేదు. కంచుముద్దలో కంచు విగ్రహం గర్భితంగా వుంటుంది. కాని కంచుముద్ద తనంతట తాను కంచు విగ్రహంగా పరివర్తన చెందలేదు. ఎందుకంటే కంచుముద్ద ప్రత్యేకించి విగ్రహంగానే మారనక్కరలేదు. కంచు బిందెగా, పాత్రగా, పళ్లెంగా ఏ ఆకారంగానైనా మారడానికి అవకాశం వున్నది. కనుక, తాను ఏ ఆకృతి ధరించాలో నిర్ణయించేది కంచుముద్ద కాదు. అంతిమ కారణం, నిమిత్త కారణం, ఆకృతిక కారణం - ఇవి అదే వరుసలో కంచు ముద్ద పరివర్తనకు ఆధారాలవుతాయి.

## ఆది కారణం

అందువల్ల అంతిమ కారణమే మరొక విధంగా చూస్తే ఆది కారణమవుతుంది. అంటే ఏ అంతిమ ప్రయోజనంకోసం చలనం ప్రారంభమయిందో ఆ అంతిమ ప్రయోజనమే ప్రథమ కారణం (first cause) పై ఉదాహరణలో కంచు విగ్రహం ప్రథమ కారణం. దానికోసమేకదా శిల్పి తన పరికరాలతో పని మొదలు పెడుతున్నాడు? దానికోసమేకదా విగ్రహాకృతిని ఊహిస్తున్నాడు? దానికోసమే కదా కంచుముద్దను తీసుకున్నాడు?

అలాగే, కోడిగుడ్డుకు ప్రథమ కారణం కోడిపిల్ల అనే ఆకృతి. ఎందుకంటే కోడిగుడ్డు లోపలి పదార్థం పొందవలసిన పరిణామదశల క్రమాన్ని కోడిపిల్ల ఆకృతి మొదటి నుంచి అనుశాసిస్తూ వుండే వుండాలి. అలా కాకపోతే కోడిగుడ్డు నుంచి కోడిపిల్ల కాక కుక్కపిల్ల, పిల్లి పిల్ల రావచ్చుకదా? కనుక కోడిపిల్ల ఆకృతి కోడిగుడ్డు పరిణామ దశలన్నిటికి ప్రథమ కారణం (first cause) అవుతున్నది. దీనికి మన సాంఖ్యులు చెప్పిన "సత్కార్యవాదం"తో పోలిక కనిపిస్తున్నది. కారణం (cause) లోనే కార్యం (effect) వున్నదనేది సత్కార్య వాదం.

ప్రపంచంలో ఇటువంటి పరిణామాలు, పరివర్తనలు, చలనాలు అసంఖ్యాకంగా వున్నాయి. ఒక చలనం మరొకదానికి కారణం అవుతున్నది. కాని ఈ మొత్తం చలనాలకు ప్రప్రథమ కారణం ఏదో ఒకటి వుండి వుండాలి. అలాంటి ప్రథమ కారణం లేకపోతే అసలు మొదటగా చలనం ప్రారంభమై వుండేదే కాదు.

అలాంటి ప్రథమ కారణం తాను చలించదు. మార్పు చెందదు. తాను

కూడా చలిస్తే, మార్పు చెందితే ఆ చలనానికి, మార్పునకు మరొక కారణాన్ని మనం నిర్దేశించవలసి వస్తుంది. ఆ కారణానికి మరొక కారణం వుండాలి. దానికి మరొకటి... ఇలాగ అంతులేకుండా ప్రథమ కారణం కోసం వెనక్కి జరుగుతూ పోవాలి. అందుచేత ప్రప్రథమ కారణం ఏదైతే వుందో అది తాను చలించకుండా, తక్కిన అన్ని చలనాలకు కారణ మవుతున్నదని ఊహించుకొనడమే ఉత్తమం.

## స్థాణువు

ఆ ప్రథమ కారణాన్నే అరిస్టాటిల్ "నిశ్చల చాలకుడు" (Unmoved Mover) - అని పేర్కొన్నాడు. ఆ నిశ్చల చాలకుడే ఈశ్వరుడు. (శివుడికి 'స్థాణువు' అనే నామాంతరం కలదని ఈ సందర్భంలో గమనించవచ్చు. స్థాణువు అంటే కదలనివాడు అని అర్థం.)

ఎంత ఈశ్వరుడైనా తాను కదలకుండా తక్కిన సమస్తాన్ని ఎలా కదిలిస్తాడు? ఇది ఎలా సాధ్యం? అంటే, సాధ్యమేనని అరిస్టాటిల్ సమాధానం.

ఉదాహరణకు - ఒక కొండపై గుడిలో దేవుని విగ్రహం వున్నది. అది కదలదు కాని, ఆ విగ్రహాన్ని అర్చించడానికి భక్తులు కొండ ఎక్కి వెడతారు. ఆ విగ్రహం తాను కదలకుండా భక్తులను కదిలించిందా, లేదా ?

ఎక్కడో సుదూరాన ఒక సుందర ప్రకృతి దృశ్యం వున్నది. అది కదలదు. కాని దాన్ని తిలకించాలనే కోర్కెతో వినోద యాత్రికులు వెడతారు. ఆ దృశ్య రామణీయకం తాను కదలకుండా యాత్రికులను తనను చూడాలనే కోర్కె ద్వారా కదిలించిందా, లేదా ?

ఒక సుందరి ఒక ఉద్యానవనంలో కూర్చుని వున్నది. ఆమె అందం ఆకర్షణకు లోనై కొందరు యువకులు ఆమె పరిసరాలకు వెడతారు. తాను కదలకుండా ఆమె వారిని తన వద్దకు రప్పించ గలిగిందా, లేదా?

## దేవుని దిశగా ప్రయాణం

ఆ సుందరివంటి వాడు ఈశ్వరుడు. ఆయన సమస్త ప్రపంచానికి గమ్యం, లక్ష్యం. కనుక ఆయనను చేరడానికి ప్రపంచంలోని ప్రత్యేక వస్తువులన్నీ తహతహలాడుతున్నాయి. ఆ తహతహ వాటిలో చలనం కలిగిస్తుంది. ఆయన చలించడు. జగత్తును చలింపజేయాలనే కోర్కె కూడా ఆయనలో వుండదు. అట్టి కోర్కె వుంటే ఆయన చలించినట్టే. కాని కేవలం ఆయన ఉనికివల్లనే

సమస్త చరాచర జగత్తు ఆయనవైపుగా చలిస్తున్నది, ప్రయాణిస్తున్నది. "జగత్" అంటేనే గమించేదని అర్థం.

అరిస్టాటిల్ చెప్పిన ఈశ్వరుడు సృష్టికర్త కూడా కాదు. ప్రపంచాన్ని సృష్టించాలంటే అలా సృష్టించాలనే కోర్కె కలగాలి. అంటే ఈశ్వరుడు చలించాలి. అప్పుడు ఈశ్వరుడి చలనానికి కారణం కోసం అన్వేషించవలసిన అగత్యం కలుగుతుంది. ఇక ఆ అన్వేషణకు అంతు వుండదు.

భౌతిక పదార్థం వున్నచోట చలనం తప్పదు. కాని, ఈశ్వరుడు భౌతిక పదార్థం కాదు. కనుక ఈశ్వరుడు చలించనక్కరలేదు. ఆయనకు కోర్కెలు వుండవు. అన్ని కోర్కెలకు ఆయన గమ్యస్థానం. ఆయన కేవల భావం-శుద్ధ ఆకృతి. ఆయన పరిపూర్ణ వాస్తవత్వం (absolute actuality). ఆయనలో గర్భిత స్థితి (potentiality) అనే దోషం లేనేలేదు. ఆయన అనాద్యనంతుడు. సృష్టి కూడా అనాద్యనంతం. చలనం కూడా అనాద్యనంతం.

ఈ సందర్భంలో మన సాంఖ్యదర్శనంలోని పురుషుడు, ప్రకృతి జ్ఞాపకం రావడం సహజం. అలాగే ముండకోపనిషత్తులోని "ద్వా సువర్ణా సయుజా సఖాయా సమానం..." అనే శ్లోకం కూడా జ్ఞాపకం వస్తుంది. సమాన స్వభావం కలిగి శాశ్వత సఖులైన రెండు పక్షులు (జీవాత్మ, పరమాత్మ) ఒకే వృక్షంపై నివసిస్తున్నాయి. ఒకటి సుఖదుఃఖాత్మకమైన కర్మఫలాన్ని భుజిస్తుండగా, రెండవది సాక్షి మాత్రంగా చూస్తున్నదని ఆ శ్లోకం అర్థం. ఆ రెండు పక్షులతో అరిస్టాటిల్ ప్రతిపాదించిన ఈశ్వరుడిని (God), సృష్టిని (creation) పోల్చవచ్చు.

## చిత్ స్వరూపుడు

ఈశ్వరుడిని "ఆలోచనను ఆలోచిస్తున్న ఆలోచన" (Thought thinking thought) గా కూడా అరిస్టాటిల్ వర్ణించాడు. ఈశ్వరుడు మరి దేన్ని గురించి ఆలోచించడు. ఎందుకంటే మరొకదాన్ని గురించి ఆలోచిస్తే చలనం కలుగుతుంది. కాని, ఈశ్వరుడు చలనరహితుడు. అందుచేత తన గురించే తాను ఆలోచిస్తాడు. తాను ఆలోచనా (చిత్) స్వరూపుడు కనుక "ఆలోచన" తన గురించే తాను ఆలోచిస్తున్నట్లు అవుతున్నది. (మన శివుడు ధ్యానసమాధిలో వున్నప్పుడు దేన్ని గురించి ధ్యానిస్తున్నాడు? తన గురించే కదా? అలాగే అరిస్టాటిల్ దేవుడు కూడా.)

అరిస్టాటిల్ ఈశ్వర భావాన్ని పలువురు పండితులు ఈసడించారు. ఆలో-

చన తన గురించి తాను ఎలా ఆలోచిస్తుంది? ఆలోచనకు ఒక విషయం వుండాలి కదా? రెండు అద్దాలను ఎదురెదురుగా పెడితే ఒకదాన్ని మరొకటి ప్రతిబింబిస్తుంది. అంటే అవి ఏ అన్యవస్తువును ప్రతిఫలించవు. అలాగే అరిస్టాటిల్ ఈశ్వరుడు అసలు ఆలోచించడనే తేలుతున్నది.

అరిస్టాటిలియన్ ఈశ్వరుడు మానవులప్రార్థనలకు, ఆరాధనకు దేనికిచలించడు. అటువంటి దేవునివల్ల ఉపయోగం ఏమిటని విమర్శకులుప్రశ్నించారు.

ఉపయోగం వున్నా, లేకపోయినా అరిస్టాటిల్ తత్వమీమాంస చివరికి అటువంటి స్థాణువు, నిరీహుడు, నిర్వికల్పుడు, నిర్గుణుడు అయిన ఈశ్వరుడి వరకు వెళ్లి ఆగిపోయింది.

ఇక అరిస్టాటిల్ తర్క, భౌతిక, జీవ శాస్త్రాలను చూద్దాము.

## విజ్ఞాన శాస్త్రాలకు మార్గదర్శి

"లాజిక్" అంటే తర్క శాస్త్రం. అంత విసుగు పుట్టించే సైన్సు మరొకటి లేదు. కాలేజీలలో లాజిక్ విద్యార్థులందరికి ఇది అనుభవమే.

తక్కిన సైన్సులకు ఆలోచించడానికి వేరే ఒక విషయమంటూ వుంటుంది. కాని, "లాజిక్"కు ఆలోచనే (thought) విషయం. అది ఆలోచనను గురించి ఆలోచించే శాస్త్రం. ఇంతకుముందే దేవుడిని "ఆలోచనను ఆలోచించే ఆలోచన"గా అరిస్టాటిల్ వర్ణించినట్టు చదివాము. ఈ వర్ణన "లాజిక్"కు సరిగ్గా సరిపోతుంది. దేవుడు రేఖాగణిత (జ్యామెట్రీ) సూత్రాల ప్రకారం ఆలోచిస్తాడని ప్లేటో భావించాడు. కాగా అరిస్టాటిల్ దేవుడు మహాతర్క శాస్త్రజ్ఞుడు—(Super Logician-)అయివుండాలి.

### తర్క పితామహుడు

తర్కాన్ని ఒక ప్రత్యేక శాస్త్రంగా రూపొందించిన ఘనత అరిస్టాటిల్‌దే. అతడు పాశ్చాత్య తర్కశాస్త్ర (లాజిక్) పితామహుడు. తర్కంలో డిడక్షన్ (నిగమనం) అనే పద్ధతికి అతడు ఆద్యుడు. పదహారవ శతాబ్దంలో ఫ్రాన్సిస్ బేకన్ ఇండక్షన్ (ఆగమనం) అనే పద్ధతిని ప్రవేశపెట్టేవరకు అరిస్టాటిల్ డిడక్టివ్ పద్ధతే రాజ్యం చేసింది.

తర్కం— లాజిక్— అంటే ఏమిటి? భాషకు వ్యాకరణం కావాలి. లేకపోతే అర్థవంతమైన వాక్య నిర్మాణం సాధ్యం కాదు. వాక్య నిర్మాణాన్ని వ్యాకరణం శాసిస్తుంది.

అలాగే తర్కం ఆలోచనను శాసిస్తుంది. తర్కబద్ధం కాని ఆలోచన అసంబద్ధం (absurd) గా తయారవుతుంది. వ్యాకరణం వాగనుశాసనమైతే, తర్కం ఆలోచనానుశాసనం.

సరైన ఆలోచన సరైన జ్ఞానానికి దారితీస్తుంది. నిర్దుష్ట జ్ఞానానికి తర్కం ఒక సాధనం.

అరిస్టాటిల్ తర్కశాస్త్ర రచన లన్నిటిని "ఆర్గనాన్" అనే శీర్షికక్రింద క్రోడీకరించారు. "ఆర్గనాన్" అంటే "సాధనం" అని అర్థం. ఇది అరిస్టాటిల్ అనుయాయులు అతని తర్క రచనల సంపుటానికి పెట్టిన పేరు. తర్కం ఆలోచనకు ఒక పరికరం వంటిది కనుక ఆ పేరు పెట్టారు.

## సైన్సులకు రాణి

తత్వ శాస్త్రంతో సహా అన్ని విజ్ఞానశాస్త్రాలకు తర్క సహాయం కావాలి. కనుకనే లాజిక్‌ను "సైన్స్ ఆఫ్ సైన్సెస్" అన్నారు. అన్ని శాస్త్రాలను అది రాణిలాగా అనుశాసిస్తుంది. కనుక దాన్ని "క్వీన్ ఆఫ్ సైన్సెస్" అని కూడా అన్నారు. శాస్త్రవేత్త ఒక విషయాన్ని ప్రతిపాదించి ఊరుకుంటే చాలదు. దాన్ని తర్కబద్ధంగా నిరూపించాలి. అందుకే సైకాలజీ, బయాలజీ, ఫిజియాలజీ మొదలయిన పెక్కు సైన్సుల పేర్లకు చివరలో "లాజీ" (logy) అని వుంటుంది.

అరిస్టాటిల్ శాస్త్రబద్ధం చేసిన డిడక్టివ్ లాజిక్ (నిగమన తర్కం) సిలజిజం రూపంలో సాగుతుంది. మొత్తం మన ఆలోచన అంతా సిలజిజం (Sylogism-త్రయీ తర్కం) పద్ధతిలోనే జరుగుతుందని అరిస్టాటిల్ భావించాడు.

సిలజిజంలో మూడు భాగాలుంటాయి. మొదటి భాగం "మేజర్ ప్రెమిస్" (ముఖ్య ప్రతిపాదన) అంటారు. రెండవదాన్ని "మైనర్ ప్రెమిస్" (లఘు ప్రతిపాదన) అని, మూడవదాన్ని "కంక్లూజన్" (నిగమనం లేదా సిద్ధాంతం) అని అంటారు.

## బార్బారా

లాజిక్ విద్యార్థులందరికి సిలజిజం, దాని వివిధ రూపాలు తెలిసినవే. వాటిలో అతి సాధారణమైనది ఇలా వుంటుంది.

All men are mortal (మానవులందరు మర్త్యులు. ఇది మేజర్ ప్రెమిస్.)

Socrates is a man (సోక్రటీస్ మానవుడు. ఇది మైనర్ ప్రెమిస్.)

Therefore, Socrates is mortal (కనుక సోక్రటీజ్ మర్త్యుడు. ఇది సిద్ధాంతం, లేదా నిగమనం.)

ఇక్కడ ముఖ్య ప్రతిపాదన సార్వజనీనమైనది. లఘు ప్రతిపాదన ఒక వ్యక్తికి సంబంధించినది. ఈ రెండూ నిజమైతే మూడవదైన సిద్ధాంతం విధిగా నిజమవుతుంది.

ఈ రకం సిలజిజాన్ని లాజిక్ పాఠ్యపుస్తకాలలో "బార్బారా" అంటారు. ఇలాగే సిలారెంట్, డెరియో, ఫెరియొ వంటి మరి పెక్కురకాల సిలజిజమ్‌లు వున్నాయి.

ఏ శాస్త్ర సిద్ధాంతమైనా సిలజిజమ్ ద్వారానే నిరూపితమవుతుందని అరిస్టాటిల్ అభిప్రాయపడ్డాడు. ఒక సిలజిజమ్ చాలదు. సిలజిజమ్ పరంపర కావలసివస్తుంది. అప్పుడు ఒక సిలజిజమ్‌లోని సిద్ధాంతం మరొక దానికి ముఖ్య ప్రతిపాదన అవుతుంది. దాని సిద్ధాంతం (conclusion) మరొకధానికి ముఖ్య ప్రతిపాదన అవుతుంది. ఇలాగ ఈ పరంపర సాగి, ఇక సిలజిజం అవసరంలేని సార్వకాలిక, సార్వజనీన సత్యం సిద్ధిస్తుంది. అది స్వయంవేద్యం (self-evident). ప్రత్యక్షానుభవం ద్వారానే దాన్ని తెలుసుకోగలము. ప్రతి విజ్ఞానశాస్త్రం ఇలాంటి స్వయం వేద్య సత్యాలతోనే ప్రారంభ మవుతుంది. మన ఇంద్రియాలకు గోచరిస్తున్న జగత్తు యథార్థం అనేది ఇలాంటి అనుభవ సిద్ధమైన సత్యం. దాన్ని అంగీకరిస్తేనే ఏ విజ్ఞానశాస్త్రమైనా ముందుకు పోగలుగుతుంది.

## న్యాయ దర్శనం

సిలజిజం భారతీయులకు కొత్తకాదు. భారతీయ తర్కంలో ఇది అతి ప్రాచీన కాలంనుంచి వున్నది. ఉదాహరణకు షడ్దర్శనాలలో ఒకటైన "న్యాయ దర్శనం" లో గ్రీకులవలె మూడు కాక, అయిదు భాగాలతో కూడిన సిలజిజం వున్నది.

1. ఈ కొండమీద నిప్పున్నది (ఇది ప్రతిజ్ఞ.)

2. ఎందుకంటే అక్కడినుంచి పొగ వస్తున్నది. (హేతువు).

3. వంటింటిలోవలె నిప్పున్నచోట పొగ తప్పదు (ఉదాహరణ).

4. ఈ కొండపై వంటింటిలోని పరిస్థితి వున్నది (ఉపనయం)

5. కనుక, ఈ కొండపై నిప్పున్నది (నిగమనం.)

లాజిక్‌ను ఇంతటితో వదలిపెట్టి, అరిస్టాటిల్ నిర్మించిన ఇతర శాస్త్రాల వ్యవస్థను సంగ్రహంగా పరిశీలిద్దాము.

## అరిస్టాటిల్ ఫిజిక్స్

ప్రతి వస్తువుకు గర్భితస్థితి (potentiality), వాస్తవస్థితి (actuality) వుంటా యని క్రిందటి అధ్యాయంలో చదివాము. ప్రతి వస్తువు ఒక దృష్టితో చూస్తే గర్భిత స్థితిలో, మరొక దృష్టి నుంచి చూస్తే వాస్తవ స్థితిలో వుంటుంది. అది గర్భిత స్థితినుంచి వాస్తవ స్థితికి పరిణామం చెందాలని ప్రయత్నిస్తూ వుంటుంది.

పూర్తిగా గర్భిత స్థితిలో వుండేది ఆకృతి రహితమైన శుద్ధద్రవ్యం (formless pure matter). ఇది మనకు అనుభవ గోచరం కాదుగాని, మనస్సుతో ఊహించ గలము. అలాగే పూర్తిగా వాస్తవ స్థితిలో వుండేది. ద్రవ్య రహిత శుద్ధ ఆకృతి (matterless pure form). ఇదీ మనకు అనుభవ సిద్ధం కాదు కాని, మనస్సుతో ఊహించగలము. ఇటు శుద్ధ ద్రవ్యం, అటు శుద్ధ ఆకృతి. ఈ రెండింటి మధ్య చరాచర జగత్తు అంతా వుంటుంది. అది శుద్ధ ఆకృతి (ఈశ్వరుడు) వైపుగా ప్రయాణిస్తూ వుంటుంది.

## పంచ భూతాలు

శుద్ధ ద్రవ్యం మొదటగా నాలుగు మూల పదార్థాలు (elements)గా మారు తుంది. వరసగా అవి మట్టి, నీరు, గాలి, అగ్ని. ఇంతవరకు అరిస్టాటిల్‌కు పూర్వులైన గ్రీకులు కనిపెట్టినవే. కాని, అతడు అయిదవ మూలపదార్థాన్ని కూడా ఊహించాడు. అది ఈథర్ (విహాయసం). అంటే అరిస్టాటిల్ నాటికి గ్రీకులు మన పృథ్వ్యాపస్తేజో వాయురాకాశాలు అయిదింటిని అంగీకరించినట్టు అయింది.

శుద్ధ ద్రవ్యానికి మొట్టమొదటి వాస్తవ స్థితులు పైన పేర్కొన్న నాలుగు మూలపదార్థాల (మట్టి, నీరు, గాలి, అగ్ని) వల్లనే కలుగుతున్నాయి. ఇవి లేకపోతే ఇక ఆ తర్వాత వచ్చే గర్భిత, వాస్తవ స్థితులు ఏవీ వుండవు. అంటే ప్రపంచంలో మనం చూసే ఏ వస్తువులూ వుండవు. అన్ని వస్తువులు ఈ నాలుగు మూల పదార్థాల కలయికతోనే ఏర్పడుతున్నాయి.

ప్రతి భౌతిక వస్తువుకు కొంత విస్తృతి (extension) వుంటుంది. అది కొంత స్థలాన్ని ఆక్రమిస్తుంది. దానికి ఒక పరిమితి (limit) వుంటుంది. ఆ వస్తువు పరిసరాలు దాని పరిమితిని నిర్ణయిస్తాయి.

## శూన్యం లేదు

మొత్తం విశ్వానికి పరిసరాలు లేవు. అంటే విశ్వం వెలుపల స్థలం (Space)

లేదు. కనుక విశ్వం స్థలం లోపల లేదు. స్థలమే విశ్వం లోపల వున్నది. ల్యూసిప్పస్, డెమొక్రిటస్‌లు అన్నట్టు అణువులే కాక, శూన్యస్థలం కూడా లేదు. స్థలాన్ని ఆక్రమించే వస్తువులు లేనప్పుడు స్థలం అనేది ఎలా వుంటుంది? స్థలంకాని, విశ్వంకాని అనంతాలు కావు. పరిమితాలు. అనంత స్థలాన్ని, అనంత విశ్వాన్ని ఊహించలేము. రెండు వస్తువుల మధ్య దూరమే స్థలం కనుక వస్తువులు లేనిచోట స్థలం వుండడానికి వీలులేదు. మొత్తం విశ్వం వెలుపల వస్తువులేవీ వుండవు కనుక శూన్యస్థలం వుండడానికి వీలులేదు.

వస్తువులున్నచోట చలనం తప్పదు. చలనం లేకుండా వస్తువులు లేవు. చలనం అంటే ఒక వస్తువు ఒక చోటినుంచి మరొక చోటికి వెళ్లడం. ఈ చలనం వల్లనే కాలం (time) ఏర్పడుతున్నది. చలనం లేనిచోట కాలం లేదు.

## త్రివిధ చలనం

చలనం (motion) మూడు రకాలు. సూటిగా (rectilinear), వెనుకకు, ముందుకు, ప్రక్కలకు కదలడం ఒక రకం. ఇది భూమికి, దాని సమీప పరిసరాలకు వర్తిస్తుంది - నీరు బరువైనది. మట్టి (రాళ్లు మొదలైనవాటితో సహా) ఇంకా బరువైనది కనుక ఇవి నేలవైపు క్రిందికి పడిపోతాయి. గాలి తేలికైనది. అగ్ని ఇంకా తేలికైనది. కనుక ఈ రెండూ నేలనుంచి పైవైపు పోతాయి. ఇందువల్లనే పైన, క్రింద అనే భావాలు మనకు కలుగుతున్నాయి.

అయితే ఈ మొదటిరకం చలనం తక్కువ తరగతికి చెందినట్టిది. ఎందుకంటే సూటిగా వెళ్లే వస్తువు ఒకచోట బయలుదేరి మరొకచోట ఆగిపోక తప్పదు.

రెండవరకం చలనం అంతకంటే ఉన్నత స్థాయికి చెందినది. అది వృత్తాకార చలనం. వృత్తాకారానికి తుది, మొదలు లేవు. ఒక కేంద్ర బిందువుచుట్టూ తిరగడమే వృత్తాకార చలనం. ఇది చక్రంలోని వస్తువులకు సహజమైన చలనం. ఆ వస్తువులు - అంటే సూర్యచంద్రులు, గ్రహాలు, నక్షత్రాలు, విహాయసం (ఈథర్) అనే అయిదవ మూల పదార్థంతో ఏర్పడినట్టివి. అవి దివ్యవస్తువులు. ఆది, అంతం లేనివి. కనుకనే అవి తుది, మొదలు లేని వృత్తాకారంలో పరిభ్రమిస్తూ వుంటాయి.

మరి సూర్యుడు, చంద్రుడు, బుధుడు, శుక్రుడు, కుజుడు మొదలైన ఖగోళ వస్తువులు స్థానభ్రంశం పొందుతున్నట్టు, వెనుకకు వచ్చి ముందుకు పోతున్నట్టు కనిపిస్తున్నదే? ఎందువల్ల? అంటే వాటిది మొదటి రెండు చలనాలు— సరళ రేఖా చలనం, వృత్తాకార చలనం— కలిసిన సంయుక్త చలనం.

## విశ్వ కేంద్రం

భూమి సమస్త విశ్వానికి కేంద్రం. భూమినుంచి పైకిపోతే చక్రాకారంగా వున్న కొన్ని ఆవర్తాలు (concentric circles) వస్తాయి. ఉల్లిపాయ కొన్ని పొరలతో ఏర్పడినట్టు ఒక దానిపై ఒకటిగావున్న కొన్ని ఆవర్తాలతో విశ్వం ఏర్పడింది.

భూమిని దాటిపోతే మొదటగా వచ్చే ఆవర్తంలో చంద్రుడున్నాడు. దాని పైన వరసగా బుధుడు, శుక్రుడు, సూర్యుడు, కుజుడు, గురుడు, శని వున్న ఆవర్తాలు వస్తాయి. ఇంకా పైకిపోతే నిశ్చల నక్షత్రాలు (fixed stars) వున్న ఆవర్తం వస్తుంది. అటు నక్షత్రాల ఆవర్తానికి, ఇటు భూమికి మధ్యగా వున్నందువల్లనే చంద్ర, బుధ, శుక్ర, సూర్యాది గ్రహాలకు సరళరేఖా, వృత్తాకార చలనాలతో కూడిన సంయుక్త చలనం కలుగుతున్నది. అంటే అవి వున్న ఆవర్తం వృత్తాకారంలో తిరుగుతుండగా అవి మాత్రం వెనుకకు, ముందుకు జరుగుతూ వుంటాయి.

నక్షత్రాల ఆవర్తానికి పైన భగవంతుడు మొత్తం విశ్వాన్ని ఆవరించుకుని వున్నాడు. ఆయన (క్రిందటి అధ్యాయంలో చెప్పినట్టు) తాను చలించకుండా సమస్త విశ్వానికి చలనం కలగజేస్తున్నాడు.

### పొరపాటు ఊహలు

ఇది అరిస్టాటిల్ భౌతిక- ఖగోళ శాస్త్రాల సారాంశం. ఇందులో ఈనాటి శాస్త్రవేత్తల సిద్ధాంతాలకు వ్యతిరేకమైనవి. ఎన్నో అంశాలు కలవని వేరే చెప్ప నక్కరలేదు.

నక్షత్రాలు ఆది, అంతం లేనివి కావు. వాటికీ చావు పుట్టుక లున్నాయి. అవి నిశ్చలంగా లేవు. అవి కూడా అమిత వేగంతో ప్రయాణిస్తున్నాయి. గ్రహ గతులలో మార్పులు కనిపించడానికి కారణం వాటి సంయుక్త చలన స్వభావం కాదు. భూమి విశ్వ కేంద్రంలో లేదు. అంటే భూమిచుట్టూ గ్రహాలతో సహా విశ్వమంతా తిరగడం లేదు. సూర్యుడు కేంద్రంగా వరుసగా బుధుడు, శుక్రుడు, భూమి, కుజుడు, గురుడు, శని గ్రహాలు పరిభ్రమిస్తున్నాయి. భూమి కూడా ఒక సౌరగ్రహం.

తేలిక వస్తువుల కంటె బరువైన వస్తువులు వేగంగా నేలపై పడవు. రెండూ ఒకే వేగంతో ఒకేసారి పడతాయి. ఈ విషయాన్ని గలీలియో ఒక ప్రయోగంలో నిరూపించాడు. నక్షత్రాలు ఈథర్ అనే మూల పదార్థంతో కూడినవి కావు. అసలు మట్టి, నీరు, గాలి, అగ్ని మూలపదార్థాలు కావు. భూమి, నక్షత్రాలు అన్నీ తొంభై రెండు రకాల మూలపదార్థాలతో ఏర్పడ్డాయి.

సరళరేఖా మార్గంలో, అంటే సూటిగా పయనించే వస్తువు ఒకచోట ఆగి పోతుందన్నది నిజం కాదు. చలనం గురించి న్యూటన్ కనిపెట్టిన మొదటి సూత్రం (first law of motion) ప్రకారం ఏ వస్తువైనా ఒకే వేగంతో, ఒకే దిశలో సూటిగా బయలుదేరి ప్రయాణిస్తుంటే, దానిపై మరొక వస్తువు ఆకర్ష ణశక్తి ప్రభావం పడనంత వరకు అది అనంతంగా అలా పోతూనే వుంటుంది. కాని, మరొక పెద్ద వస్తువు ఆకర్షిస్తుంటే మాత్రం చిన్న వస్తువు పెద్ద వస్తువులో పడిపోనైనా పడిపోతుంది. లేదా దానిచుట్టూ ప్రదక్షిణం చేస్తుంది. అంతే తప్ప ఖగోళ వస్తువులకు వృత్తాకార చలనం సహజ స్వభావం కాదు.

పోతే, ఒక విషయంలో మాత్రం అరిస్టాటిల్ చెప్పినది ఐన్‌స్టయిన్ సిద్ధాంతానికి దగ్గరగా వచ్చినట్టు కనిపిస్తుంది. ఐన్‌స్టయిన్ కూడా విశ్వం పరిమితమని భావించాడు. వస్తువు లున్నచోటనే స్థలం (Space) వుంటుందని, వస్తువులమధ్య దూరమే స్థలమని ఐన్‌స్టయిన్ నిర్వచించాడు.

## జీవశాస్త్రం

భౌతికశాస్త్రంలోకంటె జీవశాస్త్రం (biology) లో అరిస్టాటిల్ ఎక్కువ విజయం పొందాడు. అయిదువందలకు పైగా జంతుజాతులను అతడు పరిశీలించాడట. వాటిలో కనబడే సామాన్య లక్షణాలనుబట్టి వాటిని కొన్ని వర్గాలు (genus) గాను, ప్రత్యేక లక్షణాలనుబట్టి కొన్ని జాతులు (species) గాను విభజించాడు. ఈ విభజన అతడు జీవశాస్త్రానికి చేసిన మౌలిక దోహదం.

ఒక జీనస్‌కు చెందిన జంతువులలో ముందుగా వాటి సామాన్య లక్షణాలు ప్రత్యక్ష మవుతాయని, ఆ తరువాత ప్రత్యేక లక్షణాలు వృద్ధి చెందుతాయని కనుగొన్నాడు. ఉదాహరణకు పక్షులకు, పాములకు దేహనిర్మాణంలో పోలికలను అతడు కనుగొన్నాడు. మానవులకు, చతుష్పాత్తులకుగల పోలికలను కనుగొన్నాడు. స్తన్యజంతు విభాగం చేశాడు. తిమింగిలాలను స్తన్య జంతువులలో వర్గీకరించాడు. వానరాలకు, మానవులకు గల సారూప్య లక్షణాలను కనిపెట్టాడు.

## ఆత్మలలో రకాలు

జీవానికి, నిర్జీవానికి మధ్య విభేదం ఆత్మ వుండడం, లేకపోవడంతో ఏర్పడుతున్నదని అతడు భావించాడు. ఆత్మ అనేది నాలుగు మూలపదార్థాలు అయిదవదైన ఈథర్‌తో రకరకాలుగా కలియడంవల్ల ఆత్మలలో రకాలు ఏర్పడుతున్నాయి. వృక్షాలలో ఒకరకం, చతుష్పాత్తులలో మరొక రకం, మానవులలో వేరొకరకం ఆత్మలు వుంటాయి. ఆత్మ ఎక్కువ తక్కువలనుబట్టి జీవజాతులలో తేడాలు కలుగుతున్నాయి.

ప్రాణులలో ఒక ఆరోహణక్రమం వున్నది. అధమశ్రేణిలో ప్రాణులకు జీవం మాత్రమే వుంటుంది. పై శ్రేణులకు పోతున్నకొద్దీ ప్రాణులకు జీవంతోపాటు ఇంద్రియానుభవశక్తి, తెలివి ఎక్కువౌతూపోతాయి. మానవునిలో వీటన్నిటితో పాటు హేతుబద్ధ చింతన (rational thought) కూడా వుంటుంది. మానవుడు బౌద్ధిక జంతువు (Man is a rational animal). అతనిలో జీవం (life) పరిపూర్ణ వాస్తవస్థితి పొందుతున్నది.

పరిణామవాదానికి చాలా దగ్గరగా వచ్చిన అరిస్టాటిల్ తన పూర్వులైన ఎంపిడోక్లీస్, అనగ్జాగరస్‌లు ప్రతిపాదించిన పరిణామ వాదాన్ని అంగీకరించలేదు. సృష్టిలో జీవజాతులన్నీ యథాతథంగా ఆదినుంచి వున్నవనే అతడు విశ్వసించాడు.

## చేతులు, తెలివితేటలులు

అరిస్టాటిల్ మరికొన్ని పొరపాట్లు కూడా చేశాడు. మనిషి చేతులను ఉపయోగించే శక్తిని అలవరచుకోవడంవల్ల అతని బౌద్ధికశక్తి వృద్ధి అయిందని అనగ్జాగరస్ ప్రతిపాదించాడు. కాని, అరిస్టాటిల్ బౌద్ధికశక్తి వల్లనే మనిషి చేతులను ఉపయోగించగలుగుతున్నాడని వాదించాడు. ఇది "వైటలిజం" అనబడే పరిణామవాదాన్ని పోలినది... కాని, దీన్ని ఆధునిక జీవశాస్త్రవేత్తలు త్రోసిపుచ్చారు.

కండరాలను గురించి అతనికి తెలియదు. ధమనులకు, సిరలకు భేదాన్ని అతడు గుర్తించలేదు. మెదడు రక్తాన్ని చల్లబరచే అవయవమని భావించాడు. మనిషికి ఎనిమిది పక్క టెముకలు కలవన్నాడు. పురుషునికంటె స్త్రీకి పళ్ల సంఖ్య తక్కువని, పూర్తికాని పురుషుడే స్త్రీ అని అనుకున్నాడు.

ఇటువంటి అంశాలను మినహాయిస్తే మొత్తంపై అరిస్టాటిల్ జీవశాస్త్రానికి చేసిన దోహదం అమూల్యమైనదని పండితులు అభిప్రాయపడ్డారు. అతని మనస్తత్వశాస్త్రం (psychology), జ్ఞానశాస్త్రం (epistemology) మొదలైనవి ఆ తర్వాత కాలంలో ఎంతో ప్రాముఖ్యం వహించాయి.

అరిస్టాటిల్ గ్రీకు తత్వశాస్త్ర చరిత్రలో చిట్టచివరి మహా మేధావి. కనుక మరొక ఉపాధ్యాయాన్ని కూడా అతనికి కేటాయించక తప్పడం లేదు. ఇప్పుడు అతని రాజకీయ, నైతిక, అలంకార శాస్త్రాలను సమీక్షించి, అతనికి వీడ్కోలు చెబుదాము.

# అరిస్టాటిల్ : కవిత్వ తత్వ విచారం

ప్లేటో తన "ఆదర్శరాజ్యం నుంచి కవులను "బహిష్కరించా"డని ఇంతకు

ముందు తెలుసుకున్నాము. అతని వాదం ప్రకారం భావజగత్తు మాత్రమే వాస్తవమైనది. దాన్ని ఇంద్రియజగత్తు అనుకరిస్తుంది. కాగా, కవిత్వం, తక్కిన కళలు ఇంద్రియజగత్తును అనుకరిస్తాయి. అంటే అవి అనుకరణలకు అనుకరణలు. అందుకే వాటికి ప్లేటో అధమ స్థానం ఇచ్చాడు.

తన ఆదర్శరాజ్యంలో పిల్లలకు కవిత్వ రూపంలో కథలు, గాథలు చెప్పవలసివస్తే, వాటిని ప్రభుత్వం ముందుగా సెన్సార్ చేసి మరీ అందజేయాలని ప్లేటో సూచించాడు. నీతి కథలను, ధీరోదాత్తుల వీరగాథలను మాత్రమే అనుమతించా లన్నాడు. ప్లేటో వాదాన్ని అంగీకరిస్తే, గ్రీకుల సుప్రసిద్ధ విషాదాంత నాటకాలనే కాదు, షేక్స్పియర్ నాటకాలతో సహా ప్రపంచ సారస్వతంలోని చాలా భాగాన్ని నిషేధించవలసి వుంటుంది.

అరిస్టాటిల్ తక్కిన అనేక విషయాలలో వలె ప్లేటో కవిత్వాన్ని గురించి చేసిన ప్రతిపాదనలతో కూడా విభేదించాడు. ఏది ఉత్తమ కవిత్వం; అది మనలను ఎందుకు, ఏ విధంగా ప్రభావితం చేస్తుంది దాని ప్రయోజనం ఏమిటి ఒక రచన విషాదాంత కావ్యమైనా మనకు ఆనందం ఎలా కలగజేస్తున్నది మొదలైన విషయాలను అతడు తన "పొయటిక్స్" అనే అలంకార శాస్త్ర గ్రంథంలో కూలంకషంగా చర్చించాడు.

## ర సో వై సః

ఇది రెండు భాగాల గ్రంథం. మొదటి భాగంలో ట్రాజెడీ (విషాదాంత నాటకం)ని, రెండవదానిలో కామెడీ (సుఖాంత నాటకం)ని అరిస్టాటిల్ విశ్లేషించాడు. మొదటిది మాత్రమే లభ్యమైంది. రెండవది కాలగర్భంలో కలిసిపోయింది. అయినా, మొదటి భాగంలో అతడు చేసిన కవిత్వ తత్వవిచారం ఆ తరువాతి కాలంలో సాహిత్య స్రష్టలకు, విమర్శకులకు శిరోధార్యమైంది. దాని ప్రభావం యూరోపియన్ సాహిత్యాలపై ఎంతో వున్నది. నేటికి కూడా దాన్ని ఎంతో విలువైనదిగా, ప్రామాణికమైనదిగా పరిగణిస్తున్నారు. ఇంతేకాదు, సంస్కృతాలంకారికుల రస సిద్ధాంతానికి దగ్గరగా వచ్చే కొన్ని అంశాలు అతని కవిత్వ తత్వశాస్త్రంలో కనిపిస్తాయి.

ప్లేటో వలె అరిస్టాటిల్ కూడా కళను అనుకరణాత్మకమైనదిగానే పరిగణించాడు. మానవుడు అనుకరించే జంతువు అని అతడు నిర్వచించాడు. కవిత్వం, తక్కిన కళలు ప్రకృతిని అనుకరిస్తాయని, అనుకరణవల్ల మానవునికి ఆనందం కలుగుతుందని చెప్పాడు.

## నీరస కళ, అధమ కళ

కళ— ప్లేటో చెప్పినట్టు— నీతి పాఠాలు చెప్పదు. ఎల్లప్పుడు ధర్మమే జయించును, అధర్మము నశించును అని చెప్పేది అధమశ్రేణి కళ. ఉత్తమ కళ రసానందం కలిగిస్తుంది. దానికి నీతికి సంబంధంలేదు. చెప్పినదాన్ని కవి కళాత్మకంగా చెప్పాడా లేదా అన్నదే చూడాలి. కవిత్వంలో నీతిని చిత్రించరాదని కాదు. అయితే, దాన్ని రసవంతంగా చిత్రించాలి. లేకపోతే అది నీరస కళ అవుతుంది. అలాగే అవినీతిని చిత్రించరాదని నియమం లేదు. కాని, దాన్ని సయితం కళాత్మకంగా చిత్రించాలి. లేకపోతే, అది అధమ కళ అవుతుంది.

నీతిబోధకంగా లేవని చెప్పి కావ్యాల నుంచి కొన్ని భాగాలను తొలగించడం తగదు. హోమర్ తన కావ్యాలలో దేవతల విశృంఖల వర్తనను చిత్రించినంత మాత్రాన వాటిని నిషేధించడం అనుచితం.

ఒక రచయిత తన గ్రంథంలో అభ్యంతరకర విషయాలు చొప్పించాడని నిరసించడానికి ముందు— ఆ విషయాలు మొత్తం కావ్యాకృతికి, లేదా నాటక శిల్పానికి అవసరమా కాదా అని ఆలోచించాలి. అశ్లీలం కోసమే అశ్లీలం వ్రాశాడా, లేక అశ్లీల చిత్రణ అని మనం అనుకుంటున్న దానివల్ల మొత్తం నాటకం దృష్ట్యా ఏదైనా పరమార్థం సాధించాడా అన్నది చూడాలి. అట్టి సన్నివేశాలవల్ల నాటకం విలువ పెరిగితే వాటిని తిరస్కరించరాదు. అలాగే రచయిత అశ్లీలాన్ని, అవినీతిని మాత్రమే చూపించి ఏ ఉత్తమ కళాత్మక ప్రయోజనాన్ని సాధించలేకపోతే అది అధమ కళ అవుతుంది.

లలితకళ లన్నిటిలోకి కవిత్వం ఉన్నత కళ. ఎందుకంటే అది మానవుని ప్రవర్తనను విశ్వజనీనం చేస్తుంది; సాధారణీకరిస్తుంది.

## కావ్యేషు నాటకమ్...

ఇక కవితా రూపాలలో ఇతిహాసం, నాటకం గొప్పవి. అయితే, ఇతిహాసం కథా కథనం మాత్రమే చేస్తుంది, వర్ణనాత్మకంగా మాత్రమే వుంటుంది. కనుక దానికంటె నాటకం గొప్పది. "కావ్యేషు నాటకమ్ రమ్యమ్" అన్నారు. ఎందుకంటే నాటకంలో పాత్రల చర్యలను ప్రత్యక్షంగా చూస్తాము. అది సంఘటనాత్మకమైన సాహిత్య ప్రక్రియ.

నాటకాలలో కూడా విషాదాంత నాటకం ఉన్నతశ్రేణికి చెందినదని అరిస్టాటిల్ భావించాడు. విషాదాంత నాటకం (ట్రాజెడీ) మనలో కరుణను, భయాన్ని ఉద్బుద్ధం చేస్తుంది.

కాని, ప్రేక్షకునిలో వట్టి భయోత్పాతాన్ని కలిగించరాదు. దానివల్ల నాటకంలోని విషాదం చెడిపోతుంది.

విషాదాంత నాటకాన్ని చూస్తుంటే మనకు ఆనందం కలగాలి. ఇది ఎలా సాధ్యం? విషాదకర సన్నివేశాన్ని చూస్తుంటే ఆనందం ఎలా కలుగుతుంది?

## క్షాళన క్రియ

వాస్తవ జీవితంలో మనకు కలిగే జాలి (pity) లో, భయం (fear) లో బాధ మిళితమై వుంటుంది. కాని, నాటకం చూస్తున్నప్పుడు మాత్రం మనలో కలిగే జాలినుంచి, భయంనుంచి లౌకికత్వం క్షాళన (catharsis) అయిపోతుంది. జాలి, భయం మననుంచి ట్రాజిక్ హీరోవైపు ప్రసరిస్తాయి. అతనిలో మనం లీనమైపోతాము. అతని బాధలు మనవైపోతాయి. అతని కష్టాలు చూసి మనం శోకిస్తాము. భయ విహ్వాలురమైపోతాము. కాని, ఆ శోకంగాని, భయంగాని నిజంగా మనవికావు. కనుక అవి మనల్ని నిజంగా తాకవు. అవి సాధారణీకరణం (universalisation) చెందుతాయి. నాటకం చూస్తున్నప్పుడు మనచుట్టూ మామూలుగా వుండే వ్యక్తిగత ఆవరణ తొలగిపోయి విశ్వ మానవ బాధలలో విలీన మవుతాము. మన నుంచి మనం వేరైపోతాము.

ఈ ప్రక్రియవల్ల మనకు ఆనందం కలుగుతుంది. అదే రసానందం. (ఈ సిద్ధాంతం సంస్కృతాలంకారికుడైన అభినవ గుప్తుని "భగ్నావరణ" సిద్ధాంతానికి ఎంత దగ్గరగా వున్నదో పాఠకులు గమనించే వుంటారు ఎటొచ్చీ అరిస్టాటిల్ క్రీస్తుపూర్వం 4వ శతాబ్ది నాటివాడు.) ఎంత గొప్ప నాటకం చూశామన్న ఉత్తేజంతో బయటికి వస్తాము. ఆనందం పొందడంతోపాటు నైతికంగా కూడా మనం ఉన్నత స్థాయికి పెరుగుతాము. కాని, ఈ నైతికోన్నతిని మనకు కలిగించడమే కళ అసలు ప్రయోజనం కాదు. సౌందర్యాన్ని, ఆనందాన్ని సృష్టించడమే రచయిత లక్ష్యం.

## హీరో లక్షణాలు

విషాదాంత నాయకుడు ధీరోదాత్తుడు, కులీనుడు, అదృష్టవంతుడు, భాగ్యశాలీ, సద్గుణశీలి అయివుండాలి. ఒక వ్యక్తి పతనంవల్ల విషాదం కలుగుతుంది. కాని, అతడు చరమదుష్టుడైతే అతని పతనంవల్ల విషాదం కలగదు. సాధారణ వ్యక్తి అయితే అతని పతనం పతనం అనిపించుకోదు. పైనుంచి క్రింద పడితేనే కదా పతనం?

అయితే, విషాదాంత నాయకునిలో ఏదో ఒక నైతిక బలహీనత వుండాలి.

లేదా ఏదో పెద్ద పొరపాటు చేయాలి. అతడు చేజేతులా పతనం కొనితెచ్చుకో వాలి. అదే సమయంలో యాదృచ్ఛిక సంఘటనలు, ఆశ్చర్యకరమైన సంఘటనలు వుండాలి. కథ అద్భుత రసాత్మకంగా ఉండాలి. నాటకం చూస్తుంటే ఓహో అనిపించాలి.

ఇతివృత్తంలో వస్త్వైక్యం (unity of plot) ప్రధానం. అంటే సన్నివేశాలన్నీ ఏకోన్ముఖంగా వుండాలి. అలాంటి సన్నివేశాలను ఎంచుకుని నాటకం నడిపించాలి. ఇతివృత్తానికి సంబంధించని సన్నివేశాలు చేర్చరాదు. లేకపోతే నాటకం అందం చెడుతుంది. స్వయం సంపూర్ణమైన కథ వుండాలి. సాధారణంగా కథా సమయం ఇరవై నాలుగు గంటలకు మించరాదు.

## రాజకీయశాస్త్రం

అరిస్టాటిల్ మానవుడిని రకరకాలుగా నిర్వచించాడు. అతనిదే మరొక నిర్వచనం మానవుడు రాజకీయ జంతువు (Man is a political animal) రాజ్య వ్యవస్థలోనే మనిషి పరిపూర్ణత్వం పొందుతాడు.

సంఘవ్యవస్థకు ప్రాతిపదిక కుటుంబం. అంటే భర్త, భార్య, సంతానం. కొన్ని కుటుంబాలు కలిస్తే ఒక గ్రామం. కొన్ని గ్రామాలు కలిస్తే రాజ్యం. దీన్ని నగర రాజ్య (city state) మనే మనం అర్థం చేసుకోవాలి.

రాజ్యం అనేది కాలక్రమంలో కాకపోయినా ప్రాధాన్యక్రమంలో మొదటిది. మానవ జీవిత పరిణామానికి అది లక్ష్యం. రాజ్యం లేనిదే మానవుని జీవితం అసంపూర్ణంగా మిగిలిపోతుంది.

అలాగని వ్యక్తి సంఘానికి, రాజ్యానికి బానిస కాదు. రాజ్యం వ్యక్తికోసం. వ్యక్తి రాజ్యం కోసం.

అరిస్టాటిల్ మొత్తం 158 రాజ్యాంగాలను సేకరించాడు, పరిశీలించాడు. వాటిలో కొన్ని మంచివైతే, కొన్ని చెడ్డవి. రాజరికం, అరిస్టాక్రసీ, పోలిటీ– ఇదే వరుసలో ఇవి మంచివి. నియంతృత్వం, అలిగార్కీ (ధనికస్వామ్యం) డెమోక్రసీ– ఈ వరుసలో ఇవి చెడ్డవి.

## ఏది మంచి వ్యవస్థ?

రాజరికం అన్నిటికంటె శ్రేష్ఠం. కాని, రాజు నిరంకుశుడైతే అది నియంతృత్వంగా మారుతుంది. ఆ తర్వాత అరిస్టాక్రసీ. కాని అది అలిగార్కీగా మారిపోయే ప్రమాదం వుంది. ఉన్నంతలో పోలిటీ మంచిది. అంటే రాజ్యాంగ బద్ధమైన పరిపాలన. ఈ వ్యవస్థలో అందరూ సమానులే.

నియంతృత్వం అన్నిటిలోకి దుష్టమైనది. దానికంటె కొంత మంచిది ఆలిగార్కి. దానికంటె మంచిది డెమోక్రసీ. గ్రీకులు డెమోక్రసీ అని వ్యవహరించినదాన్ని ఈనాటి ప్రజాస్వామ్యంగా మనం అర్థం చేసుకోరాదు. వారిది బానిసతనంపై ఆధారపడిన అతి పరిమిత "ప్రజాస్వామ్యం."

బానిసతనాన్ని అరిస్టాటిల్ సమర్థించాడు. అది ప్రకృతిసిద్ధమని అంటాడు. అయితే గ్రీకులు ఉన్నత జాతివారు కనుక గ్రీకులకు గ్రీకులు బానిసలు కారాదట. విజాతీయులైతే మంచిదట. సాధు జంతువులు మనిషి అదుపులోవుంటే సుఖంగా బ్రతుకుతాయి. అలాగే సహజంగా తక్కువ జాతికి చెందిన మానవులు బానిసలుగా యజమాని చెప్పుచేతలలో వుంటే సుఖంగా జీవిస్తారట.

ఆనాటి గ్రీకు తత్వవేత్తలందరివలె అరిస్టాటిల్ కూడా శారీరక శ్రమను ఏవగించుకున్నాడు. దాని ఔన్నత్యాన్ని (dignity of labour) అతడు గుర్తించ లేదు. శారీరక శ్రమవల్ల తెలివితేటలు వృద్ధి కావని, మెదడుతక్కువ వారికే అది తగునని భావించాడు.

ఇక వ్యాపారం, వ్యవసాయం. వీటిలో వ్యవసాయాదాయం మంచిదని అరిస్టాటిల్ అభిప్రాయం. వ్యాపారంవల్ల వచ్చే ధనం, ముఖ్యంగా వడ్డీ వ్యాపారం వల్ల వచ్చే ఆదాయం హీనమట.

ప్లేటో ఆదర్శరాజ్యాన్ని అరిస్టాటిల్ అన్యాపదేశంగా విమర్శించాడు. ప్లేటో రిపబ్లిక్‌లో వ్యక్తికి కాక ప్రభుత్వానికే అధిక ప్రాధాన్యం కనుక వ్యక్తి ప్రాధాన్యాన్ని గుర్తించిన అరిస్టాటిల్ దాన్ని ఖండించాడు. ఉత్తమ పౌరులను తయారు చేయడమే రాజ్య లక్ష్యం కావాలన్నాడు.

## సొంత ఆస్తి

సొంత ఆస్తి (private property) వుండరాదన్న ప్లేటో అభిప్రాయాన్ని కూడా అరిస్టాటిల్ ఖండించాడు. ఒక వస్తువు లేదా ఆస్తి అందరిదీ అయితే దానిపై ఏ ఒక్కరికీ శ్రద్ధ వుండదు. కనుక సొంత ఆస్తి వుండవలసిందే. కాని, దాన్ని సంఘ శ్రేయస్సుకు వినియోగించాలి.

అలాగే ప్లేటో సూచించిన సామూహిక దాంపత్యాన్ని కూడా అతడు విరసించాడు. అందరూ భర్తలు, భార్యలు అయితే ఎవరూ ఎవరినీ పూర్తిగా ప్రేమించలేరు. ప్రేమ పలచబడిపోతుంది. అందరూ అందరికీ సోదరులైతే ఏ ఒక్కరూ ఏ ఒక్కరికీ సోదరుడు కాదన్న మాట. అందరూ తల్లి, తండ్రులైతే ఏ ఒక్కరూ ఎవరికీ తల్లి, తండ్రి కారన్నమాట.

ప్లేటో తన రాజ్య వ్యవస్థలో స్త్రీకి పురుషునితో సమానస్థాన మివ్వగా అరిస్టాటిల్ స్త్రీని చులకన చేశాడు. పరిణామక్రమంలో స్త్రీ తక్కువదట. నాగరికుడైన గ్రీకు జాతీయునికి బర్బరుడు ఎలాగో, పురుషునికి స్త్రీ అటువంటిదట.

## వివాహ యుక్తవయస్సు

పురుషుడు 37 ఏళ్లు వచ్చేవరకు, స్త్రీ ఇరవై ఏళ్లు వచ్చేవరకు వివాహం చేసుకోరాదని అరిస్టాటిల్ సూచించాడు. ఈ వయఃపరిమితులను పాటిస్తే ఉభయులకు దాదాపు ఒకేసారిగా సంతానోత్పత్తి శక్తి అంతరిస్తుందని అతని భావమట. మరీ చిన్నతనంలో పెళ్లి చేస్తే దుర్బల సంతానం కలుగుతుందని, పైగా ఆడపిల్లలు పుడతారని అతడు భావించాడు. బాల్యంలో స్త్రీకి పెళ్లిచేస్తే స్వైరిణి కాగల అవకాశం కలదట. అలాగే మగవాడికి చిన్నతనంలో పెళ్లిచేస్తే అతడి ఎదుగుదల ఆగిపోతుందట. ఏమైనా వివాహార్హ వయస్సును రాజ్యాంగం నిర్ణయించాలన్నాడు.

పౌరులకు ఆస్తి వుండాలి కాని, జీవనోపాధికోసం వారు దైహిక శ్రమచేయరాదు. ఈ లెక్కన వర్తకులు, కార్మికులు, వ్యవసాయదారులు పౌరత్వానికి అర్హులు కారు. విద్యకు కూడా పౌరులైనవారే అర్హులట.

## స్మాల్ ఈజ్ బ్యూటిఫుల్

రాజ్య విస్తీర్ణంగాని, జనాభాగాని మరీ ఎక్కువగా వుండరాదని అరిస్టాటిల్ సూచించాడు. విస్తీర్ణం, జనాభా మరీ ఎక్కువైతే క్రమశిక్షణ లోపిస్తుంది. మరీ తక్కువైతే ఆర్థికంగా రాజ్యం స్వయంపోషకంగా వుండజాలదు. ఒక ఎత్తయిన కొండపై ఎక్కి చూస్తే రాజ్యమంతా కనబడాలి. పదివేలు జనాభా కలిగివుంటే చాలు.

అరిస్టాటిల్ తన "రాజకీయ శాస్త్రం" (Politics) గ్రంథ రచన చేస్తుండగానే మరొకవైపు అతని శిష్యుడు అలెగ్జాండర్ దేశం తర్వాత దేశాన్ని జయిస్తూ విశాల సామ్రాజ్యాన్ని స్థాపిస్తున్నాడు. ఆ విషయాన్ని ఎరగనట్టే అతడు తన ఆదర్శ రాజ్యాన్ని ఒక నగరానికి, దాని పరిసరాలకు పరిమితం చేయడం వింతే.

అరిస్టాటిల్ వాదాలలో విచిత్రమైనది ఒకటి వున్నది. ప్లేటో తన "రిపబ్లిక్"లో ప్రతిపాదించిన "ఆదర్శరాజ్య" లక్షణాలన్నీ నిజంగా ఆదర్శప్రాయాలే అయితే, వాటిని ప్లేటో కంటె ముందుగానే ఎవరో ప్రతిపాదించేవారు కదా అంటాడు.

ఏమైనా, అరిస్టాటిల్ రాజకీయశాస్త్రం ఈనాడే కాదు, ఏనాడైనా అనేక అభివృద్ధి నిరోధక అంశాలతో కూడినదని చెప్పకతప్పదు. అది దాదాపుగా నిరుపయోగమైనది. రాజ్యంతో సమానమైన ప్రతిపత్తిని వ్యక్తికి ఇవ్వడంలోను, డెమోక్రసీలో విప్లవాలకు అవకాశం తక్కువ కనుక దాన్ని వున్నంతలో మంచి వ్యవస్థగా అంగీకరించడంలోను మాత్రం అతని అభిప్రాయాలకు మనం విలువ ఇవ్వవచ్చు.

## నీతిశాస్త్రం

అరిస్టాటిల్‌ను గురించి ఇంతవరకు చదివినదాన్నిబట్టి అతడిది తత్వశాస్త్రంలో, దాని విభిన్న శాఖలలో మధ్యమ వాదం అనే విషయం పాఠకులు గుర్తించే వుంటారు. తన పూర్వుల విభిన్న తాత్విక సిద్ధాంతాలను అతడు సమన్వయం చేసి కొత్త సిద్ధాంతాలను ప్రతిపాదించాడు.

నీతి శాస్త్రం (Ethics) లో కూడా అతనిది మాధ్యమిక వాదమే. ప్లేటో పూర్తిగా ఆదర్శవాది కాగా ఇతడు వాస్తవిక వాది. అతని నీతిసూత్రాలను "అతి సర్వత్ర వర్జయేత్" అని ఒక వాక్యంలోకి కుదించవచ్చు.

## వాస్తవిక దృక్పథం

మానవ శక్తికి అతీతమైన ఆదర్శాల జోలికి అరిస్టాటిల్ పోలేదు. మనిషిని మనిషిగా, ఒక సంఘజీవిగా- వాస్తవిక దృక్పథంతోనే అతడు పరిగణించాడు. తాను సుఖం పొందుతూ, ఇతరులకు సుఖం కలిగించే పద్ధతి గురించి అతడు ఆలోచించాడు. మంచితనం కోసమే మంచితనం కాదు. మంచితనంవల్ల తనకు, ఇతరులకు సుఖం కలగా లన్నాడు. సుఖం అంటే ఇంద్రియసుఖం కాదు. అది తాత్కాలికం. నిజమైన సుఖం శాశ్వతానందం కలిగించాలి.

శాశ్వతానందం ఎలా లభిస్తుంది? తక్కిన జంతువులకంటె మానవుడు ఒక విషయంలో భిన్నుడు. అతనికి ఆలోచనా శక్తి, వివేచనా పటిమ వున్నాయి. ఇదే అతనికి, సాధారణ జంతువులకు తేడా. ఈ తేడా ద్వారానే అతనికి నిజమైన సుఖం లభిస్తుంది. కనుక ఆ భిన్నగుణాల్ని అతడు అభివృద్ధి చేసుకోవాలి.

భౌతికావసరాలను అశ్రద్ధ చేయరాదన్నమాట నిజమే. వాటిని తృప్తిపరచవలసిందే. కాని, అవి మాత్రమే చాలదు. అవి మనల్ని శాసించరాదు. వాటిని నిష్కామంగా, సంయమనంతో అనుభవించాలి. ఒక మితిని దాటి కోర్కెలను పెరగనివ్వరాదు. నేర్పుగా వాటిని సాధించాలి.

ఇందుకు మధ్యమ మార్గాన్ని అవలంబించాలి. అరిస్టాటిల్ ప్రతిపాదించిన ఈ మధ్యమ మార్గానికే (golden mean) అని పేరు వచ్చింది.

ప్రతి విషయానికి రెండు చివరలు వుంటాయి. ఆ రెండింటికి మధ్యస్థంగా మనిషి నడుచుకోవాలి.

## మాధ్యమిక వాదం

ఉదాహరణకు ఒకవైపు పిరికితనం, మరొక వైపు దుడుకుతనం వుంటాయి. వాటికి మధ్యస్థంగా ధైర్యం వుంటుంది. పిసినిగొట్టుతనానికి, దుబారాకు మధ్యలో పొదుపరితనం. నిరాశకు దురాశకుమధ్య ఆశ. అతి వినయానికి, అహంభావానికి మధ్య వినమ్రత. మౌనానికి, అతి వాగుడుకు మధ్య మితభాషిత్వం. ఈసురో మంటూ బ్రతకడానికి, వెకిలితనానికి మధ్య హాస్యప్రియత్వం. డోలాందోళనకు, తొందరపాటుకు మధ్య ఆత్మ నిగ్రహం.

అయితే, ఏదీ మధ్యమ మార్గం అనేది ముందుగా తెలుసుకోలేము. ఏది సత్ఫలిత మిస్తే, ఏది నిజమైన సుఖానికి దారితీస్తే అది మంచిమార్గం, మధ్యమ మార్గం. జీవితంలో ప్రతి సన్నివేశాన్ని ఆచితూచి అంచనావేసి ఏది మధ్యమ మార్గం కాగలదో నిర్ణయించుకోవాలి.

అలా నిర్ణయించే శక్తి శిక్షణవల్ల, అభ్యాసంవల్ల, అనుభవంవల్ల సిద్ధిస్తుంది. మనం మంచివారమైనందున మంచిగా ప్రవర్తించము. మంచిగా ప్రవర్తించి నందువల్ల మంచివారమవుతాము. మంచితనం జన్మతః రాదు. అభ్యాసంవల్ల, నిరంతరాచరణవల్ల సిద్ధిస్తుంది. ఒక్క కోకిల కూస్తే వసంతం వచ్చినట్టు కాదు. ఒక్క మంచి పనివల్ల మనిషి మంచివా డనిపించుకోడు. ఎప్పుడూ మంచిపనులు చేయడంవల్లనే మంచివా డవుతాడు.

పిరికివాడు ధైర్యశాలిని చూసి దుడుకుమనిషి అనుకుంటే, దుడుకుమనిషి ధైర్యశాలిని చూసి పిరికివా డనుకుంటాడు. జాగ్రత్తగా ఖర్చుపెట్టేవాడిని చూసి లోభి దుబారా మనిషిగా జమ కడతాడు. దుబారావాడు వాడిని లోభిగా లెక్కవేస్తాడు. అయినా మధ్యమ మార్గమే అనుసరణీయం.

పిరికివాడు దుడుకుతనం నేర్చుకోడానికి ప్రయత్నించాలి. దుడుకు మనిషి పిరికి తనం అలవరచుకోవడానికి కృషి చేయాలి. అప్పుడు ఇద్దరూ మధ్యలో ధైర్యగుణం వద్దకు చేరుకుంటారు—లుంగలు చుట్టుకుపోయిన కాగితాన్ని వెనక్కి విరిచిచుట్టితే అది సాఫు అయినట్టు.

నైతికంగా మధ్యమ మార్గం అవలంబించినంత మాత్రాన సుఖం లభించదు.

తగు మాత్రంగా అస్తిపాస్తు లుండాలి. దారిద్ర్యం దుఃఖహేతువు. దానివల్ల సకల దుర్గుణాలు వస్తాయి.

## సృష్టిలో తీయనిది...

సుఖంగా వుండదలచినవాడికి స్నేహితులు కావాలి. ఇతరులతో పంచుకున్నప్పుడు సుఖం పెరుగుతుంది. దుఃఖం తరుగుతుంది. కాని, ఎక్కువ మంది స్నేహితులు వుండరాదు. స్నేహితులు ఎక్కువైతే ఏ ఒక్కరితోను గాఢమైత్రి సాధ్యం కాదు. సమానుల మధ్యనే స్నేహం సాధ్యం. ధనికుడు పేదవానితో స్నేహం చేయరాదు. అప్పు ఇచ్చినవాడిని అప్పు తీసుకున్నవాడు శత్రువు కింద చూస్తాడు.

ప్రాపంచిక సుఖాలు అనుభవించిన కొద్దీ కావాలనిపిస్తాయి. దురద పెట్టడానికి గోక్కుంటాము. గోక్కోడానికి దురద పెట్టించుకుంటాము. కనుక కోర్కెలను అదుపులో పెట్టుకోవాలి. అన్నిటిలోకి గొప్ప సుఖం సత్యాన్వేషణలో లభిస్తుంది.

కొన్ని స్వతహాగా దుర్గుణా లుంటాయి. చౌర్యం, క్రౌర్యం, అసూయ, ద్వేషం, క్రోధం, వ్యభిచారం మొదలైన వాటికి మధ్యమ మార్గం లేదు.

అరిస్టాటిల్ నైతిక మధ్యమ వాదాన్ని (golden mean) రస్సెల్ వేళాకోళం చేస్తూ ఒక ఉదాహరణ చెప్పాడు. ఒక నగరం మేయరు పదవీ విరమణ సందర్భంలో ఒక చిన్న ప్రసంగం చేశాడు. తానెప్పుడూ మధ్యమ మార్గాన్ని అనుసరించడానికే ప్రయత్నించానని చెబుతూ "నేను పక్షపాతానికి, నిష్పక్షపాతానికి మధ్యగా ప్రవర్తించా"నని బడాయిగా అనేసి చప్పున నాలుక కరచుకున్నాడట.

అయితే, అరిస్టాటిల్ చెప్పినట్టు ఏది మధ్యమ మార్గమో తెలుసుకోడానికి చాలా శ్రమ పడాలి. అది ఒక్కొక్క సందర్భంలో ఒక్కొక్క విధంగా వుంటుంది. అయితే మధ్యమ మార్గం తిరిగి అదొక వైపరీత్యం (extreme)గా తయారుకాకుండా జాగ్రత్త పడాలి.



# 14
# అపర చార్వాకుడు ఎపిక్యురస్

చేతిలో కర్ర, బుజానికి జోలె, కప్పుకొనడానికి ముతక ఉన్నిదుప్పటి, గుబురు జుట్టు, బవిరిగడ్డం-- బికారివలె,మన బైరాగులవలె, ఈనాటి అమెరికన్ హిప్పీ లకు ఒకనాటి మార్గదర్శివలె ఇదీ ఏంటిస్తెనీజ్ వేషం. గ్రీకు తత్వశాస్త్రంలో "సినిసిజం" అనే శాఖకు అతడు ఆద్యుడు.

"సినిసిజం" చాలా ఆసక్తికరమైన తాత్విక సిద్ధాంతం. దీన్ని అనుసరించిన వారికి సినిక్‌లని పేరు వచ్చింది.

లాటిన్‌లో "సినికస్" అంటే "కుక్కకు సంబంధించిన" అని అర్థం. ఆ మాటనుంచి "సినిక్" అనే మాట వచ్చింది. సంస్కృతంలో శునకః శునిః అనే మాటలకు కుక్క అని అర్థం. కనుక సినిక్‌లకు మనం తెలుగులో "శౌనకులు" అని ముద్దుపేరు పెట్టవచ్చు.

సినిక్ తాత్వికుడైన డైయోజెనిస్ "మనుషులు కుక్కలవలె బ్రతకాలి" అనే వాడట. ఈ మాటను పట్టుకుని ఆనాటి వారు "సినిక్" అనే మాటను హేళనార్థంలో మొదటగా ఉపయోగించి వుంటారు. చివరికి ఏంటిస్తెనీస్, డైయో

జెనిన్‌ల తాత్విక చింతనకు సినిసిజం అని, వారి అనుయాయులకు సినిక్‌లని పేర్లు స్థిరపడిపోయాయి.

## ఈనాటి సినిసిజం

కాని, సినిక్ అనే మాటకు ఈనాటి అర్థం వేరు. మానవులందరు స్వార్థ పరులని, పైకి ఎన్ని నీతులు, ఎన్ని ఆదర్శాలు వల్లించినా ప్రతివాడు దగాకోరు అని నమ్మేవాడిని ఈ రోజులలో సినిక్ అంటాము. మానవుడిలో మంచితనం ఏకోశానా కనబడదన్న దృక్పథం కలవాడు సినిక్. కాగా, పూర్వకాలపు గ్రీకు సినిక్‌లు గొప్ప తాత్వికులు.

ఏంటిస్తెనీస్ సోక్రటీస్ శిష్యులలో ఒకడు. ప్లేటో కంటె ఇరవై ఏళ్లు పెద్ద. క్రీస్తుపూర్వం 445 నుంచి 365 వరకు జీవించి వున్నాడు. పెరిక్లీస్ నాటి వైభవం అంతరించి ఏథెన్సుతో సహా మొత్తం గ్రీసు మేసిడోనియా సామ్రా జ్యంలో అంతర్భాగమై పోయిననాటి నిరాశా, నిస్పృహల వాతావరణంలో అతడు జీవించాడు. ఆ వాతావరణంలో నుంచి వచ్చినదే ఏంటిస్తెనీస్ సినికల్ తత్వ చింతన.

## టాల్‌స్టాయ్‌తో పోలిక

ఇతడిని బెర్ట్రాండ్ రస్సెల్ టాల్‌స్టాయ్‌తో పోల్చాడు. టాల్‌స్టాయ్‌వలె ఇతడు కూడా భోగభాగ్యాలను త్యజించాడు. సామాన్య ప్రజలతో కలసి మెలసి జీవించాడు. వారినిపోలిన వేషభాషలను అలవరచుకున్నాడు. అనార్కిస్టులవలె అసలు ఏ ప్రభుత్వం వనికి రాదన్నాడు. సొంత ఆస్తి, వివాహ వ్యవస్థ, మతం ఏదీ వుండరాదన్నాడు. మాటలో దురుసుతనం, ప్రవర్తనలో మొరటుతనం పెంచుకున్నాడు.

గ్రీకు తత్వవేత్తలందరు విస్తారంగా గ్రంథరచన చేసినవారే. ఏంటిస్తెనీస్ కూడా విపరీతంగా వ్రాశాడట. కాని అన్నీ కాలగర్భంలో కలిసిపోయాయి. సోక్రటీస్ వ్యక్తిత్వంలో అతనికి నచ్చినదొకటే. మనిషికి బాహ్య పరిసరాలతో, జీవిత కష్ట సుఖాలతో నిమిత్తంలేని గుండె నిబ్బరం, మనో నిగ్రహం కావాలి. మనిషి సుఖాన్ని కోరడంకంటె ఉన్మాది కావడం మంచిది. జీవితం ఎన్ని కష్ట నష్టాలు తీసుకురానీ, మనిషి తన అంతర శాంతిని, మానసిక స్వాతంత్ర్యాన్ని వదలుకోరాదు. అప్పుడు అతడిని జీవితం ఎంతమాత్రం బాధించబోదు. ఎవరూ అతడిని ఏమీ చేయలేరు. ప్రాపంచిక బంధాలన్నిటిని ఛేదించుకుని, వాటిపై ఆధారపడనక్కరలేని నిరాడంబర, నీతి పూరిత జీవితం గడపాలి.

## అలెగ్జాండర్ నీడ

ఏంటిస్తెనీస్ శిష్యులలో ముఖ్యుడైన డైయోజెనీస్ గురువును మించి పోయాడు. అతడు ఒక పొడుగాటి తొట్టెలో నివసించేవాడట. పగటి పూట కాగడా పట్టుకుని ఏథెన్సు పుర వీథులలో నిజమైన మనిషి కోసం అన్వేషించేవాడట. అతని జనన సంవత్సరం తెలియదు కాని, మరణం క్రీస్తు పూర్వం 324 లో.

ఒకనాడు డైయోజెనిస్ ఎండలో కూర్చున్నాడు. చక్రవర్తి అలెగ్జాండర్ అతడి పేరు ప్రఖ్యాతులు విని చూడవచ్చాడు. "నీకేమి కావాలి స్వామీ?" అని చక్రవర్తి అడిగాడు. "నీ నీడ నామీద పడుతోంది. తప్పుకో" అన్నాడట డైయోజెనీస్.

"నేను అలెగ్జాండర్‌ని కాకపోతే డైయోజెనీస్ వలె జీవించాలని కోరుకునే వాడిని" అన్నాడట. చక్రవర్తి.

చేదువిషం జీవఫలం; చదువు వృథా, బ్రతుకు వృథా; వెనుక దగా, ముందు దగా; కుడి ఎడమల దగా దగా— ఇదీ డైయోజెనీస్ జీవిత దృక్పథం. రాజులు, భృత్యులు, విజ్ఞానం, సౌఖ్యం, డబ్బు, కీర్తి, హోదా, దేశభక్తి, మంచి, మర్యాద, ఇల్లు, వాకిలి, తిండీ, తిప్పలు, ఆచారాలు, నియమాలు, కట్టుబాట్లు మొత్తం జీవితమే దండగ. మనుషులు జంతువులవలె, కుక్కలవలె ప్రకృతికి దగ్గిరగా, నాగరికతకు దూరంగా, స్వేచ్ఛగా బ్రతకాలి.

## ఏది స్వేచ్ఛ?

అయితే, స్వేచ్ఛ ఎలా లభిస్తుంది? వాంఛా పరిత్యాగంలో లభిస్తుంది. కోరికలన్నిటిని కాలదన్నాలి. కోరికల వల్లనే భయం. భోగ భాగ్యాలు అశాశ్వతం. మన నీతి, మన వాంఛారాహిత్యం, మన స్వేచ్ఛాభావం, మన మనస్సు— ఇవే నిజంగా మనవి. ఈ భావాన్ని అలవరచుకుంటే ప్రపంచమంతా మనది. కానప్పుడు ప్రపంచమంతా మనదైనా మనకు ఏమీ లేనట్టే.

డైయోజెనీస్ గొప్పతనం ఒకటే. అతడు చెప్పింది చేశాడు. తన ఉపదేశా లను తూచా తప్పక అనుసరించాడు. జోలెపట్టి బిచ్చమెత్తుకుని జీవించాడు. క్రీస్తుపూర్వం మూడవ శతాబ్దిలో అతని "సినిసిజం" ఒక ఫ్యాషన్‌గా మారింది.

## సుఖవాదం

సోక్రటీస్ శిష్యులలో మరొకడైన అరిస్టిప్పస్ వేరొక తత్వశాఖకు ఆద్యుడ

య్యాడు. అతడు ఆఫ్రికాలోని సిరీనీ అనే పట్టణంలో ఒక ధనిక కుటుంబంలో క్రీస్తు పూర్వం 435లో జన్మించి 355 వరకు జీవించాడు. ఆ పట్టణం పేరు మీదుగా అతని అనుయాయులకు "సిరినైక్" లనే పేరు వచ్చింది.

అరిస్టిప్పస్ సినిక్‌లకు బద్ధ వ్యతిరేకి. సోక్రటీస్ ఎంత నిరాడంబరంగా, సర్వ సంగ పరిత్యాగివలె జీవించినా, సాదారణ సుఖాలను నిరసించలేదు. అతని వ్యక్తిత్వంలోని ఈ అంశాన్ని అరిస్టిప్పస్ తన తత్వ చింతనకు ప్రాతిపదిక చేసుకున్నాడు.

వ్యక్తిగా అతడు సౌమ్యుడు, హాస్యప్రియుడు, నిత్య సంతోషి, సరదా పురుషుడు. సౌఖ్యం కోసమే ప్రతిప్రాణి పుట్టుకతోనే ప్రయత్నిస్తుంది. కనుక సౌఖ్యమే జీవిత లక్ష్యమని అరిస్టిప్పస్ బోధించాడు.

ప్లేటో భావసిద్ధాంతాన్ని (theory of ideas) అతడు తిరస్కరించాడు. సోఫిస్టులతో ఏకీభవించాడు. ఏ వ్యక్తికి ఆ వ్యక్తే ప్రమాణం. నీవు చూసే దృశ్యం, నేనుచూసేది ఒకటి కాకపోవచ్చు. నీ అనుభవం నీది, నా అనుభవం నాది. నీకు భౌతిక ప్రపంచం ఒక విధంగా కనిపిస్తే నాకు మరొక తీరుగా కనిపిస్తుంది. అందుచేత బాహ్య ప్రపంచం గురించి సాధారణీకరించడం సాధ్యంకాదు.

సౌఖ్యం కూడా అంతే. నీకు ఒక మార్గాన సౌఖ్యం లభిస్తే, నాకు మరొక రీతిగా లభిస్తుంది. అందుచేత దేన్నీ ఒక నిర్దిష్ట నిర్వచనంలో ఇరికించలేము. సౌఖ్యంలో ఉత్కృష్టం, నికృష్టం అంటూ లేవు. అన్నీ సమానమే. మానసిక సుఖం ఎంత గొప్పదో దైహిక సుఖం కూడా అంతే. ఎందుకంటే మానసిక సుఖం కూడా ఇంద్రియ వికారాల ద్వారానే కలుగుతుంది. ఇంద్రియ సుఖమే నిజమైన సుఖం. ఆ సుఖం ఎంత తీవ్రమైతే అంత మంచిది.

## ఎపిక్యురస్

ప్లేటో స్థాపించిన "అకాడెమీ", అరిస్టాటిల్ నెలకొల్పిన "లైసియమ్", ఇంకా ఏంటిస్తెనీస్ మొదలయిన గ్రీకు తత్వవేత్తల విద్యాలయాలు ఏథెన్సులో ఒక ప్రక్కన వర్ధిల్లుతుండగానే, మరొకవైపు అదే నగరంలో వేరొక విద్యాలయాన్ని స్థాపించి, ఎందరో శిష్యులకు తన విచిత్ర తాత్విక ప్రపంచాన్ని ఆవిష్కరిస్తూ ఆదర్శప్రాయమైన నిరాడంబర జీవితం గడిపిన మహాతత్వవేత్త ఎపిక్యురస్.

పై వాక్యం పలువురు పాఠకులకు ఆశ్చర్యం కలిగించవచ్చు. ఎపిక్యురస్ ఆదర్శప్రాయమైన జీవితం గడిపాడా? అతని పేరుతో ప్రసిద్ధమైన తత్వ శాఖను "ఎపిక్యూరియనిజమ్" అంటారు. అది కేవలం సుఖవాదం కాదా? తిని, తాగి, తందనాలాడే వట్టి ఐహికవాదం, దైహికవాదం కాదా?

కాదు. ఎపిక్యురస్ భౌతికవాదేకాని, విశృంఖలవాది కాదు. ఆ తర్వాతి కాలంలో ఎపిక్యురస్ తత్వబోధలు తమ అసలు అర్థాన్ని కోల్పోయి వికృతార్థంలో ప్రచారం అయ్యాయి. తత్వ చరిత్రలో తరచుగా ఇలాగే జరుగుతుంది. ఉదాహరణకు అద్వైతం అనే మాటను తీసుకోండి. "అద్వైతులొస్తున్నారు, చెంబూ తప్పేలా జాగర్త" అనే సామెతలవంటివి ఎన్నో వచ్చాయి. అలాగే ఎపిక్యూరియనిజమ్ చాలా అపార్థాలకు లోనైంది.

ఎపిక్యురస్ క్రీస్తుపూర్వం 341లో సేమాస్ అనే గ్రీకు ద్వీపంలో జన్మించాడు. ఏథెన్సులో తన 35 వ ఏట తన గృహం వెలుపల "ది గార్డెన్ ఆఫ్ ఎపిక్యురస్" అని ప్రసిద్ధికెక్కిన ఒక విశాలోద్యానవనంలో విద్యాలయం స్థాపించాడు. అక్కడ 36 ఏళ్లపాటు నివసించి 270 లో కాలధర్మం చెందాడు. అతని తత్వబోధలు క్రైస్తవ మతం బాగా ప్రచారంలోకి వచ్చేవరకు— సుమారు ఆరు వందల ఏళ్లపాటు— ఎందరినో ఆకర్షించాయి.

## లుక్రీషియస్ మహాకావ్యం

గ్రీకు తత్వవేత్తలందరివలె ఎపిక్యురస్ కూడా బహు గ్రంథకర్త. సుమారు 300 పుస్తకాలు వ్రాశాడట. కాని, ఏవో కొన్ని లేఖలు, కొన్ని గ్రంథ శకలాలు తప్ప మరేవీ మిగలలేదు. అతని తాత్విక సిద్ధాంతాలు మనకు క్రీస్తుపూర్వం ఒకటవ శతాబ్దానికి చెందిన రోమన్ మహాకవి లుక్రీషియస్ లాటిన్‌లో వ్రాసిన "ఆన్ నేచర్" అనే కావ్యం ద్వారానే లభ్యమౌతున్నాయి. కేవల తత్వచింతనను అంత సుందరోజ్వలమైన మహా కావ్యంలో పొందుపరచిన లుక్రీషియస్‌కు చరిత్రకారులు నేటికి కూడా జోహార్లు అర్పిస్తున్నారు మరొక లాటిన్ మహాకవి వర్జిల్ వంటివాడు లుక్రీషియస్ కవిత్వాన్ని అనుకరించాడని చెబుతారు. ఏకాకిగా, అజ్ఞాతంగా జీవించాడని, అప్పుడప్పుడు అతనికి పిచ్చి ఎత్తేదని, చివరకు నలభై ఏళ్లయినా నిండకుండా ఆత్మహత్య చేసుకున్నాడని లుక్రీషియస్ గురించి కథలు ప్రచారంలో వున్నాయి.

ఇక ఎపిక్యురస్ ఉపదేశాలను చూద్దాము. ఎపక్యూరియనిజమ్‌కు దురర్థం రావడానికి ఒక కారణం లేకపోలేదు. అరిస్టిప్పస్ వలె ఇతడు కూడా సౌఖ్యమే జీవిత లక్ష్యమని బోధించాడు. అతని విద్యాలయంలో ఎక్కడెక్కడినుంచో వచ్చిన యువతీ యువకులు విద్యార్థులుగా చేరేవారు. వారిలో బానిసలు, వేశ్యలు సయితం వుండేవారు. అతని విద్యాలయం ఒక వ్యభిచార గృహమని ఏథెన్సు పౌరులు నిందలు వేసేవారు. కాని, అది నిజం కాదు. అతని విద్యార్థులు గొప్ప క్రమశిక్షణతో అతి కఠోర జీవితం గడిపేవారట.

## సృష్టిలో తీయనిది స్నేహం

వ్యక్తిగా ఎపిక్యురస్ మహోన్నతుడు. దయాశీలి, స్నేహశీలి. "సృష్టిలో తీయనిది స్నేహమేనోయీ!" అనే సూక్తి అతని జీవితసూత్రం.

జీవిత లక్ష్యం సుఖ సంపాదన. బ్రతుకును సుఖమయం చేసుకోవాలి. అయితే, అట్టి సుఖం ఎలా లభిస్తుంది?

సుఖానికి ఎపిక్యురస్ ఇచ్చిన నిర్వచనం చిత్రమైనది. సుఖం అనేది ప్రత్యేకంగా వుండదు. దుఃఖ రాహిత్యమే సుఖం. కోర్కెలు లేకపోవడమే సుఖం. మనః ప్రశాంతి, మనో నిశ్చలత, మనో నిగ్రహం— ఇవే సుఖం.

సుఖంకోసం ప్రయత్నించడంలో సుఖం లేదు. సుఖంకోసం అన్వేషించక పోవడంలోనే సుఖం వున్నది.

ఒక్కొక్కసారి అనుభవించక తప్పని బాధను అనుభవించితే, ఆ బాధ ఉపశమించినప్పుడు సుఖం కలుగుతుంది. నిశ్చలంగా బాధను అనుభవించడమే మంచిది.

## సుఖం = జీర్ణశక్తి

ఎపిక్యురస్ అజీర్ణరోగి. అందువల్లనే బహుశా అతని దృష్టి ఎప్పుడూ తన ఉదర కోశం మీదనే వుండేది. చక్కని జీర్ణశక్తివల్ల సుఖం లభిస్తుందని అనేవాడు. అతిగా భుజించడంవల్ల అజీర్ణం, అనారోగ్యం తప్పవు. అలాగే అతిగా సుఖాలు అనుభవించడంవల్ల బాధలు కలుగుతాయి. కనుక సుఖాల తీవ్రతను అపేక్షించరా దనేవాడు. ఇంద్రియానుభవా లన్నిటిలోను ఒక మితిని పాటించా లనేవాడు.

ఉదాహరణకు, అతని భోజనం రొట్టె, నీళ్లు మాత్రమే. ఎప్పుడయినా సరదా కలిగితే జున్ను అరగించేవాడు; కొద్దిగా ద్రాక్షసారా రుచి చూసేవాడు. ఇంతకు మించి భోజనాన్ని - తనకే కాదు, తన గురుకులవాసు లందరికీ కఠినంగా నిషిద్ధం చేశాడు.

తీవ్రసుఖం తర్వాత తీవ్రబాధ తప్పదు. ఆ రెండింటిని పరిహరించాలి. సుఖం అనుభవిస్తున్నామని తెలియకుండా సుఖం అనుభవించాలి. ఇందుకు మానసిక సంయమనం అలవరచుకోవాలి. బాధ అనివార్యమైతే ధైర్యంగా దాన్ని అనుభవించాలి.

రాజకీయ జీవితాన్ని, ఆస్తి సంపాదన, కీర్తి ప్రతిష్ఠలు, సంఘ గౌరవం మొదలయిన వాటిని అతడు నిరసించాడు. జనసమ్మర్దానికి దూరంగా సన్యాసి వలె ప్రశాంత జీవితం గడపాలన్నాడు.

## మత వ్యతిరేకత

మనిషికి శాంతిలేకుండా చేసేది బాహ్య ప్రపంచం, భౌతికజీవితమే కాదు; మూఢ విశ్వాసాలు, మూఢ భయాలుకూడా. వాటిని వర్జించాలి.

మరణ భయం మరీ చెడ్డది. అలాగే అలౌకిక శక్తుల భయం కూడా. వాటిని విసర్జించాలి.

మరణానంతరం ఏ నరకలోకానికి వెడతామో, అక్కడ ఏ బాధలు అనుభవిస్తామో అనే భయం తగదు. ఎందుకంటే మరణం తర్వాత ఆత్మ అనేది వుండదు. దేహంతోపాటే ఆత్మ నశిస్తుంది. మనిషి చనిపోయాక ఏమీ మిగలదు. మరణం శాశ్వత నిద్రతో సమానం.ఏమీ తెలియదు. ఏ అనుభూతీ తగలదు. అయినప్పుడు మరణానికి ఎందుకు భయపడాలి? జీవితం ఎంత సహజమో, మరణం అంత సహజం. "జాతస్యహి ధ్రువో మృత్యుః"– సరిహద్దులు లేని శాంతిలోకానికి సింహద్వారంవంటిది మరణం. ఆ ద్వారం ద్వారా మనకు ముందు కోటానకోట్ల మానవులు పయనించారు. మన తర్వాత మరికొన్ని కోటాన కోట్లమంది పయనిస్తారు. మరణం అంటే ప్రాణ దీప నిర్వాణం; అది ప్రాతః ప్రసక్తిలేని ఒకే దీర్ఘయామిని. మరి మరణానికి మానవుడు ఎందుకు భయపడాలి?

అలాగే అదృశ్య, అలౌకిక శక్తుల భయంకూడా అనవసరం. ఇలాంటి భయాల వల్ల మానవునికి మనశ్శాంతి లేకుండా పోతుంది. సుఖం మృగ్య మవుతుంది.

## దైవభీతి తగదు

దేవతలు లేకపోలేదు. కాని, వారి వల్ల మనకు ఎట్టి భయం లేదు. వారు మన జోలికి రారు. ఎక్కడో ఏ నక్షత్రాల మధ్య స్వర్గలోకాలలోనో వారి దోవన వారు వుంటారు. వారు మనకు ఉపకారంగాని, అపకారంగాని చేయజాలరు. మన గురించి పట్టించుకోరు. మన ప్రార్థనలు, స్తోత్రాలు వారిని కదిలించవు. వారికి మనతో పని లేనప్పుడు వారితో మనకేం పని? మనం చేసే ప్రతిపనీ ఎవరో అదృశ్యంగా వుండి చూస్తున్నారని, శిక్షిస్తారని భయం పెట్టుకోరాదు. మన సుఖమే మన లక్ష్యం.

ఎపిక్యురస్ ఈ విధమైన నైతిక సిద్ధాంతం చేయడానికి తోడ్పడినట్టిది అతని భౌతికవాదం. ఇందులో అతడు ఇంతకుముందు మనం చదివిన డెమొక్రిటస్ అణువాదాన్ని కొద్ది తేడాతో అనుసరించాడు.

దైవభీతీ, మృత్యుభీతి లేకుండా ప్రపంచంలో సుఖంగా జీవించాలంటే ముందుగా ప్రపంచమంటే ఏమిటో, జీవితమంటే ఏమిటో తెలుసుకోవాలి.

## విశ్వకారణం అణువులు

ఈ సమస్త విశ్వం అణునిర్మితం, అణువుల కలయికవల్ల వస్తువులు, వస్తువుల కలయికవల్ల విశ్వం ఏర్పడుతున్నాయి.

డెమొక్రిటస్ అణువులకు వేర్వేరు ఆకృతులను, వేర్వేరు పరిమాణాలను ఊహించాడు.కాని, వాటికి వేర్వేరు బరువులు కూడా వున్నాయి. పైగా డెమొక్రిటస్ చెప్పినట్టు అణువులు చెల్లా చెదురుగా చలిస్తూ, పరస్పరం ఢీకొట్టుకొనడం వల్ల కాదు ఏకం అయ్యేది.

అరిస్టాటిల్ చెప్పినట్టు బరువైన వస్తువులు వేగంగాను, తేలిక వస్తువులు నెమ్మది గాను కింద పడతాయి. అలాగే బరువైన అణువులు వేగంగాను, తేలిక అణువులు నెమ్మదిగాను శూన్యాంతరాళంలో పైనుంచి క్రిందికి సూటిగా పడిపోతూ వుంటాయి. అయితే, గాలికి పండుటాకులు అటు నిటు చెదిరిపోయినట్టు మధ్యలో అణువులు వాటంతట అవే ప్రక్కలకు చలిస్తాయి. అలా చలించడంలో ఒకదాని నొకటి ఢీ కొట్టుకొని, అతుక్కొని, వివిధ వస్తువులుగా ఏర్పడతాయి. నక్షత్రాలు, గ్రహాలు, సూర్యుడు, భూమి, చంద్రుడు అలా ఏర్పడినట్టివే.

## స్వయంభువాలు

అణువులను ఎవరు సృష్టించారు? వాటంతట అవే అనాదిగా వున్నాయి. అవి స్వయంభువాలు.

అణువులు ఎందుకు కిందికి పడిపోతాయి? పక్కలకు ఎందుకు చలిస్తాయి? వాటి చలనం స్వతస్సిద్ధం. అది వాటి సహజ స్వభావం. బహుశా వాటికి యథేచ్ఛ (free will) వున్నది.

అణువులు ఎందుకు ఏకమవుతాయి? అదీ స్వతస్సిద్ధమే. వాటిని ఏకం చేసే అదృశ్యశక్తి ఏదీ లేదు. ఆఖరికి దేవతలు కూడా మనుషులవలె అణు సంయోగజనితులే.

కేవలం అణువుల సంయోగంతో ఇంత అందమైన ప్రపంచం, చెట్లు, పువ్వులు, పచ్చిక, పక్షులు, జంతువులు, మానవులు ఏర్పడడం ఎలా జరిగింది?

## డార్వినిజం

భూమి మొదటగా ఒక మట్టి ముద్దగా వుండేది. దానిపై పచ్చిక, పొదలు, చెట్లు— వంటిపై రోమాలు మొలిచినట్లుగా— మొలిచాయి. పక్షులు, జంతువులు రూపొందాయి. మొదట ఎన్నో వికృతాకారాలు జన్మించాయి. వాటిలో పరిసరాలకు అనుగుణంగా లేనివి నశించాయి. అనువైన ఆకృతులు కలిగినవే

వృద్ధి పొందాయి. కొన్ని జంతువులు కళ్లు, చెవులు, కాళ్లు మొదలైన అవయవాలను పెంపొందించుకున్నాయి. అర్హత కలిగినవే బ్రతికి బట్టకట్టాయి. ప్రకృతి ఎన్నో తప్పులు చేసి, సరిదిద్దుకున్నది. ఈ విషయంలో ఎపిక్యురస్ డార్విన్ పరిణామ వాదానికి (natural selection)చాలా దగ్గరగా వచ్చాడు.

పరిణామక్రమంలో ఆఖరున మానవుడు పుట్టాడు. మొదట నగ్నంగా, మృగంవలె, అనాగరికంగా బ్రతికాడు. కందమూలాలు తిని ఆరుబయట జీవించేవాడు. నెమ్మదిగా గుహా నివాసం నేర్చుకున్నాడు. గుంపులుగా బ్రతకడం నేర్చాడు. సామూహిక జీవనంవల్ల మాట్లాడే శక్తి సంపాదించుకున్నాడు. స్నేహం, ప్రేమ, దయ అలవరచుకున్నాడు. ఆత్మ రక్షణకు లోహాలతో ఆయుధాలు, పనిముట్లు తయారు చేసుకున్నాడు.

క్రమంగా వర్తక వ్యాపారాలు, వ్యవసాయం, నౌకాయానం నేర్చాడు. ఇళ్లు నిర్మించు కున్నాడు. కవిత్వం, సంగీతం, నృత్యం, రాజకీయాలు, యుద్ధవిద్య-ఈవిధంగా మానవ నాగరికత వృద్ధి పొందింది.

## చార్వాకవాదం

మృత్యువులో జీవితం పర్యవసిస్తుంది. దేహంవలె ఆత్మకూడా అణునిర్మితమే. దేహం విచ్ఛిన్నం కాగానే ఆత్మకూడా విచ్ఛిత్తి పొందుతుంది. ఇక ఆ తర్వాత ఏమీ మిగలదు. దేహానికి వెలుపల భావాలు, అనుభవాలు, జ్ఞాపకాలు, జీవితం ఏమీ వుండవు.

తర్వాతి శతాబ్దాలలో యూరోపియన్ తత్వచింతనలో భౌతికవాదం ఒక శాఖగా వృద్ధి పొందింది. దానికి ఆద్యులలో డెమొక్రిటస్ తర్వాత పేర్కొనదగిన ముఖ్యుడు ఎపిక్యురస్.

ఇతని అణు భౌతికవాదం మనదేశంలో చార్వాకులుగా ప్రసిద్ధిపొందిన లోకాయత వాదులను జ్ఞప్తికి తెస్తుంది. ధూర్త చార్వాకులు, సుశిక్షిత చార్వాకులు అని రెండు శాఖల వారున్నారు. మొదటివారు ఆత్మను అంగీకరించరు. రెండవ శాఖవారు ఆత్మ వున్నదంటారు. కాని, అది దేహంతోనే నశిస్తుందని వాదిస్తారు.

గ్రీకు తత్వవేత్తలనుంచి సెలవు తీసుకోబోయేముందు వచ్చే అధ్యాయంలో స్థిత ప్రజ్ఞులనదగిన స్టొయిక్ తాత్వికుల ఉత్తేజకర జీవిత గాథలు తెలుసుకుందాము.

# 15

# స్థితప్రజ్ఞులైన స్టాయిక్ తాత్వికులు

అనగనగా ఒక గ్రీకు బాలుడు. చిన్నతనంలోనే ఒక రోమన్ ప్రభుత్వాధికారికి బానిసగా పట్టుబడ్డాడు. యజమాని అతడిని నిర్దయగా హింసిస్తూ వినోదించేవాడు.

ఒకనాడు ఎందుకో కోపంవచ్చి యజమాని ఆ బానిస కుర్రవాడి కాలు మెలిపెట్ట సాగాడు. బాలుని ముఖకవళిక మారలేదు. మనస్సు నిర్వికారంగా వుంది. అలాగే బాధను ఓర్చుకుంటూ "అయ్యా! అలా మెలితిప్పుతూపోతే నా కాలు విరుగుతుంది" అన్నాడు.

యజమాని ఆ మాటలు లక్ష్యపెట్టలేదు. ఇంకా మెలితిప్పుతూనే వున్నాడు. కొంతసేపటికి కాలు ఫటక్‌మని విరిగింది. బానిసబాలుని ముఖకవళిక మారలేదు. మనస్సు నిర్వికారంగానే వుంది. అలాగే బాధను ఓర్చుకుంటూ "అయ్యా! అలా మెలితిప్పుతూ పోతే నా కాలు విరుగుతుందని ఇందాకే చెప్పలేదా?" అన్నాడు.

ఆ బాలుడు తర్వాత కొంతకాలానికి బానిసతనంనుంచి విముక్తి పొందాడు. విద్యాభ్యాసం చేసి పండితు డయ్యాడు. ఎందరికో గురువై విద్యాదానం చేశాడు. కాని, జీవితాంతం కుంటివాడుగానే మిగిలిపోయాడు. అతడే గ్రీకు తత్వ

శాస్త్రంలో స్టాయిసిజం" అనే శాఖకు సాటిలేని గౌరవం సంపాదించిపెట్టిన మహాజ్ఞాని ఎపిక్టెటస్.

ఈ తత్వశాఖకు చెందినవారిలో ప్రముఖు లనేకున్నారు. వారిలో కొందరు గ్రీకులు, కొందరు రోమన్‌లు, మరికొందరు సిరియన్‌లు. వారి తాత్విక భావాలలో చాలా విభేదా లున్నాయి. కాని, అందరూ నైతిక వర్తనకు అగ్రప్రాధాన్య మిచ్చారు. కొన్నివందల ఏళ్లపాటు వారి తత్వచింతన ప్రజా జీవితాన్ని ప్రభావితం చేసింది. తొలి రోజులలో క్రైస్తవమతం కూడా గ్రీకుల స్టాయిసిజం ప్రభావానికి లోనైంది.

నిజానికి స్టాయిసిజం అనేది ఒక తత్వశాస్త్రం కాదు. స్టాయిక్ దార్శనికులు పారభౌతిక (మెటఫిజికల్) తత్వచింతనకు పెద్దగా ప్రాధాన్య మివ్వనేలేదు. స్టాయిసిజం ఒక జీవిత విధానం. ఒక జీవిత దృక్పథం.

## స్థితప్రజ్ఞుడు ఎవరు?

భగవద్గీతలో స్థితప్రజ్ఞుని ప్రస్తావన వస్తుంది. "స్థిత ప్రజ్ఞస్య కాభాషా..." అని అర్జునుడు కృష్ణుడిని ప్రశ్నించాడు. "సుఖ దుఃఖే సమేకృత్వా లాభాలాభౌ జయా జయౌ..." ఇత్యాదిగా అన్నాడు శ్రీకృష్ణుడు. సుఖదుఃఖాలను, లాభనష్టాలను, జయాపజయాలను సమానంగా పరిగణించేవాడు స్థితప్రజ్ఞుడు. "దుఃఖేష్వనుద్విగ్నమనా స్సుఖేషు విగత స్పృహః వీతరాగ భయక్రోధః స్థితధీర్మని రుచ్యతే" అని కూడా శ్రీకృష్ణుడు నిర్వచించాడు. అంటే "దుఃఖంలో అనుద్విగ్నంగాను, సుఖంపట్ల అనాసక్తంగాను వుండి రాగభయక్రోధాలను విడిచిపెట్టినవాడు స్థితప్రజ్ఞుడు."

గ్రీకు స్టాయిక్‌లు సరిగా అటువంటి స్థిత ప్రజ్ఞులు. నీతి బోధ చేయడం వేరు. ఆచరించడంవేరు. గ్రీకు స్టాయిక్‌లు తాము చెప్పింది చేసేవారు; చేసిందే చెప్పేవారు.

స్టాయిక్‌లు క్రిందటి అధ్యాయంలో మనం చదివిన సినిక్‌లకు, సిరినైక్‌లకు తరువాతివారు. ఎపిక్యూరియన్‌లకు సమకాలికులు. ముఖ్యంగా సినిక్‌ల ప్రభావం వీరిపై ఎంతో వుంది.

## మొదటి స్టాయిక్ జీనో

స్టాయిసిజం మూలపురుషుడు జీనో. ఇతడు వేరు, ఇంతకుముందు పార్మినిడీస్ శిష్యుడుగా, డయలెక్టిక్స్ మూలపురుషుడుగా మనకు పరిచితుడయిన జీనో

పేరు. ఈ జీనో సైప్రస్‌లో సిటియమ్ అనేచోట క్రీస్తుపూర్వం 350 లో జన్మించాడు. తండ్రి వర్తకుడు. ఏథెన్సుకు 320 లో వలస వెళ్లాడు. ప్లేటోనిక్ అకాడెమీలో జెనోక్రటీస్ వద్ద ఎపిక్యురస్‌వలె ఇతడు కూడా శుశ్రూష చేశాడు. ఆ పిదప అదే నగరంలో "స్టోవా పాయ్‌కిలే" అనేచోట సొంతంగా తత్వవిద్యాలయం స్థాపించాడు. ఆ స్థలం పేరునుబట్టి అతని తత్వశాఖకు "స్టాయిసిజమ్" అనే పేరు వచ్చింది. మహోన్నత వ్యక్తిగా జీనోకు ఏథెన్సులోను, అనాటి గ్రీకు రాజ్యాలలోను గొప్ప పేరు వచ్చింది. ఒకసారి అతనికి ఏదో తీవ్రగాయం తగిలింది. అవసానదశ వచ్చిందని తలచి క్రీస్తుపూర్వం 258 లో ఆత్మహత్య చేసుకొని మరణించాడు.

ఎపిక్యురస్ సౌఖ్యమే జీవిత లక్ష్యమని, బాధానివారణే సౌఖ్యమని నిర్వచించాడు. జీనో తత్వం ఇందుకు పూర్తిగా భిన్నం. సుఖాలు, దుఃఖాలు బాహ్య ప్రపంచానికి సంబంధించినవి; బాహ్య ప్రపంచ పరిస్థితులపై ఆధారపడినవి. అవి మనం కావాలంటే రావు. పోవాలంటే పోవు. వాటంతట అవి వస్తాయి, పోతాయి. వాటితో మనకు నిమిత్తంలేదు. మన మనస్సు మన స్వాధీనంలో వుండాలి. మన మనస్సును స్వేచ్ఛగా వుంచుకోవాలి. మన సహనశక్తిని పెంపొందించుకోవాలి.

## అనాసక్తయోగం

తామరాకుపై నీటిబొట్టులాగా అంటీ అంటనట్టు ఈ ప్రపంచంలో మనిషి జీవించాలి. ఇదొక యోగసాధనం (గీత చెప్పినట్టు) "యోగస్థ కురు కర్మాణి..." యోగంలో వుండి కర్మలు చెయ్యాలి. కర్మ కోసమే కర్మ, ఫలితం కోసం కాదు. నీతి కోసమే నీతి, నీతి ఫలితం నీతి మాత్రమే. జీవితాన్ని ఎదుర్కొనే పద్ధతి ఇదే! ప్రయత్నపూర్వకంగా దీన్ని సాధించాలి. ప్రేమ, అనురాగం, భయం, ద్వేషం అన్నిటినీ అణచివేయాలి. మన మానసిక వికారాలను మనం జయించాలి.

ఉద్రేకరహితంగా, అనాసక్తంగా ఏదైనా చేయవచ్చు. చెడు అనేది మనం చేసే పనిలోలేదు. మన మనస్సులో వుంది. మంచి ఫలితాలిచ్చే పనినైనా అనాసక్తితో చేయకపోతే అది చెడు పనే అవుతుంది. నిర్మోహత్వం, నిస్సంగత్వం- ఇవే ముఖ్యం.

## సెనేకా

ఈ విధంగా బోధించాడు జీనో. అతని తర్వాత ఎన్నదగిన స్టాయిక్ తత్వ

వేత్త సెనేకా. ఇతడు క్రీస్తుపూర్వం 4 లో జన్మించాడు. క్రీస్తుశకం 65 లో చనిపోయాడు. అప్పటికి గ్రీకు నాగరికత పతనమైపోయింది. రోమన్ సామ్రాజ్యంలో గ్రీసు ఒక అంతర్భాగమైంది. గ్రీకు విద్యాధికులు, తత్వవేత్తలు రోమ్ నగరానికి జీవనోపాధి కోసం వెళ్లేవారు. తమ విభిన్న తత్వశాఖలను తమతో తీసుకుపోయేవారు. ఆనాటి క్రూర, కఠోర జీవిత పరిస్థితులలో అన్నిటిలోకి స్టాయిసిజం ప్రజాబాహుళ్యాన్ని ఆకర్షించింది. అయితే ఉన్నతవర్గాలలో కూడా దానికి అనుయాయులు బయలుదేరారు.



అటువంటి స్టాయిక్ తత్వవేత్తలలో సెనేకా ఒకడు. దక్షిణ స్పెయిన్‌లో జన్మించి రోమ్‌లో నిహో విద్యాభ్యాసం చేసి అక్కడే స్థిరపడ్డాడు. వర్తకం చేసి కోటీశ్వరు డయ్యాడు. మంచి రచయిత. గ్రీకు మహా కవుల సంప్రదాయంలో లాటిన్ భాషలో గొప్ప విషాదాంత నాటకాలు వ్రాశాడు. మంచి రాజనీతివేత్త. రోమన్ చక్రవర్తికి సన్నిహితు డయ్యాడు. యువరాజు నీరోకు గురువై, తర్వాత మంత్రి అయ్యాడు. కొన్నాళ్లు తానే సామ్రాజ్యాధినేత అన్నట్టు పరిపాలన చేశాడు. నీరో క్రౌర్యం చరిత్రలో ప్రసిద్ధి కెక్కింది. సెనేకా నీతి బోధలు అతనికి రుచించలేదు. రాజద్రోహం నేరం మోపి అతడు ఆత్మహత్య చేసుకునేటట్టు చేశాడు.

సెనేకా ధనాఢ్యుడు, రాజనీతివేత్త అయినా, ప్రధానంగా తాత్వికుడు, అందులోనూ స్టాయిక్ తత్వవేత్త. కఠిన నియమబద్ధమైన జీవితం గడిపాడు. మానవ దౌర్బల్యాలను, క్రౌర్యాన్ని నిరసించాడు. ప్రపంచం దుర్మార్గమైనదని, దానినుంచి విముక్తి కలిగించేది మృత్యువేనని బోధించాడు. ఇతని "మోరల్ లెటర్స్" (నీతిలేఖలు) సుప్రసిద్ధమైనవి.

## ఒకడు బానిస, ఒకడు చక్రవర్తి

"స్టాయిసిజం" ఆ రోజులలో సమాజంలో ఎంతగా పరివ్యాప్తమైందో తెలుసుకోవాలంటే ఇరువురు విభిన్న వ్యక్తులను చూస్తే చాలు ఒకడు బానిస ఎపిక్టెటస్, మరొకడు రోమన్ చక్రవర్తి మార్కస్ అరీలియస్.

ఎపిక్టెటస్ చిన్నతనంలోనే వికలాంగుడైన ఉదంతాన్ని ఈ అధ్యాయం ప్రారం

ఛంలో తెలుసుకున్నాము. అతడు ఆసియా మైనర్‌లోని ఫ్రిజియాలో హీరాపొలిస్ అనేచోట క్రీస్తుశకం 50 వ సంవత్సరంలో జన్మించాడు. రోమన్ దండయాత్రలలో ఒక ప్రభుత్వాధికారికి బానిసగా పట్టుబడి రోమ్ నగరానికి వచ్చాడు. క్రమంగా విద్యాధికుడయ్యాడు. చివరికి స్వేచ్ఛ పొందాడు. క్రీస్తుపూర్వం 90 లో రోమన్ చక్రవర్తి డొమీషన్ అతడిని రోమ్ నుంచి బహిష్కరించగా నికొపొలిస్ నగరానికి వెళ్లి స్థిరపడ్డాడు. అక్కడ ఒక విద్యాలయం స్థాపించి, క్రీస్తుశకం 120 లో చనిపోయేవరకు నివసించాడు.

ఎపిక్యురస్ తత్వబోధకు, ఎపిక్టెటస్‌కు చుక్కెదురు. ఎపిక్యూరియన్‌ల సుఖలాలసని ఇతడు ఖండించాడు. స్టాయిక్ తత్వవేత్తలపై భారతీయుల కర్మవాద ప్రభావం వున్నట్టు కనిపిస్తుంది. ఏది ఎలా జరగాలో అలా జరుగుతుంది. జరిగేది జరగక మానదు. దేవుడు ఎవడిని ఎలా పుట్టిస్తే వాడు అలా బ్రతకాలి. జీవితం మనకు ఏది అనుగ్రహిస్తే దాన్ని సంతోషంగా, ధైర్యంగా స్వీకరించాలి. మనకు అలవికాని దానికోసం అర్రులు చాపరాదు.

## నిర్లిప్తత ముఖ్యం

మన బుద్ధిబలం, సంకల్పబలం, స్వేచ్ఛాబలం— ఇవి దేవుడు మనకిచ్చిన వరాలు. వాటిని మననుంచి ఎవరూ అపహరించలేరు. ఏ బాహ్య పరిస్థితులు వాటిని చెనకలేవు. ఒకడు నిన్ను ప్రవాసానికి పంపవచ్చు. కాని, నీవు ప్రవాసానికి సంతోషంగా వెళ్లకుండా ఎవడూ ఆపలేడు. ఒకడు నీకు మరణశిక్ష విధిస్తే మృత్యువును ధైర్యంగా ఎదుర్కొనకుండా ఎవడూ అడ్డగించలేడు. ఒకడు నిన్ను బంధిస్తే, సంకెళ్లు నీ శరీరాన్ని బంధించగలవే కాని, నీ మనస్సును కాదు. నీ మానసిక శాంతి, స్వేచ్ఛ, ధైర్యం, ఇవి పూర్తిగా నీ సొంతం.

చక్రవర్తి నీరో కాలంలో పాలకుల క్రౌర్యంనుంచి, చిత్రహింసల నుంచి, అవినీతినుంచి తమను తాము కాపాడుకొనడానికి బహుశా ఈ స్టాయిక్ దృక్పథం ప్రజలకు తోడ్పడి వుంటుంది. దీనిప్రభావం తొలి రోజులలో క్రైస్తవ మతానుయాయులపై కూడా వుండేది. రోమన్ పాలకులు వందలాది క్రైస్తవులను వినోదార్థం క్రూరమృగాలకు బలిచేసేవారు. బాధాసహిష్ణుతను వారికి స్టాయిక్ దృక్పథమే నేర్పింది.

అయితే, ఈ దృక్పథం ఎపిక్టెటస్ వంటి బానిసలను, లేదా నికృష్ట జీవితంలో మగ్గుతున్న సాధారణ ప్రజలను మాత్రమే ఆకర్షించిన దనడానికి వీలు లేదు. అగర్భ శ్రీమంతుడైన మార్కస్ అరీలియస్ స్టాయిక్ తత్వవేత్తలలో ప్రముఖుడన్న విషయం గమనించదగింది.

## అ రీ లి య న్

అరీలియన్ క్రీస్తుశకం 121 లో జన్మించాడు. తండ్రి రోమ్ నగరం ప్రధాన న్యాయాధికారి; చక్రవర్తికి దగ్గర బంధువు. అరీలియన్ తన 11వ యేట స్టాయిక్



విజయవంతంగా యుద్ధం ముగించుకుని రోమ్ నగరంలో ప్రవేశిస్తున్న చక్రవర్తి మార్కస్ అరీలియస్ (రోమ్‌లోని ప్రాచీన శిల్పం.)

తత్వవేత్త రస్టికస్‌వద్ద విద్యాభ్యాసం చేశాడు. చక్రవర్తి టైటస్ అంటోనినస్ పైయస్ మగసంతు లేక ఇతడిని దత్తపుత్రుడుగా స్వీకరించాడు. ఇతడి 18వ

ఏట "సీజర్"గా, రోమన్ మహా సామ్రాజ్యానికి భావి వారసుడుగా ప్రకటించాడు. భావి సమ్రాట్టుకు అవసరమైన సమస్త విద్యలు నేర్పించాడు. తన కుమార్తె ఫాస్టినాను ఇచ్చి వివాహం చేశాడు.

మార్కస్ అరీలియస్ చిన్ననాటినుంచి అదోకరకం మనిషి. ఎప్పుడూ గంభీరంగా, నిరంతర పఠనంలో, ఆలోచనలో మునిగివుండేవాడు. ఏకాంతాన్ని కోరుకునేవాడు. రాజోచిత జీవిత విధానాన్ని, భోగ భాగ్యాలను, అట్టహాసాన్ని తృణీకరించాడు. స్టాయిక్, సినిక్ తత్వవేత్తల బోధనలను జీర్ణించుకున్నాడు. వారివలె నిరాడంబరంగా, నిర్లిప్తంగా జీవించాలన్నది అతని ఆశయం. వారి వలె ముతకదుస్తులు ధరించేవాడు. సాధారణ భోజనం ఆరగించేవాడు. పరుపులు లేని వట్టి మంచంపై శయనించేవాడు.

ఇదంతా అతని వ్యక్తిగత, ఏకాంత జీవితం. పైకిమాత్రం అందరివలెనే ప్రవర్తించే వాడు. గుర్రపుస్వారీ, కత్తిసాము నేర్వడంతోపాటు రాజనీతి పారంగతుడయ్యాడు. కొలువుకూటంలోగాని, సైనిక శిబిరంలోగాని అతని ప్రవర్తనను చూసి అతని మనస్సులో రేగుతున్న నైతిక సంఘర్షణను ఎవరూ కనిపెట్టలేకపోయారు.

## సామ్రాజ్య భారం

స్టాయిక్‌వలె, యోగివలె జీవించా లనుకున్నవాడు రాజ ప్రాసాదంలో జీవించవలసి వచ్చింది. క్రీస్తుశకం 161 లో టైటస్ ఆంటోనినస్ మృతితో మార్కస్ అరీలియస్ చక్రవర్తి అయ్యాడు. తనతోపాటు టైటస్ పెంచుకున్న లూషియస్ వేరస్‌కు రాజ్య వ్యవహారాలు అప్పగించి తాను తన తాత్విక జీవితాన్ని కొనసాగించా లనుకున్నాడు. కొన్నాళ్లు అలాగే జరిగిందిగాని, వేరస్ అకాలమరణంతో మొత్తం సామ్రాజ్య నిర్వహణభారం అరీలియస్‌పైనే పడింది.

సామ్రాజ్య భారంతోపాటు కష్టాల పరంపర కూడా అరీలియస్‌ను వెదుక్కుంటూ వచ్చింది. ఫాస్టినావల్ల అతనికి పదముగ్గురు సంతానం కలగగా, వారిలో ఎనిమిదిమంది మరణించారు. మరొకవైపు సామ్రాజ్యంలో ఎక్కడ చూసినా తిరుగుబాట్లు, లేదా ఆటవికజాతుల దాడులు, దీనికితోడు అతి ఘోరమైన ప్లేగు వ్యాధి వ్యాపించి రోమ్ నగరంలోను, సామ్రాజ్యంలోని ఇతర భూభాగాలలోను అపార జననష్టం కలిగింది. ఆనాడు మూడవ వంతు ప్రజలు ప్లేగువాత పడ్డారని చరిత్రకారుల అంచనా.

పంధొమ్మిదేళ్ల రాజ్యపాలనలో అతడు యుద్ధాలో, మరొకవిధమైన కష్టాలో

ఎదుర్కొనని రోజు లేదు. కాని ధైర్యంగా, నిశ్చలంగా, నిర్వికారంగా వాటిని ఎదుర్కొన్నాడు. అందుకు అతని స్టొయిక్ దృక్పథం తోడ్పడింది.

## రణభూమిలో రచనావ్యాసంగం

మొదటగా సిరియాలో పార్థియన్‌లు తిరుగుబాటు చేశారు. వారిని అణచివేశాడు. తర్వాత ఉత్తరాన రైన్ - డాన్యూబ్ నదుల సరిహద్దుల అవలినుంచి బర్బర జాతులవారు సామ్రాజ్యంపై దాడులుచేసి వేధించసాగారు. అరీలియన్ స్వయంగా సైన్యాధ్యక్షత వహించి రణరంగానికి వెళ్లాడు. పగలు యుద్ధ తంత్రం, రాత్రిళ్లు తన శిబిరంలో, నూనె ప్రమిద గుడ్డివెలుగులో ఏకాంతంగా కూర్చుని దూరంనుంచి నక్కల ఊళలు, క్షతగాత్రుల మూలుగులు లీలగా వినిపిస్తుండగా తాత్వికాలోచనల రచన చేశాడు. కొన్ని సంవత్సరాలపాటు ఇదే అతని నిత్యజీవితం.

ప్లేటో తన "రిపబ్లిక్"లో రాజ్యపాలనకు అర్హులు తాత్వికులేనని ఉద్ఘాటించాడు. అతని ఉద్ఘాటనకు సజీవ రూపంగా మార్కస్ అరీలియస్ భాసించాడు. రాజర్షిగా ప్రపంచ చరిత్రలో ప్రసిద్ధికెక్కాడు. దీనికి నిదర్శనం అతడు రణరంగం మధ్య దినదినం "మెడిటేషన్సు" పేరుతో వ్రాసిన తాత్విక గ్రంథం.

నీవు చేసే ప్రతి చిన్నపని, నీ ప్రతిమాట, ప్రతి ఆలోచన ఈ జీవితం నుంచి ఏ క్షణంలోనైనా నిష్క్రమించడానికి నీవు సంసిద్ధుడవై వున్నావన్న విషయాన్ని వ్యక్తం చేయాలి.

తోటి మనిషికి అన్యాయం తలపెట్టడం దైవానికి ద్రోహం చేయడమే.

దయను జయించగలిగింది ప్రపంచంలో లేదు.

నిర్లిప్తత ఒక్కటే ఆదర్శ మానసిక స్థితి.

ప్రకృతిలో స్వతస్సిద్ధంగా కొన్ని నియమాలు వున్నాయి. వాటిని అనుసరించి జీవించాలి. వివేకాన్ని, హేతుబద్ధమైన ఆలోచనను పెంపొందించుకోవాలి. కష్టాలను ధైర్యంగా ఎదుర్కోవాలి. ధర్మాన్ని ఎట్టి పరిస్థితిలోను విడువరాదు.

ఏది మంచి, ఏది చెడు అని వివేచించి ఏ పనినయినా చేయాలి. ఉద్రేకాలకు లోనుకారాదు. సుఖాలను ఆశించరాదు.

మానవుడు అనుసరించ దగింది ఒకటే మార్గం. అది ఆశాపరిత్యాగం. నిరాశను జయించాలంటే ఆశను త్యజించడమే మార్గం. ఎంత సంతోషస్థితిలోనైనా నిర్లిప్తతను కోల్పోరాదు; మనః ప్రశాంతిని వీడరాదు.

మానవుడు ఎంత మూర్ఖుడు ! ఈ ప్రపంచంలో తానొక రేణువు. అయినా, ఏదో ఘనతకోసం అర్రులు చాస్తాడు. "కారే రాజులు, రాజ్యముల్ గెలువరే, గర్వోన్నతిం బొందరే... ..." అన్నట్టు ఎంతటి సార్వభౌముడైనా మట్టిలో మాయంకాక తప్పదు. సామ్రాజ్యాల ఘనత, ఔన్నత్యం భావి పరిశోధకులు భూగర్భంనుంచి తవ్వి తీసే రాళ్లు, రప్పలు, శిథిలాలుగా పర్యవసిస్తాయి...

## ఆలోచన, ఆచరణ

ఈ ధోరణిలో ఆలోచిస్తూ పోయిన మార్కస్ అరీలియస్ దానికి అనుగుణంగా తన జీవితాన్ని తీర్చిదిద్దుకోవడంలో విఫలుడయ్యాడు. తనకు అనివార్యంగా సంక్రమించిన సామ్రాజ్య రక్షణ భారాన్ని వహించక తప్పలేదు.

అతడు మనస్ఫూర్తిగా విశ్వసించిన సేనాని ఎవీడియస్ కాసియస్ సిరియాలో తిరుగుబాటుకు కుట్ర చేశాడు. చక్రవర్తి ఆ వార్త విన్నాడుగాని, దాన్ని వదంతిగా త్రోసిపుచ్చాడు. కాసియస్ రోమన్ సామ్రాజ్యం పైనేకాక, సామ్రాజ్ఞి ఫాస్టినా పైనకూడా కన్ను వేశాడు. ఆ వార్తకూడా అరీలియస్ నమ్మలేదు.

చివరికి చక్రవర్తి యుద్ధభూమిలో చనిపోయాడని, తానే చక్రవర్తి కానున్నానని క్లాసియస్ ప్రచారం చేశాడు. అప్పుడు విధిలేక అరీలియస్ ఆ తిరుగుబాటును అణచివేయడానికి బయలుదేరాడు. తిరుగుబాటు నూరు రోజులు మాత్రమే జరిగింది.

కాసియస్‌కు క్షమాభిక్ష పెట్టడానికి అవకాశం కలుగుతుందో, లేదోనని విచారపడుతున్న అరీసియస్‌కు నిజంగానే అట్టి అవకాశం రాలేదు. కాసియస్‌ను అతని అనుచరులలో ఒకడు హత్య చేశాడు. అతని కుటుంబానికి, తక్కిన అనుచరులకూ చక్రవర్తి క్షమాభిక్ష పెట్టాడు. రాణి ఫాస్టినాను వెంటబెట్టుకుని తనపై తిరుగుబాటు చేసిన నగరాలన్నిటికి క్షమా సందేశం వినిపించడానికి అరీలియస్ బయలుదేరాడు. మార్గమధ్యంలో ఒకచోట ఫాస్టినా వ్యాధిగ్రస్తురాలై మరణించింది. ఆమె కూడా బహుశా అతనికి ద్రోహం తలపెట్టి వుండవచ్చునన్న వదంతి రాకపోలేదు. కాని, ఆమె మరణానికి అతడు ఎంతో దుఃఖించాడు. క్రుంగిపోయాడు. ఆమెకొక స్మృతిచిహ్నం కట్టించి ఆమె స్వర్ణప్రతిమను ప్రతిష్ఠించాడు.

## రా జ ర్షి

తిరిగి బర్బరులపై దండయాత్రకు బయలుదేరాడు. ఎలాగైతేనేం క్రీస్తుశకం 179 లో మొత్తం అన్ని తిరుగుబాట్లను, దాడులను అణచివేసి సామ్రాజ్యాన్ని

సురక్షితం చేశాడు కాని, మరొక ఏడాదిలో రుజాగ్రస్తుడై వియన్నావద్ద మరణిం చాడు. రాజర్షిగా పాశ్చాత్య చరిత్రలో అతని పేరు, అతని తాత్విక బోధలు చిరస్థాయిగా నిలిచిపోయాయి. అతని విజయ చిహ్నం నేటికీ రోమ్‌లో వుంది.

స్టాయిక్ తాత్వికులకు సమకాలికులైన వారిలో ముఖ్యులుగా పేర్కొనదగిన వారు. స్కెప్టిక్స్. స్కెప్టిసిజమ్ అంటే సంశయవాదం. దీనికి ఆద్యుడు ఫిరో (క్రీస్తుపూర్వం 360-270) మరొక ముఖ్యుడు సెక్‌స్టస్ ఎంపిరికస్ (క్రీస్తుశకం 300 ప్రాంతం). సోఫిస్టులవలె వీరుగూడా ఏ విషయం గురించి మానవునికి నిర్దిష్టజ్ఞానం అలభ్యమని, సత్యం దుర్లభమని భావించారు. ఈ అనిశ్చిత స్థితిలో మానవునికి నైతిక బాధ్యతలు ఎలా నిర్ణయించడమని వీరి ప్రశ్న.

## ప్లో టి న స్

మరొక ముఖ్యమైన తత్వశాఖ నియో ప్లేటోనిజం. దీనికి కర్త అమోని యస్ సకాస్ (క్రీసుశకం 175 -242). అతని శిష్యుడు ప్లోటినస్ (క్రీస్తుశకం 204-269). ఏథెన్సులో ఒక విద్యాలయం స్థాపించి చరిత్ర ప్రసిద్ధికెక్కాడు. ఇతడు ప్లేటో, అరిస్టాటిల్, నియో పితగోరియనిజం, స్టాయిసిజం మొదలైన వాటిని సమన్వయం చేయడానికి ప్రయత్నించాడు. క్రైస్తవ వ్యతిరేకి.

ఈశ్వరుని గురించిన జ్ఞానం మానవునికి అలభ్యమని ఇతని వాదం. అయితే, ఈశ్వరుడిని నిర్వచించాలంటే "ఏకత్వం" అనిమాత్రం చెప్పగలమని, ఈశ్వరుడు కానిది లేదని ప్లోటినస్ భావించాడు. ఒక్కమాటలో చెప్పాలంటే "ఏకమేవా ద్వితీయమ్" అన్నది ఇతని సిద్ధాంతం.

బైజంటైన్ చక్రవర్తి జస్టీనియన్ క్రీస్తుశకం 529 లో ఏథెన్సులోని ప్లేటో నిక్ అకాడమీని, ఇతర విద్యాలయాలను మూసివేయించాడు. దానితో సుమారు వెయ్యేళ్ల ఉజ్వల చరిత్రగల గ్రీకు తాత్విక చింతనకు భరతవాక్యం పలికినట్లయింది. ఆ తర్వాత యూరప్‌లో అంధయుగపు చీకట్లు వ్యాపించాయి.

# 16
# మధ్యయుగాలనుంచి నవీన యుగానికి

తొలి రోజులలో రోమన్ చక్రవర్తులు క్రైస్తవ మతం తమ సామ్రాజ్యసమైక్యానికి ప్రబల శత్రువుగా పరిణమించినదన్న కారణాన దాన్ని అణచివేయడానికి అతి క్రూర పద్ధతులు అవలంబించారు. క్రైస్తవులకు అమానుషమైన శిక్షలు విధించేవారు.

నీరోవంటి రోమన్ చక్రవర్తుల విషయం చెప్పనక్కరలేదు. కాని, స్టాయిక్ తత్వవేత్తగా, రోమన్ చక్రవర్తులలో ఉత్తమోత్తముడుగా, ఆదర్శవాదిగా పేరొందిన మార్కస్ అరీలియస్ సయితం అంతరాంతరాలలో ఇష్టంలేకపోయినా, ఆనాటి పరిస్థితులనుబట్టి క్రైస్తవ మతావలంబులను రోమన్ దమననీతికి గురిచేయడం జరిగింది.

అయినా, క్రైస్తవ మతం క్రమంగా విశేషవ్యాప్తి చెందింది- ప్రజల మనస్సులను అమితంగా ఆకర్షించింది. చివరికి థియొడోసియస్ ది గ్రేట్ (346-395) అనే రోమన్ చక్రవర్తి క్రైస్తవమతాన్ని స్వీకరించాడు. దాన్ని రాజమతంగా ప్రకటించాడు. ఆ తర్వాత వచ్చిన వారందరు ఆ మతాన్ని అంగీకరించి,

అవలంబించి, పోషించారు. రాజ పోషణలో, ప్రజాసామాన్యం సమర్పించే విరాళాలతో, క్రైస్తవమతం బలపడింది. ఆ మతానికి కేంద్రంగా చర్చి అధికారం, చర్చి అధికారానికి కేంద్రంగా పోప్ పదవి బలపడ్డాయి.

పదమూడవ శతాబ్దినాటికి యూరప్‌లో మూడవవంతు పోప్ అధీనంలో వుండేదట. పోప్ మాట బైబిల్ వాక్యమైంది. పోప్ ఎలా శాసిస్తే అలాగ చక్రవర్తులు సయితం నడుచుకునేవారు. "యథా రాజా తథా ప్రజా" కనుక ప్రజలు సయితం పోప్ ఆధిపత్యాన్ని శిరసావహించేవారు. మొదటి రోమన్ సామ్రాజ్యం క్రీస్తుశకం 410 లో అంతమైంది. రెండవది 1453 లో కాన్‌స్టాన్‌టినోపుల్ తురుష్కుల కైవసం కావడంతో అంతరించింది. ఆ మధ్యలో సుమారు వెయ్యేళ్ల పాటు మతాధికారుల ప్రాబల్యం క్రింద క్రైస్తవ ప్రపంచంలో వైజ్ఞానిక స్తబ్దత ఏర్పడింది.

తత్వశాస్త్ర జ్యోతి మిణుకు మిణుకు మని వెలుగివ్వక పోలేదు. కాని, తత్వశాస్త్ర చింతన థియాలజీ, స్కాలాస్టిసిజం రూపాలలో మాత్రమే కొనసాగింది. ఈ కాలంలో సుప్రసిద్ధులైన క్రైస్తవ తత్వవేత్త లందరిని ఇక్కడ పరామర్శించడం సాధ్యంకాదు. కొద్దిమందిని మాత్రం క్లుప్తంగా పేర్కొని నవీన యుగానికి సాగిపోదాము.

## అ గ స్టి య న్

మొదటగా పేర్కొనదగిన తాత్వికుడు సెంట్ అగస్టయిన్ (క్రీస్తుశకం 354-430). ఇతడు మతానికి, తత్వశాస్త్రానికి సంబంధం లేదన్నాడు. ఒకటి విశ్వాసంపై ఆధారపడితే, మరొకటి తర్క వివేచనపై ఆధారపడినట్టిది. ఈ రెండింటిని సమన్వయం చేయడానికి అతడు ప్రయత్నించాడు. విశ్వాసాన్ని సుస్థిరం చేసుకొనడానికిగాను ప్రపంచతత్వాన్ని అవగాహన చేసుకోవాలి. కాని, ప్రపంచతత్వం అవగాహన కావాలంటే దృఢమైన విశ్వాసం కావాలి. ఇదీ అతని ఉపదేశం.

సెంట్ యాన్‌సెల్మ్ : ఇటలీలో 1033 లో జన్మించి ఇంగ్లండులో కాంటర్బరీ ఆర్చిబిషప్‌గా పనిచేసి 1109 లో కాలధర్మం చెందాడు. ఇతడుకూడా హేతువాదాన్ని, విశ్వాసవాదాన్ని సమ్మిళితం చేయడానికి యత్నించాడు.

"విశ్వాసం (faith) కలగడానికి అవగాహన (understanding) కోసం ప్రయత్నించవద్దు. అవగాహన కలగడానికే విశ్వాసాన్ని పెంపొందించుకోవాలి. విశ్వాసం వుంటే తప్ప పరతత్వం అవగాహన కాదు. ముందు విశ్వసించు, తర్వాత విశ్వాసానికి కారణాలు అన్వేషించు"- ఇది అతని వాదం.

దేవుని ఉనికిని హేతుబద్ధంగా నిరూపించడానికి ఇతడు ప్రయత్నించాడు. అతడి వాదాన్ని అంటలాజికల్ ఆర్గ్యుమెంట్ (Ontological argument) అంటారు. ఆంటాలజీ అంటే అస్తిత్వానికి, సత్యానికి సంబంధించిన శాస్త్రం.

మనకు అనేకంగా, అసంఖ్యాకంగా ఆలోచనలువస్తూ వుంటాయి. అన్ని ఆలోచనలలోకి మహోత్కృష్టమైనది ఏది? దేవుడు అనే భావం. దేవుడు అంటే నిర్వచనం ఏమిటి? మనం ఊహించగలిగిన సమస్త సద్గుణాలయొక్క రాశి. అంటే దయ, ప్రేమ, క్షమ, స్నేహం, శక్తి, శౌర్యం— ఇలా మన మనస్సుకుతోచిన ఏ సద్గుణమైనా తీసుకోండి. ఆ సద్గుణంయొక్క సర్వోత్కృష్ట రూపమే దేవుడు. అటువంటి అనేక సద్గుణాల, సల్లక్షణాల రాశీభూత భావమే దైవం. మరి అన్ని సద్గుణాల, సల్లక్షణాల జాబితాలో అస్తిత్వం అనేదికూడా ఒకటై వుండాలికదా? ఉనికి (existence) లేకుండా ఆ జాబితా ఎలా పూర్తి అవుతుంది? దేవుడిని అనేక సర్వోత్కృష్టతల (perfections) పుంజీభావంగా నిర్వచిస్తూ ఆ సర్వోత్కృష్టతలలో దైవంయొక్క అస్తిత్వాన్ని, అంటే ఆయన ఉనికిని చేర్చకుండా ఎలా వుంటాము? అందుచేత దేవునికి తప్పకుండా ఉనికి వుండే వుండాలి. కనుక దేవుడు వున్నాడని ఈ వాదంద్వారా రుజువైంది.

అయితే, సెంట్ అన్‌సెల్మ్ ప్రతిపాదించిన ఈ "అంటలాజికల్ ఆర్గ్యుమెంట్"ను సెంట్ థామస్‌తో సహా క్రైస్తవ తత్వవేత్తలందరు తిరస్కరించారు. అంటే దేవుడు లేడనికాదు. దేవుడున్నా డనడానికి అన్‌సెల్మ్ చూపించిన కారణం బలంగా లేదని, సమర్థించదగినదిగా లేదని వారు అభిప్రాయపడ్డారు.

కాని, నవీనయుగ తత్వవేత్తలు కొందరు సెంట్ అన్‌సెల్మ్ వాదాన్ని బలపరిచారు. దేకార్త్, లైబ్నిజ్ వంటివారు కొన్ని మార్పు, చేర్పులతో ఆంటలాజికల్ ఆర్గ్యుమెంట్‌ను ఒప్పుకున్నారు.

## ఆబిలార్డ్

పీటర్ ఆబిలార్డ్ (1079-1142) :- ఫ్రెంచి తత్వవేత్త, కవి. ఈయన సిద్ధాంతం ప్రకారం సృష్టించాలనే కోర్కెవల్ల ఈశ్వరుడు ప్రపంచాన్ని సృష్టించలేదు. సృష్టికార్యం ఈశ్వర స్వభావంలోనే వుంది. సృష్టించడంతప్ప అతనికి మరొక విధి లేదు. అతడు "శివ" స్వరూపుడు. కనుక అతని సృష్టి కూడా "శివ" (goodness) స్వరూపం. ఉత్తముడు విధిగా ఉత్తమ కార్యమే చేస్తాడు. దేవుడు సర్వోత్తముడు కనుక ఈ ప్రపంచం కూడా వున్నంతలో ఉత్తమమైనట్టిది. (This is the best of all possible worlds.)

# రోజర్ బేకన్



రోజర్ బేకన్ :- (ఇంగ్లండు 1214-1294) ఇతడు ఆక్స్‌ఫర్డ్ విశ్వ విద్యాలయంలో విద్యార్థి. ఆ విహో తర్వాత ఆచార్యుడు. స్వయంగా క్రైస్తవ సన్యాసి అయివుండి కూడా వైజ్ఞానిక దృక్పథం కల వాడు. ఆధునిక విజ్ఞానశాస్త్ర బీజాలు ఇతని చింతనలో మొదటిసారిగా ప్రత్యక్ష మవు తాయి. తనకాలపు మూఢ విశ్వాసాలను నిశితంగా,నిర్భయంగా ఖండించాడు. ఈ రోజులలో సయితం అధిక సంఖ్యాకులు అవలంబించిన ఏదైనా ఒక విశ్వాసాన్ని మూఢ విశ్వాసంగా భావించినవారు దాన్ని ఖండించడం కష్టమవుతున్నది. అలాంటిది మధ్య యుగాల క్రైస్తవ ప్రపంచంలో అతడు ఆ విధంగా ఖండించడాన్ని ఎంతో సాహసకార్యంగా పరిగణించాలి.

రోజర్ బేకన్ గురించి హెచ్. జి. వెల్స్ తన "ప్రపంచ చరిత్ర"లో వ్రాస్తూ, "మధ్యయుగాల కారుచీకటిలో కాంతికిరణం"గా అభివర్ణించాడు. అప్పటిలో అరి స్టాటిల్ చెప్పినదే వేదం. అరిస్టాటిల్ గ్రంథాలు అరబిక్ నుంచి లాటిన్‌లోకి తప్పుల తడకలుగా అనూదితాలైనాయి. వాటినైనా సరిగా అర్థం చేసుకోకుండా పూజించేవారు. దీన్ని రోజర్ బేకన్ సహించలేకపోయాడు. తనకు అధికార మిస్తే మొత్తం అరిస్టాటిల్ గ్రంథాలను తగలబెడతా నన్నాడు. అవి అజ్ఞానానికి ప్రతీక లన్నాడు.

ఎంత గొప్పవాడైనాసరే ఏదైనా చెబితే గుడ్డిగా నమ్మవద్దు. అది నిజమో, కాదో స్వయంగా ప్రయోగం (experiment) ద్వారా తెలుసుకోవాలి. "ఎక్స్‌పె రిమెంట్! ఎక్స్‌పెరిమెంట్!" అన్నది అతని ఏకైక నివాదం.

"తెడ్లు లేకుండా నడిచే యంత్ర నౌకలు తయారుచేయడం సాధ్యం. పశు వులు లాగే బండ్లుకాక, యంత్ర శకటాలు- (కార్లు)- నిర్మించడం సాధ్యం. కృత్రిమంగా రెక్కలు నిర్మించి మధ్యలో మనిషి కూర్చుని పక్షులవలె ఆకాశ యానం చేయడం కూడా సాధ్యం" అని 13వ శతాబ్దిలో రోజర్ బేకన్ భావి యుగాలను గురించి ఊహిస్తూ వ్రాశాడు. తన వైజ్ఞానిక విశ్వాసాల కారణంగా

అతడు మతాధికారుల ఆగ్రహానికి లోనై 14 ఏళ్లపాటు ఏకాంత కారాగార శిక్ష అనుభవించాడు. విడుదల అయిన ఏడాదికి మరణించాడు.

## సెంట్ థామస్ ఏక్వినాస్

థామస్ ఏక్వినాస్ 1225 లో నేపుల్స్‌లో ఒక సామంత కుటుంబంలో జన్మించాడు. మధ్యయుగంలోని క్రైస్తవ తత్వవేత్తలందరిలోకి అసాధారణ ప్రజ్ఞా శాలిగా ఇతడిని చరిత్రకారులు కీర్తించారు. ఆదర్శప్రాయమైన ధార్మిక జీవనం గడిపి అందరికి ప్రేమపాత్రుడయ్యాడు. అరిస్టాటిల్‌కు ఇతడు భాష్యకారుడు. ప్రపంచాన్ని దైవ సృష్టిగా పరిగణించాడు. కాని, ఆ విషయాన్ని హేతువాదం ద్వారా నిరూపించడం సాధ్యం కాదన్నాడు. దైవసన్నిధి చేరడం మానవ జీవిత పరమావధి. ఇందుకు ఆధ్యాత్మిక జీవనమే మార్గమని ఉద్బోధించాడు.

## లూథర్ మత సంస్కరణ

క్రమక్రమంగా మధ్య యుగం అంతరించి నవీన యుగంలో విలీనమైంది. పోప్ అధికారంపై మార్టిన్ లూథర్ (1483-1546) తిరుగుబాటు చేశాడు. అతడు ప్రొటెస్టాంటిజమ్ పేరుతో ప్రారంభించిన క్రైస్తవ మత సంస్కరణ యూరప్ చరిత్రలో ఒక పెద్ద మలుపునకు కారణమైంది. మతాధికారులనే కాదు, మత విశ్వాసాలను ప్రశ్నించడం కూడా ప్రారంభమైంది.

సంపద వృద్ధి అయింది. కాగితం తయారీ పరిశ్రమ ప్రారంభమైంది. జర్మనీలో గూటెన్‌బర్గ్ (1398 -1468) అచ్చు యంత్రాన్ని తయారుచేశాడు. అప్పటి వరకు కొన్ని వర్గాలకే లభ్యమైన గ్రంథాలు విరివిగా అచ్చుపడి ప్రజా సామాన్యానికి విస్తరించాయి. కొలంబస్ 1492 లో అమెరికా ఖండాన్ని, వాస్కోడగామా 1498 లో ఇండియాకు సముద్ర మార్గాన్ని కనుగొన్నారు. భూమి గుండ్రంగా వున్నదనే విషయం నిరూపించడానికి పోర్చుగీసు నావికుడు మేజిలాన్ 1519 లో పశ్చిమ దిశగా బయలుదేరాడు. అతడు మార్గ మధ్యంలో మరణించినా, అతని నౌకలలో ఒకటి తూర్పు దిశనుంచి బయలుదేరిన చోటికే (స్పెయిన్) వచ్చింది.

విశ్వకేంద్రం భూమి కాదని, సూర్యుడని సహేతుకంగా వివరిస్తూ కోపర్నికస్ 1530 లో ఉద్గ్రంథం రచించాడు. అతని సిద్ధాంతాలను కెప్లర్, గలీలియో బలపరిచారు. అజరామరమైన చిత్రకళ సృష్టించిన లియొనార్డో డా విన్చీ (1452-1519) జీవశాస్త్రం, శరీరశాస్త్రం, హైడ్రోడైనమిక్స్, ఎరోనాటిక్స్ మొదలైన సైన్సులలో విశేషమైన కృషి చేశాడు. వెసాలియస్ (1514-1561)

మానవ శరీరాన్ని పరిశోధించి ఎన్నో అపూర్వ విశేషాలు కనుగొనగా, విలియం హార్వే (1578-1657) శరీరంలో రక్త ప్రసరణాన్ని కనుగొన్నాడు. షేక్స్పి యర్ (1564-1616) తన అద్భుత విషాదాంత నాటకాలతో ఒక వినూత్న సాహిత్య సీమను ఆవిష్కరించాడు.

## ఎరాస్మస్

ఈ విధంగా నవీనయుగం ప్రారంభమైంది. నవీన భావ ప్రపంచం ఆవిష్కృతమైంది. వివిధ విజ్ఞానశాస్త్రాలు తమ జైత్రయాత్ర ప్రారంభించాయి. మానవుని బాహ్యజగత్తు, అంతర జగత్తు కూడా విస్తరించాయి. ఈ విస్తరణ ప్రభావం తత్వచింతనపై కూడా ప్రసరించింది. డచ్చి తాత్వికుడు డెసిడీరియస్ ఎరాస్మస్ (1466-1536) అధునిక మానవతావాదానికి (Humanism) అంకురార్పణ చేశాడు.

## బ్రూనో

ఇటలీలో నేపుల్స్ సమీపంలో జన్మించిన గియర్డానో బ్రూనో (1548-1600) చిరస్మరణీయుడైన మహోన్నత వ్యక్తి. నియోప్లేటోనిజమ్, నియో అరిస్టాటిలియనిజమ్‌లను జీర్ణించుకుని క్రైస్తవ సన్యాసిగా జీవితం ప్రారంభించి, చివరికి కాథలిక్, ప్రొటెస్టెంట్ మతశాఖలను రెండింటినీ నిర్భయంగా నిరసించిన బ్రూనో కోపర్నికస్ ఖగోళ సిద్ధాంతాలను తన నూత్నమతంగా స్వీకరించాడు. ధాదాపుగా అధునిక నాస్తిక వాదానికి అచార్యుడైనాడు. ఫ్రాన్సు, ఇంగ్లండు, జర్మనీ, స్విట్జర్లెండులలో ప్రవాస జీవితం గడుపుతూ, స్వదేశం నుంచి వచ్చిన ఆహ్వానాన్ని నమ్మి అమాయకంగా 1593 లో వెనిస్‌నగరానికి వెళ్లాడు. చర్చి న్యాయస్థానం (Inquisition) అతడిని ఏడేళ్లు కారాగారంలో బంధించింది. చివరికి అతడిని నిర్దయగా సజీవ దహనం చేసింది. తమ విశ్వాసాలకు ప్రాణాలను తృణప్రాయాలుగా పరిత్యజించిన చారిత్రక మహాపురుషులలో ఒకడుగా బ్రూనో వినుతిపొందాడు.

ఈ మహా మహులు ప్రారంభించిన నవీన యుగం సంధి దశలో నూతన తత్వ శాస్త్రాన్ని, నూతన దోహదక్రియతో పల్లవింపజేసిన తాత్వికుడు సర్ ఫ్రాన్సిస్ బేకన్ (1561-1626).



# 17
# ఆధునిక యుగవైతాళికుడు బేకన్

తత్వవేత్తలలో రకరకాలవా రున్నారు. కొందరు సోక్రటీస్‌వలె నైతిక వాదులు, కొందరు డెమొక్రిటస్‌వలె భౌతికవాదులు. ప్లేటో, అరిస్టాటిల్‌వలె కొందరు పార భౌతికవేత్తలు. హాబ్స్‌వలె కొందరు రాజకీయ దార్శనికులు. మార్క్స్‌వలె కొందరు ఆర్థిక తత్వవేత్తలు. సెంట్ అగస్టయిన్‌వలె కొందరు దైవ తత్వవేత్తలు.

సర్ ఫ్రాన్సిస్ బేకన్ వైజ్ఞానిక తత్వవేత్త– సైంటిఫిక్ ఫిలాసఫర్. ఈ కారణాన అతడు ఆధునిక యుగ వైతాళికుడు.

యూరప్‌లో ఆ ధు ని క యుగం బేకన్‌కు ముందే ప్రారంభమైంది. ఆ యుగం అవతరణకు కారకులైనవారిలో ముఖ్యులైన కొపర్నికస్, కెప్లర్ వంటి విజ్ఞాన వేత్తలను, కొలంబస్ వంటి ప్రపంచ యాత్రికులను గురించి క్రిందటి అధ్యాయంలో ప్రస్తావించాము.

వీరి తర్వాతి వాడే అయినా, ఫ్రాన్సిస్ బేకన్ అధునిక యుగధర్మానికి

ఒక తాత్విక రూపాన్ని సంతరించినవాడు. ఒక నిర్వచనాన్ని సమకూర్చినవాడు. ఆధునిక దృక్పథానికి అతడు ప్రతినిధి.

ఆధునిక దృక్పథం అంటే ఏమిటని ప్రశ్న. దాన్ని వైజ్ఞానిక దృక్పథం (Scientific outlook) గా పేర్కొనాలి.

## ఏది ఆధునిక దృక్పథం?

మన పూర్వులు- వారు ఎంత మేధావులైనా, మత ప్రవక్తలైనా- ఏదో చెప్పారని యథాతథంగా అంగీకరించడం వైజ్ఞానిక దృక్పథానికి విరుద్ధం. ఎవరేది చెప్పినా వినాలి. కాని, దాన్ని హేతువాదదృష్టి నుంచే కాక, వాస్తవిక, వైజ్ఞానిక దృష్టినుంచి పరిశీలించాలి. ప్రతి విషయానికి వాస్తవమైన రుజువులను ప్రయోగరీత్యా కనుగొనడానికి ప్రయత్నించాలి. బుద్ధిద్వారా, తర్కంద్వారా, వివేచనద్వారా ఒక విషయాన్ని కనుగొనవచ్చు. కాని, దానికి వాస్తవ ప్రపంచంలో రుజువులు దొరుకుతాయో లేదో అన్వేషించాలి. ఒకటికి పదిసార్లు, ఒకరికి పదిమంది మరల మరల ప్రయోగాలు, పరిశోధనలు చేయాలి. అప్పుడు సత్యాన్ని ఆవిష్కరించాలి. తాము మొదట అనుకున్నది రుజువు కాకపోతే మొహమాటం లేకుండా దాన్ని పరిత్యజించాలి. అదీ వైజ్ఞానిక దృక్పథం.

ఇది అప్పటికి 1500 ఏళ్లుగా పాశ్చాత్యలోకంలో రాజ్యం చేస్తున్న అరిస్టాటిల్ "డిడక్టివ్ లాజిక్" పద్ధతికి భిన్నమైనది. అరిస్టాటిల్ పద్ధతి ప్రకారం కొన్ని సార్వత్రిక సత్యాలుంటాయి. వాటినుంచి ప్రత్యేక సత్యాలు వెలువడతాయి.

ఇందుకు వ్యతిరేకమైనది "ఇండక్టివ్ లాజిక్" పద్ధతి. అనేక ప్రత్యేక విషయాలను సేకరించాలి. ఆ సమాచారాన్ని వర్గీకరించాలి. ఒక క్రమ పద్ధతిలో పునర్వర్గీకరించాలి. వాటినుంచి సార్వజనీన సత్యాలను రాబట్టాలి. ఇది బేకన్ ప్రతిపాదించిన 'ఇండక్టివ్ పద్ధతి'.

## బేకన్ బాల్యం

అది ఇంగ్లండు చరిత్రలో స్వర్ణయుగంగా భాసించిన ఎలిజిబెత్‌రాణి పరిపాలనా కాలం. లండన్‌లో 1561 లో ఫ్రాన్సిస్ బేకన్ ఒక సంపన్న కుటుంబంలో జన్మించాడు. తండ్రి నికొలాస్ బేకన్ రాజముద్రికా రక్షకుడు (కీపర్ ఆఫ్ ది గ్రేట్ సీల్). రాజకీయవేత్త. తల్లి లేడీ యాన్ కుక్ లాటిన్, గ్రీకు భాషలలో విద్వాంసురాలు. తత్వవేత్తి.

తల్లిదండ్రుల "జీన్స్" కలయిక ప్రభావంవల్ల కావచ్చు- ఫ్రాన్సిస్‌లో సగం

రాజకీయవేత్త లక్షణాలు, సగం తత్వవేత్త లక్షణాలు వున్నాయి కాని— తీర్థానికి తీర్థం, ప్రసాదానికి ప్రసాదం అన్నట్టు— వేటికి అవిగా ప్రత్యక్షమైనాయి.

తల్లి తన కుమారునికి పన్నెండవ ఏటివరకు తానే చదువు చెప్పింది. తర్వాత కేంబ్రిడ్జి యూనివర్శిటీలోని ట్రినిటీ కాలేజీలో చేరాడు. మూడేళ్లు చదివాడు. ఆ మూడేళ్లలోను అరిస్టాటిల్‌తో తగాదా పెట్టుకున్నాడు. అంటే— "అరిస్టాటిల్ ఇలా అన్నాడు. అరిస్టాటిల్ అలా అన్నాడు"అని— అస్తమానం అరిస్టాటిల్ పేరు జపించే ప్రొఫెసర్లతో పేచీకి దిగేవాడు. అరిస్టాటిల్ పేరు చెబితే అరికాలిమంట నెత్తికెక్కేది. నిండా పదహారేళ్లయినా వున్నాయోలేదో ఫ్రాన్సిస్ బేకన్ "ఏమిటండీ అరిస్టాటిల్ గొప్ప? ప్రకృతిని ప్రయోగరీత్యా పరిశీలించకుండా తప్పుడు సిద్ధాంతాలకు వచ్చాడు!" అని ధిక్కరించేవాడు. అరిస్టాటిల్ నుంచి ప్రపంచాన్ని విముక్తం చేయడం తన జీవిత లక్ష్యంగా పెట్టుకున్నాడు.

ఇది ఫ్రాన్సిస్ బేకన్ వ్యక్తిత్వంలో ఒక భాగం. ఇక రెండవభాగం— అతని తండ్రి అతని 18వ ఏట చనిపోతూ ఒక చిన్న గృహం, ఏడాదికి 300 పౌనుల ఆదాయపు వనరు మాత్రం మిగిల్చిపోయాడు.

## బేకన్ స్వభావం

అది ఫ్రాన్సిస్ బేకన్‌కు పేదరికంతో సమానం. అతడు ఖర్చుదారు, దర్జా మనిషి, విలాస పురుషుడు. గడ్డితిని అయినా డబ్బు గడించడం తన మరొక జీవితలక్ష్యంగా పెట్టుకున్నాడు. (ఇది కూడా ఆధునిక యుగ లక్షణమేనని ఎవరయినా అంటే దాన్ని వెంటనే కాదనడం కష్టం. నిజమే. అన్ని యుగాలవలె ఆధునిక యుగం కూడా మంచి చెడుల సమ్మిశ్రమం.)

ఫ్రాన్సిస్ సమీప బంధువు (అంకుల్) సర్ విలియం సెసిల్ రాణి ఎలిజబెత్‌కు ప్రధానమంత్రి. రాణీగారి కొలువులో ఏదైనా ఉద్యోగ మిప్పించమని ఫ్రాన్సిస్ వేడుకున్నాడు. సర్ విలియం సరే ననలేదు, సహాయం చేయలేదు.

తర్వాత "గ్రేస్ ఇన్"లో లా చదివాడు. న్యాయవాది పట్టా (1579లో) పుచ్చుకున్నాడు. గంభీర కంఠం, మంచి వాదపటిమ కలవాడు. పార్లమెంటుకు (1583లో) పోటీచేసి గెలిచాడు.

జీవనోపాధికోసం కేంబ్రిడ్జి పోయి పాఠాలు చెప్పకుందామా అనిపించింది. కాని, దృష్టి అంతా ధన సంపాదనపైన, రాజకీయ కీర్తి ప్రతిష్ఠలపైన, పలుకుబడిపైన లగ్నమై వుంది.

## పదవీ వ్యామోహం

ఎలిజబెత్ కొలువులో దూరాలని పన్నెండేళ్లు తపస్సు చేసినంత పనిచేశాడు. తహతహలాడిపోయాడు. సర్ విలియంకు ప్రత్యర్థి, ఎలిజబెత్‌కు అనేక విధాలుగా సన్నిహితుడు అయిన ఎసెక్స్ ప్రభువును ఆశ్రయించాడు. ఎసెక్స్ అతడిని అభిమానించాడు. ఇతడు ఎప్పుడూ అప్పులలో పడి మునిగి తేలుతూ, అప్పుడ ప్పుడు కారాగారం వరకు వెడుతూ వుండేవాడు. అన్నిసార్లూ ఎసెక్స్ అతడిని ఆదుకున్నాడు. ఒక ఎస్టేట్ రాసి ఇచ్చాడు కూడా. ఎలిజబెత్‌వద్ద తనకుగల చనువునుబట్టి బేకన్‌కు మంచి పదవి ఇప్పించాలని శతవిధాల ప్రయత్నించాడు. కాని, రాణి కటాక్షవీక్షణం బేకన్‌పై పడలేదు. దగ్గిరికి రానివ్వలేదు. ఎలిజబె త్‌ను పొగడుతూ రచనలు చేశాడు, ప్రసంగాలు చేశాడు. అయినా ఫలితం పూజ్యం.

ఇంతలో ఎలిజబెత్‌కు, ఎసెక్స్‌కు చెడింది. ఇదే అదను అని ఎసెక్స్ ప్రత్య ర్థులు అతనిపై కత్తికట్టారు. అతడిపై నేరాలు మోపి ఖయిదు చేయించారు. బేకన్ కూడా ప్లేటు ఫిరాయించాడు. ప్రాణ స్నేహితుడైన ఎసెక్స్‌కు వ్యతిరే కంగా ప్రాసిక్యూషన్ తరఫున సాక్ష్యమిచ్చాడు. ప్రాసిక్యూషన్ వారు ఏవేవో అభియోగాలు తేగా, ఇతడు సరాసరి రాణి ద్రోహ నేరం మోపాడు. తనకు ఎసెక్స్ గుట్టుమట్టులన్నీ కరతలామలకాలని, రాణిని హత్య చేసి సింహాసనం వశపరచుకొనాలని కుట్ర చేశాడని అనర్గళ వాగ్ధాటితో వాదించాడు. ఎసెక్స్‌కు శిరశ్ఛేదం జరిగింది.

బేకన్ నీచప్రవర్తనకు, మిత్రఘాతుకానికి యావత్తు ఇంగ్లండు ముక్కున వేలేసుకున్నది. అతడిని అసహ్యించుకున్నది. కాని, "నీవు అనుసరించే మార్గం ఏమిటన్నది ప్రశ్న కాదు, నీ లక్ష్యం ఏమిటన్నది ముఖ్యం"– ఇదీ బేకన్ సూత్రం. సుఖంగా బ్రతకడానికి ఏ అడ్డదారి తొక్కినా పరవాలేదనేది అతని నమ్మకం.

"బేకన్‌ను పోలిన విజ్ఞాని, ప్రతిభాశాలి, నీచుడు మానవజాతిలో లేడు" అని ప్రఖ్యాత ఆంగ్ల కవి అలెగ్జాండర్ పోప్ ఊరికే అనలేదు.

## ప్లేటు మార్పు

ఎలిజబెత్ రాణి 1603 లో చనిపోయింది. ఆ తర్వాత స్కాట్లండుకు చెందిన మొదటి జేమ్సు ఇంగ్లండు సింహాసనం అధిష్ఠించాడు. బేకన్ ప్లేటు మార్చి కోటు తిరగేశాడు. జేమ్సును పొగడుతూ ఉత్తరాలు గుప్పించాడు. రాజు

చేసే ప్రతి పనిని పార్లమెంటులో సమర్థించేవాడు. రాజ న్యాయవాది (అటార్నీ జనరల్) పదవిపైనే అతని దృష్టి. రాజు ఆ పదవి ప్రసాదించలేదుగాని, సర్ బిరుదాన్ని కటాక్షించాడు.

చివరికి అతని పొగడ్తల బాధ పడలేక రాజు బేకన్‌ను సొలిసిటర్ జనరల్‌గా (1607లో) నియమించాడు. ఆ పిదప 1613లో అటార్నీ జనరల్ అయ్యాడు. పొగడ్తల నిచ్చెన ఎక్కి ఇంకా పైపైకి పోయాడు. లార్డ్ కీపర్‌గా 1617లో నియమితుడయ్యాడు. ఎట్టకేలకు 1618లో లార్డ్ ఛాన్సలర్ పదవి లభించింది. బ్యారన్ వేరులమ్, వైకౌంట్ సెంట్ అల్బన్స్ బిరుదాలు కూడా అతడిని వరించాయి. భోగభాగ్యాలకు, రాజకీయాధికారానికి లోటు లేదు.

కాని, నిచ్చెన ఒక్కసారిగా నేలకూలింది. అతడి నీచప్రవృత్తే పతనానికి కారణమైంది. మూడేళ్లు తిరకుండానే-- లార్డ్ ఛాన్సలర్‌గా రెండు చేతులా లంచాలు దోచుకున్నాడని ఫిర్యాదులపై ఫిర్యాదులు రాసాగాయి. ఈ ఫిర్యాదులతో ఇంగ్లండు దేశమంతా మారుమోగిపోయిది. కామన్స్ సభ అతనిపై సుదీర్ఘమైన ఛార్జిషీటు తయారు చేసింది. అతడిని శిక్షించాలని, పదవినుంచి తొలగించాలని సభలు, తీర్మానాలు జరిగాయి.

## పతనం

చివరికి విధిలేక బేకన్ తాను కానుకలు, బహుమతులు పుచ్చుకున్నమాట నిజమేనని అంగీకరించాడు. లంచాలు మాత్రం తాను ఎరగనంటే ఎరగనని బుకాయించాడు. అయితే తాను పుచ్చుకున్న కానుకల ప్రభావం తన నిర్ణయాలపై అణుమాత్రమైనా లేదని వాదించాడు.

కాని, అతని మాట ఎవరూ నమ్మలేదు. ఎసెక్స్‌ను బంధించిన లండన్ టవర్‌లోనే బంధించారు. పదవి ఊడబెరికి వేశారు. పెద్ద జరిమానా విధించారు. కాని, కొద్దిరోజులలోనే జేమ్స్‌రాజు అతడికి క్షమాభిక్ష ప్రసాదించి విడుదల చేశాడు. జరిమానా రద్దు చేశాడు. ఇక పార్లమెంటు ఛాయలలోనికి గాని, న్యాయస్థానాల దరిదాపులలోనికి గాని రానని, ఎటువంటి ప్రభుత్వ పదవిని ఆశించనని హామీ పుచ్చుకుని వదలి పెట్టారు. అది 1621 లో.

తర్వాత అతడు అయిదేళ్లపాటు దాదాపు అజ్ఞాతవాసం చేశాడు. ఒకవైపు రాజకీయాధికారంలో ఉంటూనే అతడు మానవ చరిత్రను మలుపు తిప్పిన తాత్విక గ్రంథాలను ఇంతకాలంగా రచిస్తూ వచ్చాడు. ఇప్పుడు అజ్ఞాతవాసంలో పూర్తిగా తాత్విక రచనలకే అంకితుడైనాడు.

## అవసానం

ఒకరోజున స్నేహితునితో కలిసి గుర్రపు బగ్గీలో ప్రయాణం చేస్తున్నాడు. మృతి చెందిన మనిషి శరీరాన్ని కొన్ని రోజులపాటు చెడిపోకుండా వుంచడం ఎలా? అన్న విషయంపైకి అతని ఆలోచన మళ్లింది. దారిప్రక్కన దట్టంగా పేరుకున్న మంచు కనబడింది. మంచులో పెడితే మృతదేహం నిల్వ వుంటుందా?

బగ్గీ దిగాడు. ఒక కోడిని చంపాడు. మంచు పోగు చేశాడు. కోడి శరీరంలో దాన్ని నింపాడు. దాన్ని ఇంటికి తీసుకుపోవా లనుకున్నాడు. కాని, వున్నట్టుండి నిస్సత్తువ అవహించింది. చలితో వణికి పోయాడు. జ్వరం వచ్చింది. న్యుమోనియా సోకింది. సమీపంలో గల ఒక స్నేహితుని ఇంటికి వెళ్లి పడుకున్నాడు. అలాగ కొన్ని రోజులు మరణశయ్య మీదనే గడిపాడు. మంచు కూరిన కోడి శరీరం చెడిపోలేదు. "నా ప్రయోగం పూర్తిగా ఫలించింది (The experiment succeded exceedingly well)" అని సంతృప్తితో నిట్టూర్చాడు. అదే అతని ఆఖరి నిట్టూర్పు. అది 1626వ సంవత్సరం.

## సాహిత్య శేముషి

ఫ్రాన్సిస్ బేకన్ గొప్ప సాహిత్యకారుడు. అతని వచనశైలి ఇంగ్లీషు భాషను పరిపుష్టం చేసింది. 1597లో అతడు ప్రచురించిన "ఎస్సేస్" (వ్యాసావళి) అతని సాహిత్య శేముషికి నిదర్శనం.

బేకన్‌పట్ల తర్వాతి శతాబ్దాలలో అతని అభిమానుల ఆరాధనాభావం ఎంత వరకు వెళ్లిందంటే వారు షేక్స్పియర్ నాటకాల కర్తృత్వాన్ని అతనికి అంటగట్టారు. నిజానికి, షేక్స్పియర్ నాటకాలు బేకన్ వంటివాడు వ్రాసి వుండడం అసంభవం. అతనిది పూర్తిగా సృజనాత్మక కళాదృష్టి. ఇతనిది పూర్తిగా విశ్లేషణాత్మక తాత్విక దృష్టి.

అగస్త్యుడు సముద్రాన్ని ఆపోశన పట్టినట్టు బేకన్ ప్రపంచ విజ్ఞానాన్ని ఆపోశన పట్టాడు.

"కొన్ని పుస్తకాలను రుచి చూడాలి. కొన్నిటిని మింగివేయాలి, కొన్నిటిని నమిలి జీర్ణం చేసుకోవాలి," అన్నది అతని ప్రసిద్ధ సుభాషితాలలో ఒకటి.

"ప్రపంచ విజ్ఞానమంతా నా కార్యక్షేత్రమే" (I have taken all knowledge to be my province) అని ధీమాగా చెప్పుకున్నాడు. "విజ్ఞానమే శక్తి" (knowledge is power) అన్నది కూడా అతని సుభాషితమే.

ప్రకృతిని గురించి ఊహాగానాలు కాదు నేడు కావలసింది. దాన్ని మన వశవర్తినిగా చేసుకోవాలి. దానిచేత బానిసవలె ఊడిగం చేయించుకోవాలి. మానవుడు ప్రకృతిని జయించడానికిగాను దానికి లొంగిపోవాలి— అని బేకన్ ఉద్బోధించాడు.

## సైన్సు ఆవశ్యకత

మానవజాతికి నిత్య జీవితంలో ఉపయోగపడే విజ్ఞానం కావాలి. ఆ విజ్ఞానం మన జీవితాన్ని సుసంపన్నం చేయాలి. వివిధ విజ్ఞాన శాస్త్రాలు వినూతన విషయాలను కనుగొని, ప్రకృతిపై మానవ విజయానికి, మానవ కళ్యాణానికి తోడ్పడాలి— ఇది అతని విశ్వాసం.

బేకన్ ఎన్నో గ్రంథాలు రచించాడు. ప్లేటో "రిపబ్లిక్" వ్రాసినట్టు, సర్ థామస్‌మోర్ "యుటోపియా" వ్రాసినట్టు విజ్ఞాన వేత్తలతో కూడిన ఒక ఆదర్శ రాజ్యాన్ని ఊహిస్తూ "న్యూ అట్లాంటిస్" అనే కల్పితగాథ కూడా వ్రాశాడు.

కాని, అతనికి శాశ్వతకీర్తి తెచ్చినట్టిది "నోవమ్ ఆర్గానమ్" అనే తాత్త్విక రచన. అరిస్టాటిల్ "ఆర్గనాన్" అనే తర్కశాస్త్ర గ్రంథం వ్రాశాడు కదా? అతడు తన తప్పు లాజిక్‌తో విజ్ఞాన శాస్త్రాలను భ్రష్టు పట్టించాడని భావించిన బేకన్ అరిస్టాటిల్‌కు పోటీగా ఈ "నోవమ్ ఆర్గానమ్" (నూతన సాధనం) వ్రాశాడు.

విజ్ఞాన శాస్త్రాలు అభివృద్ధి కావడానికి వైజ్ఞానిక దృక్పథం కావాలి. ఆ దృక్పథానికి లాజిక్ ఆలంబన కావాలి. అదే ఇండక్టివ్ లాజిక్.

వైజ్ఞానిక దృక్పథాన్ని అలవరచుకొనడానికి ముందు మనస్సుకు పట్టిన తరతరాల బూజు దులపాలి. మెదళ్ల దళ్లను కూల్చివేయాలి; "విగ్రహాలను" పడగొట్టాలి.

బేకన్ "విగ్రహారాధన వ్యతిరేకి." విగ్రహాలంటే సాధారణ దేవతా విగ్రహాలని కాదు. మానవ మనః పీఠాలపై తిష్ఠవేసిన మూఢవిశ్వాసాల "విగ్రహాలు".

## నాలుగు విగ్రహాలు

"నోవమ్ ఆర్గానమ్"లో బేకన్ మానవాభ్యుదయాన్ని అవరోధిస్తున్న నాలుగు రకాల "విగ్రహాలను" పేర్కొన్నాడు.

**1.** జాతి విగ్రహాలు (Idols of the Tribe) :- ఇవి మానవజాతిలో శత శతాబ్దాలుగా జీర్ణించుకుపోయి, రక్తగతమైపోయిన అపోహలకు సంబంధించినవి. "మానవుడే అన్నిటికి కొలమానం" అనే అభిప్రాయం తప్పు. అజ్ఞానం వల్ల

మానవుడు తన సౌకర్యం కోసమే సమస్త విశ్వం ఏర్పడిందని భావిస్తాడు. ప్రపంచానికి ఒక పూర్వనిర్దిష్ట ప్రయోజనం కలదని, దానికి "ఆది కారణం" (first cause) ఏదో వుందని భ్రమపడతాడు. లోకంలో వాస్తవంగా వున్నదానికంటె ఎక్కువగా ఒక క్రమపద్ధతి, ఒక క్రమబద్ధత వున్నాయని ఊహించుకుంటాడు. ఉదాహరణకు ఖగోళంలోని గ్రహ, తారాగణం సంపూర్ణ వృత్తాకారం (perfect circles) గా పరిభ్రమిస్తాయన్న సిద్ధాంతం. (ఖగోళ వస్తువులు సంపూర్ణ వృత్తాకృతిలో కాక దీర్ఘ వృత్తాకృతి (elliptical) లో తిరుగుతాయని కెప్లర్ నిరూపించాడు.)

మానవుని మనస్సుకు ఒక బలహీనత వున్నది. ఎవరో పూర్వులు చెప్పారని గాని, లేక తనకు సౌకర్యంగాను, అనుకూలంగాను వున్నదనిగాని ఒకానొక అభిప్రాయానికి మన మనస్సు వచ్చిన తర్వాత, దాన్ని సమర్థించే నిదర్శనాలను వెదకడం ప్రారంభిస్తుంది. తన అభిప్రాయానికి వ్యతిరేకమైన విశేషాలు తారసిల్లినా వాటిని అలక్ష్యం చేస్తుంది, లేదా ఏదో కుతర్కంతో తిరస్కరిస్తుంది. మానవ జాతి ఆరాధించే ఈ దౌర్బల్యాల విగ్రహాలను పడగొడితేగాని సత్యాన్ని దర్శించలేము.

## ప్రతిమనిషీ ఒక గుహలో...

**2.** గుహా విగ్రహాలు (Idols of the Cave) :-ఇవి వ్యక్తిగతమైనవి. ప్రతి వ్యక్తికి ఒక సొంత గుహ వుంటుంది. దానిలోకి చొరబారే వెలుగు వికీర్ణమై, వివర్ణమైపోతుంది. మనిషికి జన్మతః వచ్చే స్వభావంవల్ల, లేదా తాను చదివిన చదువువల్ల, పుస్తకాలవల్ల, ఇతరులతో జరిపే సంభాషణలవల్ల వ్యక్తిలో ఈ "మనో విగ్రహాలు" ఏర్పడతాయి.

కొన్నిరకాల సైన్సులకు, ఊహాగానాలకు కొందరు వ్యక్తులు అంకితులైపోతారు. వాటిని తాము కనిపెట్టామని అనుకుంటారు. వాటిపై ఎంతో శ్రమించినందున వాటికి అలవాటుపడి, వాటిని ఆరాధించడం మొదలుపెడతారు. అలాంటివారు తత్వశాస్త్ర రంగంలోకి అడుగుపెడితే తమ తాత్విక దృక్పథాన్ని తమ అభిమాన, దురభిమానాలకు అనుగుణంగా మలుచుకుంటారు. ఇది అరిస్టాటిల్ లో బాగా కనిపిస్తుంది. అతడు తన విజ్ఞాన శాస్త్రాలను తన లాజిక్ కు బానిసలుగా చేశాడు. దానితో ఆ సైన్సులు ఎందుకూ పనికిరాకుండా పోయాయి.

కొందరికి పాత రోత, కొత్త వింత. లేదా పాతవింత, కొత్త రోత. మధ్యమ మార్గంలో నడిచేవారు అరుదు. పాతలో మంచి వుంటే దాన్ని గ్రహించుదామని అను కునేవారు, లేదా కొత్తలోనే మంచివుంటే దాన్ని స్వీకరించుదామని భావిం

చేవారు చాలా తక్కువగా వుంటారు. దీనివల్ల తత్వచింతనకు, సైన్సుకు ఎంతో అపకారం జరుగుతుంది. సత్యాన్ని ఏ కాలంలో కనుగొన్నారని చూడరాదు. ప్రకృతి పరిశీలనద్వారా, ప్రయోగాత్మకంగా సత్యదర్శనం చేయాలి.

## మాటల నిరంకుశత్వం

**3.** విపణివీథి విగ్రహాలు (Idols of the Market Place) :- ఇవీ అభ్యుదయానికి అవరోధాలే. ఇవి మనపై మాటల ప్రభావానికి, పేర్ల ప్రభావానికి చిహ్నాలు. కొందరు తమ వివేచననుబట్టి మాటలు, పేర్లు ఏర్పడతాయని భ్రమిస్తారు. కాని, మాటలుకూడా వివేచనను శాసిస్తాయని గ్రహించరు. మాటలను వీరు ఆరాధిస్తారు. పండితుల వాద ప్రతివాదాలు మాటల దగ్గిర, పేర్ల దగ్గిర ఆగిపోతాయి. మాటలను ఎంత జాగ్రత్తగానైనా నిర్వచించవచ్చు. కాని ఆ నిర్వచనాలు కుడా మాటలతో కూడినవేకదా? అందువల్ల నిర్వచనాలవల్ల సత్యం దొరకదు. ప్రతి ప్రత్యేక సందర్భాన్ని పరిశీలించి, ప్రయోగరీత్యా పరిశోధించి నిజం నిగ్గు తీయాలి. సైన్సు పరిభాష నుంచి ఆదికారణం, కారణరాహిత్యం, కేవలత్వం, అనంతత్వం, ప్రథమ ద్రవ్యం (Primaeval matter) మొదలైన మాటలను తొలగించాలి.

**4.** రంగస్థల విగ్రహాలు (Idols of the Theatre) :- ఈ విగ్రహాలు పూర్వ తత్వవేత్తల తత్వ సిద్ధాంతాలనుంచి ఏర్పడతాయి. వివిధ తత్వవేత్తల ప్రతిపాదనలు నాటకాలవంటివి. అవన్నీ కేవల కల్పనా కథలు, కృత్రిమరత్నాలు. చూడ్డానికి అందంగా ఉంటాయి. అవి నాటకాలలోని కథలవలె మన ఇష్టానిష్టాల ప్రకారం. మన సౌలభ్యానికి, మన ఆనందానికి కల్పించుకున్నట్టివి. వాటిద్వారా సత్య దర్శనం కాదు.

## ప్రశ్న ముఖ్యం

సరే, ఈ నాలుగు రకాల విగ్రహాలను (అంటే మన విశ్వాసాలు, ఛాందసాలు, అపోహలు) తొలగించుకొన్న తర్వాత, సత్యాన్ని ఎలా అన్వేషించాలి? ఏ కొత్త పద్ధతిలో అన్వేషించాలి?

సందేహం (doubt) ముఖ్యం. ప్రతిదాన్ని ప్రశ్నించి తరచి చూడాలి.

ముందుగా ఒక విషయానికి సంబంధించిన ప్రత్యేక విశేషాలన్నీ సేకరించాలి. వాటిని ఒక క్రమపద్ధతిలో వర్గీకరించాలి. వాటినుంచి కొన్ని సాధారణ సూత్రాలను రాబట్టాలి.

ఆ సూత్రాల నిగ్గు తేల్చడానికి కొత్త ప్రయోగాలు చేయాలి. వాటినుంచి నూతన సత్యాలను పిండాలి. ముందు తాత్కాలిక ప్రతిపాదన (హైపోథిసిస్), తర్వాత ప్రయోగం; ఆ పిదప సిద్ధాంతం— అదీ క్రమం. ఇదే ఇండక్టివ్ పద్ధతి.

ఉదాహరణకు ఉష్ణం అంటే ఏమిటని ప్రశ్న వేసుకున్నప్పుడు దానికి సమాధానం కోసం కొన్ని ప్రయోగాలు చేయవలసి వుంటుంది. ఉష్ణం పెరిగితే ఏది పెరుగుతుంది? ఉష్ణం తగ్గితే ఏది తగ్గుతుంది? బేకన్ ఈ ప్రశ్నలు వేసుకుని ప్రయోగరీత్యా ఉష్ణం (heat) అంటే చలనం (motion) అని కనుగొన్నాడు.

బేకన్ స్వయంగా సైంటిస్టు కాదు. తన కాలపు సైంటిస్టుల పరిశోధనలను అతడు పెద్దగా పట్టించుకోలేదు కూడా. కాని వైజ్ఞానిక దృక్పథానికి అత్యున్నత ప్రాధాన్య మివ్వడంలోనే అతని ఘనత వున్నది. అంధ యుగాలకు వీడ్కోలు చెప్పి ఆధునిక యుగ ప్రాభాతానికి స్వాగతం పలికిన తత్వవేత్తగా అతడు శాశ్వత కీర్తి పొందాడు.



# 18

# హాబ్స్ ఊహించిన (ప్రా) కృతయుగం

మహా భారతంలో భీముడు సౌగంధికాపహరణ నిమిత్తం వెళ్లిన ఘట్టం (అరణ్యపర్వం- తృతీయాశ్వాసం) పాఠకులకు జ్ఞాపకం వుండే వుంటుంది. భీమునికి హనుమంతుడు తారస పడతాడు. నాలుగు యుగాలలోను ప్రజల ఆచార వర్తనాలు ఏ విధంగా వుండేవో తనకు చెప్పవలసిందిగా హనుమంతుడిని భీముడు ప్రార్థిస్తాడు.

హనుమంతుడు మొదట కృతయుగాచార వర్తనాలను వర్ణిస్తూ "కృతము కాని కర్తవ్యంబు గృతయుగంబునందు లేదు– చతుష్పాదమగుచు ధర్మమనఘ వర్తిల్లు" అని చెబుతాడు. ("కృతమేవ న కర్తవ్యం-తస్మిన్కాలే యుగోత్తమే-న తత్ర ధర్మాః సీదన్తి- క్షీయంతే నచవై ప్రజాః" -సంస్కృత భారతం.)

నాలుగు యుగాలలో కృతయుగం మొదటిది. ఆ యుగంలో కృతమే తప్ప కర్తవ్యం లేదు. ధర్మం నాలుగుపాదాలతో నడిచేది.

"కృతం" అంటే చేయబడినది, చర్య అని అర్థం. "కర్తవ్యం" అంటే చేయదగినది, చేయవలసినది అని అర్థం.

## కృతయుగం

అంటే, కృతయుగంలో ప్రజలు యథేచ్ఛగా తమకు తోచింది చేయడమే తప్ప, ఇది చేయదగును, ఇది చేయదగదు అనే నియమం ఉండేది కాదన్న మాట. ఇది పాపం, ఇది పుణ్యం - ఇది అధర్మం, ఇది ధర్మం - ఇది అన్యాయం, ఇది న్యాయం అనే విభాగం ఆ రోజులలో లేదు. ధర్మాధర్మ విభజన, లేనప్పుడు-కర్తవ్యా కర్తవ్య విభజన లేనప్పుడు 'చేయబడినది' (కృతం) ఒకటే వుండేది. "చేయవలసింది" (కర్తవ్యం) వుండేది కాదు. కనుక ధర్మోల్లంఘన ప్రశ్న కూడా లేదు. అందుచేతనే ఆ యుగంలో ధర్మం నాలుగు పాదాల నడుస్తూ వుండే దన్న వాడుక వచ్చివుండవచ్చు.

కాని, ఎప్పుడైతే ధర్మా ధర్మ విచక్షణ ఏర్పడిందో, అప్పుడే ధర్మోల్లంఘన కూడా ప్రారంభమైంది. త్రేతాయుగంలో కొద్దిగా, ద్వాపర యుగంలో మరి కొంత ఎక్కువగా, కలియుగంలో ఇంకా అధికంగా కర్తవ్యోల్లంఘన జరిగింది.

దీన్ని పండితులు ఒప్పుకుంటారో లేదో నాకు తెలియదు. ఒప్పుకోరనే అనుకుంటాను. కాని, భారతంలో హనుమంతుడు నిర్వచించిన కృతయుగ లక్షణానికి ఇంతకంటె హేతుబద్ధమైన అర్థం నాకు కనబడడంలేదు.

పాశ్చాత్య దార్శనికులలో కనీసం ఒక తాత్వికుడు దాదాపు ఇలాంటిదే ఒకానొక కృతయుగాన్ని ( కృతమేకాని కర్తవ్యం లేని ఆదిమ సమాజాన్ని) దీనికి వ్యతిరేక దృష్టినుంచి ఊహించాడు. అతడు 17వ శతాబ్దికి చెందిన బ్రిటిష్ తత్వవేత్త థామస్ హాబ్స్. అతడు తన "లెవియథాన్" గ్రంథంలో ధర్మాధర్మ ప్రసక్తిలేని కాలాన్ని వర్ణించాడు.

## హాబ్స్ బాల్యం

థామస్ హాబ్స్ 1588 లో జన్మించాడు. అవి శ్పానిష్ ఆర్మడా (నౌకాదళం) ఇంగ్లండుపైకి దండెత్తి వస్తున్నదనే వార్తలతో ప్రజలు భయభ్రాంతులైపోతున్న రోజులు. అందరివలె థామస్ తల్లికూడా ప్రాణభయంతో గజగజ వణికిపోతూ వుండేదట. అప్పటికామె గర్భిణి. ఆ భయంతో ఆమె రెండు నెలలు ముందుగానే కవల కొడుకులను కన్నదట. తర్వాత రోజులలో థామస్ హాబ్స్ ఈ ఉదంతాన్ని ప్రస్తావిస్తూ "నేనూ, భయమూ కవల పిల్లలం" అనేవాడట.

అతని తండ్రి పేరు కూడా థామస్ హాబ్స్. కావడానికి మతగురువే (వికార్) కాని, కలహప్రియుడు, మొరటుమనిషి. ఒకరోజున చర్చి గుమ్మంవద్ద ఎవరితోనో దెబ్బలాటకుదిగి, ఇంటికి రావడానికి మొగంచెల్లక, అటునుంచి

అటే ఎటో పారిపోయాడు. అతని ముగ్గురు పిల్లలను పినతండ్రి చేరదీసి పెంచి పెద్దవారిని చేశాడు.

థామస్ హాబ్స్ తన నాలుగవ ఏట చర్చి స్కూలులో చేరాడు. ఆరవ ఏటనే గ్రీకు, లాటిన్ భాషలు నేర్చాడు. పదిహేనవ ఏట ఆక్స్‌ఫర్డ్‌లో చేరాడు. ఆక్స్‌ఫర్డ్ వాతావరణం అతనికి నచ్చలేదు. తాగుబోతులకు, రౌడీలకు నిలయమని, మద్యాలయం తప్ప విద్యాలయం కాదని దాన్ని నిరసించాడు. విశ్వవిద్యాలయాలపట్ల అతనికి అప్పటిలో ఏర్పడిన జుగుప్సాభావం జీవితాంతంవరకు నిలిచిపోయింది. విశ్వవిద్యాలయాలు కూడా అతనిపట్ల అదే అసహన భావాన్ని ప్రదర్శించేవి. ఉదాహరణకు అతని "లెవియథాన్" గ్రంథం వెలువడినప్పుడు దాన్ని ఆక్స్‌ఫర్డ్, కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయాలలో తగులబెట్టారు.

## దే శా ట న

హాబ్స్ విద్యాభ్యాసం 1608 నాటికి పూర్తి అయింది. ఆ పిదప విలియం క్యావెండిష్ అనే ధనికుని కుమారునికి ఉపాధ్యాయుడుగా కుదురుకున్నాడు. శిష్యునితోపాటు 1610 లో ఫ్రాన్స్, ఇటలీ దేశాలలో పర్యటించాడు. ఆ పిదప మరి రెండుసార్లు యూరోపియన్ దేశాలలో పర్యటించే అవకాశం కలిగింది. గలీలియో, దేకార్తె మొదలైన విజ్ఞానవేత్తలతో, తత్వవేత్తలతో అతనికి పరిచయాలు ఏర్పడ్డాయి. బేకన్ తన రచనలు డిక్టేట్ చేస్తుంటే ఇతడు వ్రాసుకునేవాడు.

ఇలా వుండగా కొంత కాలానికి ఇంగ్లండులో అంతర్యుద్ధం ప్రారంభం కానున్న సూచనలు కనిపించాయి. తన రాజకీయ భావాల కారణంగా తనకు ఎక్కడ అపాయం వాటిల్లుతుందోననే భయంతో పారిస్ పారిపోయాడు. అక్కడ పదకొండేళ్ల ప్రవాస జీవితం గడిపాడు. ఈలోగా మొదటి ఛార్లెస్ శిరశ్ఛేదం (1649), క్రామ్‌వెల్ అధికారానికి రావడం జరిగింది. ఆ రోజులలోనే హాబ్స్ తన చిరకీర్తికి కారణమైన "లెవియథాన్" రచించాడు. దానిలో అతడు వ్యక్తం చేసిన రాజకీయ, తాత్విక భావాలు పారిస్‌లో ప్రవాసులుగా వుంటున్న బ్రిటిష్ రాజభక్తులకు, ఫ్రెంచి మతాధికారులకు కూడా ఆగ్రహం కలిగించాయి. పారిస్‌లో ప్రతికూల వాతావరణం ఏర్పడింది. ఇక అక్కడ వుండడం క్షేమం కాదని, మళ్లీ లండన్ పారిపోయాడు. అక్కడ క్రామ్‌వెల్ ప్రభుత్వంతో రాజీపడి స్థిరపడ్డాడు.

## హాబ్స్ వృద్ధాప్యం

కొన్నాళ్లకు మళ్లీ స్టూవర్టులు అధికారానికి వచ్చారు. రెండవ ఛార్లెస్ (1660) రాజు అయ్యాడు. పారిస్ ప్రవాసకాలంలో హాబ్స్ ప్రిన్స్ ఛార్లె

న్‌కు గణితశాస్త్రోపాధ్యాయత్వం వహించాడు. ఆ గౌరవభావంతో రాజు ఛార్లెస్ తన గురువును చేరదీశాడు. రాజానుగ్రహం సంపాదించినా చర్చితో అతనికి యథాప్రకారంగా విరోధం కొనసాగింది. అతడు నాస్తికుడని చర్చి అధికారులు నిందించారు.

అప్పటికే హాబ్స్ వృద్ధుడయ్యాడు. అయినా, ఇంకా పెక్కేళ్లు—పండు ముదుసలి అయ్యేవరకు- -జీవించాడు. మనిషి అజానుబాహుడు, దృఢగాత్రుడు, దృఢచిత్తుడు కూడా. డెబ్బయి అయిదవ ఏట కూడా టెన్నిస్ ఆడేవాడు, పాటలు పాడేవాడు. గ్రీకు, లాటిన్ భాషలు కొట్టిన పిండి. తన 84 వ ఏట లాటిన్‌లో ఆత్మ కథాకావ్యం రచించాడు. 86 వ ఏట ఇలియడ్, ఒడిస్సీ కావ్యాలను ఇంగ్లీషులోకి అనువదించాడు. 90 ఏళ్లు వచ్చినా రచనా వ్యాసంగం విరమించలేదు. 1679 లో 91 వ ఏట కాలధర్మం చెందాడు.

తాత్వికంగా హాబ్స్ భౌతికవాది (Materialist), ప్రయోజనవాది (Utilitarian); జ్ఞానశాస్త్ర (Epistemology) రీత్యా అనుభవవాది (Empiricist). అయితే, మతాన్ని గట్టిగా విమర్శించలేదు. దేవుడున్నాడని అంగీకరించాడు. దేవుడు సృష్టికర్తే నని, కాని, అతడు ఏ విధంగా వుంటాడన్నది ఏ హేతుపద్ధతి ద్వారాను కనుగొనలేమని, అందుచేత తత్వశాస్త్రం (Philosophy) దేవునితో ప్రమేయం పెట్టుకోరాదని అన్నాడు.

## లెవియథాన్

హాబ్స్ గ్రంథా లన్నిటిలోకి ముఖ్యమైనది, "లెవియథాన్". ఇది అతని రాజకీయ సిద్ధాంత గ్రంథం. రాజ్యం (state) అంటే ఏమిటి? అది ఎందుకు, ఏ విధంగా ఏర్పడింది? ఏది ఉత్తమ రాజ్యవ్యవస్థ? మొదలైన ప్రశ్నలను దానిలో అతడు కూలంకషంగా చర్చించాడు. దాన్ని ఆధునిక కాలంలో మొట్టమొదటి రాజకీయ దర్శన గ్రంథంగా పరిగణిస్తున్నారు. ఆ తరువాతి రాజకీయ దార్శనికు లపై దాని ప్రభావం ఎంతో వున్నది. ఎన్నో అనంతర రాజకీయ సిద్ధాంతాలకు అది ప్రేరణ ఇచ్చింది. నేడు మాత్రం దాని విలువ చారిత్రకం మాత్రమే.

"లెవియథాన్" అంటే తిమింగిలం. అది శక్తిమంతమైన పెద్ద జంతువు. దానితో రాజ్యవ్యవస్థను హాబ్స్ పోల్చాడు. తిమింగిలం వలె రాజ్యం అమిత శక్తి సంపన్నమైనది కనుక ఆ పోలిక తీసుకువచ్చాడు.

"లెవియథాన్" 1651 లో ప్రచురితమైంది. మొదటి ఎడిషన్ అట్ట మీద ఒక బ్రహ్మాండమైన మానవ రూపాన్ని, ఆ మానవుని లోపల చిన్నచిన్న రూపాలలో మానవు లనేకులను చిత్రించిన బొమ్మను ముద్రించారు. ఆ

మహామానవుడు రాజ్యానికి ప్రతీక. అనేక మానవులు కలిసి సృష్టించారు కనుక అది అధిమానవుడు. ఆ అధిమానవ దేహానికి ప్రాణస్పందన కలిగించే ఆత్మ సార్వభౌమత్వం (Sovereignty). అధికారులు కీళ్లు. ప్రజలకు రాజు ప్రసాదించే శిక్షా, పురస్కారాలు నాడులు. ప్రజల సంపద దాని బలం. అది చేసే పని ప్రజల రక్షణ. సలహాలిచ్చే మంత్రులు దాని జ్ఞాపకశక్తి. న్యాయశాసనాలు దాని వివేచన శక్తి. ప్రజల అన్యోన్య సహకారం దాని ఆరోగ్యం. రాజద్రోహం అనారోగ్యం. అంతర్యుద్ధం మృత్యువు.

## హాబ్స్ చింతన

హాబ్స్ రాజకీయ సిద్ధాంతాన్ని తెలుసుకొనడానికి ముందు క్లుప్తంగా అతని తత్వదృష్టిని పరిశీలిద్దాము.

ప్రపంచంలో ఏదైతే వున్నదో అదంతా పదార్థమే (matter). ఏదైతే కనబడు తున్నదో, లేదా ఇంద్రియానుభవంలోకి వస్తున్నదో అదంతా చలనమే (motion). వస్తువులు: వాటి చలనం-ఇవే యాథార్థ్య సమస్తం (total reality). మానవుడు కూడా చలిస్తున్న కణాల కలయిక.

చలనానికి ఆదికారణం లేదు. చలనం అనాది, అనంతం. ఒక వస్తువు చలనం మరొక వస్తువుపై పనిచేసి దాని చలనానికి కారణ మవుతుంది. ఇదే కారణం (cause)గాను, కార్యం (effect) గాను మనకు కనిపిస్తుంది. శూన్యస్థలం అనేది లేదు. మొత్తం స్థలం (space) పదార్థంతో నిండివుంది. కణాలమధ్య ఖాళీ స్థలంవలె కనబడేది కూడా ఈథర్ అనే సూక్ష్మపదార్థంతో నిండివుంది. ఈథర్ ద్వారానే ఒక వస్తువు చలనం మరొక వస్తువుకు సంక్రమిస్తుంది. కనుక చలనం ప్రవాహ సదృశమైనది.

## జ్ఞాన కారణం

మనకు జ్ఞానం ఎలా కలుగుతున్నది? యాంత్రికమైన చలనమే జ్ఞానానికి కారణం. సమస్త జ్ఞానం ఇంద్రియానుభవం ద్వారానే సిద్ధిస్తున్నది. బాహ్య వస్తువు చలనం మన ఇంద్రియాలపై పని చేస్తుంది. దానివల్ల ఇంద్రియాలలో చలనం కలుగుతుంది. వీటినే సంవేదనలు (Sensations) అంటాము. ఈ సంవేదనలు నాడులద్వారా మెదడుకు వెడతాయి. అక్కడినుంచి గుండెకు పయనిస్తాయి. దానినుంచి ప్రతిస్పందన (Reaction) జరుగుతుంది. అప్పుడు మనకు వెలుపల ఒకానొక వస్తువు కలదని తెలియ వస్తుంది.

కంటితో చూసే రంగులు, చెవితో వినే ధ్వనులు, స్పర్శతో తెలిసే గట్టి దనం మొదలైనవి, ముక్కుతో గ్రహించే వాసన, నాలుక గ్రహించే రుచి—ఇవన్నీ

స్వతహాగా ఆయా బాహ్యవస్తువులలోని గుణాలు (qualities) కావు. ఆయా వస్తువులు మన ఇంద్రియాలపై పనిచేసినప్పుడు కలిగే సంవేదనలే ఆయా గుణాలుగా భాసిస్తున్నాయి. సంవేదనలకు కారణం బాహ్య వస్తువే. కాని, సంవేదనలు బాహ్యవస్తు లక్షణాలు కావు. మన సంవేదనలకు, బాహ్యవస్తువుకు పోలిక లేదు. బాహ్యవస్తువులలోని చలనమే మనకు రంగు, ధ్వని మొదలైన సంవేదనలుగా తెలియవస్తున్నాయి. అందుచేత మనకు ఇంద్రియగోచరమయ్యే ప్రపంచం వేరు, బాహ్య ప్రపంచం వేరు.

జ్ఞాపకశక్తి (memory), భావనాశక్తి (imagination) అంటే ఏమిటి? ఇవి కూడా భౌతిక చలనంవల్ల ఏర్పడుతున్నట్టివే.

## క్షీణిస్తున్న ఇంద్రియ జ్ఞానం

ఏ వస్తువైనా ఏదీ అడ్డురానంత కాలం అలా సూటిగా పయనిస్తూనే వుంటుంది. ఏదైనా అడ్డువస్తే దాని చలనం వెంటనేగాని, నెమ్మదిగాగాని ఆగిపోతుంది. అలాగే మన సంవేదనలు కూడా. కళ్లు తెరిచి చూస్తున్నప్పుడు దృష్టికి సంబంధించిన సంవేదన కలుగుతుంది. కళ్లు మూసుకున్నప్పుడు సంవేదన ఆగిపోతుంది. కాని, ఆ సంవేదన మనలో కలిగించిన సంస్పందన జ్ఞాపకంగా, లేదా భావనగా మిగిలిపోతుంది. దీనికే "క్షీణిస్తున్న ఇంద్రియ జ్ఞానం" (decaying sense) అని హాబ్స్ పేరు పెట్టాడు. నిద్రపోతున్నప్పుడు కూడా భావన పని చేస్తుంటే అది కలగా కనిపిస్తుంది. మేల్కొని వున్నప్పుడు మనస్సులో ఇంద్రియ జ్ఞానం యొక్క ప్రతిబింబాలు (impressions) ఆలోచనల రూపంలో ఒకదాని తర్వాత ఒకటి వచ్చి పోతుంటాయి. వీటిని ఒక క్రమపద్ధతిలో అమర్చితే జ్ఞానం (Knowledge) గా పరిణమిస్తుంది.

మనస్సు (mind) అంటే ఏమిటి? మెదడులో కలిగే స్పందనే మనస్సు. దానిలో కలిగే ప్రతిస్పందనే ఆలోచన. జ్ఞానం సంపాదించే శక్తితోపాటు ప్రేరణ కలిగించే శక్తికూడా మనస్సుకు వుంది. ఈ శక్తివల్ల మనస్సు శరీరానికి చలనం కలగజేస్తుంది.

ప్రతిప్రాణి సుఖాన్ని కోరుతుంది. బాధను నిరాకరిస్తుంది. మన శరీరం కొన్ని వస్తువులకు అభిముఖంగాను, మరికొన్నిటికి తిరోముఖంగాను చలిస్తుంది. అభిముఖంగా చలించితే ఆ వస్తువు సుఖం కలిగించే దన్నమాట. తిరోముఖంగా చలించితే అది బాధ కలిగించే దన్నమాట. మన రాగద్వేషాలకు ఇదే కారణం.

ఈ యాంత్రిక భౌతికవాదం (mechanical materialism) పునాదిపై హాబ్స్ తన రాజకీయ శాస్త్ర సౌధాన్ని నిర్మించాడు.

ప్రతి మానవుడు స్వీయ సుఖానికై ప్రయత్నిస్తాడు. తన ప్రాణభద్రతకు, దేహ రక్షణకు, స్వసుఖానికి ఏ వస్తువు అవసరమో దాన్ని ఏ విధంగానైనా సంపాదించడానికి యత్నిస్తాడు. అలా ప్రయత్నించడం అతనికి ప్రకృతి ప్రసాదించిన హక్కు, దానికి సహజమైన హక్కు (right of nature) అని హాబ్స్ పేరు పెట్టాడు.

## మానవ స్వభావం

స్వీయసుఖమే పరమార్థం కనుక మానవుడు స్వతహాగా స్వార్థపరుడు, నీచుడు, క్రూరుడు అవుతాడు. అరిస్టాటిల్ మానవుడు సంఘజంతువు (Man is a social animal) అన్నాడు. నరునిలో స్వభావతః దయ, ప్రేమ, సహకారం వంటి సాంఘిక లక్షణా లున్నాయని, కనుకనే సంఘజీవి అయ్యాడని అరిస్టాటిల్ భావం. దీన్ని హాబ్స్ ఖండించాడు. మనిషి జన్మతః సంఘ వ్యతిరేక జంతువని, స్వార్థపరుడని హాబ్స్ భావించాడు.

మానవు లందరికి సమాన స్వేచ్ఛ, సమాన శక్తియుక్తులు వున్నాయి. ఒకరికి దేహబలం ఎక్కువగా వుంటే— మరొకరికి బుద్ధిబలం ఎక్కువగా వుంటుంది. మొత్తంపై మానవులు దాదాపుగా సమాన శక్తిమంతులు.

అటువంటి మానవులు స్వసుఖంకోసం ప్రయత్నించడంలో, ఒకరికంటె ఒకరు అధిక గౌరవం సంపాదించడానికీ, ఒకరిపై ఒకరు అధికారం చెలాయించడానికీ పోటీపడడంలో సంఘర్షిస్తారు. ఎవరెక్కువ బలశాలురైతే వారు గెలుస్తారు; రెండవవారు నశిస్తారు. ఈ పోటీవల్ల మానవులలో నిరంతర యుద్ధస్థితి ఏర్పడుతుంది. ఎడతెగని యుద్ధం జరుగుతుందని కాదు. కాని, యుద్ధ ప్రమాదం, ప్రాణాపాయం నిరంతరం పొంచి చూస్తుంటాయి. వాటినుంచి స్వీయ రక్షణకు మానవులు సకలోపాయాలను అవలంబిస్తారు. అదే మానవుల సహజస్థితి (state of nature.)

ఆ స్థితిలో న్యాయన్యాయాలు, ధర్మాధర్మాల ప్రసక్తి లేదు. మంచీ చెడు ప్రసక్తి లేదు. మానవులను అదుపుచేసే అధిశక్తి (super power) లేదు కనుక శాసనం (law) లేదు. శాసనం లేకపోతే శాసనోల్లంఘన లేదు. 'కృతం' తప్ప కర్తవ్యం లేదు. ఈ అధ్యాయం మొదట్లో చెప్పినట్టు దాన్ని కృతయుగంగా పేర్కొనడానికి ఇష్టపడని వారు "ప్రాకృతయుగం" (original state) గా పేరు పెట్టవచ్చు. లేదా "వికృతయుగం"(unnatural state)గా పేరు పెట్టవచ్చు. ఏమైనా అటువంటి స్థితి అదిమకాలంలో వుండేదని హాబ్స్ భావించాడు.

## శాంతికై ఆరాటం

కాని, నిరంతర యుద్ధ స్థితివల్ల, శాసన రాహిత్యంవల్ల మానవులు తాము

కోరుకున్న సుఖాన్ని పొందలేక పోతారు. ప్రాణ భద్రత లేకుండా పోతుంది. ఆ స్థితిలో వారు తమ సహజస్థితికి వ్యతిరేక దిశలో ప్రయాణిస్తారు. అంటే శాంతికి అభిముఖు లవుతారు. దీన్ని మొదటి ప్రాకృతిక సూత్రం (first law of nature) గా హాబ్స్ పేర్కొన్నాడు.

అయితే శాంతి సంస్థాపనకు ఏమి చేయాలి? ప్రతి వ్యక్తి తనకు ప్రకృతి సిద్ధంగా లభించిన స్వేచ్ఛను, హక్కులను పరిమితం చేసుకోవాలి. తనకు ఎంత స్వేచ్ఛ వుండాలని కోరుకుంటాడో అంతే స్వేచ్ఛను ఇతరులకు ఇవ్వవలసి వుంటుంది. అంటే తన స్వేచ్ఛలో కొంత త్యాగం చేయవలసివుంటుంది. భారతంలో చెప్పినట్టు "ఒరులేయవి యొనరించిన- నరవర! అప్రియంబు తన మనంబున కగు దా- నొరులకు నవి సేయకునికి—పరాయణము పరమ ధర్మపథ ముల కెల్లన్" అనే సూత్రం అప్పుడు మానవులు పరస్పరం వర్తింపజేసుకుంటారు. ఇందుకోసం వారు తమలో తాము ఒక ఒప్పందానికి వస్తారు. ఇదే హాబ్స్ తర్వాతి కాలంలో రాజకీయ శాస్త్రంలో ప్రసిద్ధమైన "సోషల్ కాంట్రాక్ట్" ఇది రెండవ ప్రాకృతిక సూత్రం (second law of nature).

మానవులు అలా వదులుకున్న స్వేచ్ఛను ఎవరికివ్వాలి? ఒక సార్వభౌమ వ్యవస్థ (sovereign)కు ఇవ్వాలి. తమలో ఒకరి నుంచి ఒకరికి రక్షణకోసం, తమను అదుపుచేయడానికి, తమపై మరొక మానవ సంఘం, లేదా దేశం దురాక్రమణ చేస్తే తమను రక్షించడానికి ఆ సార్వభౌమ వ్యవస్థకు సర్వాధికారాలు అప్పగించాలి. అప్పుడు మానవులగుంపు ఒక సంఘంగా, రాజ్యంగా వ్యవస్థీకృత మవుతుంది. దానిపై అధికారం సార్వభౌమునికి సంక్రమిస్తుంది.

## సోషల్ కాంట్రాక్ట్

ఒప్పందం (social contract) వ్యక్తుల మధ్యనే తప్ప, ప్రజలకు, సార్వభౌమునికి మధ్య కాదు. సార్వభౌమునికి సర్వాధికారాలు అప్పగించడంవరకే ప్రజల బాధ్యత. ఆ తర్వాత వాటిని ఉపసంహరించే హక్కు ప్రజలకు లేదు.

అయితే, ప్రజలు తమ అన్ని హక్కులను వదలుకోరు. యుద్ధంనుంచి, దురాక్రమణనుంచి, అశాంతి నుంచి తమ రక్షణ నిమిత్తం మాత్రమే వారు తమ హక్కులు వదులుకుంటారు. కాని, స్వీయ రక్షణకు తమకుగల హక్కును వదులుకోరు. అంటే ఏ సార్వభౌముడూ తన ప్రజలలో ఏ వ్యక్తీ తనకు తాను హాని చేసుకునేటట్టు, తనకు తాను వ్యతిరేకంగా సాక్ష్యం చెప్పకునేటట్టు శాసించలేడు. అలా శాసిస్తే ఎదురుతిరిగే హక్కు వ్యక్తికి వుంటుంది.

ప్రజలు తమస్వేచ్ఛను వదులుకున్న తర్వాత సార్వభౌముడు వారికి ఎంత

స్వేచ్ఛ ఇస్తే అంతే స్వేచ్ఛ వారికి వుంటుంది. కాని శాసనాలు మౌనంగా వున్న సందర్భాలలో వారు యథేచ్ఛగా ప్రవర్తించవచ్చు. స్వేచ్ఛగా తమ వృత్తి వ్యాపారాలు చేసుకోవచ్చు. శాసనం లేనిచోట శాసనోల్లంఘన లేదు కదా?

సార్వభౌముడు ప్రజల యోగక్షేమాలకు అవసరమైన శాసనాలు చేస్తాడు. బలప్రయోగంతో వాటిని అమలుచేస్తాడు. ధిక్కరించినవారిని శిక్షిస్తాడు. ప్రజ్ఞాశాలురను సత్కరిస్తాడు. ప్రజలు ఏ మతం అవలంబించాలో శాసిస్తాడు. విద్య ఎలా వుండాలో నిర్ణయిస్తాడు.

కాని, ప్రజల రక్షణకు, యోగక్షేమాలకు, సుఖ జీవనానికి వ్యాచీపడిన మేరకే సార్వభౌమునికి సర్వాధికారా లుంటాయి. ఆ మేరకే ప్రజలు అతడి ఆజ్ఞను శిరసావహిస్తారు. ఆ బాధ్యతలో అతడు విఫలుడైతే అతడిని తొలగించే హక్కు ప్రజలకు వుంటుంది.

## రాజరికం శ్రేష్ఠం

అన్ని రాజ్య వ్యవస్థలలోకి రాజరికం (monarchy) శ్రేష్ఠమని హాబ్స్ భావించాడు. దానితర్వాత ప్రజాస్వామ్యం (democracy), దాని తర్వాత కొద్దిమంది విశిష్ట పౌరుల వ్యవస్థ (aristocracy). అందుచేత సార్వభౌమాధికారం ఒక వ్యక్తి (రాజు)లో కేంద్రీకృతం కావచ్చు. లేక ఒక పార్లమెంటులో కేంద్రీకృతం కావచ్చు.

రాజు సార్వభౌముడైతే అధికార దుర్వినియోగం జరగదా? అతడు చండ శాసనుడు కాడా? కావచ్చు. కాని, ప్రజలు అరాచక స్థితిలో, ప్రాణ భద్రతలేని "సహజస్థితి" లో జీవించడంకంటె రాజరికంలో బ్రతకడమే మేలుకదా అని హాబ్స్ ప్రశ్నిస్తాడు. నిజానికి రాజు పరిపాలకుడైతే ప్రజల కష్టసుఖాలతో తాదాత్మ్యం పొందుతాడు. ప్రజల తాత్కాలి కోద్రేకాలను బట్టికాక, నిజంగా ప్రజలకు ఏది మంచిదో నిర్ణయించి చేస్తాడు. నిపుణుల సలహాలను అడిగి స్వీకరిస్తాడు. ప్రజాస్వామ్యంలో ఇలాంటి సౌకర్యం లేదని హాబ్స్ అభిప్రాయపడ్డాడు.

మొత్తంపై హాబ్స్ రాజరికవాది. అందులోను సార్వభౌమునికి తిరుగులేని సంపూర్ణాధికారం వుండాలనే అతివాది (absolutist). ఇది ఆధునికకాలపు ప్రజాస్వామ్య భావాలకు పూర్తిగా విరుద్ధమైన వాదం. దీన్ని ఈనాడు ఎవరూ అంగీకరించలేరు. అయితే నవీనయుగంలో క్రమక్రమంగా లిబరలిజం, ప్రజాస్వామ్య సిద్ధాంతం పొందిన పరిణామాల చరిత్రలో దాని కొక ప్రముఖ స్థానం వున్నదని మాత్రం చెప్పవచ్చు.



# 19
# తర్కం ద్వారా దేవుడిని నిరూపించిన దే కార్త్

"నేను ఆలోచిస్తున్నాను, కనుక నేను వున్నాను. I think, therefore I am"–

పాశ్చాత్యుల తత్వశాస్త్రంలో ఇది సుప్రసిద్ధమైన వాక్యం.

ఈ వాక్యకారుడు ఫ్రెంచి తత్వవేత్త రీనీ దే కార్త్. (Rene Descartes)

పాశ్చాత్యుల తత్వశాస్త్రాన్ని అతడు సమూలంగా మార్చివేశాడు. కనుకనే అతనికి ఆధునిక తత్వశాస్త్ర జనకుడు (father of modern philosophy) అనే పేరు వచ్చింది.

దే కార్త్ ఒకదానికి కాదు- రెండు వాదాలకు జనకుడు. ఒకటి భావవాదం (idealism), రెండవది భౌతిక వాదం (materialism).

రెండూ పరస్పర విరుద్ధమైనవి. ఒకటి మనస్సు, లేదా ఆత్మ మాత్రమే సత్యం, తక్కినదంతా మిథ్య అంటుంది. రెండవది పదార్థం (matter) మాత్రమే సత్యం, తక్కినదంతా మిథ్య అంటుంది.

భౌతిక వాదులను what is matter? (పదార్థం అంటే ఏమిటి?) అని అడిగితే Never mind (మనస్సు కానిది) అంటారు. భావవాదులను what is mind? (మనస్సు అంటే ఏమిటి?) అని ప్రశ్నిస్తే No matter (పదార్థం కానిది) అని సమాధాన మిస్తారు.

ఈ రెండు విరుద్ధ వాదాలకు ఏకకాలంలో జనకుడు కావడం రీనీ దే కార్త్ తత్వ చింతనలోని విశిష్టత, లేదా బలహీనత. అతడినుంచి ఉద్భుద్ధమైన ఈ రెండు భిన్న వాదాలమధ్య సంఘర్షణ ఈనాటికీ కొనసాగుతున్నది.

దే కార్త్ ఫ్రాన్సులో లా హే అనేచోట 1596 మార్చి 31వ తేదీన ఒక సంపన్న కుటుంబంలో జన్మించాడు. తండ్రి పార్లమెంటరీ న్యాయవాది, న్యాయమూర్తి కూడా. తల్లి దేకార్త్ పుట్టిన కొద్ది రోజులకే మరణించింది. అతడిని ఒక ఆయా పెంచింది. పుట్టడమే రోగిష్టిగా పుట్టాడు. ఎక్కువ కాలం విశ్రాంతిగా గడపాలని డాక్టర్లు సలహా ఇచ్చారు. అందుచేత పగటిపూట కూడా ఎక్కువసేపు పక్కమీద పడుకునే వుండేవాడు.

## చిన్నారి మేధావి

చిన్ననాటినుంచి జ్ఞానార్జనపట్ల విశేషాసక్తి వుండేది. "అదేమిటి? ఇదెందుకు?" అని తండ్రిని ఎప్పుడూ ప్రశ్నిస్తూ వుండేవాడు. తండ్రి ముచ్చటపడేవాడు. "నా చిన్నారి మేధావీ!" (my little philosopher) అని పిలిచేవాడు.

జెసూయిట్ కాలేజీలో ఎనిమిదవ ఏట చేరాడు. లాటిన్, గ్రీకు, ఫ్రెంచి భాషలలో గద్య, పద్యరచనతోపాటు లాజిక్, నీతిశాస్త్రం, ఖగోళశాస్త్రం, తత్వశాస్త్రం, భౌతిక, రసాయనిక శాస్త్రాలు అభ్యసించాడు. ఇంకా సంగీతం, నటన, గుర్రపుస్వారీ, కత్తిసాము నేర్చాడు.

రోగిష్టి కావడంవల్ల అతడు మిగిలిన విద్యార్థులవలె క్లాసులకు టైముకు హాజరు కావాలనే నియమం వుండేది కాదు. ఇంటిలోనే మధ్యాహ్నంవరకు పడుకుని చదువుకునేవాడు. పాఠ్యపుస్తకాలే కాక, సొంతంగా ఎన్నో పుస్తకాలు చదివేవాడు. తోటివారి కంటె పాఠాలలో ఎప్పుడూ ముందుండేవాడు.

కాని, కాలేజీ చదువు సంతృప్తి కలిగించలేదు. ఒక పండితుడు చెప్పిన దాన్ని మరొకడు ఖండించడంతప్ప బూజుపట్టిన పాత పుస్తకాలలో మరేమీలేదనిపించింది. ఏది సత్యం, ఏది అసత్యం అని తెలుసుకోవాలంటే పుస్తక ప్రపంచాన్ని (the world of books) కాక, ప్రపంచ పుస్తకాన్ని (book of the world) చదవాలని భావించాడు. పదహారవ ఏట కాలేజీకి స్వస్తి చెప్పాడు.

పారిస్‌లో కొన్నాళ్లు జులాయిగా తిరిగాడు. మిత్రులతో కలిసి తినడం, తాగడం, జూదం ఆడడం- ఇదీ అతని పని. గణితంలో అబాల్య మేధావి కనుక జూదంలో తరచుగా గెలుస్తూ వుండేవాడట.

క్రమంగా ఆరోగ్యం బాగుపడింది. మనిషి పిడుగులా తయారయ్యాడు. 1618 లో హాలెండ్‌వెళ్లి ప్రిన్స్ ఆఫ్ ఆరెంజ్ సైన్యంలో చేరాడు. ఆ తర్వాత బవేరియన్, హంగేరియన్ సైన్యాలలో పనిచేశాడు. యుద్ధ ప్రియుడు కాదు. కేవలం వ్యాయామంకోసం, ఆరోగ్యాభివృద్ధికోసం సైనిక జీవితం కోరుకున్నాడు. కాని, కొన్నాళ్లకు ఆ జీవితం మొగం మొత్తింది.

## గణిత పాండిత్యం

దేకార్త్ తత్వవేత్త కావడానికి ముందు గణితవేత్త. గణితంలోనే కాదు- ఫిజిక్స్, కెమిస్ట్రీ, శరీరశాస్త్రం, మనస్తత్వశాస్త్రం, ఖగోళశాస్త్రాలలో అతడెన్నో మౌలిక విషయాలు కనుగొన్నాడు. కాని, గణిత శాస్త్రంలో అతడు చేసిన కృషి అన్నిటిలోకి గొప్పది. ముఖ్యంగా బీజగణితాన్ని (అల్జీబ్రా) రేఖా గణితానికి (జ్యామెట్రీ) అన్వయించడంలో అతని ప్రతిభ ద్యోతక మవుతుంది. అతని కృషి ఫలితాన్ని ఎనలిటిక్ జ్యామెట్రీ, లేదా కోఆర్డినేట్ జ్యామెట్రీ అంటారు. అతని పేరు మీదుగా "కార్టీజియన్ సిస్టం" అని కూడా అంటారు.

పాశ్చాత్య తత్వవేత్తలలో గణిత వేత్తలు చాలామంది వున్నారు. పితాగరస్ గురించి మనం ఇంతకుముందే తెలుసుకున్నాము. ప్లేటో కూడా గణితప్రియుడే. అట్టివారిలో దేకార్త్ మరొకడు. నిజానికి అతని తత్వచింతన గణితశాస్త్రం పునాదిపై నిర్మించిన భవ్యభవనం.

గణితశాస్త్రం స్వతస్సిద్ధసత్యాలతో ప్రారంభ మవుతుంది. సరళ సూత్రాలతో ప్రారంభించి, పోనుపోను సంక్లిష్ట సూత్రాలను కనుగొంటాము. ఇది డిడక్టివ్ పద్ధతి. స్వతస్సిద్ధ సత్యాలనుంచి కొత్తవి, మనకు అదివరకు తెలియనివి అయిన ఉన్నత సత్యాలను కనుగొనడమే ఈ సంవిధాన రహస్యం. ఇది బేకన్ "ఇండక్టివ్" పద్ధతికి భిన్నమైనది.

గణితంలో రెండు రెళ్లు నాలుగు అనేది ఒక స్వతస్సిద్ధ సత్యం. త్రిభుజంలో మూడు కోణాల మొత్తం రెండు సమకోణాల మొత్తానికి సమానమనేది మరొక స్వతస్సిద్ధ సత్యం. ఇవి త్రికాలాబాధిత సత్యాలు. తత్వశాస్త్రం కూడా ఇలాంటి స్వతసిద్ధ సత్యాలను కనుగొనగలిగితే ప్రపంచ స్వభావం గురించిన వివిధ వాదాల గందరగోళం తగ్గిపోతుంది. ఈ విశ్వాసంతో దేకార్త్ తత్వాన్వేషణకు ఉపక్రమించాడు.

## ఒకనాటి కల

ఒకనాడు అతనికొక కల వచ్చిందట. చర్చినుంచి పెనుగాలి అతడిని తరిమి వేస్తోంది. ఇంతలో ఒక ఉరుము వినబడింది. చేతిలో తెరిచిన నిఘంటువులో "నేను ఎటువంటి జీవితం గడపాలి?" అనే వాక్యం కనబడింది. ఈ స్వప్నానికి అర్థం ఏమిటని ఆలోచించి, చివరికి తానింతకాలం జులాయిగా తిరగడం పొరపాటైందని, తనను సత్యదేవత పర్జన్య కంఠంతో ప్రబోధిస్తోందని, ఇకపై సత్యాన్వేషణే తన జీవిత లక్ష్యమని ఒక స్థిర నిర్ణయానికి వచ్చాడు.

ఇందుకు ఏకాంతవాసం కావాలి. ఎలా? అప్పటికే అతని పేరు యూరప్‌లో మారుమ్రోగిపోతోంది. ఎక్కడికి వెడితే అక్కడికి మిత్రులు, అభిమానులు మూగేవారు. లాభంలేదని 1628 లో హాలెండ్ వెళ్లాడు. స్థిరపడ్డాడు. అక్కడ ఇరవై ఏళ్లు ఏకాంత జీవితం గడిపాడు. ఆ ఇరవై ఏళ్లలో మిత్రులకు తెలియకుండా వుండడం కోసం 18 సార్లు మకాం మార్చాడు.

ఆ అజ్ఞాత జీవిత కాలంలో ఉద్గ్రంథాలెన్నో రచించాడు. తన 33 వ ఏట "ప్రపంచం" (La Monde) అనే గ్రంథం రచించాడు. దానిలో కోపర్నికస్ సిద్ధాంతాన్ని బలపరిచాడు. భూమి సూర్యుడి చుట్టూ తిరుగుతున్నదని, విశ్వం అనంతమని వ్రాశాడు. కాని, ఇది మత విరుద్ధ సిద్ధాంతం. గలీలియోకు పట్టిన గతే తనకు కూడా పడుతుందని భయపడి ఆ గ్రంథాన్ని ప్రచురించకుండా దాచివేశాడు. అతని మరణానంతరంగాని ఆ గ్రంథంలోని కొన్ని భాగాలు ప్రచురణకు నోచుకోలేదు.

## స్వీడిష్ రాణి ఆహ్వానం

ఇలా వుండగా అతడి కీర్తి విని రాజులు, రాణులు తమ ఆస్థానాలను అలంకరించవలసిందిగా కబురు పంపేవారు. కాని, అతడు వారి ఆహ్వానాలను తిరస్కరించేవాడు. ఒక్క స్వీడన్ రాణి క్రిస్టినా ఆహ్వానాన్ని మాత్రం తిరస్కరించ లేకపోయాడు. ఆమె మహా పట్టుదల మనిషి. రాజ్య వ్యవహారాలలోవలె యుద్ధ విద్యలలో కూడా దిట్ట. స్వీడిష్, ఫ్రెంచ్, ఇటాలియన్, శ్పానిష్, జర్మన్, లాటిన్, గ్రీకు భాషలలో విదుషీమణి. సైన్సులు, అంతకంటె ఎక్కువగా తత్వశాస్త్రం అంటే చెవికోసుకునేది.

తనకు తత్వశాస్త్రం బోధించడానికి రావలసిందిగా ఆమె ఉత్తరాలమీద ఉత్తరాలు గుప్పించింది. స్వీడన్ చలిదేశం. తనకు చలి అసలే పడదు. అయినా ఆమె వొత్తిడిని తట్టుకోలేక దేకార్త్ 1649 చివరలో స్వీడన్ వెళ్లాడు. రాణి

క్రిస్టినా తెల్లవారు ఝామున నాలుగింటికే లేచేది. ఆమెకు పగలంతా రాజ కార్యా లుంటాయి కనుక ఆ టైముకి వెళ్లి చదువు చెప్పాలి. ఇతనికేమో మిట్టమధ్యాహ్నం వరకు పడకపై నుంచి లేచే అలవాటు లేదు.

అయినా రాణిగారి ఆజ్ఞ కనుక తెల్లవారురుఝామున ఎముకలు కొరికే చలిలో గుర్రపు బగ్గీలో వెళ్లి ఆమెకు తత్వశాస్త్ర పాఠాలు చెప్పేవాడు. నాలుగైదు నెలలు గడిచాయి. ఆ చలికి న్యుమోనియా సోకింది. మంచం పట్టాడు. వ్యాధి ముదిరింది. ఆ రోజు 1650 ఫిబ్రవరి 11 వ తేదీ, తెల్లవారురుఝాము...

"టైమెంత?" అని దేకార్త్ అడిగాడు.

"నాలుగైంది" అని పరిచారకుడు సమాధాన మిచ్చాడు

"ఓ. రాణీగారు ఎదురు చూస్తూ వుంటారు. వెళ్లాలి" అని పక్కమీంచి లేవబోయాడు. కాని, వెనక్కి పడిపోయాడు. "అవును. హంస (soul) లేచిపో వడానికి టైమైంది. వెళ్లాలి" అని గొణిగాడు. అంతే. మళ్లీ లేవలేదు.

## ముఖ్య రచనలు

దేకార్త్ రచనలలో ముఖ్యమైనవి రెండు : ఒకటి– "డిస్కోర్స్ ఆన్ మెథడ్" [ప్రక్రియా మీమాంస]. రెండవది– "మెడిటేషన్స్" [భావస్రవంతి]. వీటిలో అతడు తన నూతన తాత్వికచింతన అంతా పొందుపరిచాడు.

జ్ఞానం ఎలా లభిస్తుంది? అని ప్రశ్న వేసుకుని సందేహం ద్వారానే లభి స్తుందని దేకార్త్ సమాధానం చెప్పాడు. దీనికే తత్వశాస్త్రంలో "కార్టీజియన్ డౌట్" అని పేరు.

జ్ఞానం అంటే పుస్తకాలు చదివితే వచ్చే విజ్ఞానమని కాదు. పుస్తకాలలో ఇతరుల అభిప్రాయా లుంటాయి. అవి నిజమో కాదో, ఎలా తెలుస్తుంది? ఎవరో చెప్పారని దేన్నీ నమ్మకూడదు. స్వయంగా తర్కించి నిగ్గు తేల్చుకోవాలి.

అసలు సిసలైన సత్యాన్ని ఆవిష్కరించేదే నిజమైన జ్ఞానం. సత్యం ఎలా వుంటుంది? ఏదైనాసరే నూటికి నూరుపాళ్లు తిరుగులేని నిజం అనిపిం చాలి. నాకు నేను స్పష్టంగా (clearly), విశదంగా (distinctly)దర్శించగలిగినదే యాథార్థ్యం (reality) అవుతుంది. ఏమాత్రం అనుమానం ఉన్నా అది సత్యం కాజాలదు. సత్యం స్వతస్సిద్ధమైనది (self- evident) గా వుండాలి. దానికదే రుజువుతప్ప, మరొకటి ఏదీ దాన్ని రుజువు చేయనక్కరలేనిదై వుండాలి.

## సందేహంనుంచి సత్యం

ఇందుకోసం ప్రతి విషయాన్ని సందేహించాలి. సందేహమే సత్యాన్వేషణకు సరైన సాధనం. అది చేతపుచ్చుకుని భౌతిక, పారభౌతిక తత్వ ప్రపంచంలో అడుగుపెట్టాలి. పూర్వులెవరో చెప్పారని దేన్నీ నమ్మరాదు. మనః కవాటాలు పూర్తిగా తెరిచి వుంచాలి. మన ఆలోచనలు ఎక్కడికి తీసుకువెడితే అక్కడికి నిర్భయంగా వెళ్లాలి. ఏది స్పష్టంగా, విశదంగా కనిపిస్తుందో అది మాత్రమే సత్యమని గ్రహించాలి.

ఉదాహరణకు— ఈ బాహ్య ప్రపంచం నిజంగా వున్నదా? నా దైనందిన జీవితం నిజమైనదేనా? అసలు నా శరీరం యథార్థంగా వున్నదా? ఏమో, చెప్పలేము. నాకు అనేక భావాలు వస్తాయి. అవన్నీ నిజమైనవేనా? ఏమో కాకపోవచ్చు.

నే నిప్పుడు ఇక్కడ కూర్చుని ఎదురుగా కొన్ని వస్తువులను చూస్తున్నాను. అవి నిజమని, వాటిని నేను చూడడం నిజమని ఎలా చెప్పగలను? ఎందుకంటే కలలు వస్తాయి. కలలో ఇవే వస్తువులు చూస్తాము.ఇవే పనులు చేస్తాము. ఇవే భావాలు భావిస్తాము. కాని, అవన్నీ నిజం కావు కదా? అలాగే, మేలుకున్నప్పుడు మనం చూసేవి, చేసేవి, భావించేవి కూడా నిజం కావేమో. ఈ జాగ్రత్ప్రపంచం కూడా స్వప్న ప్రపంచం వంటిదేనేమో.

అయితే, స్వప్నంలో చూసేవి నిజం కాకపోయినా, స్వప్నం రావడం నిజం. అలాగే భౌతిక ప్రపంచం నిజం కాకపోయినా, దాన్ని గురించి నేను భావించడం నిజం. మన ఆలోచనలలో సత్యం వున్నా లేకపోయినా, ఆలోచించడం మటుకు నిజం. అది కూడా నిజం కాదని సందేహించవచ్చు ననుకోండి. కాని, సందేహించడం కూడా ఆలోచనలో భాగమే. కనుక ఆలోచన వున్నది; ఆలోచించడం వున్నది; ఆలోచించే మనస్సు వుంది; అంటే నేనున్నాను.

"నేను ఆలోచిస్తున్నాను కనుక నేను వున్నాను."

"I think therefore I am"

దీన్నే దేకార్త్ లాటిన్‌లో (cogito, ergo sum–) అన్నాడు.

## ఎవరు నేను? కోహం?

నే నెవర్ని? నేను సందేహించే వస్తువును. ఆలోచించే వస్తువును. అంటే, మనస్సును. నాకు శరీరం లేకపోయినా, మనస్సు లేకపోవడం జరగదు. ఎందు

కంటే మనస్సు వుందా లేదా అని సందేహించేది కూడా మనస్సే. అది లేకపోతే సందేహమే లేదు. నేను లేకపోతే 'లేను' అనే ఆలోచనే కలగదు. కనుక నేను స్పష్టంగా, విశదంగా వున్నాను. అంటే సందేహంతో బయలుదేరి సందేహాతీతమైన ఒక స్వతస్సిద్ధమైన సత్యాన్ని దేకార్త్ కనుగొనడం జరిగింది.

సరే—ఇంత స్పష్టమైన, విశదమైన సత్యాలు ఇంకా ఏమైనా ఉన్నాయా? ఉన్నాయి. ఒకటి-దేవుడు. రెండవది- నా శరీరం; అంటే భౌతిక ప్రపంచం.

దేవు డున్నాడని ఎలా నిరూపించగలము?

నేను దేన్ని అయితే స్పష్టంగా, విశదంగా తెలుసుకో గలుగుతానో అది—అ దొక్కటే— నిస్సందేహంగా, నిజంగా వున్నది. తక్కినవన్నీ సందేహ బాధితాలే.

కాని, నేను వున్నానని సందేహాతీతంగా తేలిపోయినప్పటికి నన్ను సందేహం పీడవలె వెన్నాడుతూనే వుందే? నా ప్రతిభావం సందేహబాధితమే అవుతు న్నదే? అంటే నా అస్తిత్వం పరిపూర్ణం, నిర్దుష్టం (perfect) కాదన్నమాట. కాని నా అస్తిత్వం నిర్దుష్టం కాదంటే, నిర్దుష్టమైనది, పరిపూర్ణమైనది, సందే హంవల్ల అబాధితమైనది వేరే ఏదో వుందన్న మాటే కదా? అదే దేవుడు.

## దేవుడు అంటే?

దేవుడు అంటే ఏమిటి? ఆయన సత్య స్వరూపుడు. పరిపూర్ణతామూర్తి (perfection). సందేహం, అనిశ్చితి, అస్థిరత, అశాశ్వతత్వం, విషాదం, క్రోధం, ద్వేషం-ఇలాంటివి ఏవీ ఆయనను బాధించవు. ఇవన్నీ మానవ లక్షణాలు. కనుకనే ఇవి మనల్ని బాధిస్తాయి. ఇవి దోషాలు (imperfections). ఇవి దోషా లని నేను తెలుసుకోగలుగుతున్నానంటే, ఇవి లేని దివ్యమూర్తి వేరే వుండి వుండాలి. అతడు పరిపూర్ణుడు, అనంతుడు, అనశ్వరుడు, సర్వ స్వతంత్రుడు, సర్వవ్యాపి, సర్వశక్తి సమన్వితుడు. అతడు వుండే వుండాలి. లేకపోతే ఈ యీ లక్షణాలతో కూడిన దైవభావం నాకెలా స్ఫురిస్తుంది? దైవమే నాలో దైవభావాన్ని ప్రవేశపెట్టి వుండాలి. కనుకనే దైవం వున్నాడనే భావం నాకు స్పష్టంగా, విశదంగా కనిపిస్తున్నది.

దైవభావం (అంటే పరిపూర్ణతాభావం) నాలో స్వతస్సిద్ధంగా వున్నది. అది ఎలా కలుగుతున్నది? శూన్యంనుంచి ఏదీ రాదు. ప్రతిదానికి ఏదో కారణం వుంటుంది. కనుక నాలో కలిగిన దైవభావానికి కూడా కారణం ఏదో వుండి వుండాలి. అట్టి కారణమే దైవం.

పైగా కార్యం (effect) లో ఎంత సత్యం వున్నదో, కనీసం అంతే సత్యం

కారణం (cause) లో వుండాలి. ఇక్కడ దైవభావం కార్యం (effect) కాగా, దైవం కారణం (cause). నాలో దైవభావం నిశ్చయంగా, నిజంగా ఏర్పడివుంది కనుక దానికి కారణమైన దైవం కూడా అంతే నిశ్చయంగా, నిజంగా వుండి వుండాలి.

## దైవం, దైవభావం

అయితే దైవం వున్నాడనే భావాన్ని నాకు నేనుగా కల్పించుకున్నానేమో నని మీరు సందేహించవచ్చు. కాని, అది కుదరదు. తక్కువ యథార్థమైన వస్తువు తన కంటె ఎక్కువ యథార్థమైన వస్తువుకు కారణం కాజాలదు. దైవం వున్నాడని నాలో ఏర్పడిన భావం దైవం వుండడంకంటె ఎక్కువ యథార్థం కాదు. కనుక, నాలోని దైవభావం దైవానికి కారణం కాజాలదు. దైవం (God) వుంటేనే దైవభావం (idea of God) కలుగుతుంది తప్ప, దైవభావం వుండ డంవల్ల దైవం వుండడం జరగనేరదు.

దైవం అంటే ఏమిటి? నిర్దుష్టతా స్వరూపం (perfection). మరి నేనో? దోషపూరితుడిని. కనుక నేను దైవాన్ని కల్పించడం జరగదు. దైవానికి నేను కారణం కాజాలను. అందుచేత దేవుడున్నాడని స్పష్టమవుతున్నది. (కనీసం దేకార్త్ ఈ విధమైన తర్కం ద్వారా దైవాన్ని నిరూపించేశానని సంతృప్తిప డ్డాడు.)

## భౌతిక ప్రపంచం

ఇకపోతే, భౌతిక ప్రపంచం సంగతి చూద్దాము. భౌతిక ప్రపంచం వున్నదా? భౌతిక ప్రపంచంలో భాగమే నా శరీరం. ఎందుకంటే అది కూడా భౌతిక పదార్థ నిర్మితమే. దాన్ని ఎలా నిరూపించడం? అది మాయ (illusion) కావచ్చు కదా?

ఎందుకంటే బాహ్య ప్రపంచం గురించిన ఎరుక మనకు జ్ఞానేంద్రియాల ద్వారా లభిస్తున్నది. కాని, మన జ్ఞానేంద్రియాలు నిజానికి అజ్ఞానేంద్రియాలు కావచ్చు. మనకు సంవేదనలు (Sensations) కలుగుతాయి. అవి భ్రమలు కావచ్చు. కోరికలు కలుగుతాయి. అవి వట్టి మిథ్యాచకోరికలుకావచ్చు; మనల్ని అవి పెడదారి పట్టించవచ్చు. కనుక బాహ్య ప్రపంచం గురించి పంచేంద్రియాల ద్వారా మనకు లభించే జ్ఞానం నిజమైంది కాకపోవచ్చు.

అయినప్పటికి బాహ్య, భౌతిక ప్రపంచం నిజంగా వున్నదనే భావం మనలో

గాఢంగా, దృఢంగా పాదుకొని వున్నది. దేవుడే మనలో ఆ నిశ్చయ, నిర్దిష్టభావం ప్రవేశపెట్టి వుండాలి. బాహ్య జగత్తు నిజంగా లేకపోతే అలాంటి భావాన్ని ఆయన ఎందుకు ప్రవేశపెడతాడు? ప్రవేశపెడితే ఆయన మోసగాడు అవుతాడు కదా? కాని ఆయన పరిపూర్ణుడు. మోసం చేయడం ఆయన స్వభావం కానేరదు. కనుక బాహ్య జగత్తు నిజంగా వున్నది. మనకు ఇంద్రియానుభవజ్ఞానం నిజమైన బాహ్యజగత్తువల్లనే కలుగుతున్నది.

అయితే, మరి మనకి అప్పుడప్పుడు భ్రమ ఎందుకు కలుగుతుంది? మన జ్ఞానేంద్రియాలు మనల్ని ఎందుకు మోసగిస్తూ వుంటాయి?

దేవుడు మనకు మన పొరపాట్లను దిద్దుకునే శక్తి కూడా ఇచ్చాడు. మనకు గల అవగాహన శక్తి (power of understanding - reason) పరిమితం. కాని నిర్ణయ స్వేచ్ఛ (Free will) అనవధికం. అంటే ఒక విషయం గురించి వాస్తవం బదులు అవాస్తవాన్ని, మంచిని బదులు చెడును ఎంచుకునే శక్తి మనకు సంపూర్ణంగా వుంది. ఆ నిర్ణయ స్వేచ్ఛాశక్తిని నిగ్రహించుకుని, దాన్ని మన అవగాహన శక్తికి లొంగివుండేటట్టు చేయడంలో మన వైఫల్యంవల్లనే మన ఇంద్రియానుభవాలు మనల్ని మోసం చేస్తూ వుంటాయి. కాని, అదే సమయంలో పొరపాట్లను సరిదిద్దుకుని సత్యాన్వేషణ యాత్రలో ముందుకు సాగిపోయే శక్తిని కూడా దేవుడు మన కిచ్చాడు.

## మనస్సు, శరీరం

పోతే- మనస్సు, శరీరం వేరు వేరు అని దేకార్త్ భావించాడు. వాటికి పరస్పర సంబంధం లేదు. దేని పని అది చేసుకుపోతుంది. శరీరంపై మనస్సుగాని, మనస్సుపై శరీరంగాని పనిచేయవు. దీన్ని ద్విసత్తావాదం (dualism) అంటారు.

శరీరం భౌతిక వస్తువు. అది యంత్రం లాంటిది. యంత్రానికిగల లక్షణాలన్నీ శరీరానికి వున్నాయి. భౌతిక వస్తువు లక్షణాలు ఏమిటి? రంగు, రుచి, వాసన, ధ్వని మొదలైనవి బాహ్యవస్తువులో స్వతస్సిద్ధంగా లేవు. అవి బాహ్య వస్తువు జ్ఞానేంద్రియాల ద్వారా మనలో కలిగించే సంవేదనలు మాత్రమే. బాహ్య వస్తువుకు గల ఏకైక స్వతస్సిద్ధ లక్షణం విస్తృతి (extension). అంటే వస్తువు పొడుగు, వెడల్పు, మందం. ఇవి తప్ప వస్తువుకు మరే లక్షణాలు లేవు.

కాని, మనస్సు వేరు. మనస్సుకు విస్తృతి లేదు. అది స్థలాన్ని (space) ఆక్రమించదు. మనస్సు లక్షణం ఆలోచించడం. ఆలోచనకు స్థల విస్తృతితో

నిమిత్తం లేదు. అందుచేత మనస్సు, శరీరం పూర్తిగా భిన్నమైనవి. ఒకదానిలో ఒకటి ఎట్టి మార్పులు తీసుకురాలేవు.

## రెండు గడియారాలు

అయితే, దేహానికి బాధ కలిగితే అది మనస్సుకు ఎలా తెలుస్తున్నది? అంటే- దేహం, మనస్సు రెండూ రెండు గడియారాల వంటివి. ఒకటి ఒక టైము చూపిస్తోం దనుకోండి. అదే టైముకు రెండవది గంట కొడుతుం దనుకోండి. అదే విధంగా పరస్పర సంబంధం లేకపోయినా పరస్పర సమన్వయంతో పని చేసేటట్టు మనస్సును, శరీరాన్ని దేవుడు ఏర్పాటు చేశాడని దేకార్త్ అను యాయులైన "ఏక సమయవాదులు" (Occasionalists) ప్రతిపాదించారు.

తన బాల్యంలో నేర్చిన దైవశాస్త్ర (theology) ప్రభావం, పెద్దయిన తర్వాత తెలుసుకున్న గలీలియో మొదలైన వారి భౌతికశాస్త్ర పరిశోధనల ప్రభావం రెండూ దేకార్త్‌లో మిళితమైనాయి. కనుకనే, అతడు మనస్సువేరు, దేహంవేరు అనే ద్విసత్తా వాదాన్ని ప్రతిపాదించాడు. దేహానికి మనస్సుతో సంబంధంలేదని చెప్పడంవల్ల అతడు తన కాలంలో జరుగుతున్న భౌతిక విజ్ఞాన శాస్త్రాల పురోగతిని పూర్తిగా సమర్థించడానికి వీలుకలిగింది. మరొకప్రక్క మనస్సుకు భౌతిక వస్తువులతో, శరీరంతో సంబంధం లేదనడంవల్ల భావవాదాన్ని సమర్థించడానికి కూడా వీలుకలిగింది. ఈ విధంగా అతడు ఒకేసారిగా రెండు విరుద్ధవాదాలకు కారకుడయ్యాడు.



# 20
# ఉదాత్త జీవితం గడిపిన స్పినోజా

ఈశావాస్య మిదమ్ సర్వమ్
యత్కించ జగత్యామ్ జగత్
తేన త్యక్తేన భుంజీథాః
మాగృధః కస్యస్విద్ధనమ్

ఇది ఈశావాస్యోపనిషత్తులోని మొదటి శ్లోకం.

"సర్వజగత్తు ఈశావాస్యమై వుంది. అందులోని ప్రతి చిన్నభాగం ఈశ్వరుని చేత ఆవరింపబడి వుంది. దాన్ని త్యాగబుద్ధితో అనుభవించాలి. అన్యుల ధనాన్ని ఆశించవద్దు."

పాశ్చాత్య దార్శనికులలో అంతటి సుశ్లోకుడు, ప్రేమాస్పదుడు మరొకడు లేడని వినుతికెక్కిన బరూచ్ స్పినోజాను స్మరిస్తే పై శ్లోకం జ్ఞాపకం వస్తుంది.

జగమంతా ఈశ్వర మయమన్నది స్పినోజా తత్వ చింతన సారాంశం.

జగత్తును నిష్కామంగా అనుభవించాలని, పరుల సొమ్మును ఆశించరాదన్నది స్పినోజా జీవిత కథా సారాంశం.

స్పినోజా జీవితం, తత్వచింతన రెండూ అసాధారణమైనవే, అద్భుతమైనవే. అంతగా సమకాలికుల నిరాదరణకు లోనైన వ్యక్తి, అంతగా అనంతర తరాలవారికి ప్రేమాస్పదుడైన వ్యక్తి మరొకడు లేడు.

## అసహనం

జన్మతః యూదుడు. కాని, యూదు సంఘం అతడిని వెలివేసింది. క్రైస్తవులు అతడిని దగ్గరికి రానివ్వలేదు. అతని చింతనా సమస్తం ఈశ్వరభావగ్రస్తం. అయినా, సమకాలికులు అతడిని నాస్తికుడుగా పరిగణించారు. అతని ముఖ్య రచనలలో ఏ ఒక్కటీ అతని జీవిత కాలంలో ప్రచురణకు నోచుకోలేదు. లేదా మారుపేరుతో ప్రచురించవలసి వచ్చింది.

తల్లిదండ్రులు పోర్చుగీసువారు. ఆ రోజులలో ఐబీరియన్ ద్వీపకల్పంలో యూదుల పట్ల విపరీతమైన అసహనం వుండేది. ప్రాణహాని శంకించి పెక్కుమంది యూదులు స్పెయిన్‌నుంచి హాలెండు పారిపోయారు. అప్పటిలో యూరప్‌లోకెల్లా హాలెండ్‌లో మాత్రమే మత స్వేచ్ఛ, భావస్వేచ్ఛ వుండేవి.

స్పినోజా తల్లిదండ్రులు కూడా స్పెయిన్‌నుంచి హాలెండు పారిపోయి వచ్చారు. ఆమ్‌స్టర్‌డాంలో 1632 నవంబరు 24 వ తేదీన బరూచ్ స్పినోజా జన్మించాడు. అతని తండ్రి వర్తకుడు. బాగా డబ్బు గడించాడు. తల్లి బరూచ్ ఆరవఏట మృతిచెందింది.

కుమారునికి తండ్రి మంచి చదువు చెప్పించాడు. యూదులకు పవిత్ర గ్రంథమైన ఓల్డ్ టెస్టమెంట్, మత గ్రంథమైన టాల్మడ్ క్షుణ్ణంగా చదివాడు. యూదు తత్వవేత్తల గ్రంథాలు పఠించాడు. గణితం, విజ్ఞానశాస్త్రాలు అధ్యయనం చేశాడు. వాన్‌డెన్ ఎండ్ అనే డచ్చి ఆచార్యుని వద్ద లాటిన్ అభ్యసించాడు. ప్లేటో, అరిస్టాటిల్, డెమొక్రిటస్, ఎపిక్యురస్ వంటి గ్రీకు తత్వవేత్తల సిద్ధాంతాలను ఆకళించుకున్నాడు. బ్రూనో మత వ్యతిరేకతత్వాన్ని జీర్ణించుకున్నాడు. దే కార్త్ బౌద్ధిక వాదాన్ని (rationalism) తాను అవలంబించాడు.

## బా ల్య ద శ

ఒక వ్యవస్థగా మతంపట్ల స్పినోజాకు చిన్ననాడే నమ్మకం పోయింది. అప్పటికి అతనికి ఎనిమిదేళ్లు. యూరియల్ అకోస్టా అనే యూదు సంశయవాది (స్కెప్టిక్)ని అతని మత వ్యతిరేక భావాలకు కినిసి యూదు సంఘం (సినగాగ్) బహిరంగంగా పరాభవించింది. అవమానబాధ భరించలేక అకోస్టా ఇంటికి

వెళ్లి ఆత్మహత్య చేసుకున్నాడు. మతానికి సంబంధించిన అభిప్రాయభేదాలను సహించలేని సమాజం మతంపేరిట ఒక వ్యక్తిని అలా కాల్చుకు తినడం స్పినోజా లేతమనసును కలచివేసింది. ఏ మతానికి కట్టుబడకుండా సత్యాన్వేషణ ఎందుకు చేయరాదో అతనికి బోధపడలేదు.

స్పినోజా గురువైన వాన్‌డెన్ ఎండ్‌ను ఫ్రెంచి సార్వభౌముడు 14 వ లూయీ ఉరితీశాడు. అదికూడా స్పినోజాలో మత వ్యతిరేకతకు ప్రోదిచేసి వుండ వచ్చు. వాన్‌డెన్ ఎండ్‌కు ఒక కుమార్తె వుండేది. ఆమెను స్పినోజా ప్రేమించాడు; పెళ్లి చేసుకోగోరాడు. కాని, అతడు యూదు జాతీయుడని, పేదవాడని ఆమె తిరస్కరించింది. అతనికంటె ధనికుడైన మరొకడిని ఆమె పెళ్లాడింది. స్పినోజా యావజ్జీవ బ్రహ్మచారిగానే వుండిపోయాడు. ప్రేమ తత్వాన్ని వదిలిపెట్టి తత్వప్రేమలో పడ్డాడు.

## సంఘ బహిష్కారం

ఈలోగా స్పినోజా బైబిల్ గురించి, టాల్మడ్ గురించి వాటిలో వర్ణించిన దేవుడిని గురించి నిరసనగా తోటి విద్యార్థులవద్ద మాట్లాడుతున్నాడని యూదు సంఘం పెద్దల చెవిన పడింది. అతని కుశాగ్రబుద్ధి పట్ల వారికెంతో అభిమానం. తమ సంఘోద్ధారకుడు కాగలడని వారు ఆశలు పెట్టుకున్నారు. అతడి నెలాగైనా దారికి తీసుకురావాలని తలపోసి, అతడు తన మత వ్యతిరేక భావాలను విడనాడితే అయిదువందల డాలర్లు బహూకరించగలమని ఆశపెట్టారు.

కాని, ధనార్జనకంటె సత్యాన్వేషణ గొప్పదని నమ్మిన స్పినోజా పెద్దలివ్వజూపిన ధనాన్ని తృణప్రాయంగా తిరస్కరించాడు. పెద్దలు ఆగ్రహించి అతడిని తమ సంఘం (సినగాగ్) నుంచి బహిష్కరించారు. అతనితో ఎవరూ మాట్లాడరాదు, కలసి తిరగరాదు, అతడు చెప్పింది వినరాదు, అతడు వ్రాసింది చదవరాదు— అని తీవ్ర దూషణ పదజాలంతో బహిష్కారపత్రం జారీ చేశారు. అప్పటికి స్పినోజాకు ఇరవై నాలుగేళ్లు. నాటినుంచి అతడు భౌతిక ప్రపంచంలో ఏకాకి అయ్యాడు. ఆలోచనా ప్రపంచంలో జీవించ సాగాడు.

తండ్రి మరణానంతరం స్పినోజాకు న్యాయంగా రావలసిన ఆస్తిని సోదరి కాజేయడానికి ప్రయత్నించింది. స్పినోజా కోర్టులో దావావేశాడు. గెలిచాడు. ఆస్తి చేతికి వచ్చింది. అప్పుడు దాన్ని పూర్తిగా సోదరికి వ్రాసి ఇచ్చాడు. అతడు దావావేసింది తండ్రి ఆస్తి దక్కించుకొనడానికి కాదు. న్యాయం తన పక్షాన కలదని నిరూపించడానికే. అది స్వాధీనమైన తర్వాత దాన్ని త్యజించాడు.

## ఏకాకి జీవితం

కాని, భుక్తి గడవాలికదా? జీవికకోసం కళ్లద్దాలు, టెలిస్కోపు లెన్సులు

పాలిష్ చేసే వృత్తిని స్వీకరించాడు. అజ్ఞాతంగా, నిరాడంబరంగా జీవిస్తూ దైవ తత్వం గురించి, విశ్వ సత్యం గురించి ధ్యాన ప్రవంతిలో మునిగిపోయేవాడు. తాను కనుగొన్న సత్యాలను గురించి రచన తర్వాత రచన చేస్తూపోయాడు.

అమ్‌స్టర్‌డాంనుంచి మకాం మార్చాడు. పేరు కూడా మార్చాడు. బరూచ్ అంటే ధన్యుడని అర్థం. దాన్ని లాటినైజ్‌చేసి బెనెడిక్టస్ అని పేరు పెట్టుకున్నాడు. లేడెన్ నగర సమీపంలోని రైన్స్‌బర్గ్‌లో 1660 నుంచి మూడేళ్లు నివసించాడు. ఆ తర్వాత 1663 లో హేగ్ నగరం శివారు గ్రామానికి, మరికొద్ది కాలానికి హేగ్ నగరానికి మారాడు. పధ్నాలుగేళ్లపాటు– జీవితాంతంవరకు అక్కడే నివసించాడు.

ఎక్కడ వున్నా ఒక్కటే గది. అక్కడే బస, చదువు, భోజనం, పడక, రచన, లెన్సులు పాలిష్ చేసే వృత్తి. అత్యవసరమైతే తప్ప బయటికి వెళ్లేవాడు కాడు. పెద్దగా స్నేహితులని చెప్పుకో దగినవారు లేరు. ఏకాంతమే ఏకైక మిత్రం.

అతని కీర్తిమాత్రం దేశదేశాల వ్యాపించింది. కొందరు అతనికి గాఢాభి మాను లయ్యారు. వారిలో బ్రిటిష్ రాయల్ సొసైటీ కార్యదర్శి హెన్రీ ఓల్డెన్‌బర్గ్ ఒకడు; జర్మన్ తత్వవేత్త లైబ్నిజ్ మరొకడు. కాంతి అనేది కణసముదాయం కాదని అది తరంగాలుగా ప్రయాణం చేస్తుందని కనుగొన్న డచ్చి శాస్త్రవేత్త హైజిన్స్ వేరొకడు.. వీరు స్పినోజాను అప్పుడప్పుడు వచ్చి పరామర్శించి పోతూవుండేవారు.

## ధనంపట్ల అనాసక్తి

అందరిలోకి గాఢాభిమాని డచ్చి వ్యాపారస్తుడు, ధనికుడు అయిన సైమన్ డిఫ్రీస్. స్పినోజాను అతడు ప్రాణాధికంగా అభిమానించాడు. అతడిని నలుగురిలోకి తీసుకురావాలని ప్రయత్నించాడు. కాని, స్పినోజా సమ్మతించలేదు. అతని పేదరికం చూడలేక ఒకసారి వెయ్యి డాలర్లు ఇవ్వజూపాడు. స్పినోజా మర్యాదగానే తిరస్కరించాడు. మరికొన్నాళ్లకు తన ఆస్తి అంతా అతని పేర వ్రాశాడు. స్పినోజా తిరిగి తిరస్కరించాడు. ఈశావాస్యోపనిషత్తు చెప్పినట్టు "మా గృధః కస్యస్విద్ధనమ్" (అన్యుల ధనాన్ని ఆశించవద్దు) అన్నది అతని జీవిత సూత్రం. కాని, డి వ్రీస్ వూరుకోలేదు. ఏటా అయిదువందల డాలర్లు వచ్చేటట్టుగా స్పినోజా పేర వీలునామా వ్రాశాడు. స్పినోజా మళ్లీ నిరాకరించాడు. కాని వారూ, వీరూ బలవంతం చేయగా, చేయగా అయిదు వందలు అక్కరలేదు, సగం చాలు-అని 250 డాలర్లు మాత్రం స్వీకరించాడు.

స్పినోజా తత్వకీర్తి 14వ లూయీవరకుప్రాకింది. తనకొక గ్రంథం అంకితమిస్తే మంచిపింఛను ఏర్పాటు చేస్తానన్నాడు. కాని, "ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు, వాహనంబులున్ సొమ్ములు కొన్ని పుచ్చుకుని చొక్కి శరీరమువాసి, కాలుచే సమ్మెట పోటులన్" తినడందేని కనుకున్నాడేమో అక్కరలేదుపొమ్మన్నాడు.

హైడెల్‌బర్గ్ విశ్వవిద్యాలయం వారు 1673 లో తత్వ శాస్త్రాధ్యాపకుడుగా మంచి ఉద్యోగ మిస్తామని ఆహ్వానించారు. అది నిజానికి అతనికి తగిన ఉద్యోగం. తత్వచింతనకు, బోధనకు అది మహదవకాశం. కాని, మతాన్ని మరీ గట్టిగా విమర్శించ వద్దన్న షరతును జోడించడంతో ఆ ఉద్యోగాన్ని కూడా స్పినోజా తిరస్కరించాడు. సత్యాన్ని నిరాకరించి ధనార్జన చేయడంకంటె ధనాన్ని తిరస్కరించి సత్యార్జన చేయడమే మంచిదని మొగమాటం లేకుండా చెప్పాడు.

## వ్యాధి గ్రస్తత

స్పినోజా వృత్తి అద్దాలు పాలిష్ చేయడం కదా? ఏళ్లతరబడి ఆ వృత్తి చేయడంతో సన్నని గాజుధూళి ఊపిరితిత్తులలో చొరబడి క్షయవ్యాధి సోకింది. క్రమంగా వ్యాధి ముదిరింది. మనిషి క్షీణించిపోసాగాడు. అయినా బాధను బయటికి కనబరచేవాడు కాడు. ఎంత జబ్బుగావున్నా, ఆయాసంగావున్నా మామూలుగా వున్నట్టే నటించేవాడు. చివరికి 1677 ఫిబ్రవరి 22వ తేదీ ఆదివారం నాడు అతనికి ఎన్నో ఏళ్లుగా ఆతిథ్యం, ఆశ్రయం ఇచ్చి ఆదుకున్న దంపతులు చర్చికి వెళ్లిన సమయంలో– అంతిమ శ్వాస విడిచాడు.

స్పినోజా జీవితకాలంలో అతని ముఖ్య రచనలేవీ ప్రచురణ కాలేదు. ప్రచురించాలని అతనికి వుండేదికాని, వాటిలో మత విశ్వాసాలకు భిన్నమైన అంశాలుండడంవల్ల తనకు కూడా గియర్డానో బ్రూనో, గలీలియోలకు పట్టిన గతి పట్టవచ్చునని అతడు శంకించాడు. మత విరుద్ధ భావాలకు బ్రూనోను 1600 లో సజీవ దహనం చేశారు. విశ్వకేంద్రం భూమి కాదని, అది సూర్యుని చుట్టూ తిరిగే గ్రహమని కొపర్నికస్ సిద్ధాంతాలను బలపరచినందుకు గలీలియోకు కారాగార శిక్ష విధించారు. ఏమైనా స్పినోజా చనిపోయిన తర్వాతనే అతని రచనలు ప్రచురణకు నోచుకున్నాయి.

స్పినోజా గ్రంథాలలో ముఖ్యమైనది లాటిన్‌లో వ్రాసిన "ఎథికా". అంటే నీతిశాస్త్రం (ఎథిక్స్). ఆ రోజులలో యూరప్‌లో ఏ దేశానికి చెందిన వారైనా లాటిన్‌లోనే తత్వ రచన చేసేవారు. మనకు పూర్వకాలంలో సంస్కృతంవలె

ఆ నాటి యూరోపియన్‌లకు లాటిన్ తత్వ శాస్త్ర భాష. విజ్ఞాన శాస్త్రాల భాష.

### యూక్లిడ్ పద్ధతి

గణితశాస్త్రం ఎంత ఖచ్చితంగా వుంటుందో తత్వశాస్త్రం కూడా అంత ఖచ్చితంగా వుండాలని దేకార్త్ నిర్దేశించాడు కదా? ఆ ఒరవడినే స్పినోజా అనుసరించాడు. యూక్లిడ్ రేఖా గణిత పద్ధతిని అవలంబించి "ఎథిక్స్" గ్రంథాన్ని వ్రాశాడు. ఇది బేకన్ ఇండక్టివ్ పద్ధతికి భిన్నమైన డిడక్టివ్ పద్ధతి. కొన్ని స్వతస్సిద్ధమైన సూత్రాలు, నిర్వచనాలు తీసుకుని వాటి పునాదిపై తన సిద్ధాంత సౌధాన్ని స్పినోజా నిర్మించాడు.

తన ఇతర గ్రంథాలలో స్పినోజా దైవశాస్త్రాన్ని (Theolgy). రాజకీయ శాస్త్రాన్ని (Politics) కూడా చర్చించాడు. రాజకీయ సిద్ధాంతానికి సంబంధించినంతవరకు అతడు హాబ్స్‌ను అనుసరించాడు. ఆదిమకాలంలో మానవులు సహజస్థితి (State of nature) లో వుండేవారు. ఆ స్థితిలో ధర్మా ధర్మ విభజన, న్యాయశాసనం లేదు. చట్టంలేదు కనుక చట్టాన్ని ధిక్కరించడమన్న ప్రశ్న లేదు. సార్వభౌముడు తప్పు చేయడని, అతనికి చర్చి లొంగివుండాలని స్పినోజా కూడా భావించాడు. అయితే రాజరికం కంటె ప్రజాస్వామ్యమే మేలైనదని, ప్రజలు తమ అన్ని హక్కులు ప్రభుత్వానికి దఖలుపరచ నక్కరలేదని, ప్రజలకు ముఖ్యంగా అభిప్రాయస్వేచ్ఛ వుండాలని అతడు విశ్వసించాడు.

ఇక, స్పినోజా తత్వ సిద్ధాంతాలు చూద్దాము.

## స్పినోజా : దైవతత్వ మధుపాన మత్తుడు

స్పినోజా తత్వచింతనలో తరుచుగా తటస్థపడే ఒక మాట "దేవుడు". ఒక వ్యాఖ్యాత అతడిని "దైవతత్వ మధుపాన మత్తుడు" (God - intoxicated Philosopher) గా పేర్కొన్నాడు.

అయినా, సమకాలికుల్లో పలువురు అతడిని నాస్తికుడుగానే పరిగణించారు. యూదు సంఘం వెలివేయగా, చర్చి బెదిరించింది. కొందరు దూషిస్తూ ఉత్తరాలు వ్రాసేవారు. వాటిలో ఒక మచ్చుతునక : "ఏదో గొప్ప సిద్ధాంతం కనిపెట్టానంటున్నావు. అది గొప్పదని నీకెలా తెలుసు? పూర్వకాలంలోను, ఇప్పుడూ వచ్చిన తత్వ సిద్ధాంతాలన్నీ పరిశీలించావా? ఇక్కడా, ఇండియాలోను, ప్రపంచమంతటా వచ్చిన సిద్ధాంతాలన్నీ నీకు తెలుసా?... నీవు నీచుడివి, పురు

గువి, బూడిదవి. నిన్ను పుంగులు తినేస్తాయి. శాశ్వత జ్ఞానాన్ని నీ చెత్త సిద్ధాంతంతో కాదనడానికి నీకెన్ని గుండెలు...?"

సమకాలికుల ఈ అపోహకు కారణం స్పినోజా ఏ మత వ్యవస్థను అంగీకరించకపోవడమే. ముఖ్యంగా సాధారణ మతాలు చెప్పే దేవుడిని, కరచరణాద్యవయవాలతో సాకారుడైన దేవుడిని (Personal God) అతడు నిరాకరించాడు. దానితో అతనికి నాస్తికుడనే ముద్ర పడింది.

దేవుడు అనే మాటను స్పినోజా తరుచుగా ఉపయోగించినప్పటికి అతని దేవుడు పైన ఎక్కడో, ఏదో లోకంలో కూర్చుని నరులను శాసించే ఒక మూర్తి కాడు. అందుచేత అతడు దేవుడికి ప్రత్యామ్నాయపదంగా "ద్రవ్యం" (Substance) అనే మాటను ఉపయోగించాడు. తెలుగులో ద్రవ్యం అనే మాట నానార్థాలు స్ఫురింప చేస్తుంది కనుక 'సత్' అనే మాటను ఉపయోగించడం సముచితం.

## గణిత పద్ధతి

దేకార్త్‌వలె స్పినోజా కూడా తన తత్వ వివరణకు రేఖాగణిత పద్ధతిని అవలబించాడు. రేఖాగణితం [జామెట్రీ] నిగమనతర్కం (deductive logic) పై ఆధారపడినట్టిది ఒక స్వతస్సిద్ధ ప్రతిపాదన చేయడం, దానినుంచి ఒకటొకటిగా అనంతర ప్రతిపాదనలన్నీ చేస్తూపోయి, చివరికి సిద్ధాంతాన్ని అవిష్కరించడం ఈ పద్ధతి. ఇలాంటి తర్కాన్ని ఉపయోగిస్తే తత్వ సిద్ధాంతం ఎక్కడా తప్పిపోకుండా నిర్దుష్టంగా, అప్రతిహతంగా నిరూపిత మవుతుందని స్పినోజా విశ్వాసం.

మానవ జీవితలక్ష్యం ఏమిటి? ఆనందం. ప్రతి ప్రాణి సుఖాన్ని కోరుతుంది. సుఖం ఎలా లభిస్తుంది? సత్యాన్ని తెలుసుకోవడంవల్ల సుఖం కలుగుతుంది.

అయితే ఏది సత్యం? సత్ ఒకటే సత్యం. సత్ అంటే ఉండడం, ఉనికి (existence). అదే ద్రవ్యం (substance) దాన్నే దేవుడు (God) గాను, ప్రకృతి (Nature)గాను స్పినోజా పేర్కొన్నాడు.

## ఏకం సత్...

సత్‌ను ఎలా నిర్వచించాలి? ఏకమేవా ద్వితీయమ్. అది కానిది ఏమీ లేదు. అదొక్కటే వున్నది. (ఏకం సత్) దాని ఉనికికి మరొకటి ఏదీ ఆధారం కాదు. ఏదీ కారణం కాదు. కాని అన్నిటికీ అదే ఆధారం, అదే కారణం. దాన్ని భావించడానికి ఏ ఇతర భావపు సహాయం అక్కరలేదు. కాని, అది లేకుండా దేన్నీ భావించలేము.

సత్ ఒక్కటే వుండేటట్టయితే, అది అనంతం (infinite) అయి వుండాలి. అనంతం కాకపోతే, అది కానిది మరొకటి వుండవలసివస్తుంది.

అది నిత్యం (eternal) అయివుండాలి. లేకపోతే దానికిముందు, తర్వాత, మరొకటి వుండవలసి వస్తుంది. ఉన్నది అదొక్కటే కనుక, వేరే తత్వం వుండడానికి వీలులేదు.

అది స్వయం సిద్ధం, స్వయంభువం (Self existent, self-caused) అయివుండాలి. లేకపోతే దాని సృష్టికి మరొకటి కారణం కావలసి వస్తుంది. అది కానిది లేదు కనుక అదీ కుదరదు.

దానికి సంకల్పం (will) అనేది లేదు. ఇలా చేయాలి, అలా చేయాలి అని సంకల్పించి, ఏదో ప్రయోజనం ఆశించి ఏ పనీ చేయదు. అది దాని స్వభావానికి విరుద్ధం. ఏదో ప్రయోజనాన్ని ఆశించి చేయడం అంటే దానికి కోర్కె వున్నదన్నమాట. తనకు ఏదో కొరత వున్నప్పుడు మాత్రమే, తనకు లేని దాని కోసమే, కోర్కె కలుగుతుంది. కాని, తనకంటె వేరే ఏదీ లేనప్పుడు, తాను సర్వ సంపూర్ణం అయినప్పుడు– కోర్కెగాని, సంకల్పంగాని ఎందుకు కలుగుతుంది.?

కనుక సత్ (Substance) అనేది అనంతం, నిత్యం, స్వయంభువం, సంకల్ప రహితం, సర్వ స్వతంత్రం, సర్వ సంపూర్ణం అయిన పరమ తత్వం. దాన్నే దేవుడని స్పినోజా వ్యవహరించాడు.

## "సత్" లక్షణాలు

సత్ అనేది అనంతం కనుక, దాని లక్షణాలు (attributes) కూడా అనంతంగా వుంటాయి. అయితే వాటిలో మానవ మేధ (human intellect) గ్రహించగలిగినవి రెండే లక్షణాలు. ఒకటి ఆలోచన (thought), రెండవది విస్తృతి (extension). ఆలోచన అభౌతిక లక్షణం. విస్తృతి అమానసిక లక్షణం. విస్తృతి అంటే మొత్తం భౌతిక ప్రపంచం. ఆలోచన- అంటే దాని అవగాహనీయత (intelligibility).

దేకార్త్ మూడు విభిన్న తత్వాలను (substances) ప్రతిపాదించాడు. ఒకటి దేవుడు. రెండవది మనస్సు (mind). మూడవది భౌతిక పదార్థం లేదా శరీరం (matter). మనస్సును, భౌతిక పదార్థాన్ని సృజించినది దేవుడే అయినప్పటికి అవి రెండూ స్వతంత్ర తత్వాలని దేకార్త్ అభిప్రాయపడ్డాడు.

కాని, స్పినోజా ఈ అభిప్రాయాన్ని ఖండించాడు. ఆలోచన (thought,

mind), విస్తృతి (extension, matter) అనేవి ఒకే పరతత్వం యొక్క లక్షణాలు మాత్రమే. అవి దేవునిపై ఆధారపడినవే, కనుక స్వతంత్రమైనవి కావు.

## రెండు భిన్నాంశలు

అయితే, దేవునివలె దేవుని అనంత లక్షణాలలో ప్రతి ఒక్కటీ అనంతమైనది. కనుక, ఆలోచన, విస్తృతి కూడా అనంతమైనవి. అవి ఒకదానిపై ఒకటి ఆధార పడినవి కావు. దేనికది స్వతంత్రమైనదే. ఆలోచన విస్తృతిపై ఆధార పడినట్టిది కాదు. దానికి కారణమైనట్టిది కాదు. అలాగే విస్తృతి ఆలోచనకు ఆధారం కాదు, కారణం కాదు... అవి ఒక నాణానికి గల రెండు ప్రక్కలవలె, దేవునియొక్క రెండు భిన్నాంశలు (two aspects). అవి ఒక దానికొకటి సమానాంతరమైనవి. నాణానికి ఒకే ప్రక్క ఎలా వుండదో, అలాగే విస్తృతి వుండి ఆలోచన లేకుండా పోదు. ఆలోచన వుండి విస్తృతి లేకుండా పోదు. ఒక దాని కొకటి కారణం కాకపోయినా, రెండూ అనంతంగా, శాశ్వతంగా కలిసే వుంటాయి. ఆలోచన వున్నచోట విస్తృతి వుంటుంది. విస్తృతి వున్నచోట ఆలోచన వుంటుంది.

ఈ రెండు భిన్న లక్షణాలద్వారా దేవుడు (సత్) తనను తాను అనేక విభిన్న రూపాల (modes)లో అభివ్యక్తం చేసుకుంటున్నాడు. ఆలోచన అనే లక్షణం అనంతమైన మనస్సులుగా, భావాలుగా, సంకల్పాలుగా అభివ్యక్త మవుతున్నది. విస్తృతి అనే లక్షణం అనంతమైన చలనం (motion) గా, స్తబ్ధత (rest)గా, అంటే భౌతికమైన సమస్త వస్తు ప్రపంచంగా అభివ్యక్త మవుతున్నది. ఈ అభివ్యక్తి (manifestation, modification) నే స్పినోజా రూపాలు (modes) గా పేర్కొన్నాడు.

స్పినోజా పారభౌతిక (metaphysical), తత్వ చింతనలో ఈ మూడు పదాలు ముఖ్యమైనవి : ఒకటి—సత్ (substance), లేదా దేవుడు. రెండవది— లక్షణాలు (attributes) లేదా ఆలోచన, విస్తృతి. మూడవది-- రూపాలు (modes), లేదా సమస్త విశ్వం.

## నామరూప జగత్తు

మన అనుభవంలోకి వచ్చే సమస్త జగత్తు నామ, రూపమయం. అది దేవుని అభివ్యక్తి (expression). దానికి ఆధారం దేవుడు. సమస్త జగత్తుకు అంతర్వ్యాప్తంగా, అంతర్యామిగా, అంతస్తత్వంగా దేవుడు ఉన్నాడు. ఆయనే జగత్తుగా భాసిస్తున్నాడు. దాని లోపల, బయట దేవుడే వున్నాడు. ("తదంతరస్య సర్వస్య, తదు సర్వస్యాస్య బాహ్యతః" అని ఈశోపనిషత్తు.)

ఈ అధ్యాయం మొదట్లో ఉదాహరించిన "ఈశావాస్య మిదం సర్వం యత్కించ జగత్యాం జగత్" (ఈ సర్వమున్నూ, దానిలోని ప్రతి చిన్న భాగమున్నూ ఈశ్వర పరివ్యాప్తమై వున్నది) అనే భావానికి స్పినోజా సిద్ధాంతం దగ్గరగా వస్తుంది.

ఇందుచేతనే స్పినోజా సిద్ధాంతాన్ని పూర్వకాలంలో గ్రీకులు ప్రతిపాదించిన "పాన్థీయిజం" (pantheism) తో వ్యాఖ్యాతలు పోల్చారు. "పాన్థీయిజం" అంటే "అంతా దైవమే" నన్న భావన. స్పినోజా భావం ప్రకారం విశ్వం, దేవుడు ఒకటే. అతని దేవుడు "వైశ్వదేవుడు."

## నిత్యం, అనంతం

విశ్వానికి అంతం లేదు. అది అనాద్యనంతం. అలాగే అది నిత్యం కూడా. స్థలం, కాలం (space and time) దృష్ట్యా దానికి అవధులు లేవు. అయితే, విశ్వంలోని వేర్వేరు భాగాలకు ఆది, అంతం వున్నాయి. అవి నశ్వరాలు. అందుచేత, విశ్వంలోని ప్రత్యేక వస్తువులను, ప్రత్యేక మనస్సులను దేవుడుగా అర్థం చేసుకోరాదు. అవి దేవునిలో భాగాలు మాత్రమే. మనం విశ్వంగా చూస్తున్నది దేవుని అనంతత్వంలో ఒక నలుసు. ఇలాంటి విశ్వాలు అనంతంగా వుండవచ్చు. అవి అన్నీ కలిస్తే దేవుని అనంతత్వం అవుతుంది. వాటన్నిటి సమాహారమే దేవుడు. అనంతత్వం, నిత్యత్వం, సంపూర్ణత్వం— ఇవి ప్రపంచపు అసలు స్వభావం (substance), అవే దేవుడు. "సత్" అనేది స్థల, కాలాలకు అతీతం, అదే దేవుడు.

విశ్వంలో ప్రతి వేర్వేరు వస్తువులలోను, ప్రతి మనస్సులోను వుండేది దేవుని అంశ మాత్రమే. అలాంటి అనంతమైన అంశల సమాహారం (totality) దేవుడు. ప్రత్యేక వస్తువులు, ప్రత్యేక మనస్సులు ఎప్పటికప్పుడు మారిపోతున్నా వాటిలో అంతర్భూతంగా వున్న సత్ మార్పు చెందదు. మొత్తం విశ్వం మార్పు చెందదు. కనుక విశ్వమే దేవుడు.

ప్రత్యేక వస్తువులకు, ప్రత్యేక మనస్సులకు ఆధారం దేవుడే అయినా, వాటిలో అంతర్యామిగా దేవుడు వున్నా, ఆయన వాటికి ప్రత్యక్ష కారణం కాదు. అంటే దేవుని సంకల్పంవల్ల ఇవన్నీ ఏర్పడడం లేదు.

## కార్యకారణాల గొలుసు

విశ్వంలోని ప్రత్యేక వస్తువులు పరస్పరం కార్యకారణ సంబంధం కలిగినవి. అంటే ఒక వస్తువు మరొక వస్తువుకు కారణమవుతుంది. ఒక సంఘటనకు

మరొకటి కారణమవుతుంది. దానికి వేరొకటి కారణం. దానికి ఇంకొకటి కారణం... ఇలా ఈ కార్యకారణ సంబంధం అనంతంగా సాగుతుంది. కనుక మనం చూసే నక్షత్రాలు, సూర్యచంద్రులు, భూమి, సముద్రాలు, కొండలు, మానవులు, చెట్లు, పుట్టలు-- ఇవన్నీ దేవుడు పనికట్టుకుని సృజించాడని అనుకో రాదు. దేవుని ప్రకృతి (nature), దేవుని స్వభావం ఈ సమస్త వస్తువులుగాను అభివ్యక్త మవుతున్నా, ఇవన్నీ ఒకదానినుంచి ఒకటి ఆవిర్భవించి నట్టివి. వీటికి ఆది కారణం (first cause) అనేదిలేదు. వీటి మధ్యగల కార్య కారణాల హారం (chain of cause and effect) అనంతమైనది. కొన్ని నిర్దిష్ట భౌతిక సూత్రాలను అనుసరించి ఇవన్నీ ఏర్పడుతున్నాయి.

ఇది దేవుని రెండవ అభివ్యక్తి అయిన ఆలోచనా వ్యవస్థకు కూడా వర్తి స్తుంది. ఏ ప్రత్యేక ఆలోచనకు దేవుడు ప్రత్యక్ష కారణం కాడు. ఒక ఆలోచన మరొక దానికి కారణం, దానికి వేరొకటి, దానికి ఇంకొకటి... ఇలా ఈ కార్యకారణ మాల (chain) అనంతమైనది. దీనికి కూడా ఆది కారణం లేదు.

కనుక స్పినోజా తాత్వికంగా నియతివాది (determinist) అవుతున్నాడు. ప్రతిది ఒక నియమాన్ని, ఒక సూత్రాన్ని అనుసరించి ఏర్పడుతున్నది. ఈ కారణాన మానవునికి యథేచ్ఛ (free will) కూడా లేదు. ఒక ఇచ్ఛ మరొక దానికి కారణం, ఒక ఆలోచన మరొక ఆలోచనకు కారణం అవుతుంది. మన ఆలోచన మనకు తెలుస్తున్నది కనుక, మనం యథేచ్ఛగా దాన్ని సంకల్పించి నట్టు భ్రమపడుతున్నాము. కాని మనకు తెలిసినా, తెలియకపోయినా, దానికి మరొక ఆలోచన, దానికి మరొక సంకల్పం కారణంగా వుండి తీరుతాయి.

అందుచేత ప్రపంచంలోని ప్రతి సంఘటనను, ప్రతి వస్తువును, మానవుని ప్రతి ఆలోచనను ప్రాకృతిక సూత్రాల (Nature law's) ప్రకారం అవగాహన చేసుకోవడం సాధ్యమే. విజ్ఞానశాస్త్రాల దృష్టి నుంచి దేనినైనా (ఇప్పుడు కాక పోతే ఎప్పుడైనా) అర్థం చేసుకోవచ్చు. అంతా దేవుడి లీల, దేవుడి దయ అనుకోనక్కరలేదు.

## నీతిశాస్త్రం

ఇక స్పినోజా నీతితత్వం (moral philosophy) చూద్దాము.

మానవుని జీవిత లక్ష్యం ఏమిటి? సుఖానుభవమేనని స్పినోజా అంటాడు.

ప్రతి ప్రాణి తనను తాను ప్రేమిస్తుంది. అంటే తన సుఖాన్ని తాను కోరుకుంటుంది. దుఃఖాన్ని తిరస్కరిస్తుంది. ఇది ప్రకృతి సహజం. దీన్ని కాదనడానికి వీలులేదు.

సుఖం అంటే ఏమిటి? ప్రపంచంలో ప్రతి ప్రాణి యథాస్థితి (status quo) నే కోరుకుంటుంది. ప్రతి మానవుడు తాను తానుగా, అనంతంగా, యథాతథంగా కొనసాగాలని కోరుకుంటాడు. తన యథాస్థితి కొనసాగితేనే అతనికి సుఖం కలుగుతుంది. అలా జరగకపోతే బాధ కలుగుతుంది. అది ప్రకృతి సహజం.

కాని, మానవజీవితం క్షణభంగురం వంటిది. మరి మానవుడు తనను తాను యథాతథంగా ఎలా కొనసాగించుకోగలడు? అది అసంభవం కనుక అతనికి బాధ కలుగుతుంది.

## వ్యష్టి, సమష్టి

అయితే, మానవుడు తాను మానవజాతిలో భాగమని గ్రహిస్తే బాధ కలగదు. తాను వ్యక్తిగా కొనసాగలేకపోవచ్చు. కాని, మానవజాతి కొనసాగుతుంది. అందులో భాగంగా తాను కూడా కొనసాగుతాడు. తాను వేరు, మానవజాతి వేరు కాదు. తనని తాను ప్రేమించు కోవడం అంటే మానవజాతిని ప్రేమించడమే. అలాగే మానవజాతిని ప్రేమించడం అంటే తనను తాను ప్రేమించుకోవడమే. మానవ జాతిలో తనను, తనలో మానవజాతిని చూసుకున్నప్పుడు అతనికి తాను శాశ్వతంగా కొనసాగలేనేమోనన్న భావం బాధ కలిగించదు.

"యస్మిన్ సర్వాణి భూతాని
ఆత్మైవా భూద్విజానతః
తత్ర కో మోహః కశ్శోకః
ఏకత్వ మనుపశ్యతః" అని ఈశోపనిషత్తు చెబుతున్నది. —సమస్త భూతాలు తానుగానే తెలుసుకోగలిగినవాడికి, ఏకత్వాన్ని మాత్రమే చూసేవాడికి భ్రమ ఎక్కడిది? దుఃఖం ఎక్కడిది?

మనలను మనం ప్రేమించుకోవాలంటే ఇతరులను ప్రేమించాలి. ప్రేమ, సుఖం ఇతరులతో పంచుకున్నప్పుడు వృద్ధి చెందుతాయి. ఇతరులకు సహాయం చేయడంవల్ల మనకు మనం సహాయం చేసుకోగలుగుతాము. సమష్టి సుఖం, వ్యష్టి సుఖం ఒక్కటే. ఇతరులు సుఖంగా వుంటేనే మనకు సుఖం కలుగుతుంది. ద్వేషంవల్ల, అసూయవల్ల సుఖం కలగదు. పరులకు అపకారం చేయడంవల్ల. సుఖం కలగదు. దయ, అనురాగం, స్నేహంవల్ల సుఖం కలుగుతుంది. మానవు లందరిని ప్రేమించాలి. వారికోసం కాదు, మన సుఖంకోసమే.

బృహదారణ్యకోపనిషత్తులో యాజ్ఞవల్క్యుడు తన భార్య మైత్రేయితో అంటాడు :

"నవా అరే పత్యుః కామాయ పతిః ప్రియోభవతి
ఆత్మనస్తు కామాయ పతిః ప్రియోభవతి;
నవా అరే జాయాయై కామాయ జాయా ప్రియా భవతి
ఆత్మ నస్తు కామాయ జాయా ప్రియా భవతి..." ఇత్యాది.

అంటే, భార్య భర్తను ప్రేమించడం భర్తకోసం కాదు. తనకోసమే. భర్త భార్యను ప్రేమించడం భార్యకోసం కాదు. తనకోసమే. పిల్లలను తల్లి దండ్రులు ప్రేమించడం పిల్లలకోసం కాదు. తమకోసమే. సమస్త భూతాలను ప్రేమించడం వాటికోసం కాదు. మనకోసమే అంటే మనలోను, సమస్తంలోను వున్న ఆత్మకోసమే.

## దేవుని పట్ల ప్రేమ

ఎందువల్లనంటే మానవుడు ఈ ప్రపంచంలో ఒక భాగం. అదే విధంగా ప్రపంచంలోని సమస్త మానవులు, ప్రాణులు, అప్రాణులు అన్నీ ప్రపంచంలోని భాగాలే. అన్నిటిలోను దైవాంశ వున్నది. వాటన్నిటి సమాహారమే దైవం. అన్నిటి సముదాయమే సత్. ఈ ప్రపంచమంతా దేవుని దేహం. దానిలో మానవుడు ఒక కణం. తాను ప్రత్యేక దేహిగా కొనసాగకపోయినా, దేవుని అనంత శరీరం కొనసాగుతుంది. తాను భాగమైన దేవుని అనంతత్వం కొనసాగుతుంది. ఈ విషయాన్ని గ్రహిస్తే మానవునికి దుఃఖం కలగదు. మృత్యు భయం తగలదు. మృత్యువు అమృతత్వానికి రహదారి. దేవుని అనంతత్వతత్వంపట్ల సరియైన అవగాహన (knowledge) పెంపొందించుకుంటే, నిజమైన జ్ఞానం (జ్ఞానయోగం) ద్వారా అనంత తత్వాన్ని ప్రేమించగలిగితే, మనకు ఆనందం కలుగుతుంది. దీన్ని స్పినోజా "దేవునిపట్ల మానసిక ప్రేమ" (intellectual love of God) అని పేర్కొన్నాడు. అదే సత్-చిత్-ఆనందం. సచ్చిదానంద సిద్ధి. అదే అమరత్వం.

స్పినోజా తత్వ సిద్ధాంతం అతి విస్తృతమైనది. అతి గహనమైనది. పెక్కు చోట్ల మార్మికంగా వుంటుంది. అది అనేక వ్యాఖ్యలకు తావిచ్చింది. దాన్ని ఒక వ్యాసం పరిధిలో వివరించడం కష్టం. కనుక, దానిలోని కొన్ని అంశాలను మాత్రమే ఇక్కడ క్లుప్తంగా సమీక్షించడం జరిగింది.

పాశ్చాత్య తత్వ శాస్త్రంలో స్పినోజా తత్వానికి చాలా ప్రముఖస్థానం వున్నది. తర్వాతి తత్వవేత్తలపై అతని ప్రభావం ఎంతో వున్నది. మానవులందరు సమానులనడంలో, ప్రతి ఒక్కడికి సమష్టిలో భాగస్వామ్యం వున్నదనడంలో అతడు ప్రజాస్వామ్య సిద్ధాంతాన్ని బలపరిచినట్టు అయింది. మొత్తం పాశ్చాత్య తత్వవేత్తలలో అంతటి ఉత్తముడు, ప్రేమాస్పదుడు మరొకడు లేడని బెర్ట్రాండ్ రస్సెల్ వినుతించాడు.



# 21
# జగమంతా శక్తి స్వరూపంగా దర్శించిన లైబ్నిజ్

ప్రపంచాన్ని ఒక్కొక్క మేధావి ఒక్కొక్క రీతిగా దర్శించాడు. ఒక్కొక్క విధంగా వ్యాఖ్యానించాడు.

ఏ ఒక్కడు ఏ ఒక్కడితోను ఏకీభవించడు. ఒకడు అన్నదాన్ని మరొకడు కాదంటాడు. తిరిగి అతడిని మరొకడు ఖండిస్తాడు. ప్రాచీనకాలపు గ్రీకులనుంచి వరసగా అనేక తత్వ సిద్ధాంతాలను పరిశీలిస్తూ వస్తున్నాము. ఒకడు జగమంతా జలమయం అంటే మరొకడు అంతా వాయుమయం అన్నాడు. డెమొక్రిటస్ అంతా అణుమయం అంటే, ప్లేటో అంతా భావమయం అన్నాడు. ఇలాగే తక్కినవారు.

ఈ విధంగానే పశ్చిమ దేశాల తత్వశాస్త్రం పరిణామం చెందింది. ఒకరు చెప్పినదాన్ని మరొకరు ఖండించి కొత్త సిద్ధాంతాన్ని ప్రతిపాదించడంతో ఎంతో గందరగోళం కూడా ఏర్పడుతున్నది. అయినా, ఆ గందరగోళంవల్లనే, తత్వ శాస్త్రం ఎంతో ఆసక్తికరంగా కూడా రూపొందింది. చివరికి ఏది నిజం అంటే,

అన్నిటిలోను ఎంతో కొంత నిజం వున్నదని, ఒక్కొక్క దృష్టినుంచి ఒక్కొక్కటి నిజమని చెప్పవలసి వస్తుంది.

గాట్ ఫ్రీడ్ విల్ హెల్మ్ లైబ్నిజ్ తనకు ముందువచ్చిన దేకార్తేను, స్పినోజాను ఖండించి కొత్త సిద్ధాంతాన్ని ప్రతిష్ఠించాడు.

## అపర అరిస్టాటిల్

లైబ్నిజ్‌ను సార్వకాలిక మహా మేధావిగా పేర్కొంటూ, వ్యాఖ్యాతలు అతడిని అరిస్టాటిల్‌తో పోల్చుతూ వుంటారు. అరిస్టాటిల్ వలె ఇతడు కూడా సజీవ విజ్ఞాన సర్వస్వం. తత్వశాస్త్రంలోనే కాక, వివిధ విజ్ఞాన శాస్త్రాలలో అఖండ కృషి చేశాడు. అతని కృషి విలువను అనాటికంటె ఈనాడు మరింతగా తత్వవేత్తలు గుర్తిస్తున్నారు.

జర్మనీలోని లీప్జిగ్ నగరంలో 1646 లో లైబ్నిజ్ జన్మించాడు. చిన్నతనంలోనే తండ్రి మృతి చెందాడు. తండ్రి కాలేజీలో ప్రొఫెసరు. లైబ్నిజ్ బాల్యదశలో ఎప్పుడూ తన తండ్రి లైబ్రరిలోనే గడిపేవాడు. చిన్ననాటనే గ్రీకు, లాటిన్ భాషలను అభ్యసించాడు. పదిహేనవ యేట యూనివర్సిటీలో చేరాడు. ఇరవైయవయేటికే న్యాయశాస్త్రంలో థీసిస్ తయారుచేశాడు. కాని, వయస్సు చాలదని లీప్జిగ్ యూనివర్సిటీవారు డాక్టరేట్ ఇవ్వలేదు. అల్ట్‌డార్ఫ్ వెళ్లి అక్కడ డాక్టరేట్ పుచ్చుకొన్నాడు. పైగా ఆ యూనివర్సిటీవారు అతనికి ప్రొఫెసరుగా ఉద్యోగ మిస్తామన్నారు కూడా. కాని, ఆ ఉద్యోగం మనస్కరించక తిరస్కరించాడు.

## ప్రతిభా వైవిధ్యం

అతని ప్రతిభా వైవిధ్యం ఆశ్చర్యం కలిగిస్తుంది. యూనివర్సిటీలో వుండగా మధ్య యుగాలనాటి థియాలజీని పరిశోధన పట్టాడు. బేకన్, హాబ్స్, దేకార్తేల తత్వ సిద్ధాంతాలతో, బ్రాహే, కెప్లర్, గలీలియోల ఖగోళశాస్త్రంతో పరిచయం ఏర్పరచుకున్నాడు. బాక్టీరియాలజీ, హిస్టరీ, స్టాటిస్టిక్స్, న్యాయశాస్త్రం, భాషా శాస్త్రం మొదలైనవాటిలో మౌలిక కృషి చేశాడు. కవిత్వం కూడా వ్రాశాడు. ఈ శతాబ్దంలో ప్రాముఖ్యం వహించిన సింబాలిక్ లాజిక్‌కు అనాడే అతడు పునాదులు వేశాడు. అతని అసంఖ్యాక రచనలలో ఇప్పటికీ ప్రచురణ కానివి ఎన్నో వున్నాయట.

కాని, లైబ్నిజ్‌కు చిరకీర్తి సంపాదించిపెట్టినది గణితశాస్త్రంలో అతని ప్రతిభ. దేకార్తేవలె ఇతడుకూడా గణితశాస్త్రంలో అఖండ ప్రజ్ఞాశాలి. ఒక కాల్‌క్యులే

టింగ్ యంత్రాన్ని రూపొందించి, ఇంగ్లండు వెళ్లినప్పుడు దాన్ని రాయల్ సొసైటీ సమావేశంలో ప్రదర్శించాడు.

గణితశాస్త్రంలో ఒక ముఖ్యశాఖ అయిన "ఇన్ఫినిటెసిమల్ కాల్క్యులస్"ను మొదటగా తయారుచేసిన ఘనత న్యూటన్తో పాటు లైబ్నిజ్ది కూడా. న్యూటన్ తన కాల్క్యులస్ను ప్రచురించకుండా నిలుపుచేశాడు. ఇంచుమించు అదే సమయంలో లైబ్నిజ్ కూడా తనంతట తాను కాల్క్యులస్ను రూపొందించి ముందుగా ప్రచురించాడు. దానితో ఎవరు ముందు అని తీవ్రమైన వాదోపవాదాలు చెలరేగి, చాలా మనస్పర్ధలకు కూడా కారణమైనాయి. కాని, "మేధావులు ఒకే రకంగా ఆలోచిస్తారు" (గ్రేట్ మైండ్స్ థింక్ ఎలైక్) అనే లోకోక్తి ప్రకారం ఆ ఘనత ఇరువురికీ చెందుతుంది. ఇన్ఫినిటెసిమల్ కాల్క్యులస్కు లైబ్నిజ్ తత్వచింతనలో కీలక స్థానం వుంది.

## వ్యవహారవేత్త

లైబ్నిజ్ మొదట కొన్నాళ్లు మెయిన్జ్ ఆర్చిబిషప్ వద్ద న్యాయవాదిగా పని చేశాడు. అతడు తత్వవేత్తయేకాక, మంచి వ్యవహారవేత్తకూడా. అతని ప్రజ్ఞా ప్రాభవాలు చూసి, ఆర్చిబిషప్ అతడిని తన దౌత్యోద్యోగిగా నియమించాడు. ఆ ఉద్యోగరీత్యా పెక్కు యూరపియన్ దేశాలలో పర్యటించే అవకాశం కలిగింది. ఒకసారి ఫ్రాన్సు వెళ్లి ఒక దౌత్య వ్యవహారంలో 14 వ లూయీ రాజును కలుసుకున్నాడు. వాటికన్ సందర్శించాడు. అక్కడ లైబ్రేరియన్ ఉద్యోగమిస్తామన్నారు. కాని, కాథలిక్ మతాన్ని స్వీకరించవలసి వస్తుందని దాన్ని తిరస్కరించాడు. సమకాలికులైన పెక్కు మంది మేధావులతో, రాజులతో అతనికి పరిచయాలు ఏర్పడ్డాయి. ఒకసారి రెండు నెలలపాటు హాలెండ్లో వుండవలసి వచ్చింది. ఆ రోజులలోనే అతడు స్పినోజాతో తరచుగా సమావేశమై తత్వ చర్చలు జరిపేవాడు. బెర్లిన్లో సైన్సు అకాడమీని స్థాపించాడు.

ఆ తర్వాత హానోవర్ ప్రభువువద్ద లైబ్రేరియన్ ఉద్యోగాన్ని స్వీకరించాడు. జీవితాంతం ఆ ఉద్యోగంలోనే వున్నాడు. కాని హానోవర్ ప్రభువు 1714 లో ఒకటవ జార్జిగా ఇంగ్లండుకు రాజు కావడంతో లైబ్నిజ్ పలుకుబడి తగ్గుముఖం పట్టింది. అతడిని ఎవరూ పట్టించుకోలేదు. చివరి రోజులలో నిరాదరణకు లోనై ఒక అనామకుడివలె అజ్ఞాతంగా మృతిచెందాడు.

అన్నిటిలోను సమన్వయం, సంధానం లైబ్నిజ్ జీవితాశయం. యూరప్లో వివిధ రాజ్యాల మధ్య సంధానం కుదర్చాలని లైబ్నిజ్ విశేషంగా కృషి చేశాడు. కాథలిక్, ప్రొటెస్టెంట్ శాఖల మధ్య సమన్వయానికి ప్రయత్నించాడు. ఒక

కొత్త అంతర్జాతీయ భాషను రూపొందించాలని కూడా పథకం తయారుచేశాడు. అలాగే వివిధ తత్వ సిద్ధాంతాల మధ్య అనుసంధానం సాధించడం తన ధ్యేయంగా పెట్టుకున్నాడు.

## రేషనలిస్టు చింతన

దేకార్త్, స్పినోజాలవలె లైబ్నిజ్ కూడా బుద్ధివాది-- రేషనలిస్టు. వారివలె ఇతడుకూడా గణితవేత్తకదా? గణితశాస్త్రం ఇంద్రియానుభవంతో, ఇంద్రియ సాక్ష్యంతో పనిలేకుండా కేవలం వివేచన (రీజనింగ్) పైనే ఆధారపడిన శాస్త్రం. ఇదే ఒరవడిలో తాత్విక సత్యాలను కూడా కేవలం బుద్ధిద్వారా, వివేచన ద్వారా కనుగొన వచ్చునని చెప్పే వాదాన్ని రేషనలిజం అంటారు. లైబ్నిజ్ రేషనలిస్టు.

అయితే, దేకార్త్, స్పినోజాల సిద్ధాంతాలను లైబ్నిజ్ అంగీకరించలేదు. దేకార్త్ దేవునితో పాటు మరి రెండు స్వతంత్ర తత్వాలను ప్రతిపాదించాడు. ఒకటి మనస్సు (mind). రెండవది భౌతిక పదార్థం (matter). మనస్సు లక్షణం ఆలోచన (thought) భౌతిక పదార్థ లక్షణం విస్తృతి, వ్యాప్తి (extension). దేకార్త్ ద్విసత్తావాది(dualist).

స్పినోజా ఈ వాదాన్ని ఖండించాడు. ఉన్నదొకటే తత్వం. అది ఈశ్వరుడు. స్పినోజా ఏకసత్తావాది (monist) మనస్సు, భౌతిక పదార్థం రెండూ స్వతంత్ర సత్తాలు కావని, అవి దేవుని లక్షణాలని అతడు అన్నాడు.

లైబ్నిజ్ ఈ రెండు వాదాలను త్రోసిపుచ్చాడు. మౌలికతత్వాలు ఒకటీ, రెండూ కావు; అనేకం, అసంఖ్యాకం, అనంతం అన్నాడు. అతడు బహు సత్తావాది (pluralist).

## శక్తివాదం

ప్రపంచంలో ప్రతి వస్తువుకు ప్రతిఘటనశక్తి (inertia) వుంటుంది. అందుకే ప్రతి వస్తువు పరిమితమైనది. (finite). ఇతర వస్తువుల కంటె వేరైనట్టిది. ప్రతి వస్తువుకు స్వతంత్ర వ్యక్తిత్వం--(individuality) వుంటుంది. అందువల్ల అది ఇతర వస్తువుల ప్రభావాన్ని నిరోధిస్తుంది. ఉదాహరణకు ఒక వస్తువు ఒక స్థలంలో వుందనుకోండి. ఆ స్థలంలోకి అదే సమయంలో మరొక వస్తువును అది రానివ్వదు.

ఒక ఒరలో రెండు కత్తులు ఇమడవన్నట్టు ఏక స్థలంలో ఏక కాలంలో రెండు వస్తువులు ఉండలేవు. ఒకటే వుండగలదు. వస్తువును అంతకంతకు

ఎంత చిన్నదిగా విభజించినాసరే, మరొకటి దాని స్థానాన్ని ఆక్రమించలేదు. మొదట వస్తువు రెండవదాన్ని నిరోధిస్తుంది. కనుక ప్రతివస్తువులో నిరోధకశక్తి వున్నది. అందుచేత ప్రతి వస్తువుకు వ్యాప్తితో పాటు శక్తి కూడా వున్నది.

అలాగే మనస్సును చూడండి. నా మనస్సు వేరు, నీ మనస్సు వేరు. ఒక మనస్సులోకి మరొక మనస్సు చొరబడలేదు. మనస్సు అంటే ఆలోచనల సమాహారం. ఒక ఆలోచనలోకి మరొక ఆలోచన చొరబడలేదు. ఒక ఆలోచన తర్వాత మరొకటి రావలసిందే. ప్రతి ఆలోచనా శకలం దేనికది స్వతంత్రం. అది తాను తానుగా వుంటుంది. దానికి కూడా నిరోధకశక్తి వున్నది. అందు చేత మనస్సుకు కూడా ఆలోచనతోపాటు శక్తి వున్నది.

మనస్సు లక్షణం ఆలోచన అయితే, ఆలోచిస్తున్నప్పుడు మాత్రమే మనస్సు వుండాలి. మరి ఆలోచన లేనప్పుడు ? స్పృహ లేనప్పుడు ? అప్పుడు కూడా మనస్సు వుంటుంది కదా? కనుక మనస్సుకు తాను తానుగా ఎల్లప్పుడు వుంటే శక్తి వుందన్న మాట.

అందుచేత భౌతిక పదార్థంలోను, మనస్సులోను కూడా శక్తి (force) అనేది వున్నది. నిజానికి వున్నది శక్తి ఒక్కటే. అదే పరమతత్వం. అదే యాథార్థ్యం. దాని లక్షణాలే భౌతిక పదార్థం, మనస్సు.

## మో న డా ల జీ

అయితే, శక్తి ఒకటిగా వుండదు. అది అనేకంగా, అసంఖ్యాకంగా వుంటుంది. ప్రపంచంలో శక్తి కేంద్రాలు (centers of force) ఒకటి కావు, అనంతం (infinite).

ఈ శక్తి కేంద్రాలకే లైబ్నిజ్ మోనాడ్స్ (monads) అని పేరు పెట్టాడు. మోనాడ్ అంటే యూనిట్. దానికి లైబ్నిజ్ ఆపాదించిన లక్షణాలను బట్టి దాన్ని తెలుగులో చిచ్ఛక్తి బిందువు అని అనవచ్చు. అంటే చిత్ (consciousness +)శక్తి బిందువు (centre of force.) ఇలా అనడానికి కారణాలు తర్వాత చూద్దాము.

శక్తి అనంతమైన చిద్బిందువుల రూపంలో వుంటుంది. అనంతమైన చిద్బిందువులు అనే ఇటుకలతో ఈ విశ్వమహాసౌధం నిర్మితమైంది.

అయితే, ఈ చిద్బిందువులు రేఖా గణితంలో వచ్చే బిందువులు (mathematical points) కావు. గణితబిందువులు అనేవి కేవలం ఊహాబిందువులు. వాటికి యాథార్థ్యం లేదు. కనుక, వాటితో విశ్వం ఏర్పడదు.

చిద్బిందువులు భౌతిక బిందువులు (physical points) కావు. భౌతిక బిందువులకు విస్తృతి (extension) వుంటుంది. కాని చిద్బిందువులు పారభౌతిక బిందువులు. (metaphysical points). అవి అణువులు కావు. అణువులకు భౌతికత్వం వుంటుంది. కాని చిద్బిందువులు పారభౌతికమైనవి. అంటే భౌతికత్వానికి ఆధారమైనవి.

## ఖాళీలులేని స్థలం

లైబ్నిజ్ తన ఇన్‌ఫినిటెసిమల్ కాల్‌క్యులస్‌ను చిద్బిందువులకు వర్తింపజేశాడు. ప్రకృతిలో అవిచ్ఛిన్నత వుంది. నిరంతరత్వం (continuity) వుంది. అంటే స్థలం (space) లో గాని, కాలం (time) లో గాని ఖాళీలు లేవు, శూన్యం లేదు. కనుక చిద్బిందువుల మధ్య కూడా ఖాళీ లేదు. శూన్యస్థలం లేదు. అవి స్థలంలోను, కాలంలోను నిరంతరత్వంతో వుంటాయి. ఒకదానిప్రక్కన ఒకటి సహజీవనం చేస్తాయి.

అయితే, అనంతమైన చిద్బిందువులలో ప్రతిదానికి దేని వ్యక్తిత్వం దానికి వుంటుంది. ఒకదాన్ని పోలి మరొకటి వుండదు. ఒకదానికి మరొకదానికి మనం కనిపెట్టలేనంత సూక్ష్మభేదం మాత్రమే వుంటుంది. దీనికి (identity of indiscernibles) దాదాపు ఒకే విధంగా వుండే వస్తువుల ప్రత్యేక వ్యక్తిత్వం- అని లైబ్నిజ్ పేరు పెట్టాడు.

## కిటికీలు లేని మోనాడ్స్

ప్రతి చిద్బిందువు తనకు తానుగా వుంటుంది. దానిలో భాగా లుండవు. అది ఒకటిగానే వుంటుంది. దాన్ని ఇంకా చిన్న బిందువులుగా విభజించడానికి వీలులేదు. అది అచ్ఛేద్యం, నిత్యం, అనశ్వరం; దానికి అది లేదు, అంతం లేదు. చిద్బిందువులను సృష్టించినది భగవంతుడే కనుక, వాటికి ఆయన తలుచుకుంటే తప్ప వినాశం లేదు.

ఒక చిద్బిందువులోకి మరొకటి చొరబడడానికి వీలు లేదు. ఒక చిద్బిందువు మరొకదానిపై ఎట్టి ప్రభావం చూపలేదు. ఒకదానికి మరొకటి కారణం కాదు. అవన్నీ స్వతంత్రమైనవి; సంపూర్ణమైనవి. వాటికి కిటికీలు లేవు; అవి గవాక్షరహితమైనవని (windowless) లైబ్నిజ్ అన్నాడు. అవి నీరంధ్రమైనవి. అంటే రంధ్రాలు లేనివి. వాటిలోకి తొంగి చూడడానికి వీలులేదు.

అయినప్పటికి చిద్బిందువులు ఒకదాన్నొకటి తమ ప్రత్యేక దృష్టినుంచి ప్రతిఫలిస్తాయి అవి అద్దాలవంటివి. ప్రతి బిందువు తక్కిన అనంత బిందువు

లన్నిటిని ఏకకాలంలో ప్రతిబింబిస్తుంది. అందుచేత ఏ ఒక్క చిద్బిందువును తీసుకున్నా దానిలో విశ్వ స్వభావమంతా ఏ స్వల్పంగానైనా, అస్పష్టంగానైనా ప్రతిబింబిస్తూ వుంటుంది. అవి విశ్వ దర్పణాలు (mirrors of the world) ప్రతిది ఒక సూక్ష్మజగత్తు (microcosm).

అవి విశ్వవ్యాప్తమైనవి; స్థలం అంతటా అవే వున్నాయి. వాటితోనే స్థలం ఏర్పడింది. ఒకదానిలో ఒకటి చొరబడడానికి వీలులేదు. ఎందుకంటే అలా చొరబడడం మొదలుపెడితే స్థలంలో ఖాళీలు (gaps) ఏర్పడతాయి. ఇది నిరంతరత్వ సూత్రానికి, అవిచ్ఛిన్నత (continuity) కు విరుద్ధం. అలా ఒకదానిలో ఒకటి చొరబడడం జరిగితే ఖాళీ జాగా లేర్పడి స్థలం కుంచించుకుపోతుంది. చివరికి స్థలం, విశ్వం అంతరిస్తాయి. కనుక అవి అభేద్యమైనవి.

### ఆధునిక వాదాలకు మార్గదర్శి

న్యూటన్ చెప్పినట్టు కేవల స్థలం (absolute space), కేవల కాలం (absolute time) వుండడానికి వీలులేదు. నిరంతరంగా, అనంతంగా చిద్బిందువులు వుండడం వల్లనే స్థల కాలాలు ఏర్పడుతున్నాయి. ఈ విషయంలో లైబ్నిజ్ సిద్ధాంతం ఐన్‌స్టయిన్ సాపేక్ష సిద్ధాంతానికి దగ్గరగా వచ్చింది.

అలాగే శక్తి యూనిట్లుగా, ఏకైక బిందువులుగా వుంటుందని ప్రతిపాదించడంలో లైబ్నిజ్ మోనాడ్ సిద్ధాంతం మాక్స్ ప్లాంక్ ప్రతిపాదించిన క్వాంటం థియరీకి కూడా దగ్గరగా వచ్చింది. మాక్స్ ప్లాంక్ శక్తి (energy) ప్రత్యేకం (discrete), సంపూర్ణం (whole) అయిన యూనిట్లుగా ప్రసరిస్తుందని అన్నాడు. ఆ యూనిట్లనే "క్వాంటా" (quanta) అంటారు.

## ఉన్నంతలో ఉత్తమ విశ్వం మనదే :

లైబ్నిజ్ ప్రతిపాదించిన చిద్బిందువులు (monads) అన్నీ ఒకే విధమైన శక్తి కేంద్రాలయితే, వాటి నుంచి ఇంత వైవిధ్యం గల ప్రపంచం ఎలా ఏర్పడింది? ప్రపంచంలో కొన్ని సజీవ పదార్థాలున్నాయి. కొన్ని నిర్జీవ పదార్థాలున్నాయి. కొన్నిటికి స్వీయ స్పృహ (self- consciousness) వుంటుంది. కొన్ని చేతన లేనివి (unconscious) గా వుంటాయి. ఇవన్నీ ఎలా వచ్చాయి?

మన మనస్సును పరిశీలిస్తే దానికి సమాధానం లభిస్తుంది. మనస్సు లక్షణం ఏమిటి? తన్ను తాను తెలుసుకోవడం, ఇతర వస్తువులను తెలుసుకోవడం, అంటే స్పృహ (perception) , స్వయం స్పృహ (self-consciousness) కలిగి వుండడం.

అయితే, ప్రకృతిలో నిరంతరత్వం (continuity) వుంది కదా? స్పృహ అనేది ఒకచోట వుండి మరొకచోట లేకుండా వుండడానికి వీలులేదు. కొన్నిటిలో వుండి, మరి కొన్నిటిలో లేకపోవడానికి వీలులేదు. ప్రకృతిలో ఖాళీలు (gaps) లేవు. కనుక, స్పృహ అనేది అంతటా వుండాలి. నిర్జీవాలలో కూడా వుండాలి.

ఇది ఎలా సాధ్యం? నిర్జీవంలో స్పృహ వుంటుందా?

నిరంతరత్వ సూత్రం ప్రకారం సున్నా (zero) నుంచి అనంతం (infinite) వరకు స్పృహ, చేతనశక్తి వుండవలసిందే. అనంతమైన స్పృహ, స్వయం స్పృహ, చేతన, చిచ్ఛక్తి కలవాడు దేవుడు. ఆయన సూపర్ మోనాడ్.

## అవరోహణ క్రమం

దేవుడినుంచి ప్రారంభమై చిచ్ఛక్తి క్రమంగా అవరోహణ క్రమంలో తగ్గుతూ వస్తుంది. మానవునిలో చిచ్ఛక్తి కొంత వుంటుంది. అతనిలో స్వయం స్పృహ, జ్ఞాపకశక్తి (memory) తో పాటు వివేచన (reasoning) కూడా వుంటుంది. జంతువులలో స్వయంస్పృహ, జ్ఞాపకశక్తి మాత్రమే వుంటాయి. వృక్షకోటిలో స్పృహ చాలా స్వల్పంగా, అస్పష్టంగా, నిద్రాణంగా వుంటుంది. జడ, నిర్జీవ వస్తువులలో స్పృహ పూర్తిగా అస్పష్టంగా, దాదాపు వుండీ లేనంత స్వల్పంగా వుంటుంది. కాని, అసలు లేకుండా పోదు. "సున్నా చిచ్ఛక్తి" (zero perception) అనే స్థితి లేదు. ఆ స్థితిని అంతకంతకు చేరుతూ, దానికి అంతకంతకు చేరువౌతూ పోవచ్చుగాని, పూర్తిగా చేరడం ఎన్నటికి జరగదు.

అన్నిటిలోకి అధమశ్రేణిలో వుండే చిద్బిందువులు నిర్జీవ పదార్థానికి చెందినవి. వాటిలో చిచ్ఛక్తి ఏ మేరకు వుంటుంది? విశ్వం (space) లో తమ తమ ప్రత్యేక స్థానాలను (apartness) తాము కాపాడుకునే మేరకు - ఆ స్థానంలోకి మరొక చిద్బిందువును చొరనీయకుండా ప్రతిఘటించే మేరకు మాత్రమే చిచ్ఛక్తి వుంటుంది. అక్కడి నుంచి పై శ్రేణులలోనికి పోతున్నకొద్దీ అత్యంత సూక్ష్మతమభేదాలతో (infinitesimal differences) చిచ్ఛక్తి పెరుగుతూ పోతుంది. అందువల్లనే లైబ్నిజ్ వాడిన మోనాడ్ (monad) అనే మాటకు చిత్‌బిందువు అని తర్జుమా చేయడం జరిగింది.

## కేంద్ర చిద్బిందువు

ప్రతి వస్తువులోను ఒక చిద్బిందువు ప్రబలస్థితిలో వుంటుంది. దాని చుట్టూ తక్కిన చిద్బిందువులు గుంపుగా చేరుతాయి. అన్నిటిలోకి ప్రబలమైన

చిద్బిందువు కారణంగానే ఆ వస్తువు ఆకృతి, స్వభావం మొదలైనవి ఏర్పడుతాయి. మానవులలో మనస్సే ప్రబలమైన చిద్బిందువు. దానిచుట్టూ శరీరానికి సంబంధించిన చిద్బిందువులన్నీ గుమికూడుతాయి. మనస్సు (mind or soul) అనే చద్బిందువు ప్రభావంవల్లనే మానవుడు మానవు డవుతున్నాడు.

చిద్బిందువు కంటె సూక్ష్మతత్వం (simple substance) మరొకటి లేదు కనుక, దానిలోనికి ఏ ఇతర వస్తువు, ఏ ఇతర చిద్బిందువు చొరబడడానికి వీలులేదని (impenetrable) అనుకున్నాము కదా? దాని లోపల వున్నది బయటికి పోదు; వెలుపలినుంచి ఏదీ లోనికి పోదు. పూర్ణమదః పూర్ణమిదం అన్నట్లు ప్రతి చిద్బిందువు సంపూర్ణ బిందువు.

అయినా, చిద్బిందువు లోపల పరిణామం జరుగుతూనే వుంటుంది. బాహ్య దృష్టి నుంచి ప్రతి చిద్బిందువు తాను తానుగానే, మార్పు లేనిదిగానే ఉన్నప్పటికి, దాని దృష్టినుంచి మాత్రం అంతర పరిణామం (inner evolution) జరుగుతూనే వుంటుంది. ఆ పరిణామం బాహ్యశక్తులవల్ల జరిగేది కాదు. దాని అంతర కారణాలవల్ల, అంతర సూత్రాలవల్ల పరిణామం జరుగుతుంది. ఒక చిద్బిందువు భవిష్యత్ పరిణామం అదినుంచి దానిలో నిక్షిప్తమయ్యే వుంటుంది. భావి పరిణామ దశలన్నీ దానిలో నిక్షిప్తమయ్యే వుంటాయి.

## దేవుడే కారణం

మానవునిలో చిద్బిందువు అతని మనస్సు. ఏ చిద్బిందువుకు మరొక చిద్బిందువుపై ఎట్టి ప్రభావం వుండదు కదా? మరి మానవుని మనస్సు మానవదేహంలోని ఇతర చిద్బిందువులను ఏ విధంగా ప్రభావితం చేస్తున్నది? ఒక వస్తువు ఆ వస్తువుగానే వుండడం, మరొక వస్తువుగా వుండకపోవడం ఎలా జరుగుతున్నది? ప్రపంచంలో ఒక క్రమం, ఒక పద్ధతి, ఒక సమన్వయం (harmony) వుండడం ఎలా జరిగింది? అంటే, లైబ్నిజ్ దేవుడే ఇందుకు కారణ మన్నాడు.

ఉదాహరణకు స్పినోజా ఈ ప్రపంచంలో ప్రతి సంఘటనకు మరొకటి కారణ మన్నాడు. అతడు ప్రతిపాదించినట్టిది కార్యకారణ సూత్రం (cause and effect principle). అయితే ఒకటి మరొకదానికి కారణ మన్నంత మాత్రంలో అదే ఎందుకు కారణం కావాలో, మరొకటి ఎందుకు కారణం కారాదో బోధపడ డంలేదు. అంటే స్పినోజా చెప్పిన కార్యకారణ సూత్రంలో సమగ్రత లేదు.

మన ఎదుట ఈ మహా విశ్వం వున్నది. అది ఈ విధంగానే ఎందుకు

న్నది? మరొక విధంగా ఎందుకు లేదు? మరొక విధంగా వుండకపోవడానికి తార్కికంగా ఏ కారణం కనబడదు. విశ్వం లోపల ఎంత వెదికినా అటువంటి కారణం కనబడదు. కనుక, దానికి కారణం విశ్వం వెలుపల, విశ్వానికి అతీతంగా వుండి వుండాలి. అటువంటి కారణమే దేవుడు.

ఈ విశ్వం ఈ విధంగానే వుండడానికి, మరొక విధంగా వుండకపోవడానికి తగిన సమర్థమైన కారణం (sufficient reason) దేవుడే. ఆయన తలచుకుంటే అనంతమైన రకాల విశ్వాలను ఊహించగలడు. వాటిలో దేనినైనా ఆయన సృష్టించగలడు. కాని, వాటినన్నిటిని కాదని ఈ విధమైన విశ్వాన్ని మాత్రమే సృష్టించాడు. దేవుడు శివత్వ పూర్ణుడు కనుక సృష్టించడానికి వీలున్న విశ్వాలన్నిటిలోకి ఉత్తమ విశ్వాన్నే సృష్టించాడు. అందుచేత ఈ విశ్వం వున్నంతలో ఉత్తమమైనది. (This is the best of all possible worlds) అని లైబ్నిజ్ సిద్ధాంతం.

## మంచి, చెడు

కాని, ఇదే ఉత్తమ ప్రపంచమైతే దీనిలో ఇంత చెడు ఎందుకున్నది? ఇంత పాపం, ఇంత దుఃఖం, ఇంత బాధ ఎందుకున్నది? దేవుడు దయా సముద్రుడైతే ఈ చెడుగు లన్నిటిని ఎందుకు సృష్టించాడు?

దీనికి లైబ్నిజ్ సమాధానం ఇది : దేవుడు ఎంత ఉత్తమ ప్రపంచాన్ని సృష్టించినా, దానిలో కొంత మంచి, కొంత చెడు వుండక తప్పదు. చెడును పూర్తిగా పరిహరించడానికి దేవునికైనా సాధ్యంకాదు. దేవుడు ఒక్కడే అనంతుడు (infinite). కాగా విశ్వంలో ప్రతి వేర్వేరు వస్తువు పరిమితమైనది (finite). మానవుడుకూడా పరిమితుడే. అసలు ఈ పరిమితత్వమే ఒక చెడుగు. కనుక చెడును తొలగించాలంటే పరిమితత్వాన్నే (finitness) తొలగించాలి. అప్పుడు విశ్వమే వుండదుకదా?

పైగా, ఈ కష్టసుఖాలు, పాప పుణ్యాలు, మంచి చెడులు ఇవన్నీ మానవ దృష్టినుంచి మాత్రమే తప్ప అవి స్వతస్సిద్ధ గుణాలు కావు. మొత్తం విశ్వం దృష్టినుంచి చూస్తే మంచి, చెడూ ఏవీ లేవు. అనంతుడైన దేవునికి అన్నీ ఒకటే.

ఇంతేకాదు, చీకటి వున్నప్పుడే వెలుతురు విలువ. ఒక వర్ణచిత్రాన్ని తీసుకోండి: దాన్ని వెలుగునీడలను సూచించే రంగులతో చిత్రకారుడు వేస్తాడు. అంతా ఒకే రంగు అయితే బొమ్మే వుండదు. వెలుగు, నీడ వుంటేనే చిత్రానికి ఆకారం వస్తుంది.

## చెడు విలువ

అలాగే ఈ ప్రపంచంలో చెడు వుంటేనే మంచి తెలుస్తుంది. దేని విలువ దానిది. ప్రపంచంలో దేన్ని ఏ ఉన్నత ప్రయోజనం కోసం దేవుడు సృష్టించాడో, ఏ సంఘటన ఏ ఉత్తమ లక్ష్యం కోసం జరుగుతున్నదో పరిమిత గ్రహణశక్తిగల మానవుడు తెలుసుకోలేడు. ఏమైనా మనం నివసించే ప్రపంచం వున్నంతలో ఉత్తమమైందే తప్ప నిర్దుష్టమైంది కాదు. నిర్దుష్టత్వం (perfection) దేవునిలో మాత్రమే వుంటుంది.

మొదటనే పేర్కొన్నట్టు లైబ్నిజ్ బుద్ధివాది. దేకార్త్, స్పినోజా, లైబ్నిజ్ ఈ ముగ్గురూ పాశ్చాత్య బౌద్ధికవాదానికి (rationalist thought) ముఖ్య ప్రతినిధులు. బౌద్ధిక వివేచన ద్వారా మాత్రమే సత్యాన్ని సందర్శించగలమన్నది వీరి సిద్ధాంతం.

కాని, ఈ వాదాన్ని ఖండిస్తూ పాశ్చాత్య తత్వశాస్త్రంలో మరొక ముఖ్యమైన శాఖ బయలుదేరింది. దాన్ని అనుభూతివాదం (empiricism) అంటారు. దీనికి కేంద్రం బ్రిటన్. ఇంద్రియానుభూతిద్వారానే మనకు జ్ఞానం (knowledge) లభిస్తున్నదని ఈ శాఖకు చెందినవారు వాదిస్తారు. వీరిలో ముగ్గురు ముఖ్యులు జాన్ లాక్, జార్జి బర్కిలీ, డేవిడ్ హ్యూమ్. అత్యంతాసక్తికరమైన వీరి తత్వ సిద్ధాంతాలను ఇప్పుడు పరిచయం చేసుకుందాము.



# 22
# అనుభూతివాది జాన్ లాక్

పోలిటిక్స్ విద్యార్థులకు సుపరిచితులైన ముగ్గురు తత్వవేత్తలలో ఒకడు హాబ్స్, మరొకడు జాన్ లాక్, మూడవవాడు రూసో. ఈ ముగ్గురూ మూడు రకాల సోషల్ కాంట్రాక్టు వాదాలను ప్రతిపాదించారు.

జాన్ లాక్ పాశ్చాత్యుల తత్వశాస్త్రంలో ఒక ముఖ్యశాఖ అయిన ఎంపిరిసిజం (empiricism) ప్రారంభకుడు. ఎంపిరిసిజం అంటే అనుభూతివాదం. దేకార్త్, స్పినోజా, లైబ్నిజ్‌ల బుద్ధి వాదాన్ని (rationalism) శీర్షాసనం వేయిస్తే అనుభూతివాదం వస్తుంది. మనకు కలిగే యావత్తు జ్ఞానం బుద్ధి (mind) ద్వారా, వివేచన (Reasoning) ద్వారా వస్తుందని బుద్ధివాదులు చెప్పగా, మన జ్ఞానమంతా ఇంద్రియాలద్వారా, అనుభవం ద్వారా కలుగుతుందని అనుభూతి వాదులు అభిప్రాయపడ్డారు.

ఏ తత్వ సిద్ధాంతం గాలిలోనుంచి వూడిపడదు. ఏ తత్వవేత్త కేవలం తన మనస్సులోనుంచి ఏ సిద్ధాంతాన్ని సృష్టించదు. తన పూర్వుల సిద్ధాంతాల ప్రభావం, ప్రేరణ అతనిపై వుంటుంది. సమకాలిక పరిస్థితుల ప్రభావం

వుంటుంది. అర్థిక వ్యవస్థ, ఉత్పత్తి విధానం మానవుల ఆలోచనను శాసిస్తుం దని మార్క్స్ అభిప్రాయ పడ్డాడు. ఇది నిజమే కాని, సిద్ధాంతాల ప్రభావం తిరిగి సామాజిక వ్యవస్థపై పడడం కూడా అంతే నిజం.

ఇది జాన్‌లాక్ తాత్విక, రాజకీయ, అర్థిక సిద్ధాంతాలను చూస్తే స్పష్టమ వుతుంది. అందుచేత లాక్ సిద్ధాంతాలను పరామర్శించబోయేముందు అతని సమకాలిక చరిత్రను క్లుప్తంగా సమీక్షించడం అవసరం.

## జనన కాలం

ఇంగ్లండు రాజకీయంగా మహా సంక్షోభంలో వున్నకాలంలో - 1632 లో జాన్ లాక్ జన్మించాడు. అప్పటికి షేక్స్పియర్ చనిపోయి పదహారేళ్లయింది. బేకన్ చనిపోయి ఆరేళ్లయింది. మహాకవి మిల్టన్ 24 ఏళ్లవాడు. హాబ్స్ 44 ఏళ్లవాడు. మరొక ప్రముఖ కవి, లాక్ సహాధ్యాయి, జాన్ డ్రైడెన్ ఏడాది శిశువు. ఐజాక్ న్యూటన్ మరొక పదేళ్లకు జన్మించాడు.

మొదటి చార్లెస్ దేశాన్ని పరిపాలిస్తున్నాడు. అతనిది నిరంకుశ పరిపాలన. “నా విష్ణుః పృథ్వీపతిః” (divine right of kings) అనేది అతని పరిపాలనకు అధారసూత్రం. పార్లమెంటుకు, రాజుకు ఘర్షణ జరుగుతున్నది. ఎప్పటికైనా అంతర్యుద్ధం తప్పనిసరి అనిపిస్తున్న రోజులు. అదీ జాన్ లాక్ జనన కాలం నాటి పరిస్థితి.

చివరికి అంతర్యుద్ధం జరగనే జరిగింది. చార్లెస్ ఓడిపోయాడు. పార్లమెంటు గెలిచింది. రాజుకు 1649 లో శిరశ్ఛేదం చేశారు. ఆ తర్వాత పదకొండేళ్లు ఇంగ్లండు రిపబ్లిక్‌గా కొనసాగింది. అయితే, అధికారాన్ని కైవసం చేసుకున్న ఆలివర్ క్రామ్‌వెల్ నియంతవలె పరిపాలించాడు. ఒక పీడ పోయి మరొక పీడ తగులుకున్నట్టు, ఒక నిరంకుశత్వం స్థానంలో మరొక నిరంకుశత్వం వచ్చింది.

## రెండవ తిరుగుబాటు

క్రామ్‌వెల్ మరణానంతరం ప్రజలు 1660 లో తిరిగి రాజరికాన్నే వరిం చారు. రెండవ చార్లెస్ రాజు అయ్యాడు. కాని, అతడు తండ్రివలె నిరం కుశుడు కావడానికి వీలు లేకుండా పార్లమెంటు జాగ్రత్త పడింది. ప్రజలకు మతస్వేచ్ఛ, వ్యాపార స్వేచ్ఛ లభించాయి. అయితే, రెండవ చార్లెస్ తర్వాత సింహాసన మెక్కిన అతని సోదరుడు రెండవ జేమ్సు కర్కోటకుడుగా తయార య్యాడు. అతడు క్యాథలిక్. మతస్వేచ్ఛ లేకుండా చేశాడు. దానితో 1688 లో మరొకసారి ప్రజలు తిరుగుబాటు చేశారు.

ఈసారి విప్లవం రక్తపాతరహితంగా జరిగింది. రెండవ జేమ్సుకు ఉద్వాసన చెప్పారు. స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు పేరుపొందిన హాలెండ్‌నుంచి రాజు విలియంను, రాణి మేరీని తమ రాజు, రాణీగా వరించి తెచ్చుకున్నారు. వారి పరిపాలన ఒడుదుడుకులు లేకుండా కొనసాగింది. పార్లమెంటు అధికారం బలపడింది. రాజు రాజ్యాంగ ధర్మకర్తగా మాత్రమే వ్యవహరించాడు.

## బూర్జువా వర్గం

అవి బ్రిటన్‌లో మధ్యతరగతిగా పేరుపడిన వ్యాపారవర్గం పైకివస్తున్న రోజులు. వారినే బూర్జువావర్గం అని కూడా అంటారు. ఈ వర్గానికి ఏకైక ధ్యేయం లాభసాటి వ్యాపారం, వ్యాపారస్వేచ్ఛ. మతం వుండవలసిందే కాని, మతస్వేచ్ఛ కూడా వుండాలి. రాజు వుండవలసిందే కాని, రాజ్యాంగానికి, పార్లమెంటుకు లోబడి అతడు వ్యవహరించాలి. రాజు రాజ్యం చేయాలి తప్ప పరిపాలించరాదు.

ఇది బ్రిటిష్ బూర్జువా లిబరల్ ప్రజాస్వామ్యానికి ముఖ్య ప్రాతిపదిక. బూర్జువా ప్రజాస్వామ్యానికి ఇంగ్లండు మార్గదర్శకత్వం వహించింది. దానికి తాత్వికమైన పునాది వేసిన తత్వవేత్త జాన్ లాక్. అతని తాత్విక, రాజకీయ సిద్ధాంతాల ప్రభావం నేటికీ కూడా ఇంగ్లండు, పశ్చిమ యూరప్, అమెరికా, ఇంకా ఎక్కడెక్కడ బూర్జువా ప్రజాస్వామ్యం వర్ధిల్లుతున్నదో అక్కడక్కడ కనిపిస్తుంది.

## అమెరికా స్వాతంత్ర్య ప్రకటన

ఉదాహరణకు 1776 నాటి అమెరికా స్వాతంత్ర్య ప్రకటనకు జాన్ లాక్ సిద్ధాంతం, అతని మాటలతోసహా, ప్రధాన ప్రేరణ అయింది. ఆ ప్రకటన ముసాయిదా వ్రాసింది థామస్ జెఫర్సన్. లాక్ రాసిన "ట్రీటైజ్ ఆన్ సివిల్ గవర్న్‌మెంట్" గ్రంథంతో అతడు ప్రభావితుడయ్యాడు. "...that all men are created equal, that they are endowed with certain inalienable rights, that among these are Life, Liberty and the pursuit of Happiness... ..." అంటూ నడిచే అమెరికా స్వాతంత్ర్య ప్రకటన చరిత్ర జగత్ప్రసిద్ధమైనది.

మానవులందరు సమానులు. వారికి కొన్ని తిరుగులేని హక్కులున్నాయి. వాటిలో జీవించే హక్కు, స్వేచ్ఛ, సుఖసంపాదన ముఖ్యమైనవి. వాటి రక్షణ కోసం ప్రభుత్వాలు అవసర మవుతాయి. ఆ ప్రభుత్వాలకు అధికారాలు ప్రజల నుంచే సంక్రమిస్తాయి. ఎప్పుడెప్పుడైతే ప్రజల హక్కులకు ఏ ప్రభుత్వమైనా

ప్రతిబంధకంగా తయారవుతుందో అప్పుడప్పుడల్లా ఆ ప్రభుత్వాన్ని మార్చడానికి, లేదా రద్దు చేయడానికి ప్రజలకు హక్కు వుంటుంది— ఇదీ ఆ ప్రకటన సారాంశం.

దీనిపై లాక్ ప్రభావం ఎంతైనా వుంది. హాబ్స్ సిద్ధాంతం ప్రకారం ఒక సారి ప్రజలు సార్వభౌముడికి సర్వాధికారాలను సమర్పించుకున్న తరవాత ఇక కిక్కురు మనడానికి వీలులేదు. కాని, లాక్ దీన్ని తిరస్కరించాడు. ప్రజలదే అంతిమాధికారం అన్నాడు.

లాక్ 1632 లో బ్రిస్టల్ సమీపంలోని రింగ్టన్‌లో జన్మించాడు. అతని తండ్రి పార్లమెంటు తరపున పోరాడినవాడు. మానవస్వేచ్ఛావాది.

లాక్ ఆక్స్‌ఫర్డులో చదువుకున్నాడు. అక్కడ బోధించే మధ్యయుగాల నాటి తత్వశాస్త్రం అతనికి సరిపడలేదు. క్రమంగా దేకార్త్ ప్రభావం క్రిందికి వచ్చాడు. ఫిజిక్స్, కెమిస్ట్రీ, మెడిసిన్ చదివాడు. వైద్యశాస్త్రంలో ప్రావీణ్యం కూడా సంపాదించాడు. బ్రిటిష్ రాయల్ సొసైటీ 1663 లో ఏర్పాటు కాగా, 1668 నాటికే లాక్ దానిలో ఫెలో అయ్యాడు.

## యాష్లీతో పరిచయం

లార్డ్ యాష్లీతో 1666 లో లాక్‌కు పరిచయమైంది. అది స్నేహంగా పరిణతమైంది. యాష్లీ కుటుంబంలో ఒకడుగా మెలిగేవాడు. యాష్లీకి సలహాదారుగా, కుటుంబ వైద్యుడుగా, పిల్లలకు ట్యూటర్‌గా వ్యవహరించాడు. లార్డ్ యాష్లీ 1672 లో ఎర్ల్ షాఫ్ట్స్‌బరీ అయ్యాడు. అతడు రాజు రెండవ ఛార్లెస్‌కు ప్రబల విరోధి. పార్లమెంటుకు సన్నిహితుడు. బూర్జువా వర్గానికి నాయకుడు, ప్రతినిధి; లిబరల్‌వాది. పార్లమెంటు ఆ రోజులలోనే రాజుకు విధేయులైన టోరీలుగాను, బూర్జువా లిబరలిజానికి ప్రతినిధులైన విగ్స్‌గాను చీలి పోయింది. విగ్స్‌కు ఎర్ల్ షా బరీ నాయకుడు.

1673 షాఫ్ట్స్‌బరీ బ్రిటిష్ ప్రధాని అయ్యాడు. కాని అతనికి, రాజుకు ప్రబల వైరం. రాజద్రోహనేరం మోపి లండన్ టవర్‌లో బంధించారు. మళ్లీ విడుదల చేశారు. 1679 లో ప్రీవీ కౌన్సిల్‌కు అధ్యక్షుడయ్యాడు. మళ్లీ 1681 లో అతడిని జైలుకు పంపించారు. చివరికి అతడు 1682 లో హాలెండ్ పారిపోయాడు. ఒక ఏడాది తర్వాత చనిపోయాడు.

లాక్ జీవితం సయితం ఇన్ని మలుపులూ తిరిగింది. షాఫ్ట్స్‌బరీ రాజకీయంగా ఉన్నత పదవిలోనికి వచ్చినప్పుడల్లా లాక్ పని మూడు పువ్వులు, ఆరు కాయలుగా వుండేది. అతడు పతనం కాగానే, ఇతడు ఏ ఫ్రాన్సుకో

పారిపోయేవాడు. అతడు విడుదల కాగానే తిరిగి ఇంగ్లండు వచ్చేవాడు. చివరికి లాక్ కూడా హాలెండ్ పారిపోయాడు. అతడిని రాజద్రోహిగా పరిగణించి రెండవ జేమ్సు తన కప్పగించవలసిదిగా డచ్చి ప్రభుత్వాన్ని కోరాడు. కాని, హాలెండ్ నిరాకరించింది.

## తుది రోజులు

చివరికి విలియం ఇంగ్లండు రాజు అయిన తర్వాత లాక్ స్వదేశానికి తిరిగివచ్చి స్థిరపడ్డాడు. అప్పటికి మంచి పలుకుబడిలో వున్న విగ్ పార్టీకి సలహాదారుడుగా వుండేవాడు. అతనికి నడివయస్సులోనే ఉబ్బసం వ్యాధి పట్టుకున్నది. లండన్ వాతావరణం అతనికి పడలేదు. తుది సంవత్సరాలు లండన్‌లోకాక, ఇంగ్లండు దక్షిణాన ఓట్స్‌లో గడిపాడు. వార్ధక్యం ప్రశాంతంగానే గడిచింది. లండన్ నుంచి వారూ, వీరూ వచ్చి అతడిని పలకరించి పోతూ వుండేవారు. అలా వచ్చిపోయే వారిలో న్యూటన్ ఒకడు. ఇరువురు తాత్విక చర్చలు జరిపేవారు. 1704 లో 72 వ ఏట జాన్ లాక్ అంతిమశ్వాస విడిచాడు.

తాత్విక ప్రపంచంలో లాక్‌కు పేరు తెచ్చిన గ్రంథం, తత్వశాస్త్రాన్ని ఒక మలుపు తిప్పిన గ్రంథం "ఎస్సే కన్‌సర్నింగ్ హ్యూమన్ అండర్‌స్టాండింగ్" అనేది. హాలెండులో ప్రశాంత జీవితం గడిపిన రోజులలో దీన్ని రచించాడు. ఇంగ్లండు వచ్చిన తర్వాత 1690 లో ప్రచురించాడు. ఎంపిరిసిజానికి, అంటే అనుభూతివాదం, లేదా అనుభవవాదానికి ఇది మూల గ్రంథం.

బుద్ధివాదం ప్లేటో నాటినుంచి వున్నది. దేకార్త్ ప్రభృతులు దాన్ని పోషించారు. మానవుడు స్వతస్సిద్ధమైన భావాలతో జన్మిస్తాడని దేకార్త్‌వాదం. ఆ భావాలను (Innate ideas) అంటారు. ఈ వాదాన్ని లాక్ తన అనుభూతి వాదంతో సవాలు చేశాడు.

## మనస్సు ఖాళీ పలక

మనిషి జన్మించినప్పుడు అతని మనస్సు ఖాళీ పలక (tabula rasa) వలె, తెల్ల కాగితంవలె వుంటుందని లాక్ వాదం.

జన్మతోనే అన్ని భావాలు మానవ మనస్సులో నిక్షిప్తమైవుంటే శిశువులు పరమ జ్ఞానులు కావాలి. ఆటవికులు కూడా సకల విజ్ఞాన పారంగతులు కావాలి. మందబుద్ధులనేవారు వుండరు. విద్యార్జనకు అర్థమే వుండదు. కాని, అలా జరగడం లేదుకదా?

అలాగే నీతి సూత్రాలు కూడా స్వతస్సిద్ధమైనవి కావు. విశ్వజనీనమైన నైతికత్వం (morality) లేదు. మంచి - చెడు, పుణ్యం - పాపం వంటివి దేశకాల పాత్రలను బట్టి భేదిస్తాయి. ఒకరికి మంచి మరొకరికి చెడు. ఒకరికే భిన్న కాలాలలో మంచి, చెడు తారుమా రవుతాయి. ఒక దేశంలో మంచి మరొక దేశంలో చెడు. ఒక కాలంలో చెడు మరొక కాలంలో మంచి. ఏది మంచి, ఏది చెడు అనే మీమాంసకు ఎప్పుడూ తావు వుంటుంది. కనుక సార్వజనీనమైన విలువలు లేవు.

దేవు డున్నాడనేది కూడా స్వతస్సిద్ధ సత్యం కాదు. ఒకరి దేవుడు మరొకరికి దేవుడు కాదు. అసలు దేవుడనే భావమే ఎరగని జాతు లుండవచ్చు కూడా.

స్వతస్సిద్ధ భావాలనేవి లేకపోతే, మనకు కలిగే జ్ఞానమంతా ఎక్కడినుంచి వస్తున్నది అని ప్రశ్న రావచ్చు. "ఒక్కముక్కలో చెప్పాలంటే అనుభవం నుంచే వస్తున్నది" అని లాక్ సమాధానం చెపాడు. ఇంద్రియానుభవం (sensory experience) వల్లనే మనకు భావాలు కలుగుతున్నాయి.

జ్ఞానం రెండు రకాలుగా వస్తుంది. ఒకటి – జ్ఞానేంద్రియాల (sensation) ద్వారా, రెండు-వివేచన (reflection) ద్వారా.

బాహ్య జగత్తును గురించి జ్ఞానేంద్రియాల ద్వారా మనకు భావాలు కలుగుతాయి. అలా కలిగిన భావాలను గురించి మనస్సు వివేచిస్తుంది. అంటే ఆలోచిస్తుంది, తర్కిస్తుంది, సందేహిస్తుంది, విశ్లేషిస్తుంది, భావిస్తుంది, ఊహిస్తుంది, సంకల్పిస్తుంది. అది ఇంద్రియ జ్ఞానం, ఇది వివేచనా జ్ఞానం.

## రెండు రకాల భావాలు

ఒక్కొక్క జ్ఞానేంద్రియం ద్వారా ఒక్కొక్క రీతి ఇంద్రియ భావాలు కలుగుతాయి. వీటిని ప్రాథమిక భావాలు (simple ideas) అని లాక్ అన్నాడు. కంటితో రంగు చూస్తాము. చెవితో ధ్వని వింటాము. నాలుకతో రుచి చూస్తాము. ముక్కుతో వాసన చూస్తాము. చర్మంతో వేడి, చల్లదనం, గట్టిదనం మొదలైన గుణాలు తెలుసుకుంటాము. ఇవి ప్రాథమిక భావాలు ఎందుకైనాయంటే వాటిని అంతకంటె విభజించడానికి వీలులేదు. వాటికి అవే సాటి. తెలుపు అంటే తెలుపే, నలుపు కాదు. వేడి అంటే వేడే, మరొకటి కాదు. ఇవి సింపుల్ భావాలు.

ఇవికాక సంక్లిష్ట భావాలు (complex ideas) అనేవి వేరే వుంటాయి. జ్ఞానేం

ద్రియాల ద్వారా కలిగిన ప్రాథమిక భావాలు వెంటనే తొలగిపోవు, మాయంకావు, ఎదురుగా వస్తువు లేకపోయినా, అది కలిగించిన భావం మనస్సులో మిగిలిపోతుంది; దాని ముద్ర మిగిలిపోతుంది. అలా ఎగిలిపోయిన భావాల జాడలను గురించి మనస్సు వివేచిస్తుంది. ఆయా భావాలమధ్య సాదృశ్యాలను,-విభేదాలను మననం చేస్తుంది. వాటిని రకరకాలుగా సంక్లిష్టం చేస్తుంది. విశ్లేషణ చేస్తుంది. ఆ విధంగా సంక్లిష్ట భావాలు ఏర్పడతాయి.

ఉదాహరణకి ఒక వస్తువును చూస్తాము, అలాంటిదే మరొకదాన్ని చూస్తాము. ఆ రెండింటిని మన మనస్సు పోల్చుకుని "జంట" అనే భావాన్ని ఏర్పరుచుకుంటుంది. జంట అనేది బాహ్య ప్రపంచంలో లేదు. అక్కడ వున్నవి రెండు వేర్వేరు వస్తువులు. వాటిని మనస్సు పోల్చిచూసి జంట అనే భావాన్ని కల్పించుకుంటుంది.

## మనస్సు సృష్టించే భావాలు

ప్రాథమిక (simple) భావాలు వాటంతటఅవే కలుగుతాయి. మనస్సు పాత్ర ఏమీ వుండదు. కాని సంక్లిష్ట భావాలను కలిగించుకోవడంలో మాత్రం మనస్సు చురుకుగా పనిచేస్తుంది. మనస్సే లేకపోతే సంక్లిష్ట భావాలు ఏర్పడవు. జ్ఞానేంద్రియాలనేవి బహిరింద్రియాలైతే మనస్సు అంతరింద్రియం. మనస్సు ప్రాథమిక భావాలను కలుపు తుంది, వేరు చేస్తుంది, పునరావృత్తం చేస్తుంది, పోల్చుతుంది. ఈ విధంగా కొత్త సంక్లిష్ట భావాలను సృష్టిస్తుంది. ప్రాథమిక భావాలను మనస్సు సృష్టించలేదు, నశింపజేయలేదు. అనుభవం ద్వారా—అనుభవం తర్వాతనే—అవి కలుగుతాయి.

మరొక ఉదాహరణ-స్థలం (space) అనే భావం స్పర్శద్వారా, చూపు ద్వారా కలుగుతుంది. అలాగే మనలోకలిగే భావాలమధ్య అంతరాన్ని (duration) బట్టి కాలం (time) అనే భావం కలుగుతుంది. స్థలాన్ని నిరవధికంగా పొడిగించడం ద్వారా అనంతత్వం (infinity) అనే సంక్లిష్టభావం ఏర్పడుతుంది. కాలాన్ని అనంతంగా పొడిగించడం ద్వారా నిత్యత్వం (eternity) అనే సంక్లిష్టభావం ఏర్పడుతుంది. నిజానికి అనంతత్వం, నిత్యత్వం అనే భావాలు బాహ్య ప్రపంచంలో కనబడేవి కావు, అవి కేవలం ఇంద్రియ గ్రహణశక్తి (perception) ద్వారా, వివేచన (reflection) ద్వారా మనస్సు సృష్టించుకున్న భావాలు.

అలాగే శక్తి (power) అనే భావం. అది ఇంద్రియాలకు గోచరం కాదు. కాని, నిప్పువద్ద మైనం వుంచినప్పుడు మైనం కరగడాన్ని చూస్తాము. దాన్నిబట్టి ఉష్ణశక్తి అనే భావాన్ని మనస్సు ఊహిస్తుంది.

## సాధారణీకరణం

మరొక ఉదాహరణ-సౌందర్యం. ఒక వస్తువు మనకు ఆనందం కలిగిస్తుంది. దాన్ని సుందర వస్తువుగా గ్రహిస్తాము. ఆ విధంగా ఆనందం కలిగించే అనేక సందర్భాల అనుభవం తర్వాత వాటిని సాధారణీకరించి సౌందర్యం అనే భావాన్ని ఏర్పరుచుకుంటాము. నిజానికి సౌందర్యం అనేది బాహ్యప్రపంచంలో లేదు. మనకు కలిగే సుఖానుభవాలవల్ల సౌందర్యభావం కలుగుతుంది. అలాగే మాన వజాతి, సైన్యం, ప్రపంచం సుఖం, దుఃఖం, బాధ, మంచి, చెడు మొదలైన సాధారణీకరణాలన్నీ సంక్లిష్ట భావాలకు ఉదాహరణలు.

మరొకరకం సంక్లిష్టభావాలు వస్తువుల పరస్పర సంబంధాలను బట్టి కలుగు తాయి. వీటిలో అన్నిటికంటె ముఖ్యమైనది కార్య కారణ సంబంధం (cause and effect relation). వివిధ వస్తువులమధ్య సాదృశ్యాలు, విభేదాలు కూడా ఈ తరగతి కిందికే వస్తాయి.

మరొక ముఖ్యమైన సంక్లిష్ట భావశ్రేణి పదార్థాలకు (substances) సంబం ధించినది. మనకు అనంతకోటి భావాలు కలుగుతాయి. ఈ భావాలకు ఆధారం ఏమిటి? వాటంతట అవి కలగవు కదా? ఏదో పదార్థం ఆ భావాలను మనలో కలిగిస్తున్నది. ఆ పదార్థం భౌతికం కావచ్చు. లేదా అభౌతికం కావచ్చు. మొత్తంపై ఏదో పదార్థం తనంతట తాను స్వతస్సిద్ధంగా లేకపోతే దానికి సంబంధించిన భావం మనలో కలగదు. ఆ పదార్థం ఏమిటని అడిగితే మనం ఇదమిత్థమని మాటలలో చెప్పలేము. దాన్నే "సబ్ స్టైన్స్" (substance) అని లాక్ అన్నాడు.

బాహ్యవస్తువు మన ఇంద్రియాలపై పనిచేసినప్పుడు ఆ బాహ్యవస్తువుయొక్క భావం (idea) మన మనస్సులో కలుగుతుంది. ఉదాహరణకు ఒక వేడి వస్తు వును తాకినప్పుడు ఆ స్పర్శ మన మెదడులోకి వెళ్లి వేడి అనే భావాన్ని మనలో కలిగిస్తుంది. అలాగే ఒక తెల్లని మల్లెపువ్వును చూస్తాము. మన మనస్సులో తెలుపు అనే భావం కలుగుతుంది.

దీన్నిబట్టి మనం ఇంద్రియాల ద్వారా చూసేవి, గ్రహించేవి ఆయా వస్తు వుల యొక్క భావాలు, వాటి ప్రతిబింబాలు, వాటి అభాసలే (appearances) తప్ప అసలు వస్తువులు కావు అని గ్రహించవచ్చు. మనకు ఇంద్రియానుభవంలోకి వచ్చేది అసలు వస్తువులతో కూడిన జగత్తుకాదు, ఆ జగత్తు యొక్క అభాస మాత్రమే మనకు అనుభూత మవుతున్నది.

## రెండురకాల గుణాలు

వస్తువులకు రెండు రకాల గుణాలున్నాయి. మొదటివి- మౌలిక గుణాలు (primary or original qualities). రెండవరకం ఆభాసిక గుణాలు (secondary qualities).

వస్తువుకుగల విస్తృతి (అంటే అది ఆక్రమించే చోటు), సంఖ్య, చలనం, స్తబ్ధత, ఘనత్వం (solidity). ద్రవ్యరాశి (mass), ఆకారం (figure). పరిమాణం (size) మొదలైనవన్నీ దాని మౌలిక గుణాలు. ఇవి వస్తువును స్వతహాగా అంటిపెట్టుకుని వుంటాయి. ఈ గుణాలు లేని వస్తువును ఊహించలేము.

ఉదాహరణకు ఒక గోధుమగింజ వున్నది. దాన్ని రెండుగా చేస్తే రెండు ముక్కలు వస్తాయి. అయినా ఆ ముక్కలలో ప్రతిదానికి పైన చెప్పిన మౌలిక గుణాలన్నీ వుంటాయి. అలా ఒక్కొక్క ముక్కను ఎన్ని ముక్కలుగా విభజించినా అన్నిటిని వాటి మౌలిక గుణాలు అంటిపెట్టుకునే వుంటాయి. ఆ గుణాలలో ఏ మార్పు రాదు.

ఇవికాక, వస్తువుకు ఆభాసిక గుణా లుంటాయి. అంటే అవి వస్తువులలో వున్నట్టు కనిపిస్తాయిగాని, నిజంగా వుండవు. ఉదాహరణకు ఒక గులాబీ పువ్వు వుంది. అది ఎర్రగా వుంది. కాని, వాడిపోతే ఎరుపురంగుపోయి నలుపు వస్తుంది. కనుక ఎరుపు అనేది గులాబీ మౌలిక గుణం కాదు. చీకటిలో అసలు ఏ రంగు కనబడదు. కనుక రంగు అనేది వస్తువులో వున్నట్టు కనబడే ఆభాస గుణం మాత్రమే. అలాగే ధ్వని, వాసన, రుచి, వేడిమి, చల్లదనం మొదలైనవి కూడా ఆభాసిక గుణాలు మాత్రమే. అవి వస్తాయి, పోతాయి. వస్తువులో స్వతహాగా వుండవు. ఆ గుణాలను మన ఇంద్రియాల ద్వారా మన మనస్సుకు తెలిసేటట్టు చేసేశక్తి ఆ వస్తువుకు వుండడం వల్లనే అయా గుణాలు ఆ వస్తువులోనే వున్నట్టు మనం భ్రమపడుతున్నాము. అవి నిజంగా వస్తువులో లేవు. మన మనస్సు ఇంద్రియానుభూతి ద్వారా వాటిని కల్పించుకుంటున్నది. అంతే.

## మనస్సు కల్పన

ఒక పాట వింటాము. అది శ్రావ్యంగా వున్నదనుకుంటాము. కాని, శ్రావ్యత ఆ ధ్వనిలో నిజంగా లేదు. అది మన మనస్సు కల్పించుకున్నదే. చెవిటివాడికి అసలు ధ్వనే లేదు. ఒక పువ్వు వాసన చూస్తాము. అది సువాసనగా వున్నదనే భావాన్ని కలిగించేది మన మనస్సే. మనకు జలుబు చేసి

నప్పుడు పువ్వునుంచి ఏ వాసన గ్రహించలేము. కనుక వాసన అనేది పువ్వులో స్వతహాగా లేదు. ముక్కు ద్వారానే వాసనను మనస్సు గ్రహించగలుగుతున్నది. ఈ విధంగా ఈ అభాసిక గుణాలన్నీ (secondary qulities) మన ఇంద్రియాల స్థితిపై ఆధారపడినవే తప్ప వస్తుతహా లేవు. అవి మౌలికమైనవి కావు.

ఇకపోతే, మనకు లభించే జ్ఞానం నమ్మదగిందో, కాదో ఎలా తెలుస్తుంది?

నిశ్చయ జ్ఞానం (certain knowledge) అనేది ఏ రెండు భావాల మధ్యనైనా పొంతన (agreement) వున్నదా, లేదా అనే దానిపై ఆధారపడి వుంటుంది.

## నిశ్చయ జ్ఞానం

అట్టి పొంతన వున్నదా, లేదా అనేది తిరిగి మూడురకాల జ్ఞాన మార్గాలపై ఆధార పడి వుంటుంది. ఒకటి- అంతః ప్రబోధం (intuition), రెండు భావాల మధ్య పొంతన వున్నదా, లేదా అనేది దానంతట అదే ఎట్టి రుజువులు లేకుండా మనకు తెలిసిపోతే అది ఇంట్యూష్యన్ అవుతుంది. ఉదాహరణకి- "నేను వున్నాను" అనే జ్ఞానం అటువంటి అంతః ప్రబోధంవల్ల,ఇంట్యూష్యన్‌వల్ల కలుగుతుంది. దీనికి వేరే రుజువు లక్కరలేదు. అది తిరుగులేని నిశ్చయజ్ఞానం.

అలాకాక తార్కికమైన రుజువుల (demonstration) వల్లకూడా నిశ్చయజ్ఞానం లభించవచ్చు కాని ఈ జ్ఞానమార్గం ఇంట్యూష్యన్ అంతగా నిశ్చయజ్ఞానాన్ని కలిగించదు. ఈ మార్గాన దేవుని గురించిన జ్ఞానం లభిస్తుందని ఒక ఉదాహరణగా లాక్ పేర్కొన్నాడు.

మూడవది ఇంద్రియ జ్ఞానం. ఇంద్రియ భావాలు (sense impressions) వాటంతట అవి కలగవు. కనుక, వాటిని కలిగించే బాహ్య వస్తువులు వున్నాయనే నిర్ధారించుకోవచ్చు. ఈ మార్గాన ఒక మేరకు మాత్రమే జ్ఞానం లభిస్తుంది. కాని, అది నూటికి నూరుపాళ్లు నిశ్చయ జ్ఞానం కాదు. రకరకాల సైన్సుల నుంచి లభించేది ఇటువంటి జ్ఞానమే.

కనుక, ఈ విధంగా మనకు లభించే జ్ఞానానికి కొన్ని పరిమితు లున్నాయని లాక్ అభిప్రాయపడ్డాడు. ఈ అభిప్రాయమే అతని లిబరలిజానికి పునాది.

# లిబరల్ బూర్జువా ప్రజాస్వామ్యవాది లాక్

మనం ఈనాడు ప్రజాస్వామిక గణతంత్ర రాజ్యంలో జీవిస్తున్నాము. వంశ పారంపర్యంగా రాజకీయాధికారం పొందే రాజు మనకి లేదు. కనుక, మనది గణతంత్ర (రిపబ్లిక్) రాజ్యం. ప్రజలదే అంతిమాధికారం. కనుక, మనది ప్రజాస్వామ్య వ్యవస్థ (డెమోక్రసీ).

నిర్ణీత వ్యవధులలో పార్లమెంటుకు ఎన్నికలు జరుగుతాయి. వేర్వేరు పార్టీలు పోటీ చేస్తాయి. ప్రజలు స్వేచ్ఛగా తమ ప్రతినిధులను ఎన్నుకుంటారు. పార్లమెంటులో ఏ పార్టీకి మెజారిటీవస్తే, ఆ పార్టీ ప్రభుత్వాన్ని ఏర్పరుస్తుంది. పార్లమెంటు శాసనాలు చేస్తుంది. వాటిని ప్రభుత్వం అమలుచేస్తుంది. శాసనాలు రాజ్యాంగ బద్ధమైనవో కావో నిర్ధారించడానికి స్వతంత్ర న్యాయ వ్యవస్థ ప్రత్యేకంగా వుంటుంది. ఒక పార్టీ మెజారిటీ కోల్పోతే, మరొక పార్టీ అధికారానికి వస్తుంది. అంతే తప్ప ప్రభుత్వాధికారం వంశ పారంపర్యంగా సంక్రమించదు.

కొన్ని మార్పులు, చేర్పులతో ఇటువంటి ప్రజాస్వామ్య వ్యవస్థ ఈనాడు అనేక దేశాలలో అమలులో వుంది. బ్రిటన్, స్వీడన్, నార్వే మొదలైన దేశాలలో వంశ పరంపరానుగతమైన రాజరికం వున్నమాట నిజమే. కనుక, అవి గణతంత్ర రాజ్యాలు కావు. అయినా, అవి రాజ్యాంగ బద్ధమైన రాజరికాలు. అంతిమాధికారం ప్రజలదే. పార్లమెంటును,ప్రభుత్వాలను ఎన్నుకునే హక్కు ప్రజలదే కనుక, అవి ప్రజాస్వామిక రాజ్యాలు.

అమెరికాలో ప్రెసిడెంట్‌ను, పార్లమెంటును ప్రజలే ఎన్నుకుంటారు. కనుక, అది ప్రజాస్వామిక గణతంత్ర రాజ్యం.

కొన్ని దేశాలలో వంశ పారంపర్యంగా వచ్చే నిరంకుశ రాజరికం నేటికీ వున్నది. మరికొన్ని రాజ్యాలలో రాజరికం లేకపోయినప్పటికీ, తమ ప్రభుత్వాన్ని స్వేచ్ఛగా ఎన్నుకునే హక్కు, ప్రభుత్వ వ్యవస్థను మార్చివేసే హక్కు ప్రజలకు లేదు. అవి గణతంత్ర రాజ్యాలైనా, ప్రజాస్వామ్య రాజ్యాలు కావు. అవి నియంతృత్వ రాజ్యాలు.

## లిబరల్ ప్రజాస్వామ్యం

ఇన్ని రకాల రాజ్యవ్యవస్థలలో రాజ్యాంగబద్ధమైన, లిబరలిజం ప్రాతిపదిక గాగల ప్రజాస్వామ్యమే న్యాయసమ్మతమైనదిగా, ఉత్తమమైనదిగా కనిపిస్తుంది. నిరంకుశ రాజ్యాధికారం వంశపారంపర్యంగా రావాలని ఎవరైనా వాదిస్తే అది మనకు విడ్డూరంగా, అభివృద్ధి నిరోధకంగా కూడా కనిపిస్తుంది.

అయితే, ఒకప్పుడు చరిత్రలో అతి దీర్ఘకాలంపాటు నిరంకుశ, వంశ పరంపరాగత రాజ్యాధికారమే వుండేది. మనదేశంలో సూర్యవంశపు రాజులు, చంద్రవంశపు రాజులు వుండేవారు. యూరప్‌లో రాజులు తమకు దైవదత్తమైన హక్కులు, అధికారాలు (divine right of kings) కలవని భావించేవారు. ఈ దైవదత్తాధికార వాదాన్ని తిరస్కరించి ప్రాథమిక సత్యాలను సంపాదించుకొన

డానికి ప్రజలు తిరుగుబాట్లు చేయవలసి వచ్చింది. ఇటువంటి తిరుగుబాట్లకు 17 వ శతాబ్దంలో ఇంగ్లండు మార్గ దర్శకత్వం వహించింది. పార్లమెంటరీ ప్రజాస్వామ్యానికి కూడా దారి చూపింది. ఈ వ్యవస్థకు తాత్వికమైన పునాది వేసినవాడు జాన్ లాక్.

తన రాజకీయ సిద్ధాంతాలను వివరిస్తూ లాక్ రెండు గ్రంథాలు (Two Treatises of Civil Government) వ్రాశాడు. మొదటిదానిలో రాజుకు దైవదత్తమైన హక్కు లంటూ ఏమీ లేవని నిరూపించాడు. ఇందుకోసం ఒక గ్రంథం వ్రాయవలసి రావడమే ఈనాడు మనకు వింతగా కనిపిస్తుంది. కాని, అప్పటిలో "నా విష్ణుః పృథివీ పతిః" అనేది ఒక తిరుగులేని సూత్రంగా చెలామణి అయ్యేది.

సర్ రాబర్ట్ ఫిల్మర్ అనే రచయిత రాజుల దైవదత్తాధికారాలను సమర్థించడానికి "పేట్రియార్కా" అనే ఒక ఉద్గ్రంథం వ్రాశాడు. ఆదిమానవుడైన ఆడమ్‌ను స్వయంగా దేవుడే ఈ భూమండలానికి రాజును చేశాడట. కనుక రాజులందరు ఆడమ్ వారసులేనట. రాజుల నిరంకుశాధికారాన్ని కూడా ఫిల్మర్ సమర్థించాడు. ఒక కుటుంబంలో తండ్రికి తన పిల్లలపై వుండే అదికారం వంటిదే రాజుకు తన ప్రజలపై వుంటుందని అతడు వాదించాడు.

## రసెల్ వాదం

రాజకీయాధికారం వంశపారంపర్యంగా రావాలన్న వాదం మనకు నేడు అసంబద్ధంగా కనిపిస్తుంది. దాన్ని ప్రజలు ఎలా అంగీకరించారా అని ఆశ్చర్యం కలుగుతుంది. కాని, అందులో ఆశ్చర్యపడదగిందేమీ లేదని బెర్ట్రాండ్ రసెల్ తన "హిస్టరీ ఆఫ్ ఫిలాసఫీ"లో వ్రాశాడు.

ప్రభుత్వాధికారం పార్లమెంటులో మెజారిటీగల పార్టీ ఎన్నుకున్న ప్రధాన మంత్రి చేతిలో వున్నదనుకోండి. ఆ ప్రధానమంత్రి సంతానానికి ప్రభుత్వాధికారం వంశ పారంపర్యంగా రావాలనడం మనకు అసంబద్ధంగా కనిపిస్తుంది.

కాని, ఆర్థికమైన అధికారం వంశపారంపర్యంగా రావడంలో మాత్రం మనకు అసంబద్ధత ఏమీ కనిపించదు. ఉదాహరణకు ఒక పెట్టుబడిదారు వున్నాడు. కార్మికుల శ్రమశక్తి ఫలితంగా అతడు కోట్లు విలువచేసే ఆస్తి సంపాదించాడు. దాన్ని అతని సొంత ఆస్తి [private property] గానే మనం పరిగణిస్తాము. తన ఆస్తిని పెట్టుబడిదారు అన్ని హక్కులతోను తన సంతానానికి అప్పగిస్తే, లేదా తన ఇష్టం వచ్చినట్టు వినియోగిస్తే అది మనకు విడ్డూరంగా, అసంబద్ధంగా

కనిపించదు. నిజానికి తన ఆస్తితో తన ఇచ్చవచ్చినట్టు చేయరాదంటేనే మనకు విడ్డూరంగా, అన్యాయంగా కనిపిస్తుంది.

అలాగే ఒక భూస్వామి తన పొలాన్ని అన్ని హక్కులతోను తన సంతానానికి సంక్రమింపజేస్తే అది మనకు వింతగా తోచదు. అలా సంక్రమింప చేయరాదంటేనే అన్యాయంగా తోస్తుంది.

కనుక ప్రభుత్వాధికారంపై వంశపారంపర్యపు హక్కును ఖండించే మనం ఆర్థిక పరమైన హక్కులకు వంశపారంపర్య సూత్రాన్ని అంగీకరిస్తున్నా మన్న మాట. ఇది తప్పు అనిగాని, ఒప్పు అనిగాని రసెల్ చెప్పడు. ఒకప్పుడు రాజులు తమ రాజ్యాలను సొంత ఆస్తులుగా పరిగణించడం ఎలా జరిగిందో, అది ప్రజల దృష్టిలో సమ్మతమైనదిగా ఎలా చెల్లుబడి అయిందో చూపించడానికే ఈ దృష్టాంతాన్ని రసెల్ పేర్కొన్నాడు. కమ్యూనిస్టు రాజ్యాలలో రాజకీయాధికారమేకాక, ఆర్థికాధికారం కూడా ప్రభుత్వంలోనే కేంద్రీకృతమై వుండడాన్ని కూడా రసెల్ పేర్కొన్నాడు. కమ్యూనిస్టు రాజ్యాలలో సొంత ఆస్తి అనే వ్యవస్థ లేదు.

సరే. ఇప్పుడు లాక్ రాజకీయ సిద్ధాంతాలను చూద్దాము. అతడు తన మొదటి గ్రంథంలో రాజుల దైవదత్తాధికారాన్ని ఖండించాడు. రెండవదానిలో ప్రభుత్వాధికారానికి మూలాధారాన్ని, దాని స్వభావాన్ని వివరించాడు. ప్రజాస్వామ్య సంప్రదాయాల చరిత్రలో ఈ గ్రంథానికి చాలా ప్రాముఖ్యం వుంది.

## స హ జ స్థి తి

థామస్ హాబ్స్ వర్ణించిన ఒకానొక ఆదిమ కాలాన్ని గురించి ఇంతకు ముందు ఒక అధ్యాయంలో చదివాము. ఆదిమ యుగంలో మానవులు సహజస్థితి [State of nature] లో జీవించేవారని హాబ్స్ ఊహించాడు. ప్రభుత్వం అనేది లేనందున సహజస్థితిలో న్యాయ శాసనాలు లేవు : ధర్మాధర్మ విభజన లేదు. మానవులు యథేచ్ఛగా ప్రవర్తించేవారు. ఒకరి ఇచ్ఛ మరొకరి ఇచ్ఛకు విధిగా అడ్డు వస్తుంది కనుక, ఆ కాలంలో మానవులు నిరంతర యుద్ధ స్థితిలో మవుండేవారు. ఆ స్థితినుంచి బయటపడడానికిగాను వారు తమలో తాము ఒక ఒప్పందానికి [Social Contract] వచ్చి, తమపై సర్వాధికారాలను ఒక సార్వభౌముడికి [Sovereign] అప్పగించారు. ఆ విధంగా రాజరికం, ప్రభుత్వం ఏర్పడ్డాయని హాబ్స్ సిద్ధాంతం.

జాన్ లాక్ కూడా ఆదిమయుగంలో మానవులు సహజస్థితిలో వుండేవారని

భావించాడు. కాని అతడు ఊహించిన సహజస్థితి హాబ్స్ ఊహకు వ్యతిరే కమైనది. హాబ్స్ సహజస్థితివాదం ప్రకారం మానవులు నిరంతర ఘర్షణలో జీవించేవారు. అధర్మం నాలుగుపాదాల నడిచేది. కాని, లాక్ ఊహించిన సహజస్థితిలో ధర్మం దాదాపు నాలుగు పాదాలలో నడిచేది. ప్రభుత్వం అనేది లేకపోయినా, ప్రజలమధ్య సహజన్యాయం [Law of nature]అమలులో వుండేది. మానవు లందరు సమానులే. ఒకరు ఎక్కువ, ఒకరు తక్కువ అనేది లేదు. అందరికీ సమాన స్వేచ్ఛ వుండేది. అయితే ఆ స్వేచ్ఛ విశృంఖలత్వం కాదు. ఎవరికి తోచినట్లు వారు, ఎవరి సౌఖ్యంకోసం వారు ఎలా ప్రవర్తించినా, ఒకరి హక్కులకు ఒకరు భంగం కలిగించడం, ఒకరికొకరు హాని చేయడం వుండేది కాదు.

## సహజ న్యాయం

అంతమాత్రాన అది ఆదర్శప్రాయమైన స్థితి అని కాదు. మానవులందరు స్వతస్సిద్ధంగా మంచివారని లాక్ అభిప్రాయం కాదు. సహజన్యాయాన్ని తరచుగా ఎవరో ఒకరు ఉల్లంఘించేవారు. అన్యాయంగా పరుల ఆస్తిని కాజే యడానికి, పరుల హక్కులకు భంగం కలిగిండానికి ప్రయత్నించేవారు ఎప్పుడూ వుంటారు.

అటువంటి అన్యాయ వర్తనులను శిక్షించడానికి, వారినుంచి తమ్ము తాము రక్షించుకొనడానికి ప్రతివాడికి హక్కు వుండేది. సహజన్యాయం ప్రకారం ఎవడికి వాడే న్యాయమూర్తివలె ప్రవర్తించే వాడు. తనకు అన్యాయం తలపెట్టినవా డిని, తన హక్కులకు అడ్డువచ్చినవాడిని శిక్షించే హక్కు కలిగి వుండేవాడు.

అయితే, అటువంటి సహజ స్వత్వాల [natural rights] వల్ల కొన్ని ఇబ్బం దులు కలిగేవి. సహజస్థితిలో అందరు సమానులే. కనుక ఎవడికి వాడే రాజు, ఎవడికి వాడే జడ్జి. నింద మోపేవాడు, శిక్ష అమలుచేసేవాడు ఒకడే. అందుచేత తనకు జరిగిన అన్యాయానికి ప్రతివాడు పగ తీర్చుకొనడానికి ప్రయ త్నించేవాడు. అది వాడికి సహజమైన హక్కు అయినప్పటికీ, దానివల్ల మానవుల మధ్య సంఘర్షణ, అశాంతి ఏర్పడేవి. నేరంకంటె శిక్ష ఎక్కువ మోతాదులో వుండడానికి అవకాశం కలిగేది.

## రాజ్యం ఏర్పాటు

ఈ చిక్కును పరిహరించడానికే మానవులు తమ హక్కులను- ముఖ్యంగా సహజ న్యాయాన్ని అమలుచేసే హక్కును- స్వచ్ఛందంగా వదులుకొని ఒక ప్రభు

త్వాన్ని ఏర్పరచుకుని దానికి ఆ బాధ్యత అప్పజెప్పారు. తామంతా కలసి ఒక సంఘంగా, రాజ్యంగా ఏర్పడ్డారు. న్యాయం అమలు చేసే అధికారాన్ని ప్రభుత్వానికి అప్పగించారు.

సోషల్ కాంట్రాక్టు (ప్రజల ఒప్పందం) జరిగినప్పుడు ప్రజలు తమ సర్వస్వత్వాలను, స్వేచ్ఛలను ప్రభుత్వానికి ధారాదత్తం చేయరు. ప్రజల ప్రాథమిక స్వత్వాలను, ప్రాథమిక స్వేచ్ఛలను అపహరించే అధికారం ప్రభుత్వానికి లేదు. వాటిని పరిరక్షించడానికి అవసరమైన అధికారమే ప్రభుత్వానికి వుంటుంది. ప్రజల ప్రాథమిక స్వత్వాలు తిరుగులేనివి (inalienable). ప్రజలకు వారి ప్రాథమిక స్వత్వాలను కలగజేసేది ప్రభుత్వం కాదు. ప్రభుత్వం అనే వ్యవస్థ ఏర్పడడానికి ముందునుంచే అవి ప్రజలకు స్వతస్సిద్ధంగా వుంటాయి. అవి సహజస్థితి (state of nature)కాలం నుంచి రాజ్య వ్యవస్థ (Civil Government) లోకి కూడా కొనసాగుతూ వస్తాయి.

## ఆస్తి రక్షణకే రాజ్యం

ప్రభుత్వపు ప్రప్రథమ కర్తవ్యం ప్రజల ఆస్తులకు రక్షణ కల్పించడమేనని లాక్ భావించాడు. ప్రజల సొంత ఆస్తికి అతడు అగ్రప్రాధాన్య మిచ్చాడు. దాని పరిరక్షణ కోసమే ప్రభుత్వం అవసర మవుతుంది. సహజ స్థితిలో తన ఆస్తి పరిరక్షణ బాధ్యతను వ్యక్తియే నిర్వహించేవాడు. కాని, దానివల్ల కలిగే ఇబ్బందులను పరిహరించడానికి మానవులు ఆ బాధ్యతను ప్రభుత్వం అనే సమిష్టి సంస్థకు అప్పగించారు. ఆ బాధ్యతను ఒక ప్రభుత్వం సరిగా నిర్వర్తించలేకపోతే, ప్రజల న్యాయమైన హక్కులను ఉల్లంఘిస్తే ఆ ప్రభుత్వంపై తిరుగుబాటు చేయడానికి, మరొకదానిని ఎన్నుకొనడానికి ప్రజలకు స్వతస్సిద్ధమైన హక్కు వుంటుంది.

అధికారం ఒక వ్యక్తిలో, లేదా ఒక సంస్థలో కేంద్రీకృతం కారాదు. శాసనాలు చేసేది, వాటిని అమలు చేసేది ఒకరే కారాదు. అలా ఒకరే అయితే, అది నిరంకుశత్వంగా పరిణమిస్తుంది. ప్రభుత్వాధినేత పరిపాలించాలి; శాసనాలు చేయరాదు. ప్రభుత్వాధికారం అనేది ప్రజా శ్రేయస్సాధన అనే పరిధిని దాటిపోరాదు. కనుక ప్రభుత్వం కూడా ఒక రాజ్యాంగానికి లోబడి వుండాలి.

ప్రజలలో అధిక సంఖ్యాకులు తనకు అధికారం అప్పగించినందువల్లనే ప్రభుత్వానికి పరిపాలనాధికారం సంక్రమిస్తుంది. కనుక తనకు మెజారిటీ బలం వున్నంతవరకే ప్రభుత్వానికి అధికారం వుంటుంది. ప్రభుత్వం మెజారిటీ అభిప్రా

యాన్ని మన్నించకపోయినా, రాజ్యాంగాన్ని ఉల్లంఘించడం మొదలు పెట్టినా దాన్ని తొలగించే హక్కు ప్రజలకు వుంటుంది.

## పెట్టుబడిదారీ ప్రవక్త

రాజకీయంగా లాక్ లిబరల్ ప్రజాస్వామ్యవాది. ఆర్థిక సిద్ధాంత దృష్ట్యా పెట్టుబడిదారీ వ్యవస్థకు తాత్విక ప్రవక్త. అతని వాదం ప్రకారం వ్యాపార వర్గాలవారు ఎంత అస్తినైనా కూడబెట్టవచ్చు. భూస్వామ్య వర్గాలు మాత్రం తాము వ్యక్తిగతంగా సేద్యం చేయగలిగిన దానికంటె ఎక్కువ భూమికి హక్కు దార్లు కారాదు. ఈ వాదం లాక్ ఫ్యూడలిజం వ్యతిరేకత నుంచి వచ్చింది.

లాక్ లిబరలిజానికి పునాది అతని ఎంపిరిసిస్టు తాత్విక దృష్టి.

మనకు కలిగే వివిధ భావాలమధ్య పొంతన (agreement) వున్నదా లేదా అనే దాన్నిబట్టి మన జ్ఞానం సరియైనదో కాదో నిర్ధారణ చేసుకోవాలి. అటువంటి నిర్ధారణ అంతర్బుద్ధి (intuition) ద్వారా సంపాదించగలిగితే మనకు నిశ్చయజ్ఞానం (certain knowledge) కలుగుతుంది.

లేదా తార్కిక నిరూపణ (demonstration) ద్వారా కూడా నిశ్చయజ్ఞానం కలుగుతుంది. అయితే, తార్కిక వివేచనలో మనిషి పొరపాట్లు చేయవచ్చు. కనుక దానిద్వారా కలిగే జ్ఞానానికి అంతర్బుద్ధి ద్వారా కలిగే జ్ఞానమంతటి నిశ్చయత వుండదు.

ఇకపోతే ఇంద్రియాల ద్వారా లభించే జ్ఞానం (sensitive knowledge) వుంది. మనకు ఇంద్రియానుభూతి దానంతట అది కలగదుగదా? కనుక, బాహ్య ప్రపంచం, బాహ్య వస్తువులు వున్నాయనే అనుకోవాలి. అయితే బాహ్య వస్తువులను గురించిన ఐంద్రియ జ్ఞానం కూడా నిశ్చయ జ్ఞానం కాదు. కిందటి అధ్యాయంలో ఈ విషయం తెలుసుకున్నాము.

## లిబరల్ వాదం

మొత్తంపై మనకు లభించే జ్ఞానానికి చాలా పరిమితు లున్నాయని లాక్ సిద్ధాంతం. మన జ్ఞానం పరిమితమైనది, పాక్షికమైనది, సాపేక్షమైనది. అందు చేత ఫలానా విషయం తిరుగులేని పరమ సత్యమనో, అనుల్లంఘనీయమైన నైతిక సూత్రమనో, అంతా ఒప్పుకుని తీరవలసిన మత విశ్వాసమనో చెప్పడా నికి వీలులేదు. మన నమ్మకాలను ఇతరులమీద రుద్దరాదు.

ఈ కారణంచేత మానవులమధ్య పరస్పర సహనం అవసరం. మత స్వేచ్ఛ, అభిప్రాయ స్వాతంత్ర్యం అవసరం. ప్రతి వ్యక్తి తనకు అత్యంత సుఖదాయక మైనదాన్ని మంచి అని, అత్యంత బాధాకరమైనదాన్ని చెడు అని భావిస్తాడు. అందువల్ల, ఇతరుల స్వేచ్ఛకు, సంఘ శ్రేయస్సుకు అడ్డు రానంతవరకు సుఖా ర్జన నిమిత్తం ఎవరికి తోచిన మార్గాన వారిని పోనివ్వాలి. ఇది సహజ న్యాయం. సంఘం గాని, ప్రభుత్వంగాని ఏ వ్యక్తి స్వీయాభిప్రాయాలకు ప్రమాణాలను నిర్దే శించరాదు. అధిక సంఖ్యాకుల అదిక సుఖార్జనకు (greatest good of the greatest number) దోహద పడేది మంచి. అదే నీతి. ఇది లాక్ లిబరల్ చింతన సారాంశం.

లాక్ సిద్ధాంతీకరించిన అనుభూతి వాదం అతని తర్వాత వచ్చిన ఐరిష్ తత్వవేత్త జార్జి బెర్క్లీ చింతనలో ఒక విచిత్రమైన మలుపు తిరిగింది.



# 23
# "జగమేమాయా...."-బిషప్ బర్కిలీ

భూమి, ఆకాశం, నక్షత్రాలు, సూర్యుడు, చంద్రుడు, చెట్లు, కొండలు, నదులు, సముద్రాలు, మనుషులు, జంతువులు— వీటితో కూడినది భౌతిక ప్రపంచం. ఈ భౌతిక ప్రపంచమే నిజంగా వున్నది. ఉన్నదంతా భౌతిక పదార్థమే— ఇది భౌతిక వాదం.

ఈ వాదాన్ని చీల్చి చెండాడడానికి కంకణం కట్టుకున్న మేధావి బిషప్ జార్జి బర్కిలీ.

అతని సిద్ధాంతం ప్రకారం భౌతిక ప్రపంచం లేదు. భౌతిక పదార్థం లేదు. ఉన్నదంతా భావ జగత్తు, మనః ప్రపంచం. మనస్సు, దానిలోని భావాలు ఇవే పరమ సత్యాలు.

ఇది ఒకరకం మాయావాదం. శంకరుని మాయావాదంవలె బర్కిలీ ఆత్మాశ్రయ భావవాదాన్ని కూడా కాదనడం కష్టం. అవుననడం మరింత కష్టం. దాన్ని కక్కడం సాధ్యం కాదు. మింగడం అసలే అసాధ్యం.

"నేను ఆలోచిస్తున్నాను. కనుక నేను వున్నాను"—I think; therefore I am ఇది దేకార్త్ ప్రసిద్ధ సూత్రం ఇది.

అలాగే "ఉనికి =ఎరుక"–"To be is to be perceived"– ఇది బిషప్ బర్క్లీ సుప్రసిద్ధ వాక్యం.

మనకు మనోగోచరం కావడంలోనే వస్తువుకు ఉనికి వుంటుంది. అంటె మనకు గోచరించకపోతే వస్తువు లేనట్టే. ఇది చాలా విచిత్రమైన, విడ్డూరమైన సిద్ధాంతం.

## జీ వి త క థ

జార్జి బర్క్లీ ఐర్లెండులో 1685 లో కిల్కెన్నీ కౌంటీలో జన్మించాడు. చిన్ననాట కిల్కెన్నీ పాఠశాలలోను, తరవాత డబ్లిన్‌లోని ట్రినిటీ కాలేజీలోను విద్యాభ్యాసం చేశాడు. గ్రీక్, లాటిన్, గణితం, తత్వశాస్త్రం చదివాడు.

ఎప్పుడూ తాత్విక సమస్యలను గురించే ఆలోచించేవాడు, మాట్లాడేవాడు. అతని వింతభావాలు విని కొందరు జ్ఞానిగా పరిగణిస్తే, మరికొందరు పిచ్చివాడుగా జమ కట్టేవారు.

ట్రినిటీ కాలేజీలో చదువు పూర్తి అయిన తర్వాత అక్కడే 1707 నుంచి 1713 వరకు ఒకసారి, 1717 నుంచి 1721 వరకు మరొకసారి ఉద్యోగాలు చేశాడు.

అతనిది మహా నిశితమైన మేధాశక్తి. తన ఇరవైనాలుగవ ఏట–1709 లో దృష్టికి సంబంధించిన నూత్న సిద్ధాంతాన్ని (An Essay towards New Theory of Vision) ప్రచురించాడు. మరుసటి సంవత్సరం-- ఇరవై అయిదవ ఏట– తన అపూర్వ తత్వ చింతనను వివరిస్తూ మరొక గ్రంథం (Treatise concerning the Principles of Human Understanding) వ్రాశాడు. దాన్ని తేటతెల్లంగా వివరించడానికి 1713 లో మరొక గ్రంథం (Three Dialogues between Hylas and Philonous) రచించాడు. మొత్తంపై 28 ఏళ్ళ వయస్సుకే తత్వశాస్త్రంలో అతనికి పేరు తెచ్చిన ముఖ్యరచనలన్నీ చేశాడు. ఆ తర్వాత వ్రాయకపోలేదు గాని అవి అంత ముఖ్యమైనవి కావు.

## స్విఫ్ట్‌తో పరిచయం

1713 లో ఐర్లెండు నుంచి లండన్ వెళ్లాడు. అనాటి లండన్ సాహిత్య ప్రపంచంలో ప్రసిద్ధులైన స్విఫ్ట్ (గలివర్స్ ట్రావెల్స్ రచయిత), స్టీల్, అడిసన్, పోప్ మొదలైనవారితో అతనికి పరిచయం కలిగింది. వీరిలో స్విఫ్ట్ అతనికి సన్నిహిత మిత్రుడు. స్విఫ్ట్ ప్రియురాలొకామె స్విఫ్ట్‌తో కలహించి తన

ఆస్తిలో సగాన్ని బర్క్లీకి వ్రాసి ఇచ్చి చనిపోయింది. దానితో బర్క్లీభాగ్యవం తుడయ్యాడు. కొన్నాళ్లు ఇటలీలో పర్యటించాడు.

బర్క్లీ ఆదర్శవాది. సమకాలిక సమాజం భ్రష్టమైపోతున్నదని బాధపడే వాడు. దాన్ని మరమ్మతు చేయడం అసాధ్య మనుకున్నాడు. అంతకంటె, ఏదైనా అనాగరిక, ఆటవిక, ఆదిమ మానవసమాజాన్ని తీసుకుని, వారికి విద్యాబుద్ధులు, మతం బోధించి, ఉత్తమ మానవులుగా తీర్చిదిద్దడం మంచిదని తలపోశాడు. ఇందుకోసం బ్రిటిష్ వలస అయిన బెర్ముడాలో ఒక కాలేజీ స్థాపించాలని, అక్కడ క్రైస్తవ మత గురువులకు తర్ఫీదు ఇచ్చి అమెరికన్ "ఇండియన్" జాతివారికి విద్యా బుద్ధులు నేర్పి ఆదర్శ సమాజాన్ని స్థాపించాలని ఆలోచించాడు.

## బెర్ముడా పథకం

ఈ పథకానికి ఇంగ్లండు రాజు మొదటి జార్జి నుంచి అనుమతి పొందాడు- విరాళాలు వసూలు చేశాడు. భార్యా సమేతంగా 1729 లో రోడ్ ఐలెండ్ వెళ్ళాడు. అక్కడ రెండేళ్లు న్యూపోర్ట్ పట్టణంలో నివసించాడు. కాని, బెర్ముడాలో కాలేజీ స్థాపన ఆశయం విఫలమైంది. ఇంగ్లండులో అధికారంలో వున్న వాల్పోల్ మంత్రివర్గం అంతకుముందు పార్లమెంటు వాగ్దానం చేసిన ఇరవై వేల పౌనుల ధనసహాయాన్ని నిరాకరించింది. దానితో ఆశాభంగం చెంది బర్క్లీ స్వదేశం తిరిగి వచ్చాడు. 1734 లో క్లాయిన్‌కు బిషప్ అయ్యాడు. దాదాపు ఇరవై ఏళ్లు బిషప్‌గా పనిచేశాడు. తరువాత లండన్ వెళ్లాడు. 1753 లో మరణించాడు.

సమకాలిక సమాజం భ్రష్టమైపోతున్నదని, నీతి, దైవ విశ్వాసం క్రమంగా అంతరిస్తున్నాయని బర్క్లీ బాధపడ్డాడు. అప్పుడప్పుడే వికసిస్తున్న సైన్సు మానవులను భౌతికవాదంవైపు, సంశయవాదంవైపు మళ్లిస్తున్నదని, నిరీశ్వరవాదం ప్రబలిపోతున్నదని భావించి, సమాజాన్ని తిరిగి ఈశ్వరోన్ముఖం చేయడం జీవితధ్యేయంగా పెట్టుకున్నాడు. ఇందుకోసమే తన తత్వ సిద్ధాంతాన్ని రూపొందించాడు.

బర్క్లీకి ప్రేరణ ఇచ్చినట్టిది లాక్ అనుభూతివాదం (ఎంపిరిసిజం). బర్క్లీ కూడా అనుభూతివాదే. అయితే, లాక్ అనుభూతివాదం భౌతిక వాదానికి, సంశయవాదానికి దాని ద్వారా నాస్తికత్వానికి దారితీస్తున్నదని బర్క్లీ భావించాడు. భౌతిక ప్రపంచం తనకు తానుగా వున్నదని, అది తన సహజ సూత్రాల ప్రకారం యాంత్రికంగా పని చేసుకు పోతుందని అంగీకరిస్తే భగవంతునితో మరి ప్రమేయం ఏముంది? ఇది తప్పు. భగవంతుడు వుండడంవల్లనే

ప్రపంచం వున్నది. అతడు లేకపోతే ఏమీ లేదు. దీన్ని నిరూపించడానికే బర్క్లీ తన మేధాశక్తిని వినియోగించాడు.

## లాక్ వాదం

లాక్ సిద్ధాంతం ఇంతకుముందు తెలుసుకున్నాము. మనకు కలిగే జ్ఞానమంతా ఇంద్రియానుభూతి ద్వారా, వివేచనద్వారా వస్తున్నదని లాక్ సిద్ధాంతం. ఇంద్రియానుభూతికి కారణం బాహ్య ప్రపంచంలోని భౌతిక వస్తువులు.

భౌతిక వస్తువులో రెండు రకాల గుణాలు వుంటాయి. ఒక రకం మౌలిక గుణాలు (Primary Qualities) అంటే వస్తువులయొక్క అకారం, పరిమాణం, చలనం, సంఖ్య, ద్రవ్యరాశి మొదలైనవి. ఇవి వస్తువును అంటిపెట్టుకుని వుంటాయి. విడిగా వుండవు. వాటంతట అవి వస్తువులోనే వుంటాయి.

మరొక రకమైనవి ఆభాసిక గుణాలు (Secondary Qualities). ఇవి వస్తువులో స్వతహాగా వుండవు. భౌతిక వస్తువు మన ఇంద్రియాలపై పనిచేయడం ద్వారా ఈ ఆభాసిక గుణాలను మన మనస్సుకు అందజేస్తుంది. రంగు, రుచి, వాసన, ధ్వని, వేడిమి, చల్లదనం, గట్టిదనం, మెత్తదనం మొదలైనవి ఆభాస గుణాలు.

అయితే, ఈ వివిధ గుణాలన్నిటికి ఆదారభూతమైనది ఏది? దాన్ని భౌతిక పదార్థం (Substance) అని లాక్ అన్నాడు. ఆ పదార్థం ఎలా వుంటుందో తెలియదు. దానికి అకారం, పరిమాణం మొదలైన గుణాలున్నాయి. వాటిని భావాలరూపంలో మనం గ్రహిస్తున్నాము. కనుక ఆ మౌలిక గుణాలకు ఆధారంగా, వాటికి అంతర్గతంగా ఒక పదార్థం (మేటర్) వున్నది. అది మనకు ఇంద్రియగోచరం కాదు. మనోగోచరం కాదు. కాని, ఆ అజ్ఞాత పదార్థమేదో వుండే వుండాలి. లేకపోతే అకారం, పరిమాణం మొదలైన మౌలిక గుణాలు దేనికి సంబంధించినవైనట్టు? కనుక ఒక అజ్ఞాత భౌతిక పదార్థం వుండితీరాలి.

అదే లాక్ సిద్ధాంతం. అంటే ఒక భౌతిక పదార్థం, అది మన ఇంద్రియాలద్వారా మనలో కలగజేసే భావాలు (రంగు, రుచి, ఆకృతి, పరిమాణం మొదలైన వాటి భావాలు), ఆ భావాలను గ్రహించే మనస్సు— ఈ మూడు విభిన్న తత్వాలు వున్నాయన్నది లాక్ వాదం. అయితే, మనం గ్రహించగలిగేది భావాలనే తప్ప అసలు వస్తువులను కాదన్నది అతని ముఖ్య సిద్ధాంతం.

## డైలాగ్స్ రచన

ఇక్కడినుంచి బర్క్లీ అందుకున్నాడు. మనకు లభించే జ్ఞానమంతా అనుభూతి (experience) ద్వారా వస్తున్నదని, మన అనుభూతిలోకి వచ్చేది భావాలు

మాత్రమేనని అతడు కూడా అంగీకరించాడు. కాని, అంతవరకే అంగీకరించాడు. మిగిలినదంతా ఖండించాడు.

తన సిద్ధాంతాన్ని వివరించడానికి బర్క్లీ రెండు తాత్విక గ్రంధాలు రచించాడని పైన చెప్పుకున్నాము. వాటిలో రెండవదాన్ని ప్లేటోవలె డైలాగ్స్ రూపంలో రచించాడు. హైలాస్ అనే భౌతికవాదికి, ఫిలోనస్ అనే అభౌతికవాదికి మధ్య సంభాషణ ద్వారా తన తత్వ చింతనను బర్క్లీ ఆవిష్కరించాడు. ఇందులో ఫిలోనస్ తానే.

మామూలుగా మనం వేడి, చల్లదనం, రంగు, రుచి, ధ్వని మొదలైనవి ఆయా వస్తువులలోనే వున్నాయని అనుకుంటాము కాని, అది నిజం కాదని బర్క్లీ అంటాడు. మన మనసులలోనే ఆయా గుణాలకు సంబంధించిన భావాలు ఉత్పన్నమవుతున్న వంటాడు.

ఉదాహరణకు వేడిమి అంటే ఏమిటి? చేయి చురుక్కుమంటుంది. ఇదొక అనుభూతి. ఇది మన మనస్సుకే తెలుస్తుంది. కనుక వేడి అనేది మన మనస్సులోని ఒక భావమే తప్ప నిజంగా వస్తువులో లేదు. అలాగే చల్లదనం. అది కూడా మానసికమే తప్ప భౌతికం కాదు.

## గోరువెచ్చని నీరు

ఒక చేతిని బాగా వేడిగా వున్న నీటిలోను, రెండవ చేతిని బాగా చల్లగా వున్న నీటిలోను ముంచి రెండు చేతులను ఒక్కసారిగా గోరువెచ్చని నీటిలో ముంచండి. వేడి చేతికి గోరువెచ్చని నీరు చల్లగా వుంటుంది. చల్లని చేతికి వేడిగా వుంటుంది. అంటే గోరువెచ్చని నీరు ఒకే సమయంలో చల్లగాను, వెచ్చగాను కూడా వున్నట్టా? ఇది ఎలా సంభవం? దీన్నిబట్టి వేడి, చల్లదనం అనేవి మన ఇంద్రియాల స్థితిపై ఆధారపడిన భావాలని తెలియడం లేదా?

## ఏది తీపి ? ఏది చేదు ?

అలాగే రుచి. తీయని రుచి సుఖం కలిగిస్తుంది. చేదు రుచి బాధ కలిగిస్తుంది. సుఖం, బాధ అనేవి మానసికానుభూతులు కదా? మానసికానుభూతులు బాహ్య వస్తువులో వుండవు. మనస్సులోనే వుంటాయి. పంచదార తియ్యగా వున్నదంటాము. కాని, పంచదారకు తాను తియ్యగా వున్నానని తెలియదు కదా? అది తెలిసేది మన మనస్సుకే. కనుక రుచి మానసికమైనది; మానసికభావం మాత్రమే.

అలాగే ధ్వని. అది కూడా వస్తువులో లేదు. వస్తువువల్ల కలగదు. అదీ మానసికమే. ధ్వని అంటే గాలిలో భౌతికమైన కదలికలు కదా? అవి మనస్సులో భావాలు ఎలా అవుతాయి అంటాడు హైలాస్. కాని దీన్ని ఫిలోనస్ పూర్వపక్షం చేస్తాడు. గాలిలో కదలికలైతే, అవి కదలికలుగా చర్మానికో, కంటికో తెలియాలి కాని, వాటిని వినలేము. చెవిద్వారానే ధ్వని అనే భావాన్ని మనస్సు గ్రహిస్తుంది. కనుక అదీ భావమే.

ఇలాగే రంగు, వాసన మొదలైన వాటిని కూడా భౌతిక వస్తుగుణాలుగా కాక, మనస్సు కల్పించే భావాలుగా ఫిలోనస్ ద్వారా బర్క్లీ నిరూపిస్తాడు. ఇంత వరకు లాక్ చెప్పినదే. రంగు, రుచి మొదలైనవి ఆభాసిక గుణాలని (secondary qualities) అని అతడు కూడా అన్నాడు. కాని, వస్తువు పరిమాణం, ఆకారం మొదలైనవి వస్తువులో స్వతహాగా వుండి, మనకు భావాల రూపంలో అందుతున్నాయని, అవి వస్తువుకుగల మౌలిక (primary) గుణాలని లాక్ అన్నాడు.

ఈ వాదాన్ని బర్క్లీ పూర్వ పక్షం చేశాడు. ఆభాసిక గుణాలు, మౌలిక గుణాలు అనే రెండు రకాలు లేవని, అన్నీ ఆభాసా గుణాలేనని అతడు అంటాడు. ఒక వస్తువుకు గల సైజు, ఎత్తు, వెడల్పు మొదలైనవి తీసుకోండి. అవి ఆ వస్తువుకు స్వతహాగా వుంటాయని, అందరికీ ఒకే రకంగా కనబడతాయని అనుకుంటాము. కాని, ఇది నిజం కాదు.

## ఏది పొడుగు ? ఏది పొట్టి ?

ఉదాహరణకు మనకు అరమైలు దూరంలో ఒక తాటిచెట్టు వుంది. అది చాలా చిన్నదిగా కనిపిస్తుంది. ఒక ఫర్లాంగు సమీపానికి వెడతాము. అది కొంత పెద్దదిగా కనిపిస్తుంది. అలా సమీపిస్తున్నకొద్దీ అది ఇంకా ఇంకా పొడుగ్గా కనిపిస్తుంది. అంటే మనం వున్న దూరాన్నిబట్టి దాని పొడుగు మారుతూ వుంటుంది. ఇన్ని రకాల పొడుగులలో ఏది దాని అసలు పొడుగు? టేపు పెట్టి కొలిస్తే దాని అసలు పొడుగు తెలుస్తుంది కదా అనవచ్చు. కాని, దూరాలనుబట్టి పొడుగుమారే లక్షణం తాటిచెట్టుకువలె టేపుకు కూడా వర్తిస్తుంది కదా?

ఒక చీమ వుందనుకోండి. అది మనకు అత్యల్ప జంతువుగా కనిపిస్తుంది. మనకి కనిపించే దాని సైజు దాని అసలు సైజు అని మనం అనుకుంటాము. కాని, చీమకంటే వంద వంతులు చిన్నదైన ప్రాణి చూడగలిగితే దానికి చీమ ఎంతసైజులో కనిపిస్తుంది? చాలా పెద్దదిగా కనబడదా? అయిన ప్పుడు చీమ సైజుపై మన అభిప్రాయం రైటా, దానికంటే చిన్న జంతువు అభిప్రాయం రైటా? ఒకే వస్తువు ఒకే సమయంలో రెండు సైజులు ఎలా

కలిగి వుంటుంది?—కనుక సైజు— పరిమాణం— అసలు వస్తువుకు స్వతహాగా చెందినదికాక, చూసేవ్యక్తి మనోధర్మాన్నిబట్టి వుంటుందని, కనుక అది కూడా ఆభాసా గుణమేనని తేలడంలేదా?

ఒక వస్తువు నున్నగా వున్నట్టు కనబడుతుంది. కాని, మైక్రోస్కోపులో నుంచి చూస్తే, దాని ఎగుడు దిగుడులన్నీ కొట్టొచ్చినట్టు కనబడతాయి. అలాగే రూపాయి నాణెం గుండ్రంగా వున్నదంటాము. కాని, నిజానికి రూపాయి ఆకారం మనంచూసే కోణాన్నిబట్టి మారుతుంది. ఒక ప్రక్కనుంచి చూస్తే అలవాటుకొద్దీ అది గుండ్రంగానే వున్నదని మనం అనుకున్నప్పటికీ, ఆ కోణం నుంచి ఫొటో తీసి చూస్తే అది గుండ్రంగా కాక, కోడిగుడ్డు ఆకారంలోనో, మరొక అకృతిలోనో వున్నట్టు కనిపిస్తుంది. అందుచేత ఆకారం కూడా వస్తువులో స్వతహాగా వున్న మౌలిక గుణం కాదు. అది మానసిక భావమే.

## న్యూటన్ వాద తిరస్కృతి

ఇదే తర్కంతో బర్క్లీ న్యూటన్ ప్రతిపాదించిన కేవల చలనం (absolute motion), కేవల స్థలం (absolute space) కేవల కాలం (absolute time) ను కూడా కొట్టివేశాడు. ఉదాహరణకు కేవల చలనం అనేది లేదంటాడు. ఒక వస్తువు కదులుతున్నప్పుడు ఒకరికి అది నెమ్మదిగా కదులుతున్నట్టు కనిపిస్తే, మరొక స్థితిలో వున్నవాడికి అది వేగంగా కదులుతున్నట్టు కనిపించవచ్చు. కనుక, చలనం అనేది చూసేవాడినిబట్టి వుంటుంది.

ఆధునిక విజ్ఞాన శాస్త్రం నుంచి ఒక ఉదాహరణ తీసుకుంటాము. వస్తువులోని ద్రవ్యరాశి (మాస్) ఏ పరిస్థితిలోను మారదని మనం మామూలుగా అనుకుంటాము. కాని, వస్తువు వేగాన్ని బట్టి ద్రవ్యరాశి మారుతుందని ఐన్‌స్టయిన్ నిరూపించాడు. వస్తువు వేగం పెరుగుతున్నకొద్దీ దాని ద్రవ్యరాశి పెరుగుతుంది.

మొత్తంపై బర్క్లీ మౌలిక గుణాలకు, ఆభాసా గుణాలకు తేడా లేదని, అవి రెండూ ఒకటేనని అభిప్రాయపడ్డాడు. మనం ఏయే గుణాలైతే వస్తువులో స్వతహాగా వున్నాయనుకుంటున్నామో, అవి నిజంగా మన మనస్సులోని భావాలేనని, మనకు తెలిసేవి ఆ భావాలేనని అతడు అన్నాడు.

ఇకపోతే లాక్ ఊహించిన పదార్థం (substance) వుంది. మనకు ఇంద్రియానుభూతులు (రంగు, రుచి, వాసన, పరిమాణం, ఆకారం మొదలైనవి) కలుగుతున్నాయంటే వాటిని మన మనస్సులో ఉత్పత్తి చేసే బాహ్య వస్తువు

ఏదో ఒకటి వుండాలి కదా? అనుభూతులు వాటంతట అవి కలగవు కదా? కనుక మనకు కనిపించే అభాసిక, మౌలికగుణాల వెనుక, అంతరాధారంగా (substratum) ఒక పదార్థం వుండి వుండాలని లాక్ భావించాడు.

## మేటర్ లేదు

బర్క్లీ ఈ వాదాన్ని తిరస్కరించాడు. మన మనస్సు తెలుసుకోగలిగింది భావాలను మాత్రమే అయినప్పుడు- అనుభూతిద్వారానే భావాలు కలుగుతున్నప్పుడు మన అనుభూతిలోకి రాని పదార్థం ఏదో వుందని మనం ఎలా అనుకుంటాము? అందుచేత లాక్ ఊహించినట్టు రంగు, రుచి, పరిమాణం, ఆకారం మొదలైన భావాలను మనలో కలిగించే గుణాలకు ఆధారంగా, ఏదో అజ్ఞాత పదార్థం, ఎక్కడో, మనకు తెలియకుండా వున్నదనే అభిప్రాయం తప్పు. అటువంటి పదార్థం లేదు. ఉన్నదంతా మనస్సు, అది తెలుసుకునేది భావాలు మాత్రమే.

దీన్నిబట్టి మన మనస్సు తెలుసుకో గలిగిన దానికంటె భిన్నమైనదేదీ స్వతహాగా, స్వతంత్రంగా, దానంతట అది లేదని ధ్రువపడుతుంది. ఒక వస్తువు వున్నదీ అంటే దాన్ని మనం మనస్సుతో గ్రహిస్తున్నా మన్నమాట. మనం తెలుసుకో గలిగిన మేరకే ఆ వస్తువున్నది. అంతకుమించి భౌతిక వస్తువనేది లేదు; అంతకుమించిన యాథార్థ్యం (reality) దానికి లేదు.

## ఉనికి = ఎరుక

ఫిజిక్సులో ఐన్‌స్టయిన్ కనిపెట్టిన $E = mc^2$ సూత్రం వలె తత్వశాస్త్రంలో బర్క్లీ ప్రతిపాదించిన సూత్రం "ఉనికి=ఎరుక" అనేది ప్రసిద్ధమైనది. మన చైతన్య పరిధిలోనికి వచ్చినమేరకే వస్తువుకు యాథార్థ్యం వున్నదని దీని అర్థం. (To be is to be perceived).

అంటే మనం చూడకపోతే ప్రపంచం లేనట్టేనా? అని ప్రశ్నవస్తుంది. నేను నా గదిలో కూర్చుని వ్రాసుకుంటున్నాను. మధ్యలో అవతలకు వెడతాను. అప్పుడు నా గది లేనట్టేనా? తిరిగి వస్తాను. అప్పుడు గది మళ్లీ తిరిగి వస్తుందనా?

అలా కాదంటాడు బర్క్లీ. నేను చూసినప్పుడే ఒక వస్తువుండి, చూడనప్పుడు పోతుందని కాదు. నేను ఆ గదిలో లేకపోయినప్పటికీ, ఆ గదిలో వుండి వుంటే అది నా చైతన్య పరిధిలోకి వచ్చేదని నాకు తెలుసు కనుక, ఆ గది యథాప్రకారంగానే కొనసాగుతుంది. లేదా నేను ఆ గదిని చూడకపోయినా

మరొకరు చూస్తూ వుంటారు కనుక ఆ గది కొనసాగుతుంది. చైతన్యవంత మైన ఏ ప్రాణీ ఆ క్షణంలో ఆ గదిని చూడకపోయినా, సర్వాంతర్యామి అయిన భగవంతుడు నిరంతరాయంగా దాన్ని చూస్తూనే వుంటాడు కనుక అది యథాప్రకారంగా కొనసాగుతుంది.

దీని అర్థం ఇది– ఏ భౌతిక వస్తువైనా ఏదో ఒక మనస్సులో భావంగా వున్నంతవరకే దానికి యాథార్థ్యం వుంటుంది. అంతేతప్ప దానికి స్వతంత్రమైన అస్తిత్వం లేదు. ఆ మనస్సు నాదే కానక్కరలేదు. ఇంకొకరిది కావచ్చు. ప్రపంచంలో మానవు లెవ్వరూ లేనప్పుడో? అప్పుడు భౌతిక ప్రపంచం లేనట్టేనా? కాదు, భగవంతుని మనస్సు నిరంతరం గమనిస్తూనే వుంటుంది. భగవంతుడు కూడా లేకపోతే ప్రపంచం లేనట్టే. కాని, ప్రపంచం వుంది కనుక, భగవంతు డున్నాడు. ఉండి తీరాలి. ఈ విధంగా బర్క్లీ భగవదస్తిత్వాన్ని నిరూపించాడు. అదేకదా అతని తాత్విక ధ్యేయం?

## ప్రసిద్ధ వాక్యం

మనస్సు లేనిదే ఏ వస్తువు లేదు. వస్తువు వున్నదంటే అది మనస్సుకు తెలియ బడడం వల్లనే; కనుక మనస్సుకు తెలియబడని వస్తువుకు యాథార్థ్యం లేదు.

"ఆకాశంలోని నక్షత్రాలు, భూలోకంలోని సమస్త వస్తుజాలం– ఇవన్నీ మనస్సు లేనిదే లేవు" "All the choir of heaven (నక్షత్రాంతర్నిబిడ నిఖిల గానం) and furniture of the earth, in a word, all those bodies which compose the mighty frame of the world have not any substance without the mind..." ఇది బర్క్లీ ప్రసిద్ధ వాక్యాలలో మరొకటి.

మనస్సుకు తెలిసేవి భావాలు మాత్రమేనని, వస్తువులు కాదని అనేటట్టయితే, మనం భావాలను తింటున్నామా? భావాలను తాగుతున్నామా? భావాలు తొడుక్కుంటున్నామా? అని ప్రశ్న వస్తుంది. దీనికి బర్క్లీ సమాధానం : మనం తినేది, తాగేది, ధరించేది మన మనస్సుకు వెలుపల స్వతంత్ర అస్తిత్వంలేని– ఇంద్రియాల అనుభవ పరిధిలోకి వచ్చే- వస్తువులను మాత్రమే. అందుచేత మనం తినేది ఆహారాన్నే, తాగేది నీటినే, ధరించేది దుస్తులనే. అయితే వాటికి మన ఎరుక (perception) కు మించిన యాథార్థ్యం లేదు.

అలాగే మనం ఏదో దైహిక బాధ అనుభవిస్తున్నాము. అది కేవలం భావమేనా? అయితే, మనం అనుభవించే దైహిక బాధ అనే భావానికి, ఊరికే

కూర్చుని ఊహించుకునే దైహిక బాధకు తేడా ఏమిటి? పగలు మనం చూసే సూర్యుడికి, రాత్రి పూట లేని సూర్యుడిని గురించిన ఊహకు తేడా ఏమిటి?

## భావాలు, ఊహలు

అంటే, కొన్ని భావాలు నిజమైనవి. కొన్ని వట్టి ఊహలు. నిజమైన భావాలు నా అనుభూతిలోకి వచ్చే భావాలు- కేవలం నా మనస్సు లోనివి మాత్రమే కాదు. అవి ఈశ్వరుడు నాలో ప్రవేశపెట్టిన భావాలు. అవి నేను వద్దనుకున్నా వస్తాయి. పొమ్మన్నా పోవు. ఉదాహరణకు నేను ఎదురుగా ఒక చెట్టు చూస్తున్నాను. కళ్లు తెరుచుకుని వున్నంతసేపు దాన్ని చూడకుండా వుండలేను. ఆ చెట్టు భావాన్ని నేను నా మనస్సులో ప్రవేశించకుండా నిరోధించలేను. ఎందుకంటే అది దేవుడు. నా మనస్సులో ప్రవేశపెట్టిన భావం. నా మనస్సులో నిజంగా వున్న చెట్టు అనే భావం దేవుని మనస్సులో కూడా భావమే.

కేవలం ఊహలైన భావాలు అలా కాదు. అవి నా మనస్సు లోనివి మాత్రమే. అవి దేవుని భావాలు కాదు. నేను నా ఊహలను కావాలంటే తెప్పించుకోగలను. అక్కరలేదనుకుంటే మానివేయగలను. నిజమైన భావాలకు, వట్టి ఊహలకు తేడా అదే. నిజమైన భావాలు బలంగా, స్పష్టంగా, విశదంగా, ఒక క్రమబద్ధత (order) కలిగి వుంటాయి. వట్టి ఊహలు అంత బలంగా, స్పష్టంగా, క్రమబద్ధంగా వుండవు.

## ఆత్మాశ్రయ భావవాదం

లాక్ అనుభూతి వాదాన్ని బర్క్లీ విపరీత స్థాయికి తీసుకువెళ్లాడు. అనుభవంలోకి వచ్చేదానికి మాత్రమే యాథార్థ్యం వున్నదన్నాడు. దీన్ని సమర్థించడానికి ఈశ్వరుని సహాయం తెచ్చుకున్నాడు. ఈశ్వరుడు లేడనుకునే వారికి మాత్రం అతని ఆత్మాశ్రయ భావవాదం (subjective idealism) అసంబద్ధంగా, కామన్ సెన్సుకు విరుద్ధంగా కనిపిస్తుంది. అదే సమయంలో దాన్ని తార్కికంగా ఎదుర్కోవడం అసాధ్యం కాకపోయినా, కష్టమవుతుంది.

బౌద్ధ దర్శనాలలో అసంగుడు, వసుబంధుడు అనే ఇరువురు సోదరులు ప్రవచించిన విజ్ఞానవాదం ఒకటి. దీన్నే యోగాచారం అని కూడా అంటారు. దానికి బర్క్లీ ఆత్మాశ్రయ భావవాదానికి కొన్ని పోలికలను ఇదివరకే పలువురు భారతీయ వ్యాఖ్యాతలు పేర్కొన్నారు. భౌతిక ప్రపంచానికి స్వతంత్ర అస్తిత్వం కలదని విజ్ఞానవాదం గుర్తించదు. "సర్వం బుద్ధిమయం జగత్" అనే ఈ విజ్ఞాన వాదాన్ని భారతీయ దర్శన భాగంలో పరిశీలిద్దాము.



# 24
# అతనికంటె ఘనుడు...డేవిడ్ హ్యూమ్

జాన్ లాక్ ఇంగ్లీషు తత్వవేత్త. జార్జి బర్క్లీ ఐరిష్ దార్శనికుడు. డేవిడ్ హ్యూమ్ స్కాటిష్ మేధావి. ఈ ముగ్గురూ బ్రిటిష్ ఎంపిరిసిజానికి (అనుభూతి వాదానికి) త్రిమూర్తులు.

లాక్ సిద్ధాంతం ప్రకారం తెలుసుకునే మనస్సు, తెలియబడే భావాలు, ఆ భావాలకు ఆధారంగా భౌతిక వస్తు ప్రపంచం– ఈ మూడు తత్వాలు వున్నాయి.

బర్క్లీవచ్చి ఈ మూడింటిలో భౌతిక వస్తు ప్రపంచం మన అనుభూతి లోనికి రాదు. కనుక దాన్ని తిరస్కరించి మనస్సును, భావాలను మిగిల్చాడు.

హ్యూమ్‌వచ్చి మనస్సు కూడా మన అనుభూతిలోనికి రాదు కనుక దాన్ని సయితం తిరస్కరించి భావాలను మాత్రం మిగిల్చాడు.

హ్యూమ్ వాదం ప్రకారం మేటర్ లేదు. మైండ్ లేదు. ఉన్నవి మన మానసిక స్థితులు (mental states) మాత్రమే.

సమకాలిక మేధావులు నిర్ఘాంతపోయారు. పదార్థం [మేటర్] సరే, మనస్సు [మైండ్] కూడా లేదంటూ డేమిటి హ్యూమ్? ఇదెలా సాధ్యం? ఇది అసంబద్ధం, అసంభవం కాదా? వారిలో కొందరు అతడిని నాస్తికాగ్రేసరుడుగా పరిగణించారు.

## తిమ్మి, బమ్మి

కేవల తర్కవాదాన్ని నమ్ముకుంటే అంతే మరి. తర్కంతో తిమ్మిని బమ్మి, బమ్మిని తిమ్మి చేయవచ్చు. విశ్వదర్శనం తొలి అధ్యాయాలలో వర్ణించిన గ్రీకు తత్వవేత్త జీనో విచిత్రవాదం పాఠకులకు జ్ఞాపకం వుండే వుంటుంది. కదులుతున్న బాణం కదలడం లేదన్నది అతడు కల్పించిన పేర డాక్సలలో ఒకటి. దాన్ని తార్కికంగా కాదనడం ఎంతకష్టమో-డేవిడ్ హ్యూమ్ వాదాన్ని కాదనడం అంత కష్టం. అదే సమయంలో దాన్ని ఔననడం మరింత కష్టం.

బెర్ట్రాండ్ రసెల్ తన పాశ్చాత్య తత్వ చరిత్రలో హ్యూమ్‌కు అత్యంత ప్రముఖ స్థానమిచ్చాడు. లాక్ ప్రారంభించిన అనుభూతి వాదాన్ని హ్యూమ్ పరా కాష్ఠకు తీసుకుపోవడమేకాక, అది మరొక్క ముందడుగైనా వేయలేని ఇరుకు సందులోకి తీసుకుపోయి వదలిపెట్టాడని రసెల్ వ్యాఖ్యానించాడు. హ్యూమ్ వాదాన్ని ఖండించాలనే ప్రయత్నం నేటికి కూడా తత్వవేత్తల వినోద క్రీడలలో ఒకటి అని ఆయన పేర్కొన్నాడు.

డేవిడ్ హ్యూమ్ 1711 లో ఎడింబరోలో ఒక సంపన్న కుటుంబంలో జన్మించాడు. అతని చిన్ననాటనే తండ్రి మరణించాడు. తల్లి విద్యాబుద్ధులు చెప్పించి పెద్దవాడిని చేసింది. ఎడింబరో యూనివర్సిటీలో ఉన్నత విద్య అభ్య సించాడు. తత్వశాస్త్రం, సాహిత్యం అభిమాన విషయాలు. సాహిత్యవేత్తగా కీర్తి శిఖరాలు అందుకోవా లన్నది అతని జీవిత ధ్యేయం.

## ఆశాభంగం

1734 లో ఫ్రాన్సు వెళ్ళాడు. అక్కడ మూడేళ్ళున్నాడు. ఆ రోజులలోనే తన మొదటి తాత్విక గ్రంథం (Treatise of Human Nature) వ్రాశాడు. దాన్ని ఎవరైనా ఖండిస్తారేమో, వారిని పట్టుకుని చీల్చిచెండాడి పేరు సంపాదించుకో వాలని ఉబలాటపడ్డాడు. కాని, నిరాశ ఎదురైంది. అతని ఉద్గ్రంథాన్ని ఎవరూ పట్టించుకోనేలేదు. పుస్తకానికి పురిట్లోనే సంధి కొట్టింది. "మాతృగర్భం నుంచి వెలువడిన మృతశిశువు"గా హ్యూమ్ తానే దాన్ని వర్ణించాడు.

కాని, హ్యూమ్ ఇలాంటి ఆశాభంగాలకు వెరచే మనిషి కాదు. త్వరలోనే

తేరుకుని ఇతర రచనలపై దృష్టి మళ్లించాడు ఎడింబరో యూనివర్సిటీలో నీతి శాస్త్రాచార్య ఉద్యోగానికి ఖాళీవస్తే దరఖాస్తు చేశాడు. కాని, అతని తీవ్రభావాలకు జంకి అధికారులు ఆ ఉద్యోగ మివ్వలేదు. చివరికి ఎడింబరోలో అడ్వకేట్స్ లైబ్రరీలో గ్రంథాలయాధికారి ఉద్యోగం లభించింది. అక్కడి పుస్తకాలతో తన విజ్ఞాన దాహం తీర్చుకున్నాడు. ఇంగ్లండు చరిత్ర వ్రాశాడు. అది ప్రజాదరం పొందింది. దాన్ని తారీఖులు, దస్తావేజులతో కాక, ఇంగ్లండు సాంఘిక, సాంస్కృతిక వికాస చరిత్రగా వ్రాశాడు.

## సాహిత్య కీర్తి

1748 లో తన పూర్వపు గ్రంథమైన "ట్రీటైజ్ ఆఫ్ హ్యూమన్ నేచర్"ను కుదించి మరొక గ్రంథాన్ని- "ఇంక్వయిరీ కన్‌సర్నింగ్ హ్యూమన్ అండర్‌స్టాండింగ్" వ్రాశాడు. అది బహుళ ప్రజాదరం పొందింది. తత్వవేత్తగా అతని ఖ్యాతి దేశ దేశాంతరాలకు వ్యాపించింది. అతని గ్రంథాలు ఫ్రెంచి, తదితర భాషలలోనికి తర్జుమా అయ్యాయి. ఆ తర్వాత వరసగా అనేక తాత్విక గ్రంథాలు వ్రాశాడు. వాటిలో "డైలాగ్స్ కన్‌సర్నింగ్ నేచురల్ రిలిజన్" అనేది తీవ్రభావాలతో కూడిన గ్రంథం. దాన్ని అతని కోర్కె ప్రకారం అతని మరణానంతరం 1779 లో ప్రచురించారు. అతని స్వీయకథ కూడా అతడు చనిపోయిన మరుసటి సంవత్సరం (1777) ప్రచురితమైంది. బహుగ్రంథకర్త అయి తన జీవిత ధ్యేయమైన సాహిత్య కీర్తిని ఆర్జించాడు.

ఒకవైపు తాత్విక, చారిత్రక రచనలు చేస్తూనే హ్యూమ్ రాజకీయ, దౌత్య వ్యవహారాలలో ప్రముఖ పాత్ర వహించాడు. యూరప్‌లో విస్తృతంగా పర్యటించి సమకాలిక మేధావులెందరినో పరిచయం చేసుకున్నాడు. 1763 లో పారిస్‌లోని బ్రిటిష్ రాయబారికి కార్యదర్శిగా వెళ్లాడు. ఫ్రెంచివారు అతనికి బ్రహ్మరథం పట్టారు. అతడిని, అతడి మేధా నైశిత్యాన్ని పొగడడంలో ఫ్రెంచి రాజు, ప్రభువులు, పండితులు, ఇతరులు ఒకరితో ఒకరు పోటీపడ్డారు.

పారిస్‌లో వుండగా అతడు ఎంతో అభిమానించిన స్నేహితులలో ఒకడు రొమాంటిక్ తత్వవేత్త రూసో. తనతోపాటు రూసోను లండన్ తీసుకువచ్చి ఆశ్రయమిచ్చాడు. కాని, రూసో చపలచిత్తుడు. ఇరువురికి త్వరలోనే చెడింది. దెబ్బలాడుకున్నారు. రూసో తిరిగి స్వదేశం వెళ్లిపోయాడు.

హ్యూమ్‌కు 1767 లో స్కాట్లండ్ వ్యవహారాల శాఖ ఉపకార్యదర్శిగా మరొక ఉద్యోగం వచ్చింది. కాని, క్రమంగా అతని ఆరోగ్యం క్షీణించసాగింది. రాజీనామా ఇచ్చి చివరి సంవత్సరాలు ప్రశాంతంగా సాహిత్య వ్యాసంగంలో గడుపుతూ 1776 లో కన్ను మూశాడు.

## నిత్య సంతోషి

వ్యక్తిగా హ్యూమ్ నిత్య సంతోషి. సరదా మనిషి. ఎంత ఎదురుదెబ్బ తగిలినా లెక్కచేయని ఆశావాది. స్నేహపాత్రుడు. సాహిత్య కీర్తికండూతి తప్ప- ఇంకే వ్యసనానికి బానిస కాలేదు. అన్నిటిలోను మితాన్ని పాటించాడు. క్యాన్సర్ వ్యాధిగ్రస్తుడై మృత్యుముఖంలో వున్నప్పుడు కూడా— ఆఖరికి మృత్యుదేవతపై కూడా— ఛలోక్తులు వేయడం మానలేదు.

ఇప్పుడు హ్యూమ్ సిద్ధాంతాన్ని తలస్పర్శిగా తెలుసుకుందాము. దీనికి ముందు లాక్, బర్క్లీలను మరొకసారి స్మరించాలి.

మనకు అనుభూతిలోకి వచ్చేవి ఆభాసా గుణాలు (రంగు, రుచి వగైరా), మౌలిక గుణాలు (పరిమాణం, ఆకారం వగైరా) మాత్రమేనని, ఈ మౌలిక గుణాలకు ఆధారభూతమైన భౌతిక పదార్థం (substance) ఏదో వుందని లాక్ అన్నాడు. అయితే, ఆ పదార్థం మన అనుభూతిలోకి రాదు కనుక అది ఎన్నటికీ అజ్ఞాతంగా, అజ్ఞేయంగా వుండిపోతుం దన్నాడు.

బర్క్లీ దీన్ని ఖండిస్తూ అనుభూతిలోకి రాని భౌతిక పదార్థం వుందని ఎలా చెప్పగలమని ప్రశ్నించాడు. కనుక భౌతిక జగత్తు లేదని, మనస్సు మాత్రమే వుందని అన్నాడు.

## మనస్సు లేదు

హ్యూమ్ తిరిగి ఈ వాదాన్ని ఖండించాడు. మనస్సు కూడా మన అనుభూతి లోనికి రాదు కదా? మనలోనికి చూసుకున్నప్పుడు మనస్సు గురించిన జ్ఞానమేదీ కలగదు. ఎప్పుడు, ఏ క్షణంలో చూసినా మనకు ఏదో ఒక ప్రత్యేకానుభూతి, ఏదో ఒక సంవేదన (sensation), ఏదో ఆలోచన, ఏదో భావం మాత్రమే గోచరిస్తుంది. వేడిమి, చల్లదనం, రంగు, కాంతి, నీడ, ప్రేమ, ద్వేషం, బాధ, సుఖం-- ఇవే మనకు అనుభూతమవుతాయి. ఏదో సంవేదన, ఏదో భావం లేకుండా ఒక్క క్షణం కూడా మనం వుండలేము. ఇవన్నీ మానసిక స్థితులు. వీటినే మనం తెలుసుకునేది. కనుక అవే నిజంగా వున్నాయి. ఈ మానసిక స్థితుల మూటనే (bundle of perceptions) మనం మనస్సు అని పిలుస్తున్నాము. మనస్సు (mind) అనేది ఒక పేరుతప్ప మరేమీ కాదు. మన మానసిక స్థితులేతప్ప మనస్సు మన అనుభూతిలోకి రాదు. కోపించడంతప్ప కోపించే మనస్సు లేదు. భయపడడంతప్ప భయపడే మనస్సు లేదు. బాధతప్ప బాధపడే మనస్సు లేదు. ఇలాగే వివిధ అనుభూతులు తప్ప అనుభూతిచెందే "నేను" లేను.

## దేవుడు లేడు

అలాగే బర్క్లీ ప్రతిపాదించిన దేవుడిని కూడా హ్యూమ్ తిరస్కరించాడు. భౌతిక ప్రపంచపు అస్తిత్వానికి ఆధారంగా బర్క్లీ దేవుడిని సహాయంగా తెచ్చుకున్నాడు. ప్రపంచం దేవుని మనస్సులో భావంగా కొనసాగుతుం దన్నాడు. కాని, హ్యూమ్ దీన్ని దుర్బల వాదంగా కొట్టిపేశాడు. ఇంద్రియానుభూతి ద్వారానే మనకు వివిధ భావాలు కలుగు తున్నాయని ఒక వంక చెబుతూ, అనుభూతిలోనికి రాని దేవుడి ఉనికిని ఎలా నిర్ధారణ చేయగలమని ప్రశ్నించాడు.

చివరికి మనకు మిగిలేవి మానసిక స్థితులు (mental states). మానవుడు అంటే మానసిక స్థితుల మూట. అవి తప్ప మరేమీ లేవు.

మానసిక స్థితులు రెండురకాలు. ఒక రకాన్ని హ్యూమ్ ఇంగ్లీషులో impressions అన్నాడు. ఇది కొత్త పేరు. అయినా వీటిని sensations గానే పరిగణించాలి. తెలుగులో వీటిని సంవేదనలుగా మనం వ్యవహరించవచ్చు. ఇంద్రియానుభవంద్వారా మనలో కలిగే గాఢమైన సంవేదనలే ఇంప్రెషన్స్. అయితే, కేవలం ఇంద్రియానుభూతులనే కాక, వీటిలో మన కోర్కెలను, ఉద్రేకాలను, ఆవేశాలను కూడా హ్యూమ్ చేర్చాడు.

రెండవ రకానికి చెందిన మానసిక స్థితులను ideas అని హ్యూమ్ పేర్కొన్నాడు. ఇవి మన ఆలోచనలు, వివేచనలు, భావాలు, జ్ఞాపకాలు, ఊహాలు మొదలైనవి.

## సంవేదనలు, భావాలు

సంవేదనలకు, భావాలకు ముఖ్యమైన తేడా ఒకటి వున్నది. సంవేదనలు మనలను బలంగా, శక్తిమంతంగా తాకుతాయి. వీటిని మన మనస్సు నిస్సహాయంగా స్వీకరించడం తప్ప వేరేమీ చేయలేదు. వీటి విషయంలో మనస్సు తటస్థంగా వుంటుంది.

మరి, భావాలు అంటే ఏమిటి? అవి సంవేదనలకు కాపీలు, ప్రతిబింబాలు (images).

సంవేదనలు అనుభూతి (feeling) కి సంబంధించినవి. భావాలు ఆలోచన (thinking) కు సంబంధించినవి. అయితే, ఇవి సంవేదనలనుంచే వస్తాయి.

సంవేదనలకు, భావాలకు గల తేడాను గ్రహించడానికి ఈ క్రింది ఉదాహరణ ఉపకరిస్తుంది. కోపం అనేది ఒక అనుభూతి (feeling). కోపం అనే ఉద్రేకాన్ని

అనుభవించడం వేరు, కోపం అనే భావాన్ని ఆలోచించడం వేరు. మొదటిది శక్తిమంతమైన అనుభూతి; రెండవది దుర్బలమైన అనుభూతి. అలాగే, నిప్పు తాకినప్పుడు చేయి చురుక్కు మనడానికి, చేయి చురుక్కు మనడాన్ని ఊహించడానికి తేడా వుంది. ఒకటి బలీయమైన సంవేదన. రెండవది దుర్బలమైన భావన. ఒకటి స్పష్టంగా, విశదంగా, నిశ్చయంగా వుంటుంది. రెండవది దానికి భిన్నంగా ఉంటుంది. ఆ రెండింటికి మధ్య తేడా వాటి సజీవత్వపు (liveliness) స్థాయినిబట్టి వుంటుంది.

సంవేదనలే భావాలకు ఆధారం. భావాల కంటె ముందు సంవేదనలు మనకు అనుభూత మవుతాయి. సంవేదనలు లేనిదే వాటికి సంబంధించిన భావాలే కలగవు. ఉదాహరణకు పుట్టుకతో గుడ్డివానికి రంగు అనే భావం కలగదు. పుట్టుకతో చెవిటి వానికి ధ్వని అనే భావం కలగదు.

కనుక భావం అనేది సంవేదనవల్లనే కలుగుతుంది. అయితే మన యథార్థ అనుభూతిలోకి రాని కొన్ని భావాలు కలగవచ్చుకదా అని ప్రశ్న రావచ్చు. ఉదాహరణకు రెక్కల గుర్రం అనే భావం, లేదా బంగారు పర్వతం అనే భావం ఎలా వస్తున్నాయి? వీటిని మనం ఎన్నడూ చూడలేదు కదా? అంటే—రెక్కలను, గుర్రాలను మనం చూస్తున్నాము. బంగారాన్ని, పర్వతాలను విడిగా చూస్తున్నాము. ఈ సంవేదనలను అనుసంధించడం ద్వారా రెక్కల గుర్రం, బంగారు పర్వతం అనే భావాలను మనస్సు ఏర్పరుచుకుంటుంది.

## కార్య - కారణత్వం

హ్యూమ్ తత్వచింతనలో ఒక ముఖ్య భాగం కార్య కారణత్వానికి సంబంధించినట్టిది. కార్య కారణ సూత్రాన్ని (causality) అతడు తిరస్కరించాడు. ఒక సంఘటన మరొకదానికి, ఒక సంవేదన మరొకదానికి, ఒక భావం మరొకదానికి కారణం (cause) కాగలదని, లేదా ఫలితం (eflect) కాగలదని భావించడం పొరపాటు అని అతని అభిప్రాయం. ఇది సయితం చాలా విద్యూరమైన, విప్లవాత్మకమైన తత్వ సిద్ధాంతం.

మనకు కలిగే ఇంద్రియ సంవేదనలు (Sense impressions) దేనికది విడి విడిగా వస్తాయి. అంతేతప్ప పరస్పర కార్య కారణ సంబంధంతో రావు. ఒక సంవేదనకు మరొక సంవేదనకు మధ్య ఎట్టి సంబంధం లేదు. ఒకటి మరొకదానికి కారణం కాదు.

ప్రతి ప్రత్యేక సంవేదనకు ఒక ప్రత్యేక స్వతంత్ర అస్తిత్వం వుంటుంది.

మరొకదానిపై అది ఆధారపడదు. ఒకవేళ ఆధారపడితే, అట్టి ఆధారం మన అనుభూతిలోకి రాదు. అనుభూతిలోకి రానిది ఏదీ లేనట్టే కదా? కనుక ఇది కార్యం, ఇది కారణం అనే సంబంధాన్ని మనం ఎలా గ్రహించగలం?

అయితే, ప్రకృతిలోనేమి, మన మనస్సులోనేమి ప్రతి సంఘటనకు మరొక దానితో కార్యకారణ సంబంధం కలదని, ఏదీ కారణం లేకుండా జరగనేరదని మనం అనుకుంటున్నాము కదా? ఈ భావం ఎలా కలుగుతున్నది? నిజంగా కార్య కారణ సూత్రం అనేది లేకపోతే కార్య కారణ భావం ఎలా కలుగుతున్నది?

## కలిసికట్టు

మన సంవేదనలు ఒక క్రమంలో కలిసికట్టుగా వస్తాయి. అలా రావడంవల్ల ఒక సంవేదన లేదా ఒక సంఘటన మరొక దానికి కారణం అవుతున్నదని మనం భావిస్తాము. ఫలానా పని చేస్తే ఫలానా ఫలితం కలుగుతుందని ఊహించుకుంటాము. కాని, నిజానికి అటువంటిది ఏదీ ప్రకృతిలో లేదు.

ఉదాహరణకు ఎ అనే సంఘటన జరిగింది. తర్వాత బి అనే మరొక సంఘటన జరిగింది. ఆ రెండూ అలా పెక్కుసార్లు కలిసిరావడం జరిగితే ఎ అనేది బి అనే దానికి కారణమని, బి అనేది ఎ అనేదానికి ఫలితమని మనం భావిస్తాము. ఎ అనే సంఘటన మొదటిసారిగా మనకు తెలియవచ్చిందనుకోండి. దాన్ని బట్టి బి అనేది విధిగా జరిగి తీరుతుందని మనం ఊహించగలమా? బి అనేది కూడా జరిగిన తర్వాతనే—అలా కొన్నిసార్లు ఎ, బి కలిసికట్టుగా వచ్చిన తర్వాతనే—ఆ రెండింటికి మధ్య మనం కార్య కారణ సంబంధాన్ని అంటగడుతున్నాము.

నిజానికి అవి రెండూ కలిసికట్టుగా రావడం తప్పితే మరేవిధమైన సంబంధం వాటి మధ్య లేదు. కాని, అలవాటుకొద్దీ, పూర్వపు జ్ఞాపకాలకొద్దీ మనం ఎప్పుడు ఎ అనే సంఘటనను చూసినా బి అనేది విధిగా వస్తుందని భావించుకుంటాము. అదే కార్య కారణ సూత్రంగా మనకు అవగత మవుతున్నది.

## సంఘటనా క్రమం

ఉదాహరణకు ఒక బంతిని పైకెగరవేస్తే నేలమీద పడుతుంది. బంతిని పైకి ఎగరవేయడం, అది నేలమీద పడడం వేర్వేరు సంఘటనలు. కాని, అవి ఎప్పుడూ కలిసికట్టుగా రావడంవల్ల భూమి బంతిని ఆకర్షించడం కారణమని, బంతి నేలపై పడడం ఫలితమని మనం సూత్రీకరిస్తాము. ఈ విధంగా ప్రపంచంలో వివిధ సంఘటనలు ఒక క్రమం (Sequence) లో జరగడంవల్ల వాటి

మధ్య కార్య కారణ సంబంధాన్ని మన మనస్సు కల్పించుకుంటున్నదే తప్ప అట్టి సంబంధం నిజంగా ఆ సంఘటనల మధ్య లేదు.

ఎందుకంటే అనుభూతి వాదం ప్రకారం మనకు యథార్థంగా అనుభవమైన దానికే కదా అస్తిత్వం వున్నది? ఈ సూత్రం ప్రకారం రెండు సంఘటనల మధ్య, రెండు సంవేదనల మధ్య, రెండు భావాలమధ్య ముందు, వెనుక అనే క్రమం (sequence) తప్ప మరే విధమైన సంబంధం మనకు అనుభూతం కావడం లేదు.

ఈ క్రమానుగతత్వాన్నే మనం కార్య కారణ సంబంధంగా భ్రమిస్తున్నాము. అంతేతప్ప ఆ సంబంధం మన అనుభూతిలోకి రావడం లేదు. కనుక అటువంటి కార్య కారణత్వం యథార్థంగా లేదు. అదొక మనోభావం; ఊహాకల్పన.

లాక్, బర్కిల్లల సిద్ధాంతాలలోని లోపాలను హ్యూమ్ భర్తీచేసి ఎంపిరిసిస్టు (అనుభూతివాద) తత్వశాఖను పరిపూర్ణ స్థాయికి తీసుకువెళ్లాడు. అతని ప్రభావం తర్వాతి తత్వవేత్తలపై ఎంతో వున్నది. ముఖ్యంగా కాంట్‌ను "తాత్విక నిద్రనుంచి మేల్కొలిపినవాడు"గా హ్యూమ్ ప్రసిద్ధి పొందాడు.

వేర్వేరు మానసిక స్థితులే తప్ప మనస్సు, ఆత్మ, 'నేను' అనేవాటికి ప్రత్యేక అస్తిత్వం లేవనే హ్యూమ్ సిద్ధాంతం ఇటీవలి జర్మన్ భౌతిక శాస్త్రవేత్త హైసెన్‌బర్గ్ ప్రతిపాదించిన "ప్రిన్సిపుల్ ఆఫ్ ఇన్‌డిటర్మినెసీ"తో పోలిక కలిగినదని కొందరు వ్యాఖ్యాతలు పేర్కొన్నారు. బిహేవియరిజం అనబడే ఆధునిక మనస్తత్వ శాస్త్ర సిద్ధాంతంపై కూడా అతని ప్రభావం వున్నదంటున్నారు.



# 25
# రొమాంటిక్ వాద ప్రవక్త రూసో

"మానవుడు జన్మతః స్వేచ్ఛాజీవి. కాని ఎక్కడ చూసినా, సంకెళ్ల లోనే కనబడుతున్నాడు." Man is born free, but everywhere he is in chains)–

ఈ సుప్రసిద్ధ సుభాషితానికి కర్త జాం జాక్ రూసో (Jean jaques Rousseau).

రూసో పేరు స్మరిస్తే మొదటగా జ్ఞాపకం వచ్చేది ఫ్రెంచి విప్లవం. అది 18వ శతాబ్ది చివరలో (1789) యూరప్‌ను ఒక ఊపు ఊపేసింది. ఆ విప్లవానికి తాత్విక దృక్పథాన్ని సమకూర్చిన వారిలో ఒకడు వోల్టేర్ కాగా, మరొకడు రూసో. ఫ్రెంచి విప్లవ కారులకు రూసో వ్రాసిన "సోషల్ కాంట్రాక్టు" బైబుల్ తర్వాత బైబుల్ లాంటిది. ఆ గ్రంథం మొదటి అధ్యాయంలో మొదటి వాక్యమే పైన పేర్కొన్న సుభాషితం. ఫ్రెంచి విప్లవ నాయకుడు రాబ్‌స్పియర్ రూసోకు గాఢాభిమాని.

రూసో పేరు స్మరిస్తే జ్ఞాపకం వచ్చే వాటిలో మరొకటి జర్మనీ, ఫ్రాన్సు, ఇంగ్లండు మొదలైన దేశాలలో మేధావులను, రచయితలను, కళాకారులను విపరీతంగా ప్రభావితం చేసిన రొమాంటిక్ ఉద్యమం. ఆ ఉద్యమ ప్రవక్త రూసో.

రూసో జీవితం చాలా చిత్రమైనది. అతని మనస్తత్వం ఇంకా విచిత్రమైనది. ఏ దాస్తోయెవ్‌స్కీ నవలలో నుంచో, డి. హెచ్. లారెన్స్ నవలలోనుంచో వూడిపడిన అసాధారణ పాత్రవలె కనిపిస్తాడు.

ఇప్పటివరకు మనం చదివిన తత్వవేత్తలకు, రూసోకు పోలిక లేదు. వారి వలె ఇతడు పారభౌతిక సత్యాలను (metaphysical truths) అన్వేషించలేదు. ఆ దృష్టితో చూస్తే ఇతడు దార్శనికుడే కాదు. మార్క్సువలెనే అతడు కూడా ఆధునిక యుగ ప్రవక్త. రాజకీయాలు, కళలు, సాహిత్యం, మనస్తత్వ శాస్త్రం, జీవిత దృక్పథం- అన్నిటిని రూసో ప్రభావితం చేశాడు. ప్రధానంగా అతడు సాంఘిక, రాజకీయ సంస్కర్త.

## ఉత్తర, దక్షిణ ధ్రువాలు

ఒక విచిత్రం ఏమంటే వోల్టేర్, రూసో ఇరువురు ఫ్రెంచి విప్లవానికి తాత్విక మార్గ దర్శకులైనా ఉభయులకు పోలిక లేదు. ఒకరు దక్షిణ ధ్రువం. మరొకరు ఉత్తర ధ్రువం. వోల్టేర్ మేధావాది. రూసో హృదయవాది. అతడు వివేచన (reason) కు ప్రాధాన్యమిస్తే, ఇతడు హృదయానుభూతి (feeling) కి పట్టాభిషేకం చేశాడు.

దేకార్త్ "నేను ఆలోచిస్తున్నాను, కనుక వున్నాను" అన్నాడు.

'నేను అనుభూతి పొందుతున్నాను, కనుక వున్నాను' (I feel-therefore I am) అన్నది రూసో వాదం.

రూసో ఫ్రెంచి జాతీయుడు. జినీవాలో 1712 లో జన్మించాడు. తండ్రి గడియారాలు తయారుచేసేవాడు. పుత్రుడు జన్మించిన కొన్నాళ్లకే తల్లి మరణించింది. తండ్రి ఇతడిని గురించి పట్టించుకోలేదు. విద్యాబుద్ధులు చెప్పించలేదు.

పదో ఏట నుంచే రకరకాల ఉద్యోగాలు చేశాడు. ఒక ఎన్‌గ్రేవర్ దగ్గర పని చేస్తూండగా యజమాని అతడిని సోమరి అని, మందమతి అని, దొంగ అని చావ బాదేవాడు. సరే, ఎలాగూ దొంగ అనే ముద్రపడింది గదా అని, నిజంగానే దొంగతనాలు మొదలుపెట్టాడు. అడ్డమైన వారితోను సావాసం చేసి, జులాయిగా తిరిగేవాడు.

## దేశ ద్రిమ్మరి

అలా తిరిగి తిరిగి ఒకసారి ఇంటిలో నుంచి పారిపోయాడు. ఇటలీలోని ట్యూరిన్ వెళ్లాడు. మదాం డి వారెన్స్ అనే ధనికురాలు అతడిని చేరతీసింది. కాథలిక్ మతం ఇప్పించింది. వ్యాకరణం, సంగీతం నేర్పించింది.

కొన్నాళ్లు ఆమెవద్ద గడిపి, మళ్లీ తిక్కరేగి పారిపోయాడు. ఎన్‌గ్రేవర్‌గా, సంగీతం టీచరుగా అక్కడా ఇక్కడా పనిచేశాడు కాని, పూట గడిచేది కాదు. మళ్లీ మదాం డి వారెన్స్ శరణ్యమైంది. 1733 నుంచి 1740 వరకు ఆమెతో వున్నాడు. సంగీతంతోపాటు కాస్త మంచి, మర్యాద, సభ్యత, సంస్కారం నేర్చు కున్నాడు. కొన్నాళ్లకు ఆమెకు అతనిపై ఇష్టం తగ్గి వదిలేసింది.

పారిస్ వెళ్లాడు. వెనిస్‌లో ఫ్రెంచి రాయబారికి కార్యదర్శిగా కుదురు కున్నాడు. రూసో ప్రవృత్తి చాలా చంచలమైంది. మనిషి ఆవేశపరుడు. అందరితోను దెబ్బలాడేవాడు. అలాగే తనకు ఉద్యోగమిచ్చిన రాయబారి తోనూ దెబ్బలాడాడు. యజమానిపై కోపం మొత్తం ప్రభుత్వంపై, ధనికులపై, భూస్వాములపై, సమకాలిక సమాజ వ్యవస్థపై క్రోధంగా మారింది.

ఏవో రచనలు చేసేవాడు. కాని, రచయితగా పేరు రాలేదు. మేధావులతో పరిచయాలు, స్నేహాలు ఏర్పడ్డాయి. స్నేహితులలో ఒకడు దిదిరో (Diderot). అతడు ఫ్రెంచి ఎన్‌సైక్లోపీడియా సంపాదకుడు. ఫ్రెంచి విప్లవానికి తాత్విక ప్రేరకులలో ఒకడు. మహా రచయితగా పేరెన్నిక గన్నవాడు.

## జీవితంలో మలుపు

అది 1749 వ సంవత్సరం. దిదిరో ఏదో ప్రభుత్వ వ్యతిరేక రచన చేసి నందుకు కారాగార శిక్ష అనుభవిస్తున్నాడు. అతడిని చూడడానికి వెడుతూ, రూసో దారిలో ఒక పత్రిక కొన్నాడు. ఆ పత్రికలో ఒక ప్రకటన అతడి దృష్టిని ఆకర్షించింది. అది దిజాన్ అకాడెమీ చేసిన ప్రకటన :- "కళలు, సైన్సులవల్ల మానవ జీవితం బాగుపడిందా?" అనే విషయంపై ఉత్తమ వ్యాసం వ్రాసినవారికి బహుమతి ఇస్తామని ఆ అకాడెమీ ప్రకటించింది.

ఆ ప్రకటన చదివి, దాన్ని గురించి ఆలోచించసాగాడు. శర పరంపరగా భావాలు అతడిని ముట్టడించాయి. అప్పటి తన మానసిక స్థితిని రూసో ఇలా వర్ణించాడు :

"నా ముందు ఒక వెయ్యి దీపాలు భగ్గున వెలిగాయి, విస్పష్టమైన భావాలు గుంపులు గుంపులుగా నా మనస్సులో ముసిరాయి. వర్ణనాతీతమైన మానసిక సంక్షోభానికి లోనయ్యాను. నా తల తిరిగిపోయింది. మద్యపానంవల్ల కలిగే మగత వంటిది నన్ను ఆవహించింది–"

ఆవేశాన్ని అణచుకోలేక రోడ్డుపక్క చెట్టుకింద కూర్చున్నాడు. మానవుని పరిస్థితి గురించి ఆలోచిస్తుంటే ఉద్వేగం కట్టలు తెంచుకున్నది. విషాదం తుఫానులా చెలరేగింది. భావాలు సముద్ర తరంగాలవలె ముంచెత్తాయి.

## ఉ ద్వి గ్న త

క్రమంగా అతని ఆవేశం తగ్గింది. ఇక్కడ ఎందుకు కూర్చున్నానా అని చుట్టూ చూశాడు. అతని కోటు ముందు పక్కన అంతా కన్నీటితో తడిసిపోయింది. తనకే తెలియకుండా అంతసేపు అతడు తనలో తను వెక్కి వెక్కి ఏడ్చా డన్నమాట.

"ఆ చెట్టు నీడలో నాకు కలిగిన అనుభూతులలో ఏ పావు భాగమైనా కాగితం మీద పెట్టగలిగితే, మానవ సమాజ వ్యవస్థలోని వైరుధ్యా లన్నిటిని ఎంత బలంగా చీల్చి చెండాడి వుందునో అనిపించింది."

అలాగే తన భావాలన్నీ అతడు కాగితంమీద పెట్టాడు. వ్యాసం పూర్తిచేసి అకాడెమీకి పంపించాడు. బహుమతి గెలుచుకున్నాడు.

అతని జీవితం ఒక మలుపు తిరిగింది. ఉన్నట్టుండి ఫ్రాన్స్ అంతటా అతని పేరు మార్మ్రోగింది.

కాని, అతనిది విచిత్ర ప్రవృత్తి కదా? డబ్బు అతనికి సుఖమివ్వలేదు. కీర్తివల్ల అసలే సుఖం కలగలేదు. ఎప్పుడూ అందని దేనికోసమో ఆరాటం. ఎప్పుడూ ఎవరితోనో పోరాటం. ఏదో అశాంతి, అసుఖం, ఆవేదన.

## దగుల్బాజీ తనం

రచయితగా వచ్చిన కీర్తితో ఉన్నత వర్గాలవారితో స్నేహాలు ఏర్పడ్డాయి. అదే సమయంలో పారిస్‌లో తాను నివసించే హోటల్‌లోని ఒక పనిపిల్లను ప్రేమించాడు. ఆమె పేరు థెరిసి లీ వాసియర్. ఆమెలో ఏమి చూశాడో తెలియదు. వ్రాయడం, చదవడం బొత్తిగా రాదు. పైగా అనాకారి. బహుశా ఆమె ముందు తానొక గొప్ప మేధావిగా చెలామణీ కాగల అవకాశంకోసం ప్రేమించాడేమో నంటారు. ఆమెవల్ల అతనికి అయిదుగురు పిల్లలు కలిగారు. వారిని తానే పెంచితే, తన వలెనే భ్రష్టులుగా తయారవుతారని, కన్న తండ్రివనే మమకారం లేకుండా, పుట్టినవారిని పుట్టినట్టుగా ఒక అనాథ శరణాలయంలో చేర్చేవాడు. నిర్దయగా చేతులు దులుపుకొని వచ్చేవాడు.

1752 లో రూసో వ్రాసిన ఒక సంగీత రూపకాన్ని రాజ దర్బారులో ప్రదర్శించారు. అది అందరి మెప్పు పొందింది. రాజు 15వ లూయీ, రూసోకు పెన్షన్ ఇవ్వజూపాడు. కాని, అతడు అనాసక్తితో అసలు దర్బారుకే వెళ్లలేదు. పెన్షన్‌ను స్వీకరించలేదు. యథాప్రకారం తనూ, తన సంగీత పాఠాలు, తన ఉంపుడుకత్తె, తన పేదరికం--

1755 లో దిజాన్ అకాడెమీ మరొక పోటీ ప్రకటించింది. రూసో మళ్లీ ఒక వ్యాసం వ్రాశాడు. దానికి ఈసారి బహుమతి రాలేదు. కాని, అంతకంటె విలువైన కీర్తి లభించింది. ఆ వ్యాసం పేరు "A Discourse on the Origins of Inequality." (మానవ జాతిలో అసమానతల పుట్టు పూర్వాలు).

## వి రో ధా లు

ఆ రోజులలో అతడిని ఆదరించిన మదాం డి ఎపినే అనే మరొక ధని కురాలు రూసోకు ఒక గృహంలో ఆశ్రయమిచ్చింది. దానిలో తన ఉంపుడు కత్తెతో సహా నివసించేవాడు. కాని, కొద్ది కాలానికే మదాం డి ఎపినేతో తగవు పెట్టుకున్నాడు. మరొకవైపు తనను అభిమానించిన మహా మనీషి దిదిరోతో విరోధం తెచ్చుకున్నాడు. చివరికి పారిస్ వదిలిపెట్టి- మాంట్ మొరెన్సీ అనే అడవి మధ్యలో ఒక చిన్న కుటీరంలో నివసించాడు. అక్కడే తన చిరకీర్తికి పునాదులైన రెండు గ్రంథాలు వ్రాశాడు. ఒకటి ఒక నూతన విద్యా విధానాన్ని ప్రతిపాదించిన "ఎమిల్", మరొకటి విప్లవాత్మక రచన "సోషల్ కాంట్రాక్ట్".

రూసో ఎప్పుడూ సగం ఉన్మాదావస్థలో వుండేవాడు. ఎవరో తనను హత్య చేయడానికి కుట్ర పన్నుతున్నారని, తన గురించే మాట్లాడుకుంటున్నారని అను కునేవాడు. ఒకరకం పర్సెక్యూషన్ మేనియా-వేధింపు భయం - పట్టుకున్నది.

"సోషల్ కాంట్రాక్ట్"ను అధికారులు నిషేధించారు. అతడి అరెస్టుకు ఉత్త ర్వులు జారీ అయ్యాయి. అతడు ప్రష్యా పారిపోయాడు. ఫ్రెడరిక్ ది గ్రేట్ అతనికి ఆశ్రయ మిచ్చాడు. కాని అక్కడా వుండలేకపోయాడు. బ్రిటిష్ తత్వ వేత్త డేవిడ్ హ్యూమ్ అతడిని లండన్ తీసుకుపోయి ఆశ్రయమిచ్చి ఆదరించాడు. బర్క్, బాస్వెల్, ప్రధాని వాల్పోల్ మొదలైన వారితో పరిచయాలు ఏర్ప డ్డాయి. ఇంగ్లీషు వారు అతనికి బ్రహ్మరథం పట్టారు. రాజు మూడవ జార్జి అతనికి పెన్షన్ ఇవ్వజూపగా నిరాకరించాడు. తనను ఎంతో అభిమానించిన హ్యూమ్‌తో తీవ్రంగా దెబ్బలాడాడు. తనను అతడు హత్యచేయ జూస్తున్నాడని భయం పట్టుకుని లండన్‌నుంచి మళ్లీ పారిస్‌కు పలాయితు డయ్యాడు. మళ్లీ కొత్త స్నేహాలు, కొత్త విరోధాలు....

సంగీతపు నోట్స్ కాపీ చేసే వృత్తితో పొట్టపోసుకొనేవాడు. ఎవరో మళ్లీ చేరదీశారు. ఇల్లూ వాకిలీ కుదిర్చిపెట్టారు. దుర్భర దారిద్ర్యగ్రస్తుడై, వ్యాధి పీడితుడై 1778 లో కన్ను మూశాడు.

## విచిత్ర వ్యక్తి

మొదటనే చెప్పినట్టు రూసోది అనేక వైరుధ్యాలతో కూడిన విచిత్ర ప్రవృత్తి.

చిన్ననాడు ఏమంత చదువుకోలేదు. కాని, ప్రపంచమంతటా విద్యావిధానంలో విప్లవాత్మకమైన మార్పులకు కారణమైన ఉద్గ్రంథం వ్రాశాడు. ఫ్రెంచి సాహిత్యంలో అతనిది అజరామరకీర్తి. గొప్ప నవలలు, నాటకాలు, సంగీత రూపకాలు వ్రాశాడు. రాజకీయ, సాంఘిక సమస్యలపై వ్యాసాలు, గ్రంథాలు, స్వీయచరిత్ర ఇత్యాదిగా 47 సంపుటాల రచనలు చేశాడు. అతని నవలలు ఆ రోజులలో పాఠకులను ఉద్రూత లూగించాయి.

సంగీతం పెద్దగా నేర్చుకోలేదు. కాని, సంగీత ఉపాధ్యాయుడుగా పనిచేశాడు. సంగీతపు నొటేషన్ (స్వర రచన)లో మార్పులు ప్రవేశ పెట్టాడు. దిదిరో తన ఎన్సైక్లోపీడియాలోని సంగీత వ్యాసా లన్నిటిని రూసో చేతనే వ్రాయించాడు.

మహామేధావి, మానవతావాది. కాని, వ్యక్తిగా అంత ఆకతాయి మరొకడు లేడన్న చెడ్డపేరు తెచ్చుకున్నాడు.

హృదయవాది. కాని కొన్ని సమయాలలో హృదయం ఏ కోశాన లేనివాడి వలె ప్రవర్తించేవాడు. అయితే మనిషి తన చిత్తవృత్తి ప్రకారం జీవించాలనేవాడు. అలాగే జీవించాడు.

ఇక రూసో సిద్ధాంతాలు.

# నాగరికతను నిరసించిన రూసో

దైవ నిషిద్ధమైన విజ్ఞాన వృక్ష ఫలాన్ని ఆరగించినందువల్లనే ఆదిమానవుడు ఆదమ్ భూతలస్వర్గం నుంచి పతితుడైనాడని బైబుల్ కథ. అలాంటిదే రూసో వాదం కూడా. దాని ప్రకారం మానవుడు విజ్ఞానం ఆర్జించి కృత్రిమ నాగరికతను పెంపొందించుకోవడం వల్లనే భ్రష్టుడయ్యాడు.

మానవుడు స్వతహాగా మంచివాడు, అతడిని చెడగొట్టింది సమాజం, నాగరికత— ఇది రూసో ప్రబల విశ్వాసం.

తనకు బహుమతి తెచ్చిపెట్టిన వ్యాసంలో రూసో సైన్సులను, కళలను పట్టుకుని తూర్పారబట్టాడు. మానవ పతనానికి అవే కారణా లన్నాడు.

హాబ్స్ వలె, లాక్ వలె రూసో కూడా ఒకానొక "సహజ స్థితి" (State of Nature)ని ఊహించాడు. అయితే హాబ్స్ చెప్పినట్టు అది నిరంతర యుద్ధ స్థితి కాదు. ప్రాచీన, అనాగరిక మానవుడు సుఖంగా, హాయిగా ఉండేవాడు. దొరికిందేదో తినేవాడు. కడుపు నిండిన తర్వాత కాలుమీద కాలు వేసుకుని ప్రశాంతంగా జీవించేవాడు. అందరితోను స్నేహంగా వుండేవాడు. అది సత్యయుగం.

కాని, ఆ యుగం ఎంతో కాలం కొనసాగలేదు. మానవుడు ప్రకృతిలో అంతర్భాగంగా కాక, దానిపై ఆధిపత్యానికి ఎప్పుడైతే ప్రయత్నించాడో, దొరికిన దానితో తృప్తిపడక ఎప్పుడైతే కోరికలు పెంచుకున్నాడో అప్పుడే అతని పతనం ప్రారంభమైంది. లోహాలు కనిపెట్టాడు. పనిముట్లు తయారుచేశాడు. కళలు నేర్చాడు. వ్యవసాయం నేర్చాడు. వీటి ఫలితంగా పతితు డయ్యాడు. ఇనుము, ధాన్యం మానవ పతనానికి ముఖ్యకారణాలని రూసో పేర్కొన్నాడు.

## అసమానతలు

విజ్ఞానం పెరగడంతో మనుషులలో ఎక్కువతక్కువలు మొదలయినాయి. బలవంతుడు, దుర్బలుడు, ధనికుడు, పేదవాడు అనే తారతమ్యాలు, వర్గ విభేదాలు బయలుదేరాయి. అసమానత్వం పెరిగింది. బలవంతుడు దుర్బలుడిని, ధనికుడు పేదవాడిని అణచివేసి బానిసగా చేసుకున్నారు. విజ్ఞానం, ధనం ఇవి అసమానతలను సృష్టించాయి.

నాగరికత మానవుడిని భ్రష్టుడిని చేసింది. నాగరికతకు దూరంగా, ప్రకృతికి దగ్గరగా వుండే మానవ సమాజాలలో కుళ్లు, కుత్సితం, కృత్రిమత్వం కనబడవు. నాగరిక సమాజంలో కంటె అనాగరిక ఆదిమ సమాజాలలో స్వేచ్ఛా, సమానత్వాలు ఎక్కువ.

అనాగరిక, ఉదాత్త మానవుడు (noble savage) స్వేచ్ఛాప్రియుడు, శాంతికాముకుడు, కష్టపడి చెమటోడ్చి పనిచేయనవసరం లేని ప్రశాంత, విశ్రాంత జీవనం గడుపుతాడు. నాగరికుడు అలాకాక, ఎప్పుడూ ఏదో కొంప మునిగిపోయినట్టు ఎక్కడికో పరిగెడుతూ, దేనికోసమో అర్రులు చాస్తూ, చెమటోడ్చి పనిచేస్తూ, ధనం కూడబెడుతూ, తాను హైరానపడుతూ, ఇతరులను హైరాన పెడుతూ, ధనికులకు ఊడిగం చేస్తూ, ఊడిగంలోనే తనకు స్వేచ్ఛ కలదని నమ్ముతూ, నమ్మిస్తూ, దొంగవేషాలు వేస్తూ, అవినీతి పంకంలో దొర్లుతూ, కులుకుతూ, సంప్రదాయాల సంకెళ్లతో తనను తాను బంధించుకుంటూ, కట్టుబాట్లకు బానిసగా బ్రతుకుతూ, తన సహజ ప్రవృత్తి ప్రకారం తాను బ్రతకకుండా, ఇతరుల అభిప్రాయాల ప్రకారం జీవిస్తూ, అధికారంలో వున్న వారిని లోపల ద్వేషిస్తూ, పైకి గులాములా వంగి వంగి సలాము చేస్తూ జీవితం గడుపుతాడు.

## సొంత ఆస్తి

సొంత ఆస్తి అన్ని అనర్థాలకు మూలం. "నిజానికి ఏ పౌరుడు మరొక పౌరుడిని కొనగలిగినంత ధనం కూడబెట్టరాదు. ఏ పౌరుడు తనను తాను మరొకడికి అమ్ముకునేటంత పేదవాడు కారాదు"- ఇది రూసో సూక్తులలో మరొకటి.

"ఇది నాది అని ఏ మానవుడు ఒక స్థలం చుట్టూ గిరిగీసి, చుట్టూ కర్రలు పాతి, కంచెకట్టి మొదటగా ప్రకటించాడో, ఇతరులను నమ్మించాడో అతడు మొట్టమొదటగా సభ్య సమాజాన్ని (Civil Society)" స్థాపించాడని చెప్పవచ్చు. కాని, 'ఈ మోసగాడిని నమ్మవద్దు. భూమి ఇచ్చే ఫలాలు మన అందరి ఉమ్మడి ఆస్తి అని విస్మరించవద్దు. ఈ భూమి ఏ ఒక్కరిదీ కాదు.' అని ఏ ఒక్కడైనా ఆనాడే తన సోదర మానవులకు చెప్పి ఆ కంచెను ఊడబెరికి గుంటలు పూడ్చివుంటే, అతడు ఎన్ని నేరాలనుంచి, ఎన్ని హత్యలనుంచి, ఎన్ని ఘాతుకాలనుంచి, ఎన్ని దురదృష్టాలనుంచి మానవజాతిని రక్షించి వుండేవాడో చెప్పలేము అని రూసో "సోషల్ కాంట్రాక్ట్" పుస్తకంలో ఒక గొప్ప ఆవేశంతో, నాగరిక సమాజ వ్యవస్థపట్ల గొప్ప అసహనంతో, మానవజాతిపట్ల అపార కరుణార్ద్రతతో వ్రాశాడు.

హాబ్స్‌వలె, లాక్‌వలె రూసోకూడా ఒక సోషల్ కాంట్రాక్ట్‌ను (ప్రజల ఒప్పందం) ఊహించాడు. హాబ్స్ సిద్ధాంతం ప్రకారం సార్వభౌమత్వం (sovereignity) రాజులో నిక్షిప్తమై వుంటుంది. లాక్ ప్రజా ప్రతినిధులతో కూడిన పార్లమెంటుకు సార్వభౌమత్వం సంక్రమిస్తుం దన్నాడు. రూసో అలా కాక సార్వభౌమత్వం ప్రజలందరిలోను ఏక కాలంలో పరివ్యాప్తమై వుంటుం దన్నాడు.

## ఏది ఉత్తమ వ్యవస్థ?

అన్నిటిలోకి రాజరిక వ్యవస్థ చెడ్డది. మహాకవి ధూర్జటి మాటలలో "రాజులొమ్మత్తులు వారి సేవ నరకప్రాయంబు—" ఇది రూసో విశ్వాసం. రాజులచుట్టూ దుర్మార్గులు, దుర్బలులు, అధికార మదాంధులు, భజనపరులు, అవినీతిపరులు, సోమరులు చేరుతారు. వారిలో కలికానికైనా మంచి కానరాదు.

అదే సమయంలో సంపూర్ణ ప్రజాస్వామ్యాన్ని (absolute democracy) కూడా రూసో అంగీకరించలేదు. ప్రజాస్వామ్యం చిన్నరాజ్యంలోనే సాధ్యం. అసమానతలు, వర్గ విభేదాలు, ధనబలం, విలాస జీవితం కల చోట అది సాధ్యపడదు. సంపూర్ణ ప్రజాస్వామ్యంలో పనులు తెమలవు. చర్చలతోనే కాలక్షేపమైపోతుంది.

అన్నిటికంటె ఉత్తమం-- ఎన్నిక అయిన విశిష్ట వ్యక్తుల ప్రభుత్వం (elected aristocracy). అయితే అది వారసత్వంగా సంక్రమించే అధికారం కారాదు.

ప్రభుత్వ రూపాలు మారవచ్చుగాని, రాజ్యం (state) మారదు. అది అవిచ్ఛిన్నంగా కొనసాగుతుంది. దానిలోనే సార్వభౌమత్వం నిక్షిప్తమై వుంటుంది. రాజ్యం సమిష్టి నిర్ణయానికి (general will) ప్రతీక. అది సమిష్టి శ్రేయస్సును కోరుతుంది. అందరి ప్రయోజనాలను కోరుతుంది.

లాక్ ఆస్తి హక్కుల రక్షణకు విప్లవాన్ని అంతిమాయుధంగా పరిగణించాడు. కాని, రూసో అలా కాదు. ప్రభుత్వం ఎప్పుడైతే సమిష్టి శ్రేయస్సుకు భంగకరంగా ప్రవర్తిస్తుందో, దమననీతికి పాల్పడుతుందో అప్పుడు తిరుగుబాటు చేసే హక్కు ప్రజలకు వుంటుం దన్నాడు. విప్లవాలు రక్తపాతానికి దారితీస్తాయని, కనుక అవి తగవన్న వాదాన్ని అతడు తిరస్కరించాడు. విప్లవాలవల్ల సమాజం, మానవ జీవితం ప్రక్షాళితా లవుతా యన్నాడు.

## కొత్త విద్యా విధానం

"ఎమిల్" అనే నవలలో రూసో ఒక నూతన విద్యా విధానాన్ని ప్రతిపాదించాడు. మనిషి పుట్టుకతో వచ్చిన మంచితనాన్ని పోగొట్టుకోకుండా వుండేటట్టు, అతని హృదయాన్ని అద్దంలా నిర్మలినంగా వుండేటట్టు చేయగల విద్యా విధానం అవసర మన్నాడు.

శిశువు జన్మించినప్పుడు జంతుస్థితిలో వుంటాడు. అందుచేత పిల్లలను అయిదేళ్ల వరకు వారి సహజ ప్రవృత్తి ప్రకారం పెరగనివ్వాలి. క్రమశిక్షణ పేరుతో వారిని పెద్దల మనోభీష్టాల ప్రకారం లొంగదీయరాదు. పన్నెండేళ్లు వచ్చేవరకు వారికి పుస్తక విజ్ఞానం నేర్పరాదు. సాంఘికమైన, నైతికమైన కట్టుబాట్లు రుద్దరాదు. ఆ తర్వాతనే వారికి ఖగోళం, ఇతర శాస్త్రాలు కళలు, చరిత్ర, రాజకీయాలు, ఆర్థిక, సాంఘిక శాస్త్రాలు, మతం లాంటివి బోధించాలి. ప్రకృతిని స్వయంగా పరిశీలించి నేర్చుకోనివ్వాలి. వారి సహజ కుతూహలాన్ని పెంపొందించే విధంగా విద్యా విధానాన్ని రూపొందించాలి.

## కృత్రిమ నాగరికత

రూసో తన కాలంనాటి కృత్రిమ నాగరికతనే అంతగా ఏవగించుకుంటే, ఇక ఈ రోజులలో మనం అంతకు ఎన్నోరెట్లు పెరిగిన ఈ యాంత్రిక, సాంకేతిక నాగరికతను మరెంతగా అసహ్యించుకోవాలి? ఆధునిక జీవితం పూర్తిగా యాంత్రికమైపోయింది. వేగం పెరిగింది. అశాంతి, ఒత్తిడి పెరిగాయి. విశ్రాంతి కరువైంది. భారీ పరిశ్రమలతో పరిసరాల కాలుష్యం పెరిగి, సహజసుందరమైన ప్రకృతికి మనిషి దూరమయ్యాడు. నాగరిక జీవనం మనిషిలో కృత్రిమత్వాన్ని పెంచింది. సహజమైన ఉద్రేకాలు బయటికిపోయే మార్గం (outlet) లేక మనిషి శారీరక, మానసిక ఆరోగ్యం దెబ్బ తింటున్నది.

ఈ సందర్భంలో కాళిదాసు అభిజ్ఞాన శాకుంతలం పంచమాంకంలో కణ్వాశిష్యులైన శార్ఙ్గరవ, శారద్వతులు మున్యాశ్రమంనుంచి వచ్చి మొదటిసారిగా నగరప్రవేశం చేసినప్పుడు చెప్పిన మాటలు గుర్తుకు వస్తాయి. జనసమ్మర్దంతో

కూడిన పురం తగులబడుతున్న ఇల్లువలె వున్నదని ఒక శిష్యుడు అంటాడు. పుర ప్రజలను చూస్తున్నప్పుడు స్నానం చేసినవాడు అశుభ్రంగా వున్నవాడిని, పవిత్రుడు దుష్టుడిని, మేలుకుని వున్నవాడు నిద్రితుడిని, స్వేచ్ఛగా వున్నవాడు కారాబద్ధుడిని చూస్తే కలిగే ఏవగింపు వంటిది కలగడం సహజమేనని మరొక శిష్యుడు అంటాడు.

[1. శార్ఙ్గరవుడు :
మహాభాగః కామం నరపతిరభిన్న స్థితిరసౌ
న కశ్చి ద్వర్ణానామపథమపకృష్టోఽపి భజతే
తథాపీదం శశ్వత్పరిచితవివిక్తేన మనసా
జనాకీర్ణం మన్యే హుతవహపరీతం గృహమివ !

[2. శారద్వతుడు :
అభ్యక్తమివ స్నాతః శుచిరశుచి మివ
ప్రబుద్ధ ఇవ సుప్తమ్
బద్ధమివ స్వైరగతిర్జనమిహ
సుఖసంగినమవైమి .!
(అభిజ్ఞాన శాకుంతలం : 5 అం. 10-11 శ్లో.]

## రొమాంటిసిజం

రూసో సిద్ధాంతాలు ఇంగ్లండులో రొమాంటిక్ ఉద్యమానికి కారణమైన విషయం అందరికీ తెలిసిందే. వర్డ్స్‌వర్త్ ప్రకృతి ఆరాధన, కోల్‌రిజ్ "ఏన్షియంట్ మేరినర్" లాంటి విచిత్ర భయానక గాథాకవితలు, షెల్లీ మానవ స్వేచ్ఛాసమానత్వాలను కీర్తిస్తూ వ్రాసిన అద్భుత గీతాలు, పద్య నాటకాలు, కీట్సు ప్రాచీన గ్రీకు పురాణ కథాకాలంలోనికో, మధ్య యుగాలలోనికో కవితా పక్షాలపై (on the viewless wings of poesy) పలాయనం చేస్తూ వ్రాసిన పరమ రమణీయ కవిత్వం, స్కాట్ చారిత్రక నవలలలోని షివల్రీ వాతావరణం, ఎమిలీ బ్రాంటీ "వుదరింగ్ హైట్స్" లోని ప్రాకృతికోద్రేకాలు, ఇటీవలి డి. హెచ్. లారెన్స్ నవలలలోని "నేచురల్ మ్యాన్" ఫిలాసఫీ– వీటన్నిటిపై రూసో చింతనా ప్రభావం జ్ఞాతంగానో, అజ్ఞాతంగానో కనిపిస్తుంది.

వర్డ్స్‌వర్త్ "The world is too much with us,..." అన్నప్పుడు రూసో జ్ఞాపకం వస్తాడు.

"రిటర్న్ టు నేచర్" అంటూ థోరో వాల్డెన్ కొలనువద్ద కుటీరం నిర్మించుకుని నివసించిన ఉదంతం వింటే రూసో మదిలో మెదలుతాడు.

టాల్‌స్టాయ్ రష్యన్ కర్షకుల అమాయక, సరళ జీవన విధానాన్ని కీర్తిం చినప్పుడు రూసో మన స్మృతివీధిలో కదలాడుతాడు.

గాంధి "గో బ్యాక్ టు విలేజెస్" అని గ్రామ స్వరాజ్యాన్ని మన లక్ష్యంగా నిర్దేశించి ప్రబోధించినప్పుడు రూసో ప్రభావం ఎంత పరోక్షంగానైనా కనబడు తుంది.

తెలుగులో భావకవులు ప్రకృతి గీతాలను పరవశించి పాడినప్పుడు, కృష్ణ శాస్త్రి–

"క్రౌర్య కౌటిల్య కల్పిత కఠిన దాస్య
శృంఖలములు తమంతనె చెదరిపోవ
గగనతలము మార్మ్రోగగ కంఠమెత్తి
జగమునిండ స్వేచ్ఛాగాన ఝరుల నింతు."

అని స్వేచ్ఛాగానం చేసినప్పుడు

రూసో భావప్రతిస్పందన దూరం నుంచే కావచ్చుగాని మన చెవులలో మారుమ్రోగుతుంది.

ఇంతకు ముందు పేర్కొన్నట్టు వోల్టేర్, రూసోలు ఉత్తర, దక్షిణ ధ్రువాల వంటివారు. ఇరువురి ఆలోచనా ధోరణులకు ఏ మాత్రం సమన్వయం కుదరదు. రూసో ఎంత రొమాంటిసిస్టో, వోల్టేర్ అంత రేషనలిస్టు. అతనికి హృదయం, మానవుని సహజ ప్రవృత్తులు ముఖ్యం. ఇతనికి బుద్ధి, వివేచన ముఖ్యం.

రూసో ఒకసారి వోల్టేర్‌కు తాను వ్రాసిన ఒక గ్రంథం పంపించాడు. అది చదివి వోల్టేర్ ఇలా సమాధానం వ్రాశాడట. "మీ పుస్తకం చదివిన తర్వాత మనిషికి నాలుగు కాళ్లపై నడవా లనిపిస్తుంది. అయితే నేను ఆ అలవాటు మానుకుని దాదాపు అరవై యేళ్లయింది. ఇప్పుడు కొత్తగా అది అలవాటు చేసుకోలేను, సారీ!"

నాగరిక జీవితంలోని అసహజత్వంపై రూసో విమర్శను కాదనడానికి వీలు లేదు. కాని, ఈ సమస్యకు పరిష్కారం ఏమిటి? చరిత్ర గడియారాన్ని వెనక్కి తిప్పడానికి, తిరిగి ప్రాకృతస్థితికి పోవడానికి వీలులేదు. నిజానికి అటువంటి ఆదర్శప్రాయమైన ప్రాకృతస్థితి (state of nature) ఒకప్పుడు వున్న దనడానికి ఆధారమూ లేదు. స్వర్ణయుగం, సత్యయుగం ఇవన్నీ అందమైన కల్పనలు, రొమాంటిక్ కలలు. రూసో ఊహించిన "నోబుల్ శావేజ్" కల్పిత వ్యక్తి. మానవ సమాజం ఎప్పుడూ ఆదర్శ ప్రాయంగా లేదు. అది ఎప్పుడూ మంచి, చెడుల సమ్మిశ్రణమే- అయితే రూసో, లేదా అతని తాత్వికానుయా యుల విమర్శ ఆధునిక నాగరికతలోని కృత్రిమత్వాన్ని, దాని దుష్పలితాలను తగ్గించడానికి కృషిని ప్రేరేపించగల మేరకు దాని విలువను గుర్తించక తప్పదు.



# 26
# వోల్టేర్ రగిలించిన భావ విప్లవ జ్వాల

"నీవు చెప్పేదానిలో ఒక్క మాటను కూడా నేను అంగీకరించను. కాని, ఆ మాట చెప్పడానికి నీకు గల హక్కును నా ప్రాణమిచ్చి అయినా సమర్థిస్తాను".

ప్రజాస్వామ్యానికి వాక్ స్వాతంత్ర్యం ఎంత ముఖ్యమైనదో చెప్పడానికి ఈ సుభాషితాన్ని పలువురు ఉదాహరిస్తూ వుంటారు.

"నేను నమ్మినట్టు నమ్ము; లేకపోతే దేవుడు నిన్ను శిక్షిస్తాడు" అంటూ ఇవాళ భయపెట్టేవాడు 'నేను నమ్మినట్టు నమ్ము; లేకపోతే నిన్ను చంపేస్తాను' అని రేపు నిన్ను బెదిరించడానికి వెనుకాడడు."

మత మౌఢ్యం వెనుక ఎంత క్రౌర్యం దాగివుందో తెలపడానికి ఈ సుభాషితాన్ని కూడా పలువురు ఉదాహరిస్తూ వుంటారు.

ఈ సుభాషితాల కర్త ఫ్రెంచి మహా రచయిత, మేధావి, తాత్వికుడు అయిన వోల్టేర్.

ఇవే కాదు. ఇలాంటి వందలాది సుభాషితాలకు అతడు కర్త. నిజానికి వోల్టేర్ సుభాషిత రత్నాకరుడు.

చిత్రం ఏమంటే ఈ రోజులలో ఈ సుభాషితాలు అతి సామాన్యంగా కనిపిస్తాయి. నియంతృత్వం వున్న దేశాలలో తప్ప ఇలాంటి సుభాషితాలు చెప్పడానికి పెద్ద ధైర్యం అక్కరలేదు.

## సా హ సి

కాని, వోల్టేర్ కాలంలో ఫ్రాన్సులో అలా కాదు. అప్పటి ఫ్రాన్సులో ప్రజా స్వామ్యం మచ్చుకైనా లేదు. నిరంకుశత్వం రాజ్యంచేస్తూ వుండేది. మత మౌఢ్యం వేయి పడగలు విప్పి బుసలుకొడుతూ వుండేది. రాజు పద్నాలుగవ లూయీ "నేనే రాజ్యాన్ని" (ఐ యామ్ ది స్టేట్) అన్నాడు. రాజుకు, రాజ దర్బారుకు, మతానికి, మతాధికారులకు వ్యతిరేకంగా పల్లెత్తుమాట పలికినా, 'బాస్టీల్' అనే ఘోర కారాగారం తలుపులు తెరుచుకునేవి. నిందితుడిని కబ లించి మూసుకునేవి. ఆనాటి రాజరిక నిరంకుశత్వానికి ప్రతీక బాస్టీల్. దాని మరోపేరు నరలోక నరకం.

చివరికి ఫ్రెంచి ప్రజలు 1789 లో రాజుపై తిరుగుబాటు చేశారు. అదే ఆధునిక చరిత్రను మలుపు తిప్పిన ఫ్రెంచి విప్లవం. ఆ విప్లవానికి ఫ్రెంచి ప్రజలను మానసికంగా, సిద్ధాంతపరంగా సిద్ధంచేసిన మహామహులు చాలామంది వున్నారు. వారందరిలోకి ప్రసిద్ధులైన వారిలో ఒకడు వోల్టేర్. మరొకడు రూసో.

వోల్టేర్, రూసోలు ఉత్తర, దక్షిణధ్రువాలు; వోల్టేర్ హేతువాది, మేధావాది. రూసో హృదయవాది, ప్రకృతివాది. వీరిరువురు కలిసి స్వదేశ, విదేశాలలో సమ కాలికులను విపరీతంగా ప్రభావితులను చేశారు. దంత గోపురంలో కూర్చొని పరవస్తు తత్వాన్ని గురించి తర్జనభర్జనలు చేస్తున్న తత్వశాస్త్రాన్ని నేలమీదకు లాక్కువచ్చి నాలుగు బజార్ల కూడలిలో నిలబెట్టి ప్రజలకు మార్గనిర్దేశం చేసే సాధనంగా దాన్ని తీర్చిదిద్దారు. ముఖ్యంగా వోల్టేర్.

## జననం

వోల్టేర్ అసలు పేరు ఫ్రాన్‌స్వా మారీ అరూయేట్. పారిస్‌లో 1694 లో జన్మించాడు. తండ్రి వృత్తిరీత్యా నోటరీ : మధ్య తరగతి కుటుంబీకుడు. వోల్టేర్ పుట్టడమే అర్భకంగా అనారోగ్యంతో పుట్టాడు. నాలుగు రోజులకంటె ఎక్కువ బ్రతకడని దాది చెప్పింది. నాలుగు రోజులు కాదు- 84 సంవత్స రాలు బ్రతికాడు వోల్టేర్. ముగ్గురు ఫ్రెంచి రాజుల—14 వ, 15 వ, 16 వ లూయీల-- పరిపాలన చూశాడు. అయితే అంత దీర్ఘకాలమూ అర్భకంగా, అనారోగ్యంతోనే బ్రతికాడు.

పొడుగు ముక్కు, పొడుగు ముఖం, ముఖంనిండా మచ్చలు, గుంటకళ్లు, చప్పి దవడలతో వికారంగా వుండేవాడు. అయితే అర్భకత్వం దేహానికే తప్ప మేధకు కాదు. కురూపం ముఖానికే తప్ప మనస్సుకు కాదు. అంత చురుకైన, పదునైన మేధాశక్తి, విద్వత్తు, ప్రతిభ, ప్రపంచ చరిత్రలోనే- అరుదు. ధైర్య సాహసాలలో, అపాయాన్ని లెక్కచేయని మొండితనంలో అతనిదే బిరుదు.

## 99 సంపుటాలు

తొలి యౌవనంలోకి తొంగిచూచిన క్షణంనుంచి 84 వ యేట కన్నుమూసే వరకు వోల్టేర్ ఎత్తిన కలం దించలేదు. తెరిచిన నోరు మూయలేదు. అతని కలంనుంచి పుంఖాను పుంఖంగా - సమకాలికులను పొట్టచెక్కలయ్యేటట్టు నవ్వించిన- మనదీ ఒక బ్రతుకేనా అని వారి ఆలోచనలను కవ్వించిన- నవలలు, నాటకాలు, పిట్ట కథలు, కట్టుకథలు, చరిత్రలు, సంగీత రూపకాలు, లఘుకావ్యాలు, మహా కావ్యాలు, వ్యాసాలు, తాత్విక, వైజ్ఞానిక గ్రంథాలు-ఒకటేమిటి-సమస్త సాహిత్య ప్రక్రియలలోను రచనలు వెలువడ్డాయి. అవి కాక వారికీ వీరికీ పదివేలదాకా ఉత్తరాలు వ్రాశాడట! అతని రచనా సంపుటాలు 99 వరకు వుంటాయట.

ఇక అతడు ఎక్కడవుంటే అక్కడ విద్వద్గోష్ఠి జరగవలసిందే. శరపరంపరగా అతడు గుప్పించే హాస్యచతురోక్తులతో శ్రోతలు హాస్యపరవశులు కావలసిందే.

### కత్తిగా కలం

అయితే అతడు సాధారణ సాహిత్యవేత్త మాత్రమే కాడు. తన రచనలను సరదాగా పాఠకుల వినోదంకోసం వ్రాయలేదు. సమకాలిక సమాజ వ్యవస్థలోని దురన్యాయాలను, దురంతాలను, మోసాన్ని, క్రౌర్యాన్ని, రాజు నిరంకుశత్వాన్ని, మూఢ మత విశ్వాసాలను చీల్చి చెండాడడానికి తన కలాన్ని కత్తిగా వాడాడు. తన మాటలను ఈటెలుగా ప్రయోగించాడు. సమాజ పరివర్తన కోసం, పీడిత ప్రజల భుజం తట్టి ధైర్యాన్ని పురికొల్పడానికి, వారి కన్నీరు తుడవడానికి, వారిలో భవిష్యత్తుపై ఆశను చిగురింపజేయడానికి తన సాహిత్య సమస్తాన్ని అంకితం చేశాడు.

ఆ కాలంలో వోల్టేర్ రచనలు ప్రజలను ఎంతగా వినోదింపజేసేవో, అంతగా అతడు లేవదీసిన రాజకీయ, తాత్విక, మత సమస్యలను గురించి ఆలోచింప చేసేవి. ఫ్రెంచిలో నాటికి నేటికి అంత అందమైన, శక్తిమంతమైన వచనశైలి మరొకరిలో కనబడదని ప్రతీతి. అయినా ఈ రోజులలో అతని అసంఖ్యాక

రచనలలో ఏవో కొన్ని తప్ప మిగిలినవి ప్రచారంలో లేవు. వాటిని ఇప్పుడెవరూ చదవరు. అవి సమకాలిక ప్రయోజనాలను ఉద్దేశించి వ్రాసినవి. వాటి ప్రయోజనం తీరిపోవడంతో అవి విస్మృతి యవనిక చాటుకు వెళ్లిపోయాయి. కాని, నేటికీ కాండిడ్, మైక్రో మెగాస్, జాడిగ్ వంటి కథలు, ముఖ్యంగా అతని లేఖా సాహిత్యం పాఠకులను అలరిస్తూనే వున్నాయి.

## సాహిత్యోపజీవి

తండ్రి అతనికి మంచి చదువే చెప్పించాడు. జెసూయిట్ కాలేజీలో చదువుకున్నాడు. ఆ రోజుల్లో నీతి నాటకాల (మొరాలిటీ ప్లేస్)లో వేషాలు వేసేవాడు. కొన్ని తనే వ్రాసి ప్రదర్శించేవాడు. (బహుశా చిన్ననాటి ఈ నాటకాల ప్రభావం అతనిపై వుందేమో, సాహిత్యం సందేశాత్మకంగా, సమాజ పరివర్తనకు సాధనంగా వుండాలన్న భావానికి ఆ నీతి నాటకాల ప్రభావమే కారణమేమో.)

తండ్రి అతడిని వ్యాపారంలో ప్రవేశపెట్టాలని, ఒక ధనిక వర్తకుని కుమార్తెతో వివాహం చేయాలని తన ఇల్లు పిల్లాజెల్లాతో కలకల లాడాలని కలలు కన్నాడు. కాని, వోల్టేర్ తండ్రి మాట పెడచెవిని పెట్టాడు. సాహిత్యమే తన ధ్యేయమన్నాడు. సాహిత్యం కూడు పెట్టదని తండ్రి కోప్పడ్డాడు. కాని సాహిత్యం అతనికి కూడు పెట్టడమే కాదు. అపార భోగభాగ్యాలు ఇచ్చింది. అజరామరమైన కీర్తి తెచ్చింది.

తండ్రి మరి లాభంలేదని వోల్టేర్‌ను హేగ్ నగరానికి ఫ్రెంచి రాయబారివద్ద ఉద్యోగిగా పంపించాడు. అక్కడ అతడు ఒక పేదపిల్లను ప్రేమించి ఆమెతో లేచిపోవడానికి ప్లాన్ వేశాడు. తండ్రి అతడిని అరెస్టు చేయిస్తానని బెదిరించి తిరిగి పారిస్ లాక్కొచ్చాడు.

## తిట్టే నోరు

తిట్టే నోరు, తిరిగే కాలు వూరుకోవని సామెత. వోల్టేర్‌కు తిట్టే నోరు, తిరిగే కాలు రెండూ వున్నాయి. అతడి నోటికి తాళం లేదు. ఎప్పుడూ ఎవరో ఒకరిపై ఛలోక్తులు విసురుతూండేవాడు. ముఖ్యంగా రాజదర్బారుకు చెందిన ఉన్నతాధికారులపై, ప్రభువంశీకులపై వ్యంగ్య బాణాలు గుప్పిస్తూ వుండేవాడు. అవి వూరంతా పాకేవి. పారిస్‌లో ఎవరు ఏ రాజోద్యోగిపై ఛలోక్తి విసిరినా అది వోల్టేర్‌కే అంట కట్టేవారు. అప్పటికి 14వ లూయీ చనిపోయి, పసివాడయిన 15 వ లూయీ రాజు అయ్యాడు. అతని పేరుపై

పరిపాలన చేసే రాజ ప్రతినిధి విలాస జీవితంపై వోల్టేర్ ఏదో అనరాని మాట అన్నాడని ఫిర్యాదు వచ్చింది. వెంటనే వోల్టేర్‌ను బాస్టిల్ జైలులో పెట్టారు.

జైలులో వోల్టేర్ పదకొండు నెలలు గడిపాడు. ఆ రోజులలోనే అతడు తన పేరును "వోల్టేర్"గా మార్చుకున్నాడు. "హెన్రియాడ్" అనే మహా కావ్యం రాసి పారేశాడు.

జైలునుంచి విడుదల అయిన తర్వాత కూడా అతని కలం, నోరు ఆగలేదు. మత అసహనాన్ని, నిరంకుశ రాజరికాన్ని విమర్శిస్తూ రచనలు ప్రారంభించాడు.

## నాటక రచన

ఆ రోజులలోనే "ఈ డి ప్" అనే విషాదాంత నాటకం వ్రాశాడు. దాన్ని పారిస్‌లోని ప్రధాన నాటక మందిరంలో ప్రదర్శించారు. ఆ నాటక మందిరంలో ఎంత గొప్ప రచయిత నాటకమైనా అయిదు రాత్రులు వరుసగా ఆడితే గొప్ప. వోల్టేర్ నాటకం నలభై రాత్రులు వరసగా ఆడింది. అతనికి నాలుగువేల ఫ్రాంకుల ఆదాయం వచ్చింది. ఫ్రెంచివారు అతడిని 23-24 ఏళ్లకే ఒక మహా రచయితగా గుర్తించారు. ఇక అక్కడనుంచి అతని ఆదాయం, కీర్తి పెరగడమే తప్ప తరగడం అనేది లేదు. వోల్టేర్ సాహిత్యంలో ఎంత ఘనుడో వ్యాపారంలో అంత ఘటికుడు. సాహిత్యంలో వచ్చిన ఆదాయాన్ని స్పెక్యులేషన్ వ్యాపారంలో మదుపు చేసి ఇంకా భాగ్యశాలి అయ్యాడు.

వోల్టేర్ నోటి తీట మరొకసారి అతడిని జైలుకు పంపించింది. షెవాలియర్ డీ రోహన్ అనే కులీనుడితో ఒక స్త్రీ విషయమై తగాదా పడ్డాడు. రోహన్ వోల్టేర్‌ను అవమానించడానికి అదనుకోసం ఎదురుచూస్తున్నాడు. ఒక రోజున వోల్టేర్ స్నేహితులతో ముచ్చటిస్తూ జోకుల బాకులు విసురుతూ నవ్విస్తూ వుండగా అక్కడికి రోహన్ వచ్చాడు. "అరూయేట్, వోల్టేర్—ఈ రెండింటిలో నీ అసలు పేరు ఏది" అని అడిగాడు.

"నా పేరు అంత చెప్పుకోదగిన గొప్ప పేరు కాదు. కాని, నా పేరు నా పేరుకు గొప్ప పేరు తెచ్చే పేరు" అన్నాడు వోల్టేర్. దీని అర్థం "నీ వంశం పేరు గొప్పది కావచ్చు. నీకు దానివల్లనే పేరు వచ్చింది తప్ప నువ్వు పట్టి బడుద్ధాయివి. నేను సామాన్యుడిగా పుట్టినా ప్రతిభవల్ల గొప్పవాడిని" అని. వోల్టేర్ సమాధానం విని అందరూ గొల్లున నవ్వారు. రోహన్ ముఖం కంద గడ్డలా అయింది. అప్పటికి వెళ్లిపోయి మర్నాడు చీకటిలో వోల్టేర్ ఒంటరిగా పోతుండగా ఆరుగురు గూండాలచేత చితక్కొట్టించాడు.

వోల్టేర్ చావు తప్పి కన్ను లొట్టపోయి బయటపడినా పౌరుషశాలి కనుక, ఆ రాత్రికి రాత్రి కత్తియుద్ధం నేర్చుకున్నాడు. మర్నాడు రోహన్‌ను ద్వంద్వ యుద్ధానికి ఆహ్వానించాడు. అతని మాట ఎంత పదునో కత్తికూడా అంత పదునే అని గ్రహించిన రోహన్ భయపడిపోయి, పోలీసులకు ఫిర్యాదు చేశాడు. మళ్లీ బాస్టీల్‌కు అతిథిగా వెళ్లాడు వోల్టేర్.

## ప్రవాస జీవితం

కాని, వెంటనే అతడిని అధికారులు విడుదలచేశారు. దానిబదులు దేశ బహిష్కార శిక్ష విధించారు. వోల్టేర్ తన ప్రవాస జీవితానికి ఇంగ్లండును ఎంచుకున్నాడు. ఇంగ్లండులో మూడేళ్ల ప్రవాసం వోల్టేర్ జీవితంలో ఒక ముఖ్య ఘట్టం.

వెళ్లిన మూడు నెలల్లో ఇంగ్లీషు భాష వ్రాయడం, చదవడం నేర్చుకున్నాడు. ఇంగ్లీషులోని ఉత్తమోత్తమ సాహిత్యాన్ని, వైజ్ఞానిక వాఙ్మయాన్ని అపోశన పట్టాడు. ఇంగ్లీషువారు ఆరాధించే షేక్‌స్పియర్ నాటకాలు అతనికెందుకో నచ్చలేదు. వాటిని నాటురకం, మోటురకం నాటకాలుగా ఈసడించాడు. అనుభూతి వాద (ఎంపిరిసిజమ్) ప్రవక్త జాన్ లాక్ గ్రంథాలను మథించాడు. వాటివల్ల ప్రభావితుడయ్యాడు. అతడు ఇంగ్లండు వెళ్లిన కొద్ది రోజులకే (1727) న్యూటన్ మరణించాడు. న్యూటన్ అంత్యక్రియలలో పాల్గొన్నాడు. న్యూటన్ సిద్ధాంతాలను జీర్ణించుకుని, అతడిని తన ఏకైక గురువుగా భావించుకున్నాడు. అనాటి ఇంగ్లీషు మేధావులు, రచయితలు - ముఖ్యంగా జొనాథన్ స్విఫ్ట్, కాంగ్రీవ్, ఎడిసన్, అలెగ్జాండర్ పోప్‌లాంటి వారితో స్నేహం చేశాడు. వారు కూడా ఇతడిని ఎంతో గౌరవించారు.

ఇవన్నీ, ఒక ఎత్తు. ఇంగ్లీషువారి లిబరల్ రాజకీయ, సాంఘిక, మత వ్యవస్థలపట్ల వోల్టేర్ పెంచుకున్న ఆరాధనాభావం మరొక ఎత్తు. ఇంగ్లండును వర్తకుల దేశమని (ఎ నేషన్ ఆఫ్ మర్చంట్స్) ఎగతాళి చేశాడుగాని, అక్కడి వాక్ స్వాతంత్ర్యం, మత స్వేచ్ఛ, భావస్వేచ్ఛలను, ఫ్రాన్స్‌లోని దుర్భర పరిస్థితులతో పోల్చి చూసుకుని బాధపడ్డాడు. ఇంగ్లండు పట్ల తన మెచ్చుకోలును, ఫ్రాన్సు పట్ల తన ఏవగింపును పారిస్‌లోని తన స్నేహితులకు ఉత్తరాలలో వ్యక్తం చేశాడు.

## తిరిగి పలాయనం

ప్రవాసశిక్ష ముగిసిన తర్వాత పారిస్ తిరిగి వచ్చాడు. కొన్నాళ్లు బాగానే గడిచింది. కాని, అతడు స్నేహితులకు ప్రయివేటుగా వ్రాసిన ఉత్తరాలన్నిటిని

ఎవరో సేకరించి పుస్తకంగా అచ్చువేశారు. అందులో ఫ్రాన్సు పేరు ఎక్కడా లేకపోయినా, అన్యాపదేశంగా అతడు విమర్శించిన దేశం అదే అని తెలుస్తూనే వుంది. దానితో అధికారులు మండిపడి ఆ పుస్తకం ప్రతులు తగలబెట్టించారు. వోల్టేర్ అరెస్టుకు ఉత్తర్వు జారీ అయింది. ఫ్రెంచివారికి బుద్ధిచెప్పే ప్రయత్నాన్ని తాత్కాలికంగా విరమించి తన కాలికి బుద్ధి చెప్పాడు.

అప్పుడు షాంపేన్ రాష్ట్రంలోని సైరీలో మార్క్విస్ డు షాటిలే అనే సామంత ప్రభువు వోల్టేర్‌కు తన లోగిలిలోను, ఆయన భార్య మదాం డు షాటిలే తన కౌగిలిలోను ఆశ్రయమిచ్చారు. వోల్టేర్ పట్ల వారి గౌరవ ప్రపత్తులు అంతటివి. ముగ్గురు పిల్లల తల్లి మదాం డు షాటిలే అద్భుత సౌందర్య ఖని; అద్భుత విదుషీమణి. గణిత, భౌతిక, రసాయనిక శాస్త్రాలను, సాహిత్యాన్ని ఆమె కాచి వడబోసింది. న్యూటన్ "ప్రిన్సిపియా" గ్రంథాన్ని ఫ్రెంచిలోకి అనువదించింది.

ఆమె భర్త ఎప్పుడూ కదనకుతూహలంతో ఏవో యుద్ధాలలో సేనానిగా పాల్గొంటూ దేశాంతరాలలో వుండేవాడు. ఇంటివద్ద ఈమె వోల్టేర్‌తో మదన కుతూహలం తీర్చుకునేది. ఈ విషయం ఫ్రాన్సు అంతా పొక్కింది. భర్త తెలిసీ తెలియనట్టు నటించేవాడు.

## విద్వద్గోష్ఠులు

సైరీలో వోల్టేర్ పదిహేనేళ్లు గడిపాడు. వారి శృంగార వ్యాసంగం మేధా వ్యాసంగానికి అడ్డు రాలేదు. పొద్దున లేచింది మొదలుకొని పగలంతా ఎవరి గదులలో వారు రచనలలో, వైజ్ఞానిక పరిశోధనలలో, ప్రయోగాలలో మునిగి తేలేవారు వోల్టేర్ కోసం దేశదేశాంతరాల నుంచి కవి- పండితులు వచ్చేవారు. రాత్రి తొమ్మిది గంటలకు వారికి వోల్టేర్ మదాం డు షాటిలే దర్శనమిచ్చే వారు. పండిత గోష్ఠులు సందడిగా జరిగేవి. వోల్టేర్ తన కథలు, నవలలు, నాటకాలు వినిపించేవాడు. నాటకాలు ప్రదర్శించేవాడు. వాటిలో వేషం వేసేవాడు కూడా.

రాను రాను మదాం డు షాటిలేకు వోల్టేర్‌పై మోజు తగ్గింది. ఒక యువకవిని చేరదీసింది. వోల్టేర్ అసూయాగ్రస్తుడయ్యాడు. ఇంతలో మదాం డు షాటిలే వ్యాధిగ్రస్తురాలై మరణించింది. వోల్టేర్ విషాదబాధతో పారిస్ ముఖం పట్టాడు. కాని, అతడిని అధికారులు పారిస్‌లో అడుగు పెట్టనివ్వలేదు.

## ఫ్రెడరిక్ ఆశ్రయం

ఎటు పోవడమో తోచని స్థితిలో అంతకుముందు నుంచి ఉత్తరప్రత్యుత్తరా

లతో వోల్టేర్‌పట్ల ఆరాధనా భావం పెంచుకున్న ప్రష్యా రాజు ఫ్రెడరిక్ ది గ్రేట్ ఆహ్వానం పంపాడు. వోల్టేర్ బెర్లిన్ వెళ్లాడు. తిరిగి మూడేళ్లు ప్రష్యాలో ప్రవాసం; తిరిగి రచనలు, గోష్టులు, మిత్రులపై ఛలోక్తులు, శత్రువులపై చండోక్తులు.

కొన్నాళ్లకి ఫ్రెడరిక్‌కి కూడా మోజు తగ్గింది. "మహా అయితే వోల్టేర్‌ను మరో ఏడాది వుండనిస్తాను. బత్తాయిపండును ఎవరైనా రసమంతా పిండేశాక తొక్క పారేస్తారు కదా" అని ఎవరితోనో అన్నాడట. ఆ మాట వోల్టేర్ చెవిని పడింది. ఫ్రెడరిక్ చేతిలో బత్తాయిపండు కావడం ఇష్టంలేక మళ్లీ పలాయన మంత్రం పఠించాడు.

అటు తిరిగి, ఇటు తిరిగి, ఎక్కడా నిలవలేక, నిలవనీడ దొరక్క, చివరికి స్విట్జర్లాండుకు, ఫ్రాన్సుకు మధ్య సరిహద్దులో ఫెర్నీ అనేచోట స్థిరపడ్డాడు. స్విస్ పోలీసులు అరెస్టు చేయవస్తే ఫ్రాన్సులో కాలు పెట్టవచ్చు. ఫ్రెంచి పోలీసులు వస్తే స్విట్జర్లాండులోకి దూకవచ్చు.

ఫెర్నీలో ఒక పెద్ద ఎస్టేటు ఏర్పాటు చేసుకున్నాడు. విశాలమైన ఉద్యానవనం నిర్మించాడు. అతడు ఎక్కడ ఉంటే అక్కడ విద్వత్సభలు జరగవలసిందే కదా? ఇంగ్లండు నుంచి గిబ్బన్, బాస్వెల్‌లాంటి వారు, పారిస్‌నుంచి, తక్కిన యూరపియన్ నగరాల నుంచి తీర్థ ప్రజ లాగా రచయితలు, తాత్వికులు వచ్చేవారు. వోల్టేర్ ఆతిథ్యం స్వీకరిస్తూ కొన్నాళ్లు గడిపి వెళ్లేవారు.

## దీర్ఘ వార్ధక్యం

అప్పటికి అతనికి వృద్ధాప్యం వచ్చేసింది. అయితే ఇంకా ఇరవై ఏళ్లకు పైగా ఆ వృద్ధాప్యం గడపవలసి వుంది, దేహం కృశిస్తున్నకొద్దీ మేధ పెరిగింది. రచనా బాహుళ్యం, వైవిధ్యం పెరిగాయి. పుంఖాను పుంఖంగా రచనలు చేసి పారిస్‌పై కుంభవృష్టిగా కురిపించాడు. ఫ్రెంచి ప్రజలు అతని రచనా మరందధారలు గ్రోలి మత్తెక్కిపోయేవారు.

ఫెర్నీలోవున్న చివరి ఇరవై ఏళ్లు వోల్టేర్ రచనా జీవితంలో సాహిత్య కేదారాలు సమృద్ధంగా పండిన ఘట్టం. కథలు, నాటకాలు, లేఖలు, చరిత్రలు, తాత్విక గ్రంథాలు, వివాద రచనలు అసంఖ్యాకంగా చేశాడు. మత మౌఢ్యంమీద పట్టించాడు. మానవుల అల్పత్వాన్ని, కౌటిల్యాన్ని చీల్చి చెండాడాడు. మానవుడు సాటి మానవుడిని పెట్టే హింసలకు ప్రతిస్పందించి ఆవేదనాభరితమైన వ్యంగ్యరచనలు చేశాడు. "కాండిడ్" అనే సుప్రసిద్ధ నవలిక ఆనాటిదే. దానిలో మానవ "జాతి"పై తన విద్వేషాన్ని, మానవ "వ్యక్తుల"పై తన కారుణ్యాన్ని అమిత శక్తిమంతంగా వ్యక్తం చేశాడు.

పారిస్‌లో దిదిరో, డి అలెంబేర్ ప్రభృతులు "ఎన్‌సైక్లోపీడీ" అనే గ్రంథ సంపుటాలను సంకలిస్తున్న రోజులవి. ప్రపంచ విజ్ఞానమంతా వాటిలో పొందు పరచడానికి వారు కృషి సాగిస్తున్నారు. అకారాదిగా ఒక్కొక్క విషయాన్ని తీసుకుని ఒక్కొక్కరికి రచనా బాధ్యత అప్పగిస్తున్నారు. ప్రజా సామాన్యానికి మానవ విజ్ఞాన సంపదను అందజేయడం, వారిలో విప్లవ భావాలను రేకెత్తించడం, మూఢ విశ్వాసాలను ఛేదించడం, నిరీశ్వర వాదాన్ని ప్రచారం చేయడం వారి ధ్యేయాలు. వీరిని "ఎన్‌సైక్లోపీడిస్టు" లంటారు. ఫ్రెంచి విప్లవానికి ముందు ఫ్రెంచివారి మనస్సులలో విప్లవ జ్యోతిని వెలిగించడంలో వీరి పాత్ర ఎంతో వుంది. వీరి నాయకుడు దిదిరో. ఎన్‌సైక్లోపీడీలో ఎక్కువభాగం వ్రాసింది, సంపాదకత్వ భారం వహించింది అతడే.

వోల్టేర్‌ను కూడా కొన్ని వ్యాసాలు అందించవలసిందిగా ఎనసైక్లోపీడిస్టులు కోరారు. అతడు వారు కోరినవి వ్రాసి ఇచ్చాడు. అయితే అతడు నిరీశ్వర వాదికాడు. అదే సమయంలో సాధారణ ఈశ్వరవాది కూడా కాడు. థీయిస్టు (Theist) గాని, ఎథీయిస్టు (Atheist) కాని కాదు. అతడు "డీయిస్టు". (Deist)

## దైవ విశ్వాసం

వోల్టేర్ దృష్టిలో ఈశ్వరు డున్నాడు. ఉన్నాడని లోకమంతా కోడై కూస్తోందన్నాడు. ఒకవేళ ఈశ్వరుడు లేకపోతే అతడిని సృష్టించడం అవసరం అన్నాడు. (If there is no God it is necessary to invent Him) ఈశ్వరుడు లేకపోతే సృష్టి ఎలా వచ్చింది అని అడిగాడు. గడియారం సృష్టించినవాడు లేకపోతే గడియారం ఎక్కడినుంచి వస్తుంది అని ప్రశ్నించాడు.

అయితే, గడియారం తయారు చేసినవాడు తయారుచేసి కీ ఇచ్చిన తర్వాత మరి కల్పించుకోడు. దానంతట అది యాంత్రికంగా నడుస్తుంది. అలాగే దేవుడు లోకాన్ని సృష్టించి వదిలేస్తాడు. దాని సహజ సూత్రాల ప్రకారం అది కొనసాగుతుంది. లోక వ్యవహారంలో దేవుడు మరి కలిగించుకోడు. మానవుల ప్రార్థనలు, బాగోగులు పట్టించుకోడు. దేవుడు వుండడంవల్లనే లోకంలో ఒక నియతి, నైతికత్వం వున్నాయి. వోల్టేర్‌వలె ఈ విధమైన దేవుడిని విశ్వసించేవారిని "డీయిస్టులు" (Deists) అంటారు. అతడు వెలిబుచ్చిన ఈ విశ్వాసాలను ఎన్‌సైక్లోపీడిస్టులు ఏవగించుకున్నారు.

ఆ తర్వాత వోల్టేర్ స్వయంగా ఒక తాత్విక నిఘంటువు (ఫిలసాఫిక్ డిక్షనరీ) సంకల్పించాడు. అకారాదిగా ప్రతి విషయాన్ని తీసుకుని తన అపార పాండిత్యాన్ని, పరిశోధనా ఫలితాలను దానిలో సమీకరించాడు. ఒక్క చేతిమీ

దుగా ఆ బ్రహ్మాండమైన ఎన్‌సైక్లోపీడియాను ఎంతో అందమైన వచనంలో రచించాడు.

## అవసాన దశ

అతనికి అవసానం ఆసన్నమవుతోంది. జన్మస్థలమైన పారిస్ చూడా లనిపించింది. తన ఆఖరు రచనలలో ఒకటైన "ఐరీన్" అనే విషాదాంత నాటకాన్ని తీసుకుని గుర్రపు బగ్గీలో బయలుదేరాడు. వట్టి ఎముకల గూడుతప్ప మనిషి కనిపించడంలేదు, డాక్టరు ఈ ప్రయాణం వద్దని వారించినా వినలేదు. "జీవితమంతా నా ఇష్టం వచ్చినట్టు జీవించాను. చనిపోవడం కూడా నా ఇష్టం వచ్చినట్టు చనిపోతా" నన్నాడు.

పారిస్ అతనికి బ్రహ్మరథం పట్టింది. అప్పటికి పదహారవ లూయీ పరిపాలిస్తున్నాడు. అతగాడు కూడా అసూయపడేటంతగా ప్రజలు వోల్టేర్‌ను తమ గౌరవాభిమానాలలో ముంచెత్తారు. "ఐరీన్" నాటక ప్రదర్శనకు హాజరయ్యాడు. నాటక మందిరం వోల్టేర్‌పట్ల ప్రశంసాధ్వనులతో దద్దరిల్లిపోయింది. నాటకాంతంలో అతడిని జనం ముట్టడించి కదలనివ్వలేదు. అతడు ఈ అపూర్వ గౌరవానికి ఉక్కిరి బిక్కిరయ్యాడు.

## కన్నుమూత

వోల్టేర్‌కు అప్పటికి 83 వెళ్లి 84 వచ్చింది. తనపట్ల ప్రజలు చూపిన గౌరవంవల్ల కల్గిన ఉత్సాహాన్ని అతని బడుగు దేహం తట్టుకోలేకపోయింది. ఆరోగ్యం క్షీణించింది, 1778 మే 30 వ తేదీన ప్రశాంతంగా, శాశ్వతంగా కన్నుమూశాడు. (అతని తాత్విక ప్రత్యర్థి, మహా రచయిత రూసో కూడా ఆ యేడాదే కన్ను మూయడం ఒక విశేషం.)

వోల్టేర్‌ను అధికారులు పారిస్‌లో ఖననం చేయనివ్వలేదు. క్రైస్తవమత లాంఛనాలతో వేరేచోట ఎక్కడో ఖననం చేయవలసి వచ్చింది. మరి పదకొండేళ్లు గడిచిన తర్వాత ఫ్రెంచి ప్రజలు రాజుపై తిరుగుబాటు చేశారు. భూలోక నరకానికి ప్రతీక అయిన 'బాస్టీల్' కారాగారాన్ని 1789 జులై 14 వ తేదీన భూస్థాపితం చేశారు. దాని అవశేషాలమీద వోల్టేర్ భౌతిక విశేషాలను అతని అంతిమ విజయ చిహ్నంగా ప్రతిష్టించారు.

"వోల్టేర్ అంటే 18 వ శతాబ్దం" అని విక్టర్ హ్యూగో కీర్తించాడు. అతని భావ ప్రభావం 18 వ శతాబ్దాన్ని దాటి ప్రసరించింది. మానవ ప్రగతిపథంపై అతని ప్రభావజ్యోతి నిరంతరాయంగా అలా ప్రసరిస్తూనే వుంటుంది.



# 27
# ఇమాన్యుయెల్ కాంట్ తాత్విక విప్లవం

యూరోపియన్ తత్వశాస్త్రంలో ఒక విచిత్ర, విప్లవాత్మక సిద్ధాంతాన్ని ప్రవేశ పెట్టి, దాన్ని మరొక మలుపుతిప్పిన మహామేధావి జర్మన్ తత్వవేత్త ఇమాన్యుయెల్ కాంట్. అతడు ప్రారంభించినదాన్ని కాంటియన్ రివల్యూషన్ అంటారు. తన సిద్ధాంతాన్ని కోపర్నికస్ రివల్యూషన్‌తో కాంట్ స్వయంగా పోల్చుకున్నాడు.

భూమి చుట్టూ సూర్యుడు తిరుగుతున్నాడనేది పూర్వుల అభిప్రాయం. కాని, సూర్యుని చుట్టూ భూమి తిరుగుతున్నదని సిద్ధాంతీకరించి, విజ్ఞాన శాస్త్రాలలో విప్లవ శకానికి నాంది పలికినవాడు కోపర్నికస్.

తత్వశాస్త్రంలో సరిగా ఇలాంటి విప్లవాత్మక సిద్ధాంతాన్నే కాంట్ ప్రతిపాదించాడు. బాహ్య ప్రపంచాన్ని వున్నదున్నట్టుగా యథాతథంగా మానవ మనస్సు గ్రహిస్తుందనేది సాధారణాభిప్రాయం. కాంట్ దీన్ని తిరగేశాడు. మానవ మనస్సుకు అనుగుణంగా బాహ్య ప్రపంచం కనబడుతుందన్నది అతని సిద్ధాంతం. అంటే బాహ్య ప్రపంచం ఫలానా విధంగా కనబడాలని మనస్సే నిర్దేశిస్తుంది, అలా నిర్దేశించడం మన మనస్సు నిర్మాణంలోనే వుంది.

## సాదా, సీదా మనిషి

తత్వశాస్త్రంలో ఒక విప్లవం తీసుకు వచ్చినా, వాస్తవజీవితంలో కాంట్ అంత సాదా మనిషి, సీదా మనిషి మరొకడు లేడు. మనం ఇంతవరకు చదివిన తత్వవేత్త లందరికి ఎంతో కొంత జీవిత చరిత్ర అంటూ వుంది. కనీసం కొన్ని ముఖ్య సంఘటనలైనా వారి జీవితాలలో జరిగాయి.

కాని, చెప్పకోడానికి పెద్దగా జీవిత కథ అంటూ లేని తత్వవేత్త కాంట్. కొన్ని విషయాలలో కాంట్‌ను గ్రీకు తత్వవేత్త సోక్రటీస్‌తో పోల్చవచ్చు.

సోక్రటీస్. ఏథెన్సులో పుట్టి ఏథెన్సులో మరణించాడు. ఎప్పుడో ఒకటి రెండుసార్లు తప్ప అతడు ఏథెన్సు దాటిపోలేదు.

కాంట్ కూడా అంతే. తూర్పు ప్రష్యాలోని మారుమూల పట్టణమైన కోనిగ్స్‌బర్గ్‌లో 1724 లో జన్మించాడు. కోనిగ్స్‌బర్గ్‌లోనే 1804 లో చనిపోయాడు. ఆ ఎనభై ఏళ్లలోను అతడు కోనిగ్స్‌బర్గ్‌దాటి పట్టుమని 40 మైళ్లు కూడా ప్రయాణం చేయలేదు. అతని జీవితమంతా స్వస్థలంలోనే సాదాగా, సీదాగా గడిచిపోయింది.

## పేద కుటుంబం

కాంట్ పూర్వులు స్కాట్లెండు దేశస్థులు. జర్మనీవచ్చి స్థిరపడ్డారు. వారిది జర్మన్ ప్రొటెస్టెంట్లలో "పయటిస్టు" శాఖ. కాంట్ తండ్రిది గుర్రాల జీనులు తయారుచేసే వృత్తి. కాంట్‌కు 22 ఏళ్లు వచ్చేసరికే తల్లిదండ్రు లిరువురూ చనిపోయారు. చాలా బీద కుటుంబం. తొమ్మిదిమంది సంతానంలో కాంట్‌తో సహా అయిదుగురే— ముగ్గురు ఆడపిల్లలు, ఇద్దరు మగపిల్లలు— మిగిలారు.

ఎనిమిదవ ఏట కాంట్ ఒక పయటిస్ట్ స్కూలులో చేరాడు. అకడి చదువు, మత బోధ అతనికి ఒక వ్యవస్థగా క్రైస్తవ మతంపట్ల విముఖత మాత్రమే కలిగించాయి.

పదహారవ ఏట కోనిగ్స్‌బర్గ్ యూనివర్సిటీలో చేరాడు. అక్కడ తత్వశాస్త్రం, ఫిజిక్సు, జ్యామెట్రీ, ఆల్జీబ్రా, సైకాలజీ, అస్ట్రానమీ, లాజిక్ అభ్యసించాడు. తండ్రి పెద్దగా సహాయపడకపోయినందున, చదువులో తనకంటె వెనుకబడిన తోటి విద్యార్థులకు ట్యూషన్‌లు చెప్పి, డబ్బు సంపాదించి, పొట్టపోసుకొనేవాడు.

విద్యాభ్యాసం పూర్తి అయిన తర్వాత తొమ్మిదేళ్ళపాటు ధనికుల ఇళ్లల్లో నౌకరుగాను, పిల్లలకు ట్యూటర్‌గాను పనిచేసి జీవనోపాధి సంపాదించుకునేవాడు.

తరవాత మరొకసారి యూనివర్శిటీలో చేరి డాక్టరేట్ తీసుకున్నాడు. అక్కడే ఫిజిక్స్ లెక్చరర్‌గా చిన్న ఉద్యోగమిచ్చారు. తత్వ, తర్క, గణితశాస్త్రాల ప్రొఫెసరుగా 1770 నుంచి 1797 వరకు పనిచేశాడు.

## ఆకార విశేషాలు

సోక్రటీస్ ఆకారం గురించి ఇదివరలో మనం చదివాము. అందంలో అతడే మెరుగేమో అనిపించేటంత వికారరూపుడు కాంట్. ఎత్తు సుమారు అయిదడుగులు. అర్భకుడు. రొమ్ము చప్టా చేసినట్టువుండేది. పొట్ట ఉబ్బెత్తుగా వుండేది. ఒక భుజం వంకర తిరిగి అష్టావక్రుడిలా వుండేవాడు.

కాని, సోక్రటీస్ వలెనే, పెదవి విప్పి మాట్లాడడం మొదలుపెట్టాడా, అతని వికార రూపం మరచిపోయి శ్రోతలు ముగ్ధులైపోయేవారు. గొప్ప సంభాషణా చతురుడు. హాస్యప్రియుడు. కాలేజీలో పాఠాలు చెబుతుంటే ఎంత గహన విషయమైనా అరటిపండు వలిచి చేతిలో పెట్టినట్టుండేది. సరళ సుందర భాషలో, అనర్గళ వాగ్ధాటితో, అపార పాండిత్య ప్రాగల్భ్యంతో విద్యార్థులను మైమరపింపజేసేవాడు.

కాంట్ పెళ్లి చేసుకోలేదు. అతని రూపం చూసి ఎవరు ప్రేమిస్తారు కనుక, పెళ్లి చేసుకోబడలేదనడం సముచితం. యావజ్జీవ బ్రహ్మచారిగా వుండిపోయాడు.

## నిష్ఠా గరిష్ఠుడు

అతని జీవితంలో చెప్పదగిన ఏకైక ముఖ్య విశేషం అతని నియమం, నిష్ఠ. సూర్యుడి ఉదయాస్తమయ సమయాలలోనైనా మార్పులుంటాయి కాని, కాంట్, జీవితక్రమంలో నిమిషమాత్రమైనా మార్పు వుండేది కాదు. ప్రొద్దున అయిదింటికి లేచేవాడు. కాఫీ త్రాగడం, వ్రాతపని, కాలేజీలో పాఠాలు చెప్పడం, మధ్యాహ్నం ఒంటిగంటకు ఏ రెస్టారెంట్‌లోనో భోజనం, సాయంత్రం వాహ్యాళి– అన్నీ నిర్ణీత వేళలకు జరిగిపోయేవి. షికారునుంచి ఇంటికి వచ్చి తన కిటికీలోనుంచి కనబడే చర్చిగోపురాన్ని చూస్తూ ధ్యాన సమాధిలో నిమగ్నుడయ్యేవాడు. సరిగా రాత్రి పదిగంటలకు పడుకునేవాడు. మళ్లీ పొద్దున అయిదింటికి లేచేవాడు.

అతని వాహ్యాళిక్రమం చిత్రమైనది. సాయంత్రం మూడున్నర గంటలకు ఒక సెకండు కూడా ముందుగాని, వెనుకగాని కాకుండా వీధిగుమ్మం దాటేవాడు. అతడు గుమ్మంలో కనబడగానే ఇరుగు పొరుగువారు గడియారాలు దిద్దుకునేవారని ప్రతీతి. పట్టణంలోని "లైమ్‌ట్రీ" అనే అవెన్యూలో ఒక గంటసేపు అటూ ఇటూ పచార్లు చేసేవాడు. అతని కారణంగానే కోనిగ్స్‌బర్గ్‌లో

ఆ అవెన్యూకు "ఫిలాసఫర్స్ వాక్" అనే పేరు వచ్చింది. కాంట్‌కు ఒక వృద్ధ సేవకుడుండేవాడు. వానవస్తే యజమాని తడవకుండా వుండేందుకు, ఆ నౌకరు గొడుగు పట్టుకుని వెనకాలే నడిచేవాడు. ముప్ఫయ్యేళ్లపాటు కాంట్ తన జీవితంలో ఎన్నడూ ఈ క్రమం ఏ ఒక్కరోజున కూడా తప్పలేదట.

అర్భకుడైనా కాంట్ ఆరోగ్యం మంచిది. ఆరోగ్యాన్ని చాలా జాగ్రత్తగా కాపాడుకునేవాడు. అన్ని రోగాలు నోటిద్వారానే వస్తాయని అతని కొక నమ్మకం. అందువల్ల వీధిలోకి వస్తే నోటి ద్వారా ఏమాత్రం గాలి లోనికి పోకుండా జాగ్రత్తపడేవాడు. దారిలో తెలిసినవారెవరైనా తారసిల్లినా, పెదవి విప్పేవాడు కాడు. ఆరోగ్యం చెడుతుందేమోనన్న భయంవల్ల మితంగా భుజించేవాడు. రోజు కొక్కసారి పైపు కాల్చడం అతని ఒకే ఒక "లగ్జరి". కాలక్షేపానికెప్పుడైనా పేకాట, బిలియర్డ్స్ ఆడేవాడు.

## పాండిత్యం

సౌందర్యాస్వాదన అంటే ఏమిటో అతనికి తెలియదు. కవిత్వంపట్ల, సంగీతం పట్ల ఆసక్తి, అభిరుచి పెద్దగాలేదు. అంతకంటె చిత్రం తత్వశాస్త్ర చరిత్ర అతడు పెద్దగా చదువుకోలేదు. లైబ్నిజ్, వుల్ఫ్, వోల్టేర్, రూసోలను మాత్రం జీర్ణించుకున్నాడు. బ్రిటిష్ తత్వశాస్త్రం, సాహిత్యం బాగా చదివాడు. న్యూటన్ సిద్ధాంతాలు తెలుసుకున్నాడు.

ఎప్పుడూ వున్న వూరు వదలివెళ్లనందునో ఏమో, జాగ్రఫీ అంటే చెవి కోసుకునేవాడు. వార్తాపత్రికలు చదివేవాడు. కాని, రాజకీయాల జోలికి పోలేదు. అయితే, ఫ్రెంచి విప్లవాన్ని నిండు హృదయంతో ఆహ్వానించాడు. అది మానవ చరిత్రలో స్వేచ్ఛా, సమానత్వ, సౌభ్రాత్రాల నవశకానికి నాంది అని విశ్వసించాడు.

కాంట్ తన మేధా జీవితాన్ని తత్వ వేత్తగా కాక, విజ్ఞానవేత్తగా ప్రారంభించాడు. ఫిజిక్స్, ఆస్ట్రానమీ, జియాలజీ, అంత్రపాలజీవంటి సైన్సులలో గ్రంథాలు రచించాడు. డార్విన్ పరిణామవాదానికి మార్గాన్ని సుగమం చేశాడు.

## ఖగోళ సిద్ధాంతం

కాంట్ పేరు తాత్త్వికుడుగా కాకపోతే, సైంటిస్టుగానైనా చరిత్రలో చిరస్థాయిగా నిలిచేదే. అతడు 1755 లో ప్రతిపాదించిన ఒక ఖగోళ సిద్ధాంతాన్ని "నెబ్యులర్ హైపోథీసిస్" అంటారు. సౌరగ్రహాలు ఒక గొప్ప వాయు– ధూళి మేఘం కుదించుకుపోగా ఏర్పడినవన్నది ఆ సిద్ధాంతం. అది ఆరోజులలో ఎవరి

దృష్టిని ఆకర్షించలేదు. 1796 లో ఫ్రెంచి గణిత, భౌతికశాస్త్రవేత్త లాప్లేస్ తనంత తానే అదే సిద్ధాంతాన్ని మరింత గణితశాస్త్ర సమ్మతమైన రుజువులతో పునఃప్రతిపాదించాడు. అది విశేష ప్రాచుర్యం పొందింది. పెక్కు మార్పులు, చేర్పులతో దాన్ని నేటికీ శాస్త్రజ్ఞులలో అధిక సంఖ్యాకులు ఆమోదిస్తున్నారు. ఆ తర్వాత కొన్నాళ్లకు కాంట్ గ్రంథం బయటపడడంతో ఉభయుల గౌర వార్థం దాన్ని "కాంట్-లాప్లేస్ థియరీ" అని పిలుస్తున్నారు.

కాంట్ క్రమంగా ఫిజిక్స్‌నుంచి మెటఫిజిక్స్‌వైపు ప్రయాణం చేశాడు. పుట్టిన ఊరు ఎన్నడూ వదలి వెళ్లకపోయినా, అతని మేధాయాత్ర మాత్రం విశ్వాం చలాల వరకు సాగింది. విశ్వ రహస్యాలన్నీ భేదించడానికి తన జీవితాన్ని వెచ్చించాడు.

జాన్ లాక్ పదార్థం (మేటర్), మనస్సు (మైండ్) రెండూ వున్నా యన్నాడు. బర్క్లీ పదార్థం లేదని, మనస్సు ఒక్కటే వున్నదని అన్నాడు. హ్యూమ్ పదార్థం, మనస్సు రెండూ లేవన్నాడు.

వోల్టేర్ వివేచన (రీజన్) ఒక్కటే మానవజాతికి శరణ్యమన్నాడు. రూసో హృదయానుభూతి (ఫీలింగ్) మాత్రమే నమ్మకోదగిన దన్నాడు. ఇంకా ఎందరో మహానుభావులు రకరకాలుగా తాత్విక సిద్ధాంతాలు చేశారు. ఇన్నింటిలో ఏది సత్యం? ఏది అసత్యం? ఈ గందరగోళంలో మానవుడికి ఏది మార్గం? ఏది గమ్యం? ఈ ప్రపంచానికి అర్థం వుందా? ఉంటే దాన్ని ఎలా అర్థం చేసుకోవాలి?

హ్యూమ్ రచనలు చదివాక తాను తాత్విక మౌఢ్యం అనే నిద్ర (dogmatic slumbers) నుంచి మేలుకున్నానని కాంట్ చెప్పుకున్నాడు. మనస్సు లేకపోవడ మేమిటి? నిస్సంశయంగా వున్నది. మనస్సు లేకపోతే ప్రపంచాన్ని ఎలా అర్థం చేసుకోగలుగుతున్నాము? నిజానికి ప్రపంచాన్ని అర్థం చేసుకునే విధానాన్ని మనస్సే నిర్ణయిస్తున్నది.

## మూడు గ్రంథాలు

కాంట్ తన సిద్ధాంతాలను మూడు ఉద్గ్రంథాలలో పొందుపరిచాడు. ఒకటి– క్రిటిక్ ఆఫ్ ప్యూర్ రీజన్. రెండవది– క్రిటిక్ ఆఫ్ ప్రాక్టికల్ రీజన్. మూడవది– క్రిటిక్ ఆఫ్ జడ్జ్‌మెంట్. ఈ మూడింటిలో మొదటిది ముఖ్య మైనది. దాని పునాదిపైనే మిగిలిన రెండు గ్రంథాలను రెండు అంతస్తులుగా నిర్మించాడు.

కాంట్ తత్వచింతన అతి జటిలం. ఐన్‌స్టయిన్ సాపేక్ష సిద్ధాంతాన్ని ప్రకటించినప్పుడు దాన్ని ఏ ముగ్గురో, నలుగురో అర్థం చేసుకోగలిగారని ప్రతీతి. అయితే సాపేక్ష సిద్ధాంతంలోనిది సహజమైన, అనివార్యమైన జాటిల్యం. కాంట్ సిద్ధాంత జటిలత అలాంటిది కాదు.

అయితే, స్వతహాగా అతని సిద్ధాంతం గహనమైన దన్నమాట నిజమే. అది గజిబిజిగా మెలికలు తిరిగే ఇరుకు దారులతో కూడిన చీకటి గుహలాంటిది. ఎక్కడ బయలుదేరి ఎక్కడ తేలుతామో తెలియదు./ దీనికి తోడు కాంట్ భాష కూడా జటిలం. పరిభాష మరింత జటిలం. చెప్పేది సూటిగా చెప్పడు. అయోమయంగా, గందరగోళంగా చెబుతాడు. చెప్పిందే చెప్పడమేగాక, ఒకచోట చెప్పిన దానికి వ్యత్యస్తంగా మరొకచోట చెబుతాడు. ఒక వాక్యంలో చెప్పవలసినదాన్ని పదిపేజీలలో చెబుతాడు.

## ఒక జోక్

జర్మన్ తత్వవేత్తలపై ఒక జోక్ వున్నది. ఎడమ చెవి దురదపెడితే వారు కుడి చేతితో గోక్కుంటారట. కష్టంగా చెప్పడానికి వీలున్నప్పుడు సులభంగా ఎందుకు చెప్పా లనుకుంటారట.

కాంట్ తన గ్రంథం వ్రాతప్రతి నొకదాన్ని ఒక సమకాలిక తత్వవేత్తకు చదవమని పంపించాడట. అతడు దాన్ని కొంత చదివి పూర్తిగా చదివితే తన మతి పోయేటట్టున్నదని తిప్పి పంపించాడట. ఏమైనా కాంట్ గ్రంథాలపై వచ్చినన్ని వ్యాఖ్యాన గ్రంథాలు మరి ఏ తత్వవేత్తపైన రాలేదు.

కాంట్‌కు చివరి సంవత్సరాలలో నిజంగానే మతిపోయింది. జ్ఞాపక శక్తి మందగించింది. నిద్ర పట్టేదికాదు. మానసికాందోళన ఎక్కువయింది. దీర్ఘ వ్యాదితో తీసుకుని 1804 లో కన్నుమూశాడు.

భాషకు, పరిభాషకు సంబంధించిన కాఠిన్యపు దుర్గమారణ్యాన్ని ఛేదించుకుని లోనికి వెడితే, అద్భుత సౌందర్యంతో మెరిసిపోయే కాంట్ తాత్విక మహాసౌధం దర్శన మిస్తుందని వ్యాఖ్యాతలు పేర్కొన్నారు. నిజానికి కాంట్‌కు ముందున్న పాశ్చాత్య తత్వశాస్త్రం వేరు. ఆ తర్వాతది వేరు. ఒక నూరేళ్లకు పైగా పాశ్చాత్య తాత్వికులను అతడు ప్రభావితులను చేశాడు. హెగెల్, మార్క్స్, బెర్గ్‌సన్, జేమ్స్, సార్త్రె లాంటి వారెందరో కాంట్ ప్రభావ పరిధి లోకి వచ్చి వినూత్న సిద్ధాంతాలను వెలార్చినవారేనని పండితుల అభిప్రాయం. తత్వశాస్త్రంలో అతని స్థానం ప్లేటో, అరిస్టాటిల్‌ల సరసనే.

## వ్యక్తిగా కాంట్

వ్యక్తిగా కాంట్ సరళ స్వభావుడు. వంక పెట్టడానికి వీలులేని ఉదాత్తచరితుడు. సంపూర్ణ ప్రజాస్వామ్యవాది. వ్యక్తి స్వాతంత్ర్యానికి, వ్యక్తి ఆత్మగౌరవానికి అతడు అగ్ర ప్రాధాన్య మిచ్చాడు. ఒక వ్యవస్థగా మతాన్ని అతడు అంగీకరించలేదు. అఖరికి "కలడు కలం డనెడువాడు కలడో లేడో" అనే సంశయానికి తావిచ్చే సిద్ధాంతాన్ని రూపొందించాడు.

కాంట్ దేవుడిని అన్వేషించడానికి బయలుదేరి-మానవుడిని కనుగొన్నాడని ఒక రచయిత వ్రాశాడు. "మానవుడే నా సంగీతం, మనుష్యుడే నా సందేశం" అన్నది అతని నినాదం. మనిషికి మనిషే లక్ష్యం (Man is an end himself). ఏ ఇతర ప్రయోజనానికీ వ్యక్తిని ఒక సాధనంగా ఉపయోగించరాదు.

మానవునికి నిర్ణయస్వేచ్ఛ (free will) వున్నది. కనుక వ్యక్తి నైతికత్వాన్ని నిర్ణయించేది అతని అంతర వివేచన. (inner reasoning) మాత్రమే.

ప్రకృతిలో ప్రతిదీ కొన్ని నిర్దిష్ట సూత్రాలకు లోబడి వుంటుంది. మానవుడు ఒక్కడే తన అంతరాత్మ ప్రబోధాన్ని అనుసరించి, కొన్ని నీతిసూత్రాలకు అనుగుణంగా తన ప్రవర్తనను తానే స్వేచ్ఛగా మలుచుకోగలడు.

## కర్తవ్యాచరణ

మనిషి స్వతహాగా మంచివాడై, తన సహజ సౌజన్యంతో మంచి పనులు చేస్తే అవి నైతిక చర్యలు అనిపించుకోవు. ఏది కర్తవ్యమో, ఏది తన విధ్యుక్త ధర్మమో తెలుసుకుని, దాన్ని స్వేచ్ఛగా నిర్ణయించుకుని ఆ ప్రకారం ఆచరిస్తేనే నైతిక చర్యగా దానికి విలువ వుంటుంది.

"ఏ నీతి సూత్రాన్ని నీవు విశ్వజనీన నీతి సూత్రంగా అంగీకరించబడాలని కోరడానికి వీలుంటుందో ఆ నీతి సూత్రం ప్రకారం నీవు ప్రవర్తించాలి"– దీన్నే కాంట్ Categorical imperative అన్నాడు. అంటే తిరుగులేని విధి (duty). అసందిగ్ధ కర్తవ్యం. దీని ప్రకారం ఏ వ్యక్తీ తనకొక నీతి సూత్రాన్ని, పరులకొక నీతి సూత్రాన్ని నిర్ణయించడానికి వీలుండదు. అప్పుడే మానవులందరి స్వేచ్ఛా, సమానత్వాలను నీవు ఆమోదించినట్లు అవుతుంది.

# కాంట్ లేవనెత్తిన తాత్విక సమస్య

ఇమాన్యుయెల్ కాంట్ గ్రంథా లన్నింటిలోకి ముఖ్యమైనది "క్రిటిక్ ఆఫ్ ప్యూర్ రీజన్" అతడు తన ప్రధాన తాత్విక సిద్ధాంతాన్ని దానిలో నిక్షేపించాడు.

క్రిటిక్ అనే మాటకు మామూలు అర్థం విమర్శ. దీన్ని కాంట్ పరిశీలన, వివరణ, విశ్లేషణ అనే అర్థంలో ఉపయోగించాడు.

ప్యూర్ అంటే విశుద్ధమైన, వినిర్మలమైన అని అర్థం. దీన్ని అనుభవంతో నిమిత్తం లేని, అనుభవాత్పూర్వమైన (a priori) అనే అర్థంలో కాంట్ ఉపయోగించాడు. రీజన్ అంటే వివేచన. కనుక క్రిటిక్ ఆఫ్ ప్యూర్ రీజన్ అంటే "అనుభవాత్పూర్వ వివేచనవాదం యొక్క పరిశీలన" అని అర్థం.

ప్లేటో తన పూర్వుల విభిన్న తాత్విక సిద్ధాంతాలను సమన్వయం చేస్తూ కొత్త సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. అలాగే కాంట్ కూడా విభిన్న, విరుద్ధ సిద్ధాంతాలను సమన్వయం చేయబూని నూతన సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు.

కాంట్ కాలానికి రెండు విరుద్ధ తాత్వికవాదాలు ప్రహతంగా వుండేవి. ఒకటి దేకార్త్ ప్రభృతుల బుద్ధివాదం (రేషనలిజం), మరొకటి లాక్ ప్రభృతుల అనుభూతివాదం (ఎంపిరిసిజం.)

బుద్ధివాదం ప్రకారం ఇంద్రియానుభూతివల్ల నిశ్చితమైన (certain), స్పష్టమైన (clear) జ్ఞానం లభించదు. అది వివేచన (reasoning) ద్వారానే లభిస్తుంది. మన మనస్సులో స్వతస్సిద్ధ భావాలు (innate ideas) వుంటాయి. వాటిని విశ్లేషించి, సంశ్లేషించి మనం నిశ్చితజ్ఞానం సంపాదించవచ్చు. ఇది గణిత శాస్త్రాన్ని పోలిన పద్ధతిలో జరుగుతుంది. గణితంలో కొన్ని ప్రాథమిక సూత్రాలు, ప్రతిపాదనలు, నిర్వచనాలు వుంటాయి. వాటినుంచి సంక్లిష్టమైన సూత్రాలను, ప్రతిపాదనలను రాబడతాము. అలాగే తాత్వికమైన నిశ్చిత జ్ఞానాన్ని కూడా వివేచన ద్వారా రాబట్టవచ్చు.

ఈ వాదాన్ని అనుభూతివాదులు తిరస్కరించారు. లాక్ మనకు కలిగే జ్ఞానమంతా అనుభవంనుంచే వస్తుందన్నాడు. మనస్సులో స్వతస్సిద్ధమైన భావాలేవీ వుండవని, ప్రారంభంలో, అంటే శైశవంలో, మన మనస్సు శుభ్రంగా తుడిచివేసిన పలకవలె వుంటుందని, ఆ తర్వాత అనుభవాలవల్లనే మనస్సులో భావాలు కలుగుతాయని అతని ఉద్దేశం. కనుక అనుభవానంతర జ్ఞానం (a posteriori) తప్ప అనుభవాత్పూర్వ జ్ఞానం (a priori) అనేది లేదని లాక్ అభిప్రాయపడ్డాడు.

## హ్యూమ్ సంశయ వాదం

మరొక అనుభూతివాది డేవిడ్ హ్యూమ్ ఈ వాదాన్ని దాని తార్కిక పర్యవసానం వరకు తీసుకుపోయాడు. అనుభవాలవల్లనే జ్ఞానం లభిస్తుం దన్న

మాట నిజమే, కాని, ఆ జ్ఞానంలో నిశ్చితత్వం (certainty) లేదు. సార్వత్రికత (universality) లేదు ఆవశ్యకత (necessity) లేదు.

ఇంద్రియానుభవం ద్వారా సంవేదనలు కలుగుతాయి. సాధారణంగా సంవేదనలు ఒక వరుసక్రమంలో కలుగుతాయి. దానివల్ల మనకు జ్ఞానం లభిస్తుంది. కాని, ఏ వరుసక్రమమైనా అలాగే వుండాలన్న నియమం లేదు. అందుచేత ఆ జ్ఞానంలో ఆవశ్యకత లేదు. అది యాదృచ్ఛికమైన (accidental), వైకల్పికమైన (contingent) జ్ఞానం మాత్రమే అవుతుంది. దానిలో కార్యకారణత్వం లేదు. అందుచేత నిశ్చిత జ్ఞానంగాని, సార్వత్రిక జ్ఞానంగాని మానవునికి సాధ్యం కాదు. శాస్త్రీయ జ్ఞానం (scientific knowledge) సయితం అసాధ్యం. హ్యూమ్ సిద్ధాంతం ఈ విధంగా సంశయవాదానికి (skepticism) కు దారితీసింది.

ఈ రెండు విరుద్ధవాదాలను (బుద్ధివాదం, అనుభూతివాదం) సమన్వయం చేయడం ఎలా అనే సమస్య కాంట్‌కు ఎదురైంది. దీనికి పరిష్కారాన్ని కనుగొనడానికి అతడు ప్రయత్నించాడు.

బుద్ధివాదులు ఒక పొరపాటు చేశారు. నిశ్చిత జ్ఞానం అనుభవానికి ముందే వస్తుం దన్నమాట నిజమే. కాని, జ్ఞానార్జనలో అనుభవానికిగల పాత్రను వారు అలక్ష్యం చేశారు. నిజానికి అనుభవాత్పూర్వ జ్ఞానం వున్నప్పటికి, మొదట అనుభవంతోనే జ్ఞానార్జన ప్రారంభ మవుతుంది.

## కాంట్ ప్రశ్నలు

కాగా, అనుభూతివాదులు మరొక పొరపాటు చేశారు. జ్ఞానార్జనలో మనస్సు పాత్రను వారు అలక్ష్యం చేశారు. హ్యూమ్ చెప్పినట్టు నిశ్చితమైన జ్ఞానాన్ని ఇంద్రియానుభవంనుంచి సాధించలే మన్నది నిజమే. అంతమాత్రాన అసలు నిశ్చిత జ్ఞానమనేదే లేదని ఎలా చెప్పగలము? ఇంద్రియానుభవజ్ఞానానికి మించిన జ్ఞానం ఎందుకు వుండరాదు? అనుభవానికి ముందే జ్ఞానం ఎందుకు వుండరాదు? ఆ విధమైన అనుభవాత్పూర్వ జ్ఞానానికి నిశ్చితత్వం, సార్వత్రికత, ఆవశ్యకత ఎందుకు వుండరాదు? శాస్త్రీయ జ్ఞానం ఎందుకు సాధ్యంకాదు? ఇవీ కాంట్ వేసిన ప్రశ్నలు.

మన అవగాహన (understading) ను కేవలం అనుభవానికి పరిమితం చేయడం అనుభూతివాదులు చేసిన పొరపాటు. అనుభవంవల్ల ఏది వున్నదో, అది మనకు తెలుస్తుంది. కాని, అది అలాగే ఎందుకు వుండాలో, మరొక విధంగా ఎందుకు వుండరాదో మనకు తెలియదు. అనుభవాన్ని ఎంత విశ్లేషించినా నిశ్చితత్వం, కార్యకారణత, సార్వత్రికత మొదలైనవి మన గ్రహణశక్తికి అందవు.

## సార్వత్రిక సత్యాలు

అంతమాత్రాన, సార్వత్రిక సత్యాలు, నిశ్చిత సత్యాలు, అవశ్యక సత్యాలు అనేవి లేవని చెప్పలేము. అవి నిస్సందేహంగా ఉన్నాయి. కాని అనుభవం నుంచి అవి సిద్ధించవు. అనుభవానికి ముందే అవి వున్నాయి. అనుభవానికి తర్వాత కూడా అవి వుంటాయి. అనుభవంనుంచి అవి సిద్ధించకపోయినా అవి అనుభవానికి విధిగా వర్తిస్తాయి కూడా.

ఉదాహరణకు గణితశాస్త్రం అనుభవాత్పూర్వమైన సార్వత్రిక, నిశ్చిత అవశ్యక సూత్రాలతో కూడినట్టిది. ఆ సూత్రాలు ఒకప్పుడు నిజమై, మరొకప్పుడు నిజం కాకుండా పోవు.

రోజూ సూర్యుడు ఉదయించడం మనం చూస్తున్నాము. అందుచేత రోజూ విధిగా సూర్యుడు ఉదయిస్తాడని మనం భావిస్తాము. ఈ భావం మనకు రోజూ సూర్యోదయాన్ని చూడడం అనే అనుభవంనుంచే వచ్చింది. కాని, ఈ భావంలో నిశ్చితత్వంగాని, అవశ్యకతగాని లేవు. ఏమో ఇవాళ సూర్యుడు ఉదయించినప్పటికీ, రేపు ఉదయిస్తాడని నమ్మకం ఏమిటి? రేపటిలోగా సూర్యుడికి ఏదైనా ప్రమాదం జరిగి ఉదయించకపోవచ్చు. అందుచేత ప్రతిదినం సూర్యోదయం అనేది నిశ్చితసత్యం కాదు. అనుభవం మీద మాత్రమే ఆధారపడి నిశ్చితజ్ఞానాన్ని, సార్వత్రిక జ్ఞానాన్ని సాధించలేము. అనుభవం ద్వారా యాదృచ్ఛికం, వైకల్పికం అయిన జ్ఞానాన్ని మాత్రమే పొందగలము. అంటే ఫలానా విధంగా జరగవచ్చు. జరగకపోవచ్చు. జరగడానికి ఎలా కారణం లేదో జరగకపోవడానికి కూడా అలాగే కారణం లేదు.

## గణిత జ్ఞానం

కాని, అనుభవంమీద కాక, వివేచన (రీజన్) మీద ఆధారపడిన జ్ఞానమైతే దానిలో విధిగా నిశ్చితత్వం, సార్వత్రికత మొదలైనవి వుంటాయి. గణిత సూత్రాలు అలాంటివే.

రెండురెళ్లు నాలుగు అనేది నిశ్చిత జ్ఞానం, అంటే దానిలో సందేహానికి తావులేదు. అది సార్వత్రికం. అంటే అది ఇవాళ నిజమై రేపు కాకుండా పోదు. అది అవశ్యకం. అంటే విధిగా రెండు రెళ్లు నాలుగే కావాలి తప్ప మరొకటి కావడానికి వీలులేదు. అది అనుభవాత్పూర్వం కూడా. అంటే రెండు రెళ్లు నాలుగు అని చెప్పడానికి మనం రెండు జతల పుస్తకాలనో, కలాలనో, ఇంకా ఏ ప్రత్యేక వస్తువులనో చూడనవసరం లేదు. ఇది అనుభవానికి ముందే

మనకు తెలిసిన సాధారణ సూత్రం. కాని, దాన్ని అనుభవానికి ఎప్పుడు వర్తిం వజేసినా నిజమై తీరుతుంది.

అలాగే "త్రిభుజంలోని మూడుకోణాల మొత్తం రెండు లంబకోణాల మొత్తా నికి సమానం" మొదలైన గణిత సూత్రాలు.

అలాగే న్యూటన్ కనిపెట్టిన గురుత్వాకర్షణ సూత్రం. ప్రతి వస్తువు నేలపై పడడాన్ని చూడడం అనే అనుభవం ద్వారా ఈ సూత్రానికి నాందీ ప్రస్తావన జరిగినా అది ప్రయోగరీత్యా సాధించిన సూత్రం కాదు. విశ్వంలో ప్రతి వస్తువు ప్రతి ఇతర వస్తువును ఫలానా విధంగా ఆకర్షిస్తుందనేది అనుభవం ద్వారా సాధించిన సూత్రం కాదు. అది కేవలం తార్కిక, గణిత సూత్రాల ప్రకారం సాధించినట్టిదే. అయితే గురుత్వాకర్షణ సూత్రాన్ని ప్రయోగరీత్యా ఎప్పుడు పరీక్షకు నిలబెట్టినా అది నిజమై తీరుతుంది.

అలాగే ఐన్‌స్టయిన్ కనిపెట్టిన కాంతివక్రీభవన సూత్రం. బరువైన ఖగోళ వస్తువుల సమీపంలోనుంచి కాంతి కిరణాలు ప్రయాణం చేసేటప్పుడు అవి ఒక మేరకు విధిగా వక్రీభవిస్తాయి. కాని ఏ మేరకు వక్రీభవిస్తాయో ఐన్‌స్ట యిన్ అనుభవం ద్వారా, ప్రయోగరీత్యా సాధించలేదు. అది అనుభవాత్పూర్వ ప్రతిపాదన. మరి, ఆ తర్వాత కాలంలో ప్రయోగరీత్యా ఖగోళ శాస్త్రజ్ఞులు పరీక్షించగా అది నిజమేనని తేలింది.

అందుచేత హ్యూమ్ చెప్పినట్టు మన జ్ఞానం అనుభవానికి మాత్రమే పరి మితమైంది కాదు. అనుభవానికి ముందే జ్ఞానం సిద్ధిస్తుంది. అదే సార్వత్రికం, నిశ్చితం, ఆవశ్యకం అవుతుంది. అది అనుభవానికి విధిగా వర్తిస్తుంది కూడా.

ఇది ఎలా సాధ్యమవుతున్నది? అనుభవంతో నిమిత్తం లేకుండా,అనుభవానికి వర్తించగల నిశ్చితజ్ఞానం మనకు ఎలా కలుగుతున్నది? శాస్త్రీయజ్ఞానం ఎలా ఏర్పడుతున్నది?

వీటికి సమాధానమే అతని అతీతభావవాదం.

## కాంట్ జ్ఞానతత్వ మీమాంస

కాంట్ రెండు ప్రధాన తాత్విక ప్రశ్నలు లేవనెత్తాడు. ఒకటి- అనుభ వాత్పూర్వజ్ఞానం అనేది సాధ్యమా? రెండవది- సాధ్యమైతే అది ఎలా సాధ్యపడుతున్నది?

ఆలోచించడం మనస్సు లక్షణం. మనస్సు ఆలోచిస్తున్నదంటే తాను కాని

దాన్ని గురించి– అంటే బాహ్య ప్రపంచాన్ని గురించి– ఆలోచిస్తున్నదని అర్థం. కనుక మనస్సుకు వెలుపల ఒక బాహ్య ప్రపంచం (external world) వుండి వుండాలి.

బాహ్య ప్రపంచం రెండు రకాలుగా వుంటుందని కాంట్ అన్నాడు. ఈ విషయంలో లాక్‌తో కొంతవరకు అతడు ఏకీభవించాడు.

ఒకటి విషయ జగత్తు (phenomenal world) అంటే ఇంద్రియాలద్వారా మనకు తెలిసే ప్రపంచం. అది రంగు, రుచి, వాసన, ధ్వని, స్పర్శ, బరువు, ఆకృతి మొదలైన గుణాలతో కూడిన వస్తు ప్రపంచం. ఇవన్నీ ఇంద్రియాలకు తెలిసే గుణాలే తప్ప వస్తువులో నిజంగా లేవు. ఇవి ఆభాసిక గుణాలు.

విషయ జగత్తు కాక వాస్తవ జగత్తు వేరే వున్నది. రంగు, రుచి మొదలైన గుణాలు మాత్రమే మనకు తెలుస్తున్నవైనప్పుడు, వాటికి ఆధారంగా, వాటికి ప్రేరకంగా ఏవో వస్తువు లుండాలి కదా! ఏ వస్తువూ లేకుండా ఆభాసికగుణాలు వాటంతట అవి బయలుదేరి మన ఇంద్రియాలకు గోచరించవు కదా! అందుచేత గుణాలకు వెనుక ఆ గుణాలకు ప్రేరకాలైన వస్తువు లుండే వుండాలి.

## క్లిష్టపదం

ఆ వస్తువులకు కాంట్ "నూమినా" (noumena) అని పేరు పెట్టాడు- కాంట్ తన తత్వచింతనలో చాలా క్లిష్టమైన పదాలను సృష్టించాడని అనుకున్నాము కదా? అటువంటి క్లిష్టపదాలలో "నూమినా" అనే దొకటి. ఇది బహువచన పదం. దీనికి ఏకవచనం "నూమినన్" (noumenon). దీనికి సరైన ఇంగ్లీషు మాట లేదని వ్యాఖ్యాతలు పేర్కొన్నారు. ఉజ్జాయింపుగా (thing-in-itself) అనే మాటను వారు ఉపయోగించారు. వచ్చిన చిక్కేమిటంటే దీనికి కూడా సరైన తెలుగు మాటను కల్పించడం కష్టం. "థింగ్ ఇన్ ఇట్సెల్ఫ్" అంటే తనలో తాను వుండే వస్తువు. అది అప్రమేయ వస్తువు. అంటే మరొకదాని ప్రమేయం అక్కరలేని కేవల వస్తువు. అది అతీత వస్తువు. అంటే ఇంద్రియానుభవానికి అందని వస్తువు. అది యథార్థ వస్తువు. అంటే ఇంద్రియ గోచరమయ్యే రంగు, రుచి, వాసన మొదలైన ఆభాసిక (apparent) గుణాలకు కారణమైన నిజమైన అసలు వస్తువు.

## నేతి నేతి....

ఈ యథార్థ వస్తువు (నూమినన్) ఇంద్రియానుభూతికిగాని, మనస్సు అవగాహనకు గాని దేనికీ అందదు. అది విషయ జగత్తుకు వెనుకవుండే

అవాఙ్మానసగోచర వస్తువు. దాదాపుగా మన వేదాంతులు పేర్కొనే బ్రహ్మ పదార్థం లాంటిది. పారమార్థిక సత్యాన్ని వర్ణించడానికి మన వేదాంతులు "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ..." (దేనినైతే వాక్కుగాని, మనస్సుగాని పొందలేక వెనక్కి మరలివస్తాయో అది...) అన్నారు. పూర్తిగా అదేనని కాదుగాని కాంట్ పేర్కొన్న అతీత వస్తువు (నూమినన్)కు ఈ నిర్వచనం చాలవరకు వర్తిస్తుంది. ఇంద్రియాలకు, మనస్సు అవగాహనకు అందే విషయ గుణాలన్నిటిని "నేతి నేతి..." (ఇదికాదు, ఇదికాదు) అని తొలగిస్తూ పోగా చివరికి ఏది మిగులుతుందో దాన్ని కాంట్ పేర్కొన్న అతీతవస్తువుగా వర్ణించవచ్చు. అయితే అది మనకు అజ్ఞాతమే కాదు, అజ్ఞేయం కూడా. అంటే తెలియబడరానిది. కనుక కాంట్ అజ్ఞేయవాది. (agnostic)

ఈ అతీత వస్తు ప్రపంచాన్ని ప్రస్తుతానికి అవతల వుంచితే, విషయ జగత్తు (phenomenal world) గురించి మాత్రమే మనకు జ్ఞానం లభిస్తున్నది. దీన్ని గురించే మనం ప్రస్తుతం చర్చించి తెలుసుకోవలసి వుంది.

విషయ జగత్తు గురించిన జ్ఞానం మనకు రెండు విధాలుగా లభిస్తున్నది. ఒకటి ఇంద్రియానుభవశక్తి (sensibility) ద్వారా, రెండవది బుద్ధి లేదా అవగాహన (understanding) ద్వారా.

## రెండు రకాల జ్ఞానం

ఇలా లభించే జ్ఞానం కూడా రెండు రకాలుగా వుంటుంది. ఒకటి- ఇంద్రియానుభవం తర్వాత లభించే జ్ఞానం (empirical knowledge), రెండవది— అనుభవానికి ముందు లభించే జ్ఞానం (a priori knowledge).

ఈ రెండు రకాల జ్ఞానాలను గురించి ఇంతకు ముందు తెలుసుకున్నాము. ఇంద్రియానుభవంద్వారా లభించే జ్ఞానంలో నిశ్చితత్వం (certainty) లేదు. ఆవశ్యకత (necessity) లేదు. అనుభవానికి ముందే లభించే జ్ఞానంలోనే నిశ్చితత్వం, ఆవశ్యకత వున్నాయి. అనుభవాత్పూర్వ జ్ఞానమే నిజమైన జ్ఞానం. ఇది మనకు ఎలా లభిస్తున్నదనేది ప్రశ్న.

సమస్తమైన జ్ఞానం వాక్యాలుగా, ప్రతిపాదనల (Propositions) రూపంలో మనకు లభిస్తుంది. మనం ఏది ఆలోచించినా, ఏది తెలుసుకున్నా వాక్యాలుగా, ప్రతిపాదనలుగానే ఆలోచిస్తాము, తెలుసుకుంటాము. కేవలం ఒక ప్రత్యేక భావ శకలాన్ని (idea) తీసుకుంటే అది జ్ఞానం కాబోదు. ఆ భావశకలాన్ని మరొక భావశకలంతో జోడించాలి. సమన్వయించాలి. అప్పుడే జ్ఞానం లభిస్తుంది.

సమస్తజ్ఞానం ప్రతిపాదనల రూపంలో వున్నప్పటికి, ప్రతి ప్రతిపాదన జ్ఞానానికి దారితీయదు. ఎందుకంటే—

ప్రతిపాదనలన్నీ రెండు రకాలు. ఒకరకమైన దాన్ని విశ్లేషణాత్మక ప్రతిపాదన(analytic judgment), రెండవ దాన్ని సంశ్లేషణాత్మక ప్రతిపాదన (synthetic judgment) అంటారు.

## వి శ్లే ష ణ

ముందు మొదటిదాన్ని తీసుకుందాము. విశ్లేషణ అంటే విడదీయడం. దీనితో కూడినది విశ్లేషణాత్మక ప్రతిపాదన.

ఉదాహరణకు—వృత్తం గుండ్రంగా వుంటుంది. పుస్తకంలో పేజీ లుంటాయి. త్రిభుజానికి మూడు కోణాలుంటాయి. వస్తువులకు వ్యాప్తి (extension) వుంటుంది. ఇవన్నీ విశ్లేషణాత్మక ప్రతిపాదనలు.

ఎందుకంటే ఈ వాక్యాలలో అర్థవిశ్లేషణ మాత్రమే జరిగింది. వృత్తం గుండ్రంగా వుంటుందనే వాక్యంలో వృత్తాన్ని నిర్వచించడం మాత్రమే జరిగింది తప్ప వృత్తాన్ని గురించి మనకు కొత్తగా ఏమీ తెలియడం లేదు. ఎందుకంటే గుండ్రంగా వున్న ఆకృతినే కదా మనం వృత్తం అనేది?

అలాగే పేజీలుంటేనే కదా పుస్తకం అవుతుంది? మూడు కోణాలుంటేనే కదా త్రిభుజం అంటాము? వ్యాప్తి, లేదా విస్తృతి వుంటేనే కదా వస్తువు అయ్యేది?

ఆ వాక్యాలవల్ల పుస్తకాన్ని, త్రిభుజాన్ని, వస్తువును విశ్లేషించి అర్థం చెప్పడం మాత్రమే జరిగిందితప్ప ఆ పుస్తకం ఎలాంటిదో, ఆ త్రిభుజం ఏ రకానికి చెందినదో, ఆ వస్తువు ఏదో మనకు కొత్తజ్ఞానం లభించడం లేదు. ఇలాంటి విశ్లేషణాత్మక ప్రతిపాదనలు అనుభవాత్పూర్వమైన వన్నమాట నిజమే. అంటే వృత్తం గుండ్రంగా ుంటుందని వృత్తాన్ని చూసిన తర్వాత కాక, చూడకుండానే మనం గ్రహించగలము. అలాగే పుస్తకాన్ని చూడకుండానే దానిలో పేజీలుంటాయని మనకు తెలుసు. అలాగే త్రిభుజం, వస్తువు మొదలైనవి కూడా. ఇది నిజమే కాని, మనకు ఈ వాక్యాలవల్ల ఆయా వస్తువుల గురించి కొత్త జ్ఞానమేదీ కలగడం లేదు కదా ?

## సం శ్లే ష ణ

కాని, సంశ్లేషణాత్మక ప్రతిపాదనలు అలా కాదు. వాటివల్ల మనకు కొత్త

విషయాలు తెలుస్తాయి. కొత్త జ్ఞానం లభిస్తుంది. విశ్లేషణం అంటే విడదీయడం. సంశ్లేషణం అంటే కలపడం. రెండు భావశకలాలను కలపడం ద్వారా మనకు అదివరకు తెలియని కొత్త విషయం తెలిస్తే అది సంశ్లేషణాత్మక జ్ఞానం అవుతుంది.

ఉదాహరణకు "ఈ పుస్తకం కాళిదాసు నాటకం" అన్నామనుకోండి. ఆ వాక్యంలో పుస్తకం, కాళిదాస నాటకం అనే రెండు భావాలను (ideas) కలపడం ద్వారా ఆ పుస్తకం గురించి అదివరకు మనకు తెలియని కొత్త విషయం- అది కాళిదాసు వ్రాసిన నాటకమనే విషయం- తెలుస్తున్నది. అలాగే "ఈ త్రిభుజం సమకోణ త్రిభుజం" అనే వాక్యంవల్ల ఆ త్రిభుజాన్ని గురించి కొత్త సమాచారం మనకు లభిస్తున్నది. ఇది సంశ్లేషణాత్మక (రెండు భావాలను సంశ్లేషించడం ద్వారా వచ్చే) జ్ఞానం. ఇది అనుభవానంతర (a posteriori) జ్ఞానం కూడా. ఎందుకంటే ఇంతకుముందు చెప్పిన విశ్లేషణాత్మక ప్రతిపాదనవలె కాక ఆ పుస్తకాన్ని, లేదా ఆ త్రిభుజాన్ని కళ్లతో చూస్తే తప్ప, (అనుభవం తర్వాత తప్ప) మనకు ఆయా వస్తువులను గురించిన కొత్త జ్ఞానం లభించడం లేదు.

## ఏది నిశ్చిత జ్ఞానం ?

అయితే, సంశ్లేషణాత్మక ప్రతిపాదనలన్నీ మనకు సార్వత్రికమైన, నిశ్చితమైన, ఆవశ్యకమైన జ్ఞానాన్ని ఇవ్వలేవు. ఎందుకంటే అవన్నీ అనుభవం తర్వాత మనకు లభించే జ్ఞాన ప్రతిపాదనలు. అనుభవం తర్వాతనే అట్టి జ్ఞానం లభిస్తున్నది కనుక అది సార్వత్రిక, నిశ్చిత, ఆవశ్యక జ్ఞానం ఎన్నటికీ కాబోదు. ఉదాహరణకు ఒక పుస్తకం కాళిదాస నాటకమే కానక్కరలేదు. మరొకటేదైనా కావచ్చు. ఒక త్రిభుజం సమకోణ త్రిభుజమే కానక్కరలేదు. మరొక రకం కావచ్చు. అందుచేత ఈ విధమైన అనుభవానంతర జ్ఞానంలో సార్వత్రికత వుండదు. సార్వత్రికత, నిశ్చితత్వం మొదలైన గుణాలు లేని జ్ఞానం యథార్థ జ్ఞానం కాబోదు. కనుక ఇటువంటి సంశ్లేషణాత్మక జ్ఞానం శాస్త్రీయ జ్ఞానానికి (Scientific knowledge) దారితీయదు.

విశ్లేషణాత్మకమైన ప్రతిపాదన అనుభవాత్పూర్వమైనా- అందులో సార్వత్రికత వగైరా గుణాలున్నా- దానివల్ల కొత్త జ్ఞానం లభించదు. కాగా సంశ్లేషణాత్మక అనుభవాత్పూర్వ ప్రతిపాదనను (synthetic a priori judgment) మనం సాధించవలసి వుంటుంది. అదే శాస్త్రీయ జ్ఞానానికి (Scientific knowledge) పునాదిగా పనికివస్తుంది.

ఎందుకంటే దానిలో సంశయానికి తావు లేదు. ఒకసారి నిజమై మరొకసారి నిజం కాకుండా పోదు. ఒకచోట నిజమై మరొకచోట నిజం కాకుండా పోదు. అది అనుభవంద్వారా రాదు, అనుభవానికి ముందే లభిస్తుంది. అయినా అనుభవానికి విధిగా వర్తిస్తుంది.

మరి అటువంటి సంశ్లేషణాత్మక అనుభవాత్పూర్వ ప్రతిపాదనలు, లేదా సూత్రాలు లేదా నిర్ణయాలు (judgments) వున్నాయా? అంటే, వున్నాయనే కాంట్ అన్నాడు.

## నిత్య సత్యాలు

ఉదాహరణకు– త్రిభుజంలోని మూడు కోణాల మొత్తం రెండు సమకోణాలకు సమానం అనే ప్రతిపాదన తీసుకోండి. త్రిభుజం, రెండు సమకోణాలు అనే రెండు వేర్వేరు భావశకలాలను కలపగా ఈ సంశ్లేషణాత్మక ప్రతిపాదన లభించింది. అంతేగాక అది అనుభవంద్వారా కాక, అనుభవానికి ముందే–కేవలం వివేచన ద్వారానే–లభించింది కూడా. కనుక, దానికి తిరుగు లేదు. అది సర్వకాల సర్వావస్థలలోను నిజమై తీరుతుంది. ఏ త్రిభుజంలోని మూడు కోణాల మొత్తాన్నయినా సరే, కలపండి. రెండు సమకోణాలకు సమాన మవుతుంది. అలాగే "రెండు బిందువుల మధ్య దగ్గరిదారి సరళరేఖ" (The shortest distance between two points is a straight line) అనేది. ఇలాగే. తక్కిన గణిత, భౌతికశాస్త్ర సూత్రాలు.

ఈ ప్రతిపాదనలు, సూత్రాలు ఎలా సాధ్య మవుతున్నాయి?

ఇంద్రియానుభూతి రెండు అంచెలలో మనకు కలుగుతుంది. మొదటి దశలో ఏదో ఇంద్రియ సంవేదన (sensation) మాత్రమే కలుగుతుంది. రెండవదశలో అది ఇంద్రియానుభూతి (perception) గా మారుతుంది.

## సంవేదనలు

సంవేదన అనేది కేవలం ఇంద్రియాలకు కలిగే ప్రాథమిక ప్రేరణ (stimulus) మాత్రమే. అది అనుభూతికి ముందు సమాచారాన్ని మాత్రమే అందిస్తుంది. అంటే రంగు, రుచి, వాసన, స్పర్శ మొదలైన వేర్వేరు ప్రేరణలు మాత్రమే ఆ దశలో మన ఇంద్రియాలకు అందుతాయి. వాటిని ఏక సూత్రంతో బంధించి, ఏకత్వాన్ని (Unity of consciousness)ఆపాదించి, వస్త్వనుభవంగా మార్చగలిగిన శక్తి మనస్సుకు మాత్రమే వున్నది. మనస్సు లేకపోతే కేవల సంవేదనలు అనుభవంగా మారలేవు.

## స్థలం, కాలం

ఇందుకు మనస్సు రెండు రకాల సాధనాలను ఉపయోగిస్తుంది. ఒకటి స్థలానికి సంబంధించినది, రెండవది కాలానికి సంబంధించినది. స్థలం (Space), కాలం (Time)–ఈ రెండింటిని "ప్యూర్ ఇంట్యూయిషన్స్ (Purē intuitions)"గా కాంట్ పేర్కొన్నాడు.

"ప్యూర్" అంటే "అనుభవాత్పూర్వమైన" (a priori) అని ఇంతకు ముందు తెలుసుకున్నాము. ఇంట్యూయిషన్ అంటే అప్పటికప్పుడు, పూర్వానుభవంతో నిమిత్తం లేకుండా, తనంతట తానుగా కలిగే ఆంతరికజ్ఞానం. స్థలం, కాలం అనేవి అటువంటి ఆంతరిక జ్ఞానం యొక్క రూపాలుగా కాంట్ భావించాడు. స్థలం, కాలం అనేవి వస్తువులలో, బాహ్య ప్రపంచంలో వుండేవి కావు. అవి అనుభవానికి ముందే మనస్సులో వుంటాయి. మానవ మనస్సు నిర్మాణంలోనే అవి సహజాంతర్భాగాలు, అవి లేనిదే మానవ మనస్సు లేదు. బాహ్య వస్తువుల గురించిన జ్ఞానాన్ని సంపాదించడానికి మనస్సు స్థలకాలాలను సాధనాలుగా ఉపయోగిస్తుంది. మనకు కలిగే ఇంద్రియ సంవేదనలపై, స్థల, కాలాలను మన మనస్సు అధ్యారోపిస్తుంది. అప్పుడు సంవేదనలు అనుభవంగా మారుతాయి.

## పచ్చ కళ్ళజోడు

ఉదాహరణకు పచ్చద్దాల కళ్లజోడు పెట్టుకుని చూస్తే మనకు వస్తువులన్నీ పచ్చగా కనిపిస్తాయి. నిజానికి వస్తువులన్నీ పచ్చగా వుండవు కదా? మన పచ్చ కళ్లజోడు మూలంగానే అవి పచ్చగా కనిపిస్తాయి. అలాగే మన మనస్సు స్థలం, కాలం అనే రెండద్దాల కళ్లజోడు తగిలించుకుని వస్తు ప్రపంచాన్ని చూస్తుంది. దానితో వస్తు ప్రపంచం స్థల, కాలాలలో ఒక పద్ధతిలో, క్రమంలో అమరివున్నట్టు కనబడుతుంది. వస్తు ప్రపంచం (phenomenal world) లో నిజంగా పద్ధతి, క్రమం అనేవి లేవు. దేనికదిగా గందరగోళంగా వచ్చే సంవేదనలే వున్నాయి. అవి మనకు వస్తువులనుంచి లభిస్తాయి. వాటిని స్థలం, కాలం అనే ఆంతరిక జ్ఞాన రూపాలు, లేదా సాధనాలు (forms of intuition) ఒక క్రమంలో, ఒక పద్ధతిలో తీర్చిదిద్ది మన మనస్సుకు అందజేస్తాయి. ఎటొచ్చీ మామూలు పచ్చ కళ్లజోడును ఎప్పుడు వడితే అప్పుడు తీసివేయవచ్చు. కాని, ఈ స్థల, కాలాలనే "కళ్లజోడు"ను మనస్సునుంచి వేరు చేయడానికి వీలులేదు. అవి మనస్సుతోపాటే పుడతాయి. మనస్సు వున్నంత కాలం వుంటాయి. మనస్సు అనేది లేకపోతే స్థల, కాలాలు లేవు. బాహ్య జగత్తు మనకు అర్థంకాదు. అనుభవనీయం కాదు : అసలు బాహ్య జగత్తు అనేదే అంతర్ధాన మవుతుంది.

మనస్సుకు స్థల, కాలాల కళ్లజోడు స్వతస్సిద్ధంగా వుండడంవల్లనే ఆ వస్తువు అక్కడుంది, ఇది ఇక్కడుంది, ఆ సంఘటన అప్పుడు జరిగింది, ఇది ఇప్పుడు జరిగింది అనే జ్ఞానం మనకు కలుగుతున్నది. లేకపోతే అంతా గందరగోళమే.

స్థలం, కాలం అనుభవాత్పూర్వమైనవి. అంటే అవి వస్తువులలో వుండవు. వస్తువులే స్థల కాలాలలో వుంటాయి. ఇక్కడ వస్తువులంటే కాంట్ పేర్కొన్న యథార్థ వస్తువులు (నూమినా) అని కాదు. యథార్థ వస్తువులు స్థల, కాలాలకు అతీతమైనవి. యథార్థ వస్తు ప్రపంచం ఎలా వుంటుందో ఎప్పటికీ మన మనస్సుకు, అనుభవానికి అందదు. అది అజ్ఞేయం (unknowable). విషయ వస్తువులు (phenomena) మాత్రమే అంటే అనుభవంలోకి వచ్చే వస్తువులు మాత్రమే స్థల కాలాలలో వుంటాయి. విషయ వస్తువులు లేని శూన్య స్థలాన్ని, శూన్య కాలాన్ని (న్యూటన్ అబ్సల్యూట్ స్పేస్. అబ్సల్యూట్ టైమ్‌లను ఊహించినట్లు) ఊహించగలము. కాని, స్థలంలో, కాలంలో లేని విషయ వస్తువులను ఊహించనే లేము.

## సారాంశం

ఇంతవరకు చెప్పినదాని సారాంశాన్ని పునరవలోకనం చేద్దాము : యథార్థ వస్తువుల (noumena -) (నూమినా) తో కూడిన జగత్తు మనకు అనుభవంలోనికి రాదు. అది అననుభూతం. యథార్థ వస్తువుల ఆభాసిక గుణాలు (రంగు, రుచి ఇత్యాదులు) మాత్రమే మన అనుభవంలోనికి వస్తాయి. అందుచేత మన జ్ఞానం ఇంద్రియానుభవాన్ని దాటిపోలేదు.

అయితే, ఆభాసిక గుణాలు మన ఇంద్రియాలద్వారా సంవేదనల (Sensations) రూపంలోనే మనకు తెలుస్తాయి. వాటినుంచి జ్ఞానం రాదు. వాటిని మనస్సు, స్థలం, కాలం అనే చట్రంలో బిగించి చూస్తుంది. అప్పుడు మనకు బాహ్య వస్తువుల గురించి ప్రత్యక్ష జ్ఞానం (perception) కలుగుతుంది. స్థల, కాలాలు లేకపోతే బాహ్య ప్రపంచం మనకు అనుభూతమే కాదు. స్థలం, కాలం బాహ్య వస్తువులను ఒక క్రమంలో సంఘటితం చేసి మన మనస్సుకు అందజేస్తాయి.

నిజానికి, అంతటితోనైనా మనకు జ్ఞానం లభించదు. ఊరికే వస్తువులు స్థల, కాలాల్లో వున్నాయని తెలుసుకోవడం మాత్రమే జ్ఞానంగా భాసించదు. జ్ఞానానికి ఇంద్రియానుభవం అనేది ముడి సమాచారాన్ని మాత్రమే అందిస్తుంది.

మరి, ఆ ముడి సమాచారం జ్ఞానంగా ఎలా మారుతున్నది?

# బాహ్య ప్రపంచ అవగాహన పద్ధతులు

మనకు బాహ్య ప్రపంచం నుంచి ఇంద్రియ సంవేదనలు (Sensations) మాత్రమే వస్తాయని, అవి కేవలం ముడి సరుకేనని ఇంతకుముందు తెలుసు కున్నాము. స్థలం, కాలం (Space and Time) అనేవి మనస్సుకు స్వతస్సిద్ధంగా వుండే కళ్లజోడు వంటివని, ఆ కళ్లజోడులోనుంచి చూస్తేతప్ప ఇంద్రియ సంవే దనలు అనే ముడిసరుకు ఇంద్రియానుభూతి (Perception) గా మారదని కూడా చదివాము.

అయితే, కేవలం ఇంద్రియానుభూతితోనే మన జ్ఞానం సమగ్రం, సంపూర్ణం కాబోదు. ఇంద్రియ సంవేదనలు ఇంద్రియానుభూతికి ముడి సమాచారాన్ని అందించినట్టే, ఇంద్రియానుభూతి జ్ఞానసంపాదనకు ముడి సమాచారాన్ని అంద జేస్తుంది.

ఇంద్రియానుభూతి జ్ఞానంగా పర్యవసించాలంటే మనస్సుకు మరొక కళ్లజోడు అవసరం. ఆ కళ్లజోడులోనుంచి చూస్తే తప్ప విషయజగత్తు (Phenomenal World) మనకు అవగాహన కాదు; మన జ్ఞానం సమగ్రం కాదు.

## మరో కళ్లజోడు

ఈ రెండవ రకం కళ్లజోడుకు కాంట్ పెట్టిన పేరు క్యాటగిరీస్ (categories). క్యాటగిరీస్ అంటే వర్గాలు. ఇవి మొత్తం పన్నెండు అని కాంట్ సిద్ధాంతీకరిం చాడు.

ఈ పన్నెండు వర్గాలు మనస్సులోనే వుంటాయి. మనస్సే వాటిని తయారు చేస్తుంది. వాటి సహాయంతోనే మానవ మనస్సు విషయ ప్రపంచాన్ని అవగాహన చేసుకుంటుంది. మనకు బయటినుంచి వచ్చే ఇంద్రియానుభ వాలను మనస్సు పన్నెండు రకాలుగా వర్గీకరిస్తుంది. అలా వర్గీకరించకపోతే ఇంద్రియానుభవం మనకు అవగాహన కాదు.

స్థలం, కాలం అనే కళ్లజోడులోనుంచి చూస్తే బాహ్యవస్తువులన్నీ స్థలంలో, కాలంలో ఒక క్రమ పద్ధతిలో అమరివున్నట్టు ఏ విధంగా కనిపిస్తుందో, అలాగే పన్నెండు వర్గాల కళ్లజోడుతో చూస్తే, బాహ్యవస్తువులను గురించిన మన అనుభవాలన్నీ ఆ పన్నెండు వర్గాలకు అనుగుణంగా సంభవిస్తున్నట్టుగా మనం అవగాహన చేసుకుంటాము. అంటే ఈ వర్గాలు (categories) అనేవి మనం ప్రపంచాన్ని అర్థం చేసుకునే పద్ధతు లన్నమాట.

## అవగాహన పద్ధతులు

మొదట ఇంద్రియానుభవం వుండాలి. అప్పుడు దాన్ని మన మనస్సు పన్నెండు పద్ధతుల్లో అవగాహన చేసుకుంటుంది. ఇంద్రియానుభవం లేకపోతే అవగాహన చేసుకొనడానికి విషయం వుండదు. అలాగే అవగాహన లేకపోతే వట్టి ఇంద్రియానుభవం జ్ఞానాన్ని ఇవ్వదు. దీన్నే కాంట్ ఇలా అన్నాడు : Concepts without percepts are empty, Percepts without concepts are blind. "ఇంద్రియానుభవం లేకపోతే అవగాహన చేసుకునే పద్ధతులు నిరుపయోగం. అవగాహన పద్ధతులు లేకపోతే ఇంద్రియానుభవం జ్ఞానంగా పర్యవసించదు." కనుక, జ్ఞాన సంపాదనకు ఇంద్రియానుభవం. అవగాహన పద్ధతులు (వర్గాలు) రెండూ అవసరమే నన్నమాట. బాహ్య ప్రపంచాన్ని గురించి మానవుడి అవగాహన (understanding) పన్నెండు వర్గాలపై ఆధారపడివుంటుంది. అవి అవగాహనకు ఆధారసూత్రాలు (Principles of understanding) గా, పద్ధతులు (forms) గా పని చేస్తాయి. మనకు కలిగే అనుభవం ఏదైనాసరే, ఈ పన్నెండు పద్ధతులలోనే కలుగుతుంది, కలిగి తీరుతుంది. ఈ పన్నెండు పద్ధతులలో తప్ప మరొక విధంగా అనుభవం మనకు అవగాహన కానేరదు.

ఎందుచేతనంటే పచ్చకళ్లజోడు పెట్టుకుని చూస్తే, అన్ని వస్తువులు పచ్చగానే కనిపించినట్టు, మనస్సు తనకు స్వతస్సిద్ధంగా సంక్రమించిన ఈ పన్నెండు పద్ధతులలో ప్రపంచాన్ని అవగాహన చేసుకున్నప్పుడు ఈ పన్నెండు పద్ధతులకు అనుగుణంగానే అనుభవాలన్నీ వుండితీరుతాయి.

## నాలుగు శ్రేణులు

ఆ పన్నెండు వర్గాలను, లేదా పద్ధతులను కాంట్ తిరిగి నాలుగు రకాలుగా శ్రేణీకరించాడు. అంటే ఒక్కొక్క శ్రేణిలో మూడేసి చొప్పున మొత్తం పన్నెండు వర్గా లన్నమాట.

ఒక శ్రేణి రాశికి, లేదా సంఖ్యాకు (quantity) సంబంధించింది. ఇందులో ఏకత్వం (unity), బహుత్వం (Plurality) సామస్త్యం (totality) అనే మూడు వర్గాలుంటాయి, సంఖ్యాత్మకంగా మీరు ఏ వాక్యం చెప్పవలసి వచ్చినా, ఈ మూడు వర్గాలలో ఏదో ఒక దాని కిందికి అది వచ్చి తీరుతుంది. ఉదాహరణకు- అశోకుడు భారతీయ చక్రవర్తి అన్నామనుకోండి. అది ఏకత్వం అనే వర్గం కిందికి వస్తుంది. కొందరు మానవులు తెల్లగా వుంటారు అన్నామనుకోండి. అది బహుత్వం అనే వర్గమవుతుంది. మానవులందరు మర్త్యులు అన్నామనుకోండి. అది సామస్త్యం అనే వర్గం క్రిందికివచ్చి చేరుతుంది.

రెండవ శ్రేణి గుణానికి (quality) సంబంధించినది. దీనిలో యాథార్థ్యం (reality). ఖండన (Negation.) పరిమితత్వం (limitation) అనే మూడు వర్గాలుంటాయి. వస్తు గుణానికి సంబంధించిన ఏ వాక్యం చెప్పవలసి వచ్చినా ఈ మూడు వర్గాల క్రిందికి వచ్చి తీరుతుంది.

మూడవశ్రేణి "సంబంధం" (relation) అనేదానికి చెందినది. దీనిలో ద్రవ్యం (substance). కార్య కారణత్వం (causality). పారస్పర్యం (reciprocity) అనే మూడు వర్గాలుంటాయి- ఇవి వస్తువులమధ్య సంబంధాలను తెలియజేస్తాయి.

నాల్గవశ్రేణి సంభావ్యత (modality) అనేదానికి చెందుతుంది. దీనిలో సాధ్యతా సాధ్యతలు, అస్తిత్వం - అస్తిత్వరాహిత్యం, అవశ్యకత-వైకల్పికత అనే వర్గాలుంటాయి.

మనం ఏది ఆలోచించినా, ఏ వాక్యం చెప్పినా, ఏ నిర్ణయం (judgment) చేసినా, అది ఈ నాలుగు శ్రేణులలోని పన్నెండు వర్గాలలో ఏదో ఒకదాని క్రిందికి వచ్చి తీరుతుంది. వీటి సహాయంతో తప్ప మనస్సు మరొకవిధంగా ప్రపంచాన్ని, ప్రపంచ గతమైన వస్తువులను, సంఘటనలను, అనుభవాలను అవగాహన చేసుకో లేదు, ఈ వర్గాలను ఇంద్రియానుభవాలకు అన్వయించడం ద్వారానే మనస్సు వాటిని అవగాహన చేసుకుంటుంది. అందుచేత ఇంద్రియానుభవాలు విధిగా ఈ పన్నెండు వర్గాల పరిధిలోనే వుంటాయి. అప్పుడే ఇంద్రియానుభవాలు జ్ఞానంగా పర్యవసిస్తాయి.

## పునస్సమీక్ష

ఇప్పుడు కాంట్ జ్ఞాన సిద్ధాంతాన్ని మనం పునస్సమీక్షించవచ్చు, మనకు సంశ్లేషణాత్మక అనుభవాత్పూర్వ జ్ఞానం ఎలా లభ్యమవుతున్నది? అట్టి జ్ఞానం సార్వత్రికం, నిశ్చితం, ఆవశ్యకం ఎలా అవుతున్నది? అని కదా కాంట్ వేసిన ప్రశ్నలు? వాటికి సమాధానం ఇది :

బాహ్య ప్రపంచం రెండు రకాలుగా వుంటుంది. ఒకటి యథార్థ వస్తువులతో (నూమినా, లేదా థింగ్స్ ఇన్ దెమ్‌సెల్వ్స్) కూడిన ప్రపంచం. ఆ ప్రపంచం, అందులోని యథార్థ వస్తువులు మన ఇంద్రియానుభవంలోకి రావు, ఇంద్రియానుభవంలోనికి వస్తేనే మనం దేనినయినా అవగాహన చేసుకు నేది. కాని యథార్థ వస్తువులు అవగాహనకు కూడా అందవు. అవి అజ్ఞేయాలు (unknowable) .

ఇక రెండవ రకం ప్రపంచం మనం నిత్యం చూస్తున్న విషయ జగత్తు,

(Phenomenal world) ఇదే మన ఇంద్రియానుభవంలోనికి వచ్చి మన చేత అవగాహన చేసుకోబడేది.

## యథార్థ వస్తువులు

అయితే, అజ్ఞేయం, అననుభూతం అయిన యథార్థ వస్తు ప్రపంచం ఒకటి వుందని మనం ఎలా చెప్పగలమన్న ప్రశ్న రావచ్చు. అంటే అనుమాన ప్రమాణాన్ని (inference) బట్టేనని చెప్పాలి. యథార్థ వస్తువులు లేకపోతే మనకు రంగు, రుచి, వాసన, బరువు, అకృతి మొదలైన ఇంద్రియ సంవేదనలు (sensations) ఎలా కలుగుతున్నాయి? వాటికి ఆధారమైన వస్తువులు-వాటిని మనకు అందజేసే వస్తువులు—వుండాలి కదా? కనుక సంవేదనలను అనుభవాలుగా మార్చుకుని, అవగాహన చేసుకునేది మన మనస్సే అయినా, సంవేదనలను కలుగజేసేది మాత్రం బాహ్య ప్రపంచంలోని యథార్థవస్తువులే.

అందుచేత బాహ్య ప్రపంచం అనేది స్వతస్సిద్ధంగా, దానంతట అది వుంది. దానికి కర్త వున్నాడో, లేడో మనకు తెలియదు. ఉంటే ఆ కర్త ఎవరో తెలియదు. మన మనస్సుమాత్రం దానికి కర్త కాదు. మనకు సంవేదనలను పంపించడం వరకే బాహ్యప్రపంచం పని. ఆ సంవేదనలను స్థల కాలావస్థితంచేసి, అంటే ఒక క్రమంలో, ఒక పద్ధతిలో అమర్చి, కార్యకారణ సంబంధం, సంఖ్య, గుణం, సంభావ్యత మొదలైన పద్ధతులద్వారా అవగాహన చేసుకునేది మాత్రం మన మనస్సే. ఈ పద్ధతులు (categories) బాహ్యప్రపంచానికి చెందినవి కావు. అవి మన మనః ప్రపంచంలోనివి. మానవుడి మనస్సు నిర్మాణంలోనే ఆ పద్ధతులు అంతర్భూతంగా వున్నాయి. మన మనస్సు ఆ పద్ధతులలోకాక మరొక పద్ధతిలో ఆలోచించలేదు. బాహ్య ప్రపంచంనుంచి మనకు కలిగే ఇంద్రియానుభవానికి ఆ పద్ధతులను వర్తింపజేసి, మనస్సు అప్పుడు ఆ అనుభవాన్ని అర్థం చేసుకుంటుంది.

అందుచేత ఈ అవగాహన పద్ధతులు (Principles of understanding) అనుభవం ద్వారా వచ్చేవి కావు. అనుభవానికి ముందే అవి మనలో వుంటాయి. కనుకనే వాటిని అనుభవానికి వర్తింప జేయడం జరుగుతుంది. కనుకనే గణిత సూత్రాలు, భౌతిక శాస్త్ర సూత్రాలు విధిగా బాహ్య ప్రపంచానుభవానికి వర్తించి తీరుతాయి. రెండు రెళ్లు నాలుగు అనే సూత్రంతో మొదలుపెట్టి సంక్లిష్టమైన గణిత, భౌతిక సూత్రాల వరకు అన్నీ సర్వకాల, సర్వావస్థలలోను నిశ్చితంగా, అనివార్యంగా, నిజం కావడం ఈ కారణం చేతనే. మన మనస్సు ఒకానొక పద్ధతిలో ప్రపంచాన్ని చూస్తున్నప్పుడు ప్రపంచం అలా వుండక మరొక విధంగా ఎందుకుంటుంది?

## వైరుధ్యాలు

ఇక్కడ ఒక ముఖ్య విషయాన్ని గుర్తు పెట్టుకోవాలి. మన మనస్సు నిర్మాణంలో సహజంగా వున్న స్థలం, కాలం (space and time), పన్నెండు అవగాహన సూత్రాలు (categories) మనకు దృశ్యమానమవుతున్న విషయ ప్రపంచానికేతప్ప యథార్థ ప్రపంచానికి వర్తించవు. యథార్థ వస్తువులు స్థలానికి, కాలానికి అతీతమైనవి. అలాగే మన అవగాహనా సూత్రాలకు కూడా అతీతమైనవి. కాని, మనస్సు అలా ఊరుకోలేదు కదా? కుతూహలం కొద్దీ స్థల, కాలాలను, అవగాహనా సూత్రాలను యథార్థ ప్రపంచానికి (noumenal world) కూడా వర్తింపజేయడానికి ప్రయత్నిస్తూ వుంటుంది. అలా ప్రయత్నించినప్పుడల్లా కొన్ని పరస్పర వైరుధ్యాలు మనకు ఎదురవుతూ వుంటాయి. ఆ వైరుధ్యాలను పరిష్కరించడం, పరిహరించడం మానవ సాధ్యం కాదు.

ఈ పరస్పర విరుద్ధ ప్రతిపాదనలను పాశ్చాత్య తత్వ పరిభాషలో "యాంటీనమీస్" అంటారు. యాంటీనమీ (antinomy) లో రెండు విరుద్ధ ప్రతిపాదనలుంటాయి. ఆ రెండింటిని దేనికదిగా చూస్తే అదీ నిజమే, ఇదీ నిజమే. దాన్నీ రుజువు చేయవచ్చు. దీన్నీ రుజువు చేయవచ్చు అనిపిస్తుంది. కాని, వాటిలో ఒకటి నిజమైతే రెండవది నిజం కావడానికి వీలులేదు. అటువంటిదాన్ని యాంటీనమీ అంటారు.

కాంట్ ఇటువంటి విరుద్ధ ప్రతిపాదనలను (యాంటీనమీస్) నాల్గింటిని పేర్కొన్నాడు.

## ఏది నిజం?

1. కాలం దృష్టితో (temporally) చూస్తే జగత్తుకు ఆద్యంతాలు వున్నాయి. స్థాలికంగా (spatially) చూసినా ప్రపంచానికి ఆద్యంతాలు వున్నాయి. ఇది థీసిస్. అంటే వాదం.

కాలికంగాను, స్థాలికంగాను ప్రపంచానికి ఆద్యంతాలు లేవు. ఇది యాంటీ థీసిస్. అంటే ప్రతివాదం.

ఈ వాద, ప్రతివాదాలు రెండింటికి రుజువులున్నాయి. కాని, ఒకటి నిజమైతే రెండవది నిజం కావడానికి వీలులేదు కదా? అదే యాంటీనమీ.

2. పదార్థాన్ని (matter) అనంతంగా విభజించవచ్చు. ఇది వాదం.

పదార్థం ఇక విభజించడానికి వీలులేని అత్యల్ప శకలాలతో నిర్మింపబడింది- ఇది ప్రతివాదం.

ఇదీ అంతే. రెండూ తర్కబద్ధమైనవే. కాని, ఒకటి నిజమైతే రెండవది నిజం కానేరదు.

3. కార్య కారణాల గొలుసు (chain of cause and effect) అనంతమైనది.

కార్యకారణాల గొలుసు అనంతం కాదు. ఆదికారణం (first cause) ఒకటి వున్నది.

ఇది కాంట్ పేర్కొన్న మూడవ యాంటీనమీ. ఈ వాద ప్రతివాదాలు రెండూ నిజంగానే భాసిస్తాయి. కాని, ఒకటి నిజమైతే రెండవది నిజం కాదు.

4. ప్రపంచానికి కారణమైన దేవుడు వున్నాడు. ఇది వాదం.

ప్రపంచానికి కారణంగా దేవుడు లేడు. ఇది ప్రతివాదం.

ఇది నాల్గవ యాంటీనమీ.

## వైరుధ్యాలకు కారణం

ఈ విరుద్ధ ప్రతిపాదనలు ఏర్పడడానికి కారణం అనుభవ గోచరమైన విషయ జగత్తుకు వర్తించే కార్యకారణత్వాది అవగాహన సూత్రాలను అనుభవగోచరం కాని యథార్థ జగత్తుకు వర్తింపజేయాలని అత్యాశకొద్దీ ప్రయత్నించడమేనని కాంట్ అభిప్రాయపడ్డాడు. యథార్థ జగత్తు ఎలా వుంటుందో మనకు తెలియదు. తెలుసుకొనడానికి వీలులేదు. మనకు ఒక వస్తువు తెలిసిందీ అంటే, ఇంద్రియాలవల్ల అనుభూతమైందీ అంటే అది యథార్థ వస్తువు కాదన్నమాట. యథార్థ వస్తువు దానికి అతీతంగా మిగిలే వుంటుం దన్నమాట. ఇంద్రియ గోచర వస్తువులను మాత్రమే మన మనస్సు గణిత, భౌతిక సూత్రాల ప్రకారం అవగాహన చేసుకోగలదు. కాగా యథార్థ వస్తువులు (Things-in-themselves or noumena) ఎన్నటికి మన అనుభవ పరిధిలోకి రావు.

మెటఫిజిక్స్ అంటే పారభౌతికశాస్త్రం. భౌతిక వస్తువులకు ఆధారంగా, వాటికి అతీతంగా వుండే శాశ్వత సత్యాన్ని కనుగొనడానికి పార భౌతిక శాస్త్రం ప్రయత్నిస్తుంది. కాని, అట్టి శాశ్వత సత్యం మానవమనస్సుకు, మానవ మేధకు ఎన్నటికి అందని అనధిగమ్యమైన పదార్థం. అదుచేత పారభౌతిక శాస్త్రం వృథా. మనం మనసుద్వారా తెలుసుకోగలిగింది భౌతిక సత్యాలను మాత్రమే. దేవుడు, ఆత్మ, అమరత్వం (immortality) మొదలైనవి మన మనోవగాహనకు అందని విషయాలు.

అంతమాత్రాన దైవం, ఆత్మ, దాని నిత్యత్వం లేవని కాంట్ అభిప్రాయం

కాదు. అవి వివేచనకు అందకపోవచ్చు; కాని, విశ్వాసానికి నిశ్చయంగా లభ్య మవుతాయని కాంట్ అభిప్రాయపడ్డాడు.

# కాంట్ నైతిక సిద్ధాంతం

కాంట్ పారభౌతిక (మెటఫిజికల్) సిద్ధాంతం మీద ఆధారపడిందే అతని నైతిక సిద్ధాంతం. "క్రిటిక్ అఫ్ ప్యూర్ రీజన్"లో కాంట్ తన పారభౌతిక సిద్ధాంతాన్ని విశదీకరించాడు. నిజానికి అతని పారభౌతిక సిద్ధాంతం పారభౌతిక సిద్ధాంతం కానే కాదు. పారభౌతిక సత్యాన్ని కనుగొనడం మానవ మనస్సుకు సాధ్యం కాదని, అది అజ్ఞేయమని కాంట్ వాదం. అందుచేత అతడు నిజానికి అజ్ఞేయవాది (agnostic). తన "క్రిటిక్ అఫ్ ప్యూర్ రీజన్" లో తన అజ్ఞేయ వాదాన్నే ప్రతిపాదించాడు.

అయితే, అది అతనికి తృప్తినివ్వలేదో ఏమో, ఆ తర్వాత వ్రాసిన "క్రిటిక్ అఫ్ ప్రాక్టికల్ రీజన్" అనే గ్రంథంలో కాంట్ తన జ్ఞేయవాదాన్ని విపులీకరించాడు. అంటే అజ్ఞేయమైన పారభౌతిక సత్యాన్ని ఏవిధంగా జ్ఞేయం చేసుకోగలమో చెప్పాడు.

బుద్ధిద్వారా, వివేచన ద్వారా పారభౌతిక యాథార్థ్యాన్ని (metaphysical reality) తెలుసుకోలేమన్న మాట నిజమే. ఏమిటీ ఆ పారభౌతిక యాథార్థ్యం? దాన్ని "తనలో తాను వుండే వస్తువు"--Thing-in-itself–అనండి, విశ్వజనీన సత్యం అనండి, కేవల, శాశ్వత, నిరపేక్ష సత్యం అనండి, దేవుడు అనండి- ఏదో ఒక యాథార్థ్యం, (Reality) ఈ బాహ్య, ఇంద్రియ గోచర ప్రపంచానికి వెనుక, దానికి ఆధారభూతంగా వుంది. ఎటొచ్చీ అది మన ఇంద్రియాలకు, మనస్సుకు అననుభూతంగా, అజ్ఞేయంగా వున్నది. దాన్ని మనం తర్కం ద్వారా, వివేచన (reasoning) ద్వారా, మనస్సు ద్వారా తెలుసుకోలేము. ("యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ--ఆనందం బ్రహ్మణో విద్వాన్ నబిభేతి కదాచన" అని ఉపనిషద్వాక్యం.)

## నైతిక సంకల్పం

కాని, మన నైతిక ప్రవర్తనద్వారా దాన్ని తెలుసుకొనడానికి వీలున్నది. ప్రపంచ యాథార్థ్యం, లేదా దైవం మన నైతిక ప్రవర్తన (క్రమయోగం) ద్వారా, నైతిక సంకల్పం (moral will) ద్వారా మనకు గోచరించే అవకాశం వుంది.

ఎందుకంటే నైతిక సంకల్పం అనేది మనకు ఇంద్రియగోచర ప్రపంచం నుంచి సమకూరడం లేదు. అలాగే మన మనస్సు దాన్ని కల్పించడం లేదు. అంటే ఇంద్రియానుభవం ద్వారాగాని, మనోవ్యాపారం ద్వారాగాని వివేచనద్వారాగాని, నైతిక సంకల్పం మనలో కలగడం లేదు.

మరి ఎలా వస్తోంది అది? అంటే, ప్రపంచానికి ఆధారంగా, భూమికగా వున్న అవాఙ్మానస గోచరమైన పరమ సత్యమే నైతిక సంకల్పాన్ని మనలో ఉద్బుద్ధం చేస్తోంది. అందుచేత ఆ నైతిక సంకల్పంద్వారానే మనకు పారభౌతిక సత్యం గురించిన ప్రత్యక్ష జ్ఞానం--చూచాయగానయినా-- లభిస్తోంది.

ఇంతకీ నైతిక సంకల్పం అంటే ఏమిటి?

## నిర్ణయ స్వేచ్ఛ

మనం చేసే పనులు స్థూలంగా రెండు విధాలు. మన కోరికలు, ఉద్రేకాలు, ఉద్వేగాలు– వీటి ప్రేరణతో చేసే పనులు ఒక రకం.

అలా కాక, కర్తవ్య నిష్ఠతో చేసే పనులు మరొక రకం.

కోరికలకు, ఉద్రేకాలకు లోనై కొన్ని పనులు చేస్తాము. అంటే అవి మనం స్వేచ్ఛగా చేసే పనులు కావు. వాటికి ప్రేరణలు బాహ్య ప్రపంచం నుంచి వస్తాయి. మనకు ఒకానొక పని ఇష్టం కనుక, అది చేస్తే మనకు సుఖం లభిస్తుంది కనుక, లేదా ఏదో ప్రయోజనం, స్వలాభం చేకూరుతుంది కనుక ఆ పని చేస్తాము. దానిలో మన సంకల్ప స్వేచ్ఛ వ్యక్తం కాదు. మనల్ని బయటినుంచి ఏదో ఆశ, ఏదో కోరిక, ఏదో తృష్ణ, ఏదో ఉద్రేకం ప్రోద్బలిస్తుంది. కనుక మనం ఆ పని చేస్తాము.

అలా కాక, మానవుని సంకల్ప స్వేచ్ఛ వ్యక్తమయ్యే పనులు వేరే వుంటాయి. అవి మనం కర్తవ్య పాలనగా చేసే పనులు. ఒకానొక పని మనకు ఇష్టం కనుక, దానివల్ల సుఖమో, లాభమో కలుగుతుంది కనుక, మంచి పనులు చేయడం అతని స్వభావం కనుక, అతడు మంచి పనులు చేయరాదు. అలా చేసే పనులన్నీ మనం స్వతంత్రించి, మన నైతిక సంకల్పానుసారం చేసే పనులు కావు. అవి స్వేచ్ఛా కర్మలు కావు.

ఏ పనినయినా మన విధ్యుక్త ధర్మం కనుక చేయాలి. అందులో మన స్వార్థం లవలేశమైనా వుండరాదు. స్వసుఖం కోసం, స్వలాభంకోసం, స్వభావానుసారం చేయరాదు. అది మన అవశ్య కర్తవ్యమైనందునే చేయాలి.

ఒక పని మన విధ్యుక్తధర్మ మైనందునే మనం చేస్తే, దానిలో మానవ సంకల్ప స్వేచ్ఛ ఎక్కడ వ్యక్తమవుతోంది అని ప్రశ్న రావచ్చు. దానికి సమాధానం ఇది :

ఏ పరిస్థితిలోనైనా మనకు అనేక ప్రత్యామ్నాయాలు ఎదురవుతాయి. వాటిలో ఇదీ మన కర్తవ్యం, ఇదీ మన విధ్యుక్తధర్మం అని ఒక ప్రత్యామ్నాయాన్ని మన అంతరాత్మ, లేదా అంతర్వాణి మనకు ప్రబోధించినప్పుడు, దాన్ని మన ఇష్టా ఇష్టాలతో నిమిత్తం లేకుండా, దాని లాభనష్టాలతో, కష్ట సుఖాలతో ప్రమేయం లేకుండా, ఆచరించడానికి నిర్ణయించుకోవడంలోనే మన నిర్ణయస్వేచ్ఛ (free will) వ్యక్తమవుతుంది. అది కేవలం మన కర్తవ్యం అయినందునే, విధ్యుక్త ధర్మం అయినందునే దాన్ని స్వేచ్ఛగా ఎంచుకుంటున్నాము. అలా ఎంచుకొనకుండా వుండే స్వేచ్ఛ కూడా మనకు వుంది. కాని అది మన కర్తవ్యమైనందున ఎంచుకున్నప్పుడు అది ఉత్తమ కార్యం, నైతిక కార్యం అవుతున్నది.

## క్యాటిగారికల్ ఇంపరేటివ్

మన సాధారణ చర్యలకు, నైతిక చర్యలకు ఇదే తేడా. సాధారణ చర్యలను మనం బాహ్య ప్రేరణలకు లోనై విధిగా చేస్తాము. అంటే అవి బాహ్య ప్రేరణా నియంత్రితాలైన పను లన్నమాట. అలాకాక నైతిక చర్యలను, కర్తవ్య ప్రచోదితమైన చర్యలను--మనం నిరాకరించే స్వేచ్ఛ కూడా వున్నప్పటికీ, అవి కేవలం మన కర్తవ్యాలు కనుకనే ఆచరిస్తాము. అందుచేతనే అవి నైతిక చర్యలు అవుతున్నాయి.

ఈ కర్తవ్య పాలనను-- ఈ విధ్యుక్త ధర్మ నిర్వహణను--కాంట్ "క్యాటిగారికల్ ఇంపరేటివ్" (Categorical imperative) అని అన్నాడు.

ఈ సమాసం పాశ్చాత్య తత్వ శాస్త్రంలో సుప్రసిద్ధమైనది. తత్వవేత్తలకే కాక, పామరులకు కూడా సుపరిచితమైనది.

క్యాటిగారికల్ ఇంపరేటివ్ అంటే "నిరపేక్ష కర్తవ్యం."

ఏ పనినైతే మనం ఏ అన్య ప్రయోజనాన్నీ ఆశించి చేయమో, కేవలం అది కర్తవ్యం కనుకనే, చేయదగింది కనుకనే చేస్తామో అది నిరపేక్ష కర్తవ్యం--క్యాటిగారికల్ ఇంపరేటివ్. కర్తవ్యానికి కర్తవ్యమే ప్రయోజనం. దానికి స్థల కాలాలతో, ఇతర బాహ్య కారణాలతో నిమిత్తం లేదు. ఒకానొక విశ్వజనీన నైతిక సూత్రాన్ని అనుసరించి అది నిర్ణీత మవుతుంది. దాన్ని ఆచరించడం ద్వారా మనం పరమ సత్యావగాహనకు మరొకింత చేరువ అవుతాము.

## ఏది కర్తవ్యం?

అయితే, ఏది కర్తవ్యం? అని ప్రశ్న ఉత్పన్న మవుతుంది. మానవునికి జీవితంలో అడుగడుగునా ఎదురయ్యే ధర్మ సందేహం ఇది !

కర్తవ్యం చేయాలని చెప్పడం తేలికే. కాని ఏది కర్తవ్యమో ఎలా చెప్పడం?

అర్జునుడికి కురు పాండవ సేనలమధ్య నిలబడినప్పుడు ఇలాంటి ధర్మ సందేహమే కలిగింది-- యుద్ధం చేయడమా, మానడమా అని. అప్పుడు కృష్ణుడు అతనికి సందేహ నివృత్తి చేశాడు— క్షాత్రధర్మం అనేది సర్వకాలాలకు నిర్దిష్టమై, నిర్ణీతమై వుంది. దాన్ని అనుసరించి... "నిరాశీ ర్నిర్మమో భూత్వా యుద్ధ్యస్వ విగతజ్వరః".

కృష్ణుడి బదులు మన అంతర్వాణి ధర్మసందేహం కలిగినప్పుడల్లా మనలను ఇదీ నీకర్తవ్యమని ప్రబోధిస్తుంది.

## విశ్వజనీన సూత్రం

ఏమిటా ప్రబోధం? ఏదైనా ఒక ధర్మసందేహం ఉత్పన్నమైనప్పుడు— అంటే ధర్మాన్ని గురించిన సందేహం ఎదురైనప్పుడు—ఆ పరిస్థితిలో ప్రపంచంలోని ప్రతి మానవుడు ఎలా ప్రవర్తించాలని నీవు కోరుతావో ప్రతివాడు ఎలా ప్రవర్తిస్తే లోకకల్యాణం జరుగుతుందని నీవు భావిస్తావో, అలాగే నీవు కూడా చేయాలి.

అంటే—నీకొక నీతిసూత్రం, అన్యులకొక నీతిసూత్రం లేవన్నమాట. ఒక నీతి సమస్య ఎదురైనప్పుడు అందరు ఎలా ప్రవర్తిస్తే సముచితం కాగలదని, నీతి కాగలదని నీవు భావిస్తావో, నీవు కూడా అలాగే ప్రవర్తించాలి. అదే నీకు కర్తవ్యం అవుతుంది. అంటే నీవు నిర్దేశించే కర్తవ్యం ఒక విశ్వజనీన నైతిక సూత్రం కావడానికి అర్హమై వుండాలి.

ఒకడిపై నీకు ద్వేషం కలిగి వాడికి హాని తలపెట్టావనుకో. వెంటనే లోకంలోని ప్రతివాడు ఇతరులను ద్వేషించి, హాని తలపెడితే లోకం ఏమవుతుంది అని ఆలోచించు కోవాలి. ప్రతివాడు ఇతరులకు హాని తలపెట్టాలని నీవు కోరుకోవు కనుక, అలా జరిగితే సంఘజీవనం, సహజీవనం సాధ్యంకావు కనుక, నీవు కూడా ఇతరులను ద్వేషించరాదు, హాని తలపెట్టరాదు.

అలాగే ఒక సన్నివేశంలో అబద్ధమాడా లనిపించిం దనుకో. లోకంలో ప్రతివాడు అబద్ధమాడడం మొదలు పెడితే ఏమవుతుందని ఆలోచించుకోవాలి. అలా అందరు అబద్ధమాడడం మొదలెడితే ఎవడూ ఎవడి మాటను నమ్మలేడు. తిరిగి సంఘజీవనం, సహజీవనం అసాధ్యమవుతాయి.

అలాగే, ఎవరినీ మోసం చేయరాదు అనేది మన విధ్యుక్త ధర్మం. ఎందుకంటే ప్రతివాడు ప్రతివాడిని మోసం చేయతలపెడితే లోకవ్యవహారం తలక్రిందులవుతుంది. అందుచేత, నిజాయితీగా ప్రవర్తించడమే మన కర్తవ్యం అవుతుంది.

## కర్తవ్య ప్రబోధం

ఈ కారణంచేత ఏది కర్తవ్యం అనే ధర్మ సందేహానికి తావులేదు. లోకంలో అందరు ఎలా ప్రవర్తించాలని కోరుతావో, ఏ కర్తవ్యాన్ని సార్వజనీన, సార్వకాలిక నీతిసూత్ర స్థాయికి తీసుకుపోవాలని నీవు కోరుతావో అదే నీకు కర్తవ్యమవుతుంది. అంటే కర్తవ్యం అనేది ఒకానొక విశ్వజనీన సూత్రాన్నిబట్టి నిర్ణయమవుతుం దన్నమాట.

మహాభారతంలో ఒక పద్యం వున్నది-

"ఒరు లేయవి యొనరించిన
నరవర! అప్రియము తన మనంబున కగుఁదా
నొరులకు నది సేయకునికి
పరాయణము పరమ ధర్మపథముల కెల్లన్"

అంటే ఇతరులు ఏ పనిచేస్తే మనకు అప్రియంగా వుంటుందో, ఆ పని ఇతరులకు మనం చేయకపోవడం అన్ని ధర్మాలలోకి ఉత్తమ ధర్మం అవుతుంది.

కాంట్ సూత్రీకరించిన "క్యాటిగారికల్ ఇంపరేటివ్" కూడా దాదాపు ఇలాంటిదే.

నైతిక ప్రవర్తనను నిర్దేశించే విశ్వజనీన సూత్రాన్ని అనుసరించి మనం కర్తవ్యపాలన చేయడంలో మనకు స్వార్థచింతన అనేది వుండదు. ఎందుకంటే అది లోకంలోని సర్వ మానవులకు వర్తిస్తుంది. అందులో స్వార్థంలేదు కనుక, అది ఉత్తమ స్థాయికి చెందినది. స్వార్థంకోసం చేసేది అధమ కార్యం. అలా కాక నిస్వార్థంగా కర్తవ్యం కనుకనే కర్తవ్యం ఆచరిస్తే అది లోక సంగ్రహార్థం చేసినట్టిది అవుతుంది.

భగవద్గీతలో కృష్ణుడు "కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన... ..." అని అర్జునుడికి బోధించాడు. అంటే కర్మలు చేయడానికి మాత్రమే నీకు అధికారం వుంది కాని, కర్మఫలాలపై నీకు అధికారంలేదు అని. ఇక్కడ కర్మలు అంటే ఏవో పనులని కాదు; కర్తవ్యాలు అనే.

ఇలాంటి భావాన్నే ఈశావాస్యోపనిషత్తు కూడా విశదం చేస్తోంది :

"కుర్వన్నేవేహ కర్మాణి
జిజీవిషేచ్ఛతగం సమాః
ఏవం త్వయి నాన్యథేతోస్తి
న కర్మ లిప్యతే నరే"

కర్మలు చేస్తూ నరుడు నూరేళ్లు జీవించాలని కోరుకోవాలి. ఆ విధంగా చేస్తే నీకు కర్మ ఫలితం అంటుకోదు అని దీని అర్థం. ఇక్కడ కూడా కర్మ అంటే కర్తవ్యం అనే.

## అతీత సత్యం

కాంట్ చెప్పింది దీనికి దగ్గిరగా వస్తుంది. మనకు ఇంద్రియ గోచరమవుతున్న ఈ ప్రపంచం వెనుకగల, దేశకాలాబాధితమైన సత్యం మనకు అవాఙ్మానస గోచరం. అయితే మన నైతిక సంకల్ప స్వేచ్ఛను వినియోగించుకోవడం ద్వారా, మన నిరపేక్ష కర్తవ్య నిర్వహణద్వారా, ఆ సత్యాన్ని మనం పూర్తిగా కాకపోయినా, చూచాయగానైనా తెలుసుకోగలము. ఎందుకంటే, మన కర్తవ్యం విశ్వజనీనం; దేశ కాలాబాధితం; అనుభవాత్పూర్వం; అనుభవాతీతం. అందుచేత దేశకాలాబాధితమైన పరమ సత్యం మన నైతిక, నిరపేక్ష కర్తవ్యాచరణలో తన్ను తాను అభివ్యక్తం చేసుకుంటుంది. అట్టి కర్తవ్య నిర్వహణ లోక సంగ్రహాన్ని కోరుతుంది. కనుక అది అవశ్యం ఆచరణీయం. అదే కాంట్ ప్రవచించిన "క్యాటిగారికల్ ఇంపరేటివ్".

## సర్వమానవ సమానత్వం

దీనికి ఒక పర్యవసానం సర్వమానవ సమానత్వం; ఈనాటి పరిభాషలో ప్రజాస్వామ్యం.

నీకొక నీతి, అన్యులకొక నీతి లేదు అనేది ఇందులో ముఖ్యసూత్రం. ప్రపంచంలో నైతిక దృష్టి నుంచి ఎవడూ ఎవడికంటె గొప్పవాడు కాడు. సార్వకాలిక, సార్వజనీన నీతి సూత్రం ముందు ఎవడైనా, ఆఖరికి దేవుడైనా తలవంచి నిలబడ వలసిందే.

## మానవుడే గమ్యం

నీతిగా ప్రవర్తించడం అంటే ఏమిటి? ఇతరులపట్ల నీతిగా ప్రవర్తించడమే కదా? ప్రతి వ్యక్తి ఎవడి దృష్టినుంచి వాడు తనకు తానే సాటి. మనం

మనకు ఇచ్చుకునే విలువనే, ఇతరులుకూడా తమకు తాము ఇచ్చుకుంటారని గ్రహించాలి. ప్రతి వ్యక్తి గమ్యం తానే; తన వ్యక్తిత్వపు సంపూర్ణ సాక్షాత్కారమే. ఏ వ్యక్తి మరొక వ్యక్తికి సాధన మాత్రుడు కాడు. తానుతప్ప, మరి ఏ ప్రయోజనానికి నిమిత్తమాత్రుడు కాడు. ఎవడి వ్యక్తిత్వం, ఎవడి ప్రత్యేకత, ఎవడి విశిష్టత వాడిదే. అందుచేత మనం మనకు ఇచ్చుకునే విలువను మనం ఇతరులకు కూడా ఇవ్వాలి. ఇదే మన నైతిక ప్రవర్తనకు ఆధార సూత్రం కావాలి. ఆ సూత్రాన్ని కాంట్ ఇలా నిర్వచించాడు :

మానవజాతి పట్ల మనం ఎలా ప్రవర్తించాలంటే నీతోసహా, మనలో ప్రతి ఒక్కరితో సహా మొత్తం మానవ జాతిని, ప్రతి ప్రత్యేక సందర్భంలోను దాని కొరకే దాన్నిగా తప్ప ఏ ఇతర ప్రయోజనానికి సాధన మాత్రంగా మనం పరిగణించరాదు. (Treat humanity whether in thine own person or in that of any other, in every case as an end withal, never as a means only.)

మానవజాతిపట్ల మనం ఎలా ప్రవర్తించాలంటే– మనతోసహా ప్రతి ఒక్క మానవుడు తనకు తానే గమ్యం అని మనం భావించాలి. ప్రతివాడు తన వ్యక్తిత్వసాక్షాత్కారమే తన గమ్యంగా పెట్టుకుంటాడు. ఎవడూ మరొక లక్ష్యానికి సాధన మాత్రుడు కాడు.

దీని పర్యవసానంగా సర్వమానవ సమానత్వం అనే విశ్వజనీన సత్యం ఆవిష్కృతం అవుతుంది. మన ఉపనిషత్తులు కూడా "ఆత్మవత్సర్వ భూతాని" అని సూత్రించాయి. అంతేకాదు. ఇంకా ముందుకుపోయి–

"యస్తు సర్వాణి భూతాని ఆత్మన్యేవాను పశ్యతి
సర్వభూతేషు చాత్మానం తతో న విజుగుప్సతే" అన్నారు.

అంటే, ఎవడైతే తనలో సర్వప్రాణులను, సర్వ ప్రాణులలోను తనను చూచుకుంటాడో వాడికి దుఃఖం లేదు అని.

పాశ్చాత్య తత్వశాస్త్రంలో కాంట్ ప్రవచించిన క్యాటిగారికల్ ఇంపరేటివ్– నిరపేక్ష, సార్వత్రిక, నైతిక ప్రవర్తన సూత్రం చాలా ముఖ్యమైనది. అది ఒక గొప్ప ఉదాత్త సౌందర్యంతో భాసిస్తుంది.

## ఒక ధర్మ సూత్రం

అయితే, బెర్ట్రాండ్ రస్సెల్ చెప్పినట్టు ఒక ధర్మ సూక్ష్మం దీన్ని బాధిస్తుంది. ఉదాహరణకు, 'అబద్ధం చెప్పరాదు' అనే నీతి సూత్రాన్ని తీసుకోండి. ప్రపంచంలో ప్రతి ఒక్కరు సత్యమే పలకాలని మనం కోరుకుంటాము కనుక,

మనం -కూడా నిత్యం సత్యం పలకవలసిందే. కాని, ఒక్కొక్కసారి నిజం చెప్ప డంవల్ల నిరపరాధికి ప్రాణాపాయం కలగవచ్చు. అప్పుడేమి చేయాలి?

వెనుకటికొక వేటగాడు దారిలో ఒక చెట్టుక్రిందవున్న మునిని అడిగాడట- ఆ దారిన ఏదైనా మృగం వెళ్లిందా అని. వెళ్లిందని నిజం చెబితే వేటగాడు పోయి దాన్ని చంపేస్తాడు. అది జీవహింస. వెళ్లలేదని చెబితే నిజంగా వెళ్లింది కనుక అది అబద్ధం అవుతుంది.

ఇదొక ధర్మసూక్ష్మం. ఇలాంటి ధర్మ సూక్ష్మాలు దాదాపు ప్రతి నీతి సూత్రాన్ని బాధిస్తాయి. ఒక నీతి సూత్రంతో మరొక నీతి సూత్రం సంఘర్షి స్తుంది. అప్పుడు ఏం చేయాలి?

### ఒక పరిష్కారం

ఇది చిక్కు ప్రశ్నే. బహుశ దీనికొకటే పరిష్కారం. ఆయా ప్రత్యేక సన్నివే శాలలో అందరు మానవులు ఎలా ప్రవర్తిస్తే నీతి అవుతుందని నీ అంతర్వాణి నిన్ను ఉద్బోధిస్తుందో ఆ విధంగా ప్రవర్తించడమే నీ కర్తవ్యం అని భావించాలి. అందులో నీ స్వార్థం లేనంతవరకు దాని దోషం నీకు చుట్టుకోదు.

కనుక క్యాటెగారికల్ ఇంపరేటివ్‌ను- అంటే విశ్వజనీన, నిరపేక్ష, నీతి సూత్రాన్ని గుడ్డిగా కాకుండా—పిడుక్కీ, బియ్యానికీ ఒకటే మంత్రం అన్నట్టుగా కాకుండా— సందర్భానుసారంగా అవిష్కరించడమే సరైన మార్గం.

# కాంట్ రామణీయక సిద్ధాంతం

కాంట్ గ్రంథ సముచ్చయంలో మూడు ముఖ్య గ్రంథా లున్నాయి. వాటిని “ది త్రీ క్రిటిక్స్” (The Three Critiques) అంటారు. మొదటిది “ది క్రిటిక్ ఆఫ్ ప్యూర్ రీజన్”. ఇది జ్ఞాన మీమాంసకు సంబంధించినది. రెండవది “ది క్రిటిక్ ఆఫ్ ప్రాక్టికల్ రీజన్”. ఇది నైతిక మీమాంసకు సంబంధించినది. ఈ రెండింటిని గురించి ఇంతవరకు తెలుసుకున్నాము.

కాగా మూడవది “ది క్రిటిక్ ఆఫ్ జడ్జిమెంట్.” ఇది సౌందర్య మీమాం సకు సంబంధించినది. అంటే “ఈస్తటిక్స్” (Aesthetics) శాస్త్రాన్ని గురించి వ్రాసినది. సౌందర్యం అంటే ఏమిటి? ఒక వస్తువు—అది బాహ్యసృష్టిలోనిదైనా, కళాసృష్టిలోనిదైనా సుందరమైనదనో, అసుందరమైనదనో ఎలా తెలుసుకోగలు గుతున్నాము? సౌందర్యాన్ని ఎలా అస్వాదించగలుగుతున్నాము? మొదలైన ప్రశ్నలను విచికిత్స చేసే శాస్త్రం. ఇది సంస్కృతంలో అలంకార శాస్త్రాన్ని పోలినది.

పూర్వకాలంలో గ్రీకు తత్వవేత్తలు ప్లేటో, అరిస్టాటిల్ వంటివారు రామణీయకాన్ని గురించి, కావ్యలక్షణాలను గురించి చర్చించారు కాని, యూరోపియన్ తత్వవేత్తలు దీన్ని గురించి ఎక్కువగా పట్టించుకోలేదు. వారి తత్వ చర్చ పారభౌతిక, నైతిక చింతనలకే పరిమితమైంది. కాగా, కాంట్ రామణీయకాన్ని గురించి విస్తృతంగా చర్చించాడు. ఒక గ్రంథానికి గ్రంథమే దానికి కేటాయించాడు. అందుకే అతడిని ఆధునిక రామణీయక శాస్త్రానికి (modern aesthetics) పితామహుడుగా పరిగణిస్తారు.

## సత్యం, శివం, సుందరం

మొదటి "క్రిటిక్"లో కాంట్ సత్యం (Truth) గురించిన చర్చ చేశాడు. రెండవ "క్రిటిక్" లో "శివం" (the good) గురించిన చర్చ చేశాడు. మూడవ "క్రిటిక్"లో "సుందరం" (the beautiful) గురించిన చర్చ చేశాడు. దానితో సత్యం, శివం, సుందరం అనబడే త్రికాన్ని గురించిన మీమాంస పూర్తి అయిందన్నమాట. కాంట్ కాలంనుంచే తత్వశాస్త్రంలో రామణీయక చర్చ ఒక ముఖ్య భాగమైంది.

సత్యం, శివం, సుందరం... ఈ మూడు తత్వాలు దేనికవి విభిన్నమైనవి. ఆంగ్లకవి కీట్సు తన "ఓడ్ ఆన్ ఎ గ్రీషియన్ అర్న్" అనే గీతంలో సత్యం, సౌందర్యం రెండూ ఒకటే నన్నాడు.

"Beauty is truth, truth beauty– that is all ye know on earth, and all ye need to know."

అయినా అది సర్వాంగీకారమైన ప్రతిపాదన కాదు. ఎందుకంటే సత్యమైన విషయం నీతిమంతమైనది, శుభంకరమైనది కాకపోవచ్చు. అలాగే నైతికమైనది సత్యం కాకపోవచ్చు. అలాగే సత్య విషయం సుందరమైనది, నీతిమంతమైనది కాకపోవచ్చు. సుందరమైన ప్రతిదీ నైతికం, సత్యనిష్ఠం కాకపోవచ్చు. ఈ మూడూ మూడు విభిన్న సూత్రాలు.

అంతేకాదు, సత్యమైనది ఏ ఒక్కడికో కాక, ప్రతి ఒక్కడికీ సత్యమే. దానికి సార్వత్రికత, సార్వజనీనత ఉన్నాయి. అలాగే నైతికమైనది కూడా సమస్త మానవాళికి ఒకటే, ఒకడికి ఒకటి నీతి అయి మరొకడికి కాకుండా పోదు. దానికి కూడా సార్వత్రికత, సార్వజనీనత వున్నాయి.

## వ్యక్తిగతానుభూతి

కాని, సుందరమైనది అలాకాదు. ఒకడికి సుందరమైనది మరొకడికి అసుం

దరం కావచ్చు. మజ్నూ ప్రేమించిన లైలా అందగత్తె కాదు. కాని అతడు ఆమెలో అతిలోక సౌందర్యాన్ని చూశాడు. అదేమని అడిగితే ఆమెను తన కళ్లతో చూడమన్నాడు. అందుచేత రామణీయకం అనేది వ్యక్తిగత విషయం.

ఒక వస్తువు నాకు ఆనందం కలిగిస్తున్నదంటే అది అందమైన దన్నమాట. జుగుప్స కలిగిస్తే అది అనాకారమైన దన్నమాట. అందమైన వస్తువు కలిగించే సంవేదన (feeling) ప్రతి ఇతర సంవేదనకంటె భిన్నమైనది. దానికి అదే లక్ష్యం. అదే గమ్యం. అది ఏ ఇతర సంవేదనకు కారణం కాబోదు. అంటే అందానికి ఆనందమే పరమావధి. "అందమె ఆనందం"– తెలుగు కవి తిలక్ చెప్పినట్టు కవిత్వం "అగ్ని జల్లినా, అమృతం కురిసినా అందం ఆనందం దాని పరమావధి." అందంగా వున్నది అనైతికం కావచ్చు. అసత్యం కావచ్చు. అయినా అది అందమైనదే.

## కొలమానాలు వేరు

అందమైన వస్తువుకు, లేదా కళాఖండానికి నీతి సూత్రాలను వర్తింపజేయరాదు. ఇతర ప్రయోజనాలను దానికి ఆపాదించరాదు. అలాగే అందమైన వస్తువుకు కళాఖండానికి వైజ్ఞానిక సూత్రాలను వర్తింపజేయరాదు. ఒక కళాత్మక వస్తువు అందంగా వున్నదో లేదో చెప్పడానికి ఈ నైతిక, భౌతిక శాస్త్రాల కొలమానాలు ఏమీ పనికి రావు. కళా రామణీయకం అనుభవైకవేద్యం. దాన్ని కళానియమాల దృష్టితోనే చూడాలి.

అంటే మనం రామణీయకాన్ని, కళాత్మకవస్తువును దానికి అదే గమ్యంగా లక్ష్యంగా– నిర్మలంగా, నిర్లిప్తంగా పరిగణించాలి తప్ప అది సాంఘికంగానో, రాజకీయంగానో, ఆర్థికంగానో ప్రయోజనకరమైనది కనుక అందమైనదిగా పరిగణించరాదన్నమాట. అది మనలో నిరపేక్షమైన రసానందం కలిగిస్తుంది కనుక, రమణీయార్థాన్ని ప్రతిపాదిస్తుంది కనుక, సుందరమైనది అవుతున్నదే తప్ప మరొకందుకు కాదు. దాన్ని దాని కోసమే మనం ప్రేమిస్తాము, ఆస్వాదిస్తాము.

## మరొక విరోధాభాస

అయితే, ఇక్కడ కూడా కాంట్ ఒక విరోధాభాసను (antinomy) ప్రతిపాదించాడు. రామణీయకం వ్యక్తికం అయినా, దానికి మనం సార్వత్రికత (Universality) ఆపాదించడానికి ప్రయత్నిస్తాము. దాన్ని అన్ని కాలాలకు, అన్ని దేశాలకు వర్తింపజేయాలని చూస్తాము. అది అందరికీ అందంగా వుండాలని, ఆనందదాయకం కావాలని ఆశిస్తాము. దానివల్ల మనకు కలిగే ఆనందంలో అందరు పాలు పంచుకోవాలని కోరుతాము.

అయితే ఈ సార్వత్రికత గురుత్వాకర్షణశక్తి సూత్రంలాంటి భౌతిక సార్వత్రికత కాదు. "అబద్ధం ఆడరాదు" లాంటి నైతిక సార్వత్రికత కాదు. అది ఒకే సమయంలో వైయక్తికం, సార్వజనీనం కూడా. ఇది ఎలా సంభవం?

సౌందర్యాస్వాదనవల్ల ఒకానొక సంతృప్తి మనకు కలుగుతున్నది. అయితే అది కేవలం ఇంద్రియపరమైన సంతృప్తి కాదు. వైజ్ఞానికమైన సంతృప్తి కాదు. ఒకానొక నిర్లిప్త నిర్మల సంతృప్తి కలుగుతున్నది.

ఉదాహరణకి-ఆకలిగా వున్నప్పుడు ఇష్టమృష్టాన్నం భుజిస్తే సుఖం కలుగుతుంది. అలాగే కామోపశమనంవల్ల సుఖం కలుగుతుంది. ఏదో సాంఘిక ప్రయోజనాన్ని ఆశించి కర్తవ్యాన్ని, విధ్యుక్త ధర్మాన్ని ఆచరించడంవల్ల సుఖం కలుగుతుంది.

కాని, సౌందర్యాస్వాదనవల్ల అటువంటి ఏ బాహ్య ప్రయోజనం నెరవేరడం లేదు. సుందరమైన ప్రకృతి దృశ్యాన్ని చూసినప్పుడు, మనలోని ఒకానొక తృష్ణ తీరాలని, ఫలానా లోటు భర్తీ కావాలని మనం కోరుకోవడం లేదు. సౌందర్యాస్వాదన వల్ల ఒకానొక మానసిక సంతృప్తి కలుగుతుం దన్నమాట నిజమే. కాని, అది మనలోని ఏదో లోపాన్ని పూరించినందువల్ల, ఏదో కోరిక నెరవేరడం వల్ల కలిగే సంతృప్తి కాదు, అది నిరపేక్షిత, నిరాసక్త సంతృప్తి. దానికి అదే లక్ష్యం. దానిలో స్వార్థానికి తావు లేదు. అది ఏ ఇతర బాహ్య ప్రయోజనంతోను లిప్తం, మలినం కాని మానసిక స్థితి. అందుచేత అది మన ఒక్కరిదే కాదు. అందరికీ చెందుతుంది, చెందాలి. కనుక మన వైయక్తికానందానికి సార్వత్రికత, విశ్వజనీనత కూడా సిద్ధిస్తాయి. కార్య—కారణ సంబంధంవలె అది అనుభవాత్పూర్వమే ప్రాప్తించే స్థితి. అందుచేత దానికి నిశ్చితత్వం (certainty), అవశ్యకత (necessity) కూడా వున్నాయి.

సుందరమైన వస్తువులు విధిగా ఆనందం కలిగిస్తాయి. ఆ ఆనందం వస్తువులో లేదు. మన ఆస్వాదన శక్తిలో వుంది. అట్టి శక్తివల్లనే ఒక వస్తువు అందంగా వున్నట్టు కనిపిస్తుంది. అట్టి శక్తి అందరికీ వుంటుంది కనుక, ఆ వస్తువు అందరికీ అందంగానే కనిపిస్తుందని, కనిపించాలని ఆశిస్తాము. ఒక వస్తువు మనకు అందంగా వుండి, ఇతరులకు అందంగా లేకపోతే, అది ఆ వస్తువు లోపం కాదు. ఆస్వాదించే శక్తిలో తేడాల వల్లనే, అభిరుచి లోపంవల్లనే అలా జరుగుతుంది.

## రెండు విధాల సౌందర్యం

సౌందర్యం రెండు రకాలుగా వుంటుంది. ఒకటి సాపేక్ష సౌందర్యం

(dependent beauty) అంటే అది మరొక బాహ్య ప్రయోజనంమీద ఆధారపడి వుంటుంది. ఆ ప్రయోజనాన్ని నెరవేర్చిన మేరకే అది సుందరం.

అలా కాక నిరపేక్ష కేవల సౌందర్యం (free beauty) వుంటుంది. అదే అసలు సౌందర్యం. ఉదాహరణకు పువ్వులున్నాయి. అవి అందంగా వుంటాయి. కాని వాటి అందం ఏ మానవ, వైజ్ఞానిక, నైతిక ప్రయోజనాన్ని నెరవేర్చుతున్నది? సుమరామణీయకానికి ఏ ఇతర ప్రయోజనం లేదు. ఆ రామణీయకాస్వాదన కూడా నిరపేక్షమే. దానికదే ప్రయోజనం.

ఇది కళాఖండాలకు కూడా వర్తిస్తుంది. కళ నిజమైన కళ కావాలంటే అది బాహ్య ప్రయోజన రహితం కావాలి. అంటే కళను కళ కోసమే ఆస్వాదించాలి, ఆనందించాలి. దీన్ని కాంట్ ప్రయోజనరహితమైన ప్రయోజనాత్మకత—(purposeless purposiveness)—అన్నాడు.

కళాఖండానికి ఏ ఇతర ప్రయోజనాలు వుండవని, వుండరాదని కాదు. మానవుడు చేసే ప్రతి పనికి ఏదో ప్రయోజనం వుంటుంది. ప్రయోజనం లేనిదే ఎవడూ ఏ పనీ చేయడు. కాని, కళాఖండపు కళాత్మకత (artistry) దాని నైతిక, భౌతిక, సాంఘిక, తదితర ప్రయోజనాలలో లేదు. దానియొక్క కేవల రామణీయకంలోనే వుంది. అది అనుభవైక వేద్యం. దాని కొలమానాలు వేరు, దాని సూత్రాలు వేరు.

"కవిత్వాన్ని తూచే రాళ్లు తన దగ్గర లేవన్నాడు చలం. తూచవద్దు, అనుభవించి, వలవరించమన్నాడు శ్రీశ్రీ."

"కళ యావత్తూ ఉపయోగ రహితం"- All art is useless- అన్నాడు ఆస్కార్ వైల్డ్.

పువ్వులు అనేక విధాలుగా ప్రయోజనకరం, ఉపయోగకరం. కాని, వాటి అందం ఆ ప్రయోజనంలో లేదు, ఉపయోగంలో లేదు. వాటి ప్రయోజన రాహిత్యంలో వుంది. అంటే అవి మనల్ని వేరేకొలత (dimension) లో స్పృశిస్తాయి. అలాగే కళాఖండంలోని "అందం" దాని సాంఘిక, తదితర ప్రయోజనాలలో లేదు. బాహ్య ప్రయోజన రహితమైన ఆనందానుభూతిని, రసానుభూతిని కలిగించడంలో వుంది. అందుచేతనే, రసానుభూతిలోని సానుభూతి వ్యక్తికం, విశ్వజనీనం కూడా. ఆనందానికి ప్రయోజనం ఆనందమే. అటువంటి ఆనందం కలిగించడంలోనే నిజమైన కళారామణీయకం అభివ్యక్తం అవుతుంది.

ఈ రామణీయక సిద్ధాంతాన్ని, తర్కాన్ని ఆమోదించేవారికంటె, అంగీకరిం

చని వారే ఎక్కువగా వుంటారని వేరే చెప్పనక్కరలేదు. ముఖ్యంగా ఆధునిక కాలంలో కళకు, సాహిత్యానికి సామాజిక స్పృహ, సాంఘిక శ్రేయస్సు పరమ లక్ష్యాలన్న వాదం బలంగా ప్రచలితం అవుతుండగా, కళాసౌందర్యానికి ఆనందమే పరమావధి అనే సిద్ధాంతాన్ని పలువురు తిరస్కరిస్తే వింతలేదు.

కాని, కాంట్ ఏ దృష్టితో, ఏ అతీత దృక్పథంతో ఈ సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడో లోతుగా ఆలోచించడం అవసరం. కళాఖండానికి (work of art) లేదా సాహిత్యానికి సాంఘిక ప్రయోజనం వుండదని, వుండరాదని దీని తాత్పర్యం కాదు. అనైతికం (immoral) అసత్యం (untruthful) అయినప్పటికి కళాఖండాలను ఆదరించాలని, ఆస్వాదించాలని కూడా దీని అర్థం కాదు. కళలోని సౌందర్యం దాని నైతికత (ethicality) లో కాక, దాని సత్య ప్రామాణికత (truthfulness)లోకాక, తనకు తానే ప్రయోజనమైన ఆనందం కలిగించే లక్షణంలో వున్నదని, అది అన్నిటికి అతీతం (transcendental)గా వుంటుందని దీని అర్థం.

ఈ సౌందర్య లక్షణాన్ని అర్థం చేసుకొనడానికి ఒక ఉదాహరణ చూడండి. ఒక కుర్చీ వుంది. మనుషులు కూర్చోవడానికి ఉపయోగపడడం దాని సామాజిక ప్రయోజనం. అలా ఉపయోగపడకపోతే అది కుర్చీయే కాదు. కాని, ఒక కళాకారుడు కుర్చీని తయారుచేస్తే కేవలం దాని సాంఘికోపయోగాన్ని మాత్రమే దృష్టిలో పెట్టుకోడు. దానికి ఏవో నగిషీలు చేస్తాడు. లతలు, పువ్వులు మొదలైనవి చెక్కి దాన్ని అందంగా తయారుచేస్తాడు. అదనంగా వచ్చి చేరిన ఈ అందంవల్ల, కళాత్మకతవల్ల ఆ కుర్చీ సాంఘిక ప్రయోజనం ఎక్కువైందా? ఉపయోగం దృష్ట్యా చూస్తే అది మామూలు కుర్చీ (functional chair) కంటె ఏ విధంగా గొప్పది?

అంటే కళకు, కళాత్మకతకు, కళాసౌందర్యానికి సాంఘిక ప్రయోజనాన్ని మించిన అతీత ప్రయోజనం వుందన్నమాట, అదే కాంట్ చెప్పిన (purposeless purposiveness) (ప్రయోజనరహిత ప్రయోజనాత్మకత). అది వున్నపుడే అది కళాఖండమవుతుంది. అది ఏ మేరకు వుంటే ఆమేరకు అది కళాఖండ మవుతుంది. కళాసౌందర్యానికి కళాసౌందర్యమే లక్ష్యం, ప్రయోజనం అనడంలో అర్థం ఇది. ఇదే దృష్టితో త్యాగయ్య కృతులనుంచి, కాళిదాస నాటకాలనుంచి, టాల్‌స్టాయ్ నవలలనుంచి, వాల్మీకి రామాయణం నుంచి, షేక్‌స్పియర్ రచనలనుంచి ప్రతి కళాఖండం వరకు వేటినైనా అవగాహన చేసుకోవాలి. ఇది అన్ని లలితకళలకు వర్తిస్తుంది.



# 28
# జటిలత్వానికి పరాకాష్ఠ హెగెల్

"నన్ను ఎవరూ అర్థం చేసుకోలేక పోయారు—ఒక్క డాక్టర్ రోజెన్ క్రాంట్జ్ తప్ప. అతడు కూడా తప్పుగా అర్థం చేసుకున్నాడు."

మరణ శయ్యమీద వుండగా హెగెల్ స్వయంగా అలా అన్నాడని ప్రతీతి.

అసలు తత్వశాస్త్రమే జటిలమైంది. కాగా, హెగెల్ తన తత్వ చింత నను జటిలత్వ పరాకాష్ఠకు తీసుకువెళ్లాడు. ఇంతకు ముందు ఇమాన్యుయెల్ కాంట్‌ను గురించిన అధ్యాయంలో కాంట్ చింతన అతి క్లిష్టమైందని పేర్కొవడం జరిగింది. అంతకంటె క్లిష్టమైంది హెగెల్ సిద్ధాంత వ్యవస్థ.

భావక్లిష్టత కొంత, భాషా సంక్లిష్టత మరి కొంత. దానికి తోడు తన భావాల వ్యక్తీకరణకు అతడు స్వయంగా సృష్టించుకున్న నూతన పరిభాషా జటిలత కొంత.

అయితేనేం, పందొమ్మిదవ శతాబ్దపు పాశ్చాత్యతత్వ ప్రపంచంపై హెగెల్ ప్రభావం ఇంతిం తన రానంతటిది. అతడు ప్లేటో తర్వాత ప్లేటో అంతటి

వాడని కొంద రన్నారు, అతడు చెప్పిందేమిటో అర్థం కాకపోవడం వల్లనే అతనికి అంత పేరు వచ్చిందని కొందరు హేళన చేశారు. అతనిదంతా బుకాయింపు అని మరొక ప్రముఖ తత్వవేత్త షోపెన్‌హూవర్ అన్నాడు.

## మార్క్స్‌పై ప్రభావం

మొత్తంపై మంచికో, చెడుకో హెగెల్ సిద్ధాంతాల ప్రభావం, యూరప్, అమెరికాలలో చాలా మందిపై పడింది. ఇందుకు ఒక ప్రఖ్యాతమైన ఉదాహరణ మార్క్స్. తన భావ వాదాన్ని ఆవిష్కరించడానికి హెగెల్ ఉపయోగించిన డయలెక్టికల్ పద్ధతిని (గతి తార్కికవాదం) మార్క్స్ దాదాపు యథాతథంగా తీసుకుని దాన్ని తన భౌతికవాదానికి అన్వయించాడు. అదే డయలెక్టికల్ మెటీరియలిజం (గతి తార్కిక భౌతికవాదం)గా ప్రసిద్ధికెక్కింది. మార్క్స్ యౌవనంలో "యంగ్ హెగెలియన్స్" అనే బృందానికి చెందినవాడు.

మరొకవైపు హెగెల్ సిద్ధాంతాలు ఈ శతాబ్దంలో నాజీజం, ఫాసిజంవంటి దారుణ రాజకీయ సిద్ధాంతాలకు దారితీశాయని కొందరు ఆరోపించారు. కాని, శాసనంపట్ల విధేయతే స్వాతంత్ర్యం అన్న హెగెల్ వాదానికి ఇది మరీ దూరాన్వయం, దురన్వయం అని ప్రముఖ వ్యాఖ్యాత లందరు ఖండించారు.

## పది గ్రంథాల జవాబు

ఒకసారి ఒక ఫ్రెంచిమిత్రుడు "ఒక్క ముక్కలో మీ సిద్ధాంతం ఏమిటో చెప్పండి" అని హెగెల్‌ను కోరాడట. దానికి సమాధానంగా హెగెల్ పది లావుపాటి పుస్తకాలు వ్రాశాడని విల్ డ్యురాంట్ పేర్కొన్నాడు.

తర్కశాస్త్రం, భౌతిక శాస్త్రం, పారభౌతికశాస్త్రం, మానవ పరిణామ శాస్త్రం, మనస్తత్వ శాస్త్రం, న్యాయశాస్త్రం, నీతిశాస్త్రం, రాజనీతి శాస్త్రం, ఆర్థిక శాస్త్రం, అలంకార శాస్త్రం, మతం, చరిత్ర– ఇలా మొత్తం మానవ విజ్ఞానాన్ని హెగెల్ తన పరిధిలోకి తీసుకుని విశ్లేషించాడు. పూర్వ తాత్విక వాదాలను ఖండించాడు. వాటిని సమన్వయిస్తూ, నూతనభాష్యాలు చెబుతూ ఒక బ్రహ్మాండమైన సిద్ధాంత వ్యవస్థను నిర్మించాడు.

విజ్ఞాన శాస్త్రాలలో కోపర్నికస్ తీసుకు వచ్చిన విప్లవం లాంటిది తాను తత్వశాస్త్రంలో తీసుకువచ్చానని కాంట్ చెప్పుకున్నాడు. హెగెల్ ఇంకా ముందుకు పోయాడు. తనకు పూర్వులైన తత్వవేత్త లందరిలోని వైరుధ్యాలను సమన్వయించి ఒక నూతన సిద్ధాంతాన్ని తాను ప్రతిపాదించడమేకాక, తత్వశాస్త్రానికి తన సిద్ధాంతం పరాకాష్ఠ అని, తన తర్వాత ఎవరైనాసరే, చెప్పదగిందేమీ లేదని అన్నాడు.

## నిరంతర జిజ్ఞాస

హెగెల్ పూర్తి పేరు గెవోర్గ్ విల్‌హెల్మ్ ఫ్రీడ్రిక్ హెగెల్. జర్మనీలోని స్టుట్‌గార్ట్‌లో 1770 అగస్టు 27 వ తేదీన జన్మించాడు. తండ్రి వుర్టెంబర్గ్ ప్రభుత్వంలో ఉద్యోగి. అప్పటిలో ప్రభుత్వోద్యోగు లందరివలెనే తండ్రి కూడా గుమాస్తా మనస్తత్వాన్ని నరనరానా జీర్ణించుకున్నాడు. అంటే పై అధికారి ఏం చెబితే దాన్ని వేదవాక్కులా శిరసావహించడం, అధికార యంత్రాంగంలో ఒక చిన్న మరమేకువలె పడివుండడం, ప్రభుత్వంపట్ల వినయవిధేయతలతో ప్రవర్తించడం. తండ్రి ప్రభావం తనయుని సిద్ధాంతంలో లీలగా గోచరిస్తుందని కొందరు హేళనగా అంటారు.

హెగెల్ ట్యూబిన్‌గెన్ యూనివర్సిటీలో చదువుకున్నాడు. ప్లేటో, అరిస్టాటిల్ గ్రంథాలు, సొఫోక్లీజ్ నాటకాలు చదివాడు. రూసో, కాంట్ సిద్ధాంతాలతో ప్రభావితుడయ్యాడు. నిరంతర పఠనంతో పుస్తకాల పురుగుగా పేరు తెచ్చుకున్నాడు. తనకు ఆసక్తి కలిగించిన ప్రతి విషయం మీద దస్తాల కొద్దీ నోట్సు వ్రాసుకునేవాడు. తరవాత కాలంలో మహా తత్వవేత్తగా పేరు తెచ్చుకున్న హెగెల్ 1793 లో ట్యూబిన్‌గెన్ యూనివర్సిటీలో పట్టభద్రుడై తత్వశాస్త్రంలో చాలా వెనుకబడిన విద్యార్థి అనే సర్టిఫికెట్ పుచ్చుకుని మరీ బయటికి వచ్చాడు.

## విప్లవదశ

అప్పటికి ఫ్రాన్సులో విజృంభిస్తున్న విప్లవాన్ని యూరప్‌లోని మేధావులు, రచయిత లందరివలెనే హెగెల్ కూడా రెండు చేతులా ఆహ్వానించాడు. మానవ చరిత్రలో ఒక కొత్త శకానికి నాందిగా, స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాత్రం అనే ఆదర్శాలను నిజంచేసే పరిణామంగా ఫ్రెంచి విప్లవాన్ని అతడు సంభావించాడు. ఆ ఉత్సాహంతో ట్యూబిన్‌గెన్ బజారులో ఒక "స్వేచ్ఛా వృక్షం" నాటాడు కూడా.

పట్టభద్రుడైన తర్వాత బ్రతుకు తెరువుకోసం కొన్నేళ్లు బెర్న్‌లోను, ఫ్రాంక్‌ఫర్ట్‌లోను స్విస్, జర్మన్ కుటుంబాలకు ట్యూటర్‌గా పనిచేశాడు. తండ్రి 1799 లో చనిపోతూ ఇతనికి 1500 డాలర్లు ఆదాయం వచ్చే ఆస్తి ఇచ్చాడు. సుఖ జీవనానికి అది సరిపోతుంది. అది పుచ్చుకుని ఎక్కడ స్థిరపడడమా అని ఆలోచిస్తుండగా యేనా యూనివర్సిటీలో అప్పటికే పనిచేస్తున్న సహాధ్యాయి, ప్రఖ్యాత తత్వవేత్త షెల్లింగ్ ఆహ్వానించాడు. యేనా అప్పటిలో ఎందరో మేధావులకు కేంద్రంగా వుండేది. ప్రసిద్ధ జర్మన్ నాటకకర్త షిల్లర్, ఇంకొక ప్రముఖ తత్వవేత్త ఫిక్టె కూడా ఆ రోజులలో అక్కడ వుండేవారు.

(కాంట్ తాత్విక వారసులుగా ఫిక్టె, షెల్లింగ్, హెగెల్– ఈ ముగ్గురిని పేర్కొంటారు. అందరిలోకి ప్రసిద్ధుడు హెగెల్).

## మోహం మొత్తిన విప్లవం

హెగెల్ 1801 లో యేనా వెళ్లాడు. రెండేళ్ల తర్వాత యూనివర్సిటీలో ప్రొఫెసరుగా చేరాడు. అప్పటికి ఫ్రెంచి విప్లవంపట్ల యూరప్‌లో అందరికీ ముఖం మొత్తింది. మానవ స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాత్రాలకు పునాది వేస్తుందని ఆశ పెట్టుకున్న విప్లవం రక్తపు టేరులు పారించింది. రాచరికపు నిరంకుశత్వం పోయి మరొక నిరంకుశత్వం వచ్చింది. నెపోలియన్ యూరప్‌ను పాదాక్రాంతం చేసుకొనడానికి దండయాత్రలు ప్రారంభించాడు. ప్రష్యాను కబళించడానికి నెపోలియన్ దండెత్తి వచ్చాడు. 1806 లో యేనావద్ద జరిగిన యుద్ధంలో ప్రష్యా ఓడిపోయి నెపోలియన్‌కు దాసోహం అన్నది. ఫ్రెంచి సైనికులు హెగెల్ ఇంటిలో చొరబడ్డారు. హెగెల్ తన గ్రంథాలు, రచనలు చేతపట్టుకుని పలాయితుడయ్యాడు.

కొన్నాళ్లు బికారిలా తిరిగాడు. కొన్నాళ్లు బాంబెర్గ్‌లో ఒక పత్రికకు సంపాదకుడుగా పనిచేశాడు. ఆ తర్వాత 1812 లో న్యూరెంబర్గ్‌లో ఒక పాఠశాలకు డైరెక్టరుగా పనిచేశాడు. అక్కడే వివాహితు డయ్యాడు. ఆ రోజులలోనే సుప్రసిద్ధమైన "లాజిక్" అనే ఉద్గ్రంథం రచించాడు. దాని క్లిష్టత చూసి మొత్తం జర్మనీ మంత్ర ముగ్ధమైపోయిందట. దానితో అతడిని హైడెల్‌బర్గ్ యూనివర్సిటీవారు ఆహ్వానించి తత్వశాస్త్రాచార్య పదవి ఇచ్చారని విల్ డ్యురాంట్ వ్రాశాడు. హైడెల్‌బర్గ్‌లో వుండగానే హెగెల్ బ్రహ్మాండమైన మరొక గ్రంథం "ఎన్‌సైక్లోపీడియా అఫ్ ఫిలసాఫికల్ సైన్సెస్" రచించాడు. అది చూసి బెర్లిన్ యూనివర్సిటీ వారు ఆచార్య పదవి ఇచ్చారు.

## పరధ్యానపు ప్రొఫెసర్

హెగెల్ బెర్లిన్‌లో 1818 నుంచి అవసానం వరకు పదమూడేళ్లు గడిపాడు. అతని జీవితంలో చెప్పుకోదగిన గొప్ప విశేషాలేమీ లేవు. వోల్టేర్‌ది ఎంత సాహసోపేత జీవితమో హెగెల్‌ది అంత సాదా సీదా జీవితం. అతడు బాహిరంగా కంటె అంతరంగంలోనే ఎక్కువ జీవించాడు. అతని ప్రపంచమంతా మానసిక ప్రపంచమే.

ఎప్పుడూ రచనలో, బోధనలో మునిగి తేలేవాడు. గుంటలు పడిన కళ్ళతో, చప్పిదవడలతో, వంగిపోయి, అర్భకంగా, అలసిపోయినట్టు కనిపిస్తూ శేషజీవితం

గడిపాడు. ఎప్పుడూ ఆలోచనలలో మునిగి తేలుతూ పరధ్యానపు ప్రొఫెసర్‌గా పేరుపడ్డాడు. తన సిద్ధాంత వ్యవస్థ ప్రపంచ తత్వ శాస్త్ర పరాకాష్ఠ అయితే, తాను నివసిస్తున్న ప్రష్యారాజ్య వ్యవస్థ మానవ రాజకీయ చరిత్రలో ఆదర్శ ప్రాయమైన అంతిమ పరిణామ దశగా ప్రస్తుతించాడు. తనను అంత ఘనంగా కీర్తించినందుకు ప్రష్యా ప్రభుత్వం కూడా హెగెల్‌ను అంతే ఘనంగా సత్కరిస్తూ వచ్చింది. "సర్కారీ తత్వవేత్త" (ఆఫీషల్ ఫిలాసఫర్)గా అతనికి నిక్‌నేమ్ కూడా వచ్చింది.

బెర్లిన్ నగరాన్ని 1831 లో కలరావ్యాధి ముట్టడించింది. హెగెల్‌కు ఆ వ్యాధి సోకింది. ఒక్కరోజే మంచంమీద వున్నాడు. ఆ మర్నాడు (నవంబరు 14వ తేదీన) ప్రశాంతంగా నిద్రలోనే అంతమ శ్వాస విడిచాడు.

# హెగెల్ పారభౌతిక తత్వ చింతన

హెగెల్ తాత్విక చింతన అతి జటిలమైనదని అనుకున్నాము. అది అసంఖ్యాకమైన కొమ్మలు, రెమ్మలతో, ఆకులు, పువ్వులు, కాయలతో కూడిన మహావృక్షం లాంటిది. ఎంత చెప్పినా, ఇంకా చెప్పవలసింది వుంటుంది. ఎంత అర్థం చేసుకున్నా అర్థం చేసుకోవలసింది ఇంకా వుంటుంది.

"హెగెల్ తన తత్వచింతనలో ఉపయోగించిన భాషను, పరిభాషను వదిలిపెట్టి దాని సారాంశాన్ని మాత్రమే వివరిస్తే దానిలోని సూక్ష్మమైన అనేక వివరాలు పోతాయి. పోనీ అతని భాషను, పరిభాషను యథాతథంగా ఉపయోగించి వివరించాలంటే అదేమో అర్థంకాకుండా పోతుంది"- అని ప్రొఫెసర్ లీవెన్‌బెర్గ్ అనే ఆయన అన్నాడు. హెగెల్ చింతన పాశ్చాత్య పారభౌతిక శాస్త్రానికే కాక, జటిలత్వానికి కూడా పరాకాష్ఠ.

పోతే ఇక తెలుగులో హెగెల్ చింతనను విశదీకరించడం ఇంకా కష్టం. పాఠకులకు ఈ హెచ్చరిక చేయడం జరిగింది కనుక తెలుగులో సాధ్యమైనంత సంగ్రహంగా, సరళంగా కొన్ని విశేషాలను మాత్రమే చెప్పడానికి ఈ ప్రయత్నం.

## తత్వ ప్రయోజనం

తత్వశాస్త్రపు ప్రయోజనం ఏమిటి? దాని కర్తవ్యం ఏమిటి?

ప్రపంచపు వాస్తవ తత్వం గురించి తత్వశాస్త్రం చెప్పాలి. దాని సంపూర్ణ సత్యాన్ని వివరించాలి. అదే దాని ప్రయోజనం, కర్తవ్యం.

ప్రపంచానికి ఆధారభూతమైన అసలు సత్యం మానవ మేధకు అందని

విషయమని కాంట్ అన్నాడు. అది అజ్ఞేయమని, తనలో తాను వుండే-విషయమని (Thing-in-itself) అన్నాడు. అందుచేత భౌతిక ప్రపంచానికి అతీతం, దానికి కారణంఅయిన సత్యాన్ని కనుగొనడానికి జరిగే ప్రయత్నం వృథా అని, పారభౌతిక శాస్త్రం (మెటఫిజిక్స్) అసంభవమని అన్నాడు.

హెగెల్ ఈ వాదంతో ఏకీభవించలేదు. పారభౌతిక తత్వం జ్ఞేయమేనని, పారభౌతిక శాస్త్రం సాధ్యమేనని అతడు భావించాడు.

లోకంలో అనేక వస్తువు లున్నాయి. వాటిని మనం వేరు వేరుగా, దేనికది విడివిడిగా వుండేవిగా చూస్తాము. కాని, నిజానికి ప్రపంచం ఒకదానితో ఒకటి సంబంధం లేని విడివిడి వస్తువుల సమూహం కాదు. ప్రపంచం పరస్పర సంబంధం లేని ప్రత్యేక వస్తువుల రాశి అని భావించడం ఒక భ్రమ. ప్రపంచం ఒక సంయుక్త పదార్థం, ఒక ఏకత్వం (Unity), ఒక సంపూర్ణత్వం (Whole).

## ఆంగిక సంబంధం

ప్రపంచంలోని వస్తువులు దేనికది విడివిడిగా, స్వతంత్రంగా లేవు. ఒక దానితో ఒకటి అంగిక (Organic) సంబంధం కలిగి వున్నాయి. అవి మిథ్య కాదు. మాయకాదు. నిజంగా వున్నాయి. కాని, అవి సంపూర్ణ వాస్తవాలు కావు; పాక్షిక వాస్తవాలు. సందర్భాన్నిబట్టి వాటిలో కొన్ని ఎక్కువ వాస్తవాలు,కొన్ని తక్కువ వాస్తవాలు.

ప్రపంచ వస్తువులు సంపూర్ణ సత్యంలోని, లేదా, సర్వ సంపూర్ణత్వంలోని అంతర్భాగాలు. అటువంటి అంతర్భాగాలుగానే వాటికి అస్తిత్వం వుంది, వాస్తవత్వం (reality) వుంది.

హెగెల్ చెప్పిన ఈ విషయాన్ని వివరించడానికి రస్సెల్ ముతక ఉపమానాలంటూ కొన్ని ఉదహరించాడు.

అటువంటిదే మరొక ముతక ఉదాహరణ :- ఒక కుర్చీని తీసుకోండి. దానికి నాలుగు కాళ్లుంటాయి. కూర్చునేందుకు ఒక చెక్క, అనుకోడానికి ఒక చెక్క వుంటాయి. అవన్నీ కలిస్తేనే కుర్చీ అవుతుంది. అయితే, కుర్చీలోని విడిభాగా లన్నిటిని కట్టకట్టి పడేస్తే అది కుర్చీ కాదు. ఆ విడిభాగాలను ఒకానొక ఆలోచనతో, ఒక క్రమంలో, ఒక పద్ధతిలో అమర్చితేనే అది కుర్చీ అవుతుంది. ఊహలో ఏ భాగానికి ఆ భాగాన్ని విడదీసి చూడవచ్చు. అయా విడి భాగాలు లేని కుర్చీని ఊహించలేము కూడా. కాని అవన్నీ ఒక క్రమంలో అమరి వుండాలి. అంటే కుర్చీకి, దాని భాగాలకు అంగికమైన (organic) సంబంధం వున్న దన్నమాట.

## హేతు బద్ధత

కుర్చీలో ఆయాభాగాలు అమరివున్న విధానం వెనుక ఒక ఆలోచన (thought) వున్నది. ఒక హేతువు (reason) వున్నది. ఒక తర్కం (logic) వున్నది. ఒక క్రమం (order) వున్నది. అవన్నీ వున్నదే- అంటే ఆలోచన, భావం, హేతువు, తర్కం, క్రమం వున్నదే- వస్తువు అవుతుంది. వాస్తవం (real) అవుతుంది.

కుర్చీని మనిషి తయారుచేస్తాడు కనుక, మనిషి హేతుబద్ధంగా ఆలోచిస్తాడు కనుక, కుర్చీవంటి వస్తువులు మాత్రమే హేతుబద్ధమైనవి అనుకోవక్కరలేదు. ప్రపంచంలోని చేతనా చేతన వస్తువు లన్నింటిలోను హేతుబద్ధత, తర్కబద్ధత వున్నాయి. అలా వుండడంవల్లనే అవి యథార్థ వస్తువు లవుతున్నాయి.

మానవ శరీర నిర్మాణాన్ని తీసుకోండి. కాళ్లూ, చేతులూ, కళ్లు, ముక్కు, చెవులు, గుండె, మెదడు ఇలా ఎన్నో విడి భాగాలు ఒకానొక పద్ధతిలో, క్రమంలో అమరివుంటేనే మానవ శరీరం ఏర్పడుతుంది. ఆ క్రమం వెనుక హేతుబద్ధత వున్నది. ఆ హేతుబద్ధతవల్లనే అది మానవశరీరం అవుతున్నది. దానికి వాస్తవత్వం సిద్ధిస్తున్నది.

గ్రహవ్యవస్థను తీసుకోండి. సూర్యుడిచుట్టూ గ్రహాలు ఒకానొక క్రమంలో, నియమిత దూరాలలో, నియమిత వేగాలలో, నియమిత కక్ష్యలలో, నియమిత ద్రవ్యరాశితో తిరుగుతున్నాయి. ఈ క్రమంలో ఏ ఒక్కటి లోపించినా సౌర గ్రహ వ్యవస్థ ఏర్పడదు. గ్రహవ్యవస్థ వాస్తవంగా వున్నది కనుక దానిలో ఒక క్రమం కూడా యథార్థంగా వున్నది, ఆ క్రమం వెనుక హేతుబద్ధత వున్నది. ఇలాగే, అణువు నుంచి బ్రహ్మాండం వరకు, సమస్త భౌతిక ప్రకృతిలోను, మానవుని ఆలోచనలలోను, మానవ చరిత్రలోను, సంఘ వ్యవస్థలోను అన్నిటిలోను హేతుబద్ధత (reason) వున్నది. కనుకనే అవి వాస్తవా లవుతున్నాయి.

## సాపేక్ష వాస్తవాలు

ప్రపంచంలోని ఏ వస్తువు దానికదే ఏకైక యథార్థం కాదు, సంపూర్ణ యథార్థం కాదు. అన్నీ సాపేక్ష యథార్థాలే, పరిమిత వాస్తవాలే. కుర్చీలోని విడిభాగాలతో పోలిస్తే కుర్చీ ఒక సంపూర్ణ వాస్తవంగానే భాసిస్తుంది. కాని, కుర్చీ తయారు కావడానికి చేసేవాడు కావాలి. ఇంకా ఎన్నో వస్తువులు కావాలి. అలాగే ప్రకృతిలోని ఏ వస్తువును తీసుకున్నా, అది రూపొందడానికి ఎన్నో ఇతర వస్తువులు కావాలి. అందుచేత అన్ని వస్తువులు పాక్షిక వాస్తవాలే.

అలాగే మన ఆలోచనలుకూడా. ఆలోచనలు దేనికవి స్వతంత్రంగా రావు.

హేతువు (Reason) ఏవీ స్తబ్ధం కావు. అవి పరివర్తన చెందుతాయి, పరిణామం చెందుతాయి, ముందుకు పోతాయి.

ఈ పరివర్తన, పరిణామం ఎలా జరుగుతుందో వివేచించాలి. పురోగమనం అంటే- ఏదైతే అవిభాజ్యంగా ఒకటిగా వుంటుందో అది మార్పుచెందుతుంది. తనకు వ్యతిరేకమైన రూపం ధరిస్తుంది. ఆ వ్యతిరేకత, లేదా వైరుధ్యం నుంచి ఏకీకృతమైన వస్తువు వస్తుంది. ఏకీకృతత్వం (unification) లో వైరుధ్యాలు సమన్వయం చెందుతాయి. ఇది పరిణామపు ప్రతి దశలోను జరుగుతుంది. అందుచేత వాస్తవం (reality) అనేది ఒక సంయుక్తత (a unity).

పరిణామ క్రమంలో క్రింది దశ తన వాస్తవత్వాన్ని పై దశలో సాక్షాత్కారింప జేసుకుంటుంది, క్రింది దశ పైదశకోసమే పైదశవైపు పురోగమిస్తుంది. క్రింది దశకు అర్థం, గమ్యం పై దశే.

పరిణామంలో ఆవిష్కృతమయ్యే ప్రతి దశలోను దాని క్రింది దశలన్నీ గర్భితంగా వుంటాయి. ప్రతి పై దశ తన క్రింది దశలన్నిటిని సమన్వయం చేసుకుని తనకంటె పై దశ వైపు పురోగమిస్తుంది. ఈ పరిణామం అనంతంగా సాగుతుంది. చివరికి ఏ చరమదశలో అనంతమైన పరిణామదశలు, సమస్తమైన వైరుధ్యాలు సమన్వయమై, అదే సమయంలో దానిలో అంతర్నిహితమై, నిరపేక్షమై వుంటాయో అదే కేవలత్వం (Absolute).

## గతితర్కం

ఈ పరిణామం గతి తార్కిక పద్ధతిలో జరుగుతుందని హెగెల్ ప్రవచించాడు. డయలెక్టిక్ అనే మాటకు గతితర్కం అనేది తెలుగులో రూఢమై చాలాకాలంగా వాడుకలో వుంది. డయలెక్టిక్‌ను గతి తర్కం అని మొదటగా అనువదించినవారు మార్క్సిస్టులే ననుకుంటాను. గతి అంటే గమనం, కదలిక (movement). దానికి సంబంధించిన తర్కం కనుక గతి తర్కం అనేది చక్కని అనువాదం.

డయలెక్టిక్‌లో వాదం, ప్రతివాదం అనే రెండు వుంటాయి. ఈ రెండింటి మధ్య సంఘర్షణవల్ల సాగే తర్కం కనుక తెలుగులో దాన్ని ద్వంద్వ తర్కం అని కూడా అంటున్నారు. కాని డయలెక్టిక్‌లో వాద, ప్రతివాద, సమన్వయ వాదాలు మూడూ (TRIAD) వుంటాయి కనుక దాన్ని త్రయీ తర్కం అని, లేదా త్రిక తర్కం అని కూడా మరింత అర్థవంతంగా తెనిగించవచ్చు. ఏమైనా గతి తార్కిక వాదం అనేది చాలాకాలంగా వాడుకలో రూఢంగా వున్నది కనుక, దాన్నే ఇక్కడ ఉపయోగిస్తున్నాను.

# హెగెల్ గతితార్కిక వాదం

గతి తార్కిక వాదం హెగెల్‌తోనే ప్రారంభం కాలేదు. గ్రీకు తత్వవేత్తల కాలంనుంచి వున్నది. పార్మెనిడీస్ శిష్యుడు జీనో ఈ వాద పద్ధతికి ఆద్యుడని ప్రతీతి. సోఫిస్టులు ఈ పద్ధతిని విరివిగాను, వెర్రిగాను ఉపయోగించారు.

సోక్రటీస్ గతి తార్కిక వాదానికి పదును పెట్టాడు. ఏథెన్స్ పురవీథులలో పరిచితుడైన ప్రతివాడిని నిలబెట్టి ఏది ధర్మం, ఏది సత్యం, ఏది నీతి, ఏది ధైర్యం, ఏది సౌందర్యం— ఇలా ప్రశ్నలు వేస్తూ సమాధానాలు రాబట్టి, వాటిలోని వైరుధ్యాలను బయటపెట్టి, వాదం కొనసాగించేవాడు.

అతని శిష్యుడు ప్లేటో గతి తార్కిక వాదాన్ని తన డైలాగ్స్‌లో అతి శక్తిమంతంగా ఉపయోగించాడు. ఆధునిక కాలంలో కాంట్, అతని తాత్విక వారసులు గతి తార్కిక వాదాన్ని ఉపయోగించినవారే.

కాని, హెగెల్ చింతనలో గతి తార్కిక వాదం పరిపుష్టమైంది. అతడు దాన్ని పూర్వులవలె వాద వివాదాలకు, ఆలోచనకే కాదు; మొత్తం ప్రపంచానికే అన్వయించాడు. చరాచర జగత్తు సమస్తం -గతితర్క మయమని అతడు భావించాడు.

## త్రయీ తర్కం

మొదట ఒక ప్రతిపాదన చేస్తాము. అది వాదం (Thesis). కాని మానవుడు చేయగలిగిన ఏ ప్రతిపాదన సంపూర్ణ సత్యం కానేరదు. దానిలో కొంత సత్యేతరమైనది కూడా వుంటుంది. అందుచేత దానికి వ్యతిరేక ప్రతిపాదన వెంటనేగాని, క్రమంగాగాని స్ఫురించి తీరుతుంది.

ప్రతిపాదనలో నుంచే దాని వ్యతిరేక ప్రతిపాదన కూడా బహిర్గత మవుతుంది. నాణానికి ఒక వైపు వుండి, రెండవ వైపు లేకుండా వుండదు. అలాగే ప్రతిపాదన వుండి వ్యతిరేక ప్రతిపాదన లేకుండా పోదు. ఆ వ్యతిరేక ప్రతిపాదన ప్రతివాదం (Antithesis) అవుతుంది. ప్రతి వాదానికి ప్రతివాదం వుంటుంది.

వాద, ప్రతివాదాలు సంఘర్షిస్తాయి. అది అనివార్యం. సంఘర్షణ ప్రపంచానికి మూలసూత్రం. సంఘర్షణ లేనిదే ప్రపంచమే లేదు. (గ్రీకు తత్వవేత్త హెరాక్లిటస్ కూడా ఇదే అన్నాడని పాఠకులకు జ్ఞాపకం వుండివుంటుంది.)

వాద, ప్రతివాదాల ఘర్షణ ఫలితంగా అవి సమన్వయమై, వాటిలో నుంచే సమన్వయవాదం (synthesis) వస్తుంది. వాదం, ప్రతివాదం, సమన్వయవాదం- ఈమూడింటి ద్వారా మన ఆలోచనా క్రమం ముందుకు సాగుతుంది.

అయితే, పురోగమనం ఆ సమన్వయ వాదంతో ఆగిపోదు- ఏ సమన్వయ వాదమైనా ఒక ప్రతిపాదనే కనుక, అది తిరిగి వాదం (థీసిస్) అవుతుంది. దానికి తిరిగి ప్రతివాదం (యాంటీ థీసిస్) ఏర్పడుతుంది. ఆ రెండింటి సంఘర్షణ ఫలితంగా వాటిలోని వైరుధ్యాలను తొలగించి, సమన్వయవాదం వెలువడుతుంది. ఆ కొత్త సమన్వయవాదం తిరిగి వాదం అవుతుంది... ఈ విధంగా గతి తార్కికవాద ప్రక్రియ తనంతట తాను అనంతంగా ముందుకు సాగుతుంది.

వాదం, ప్రతివాదం- వీటిలో ఏది నిజం అన్నది ప్రశ్నకాదు. వాదం దృష్టి నుంచి ప్రతివాదం తప్పు. ప్రతివాదం దృష్టినుంచి వాదం తప్పు. చివరికి ఏర్పడే సమన్వయ వాదంలో వాద, ప్రతివాదాల వైరుధ్యం తొలగిపోతుంది.

## క్రింది దశలు, పై దశలు

వాద, ప్రతివాదాల కంటె సమన్వయవాదం ఉన్నత దశ. ఆ ఉన్నత దశలో క్రింది దశలు నిక్షిప్తమై, అంతర్భాగాలుగా వుంటాయితప్ప అంతరించవు.

విత్తనంలో చెట్టు అవ్యక్తంగా వుంటుంది. చెట్టులో విత్తనం తనను తాను వ్యక్తం చేసుకుంటుంది. అలాగే వాద, ప్రతివాదాల భిన్నత్వంలో సమన్వయ వాదవు ఏకత్వం అవ్యక్తంగా వుంటుంది. సమన్వయ వాదవు ఏకత్వంలో వాద ప్రతివాదాల భిన్నత్వం వ్యక్తమవుతుంది.

గతితర్క పురోగమనంలో ఏర్పడే ప్రతి కొత్త సమన్వయవాదంలోను దానికి ముందు వచ్చిన పాత సమన్వయ వాదాలన్నీ విలీనమై వుంటాయి. ఒక సమన్వయ వాదంకంటె దాని తర్వాత వచ్చే సమన్వయ వాదం ఎక్కువ వాస్తవమై వుంటుంది. దానికంటె దాని తర్వాతది ఎక్కువ వాస్తవం, చివరికి ఈ సమన్వయ వాదాలన్నిటిని తనలో నిక్షిప్తం చేసుకున్న అంతిమ సమన్వయ వాదం సర్వసమగ్ర, సంపూర్ణ సత్యం అవుతుంది.

## అస్తి, నాస్తి వైరుధ్యం

హెగెల్ తన "లాజిక్" గ్రంథంలో గతి తార్కిక వాదాన్ని ఇలా ప్రారంభిస్తాడు: ఏది యాథార్థ్యం (Reality) అనే ప్రశ్నకు సమాధానంగా శుద్ధ సత్ (Pure Being) లేదా శుద్ధ అస్తిత్వం (Pure Existence) అని ప్రతిపాదిస్తా మనుకోండి. ఎందుకంటే, ప్రపంచంలో అనంతకోటి వస్తువు లున్నాయి. వీటిలో ఏది అంతిమ వాస్తవం? ఏ ఒక్కటీ కాదు. కాని, వీటన్నిటిలోను కనిష్ఠ సామాన్య గుణిజం లాంటిది ఒకటి వుంది అది అస్తిత్వం--ఉండడం-- అనేది. అందుచేత శుద్ధ సత్, శుద్ధ అస్తిత్వం, కేవలం ఉండడం అనేది అంతిమ యాథార్థ్యం అని ప్రతిపాదిస్తా మనుకోండి.

అయితే, శుద్ధ అస్తిత్వానికి ఏ లక్షణాలు వుండవు, అది నిర్గుణం అన్న మాట. మరి ఏ లక్షణాలు, ఏ గుణాలు లేని దాన్ని గురించి ఆలోచన ఎలా సాధ్యం? అది లేని దానితో సమానమే కదా? అందుచేత అంతిమ యాథార్థ్యం నాస్తిత్వం (Nothingness) లేకపోవడం కావాలి. కాని, అదే యాథార్థ్యం (Reality) అంటున్నాము కనుక లేకపోవడం అనేది కూడా వున్నదన్నమాట.

మరి ఇది వైరుధ్యం కాదా? యాథార్థ్యం వున్నది, లేనిది కూడా ఎలా అవుతుంది? ఈ సమస్యకు పరిష్కారం ఏమిటి? దీనికి సమన్వయంగా హెగెల్ పరివర్తన (Becoming) ను ప్రతిపాదిస్తాడు. అంటే వున్నది లేనిదిగా పరివర్తన చెందుతున్న దన్నమాట. యాథార్థ్యం అనేది క్రిందటి క్షణంలో తాను ఏది కాదో, ఈ క్షణంలో అది అవుతున్నది; ఈ క్షణంలో తాను ఏది అయిందో, మరు క్షణంలో అది కాకుండా పోతున్నది. అంటే యాథార్థ్యం తాను తానుగా వుంటూ, తాను కానిదిగా పరివర్తన చెందుతున్నది. ఆ విధంగా అస్తికి, నాస్తికి సమన్వయంగా పరివర్తన (Becoming)ను హెగెల్ ప్రతిపాదించాడు.

కాని, యాథార్థ్యం మారుతున్నదంటే, పరివర్తన చెందుతున్నదంటే, పరివర్తన చెందే వస్తువు ఏదో వుండాలి కదా? ఈ విధంగా గతి తర్కం గహనంగా సాగి సాగి, హెగెల్ బహుళత్వం, వైవిధ్యం, ఏకత్వం, రాశి, గుణం, కొలత– మొదలైన పెక్కు వాదాలను ప్రతిపాదిస్తూ పోతాడు. ఈ వాదాలన్నీ ఇంతకు ముందు పేర్కొన్న త్రయీతర్క (Triad) పద్ధతిలో - అంటే వాద, ప్రతివాద, సమన్వయ వాదాల గతి తర్క పద్ధతిలో - కొనసాగుతాయి.

గతి తార్కికమైన ఆలోచనా క్రమంలో ఒక దానికంటె ఒకటి ఉన్నతమైన సమన్వయ భావాలు సిద్ధిస్తాయని ఇంతకుముందు అనుకున్నాము. ఆలోచన, వాస్తవ ప్రపంచం ఒకటే కనుక, ఆలోచనకు వర్తించే ఈ సూత్రం వాస్తవ ప్రపంచానికి కూడా వర్తిస్తుంది.

## కేవల భావం

చివరికి విశ్వంలోని సమస్త ద్వంద్వాలమధ్య, పాక్షిక వాస్తవాల మధ్య గల వైరుధ్యాలన్నీ పరిష్కారమై, వాటినన్నిటిని తనలో నిక్షిప్తం చేసుకున్న ఏ అంతిమ సమన్వయవాదం-(Ultimate synthesis-)సిద్ధిస్తుందో, దాన్ని హెగెల్ సర్వసమగ్ర సంపూర్ణ సత్యంగా భావించాడు. దానికి కేవలత్వం, లేదా కేవల భావం (The Absolute లేదా Absolute Idea) అని పేరు పెట్టాడు. పరమాత్మ అనండి, బ్రహ్మపదార్థ మనండి, ఏ పేరు పెట్టినా అ కేవల భావమే. దానినే హెగెల్ దైవం అని కూడా పేర్కొన్నాడు.

కేవల భావంలో, లేదా దైవంలో వాస్తవ ప్రపంచపు గతి తార్కిక పరిణామం అంతా గర్భితమై వుంటుంది. దీని అర్థం ప్రపంచ సృష్టి నిత్యం, అనాది, అనంతం. అది ఎప్పుడూ వున్నది. సృష్టి దేవుని బాహ్య రూపం. సృష్టి లోని హేతుబద్ధత (Reason) గా, అంతస్సూత్రంగా దైవం, లేదా కేవలభావం తనను తాను అంతకంతకు ఉన్నతమైన దశలలో అభివ్యక్తం చేసుకుంటుంది. పరిణామం చెందుతూ పురోగమిస్తుంది.

అందుచేత విశ్వంలేనిదే దాని అంతస్సూత్రం లేదు, అంతస్సూత్రం లేనిదే విశ్వం లేదు. విశ్వం, దానిలోని అంతస్సూత్రం, దానిలోని కేవల భావం, దైవం అన్నీ ఒకటే.

## విశ్వమే దైవం

విశ్వంలో, విశ్వ పరిణామంలో కేవల భావం తనను తాను అంతకంతకు అధికాధికంగా, ఉన్నతోన్నత దశలలో వ్యక్తం చేసుకుంటూ పోతుంది. కేవల భావానికి స్వీయ వ్యక్తీకరణమే (Self manifestation) విశ్వం. విశ్వమే దైవం.

కేవల భావం బాహ్యప్రకృతి (Nature) లో, చరిత్రలో, మానవ సమాజ పరిణామంలో, మానవుని ఆలోచనలో తనను తాను వ్యక్తం చేసుకుంటూ సంపూర్ణమైన స్వీయ జ్ఞానం (Self-Consciousness) వైపు పురోగమిస్తుంది. బాహ్య ప్రకృతి, చరిత్ర, మానవ సమాజం, మానవుని ఆలోచన- ఇవన్నీ లేకపోతే కేవలభావం తనలో తాను (in-itself) వుండిపోతుంది. బాహ్య ప్రకృతి మొదలైన వాటిద్వారా అది తన వెలుపల (out - of - itself) వుంటుంది. ఒకే సమయంలో తాను తన లోపల, తన వెలుపల వుండడం మధ్య వైరుధ్యం అంతిమ దశలో సమన్వయమై తన కొరకు తాను (for-itself) వుంటుంది. అంటే తనను గురించి తాను పూర్తిజ్ఞానం, సంపూర్ణ స్వీయస్పృహ కలిగివుంటుంది.

హెగెల్ "లాజిక్" గ్రంథం విశ్వపరిణామ లక్ష్యమైన "కేవల భావం"తో ముగుస్తుంది. కేవల భావం శుద్ధ సత్ (Pure Being) గా ప్రారంభమై అనంత దశలను అధిగమించి శుద్ధ చిత్ (Pure Consciousness) గా పర్యవసిస్తున్నది. ఇది స్థాలికంగాను, కాలికంగాను జరిగే పరిణామంగా అర్థం చేసుకోరాదు. తార్కిక పరిణామం మాత్రమే. స్థలం, కాలం స్వతంత్ర వాస్తవాలు కావు. అంతిమ సర్వ సమగ్ర సత్యంలో భాగాలుగానే వాటికి వాస్తవత్వం వున్నది. అంటే అవి పాక్షిక వాస్తవాలు మాత్రమే.

## లాజికల్ దేవుడు

నిర్గుణమైన శుద్ధ సత్—సగుణమైన శుద్ధ చిత్‌గా పరిణమిస్తున్నది. అదే

దైవం. హెగెల్ ఊహించిన దైవానికి అరిస్టాటిల్ ఊహించిన దైవానికి కొన్ని పోలిక లున్నాయి. అరిస్టాటిల్ కూడా దేవుడిని "ఆలోచన గురించి ఆలోచించే ఆలోచన" (Thought thinking about Thought) అని వర్ణించాడు. హెగెల్ దేవుడు కూడా అంతే. శుద్ధ చిత్ అంటే కేవల స్పృహ. అది కానిది ఏదీ లేదు. కనుక అది తనను గురించే ఆలోచించాలి. హెగెల్ దేవునికి యుగాలుగా తనను గురించి తాను ఆలోచించడం తప్పవేరేపని లేదని, తర్కశాస్త్రపు ప్రొఫెసర్ ఊహించే దేవుడు ఇంతకంటె మరొకలా ఎలా వుంటాడని బెర్ట్రాండ్ రసెల్ ఛలోక్తి విసిరాడు.

సమస్త విశ్వంలోను ఈ విషయాన్ని తెలుసుకోగలిగింది మానవుని ఆలోచన. మానవుని స్వీయస్పృహలో, ఆలోచనలో విశ్వగతి తార్కిక పరిణామం అంతా ప్రతిబింబిస్తున్నది. కనుక దైవం, లేదా కేవలభావం మానవుని స్వీయ స్పృహలోనే తనను తాను తెలుసుకునే దశకు పురోగమిస్తున్నది. మానవుడు తన పరిమిత (finite) మనస్సు ద్వారా తాను కేవలత్వపు అనంత (infinite) స్వీయ స్పృహలో ఒక భాగమని తెలుసుకుంటాడు.

హెగెల్ సమస్త సృష్టికి, దాని పరిణామ చరిత్రకు, మానవ సమాజానికి సామాజిక సంస్థలకు, కళలకు, అన్నిటికి గతి తార్కిక వాదాన్ని అన్వయించాడు. మానవ సమాజం గతి తార్కిక క్రమంలో తన సాఫల్యం (fulfilment) వైపు పురోగమిస్తున్న దని అతడు భావించాడు. ఈ పురోగమనానికి లక్ష్యం మానవ స్వాతంత్ర్యం, స్వాతంత్ర్య స్పృహ.

## హెగెల్ రాజ్య వ్యవస్థ సిద్ధాంతం

హెగెల్ పారభౌతిక సత్యం కోసం గతి తార్కికంగా సాగించిన అన్వేషణ అంతా ఒక ఎత్తు. గతితార్కిక వాదాన్ని రాజ్యవ్యవస్థకు, చరిత్రకు అన్వయించిన పద్ధతి ఒక ఎత్తు. దానికంటె ఇది ముఖ్యమైనది, వివాదాస్పదమైనది, కొన్నిచోట్ల అభ్యంతరకరమైనది.

కేవల భావమే (Absolute Idea) అంతిమ సత్యమని హెగెల్ తన గతి తార్కికవాదం ద్వారా నిరూపించాడని ఇంతకు ముందు తెలుసుకున్నాము. కేవల భావం తననుతాను తెలుసుకొనడానికి, స్వీయస్పృహ కోసం చేసే ప్రయత్నమే విశ్వ చరిత్ర. విశ్వం, దాని పరిణామ చరిత్ర, మానవ ఆలోచనా వ్యవస్థ - ఇవన్నీ కేవల భావానికి బాహ్యరూపాలు, వాటిలో కేవల భావం తనను తాను వ్యక్తం చేసుకుని తన గురించి జ్ఞానాన్ని (Self - knowledge) తాను పొందుతుంది.

మనం నిర్జీవంగా భావించే అచేతన ప్రకృతిలో కూడా కేవలభావం వ్యక్తమవుతుంది. కాని, తక్కువగా వ్యక్తమవుతుంది. ఆ దశలో దానికి స్వీయస్పృహ వుండదు. తర్వాత దశ సచేతన ప్రకృతి– అంటే వృక్ష ప్రపంచం, జంతు ప్రపంచం, ఆ తర్వాత మానవుడు, మానవ సమాజం, దాని చరిత్ర, కళలు, మతం, తత్వశాస్త్రం. అంతిమంగా రాజ్యవ్యవస్థ (State).

మానవ చరిత్ర అంతిమ లక్ష్యం – మానవ స్వాతంత్ర్యం, స్వాతంత్ర్య స్పృహ. అటువంటి స్వాతంత్ర్య స్పృహ దిశగానే మానవ చరిత్ర అంతా పురోగమిస్తుంది.

## మూడు దశలు

చరిత్రను మూడు దశలుగా హెగెల్ విభాగం చేశాడు. మానవ సమాజ శైశవ దశ ప్రాచ్య దేశాలైన చైనా, ఇండియా, పర్షియా, ఈజిప్టులలో గడిచింది. అవి మానవ నాగరికతకు పుట్టినిళ్లు, అయినా, అవి అపరిణత సమాజాలు. చైనాలో వ్యక్తులకు ప్రాధాన్యం లేదు. చక్రవర్తి ఒక్కడే స్వతంత్రుడు. ఇండియాలో కుల వ్యవస్థ వ్యక్తిని అస్వతంత్రుడుగా చేసింది.

రెండవదైన యౌవనదశ గ్రీసు, రోమన్ సామ్రాజ్యాలలో గడిచింది. గ్రీసులో రాజ్య వ్యవస్థ, కళలు, తత్వశాస్త్రం మరికొంత పురోగమించాయి. ప్రాచ్యదేశాలలో ఒకడే స్వతంత్రుడు. గ్రీసులో కొందరు స్వతంత్రులు. వ్యక్తి స్వేచ్ఛా భావం అంకురించింది. ప్రజాస్వామ్యం వర్ధిల్లింది. అయినా, అది పరిమిత ప్రజాస్వామ్యం. అధిక సంఖ్యాకులు బానిసలై అస్వతంత్రులుగా వుండేవారు. రోమన్ రాజ్యంలో ప్రజాస్వామ్యం బదులు ప్రభుస్వామ్యం వుండేది. కాని, అది గ్రీకుతో పోల్చదగినంత ఉత్తమ వ్యవస్థ కాదు.

## చరిత్ర పరాకాష్ఠ

చరిత్ర తూర్పు నుంచి పడమరకు ప్రయాణం చేస్తూ చివరికి జర్మన్ ప్రపంచాన్ని చేరుకున్నది. అది మూడవ దశ. ప్రాచ్యదేశాలలో నిరంకుశత్వం, గ్రీసులో ప్రజాస్వామ్యం. ప్రాచ్యదేశాలలో ఒకడే స్వతంత్రుడు. గ్రీసులో కొందరు స్వతంత్రులు. జర్మనీలో అందరు స్వతంత్రులు. మానవ చరిత్ర, రాజ్యవ్యవస్థ హెగెల్ స్వదేశమైన జర్మనీలో, అందులోను ప్రష్యాలో పరిపూర్ణత పొందాయి.

ప్రాచ్యదేశాల దశ థీసిస్ అయితే, గ్రీసు యాంటీథీసిస్. వాటికి–నిరంకుశత్వానికి, ప్రజాస్వామ్యానికి – సమన్వయదశ అయిన రాజరికపు ప్రష్యా సింథెసిస్! ఇది హెగెల్ తన "ఫిలాసఫీ ఆఫ్ హిస్టరీ" అనే ఉద్గ్రంథంలో చేసిన ప్రతిపాదన.

ఈ విచిత్ర ప్రతిపాదనను రస్సెల్ హేళనచేస్తూ ఈ అనంత విశ్వం అంతటా నిబిడీకృతమైన – దైవస్వరూపమైన – కేవల భావం స్వయం వ్యక్తీకరణకు (Self - manifestation) కు మన భూలోకాన్నే ఎందుకు ఎంచుకో వలసివచ్చిందో, అందులోను మధ్యధరా సముద్రానికి సమీప ప్రాంతంలో ఈ పరిణామమంతా ఎందుకు జరిగిందో అర్థం కావడంలేదంటాడు. విశ్వం హెగెల్ నుంచి తత్వశాస్త్ర పాఠాలు నేర్చుకుంటున్నదేమో అంటాడు.

## రాజ్య వ్యవస్థ

మానవ చరిత్రకు లక్ష్యం మానవ స్వాతంత్ర్య స్పృహ అయితే, దాన్ని చేరుకొనడానికి ఏకైక సాధనం రాజ్య వ్యవస్థ అని హెగెల్ ప్రతిపాదించాడు. హెగెల్ రాజ్య సిద్ధాంతం (Philosophy of State) విచిత్రంగా, విడ్డూరంగా వుంటుంది. ప్రభుత్వాధికారాన్ని కిమ్మనకుండా పూర్తిగా శిరసావహించడంలోనే వ్యక్తికి స్వాతంత్ర్యం లభిస్తుందని గతితార్కికవాదం ద్వారా నిరూపించడానికి హెగెల్ ప్రయత్నించాడు. ప్రభుత్వానికి సంపూర్ణ విధేయతే సంపూర్ణ స్వాతంత్ర్యమని అతడు విశ్వసించాడు. వ్యక్తి స్వేచ్ఛ, ప్రభుత్వాధికారం—ఈ రెండూ పరస్పర విరుద్ధంగా కనిపిస్తాయిగాని, వాటి సమన్వయంలోనే వ్యక్తికి స్వీయ స్వాతంత్ర్య స్పృహ లభిస్తుందని అంటాడు.

హెగెల్ యౌవనకాలంనాటికి ఫ్రాన్సులో విప్లవం ప్రారంభమైంది. యూరప్ లోని పలువురు మేధావుల వలెనే అతడు కూడా ఫ్రెంచి విప్లవాన్ని హర్షించాడు. ఫ్యూడల్ నిరంకుశత్వానికి అది గోరీ కట్టబోతున్నదని, మానవాళికి నిజంగానే మంచి కాలం రహించబోతున్నదని ఆశించాడు. కాని, ఫ్రాన్సులో జరిగిన రక్తపాతం, ఒక నిరంకుశత్వం స్థానంలో మరొక నిరంకుశత్వం రావడం చూసి ఆశాభంగం చెందాడు. విప్లవం పట్ల అతనికి ఏవగింపు పుట్టింది. చివరికి నెపోలియన్ యూరప్‌ను ఫ్రాన్సుకు పాదాక్రాంతం చేయడానికి దండయాత్రలు సాగించాడు. జర్మనీతో సహా యూరపియన్ దేశాలకు సంకెళ్లు వేశాడు. ఈ పరిణామం పట్ల కలిగిన వైముఖ్యంలోనుంచి, ఆశాభంగంలో నుంచి హెగెల్ రాజ్య సిద్ధాంతం ఆవిర్భవించిందని కొందరు వ్యాఖ్యాతలు అభిప్రాయపడ్డారు.

## రాజ్యం ఎలా వచ్చింది ?

అసలు రాజ్యం అనేది ఎలా ఏర్పడింది? "ఏకాకి న రమతే" అని బృహదారణ్యకం పేర్కొన్నట్టుగా. ఏకాకిగా వున్న మనిషి మానవుడే కాడు. స్వతంత్రుడు కాడు. వివాహ ఫలితంగా మనషి ఒక కుటుంబంలో భాగస్వామి అయినప్పుడే

మానవు డనిపించుకుంటాడు. స్వతంత్రుడవుతాడు. ఏకాకి అయినప్పుడు, అతడు తనలో తాను జీవిస్తాడు. అతని భౌతిక అవసరాలు కాని, మానసిక, ఇతర అవసరాలు కాని తీరవు. భార్య, పిల్లల కోసం, కుటుంబ యోగక్షేమాల కోసం జీవించినప్పుడే అతని మానవత్వానికి సార్థకత కలుగుతుంది. ఏక వ్యక్తికంటే కుటుంబం పై మెట్టు.

అయితే, కుటుంబ వ్యవస్థలో కూడా మానవునికి పరిపూర్ణత సిద్ధించదు. ఏ వ్యక్తికి ఆ వ్యక్తి తన స్వార్థంకోసం తాను జీవిస్తే ఏ విధంగా వ్యక్తి స్వాతంత్ర్యం లుప్తమై పోతుందో, అదేవిధంగా ఏ కుటుంబానికి ఆ కుటుంబం తనకోసం తాను జీవించడంవల్ల సంఘర్షణ ఏర్పడుతుంది. అది వినాశనానికి దారితీస్తుంది. కుటుంబ వ్యవస్థలో వ్యక్తి (భర్తకాని, భార్య కాని) కొంత స్వార్థాన్ని వదలుకుని, ఒకరొకరి బాగోగుల కోసం జీవించడం ప్రారంభించినప్పటికీ, అనేక కుటుంబాలు ఏర్పడినపుడు వాటిమధ్య స్వార్థం కారణంగా ఘర్షణలు అనివార్యం.

ఆ ఘర్షణకు సమన్వయంగా విధిగా సభ్య సమాజం, లేదా పౌర సమాజం (Civil Society) ఏర్పడుతుంది. అటువంటి పౌర సమాజంలో వ్యక్తి తన స్వార్థాన్ని మరింతగా త్యాగం చేస్తాడు. ఇతర వ్యక్తుల గురించి, కుటుంబాల గురించి ఆలోచిస్తాడు. సొంతలాభం కొంత మానుకు పొరుగువాడికి తోడుపడడం నేర్చుకుంటాడు. ప్రజాహితంతో కొంతవరకు తాదాత్మ్యం చెందుతాడు.

## మరొక త్రయం

కాని, పౌర సమాజంలో కూడా వ్యక్తి సంపూర్ణుడు కాడు; స్వతంత్రుడు కాడు, పౌర సమాజం అంగికమైన (Organic) వ్యవస్థ కాదు. అది కుటుంబాల సమూహం మాత్రమే. దానిలో రైతాంగం, భూస్వామ్యవర్గం, వ్యాపారవర్గం మొదలైన విభాగా లుంటాయి. వీటిమధ్య వైరుధ్యం, సంఘర్షణ వుంటాయి. ఈ సంఘర్షణను పౌరసమాజం సమ్వయం చేయలేదు. అప్పుడు ఆ సమన్వయ సాధనకు రాజ్య వ్యవస్థ (State) ఏర్పడుతుంది. కుటుంబం థీసిస్-పౌర సమాజం యాంటీ థీసిస్, రాజ్యం సింతెసిస్.

మానవ స్వాతంత్ర్య భావం సర్వ సమగ్రత్వాన్ని పొందే అంతిమ దశ రాజ్య వ్యవస్థ. రాజ్యవ్యవస్థ లేనిదే మానవ స్వాతంత్ర్య స్పృహ సంపూర్ణం కాదు.

వాస్తవమైన దంతా హేతుబద్ధం, హేతుబద్ధమైన దంతా వాస్తవం అని కదా

హెగెల్ మౌలిక సూత్రం ? కుటుంబం, పౌర సమాజం వాస్తవాలు కనుక అవి కూడా హేతుబద్ధాలైనవే. కాని, అవి పాక్షిక వాస్తవాలు. కనుక పాక్షికంగానే హేతుబద్ధాలు.

వాటికంటె ఉన్నతదశ రాజ్య వ్యవస్థ. అది సంపూర్ణ సత్యం. సంపూర్ణంగా హేతుబద్ధం. కేవల భావానికి, దైవత్వానికి, మానవ స్వాతంత్ర్యానికి రాజ్య వ్యవస్థ బాహ్యరూపం.

## రాజ్యం కోసం రాజ్యం

రాజ్య వ్యవస్థ మరొకదానికి దేనికీ లక్ష్యం కాదు. దానికి అదే లక్ష్యం. రాజ్యం కోసమే రాజ్యం. ప్రజలకోసం, వ్యక్తికోసం రాజ్యం కాదు. రాజ్యం కోసమే ప్రజలు. రాజ్యంకోసమే వ్యక్తి.

ఎందుకంటే వ్యక్తుల వ్యక్తిగత వాంఛలను, స్వార్థాలను రాజ్యం క్రమబద్ధం, హేతుబద్ధం (rationalise) చేస్తుంది. సమన్వయం చేస్తుంది. సమష్టి శ్రేయస్సుకు వ్యక్తీకరణమే రాజ్యం. సమష్టి శ్రేయస్సులోనే తన శ్రేయస్సు ఇమిడివున్నదనే సత్యాన్ని వ్యక్తి రాజ్య వ్యవస్థలోనే గ్రహిస్తాడు. సమష్టి శ్రేయస్సుతో వ్యక్తి తాదాత్మ్యం చెందడం రాజ్య వ్యవస్థలోనే సాధ్యమవుతుంది.

వ్యక్తి స్వేచ్ఛ అనేదాన్ని విడిగా తీసుకుంటే దానికి అర్థం లేదు. రాజ్యశాసనాన్ని శిరసావహించడంలోనే వ్యక్తి స్వేచ్ఛ ఇమిడి వుంది. అందుచేత రాజ్యానికి విధేయుడైన పౌరుడే నిజంగా స్వతంత్రుడు. రాజ్య శాసనాన్ని శిరసావహించడం ద్వారా వ్యక్తి తన శాసనాన్ని తాను శిరసావహిస్తున్నాడు. ఎందుకంటే వ్యక్తులు వేరు, రాజ్యం వేరు కాదు. రాజ్యం శరీరమైతే, వ్యక్తులు దాని అంగాలు. ఈ సంబంధం అంగికమైంది, కనుక హేతుబద్ధమైనది.

అయితే, అన్ని రాజ్యాలు హేతుబద్ధమైనవేనా ? వాటిలో మంచివి, చెడ్డవి లేవా? నిరంకుశమైనవి, ఉదారమైనవి లేవా? ఉండవచ్చు కాని, ఇవి మౌలికమైన ప్రశ్నలు కావు. వాస్తవమైన ప్రతిదీ హేతుబద్ధమైనది. రాజ్యం—అది మంచిదైనా, చెడ్డదైనా— వాస్తవమైనది కనుక హేతుబద్ధమైనది. "కేవల భావం" దానిలో వ్యక్తమవుతుంది.

కనుక దాన్ని తిరస్కరించడానికి, సంస్కరించడానికి దానిపై తిరుగుబాటు చేయడానికి వీలులేదు. రాజ్య శాసనాన్ని ఔదల దాల్చడంలోనే పౌరులు తమ స్వాతంత్ర్యం నిక్షిప్తమై వుందని గ్రహిస్తారు. రాజ్య వ్యవస్థకు వెలుపల వారికి అస్తిత్వమే లేదు.

## నిమిత్తమాత్రులు

చరిత్రలో కొందరు గొప్ప వ్యక్తులుంటారు. అలెగ్జాండర్, జూలియస్ సీజర్, నెపోలియన్ మొదలైనవారు అలాంటి మహా వ్యక్తులు. అయినా, వారు కేవలం వ్యక్తులు కారు. చారిత్రిక శక్తుల చేతిలో వారు నిమిత్తమాత్రులు. చరిత్ర అటువంటివారిని సాధనాలుగా ఉపయోగించుకుని అయా కాలాలలో కేవల స్వాతంత్ర్య స్పృహ దిశగా పురోగమిస్తుంది.

కుటుంబ వ్యవస్థ ఏర్పడినపుడు, అనేక కుటుంబాలు ఏర్పడతాయి. వాటి మధ్య వైరుధ్యాలు సహజం. ఆ వైరుధ్యాలను తొలగించడానికి పౌరసమాజం, రాజ్యం ఏర్పడతాయి. అలాగే రాజ్య వ్యవస్థ ఏర్పడినప్పుడు అనేక రాజ్యాలు అవతరిస్తాయి. వాటిమధ్య సంఘర్షణ ఏర్పడవచ్చు. ఆ సంఘర్షణను సమన్వయం చేయడానికి అన్ని రాజ్యాలతో కూడిన ఒక అధిరాజ్యం (Super State) - ఒక ప్రపంచ రాజ్య సమాఖ్య–ఏర్పడాలి కదా!

ఈ ప్రశ్నను హెగెల్ తిరస్కరిస్తాడు. రాజ్యం అనేది "కేవల"మైనది. తన పౌరుల విషయంలోనే కాదు, ఇతర రాజ్యాల విషయంలో కూడా దాని స్వాతంత్ర్య ప్రతిపత్తికి తిరుగులేదు. అది ఏ ఇతర శక్తికి తలవంచదు. దాని కదే సర్వ సమగ్రం.

అందుచేత ప్రపంచరాజ్య సమాఖ్య, ప్రపంచ ప్రభుత్వం ఏర్పడడానికి వీలు లేదు.

మరి ప్రజారాజ్యం స్వయం సార్వభౌమం అయినప్పుడు వివిధ రాజ్యాల మధ్య సంఘర్షణ, యుద్ధం తప్పవు కదా!

## యుద్ధాలు తప్పవు

అవును, తప్పవనే హెగెల్ అంటాడు. రాజ్యాలు పరస్పరం సంఘర్షించడం, యుద్ధం చేయడం అనివార్యం కావచ్చు. అందులో అసహజం లేదు. అందుకు మనం చేయగలిగింది కూడా లేదు.

అంతేకాదు, హెగెల్ యుద్ధాలను నిరసించడు. వాస్తవమైనది ప్రతిదీ హేతు బద్ధమైనదే అయినప్పుడు యుద్ధం వాస్తవం కనుక అది హేతుబద్ధమే అవుతుంది. దానికి మంచి చెడులతో నిమిత్తం లేదు. ప్రపంచ చరిత్ర యుద్ధాల మయం. యుద్ధాల ఫలితంగా ఒకసారి ఒక రాజ్యం మరొక రాజ్యాన్ని అణచివేస్తుంది. మరొకసారి ఇంకొక రాజ్యానిది పైచెయ్యి అవుతుంది. ఏ కాలంలో ఏ

రాజ్యానిది పైచెయ్యి అవుతుందో, ఆ కాలంలో ఆ రాజ్యం కేవల భావానికి (తాత్కాలికంగానైనా) నిజమైన ప్రతినిధి అవుతుంది. తాను అణచివేసిన, లేదా విలీనం చేసుకున్న రాజ్యాల విషయంలో గెలిచిన రాజ్యం తన పౌరుల విషయంలో తాను ఏ విధంగా వ్యవహరిస్తుందో అలాగే వ్యవహరిస్తుంది.

వివిధ రాజ్యాల ప్రయోజనాల మధ్య ఘర్షణ ఏర్పడినప్పుడు యుద్ధం ద్వారా సమస్యను పరిష్కరించుకోవడం అనివార్యమనే కాక, యుద్ధాన్ని హెగెల్ నైతికంగా కూడా సమర్థిస్తాడు. రాజ్యాలు యుద్ధం చేయడం ఎంతమాత్రం తప్పుకాదని, యుద్ధాలకు నైతిక ప్రయోజనం వుందని అంటాడు.

యుద్ధం వ్యక్తిని ఉన్నతుడిని చేస్తుంది. తన దైనందిన, సంకుచిత స్వార్థ ప్రయోజనాలు ఎంత తుచ్ఛమైనవో, రాజ్య ప్రయోజనాలు ఎంత సమున్నతమైనవో పౌరునికి తెలియజెబుతుంది. రాజ్య ప్రయోజనాలు నిజంగా తన ప్రయోజనాలే కనుక (తాను వేరు, రాజ్యం వేరు కాదు కనుక) రాజ్య ప్రయోజనాల కోసం యుద్ధం చేయడం నిజంగా తన ప్రయోజనాలకోసమేనని వ్యక్తి గ్రహిస్తాడు. ఈ విధమైన తాదాత్మ్యం పొందగల పౌరులున్నప్పుడే ఆ రాజ్యం ఆరోగ్యవంతంగా, శక్తిమంతంగా వుంటుంది.

## యుద్ధాలు అవసరం

యుద్ధాలు అవసరమని కూడా హెగెల్ సూత్రీకరించాడు. అప్పుడప్పుడు యుద్ధాలలో పాల్గొనని రాజ్యం స్తబ్ధమైపోతుంది. కదలికలేని నిలవనీటితో కూడిన తటాకం ఎలా పాడైపోతుందో అలాగే యుద్ధ సంక్షోభాన్ని చవిచూడని రాజ్యం క్షీణించి పోతుంది. యుద్ధం పౌరులలో క్రమశిక్షణను, దేశభక్తిని పెంపొందిస్తుంది. యుద్ధంలో గాయపడడంవల్ల లేదా, చనిపోవడం వల్ల పౌరుని వ్యక్తిత్వం పెరుగుతుంది. వీర మరణం అతనికి వీర "జీవితాన్ని" ప్రసాదిస్తుంది.

హెగెల్ ప్రతిపాదించిన రాజ్య సిద్ధాంతం, యుద్ధాన్ని అతడు సమర్థించిన తీరు చాలా అభివృద్ధి నిరోధకమైన వనడంలో సందేహం లేదు. ఇది అతని గతి తార్కిక వాద పద్ధతి పర్యవసానం. రాజ్యంలోపల నిరంకుశపాలనను, (Totalitarianism), రాజ్యం వెలుపల దురాక్రమణను (aggression) అతని తర్కం సమర్థిస్తున్నది. అది అంగీకరించడానికి వీలులేనిదని పలువురు పండితులు కొట్టి వేశారు.

పోనీ, ఏదో అతని తర్కం అలాంటిది కనుక అలాంటి సిద్ధాంతాలకు దారి తీసింది, అందులో హెగెల్ చేయగలిగిం దేమున్నదని సరిపెట్టుకొనడానికి

వీలులేదు. అతడు తన గతితార్కికవాద సూత్రాలను తానే ఉల్లంఘించాడని రస్సెల్, తదితరులు విమర్శించారు.

ఉదాహరణకు వ్యక్తుల స్వార్థపూరిత సంఘర్షణలను సమన్వయం చేయడానికి అనివార్యంగా రాజ్య వ్యవస్థ ఏర్పడుతుందని చెప్పిన హెగెల్, వివిధ రాజ్యాల మధ్య సంఘర్షణలను నివారించి వాటి పరస్పర ప్రవర్తనను క్రమబద్ధం చేయడానికి ప్రపంచ ప్రభుత్వం ఏర్పడాలన్న వాదాన్ని ఎందుకు సమర్థించలేదు? అంగాల కంటె అంగి గొప్పదనికదా అతని సిద్ధాంతం? రాజ్యాలను అంగాలుగాను, ప్రపంచ ప్రభుత్వాన్ని అంగిగాను అతడెందుకు అంగీకరించలేదు?

బహుశా వాస్తవమైనదే హేతుబద్ధమని హెగెల్ సూత్రం కనుక, ప్రపంచ రాజ్య భావన ఇంకా వాస్తవరూపం ధరించలేదు కనుక, అది హేతుబద్ధం కాదని అనుకోవాలి. ఇది గతితర్కం కావచ్చు కాని మతి వున్న తర్కంకాదని మాత్రం ఘంటాపథంగా చెప్పవచ్చు.

హెగెల్ తత్వబోధలో చాలా లోపాలున్నాయి కాని, అతనికి పాశ్చాత్య తత్వశాస్త్ర చరిత్రలో అత్యున్నత స్థానం వున్నది. ఆధునిక తత్వవేత్తలపై అతని ప్రభావం గణనీయమైంది. ముఖ్యంగా కార్ల్ మార్క్స్‌పై అతని ప్రభావం ఇంతింత నరానిది. హెగెల్ గతితార్కిక భావవాదాన్ని ప్రవచిస్తే, మార్క్స్ గతితార్కిక భౌతికవాదాన్ని వెలయించాడు.



# 29
# నిరాశావాది షోపెన్‌హూవర్

నిరాశావాదాన్ని ఒక తాత్విక సిద్ధాంత స్థాయికి తీసుకుపోవడం ఒక ఘనతే అయితే, ఆ ఘనత నిస్సందేహంగా షోపెన్‌హూవర్‌కి దక్కుతుంది.

ఊరందరిది ఒకదారి, ఉలిపికట్టెది ఒక దారి అని సామెత. నవీనయుగ పాశ్చాత్య తత్వవేత్తలందరు ఎంతో కొంత ఆశావాదులు. వారి మధ్య షోపెన్‌హూవర్ ఒక్కడే— వ్యక్తిగా, తాత్వికుడుగా—పరమ నిరాశావాది.

అర్థర్ షోపెన్‌హూవర్ పోలెండులోని డాన్జిగ్‌లో 1788 ఫిబ్రవరి 22 వ తేదీన జన్మించాడు. తండ్రి హీన్రిక్ షోపెన్‌హూవర్ వర్తకుడు, సంపన్నుడు.

డాన్జిగ్‌ను 1793 లో ప్రష్యా స్వాధీనం చేసుకున్నది. స్వేచ్ఛాప్రియుడైన హీన్రిక్ షోపెన్‌హూవర్ పారతంత్ర్యంలో జీవించడం ఇష్టంలేక డాన్జిగ్‌ను విడిచిపెట్టి స్వతంత్ర నగరమైన హాంబర్గ్‌కి వలసపోయాడు. అప్పటికి అర్థర్‌కి అయిదేళ్లు.

1798-1800 సంవత్సరాలలో అర్థర్ ఫ్రాన్సులో చదువుకున్నాడు. ఫ్రెంచి నేర్చుకున్నాడు. 1803 లో తల్లిదండ్రులతో కలిసి బెల్జియం, ఇంగ్లండు,

ఫ్రాన్సు, స్విట్జర్లాండు, ఆస్ట్రియాలలో పర్యటించాడు. ఆ రోజులలోనే అతని నిరాశావాదానికి బీజాలు పడ్డాయి. నెపోలియన్ దండయాత్రలలో యూరప్ సర్వనాశనమైంది. ఎందరో మరణించారు. ఎందరో క్షతగాత్రులయ్యారు. లక్షలాది ప్రజలు పేదరికంలో మగ్గిపోయారు. పల్లెలు, పట్టణాలు దైన్యానికి, హైన్యానికి ప్రతీకలయ్యాయి. కొన్ని సంవత్సరాలపాటు యూరప్‌లో అశాంతి తాండవించింది. అది చూసి ఆర్థర్ చలించి పోయాడు.

## తండ్రి వృత్తి, తల్లి తీరు

కుమారుడు తనవలె వర్తకవృత్తి అవలంబించాలని తండ్రి ఆశించాడు. తండ్రిపై గౌరవంతో ఆర్థర్ అందుకు అంగీకరించాడు. కాని, తండ్రి 1805 లో ఆర్థర్ పదిహేడవేట-ఒక కాల్వలో పడి మరణించాడు.

ఆర్థర్ తల్లి జొహానా మంచి అందగత్తె. విదుషీమణి. ఆ రోజులలో బాగా పేరు పొందిన నవలా రచయిత్రి. ఆమె భర్త కన్నుకప్పి పై తిరుగుళ్లు తిరిగేది. అది భరించలేకనే ఆర్థర్ తండ్రి ఆత్మహత్య చేసుకున్నాడని ప్రతీతి.

తల్లికి, ఆర్థర్‌కు ఒక్కక్షణం పడేది కాదు. ఒకరినొకరు ఆగర్భ శత్రువులుగా భావించుకొనేవారు. అతని పద్ధతులు, స్వభావం ఆమెకు, ఆమె నడవడి అతనికి గిట్టలేదు. తండ్రిపై అతనికి అపార గౌరవం; తల్లిపై అమిత ద్వేషం. తండ్రి అకాల మరణానికి ఆమె పరోక్ష కారణమై వుండవచ్చునన్న అనుమానంతో – హామ్లెట్ తన తల్లినివలె—ఆమెను అతడు క్షమించలేకపోయాడు. హామ్లెట్‌వలె "టు బీ ఆర్ నాట్ టు బీ" అనే అవస్థలో పడ్డాడు.

భర్త మరణం తర్వాత జొహానా హాంబర్గ్ నుంచి వీమర్‌కు మకాం మార్చింది. ఆ రోజులలో వీమర్ జర్మనీలోని సాహిత్య, సాంస్కృతిక కేంద్రాలలో ఒకటి. తన సాహిత్య వ్యాసంగానికి, స్వైర జీవితానికి అది అనువైనదని జొహానా ఆ నగరంలో స్థిరపడింది.

## విద్యాభ్యాసం

ఆర్థర్ మాత్రం హాంబర్గ్‌లోనే వుండిపోయాడు. 1807 లో గోథా వెళ్లాడు. 1809 లో గాటింగెన్ యూనివర్సిటీలో చేరాడు. ప్లేటో, కాంట్‌లను, చరిత్ర, ఫిజిక్సు, వృక్షశాస్త్రం, ఖగోళశాస్త్రం, శరీరశాస్త్రం, న్యాయశాస్త్రం-ఒకటేమిటి సమస్త శాస్త్రాలు అధ్యయనం చేశాడు.

తల్లి వద్దకు అప్పుడప్పుడు వెడుతూ, వస్తూ వుండేవాడు. "వస్తే వచ్చావు

గాని నా కుమారుడుగా మాత్రం రాబోకు. అతిథిగా రా, వచ్చి కాసేపు వుండి, భోజనం చేసి నీ దారిన పో. నీవంటే నాకు అసహ్యం. నీ పొడ నాకు గిట్టదు" అని తల్లి ఉత్తరాలు వ్రాసేది.

## గేటేతో పరిచయం

ఆమె ఇల్లు రచయితలతో, కళాకారులతో నిత్య కల్యాణం, పచ్చ తోరణంగా కలకలలాడుతూ వుండేది. ఎప్పుడూ విందులు, సాహిత్య గోష్టులు. వాటికి హాజరయ్యే ప్రముఖులలో మహాకవి గేటే ఒకడు. ఆయనతో అక్కడే ఆర్థర్ షోపెన్‌హావర్‌కు పరిచయమైంది. గేటేకు ఆర్థర్ పట్ల చాలా అభిమానం. "మీవాడు ఎప్పుడో మనందరికంటె గొప్పవాడైపోతాడు" అని జొహానాతో అనే వాడు. దానితో ఆమెకు అరికాలిమంట నెత్తికెక్కేది. "వీడి మొహం. వీడు గొప్పవాడవుతాడా నేనుండగా" అనుకునేది.

ఆర్థర్ 1811 లో బెర్లిన్ యూనివర్శిటీలో చేరి విద్యాభ్యాసం కొనసాగించాడు. ఒక థీసిస్ వ్రాసి డాక్టరేట్ పొందాడు. ఆ థీసిస్ శీర్షికను సయితం చూసీ చూడగానే తల్లి పెదవి విరిచింది. ఆర్థర్ "అమ్మా! నీ నవలలు చెత్త పోగులో కూడా మిగలని రోజున ప్రపంచం నా పుస్తకాన్ని నెత్తిమీద పెట్టుకుని గౌరవిస్తుం"దన్నాడు.

ఒక రోజున ఆమె కొడుకుపై పట్టరాని కోపంతో మేడమెట్ల మీదినుంచి తోసివేసింది. అతడు లేచి వళ్లు దులుపుకుని "ప్రపంచం నీ పేరు ఎన్నడైనా తలిస్తే నా మూలంగానే" అంటూ వెళ్లిపోయాడు. ఆ తరవాత అమె 24 ఏళ్లు జీవించింది. కాని, ఆర్థర్ మళ్లీ ఆమె గుమ్మం తొక్కలేదు.

## మానవ ద్వేషం

ఇటువంటి కుటుంబ జీవితం తర్వాత, అనుభవాల తర్వాత, ఆర్థర్ షోపెన్ హావర్ నిరాశావాది కావడంలో ఆశ్చర్యం లేదు. మానవజాతినే ద్వేషించాడు. అందులో స్త్రీలను మరీని.

కొంతకాలంపాటు డ్రెజ్‌డెన్‌లో నివసించాడు. ఎవరితోను కలిసేవాడు కాడు. ఒంటరిగా తన ఆలోచనలలో తాను మునిగి తేలేవాడు. జీనియస్‌లకి స్నేహితులు వుండరనే వాడు. పొదలాగ గుబురుగా పెరిగిన జుట్టు, పెద్ద నుదురు, తీక్ష్ణమైన చూపులు... మనుష్యులమీద, ప్రపంచం మీద అసహ్యంతో, అసహనంతో ఎప్పుడూ చిర్రుబుర్రు లాడుతూండేవాడు.

ఇంతేకాదు. ప్రతివారిమీద అపనమ్మకం. జీవితం తుచ్ఛమని, లోకం శోక

మయమని, మృత్యువే మానవునికి విముక్తి అని నమ్మేటంతటి నిరాశావాది అయిన షోపెన్‌హూవర్‌కు రోగభయం, ప్రాణభయం, దారిద్ర్యభయం ఇంతా అంతా కాదు. ఆరోగ్యంపట్ల అమితశ్రద్ధ చూపేవాడు. డబ్బుపట్ల ఎంత కాపీనమో చెప్పడానికి వీలులేదు. చిల్లర డబ్బులు, బాండ్లు, అకౌంటు పుస్తకాలు ఎవరికంటా పడకుండా భద్రంగా దాచుకునేవాడు ఎవరన్నా వచ్చి దోచుకుంటారేమోనని. పడుకునేటప్పుడు తలగడ క్రింద తూటాలు నింపిన రివాల్వర్ వుంచుకునేవాడు. ఎప్పుడూ ఎవరో మోసగిస్తారేమోనని భయపడేవాడు. ఎంత దగ్గర స్నేహితులనైనా నమ్మేవాడు కాడు.

## జీనియస్ లక్షణాలు

ఈ విపరీత లక్షణాలను తనే వివగించుకునేవాడు. అయినా, ఇవన్నీ జీనియస్‌ల లక్షణాలని సరిపెట్టుకునేవాడు. జీనియస్ లందరూ నైతికంగా నికృష్టులేననేవాడు.

తాను జీనియస్ అని అతనికి గొప్ప నమ్మకం. 1819 లో అతని తత్వ సిద్ధాంతానికి మూలగ్రంథమైన "ది వరల్డ్ యాజ్ విల్ అండ్ ఐడియా" ప్రచురణ జరిగింది. దాన్ని ప్రచురణకర్తకు పంపిస్తూ "ఆ పుస్తకాన్ని విశ్లేషిస్తూ నూరు గ్రంథాలు రాగల"వని వ్రాశాడు. దాన్ని జనం ఎగరేసుకుని కొనుక్కుపోతారని ఆశించాడు. కాని, పదహారేళ్ల తర్వాత ప్రచురణ కర్త ఆ పుస్తకం ప్రతులలో ఎక్కువ భాగాన్ని చిత్తు కాగితాలుగా అమ్మేశాడు.

దీనితో షోపెన్‌హూవర్ అహం దెబ్బతిన్నది. తనంతటి జీనియస్ ఒక సరికొత్త తత్వ సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తే లోకం తిరస్కరిస్తుందా అని ఆవేశపడ్డాడు. భవభూతిలాగా "కాలోహ్యయం నిరవధి ర్విపులాచ పృథ్వీ" అనుకొన్నాడు. తనను అలక్ష్యం చేసిన జనం ఎప్పటికైనా తన జీనియస్‌ను గుర్తించకపోరనుకున్నాడు. "నిజం వేచి వుంటుంది. ఎందుకంటే నిజం చిరంజీవి" అన్నాడు. ఈ ఒక్క (స్వ) విషయంలో మాత్రం తన నిరాశావాదాన్ని సడలించుకున్నాడు.

## హెగెల్‌తో పోటీ

బెర్లిన్ యూనివర్శిటీనుంచి పిలుపు వచ్చింది. 1820 లో వెళ్లి ఆచార్య పదవిలో కుదురుకున్నాడు. అదే యూనివర్శిటీలో హెగెల్ కూడా పనిచేస్తున్నాడు. ఆ రోజులలో జర్మనీలో, యూరప్‌లో తత్వశాస్త్రానికి సంబంధించినంతవరకు హెగెల్‌దే రాజ్యం. ప్రష్యన్ ప్రభుత్వంతోసహా జర్మన్లు హెగెల్‌కు బ్రహ్మరథం పడుతున్నారు.

హెగెల్‌పట్ల షోపెన్‌హూవర్‌కు వల్లమాలిన అసూయ. హెగెల్ 'కేవల భావ

వాదం' పట్టి బుకాయింపు అనేవాడు. అతని కంటె గొప్పవాడి ననిపించుకోవాలని హెగెల్ పాఠాలు చెప్పే సమయంలోనే తను కూడా క్లాసులు ఏర్పాటు చేశాడు. హెగెల్ క్లాసునుంచి విద్యార్థులు బిలబిలమంటూ తన క్లాసులోకి వచ్చేస్తారని అతని ఆశ. కాని ఇందుకు విరుద్ధంగా షోపెన్‌హూవర్ క్లాసునుంచే విద్యార్థులు బిలబిలమంటూ హెగెల్ క్లాసుకు పరుగెత్తేవారు. షోపెన్‌హూవర్‌కి వళ్లు మండిపోయి ఖాళీ బెంచీలకి పాఠాలు చెప్పేవాడు. "ప్చ్ అంతేనండి! జీనియస్‌లని లోకం తొందరగా గుర్తించదు. సోక్రటీస్ ఏమయ్యాడు?"... అనేవాడు.

బెర్లిన్ నగరాన్ని 1831 లో కలరా వ్యాధి ముట్టడించింది. హెగెల్‌తో పాటు షోపెన్‌హూవర్ కూడా బెర్లిన్ విడిచిపెట్టాడు. హెగెల్ కలరా తగ్గిందనుకొని తొందరపడి తిరిగివచ్చాడు. కలరా అతడిని బలి గొన్నది. షోపెన్‌హూవర్ ఎంత నిరాశావాది అయినా తెలివైనవాడు కనుక తిరిగి రాలేదు. బతికిపోయాడు.

## ముదిరిన నిరాశావాదం

చివరికి ఫ్రాంక్‌ఫర్టులో స్థిరపడ్డాడు. అక్కడ తన జీవితాంతంవరకు 27 ఏళ్లపాటు నివసించాడు. వయస్సు ముదురుతున్నకొద్దీ అతని నిరాశావాదం కూడా పెరిగిపోయింది. అతని చిర్రుబుర్రులు స్నేహితులకు దుర్భరమైపోయాయి. అతడు అటు వస్తున్నాడంటే జనం ఇటు పారిపోయేవారు. అతని చూపులు ప్రసరించినంత మేర చీకట్లు కమ్ముకున్నట్టు వుండేదట.

తిరిగి ఒంటరి జీవితం. అతడు యావజ్జీవ బ్రహ్మచారి. యౌవనంలో ఒకటి రెండు ప్రణయకలాపాలు తప్ప స్త్రీలపట్ల ఏవగింపు.

వ్యక్తిగాను, తాత్వికుడుగాను కాంట్‌పట్ల షోపెన్‌హూవర్‌కు అభిమానం, ఆరాధన. జీవితంలో కూడా కాంట్‌ను అనుకరించాడు. పొద్దున్నే చన్నీటి స్నానం, స్ట్రాంగ్ కాఫీ, రాతకోతలు, కాసేపు ఫ్లూటు సాధన (అతడు మంచి సంగీత విద్వాంసుడు. అతని తత్వచింతనలో సంగీతానికి ప్రత్యేక స్థానం వున్నది), మధ్యాహ్నం రెస్టారెంట్‌లో భోజనం, విశ్రాంతి; సాయంత్రం నాలుగున్నరనుంచి రెండుగంటల సేపు చకచక నడక. రాత్రి తిరిగి రెస్టారెంట్‌లో భోజనం, తర్వాత థియేటర్‌లో కాలక్షేపం, ఇంటికి వచ్చి చదువు.

## వెంటనడిచే "ఆత్మ"

సాయంత్రపు నడక సమయంలో కాంట్ వెంట అతని సేవకుడు వుండేవాడు. షోపెన్‌హూవర్‌కు మనుషులంటే పడదు కనుక తెల్లని పెంపుడు కుక్క వెంటవుండేది. దాన్ని ఫ్రాంక్‌ఫర్ట్ పురజనులు "జూనియర్ షోపెన్‌హూవర్"

అనేవారు. షోపెన్‌హూవర్ మాత్రం దాన్ని "ఆత్మ" అని ముద్దుపేరుతో పిలి చేవాడు.

అతని గదిలో ఒకవైపు షేక్‌స్పియర్ చిత్రపటం, మరొకవైపు గేటే చిత్ర పటం వుండేవి. బల్లమీద ఒక ప్రక్క కాంట్ ప్రతిమ, మరొకవైపు బుద్ధుని కాంస్య విగ్రహం, మధ్యలో ఉపనిషత్తులు, ఇతర హిందూ, బౌద్ధ వాఙ్మయం. రాత్రి పడుకోబోయే ముందు అవే చదివేవాడు.

"ది వరల్డ్ యాజ్ విల్ అండ్ ఐడియా" ప్రచురించిన పదిహేడేళ్ల వరకు షోపెన్‌హూవర్ ఏమీ వ్రాయలేదు. 1835 లో "విల్ ఇన్ నేచర్" అని మొదటి పుస్తకంలోని సిద్ధాంతాలను కొనసాగిస్తూ మరొక గ్రంథం రచించాడు. ఆ తర్వాత అతని రచనా వ్యాసంగం నిరాఘాటంగా సాగింది.

## ఆలస్యంగా కీర్తి

క్రమంగా అతని గ్రంథాలు జనాన్ని ఆకర్షించాయి. పేరొచ్చింది. అతని కీర్తి జర్మనీ సరిహద్దులను కూడా దాటిపోయింది.

షోపెన్‌హూవర్ నిజంగానే జీనియస్. అతని మేధాశక్తిని లోకం గుర్తించింది. ఎందరో శిష్యులయ్యారు. ఆనాటి యూరోపియన్ సమాజాన్ని ఆవహించిన నైరాశ్యానికి అతని నిరాశా సిద్ధాంతం సరిగా అతికినట్టు సరిపోయింది. నవ యుగప్రవక్తగా అతడిని ప్రస్తుతించడం ప్రారంభమైంది. 1858 లో అతని 70 వ ఏట గొప్ప సన్మానం జరిగింది. ఇటీవలి కాలంలో జాం పాల్ సార్త్రె అస్తిత్వవాదం ఎంత ప్రజాదరం పొందిందో, విద్యాధికులలో ఎంతగా ఫ్యాషన్ అయిందో, షోపెన్‌హూవర్ తత్వచింతన కూడా అంతగా ప్రాచుర్యం పొందింది, ఒక ఫ్యాషన్ అయింది.

తనకు పేరు ఎప్పుడు వస్తుందా అని అంత దీర్ఘకాలంగా ఎదురు చూస్తున్న షోపెన్‌హూవర్ లోలోపల సంబరపడిపోయాడు. తనపై వెలువడే వ్యాసాలను, సమీక్షలను శ్రద్ధగా సేకరించి చదివి, దాచుకునేవాడు. "ఎవడికోసం నన్ను గుర్తిస్తుందోయ్ లోకం" అనుకునేవాడు.

## తీరిన కండూతి

తన కీర్తి కండూతి తీరడంతో లోకం అంత మరీ చెడ్డది కాదేమో నని పించింది. ఈశావాస్యోపనిషత్తు... "జిజీవిషే చ్ఛతగ్ం సమాః" అన్నది కదా? అంటే మానవుడు కర్మలుచేస్తూ నూరేళ్లు బ్రతకాలని కోరుకోవాలని. అలాగే తాను నూరేళ్లు జీవించాలని కోరుకున్నాడు.

కాని, ఆరోగ్యం విషయంలో ఎంత జాగ్రత్తగా వున్నా, ఊపిరితిత్తుల వ్యాధి ప్రవేశించింది. 1860 సెప్టెంబరు 21 వ తేదీ ఉదయం తన గదిలో గృహ యజమానురాలు తెచ్చి ఇచ్చే కాఫీ కోసం ఎదురుచూస్తూ ఆలోచనలలో మునిగివున్నాడు. కాఫీ వచ్చేసరికి తాపీగా అతని ప్రాణవాయువులు అనంతంలో విలీనమైపోయాయి. "అనాయాసేన మరణం..." అన్నట్టు గుండె పోటుతో సునాయాసంగా అంతిమశ్వాస విడిచాడు.

## ఇచ్ఛామూల మిదమ్ జగత్

"ప్రపంచం నా భావం"—The World is my idea.

ఈ వాక్యంతో షోపెన్‌హూవర్ ప్రఖ్యాత గ్రంథం "ది వరల్డ్ యాజ్ విల్ అండ్ ఐడియా" (ఇచ్ఛగా, భావంగా ప్రపంచం) ప్రారంభమవుతుంది.

ఇది స్పృహ– "కాన్షస్‌నెస్"– అంటూ వున్న ప్రతి జీవికి వర్తించే సత్య మని షోపెన్‌హూవర్ అంటాడు. అయితే ఈ సత్యాన్ని తెలుసుకోగలిగేది మనిషి ఒక్కడే; అలా తెలుసుకోగలిగిన మనిషి తాత్విక జ్ఞానం పొందినట్టే.

ఎందుకంటే మనిషి తెలుసుకునేది సూర్యుడిని, భూమిని కాదు; సూర్యు డిని చూసే కంటిని, భూమిని స్పృశించే చేతిని మాత్రమే. అంటే తన చుట్టూ వున్న ఈ ప్రపంచం తన భావంగా మాత్రమే వుంది. అంతకు మించిన యాథార్థ్యం (reality) దానికి లేదు.

ఇది స్పష్టమైన, నిరపేక్షమైన సత్యం. దీనికి వేరే రుజువు అక్కరలేదు. అనుభవాత్పూర్వమైన (a priori) సత్యం అంటూ ఏదైనా వుంటే అది ఇదేనని షోపెన్‌హూవర్ అభిప్రాయపడ్డాడు.

ఈ సత్యం కొత్తది కాదని కూడా షోపెన్‌హూవర్ అంటాడు. "నేను ఆలోచిస్తున్నాను కనుక నేను వున్నాను" (I think, therefore I am) అని సిద్ధాంతీకరించిన దెకార్త్ చింతనలో ఇది గర్భితమై వుంది. బెర్క్లీ దీన్ని మరింత స్పష్టంగా నిర్వచించాడు. ఒక వస్తువు ఉనికి దాన్ని తెలుసుకోవడంపై ఆధారపడి వుంటుందని బెర్క్లీ అన్నాడు.

ఇదే సత్యాన్ని భారతీయ ఋషులు ఏనాడో దర్శించారని షోపెన్‌హూవర్ అంటాడు.

ఈ విధంగా అతని గ్రంథంలోని మొదటిభాగం ప్రారంభమవుతుంది.

## కాంట్ సిద్ధాంతం

కాంట్ తత్వ సిద్ధాంతంపట్ల షోపెన్‌హూవర్‌కు ప్రగాఢ విశ్వాసమని ఇంత కుముందు తెలుసుకున్నాము. కాంట్ సిద్ధాంతం ప్రకారం ప్రపంచం రెండు రకాలైనది. ఒకటి మనకు ఇంద్రియ గోచరమవుతున్న అభాసిక (Phenomenal) ప్రపంచం. ఇది మనకు అనుభవంద్వారా, వివేచనద్వారా తెలుస్తున్నది. మానవుని బుద్ధింద్రియం ఈ ప్రపంచాన్ని స్థలంలోను, కాలంలోను మాత్రమే చూడగలు గుతున్నది; కార్య కారణత్వం (Causality) ద్వారనే తెలుసుకోగలుగుతున్నది.

ఈ ప్రపంచాన్ని మనం ఈ విధంగా చూడడానికి కారణం మన బుద్ధిం ద్రియ నిర్మాణం ఈ విధంగా వుండడమే. మన బుద్ధింద్రియం ఇలా కాక, మరొక విధంగా ఉంటే ఈ ప్రపంచం గురించిన మన అవగాహన మరొకలా వుండేదేమో?

ఇది ఆభాసిక ప్రపంచం కాగా దీనికి ఆధారభూతమైన– కారణభూతమైన– ప్రపంచం వేరే వుంది అది తనలో తాను (in - itself),మనకు అజ్ఞాతంగా వుండే ప్రపంచం. అది యథార్థ (Noumenal) ప్రపంచం. అది మన బుద్ధికి, అవగాహనకు అందనిది. అది అజ్ఞాతమే కాదు; మన బుద్ధింద్రియానికి గల పరిమితులను బట్టి అజ్ఞేయం కూడా. అది ఈ ఆభాసిక ప్రపంచానికి కార ణంగా వుందని ఊహించ వలసిందే తప్ప, దాన్ని గురించిన జ్ఞానం మనకు ఎన్నటికీ లభించదు.

ఇది కాంట్ తన "క్రిటిక్ అఫ్ ప్యూర్ రీజన్" అనే గ్రంథంలో ప్రతి పాదించిన సిద్ధాంతం.

## భిన్నాభిప్రాయం

ప్రపంచం రెండు రకాలైనదని, ఒకటి మన అవగాహనకు అదే ఆభాసిక ప్రపంచం, మరొకటి యథార్థ ప్రపంచం అన్నంతవరకు షోపెన్‌హూవర్ కాంట్‌తో ఏకీభవించాడు. కాని, దీనికి కారణమైన యథార్థ ప్రపంచం అజ్ఞేయమన్న దానితో విభేదించాడు. ఆ విభేదం ఆధారంగా తన నూతన సిద్ధాంతాన్ని నిర్మించాడు.

నేను కేవలం బుద్ధిజీవిని మాత్రమే. అయితే నాకు ఈ ప్రపంచం ఒక భావం (idea) గా కనిపించేమాట నిజమే. ఈ ప్రపంచం, దానిలోని వస్తు వులు స్థలంలోను, కాలంలోను, కార్య కారణత్వంలోను ఒక క్రమంలో అమరి వున్నట్టు కనిపించేమాట నిజమే.

కాని, నేను బుద్ధిజీవిని మాత్రమే కాదు. అంటే కేవలం ఆలోచించే, వివేచించే జీవిని మాత్రమే కాదు. నా అంతరాంతరాలలోకి చూసుకున్నప్పుడు నా నిజ స్వరూపం నాకు గోచరిస్తుంది. నా శరీరం కొన్ని పనులు చేస్తున్నది. నా మనస్సు కొన్ని ఆలోచనలు చేస్తున్నది. వీటికి వెనుక, వీటికి అంతర్భూతంగా ఏదో శక్తి వున్నది. దాన్ని షోపెన్ హూవర్ ఇచ్ఛ (will) అని పేర్కొన్నాడు. మన బుద్ధికి అందనిదిగా, తనలో తాను అజ్ఞేయంగా వుండే వస్తువుగా కాంట్ వదిలివేసినది అదేనని అభిప్రాయపడ్డాడు.

ప్రపంచం, దానిలోని వస్తువులు అన్నీ నా భావమే అయినప్పుడు, ఇతర మానవులు, వారి శరీరాలు కూడా నా భావమే అయివుండాలి. మానవులలో నేనూ ఒకడిని కనుక నా శరీరం, అది చేసే పనులు కూడా నా భావమే అయివుండాలి. అంటే నా శరీరం నా మనస్సు ద్వారా, ఆలోచనలద్వారా, నాకు తెలియవస్తున్న ఒక వస్తువు మాత్రమే.

అయితే, నా శరీరం, నా అవయవాలు కొన్ని పనులు చేయగలుగుతున్నాయి. ఎలా చేయగలుగుతున్నాయి? ఇలా చేయాలని నేను జ్ఞాతంగానో, అజ్ఞాతంగానో సంకల్పిస్తున్నాను కనుక, చేయగలుగుతున్నాయి. అలాగే నా మనస్సు కొన్ని ఆలోచనలు చేస్తున్నది. ఎలా చేయగలుగుతున్నది? ఇలా చేయాలని జ్ఞాతంగానో, అజ్ఞాతంగానో ఇచ్ఛయిస్తున్నాను కనుక ఆలోచించగలుగుతున్నది.

## అన్నిటికీ వెనుక ఇచ్ఛ

అంటే నా శరీరం కదలికలకు, నా ఆలోచనలకు వెనుక వున్నది నా ఇచ్ఛ, నా సంకల్పం (will) అన్నమాట; ఆ ఇచ్ఛ అనేది నా సమస్తమైన కార్యకలాపాలలోను వ్యక్తమవుతున్నది. నాలో ఇచ్ఛ నా కోర్కెలుగా, నా ఉద్రేకాలుగా, సాహజాతాలు (instincts) గా, నా ఆరాటంగా, నా పోరాటంగా వ్యక్తమవుతున్నది.

నా శారీరక క్రియలలో ఇచ్ఛ వ్యక్తమవుతున్నట్టే మొత్తం ప్రపంచంలో ఇచ్ఛ వ్యక్తమవుతున్నది. నా శరీరం ఇచ్ఛకు బాహ్యరూపం. అలాగే మొత్తం ప్రపంచం ఇచ్ఛకు బాహ్యరూపం.

ప్రపంచం ఒక దృష్టితో చూస్తే భావం (Idea). కాని, నిజానికి అది ఇచ్ఛ (Will). ఇచ్ఛకు వాస్తవీకరణమే (Objectification) ప్రపంచం.

ప్రాణం లేని రాయిలో కూడా ఇచ్ఛ వున్నది. అయితే, ఆ నిర్జీవ దశలో ఇచ్ఛకు స్వయంస్ఫృహ (self-consciousness) లేదు. నిర్జీవ ప్రపంచంలో ఇచ్ఛ వట్టి భౌతికమైన అంధ శక్తి (blind force) గా వ్యక్తమవుతున్నది.

## శక్తి రూపాలు

బాహ్య భౌతిక ప్రకృతి అంతటా శక్తి రకరకాలుగా - గురుత్వాకర్షణశక్తి, అయస్కాంతశక్తి, విద్యుచ్ఛక్తి, అణుశక్తి మొదలైన రూపాలలో - వుంటుందని మనకు తెలుసు. అవన్నీ ఇచ్ఛ తనను తాను వ్యక్తం చేసుకునే రూపాలు. ఇచ్ఛ కారణంగానే పైకెగర వేసిన రాయిని భూమి ఆకర్షిస్తున్నది. సూదంటురాయి ఇనుపముక్కను ఆకర్షిస్తున్నది.

వృక్ష ప్రపంచంలోకి వచ్చేసరికి ఇచ్ఛకు స్వయంస్పృహ వుండీలేనంత స్వల్పంగా వుంటుంది. ఆ దశలో అది ప్రాణశక్తిగా వ్యక్త మవుతుంది. మొక్క తాను జీవించాలని, తనను తాను పునరుత్పత్తి చేసుకుని, తన జాతిని కొన సాగించాలని చేసే ప్రయత్నంలో ఇచ్ఛ వ్యక్తమవుతుంది. ఉదాహరణకు— వృక్షం నేలలోకి వేళ్లుతన్ని నీటిని, ఆహారాన్ని తీసుకుంటుంది. సూర్యరశ్మికోసం పైకి పెరుగుతుంది. అంటే ఒకానొక ప్రయత్నం (striving) వృక్షంలో కనబడుతుంది. ఆ ప్రయత్నం ఇచ్ఛాపూర్వకమైనది.

## జీవనేచ్ఛ

జంతు ప్రపంచంలో మరింత ఉన్నత, పరిణత దశలో ఈ జీవనేచ్ఛ (Will to live) వ్యక్తమవుతుంది. మానవునిలో అది పూర్తి స్వయం స్పృహతో వ్యక్త మవుతుంది.

భౌతిక ప్రపంచంలోని క్రింది దశలలో— అంటే నిర్జీవ వస్తువులలో— ఇచ్ఛకు స్వయం స్పృహ వుండదు. అది కేవలం అంధశక్తిగా వ్యక్త మవుతుంది. మాన వులలో అది స్వయం చైతన్య విలసిత మవుతుంది.

దాదాపుగా తాత్వికులందరు మనిషిలో బుద్ధి (intellect) ని, స్వీయస్పృహను (self - consciousness) ప్రధాన తత్వంగా భావించారు. ఇది తప్పు. హెగెల్- ప్రపంచమంతా కేవల భావానికి వ్యక్తీకరణం, వాస్తవీకరణం అన్నాడు. అదీ తప్పే. బుద్ధి, హేతువు, తర్కం, స్పృహ, భావం ఇవన్నీ పైపై తత్వాలు. వీటి అడుగున వీటికి మూలాధారంగా వుండి వీటిని నడిపించేది ఇచ్ఛ. బుద్ధిః కర్మానుసారిణీ అన్నారు. అది సరికాదు. బుద్ధిః ఇచ్ఛానుసారిణీ— బుద్ధి ఇచ్ఛను అనుసరిస్తుంది— కర్మలు కూడా అంతే.

మనం ఒకానొక వస్తువును కోరుతున్నామంటే అది హేతుబద్ధమైనదని కాదు. ఆ వస్తువును కోరుతున్నాము కనుక, అలా కోరడానికి ఒక హేతువును, కారణాన్ని సృష్టించుకుంటున్నాము.

జంతువులు కారణాలతో నిమిత్తం లేకుండానే తమ సహజాత జ్ఞానాన్ని (Instinct) బట్టి వస్తువులను కోరుతాయి. మానవునిలో అలాకాక ఇచ్ఛ అనేది తన కోర్కెను సమర్థించుకోవడం కోసం బుద్ధీంద్రియాన్ని సృష్టించుకుంటుంది.

బుద్ధి సేవకుడు, ఇచ్ఛ యజమాని, మనం చేసే పనులన్నిటిని బుద్ధితో ఆలోచించి, తర్కించి చేస్తున్నామని అనుకుంటాము. కాని మనచేత ఆ పనులు చేయించేది మనలోని ఇచ్ఛ.

సచేతన ప్రపంచంలో జీవనేచ్ఛ ప్రధానమైనది. మనం తిండి తినాలని కోరుతాము. కామ తృప్తిని కోరుతాము. సంతానాన్ని కోరుతాము. ఇవన్నీ హేతుబద్ధమైనవి కనుక కోరుతున్నామా? కాదు. జీవనేచ్ఛవల్ల కోరుతున్నాము. బ్రతకాలన్న ఇచ్ఛతో, మన మనుగడను మన సంతానంలో కొనసాగించాలన్న ఇచ్ఛతో వాటిని కోరుతున్నాము.

## లీలా సృష్టి

మానవ శరీరం కూడా ఇచ్ఛ సృష్టే. ఇచ్ఛ కారణంగానే రక్త ప్రసరణకోసం రక్తనాళాలు ఏర్పడుతాయి. వస్తువులను పట్టుకోవాలనే కోర్కెతో చేతులు, ఆహారం తినాలన్న కోర్కెవల్ల నోరు, తిన్నది జీర్ణం కావాలన్న కోర్కెవల్ల జీర్ణకోశం, చూడాలన్న కోర్కెతో కళ్లు– ఇలా సమస్తావయవాలు ఏర్పడు తాయి. ప్రపంచాన్ని, తనను తెలుసుకోవాలన్న కోర్కెతో ఇచ్ఛ మెదడు అనే అవయవాన్ని సృజిస్తుంది. పునరుత్పత్తి కోసం జననేంద్రియాలను సృష్టిస్తుంది. ఇచ్ఛకు వాస్తవీకరణం శరీరం. దాని లీలా మానుష విగ్రహమే మన శరీరం. మన వివేచనకు భావంగా గోచరించే ఈ సమస్త ప్రకృతి కూడా ఇచ్ఛకు వాస్తవీకరణమే.

ప్రపంచం ఇచ్ఛాసృష్టి. కాని ఇచ్ఛకు కారణం లేదు, గమ్యం లేదు. అర్థం లేదు, ప్రయోజనం లేదు, అది అంధశక్తి. అది స్వయంభువం, అనంతం. స్థలానికి, కాలానికి, కార్యకారణ సంబంధాలకు అతీతం. కాంట్ తనలో తానుండే అజ్ఞాత పరతత్వంగా దేన్ని భావించాడో అది నిజానికి ఈ ఇచ్ఛ మాత్రమే. దాని లీల మాత్రమే ఈ ప్రపంచం.

ఈ సిద్ధాంతం ప్రకారం ఇచ్ఛయే సర్వశక్తి సమన్వితుడైన భగవంతుడు కావాలి. కాని, షోపెన్‌హావర్ దృష్టిలో ఇచ్ఛ భగవంతుడు కాదు. భగవం తుడంటే మామూలుగా మనం దయామయుడు, ప్రేమస్వరూపుడు అని అనుకుంటాము. కాని, షోపెన్‌హావర్ దృష్టిలో సర్వసృష్టికి మూలమైన ఇచ్ఛ

పరమ తుచ్ఛ శక్తి. దీనివల్ల ప్రపంచానికి, మానవునికి దుఃఖమే కాని, ఆనందం లేదు. ప్రపంచం దుఃఖమయం, ఈ దుఃఖానికి కారణం ఇచ్ఛ.

# నిరాశద్వారా నిర్వాణానికి నిర్గమనం

ప్రపంచానికి ఏది మూల సూత్రం -? ఒక్కొక్క తాత్వికుడు ఒక్కొక్క మూలసూత్రాన్ని ప్రతిపాదించాడు.

తాత్వికులలో చాలమంది "అద్వైత" వాదులు. అంటే ప్రపంచానికి మూల సూత్రం ఒకటేనని, అది తప్ప మరేమీ లేదని, అది కానివన్నీ దాని అభాసలేనని అన్నారు.

షోపెన్‌హూవర్ ప్రపంచానికి మూలసూత్రం ఇచ్ఛ (will) అన్నాడు. సమస్త చరాచర జగత్తును నడిపించేది ఇచ్ఛ. దాని అభాసే ప్రపంచమంతా. సత్తు (existence), చిత్తు (consciousness) దాని అభాసలే.

అయితే ఇచ్ఛ అనేది దైవశక్తి కాదని, దాన్ని షోపెన్‌హూవర్ తుచ్ఛ శక్తిగా, దుష్టశక్తిగా భావించాడని కూడా ఇంతకుముందు తెలుసుకున్నాము.

ఎందుకని? ప్రపంచమంతా దుఃఖమయం. ఈ దుఃఖానికి కారణం ఇచ్ఛ. అందుచేతనే ఇచ్ఛ దుష్టశక్తి. దాన్ని అంతం చేయడమే మానవుని కర్తవ్యం.

## హిందూ, బౌద్ధ ప్రభావం

బుద్ధుడు కూడా లోకాన్ని శోకమయంగా దర్శించాడు. కోరిక దుఃఖానికి మూలమని, కోరికను నశింపజేస్తే నిర్వాణం సిద్ధిస్తుందని అన్నాడు.

హిందూ వేదాంతులు కూడా 'జన్మ దుఃఖం, జరా దుఃఖం; జాయా దుఃఖం పునఃపునః; సంసారం సాగరం దుఃఖం...' అన్నారు. ఈ విషవలయం నుంచి విముక్తి పొందడమే మోక్షమన్నారు.

షోపెన్‌హూవర్ హిందూ, బౌద్ధ దర్శనాల వల్ల ప్రభావితు డయ్యాడు. అతడు కూడా లోకం మరొక పేరు శోకం అన్నాడు. దుఃఖానికి కారణం ఇచ్ఛ అన్నాడు.

ఇచ్ఛ అంటే కోరిక, సంకల్పం. కోరిక ఎప్పుడు, ఎందుకు కలుగుతుంది? లేమివల్ల– అంటే ఏదో మనకు లేకపోవడంవల్ల, ఏదో లోపించడంవల్ల కలుగుతుంది. లేనిదాన్ని పొందా లనుకోవడమే కోరిక.

అటువంటి ఇచ్ఛ వల్లనే సమస్త సృష్టి ఉద్భవించింది. 'తనను తాను తెలుసుకొనడానికి ఇచ్ఛ చేసిన ప్రయత్నమే సృష్టి. ఇచ్ఛ మానవునిలో సంపూర్ణ స్వయం స్పృహను పొందుతున్నది.

## కోరికవల్ల దుఃఖం

ఇచ్ఛ అంటే కోరిక. కోరికవల్ల దుఃఖం కలుగుతుంది.

కోరినది దొరకక పోవడంవల్ల దుఃఖం కలుగుతుంది. దొరికిన తర్వాత కూడా దుఃఖం కలుగుతుంది.

'ఆశ లావు, పీక సన్నం' అని సామెత. కోరికకు అంతం లేదు. తీరినకొద్దీ కోరిక పెరుగుతుంది.

ఒక కోరిక తీరిన దనుకోండి. పది కోరికలు ఊరిక లెత్తుతాయి.

పేదవాడు ఈ పూటకు తిండి దొరికితే చాలనుకుంటాడు. కాని, ఆ తర్వాత మరొక పూటకు తిండి కోసం ఆరాటం ప్రారంభ మవుతుంది.

లక్షాధికారి కోటీశ్వరుడు కావా లనుకుంటాడు. ఒక కోటి సంపాదించిన వాడు ఇంకోటి సంపాదించాలని ఆరాటపడతాడు.

దారేషణ, ధనేషణ, పుత్రేషణ— ఇవి ఈషణత్రయం. వీటికోసమే మానవుని తాపత్రయం.

తీరని కోరిక బాధ కలిగిస్తుంది. తీరిన కోరిక కూడా బాధ కలిగిస్తుంది. ఎందుకంటే దేనివల్ల కోరిక తీరిందో దానివల్ల అనాసక్తి (అన్వీ-ennui) కలుగుతుంది. అనాసక్తివల్ల విసుగుదల (boredom) కలుగుతుంది. దానినుంచి తప్పించుకొనడానికి మరొకదాన్ని కోరడం జరుగుతుంది. ఇది అనంతంగా సాగుతుంది.

ఇచ్ఛ అంటే జీవనేచ్ఛ. బ్రతుకును శాశ్వతంగా కొనసాగించాలనే కోరిక. ఇది సాధ్యంకాదు కనుక, ప్రతి ప్రాణి తన సంతానం ద్వారా తన మనుగడను కొనసాగించాలని చూస్తుంది. కాని, సంతానంవల్ల తిరిగి దుఃఖసాగరంలో ఈదులాడవలసిన కొత్త జీవులు పుట్టినట్టు అవుతుంది.

రాయికి, రప్పకి స్పృహ లేదు కనుక, వాటిలో ఇచ్ఛ అంధశక్తిగా వుంటుంది. వాటికి బాధ తెలియదు. వృక్షాలలో కూడా అంతే.

కాని జీవులలో ఉన్నతదశలకు పోతున్నకొద్దీ స్పృహ పెరుగుతూ పోతుంది.

స్పృహ ఎంత ఎక్కువైతే, ప్రాణి అంత దుఃఖం అనుభవిస్తుంది. మానవునిలో స్వయం స్పృహ గరిష్ఠ స్థాయిని అందుకుంటుంది. కనుకనే మానవునిలో దుఃఖానుభూతి కూడా గరిష్ఠ స్థాయిలో వుంటుంది.

తెలివితేటలవల్ల, విజ్ఞానంవల్ల, ఆలోచనవల్ల కూడా దుఃఖ నివృత్తి కాదు. ఆలోచన, ఊహాశక్తి ఎక్కువైనకొద్దీ దుఃఖం ఎక్కువౌతుంది. జ్ఞాపకశక్తి ఎక్కువైనా అంతే. గతంలోని బాధలు జ్ఞప్తికి వచ్చి దుఃఖం కలుగుతుంది. ముందు రాబోయేది ఊహించుకున్నా దుఃఖమే. మృత్యువుకంటె మృత్యుభీతి ఎక్కువ దుఃఖకారణం.

జీవితం తుచ్ఛమైనది. లోకంలో ఎక్కడైనా చూడండి, ఒకరితో ఒకరు బ్రతుకు కోసం, స్వార్థం కోసం, సుఖం కోసం, సంపద కోసం పోటీ, పోరాటం. ఈ పోరాటం, ఘర్షణ దుఃఖ కారకం.

## గూడు కట్టిన బాధ

మనం సాధారణంగా చూడం, చూడదలుచుకోము గాని, చూస్తే, జీవితంలో ఎంత దుఃఖం గూడుకట్టుకుని వుందో తెలుస్తుంది.

ఏ అస్పత్రికైనా వెళ్లి రోగుల మూల్గులు వినండి. శస్త్ర చికిత్సాలయానికి వెళ్లండి, చిత్రహింసాలయాలకు వెళ్లండి, యుద్ధ భూమికి వెళ్లండి, పేదల మురికి వాడలు చూడండి, ఎక్కడ చూసినా బాధ, దుఃఖం, యాతన.

నరకాన్ని అన్ని జాతులవారూ ఊహించారు. భూలోకాన్ని చూసే ఊహించారు.

"ఏ దేశ చరిత్ర చూచినా, ఏమున్నది గర్వకారణం? నరజాతి చరిత్ర సమస్తం పరపీడన పరాయణత్వం !"

హత్యలు, దోపిడీలు, కుట్రలు– ఇవే చరిత్ర.

చరిత్రలో ఒక పేజీ తిరగేస్తే చాలు. పుస్తకమంతా చూచినట్టే.

లైబ్నిజ్ "ఊహించడానికి వీలైన అన్ని ప్రపంచాలలోకి మనదే ఉత్తమ ప్రపంచం (This is the best of all possible worlds)" అన్నాడు. నిజానికి ఊహించడానికి వీలైన అన్ని ప్రపంచాలలోకి మనదే అధమాధమ ప్రపంచం.

మనిషి పుట్టుక మృత్యుదిశగా ప్రయాణంతో ప్రారంభ మవుతుంది. మనం పీల్చే ప్రతి ఊపిరి, మనం తినే తిండి మృత్యువును దూరం చేస్తున్నట్టు భ్రమ

పడతాము. కాని, జీవితంలో ప్రతిక్షణం మృత్యువు మనతో పిల్లి ఎలుకతో చెల గాట మాడినట్టు ఆడుకుంటుంది. ఎంత తప్పించుకున్నా మనుకున్నా, చివరికి బాటచివర మలుపులో మృత్యువు మనకోసం వేచి వుంటుంది. ఏదో ఒకచోట మనల్ని—డాక్టర్ ఫాస్టస్ (మార్లో నాటకం)ను మెఫిస్టాఫిలిస్‌లాగా— చటుక్కున ఒడిసిపట్టి కబళిస్తుంది.

అయితే, ఈ ఇచ్ఛా ప్రపంచంనుంచి మానవునికి మోక్షం లేదా?

ఆత్మహత్య ఒక విముక్తి మార్గంగా కనిపించవచ్చు. కాని, అదీ ప్రయోజనం లేదు. ఒకడు ఆత్మహత్య ద్వారా విముక్తి పొందినా, ప్రపంచం నశించదు. ఇచ్ఛ అంతరించదు. మానవజాతి కొనసాగుతూనే వుంటుంది. కనుక అది విముక్తి మార్గం కాదు.

## జితేంద్రియత్వం

ఇచ్ఛను అణచివేయడానికి, జయించడానికి ఒక మార్గం తాత్విక దృక్పథం. జీవితాన్ని వివేకంతో వివేచించాలి. కోరికలవల్ల దుఃఖం కలుగుతుంది కనుక, కోరికలను జయించాలి. మనస్సు గుర్రంలాంటిది. దాన్ని వివేకం, వివేచన అనే పగ్గాలతో నిగ్రహించాలి. మన కోర్కెలు, మన ఉద్రేకాల స్వభావాన్ని తరచి చూసి అర్థం చేసుకుంటే వాటిని నిగ్రహించవచ్చు.

నిమ్నశ్రేణి జీవులలో ఇచ్ఛ ప్రాబల్యం ఎక్కువ, వివేచన మటుకు శూన్యం. సగటుమనిషిలో కూడా ఇచ్ఛదే పైచేయి, వివేచనది తక్కువ స్థానం.

కాని, ప్రతిభాశాలియైనవాడిలో ఇచ్ఛకంటె వివేచన, విజ్ఞానం ప్రబల స్థితిలో వుంటాయి. కనుక, మహా ప్రతిభాశాలి ఇచ్ఛను, ముఖ్యంగా కామాన్ని జయించడం సులభం.

కళా సౌందర్యాస్వాదన కూడా ఇచ్ఛను జయించడానికి తోడ్పడుతుంది. కళాస్వాదనలో మన సొంత ఇచ్ఛ అంతరిస్తుంది. మన ఇచ్ఛ ప్రపంచపు ఇచ్ఛలో కలిసిపోతుంది. దానివల్ల మన సంకుచితావరణను దాటి విశ్వావరణలో ప్రవేశించ గలుగుతాము. అంటే, రసానుభూతివల్ల (భారతీయ ఆలంకారికులు చెప్పినట్టు) "ఆవరణ భంగం" జరుగుతుంది. మన వ్యక్తిత్వపు పరిమితులను అతిక్రమించ గలుగుతాము. దీనివల్ల ఇచ్ఛ అంతరిస్తుంది. దుఃఖం ఉపశమిస్తుంది. అన్నిటిలోకి ఉత్తమ కళ సంగీతం. తక్కిన కళలు కేవలం భావాలకు ప్రతిబింబాలు కాగా, సంగీతం భావాలకు అతీతమైన, ప్రపంచపు ఇచ్ఛను యథాతథంగా ప్రతిధ్వనిస్తుంది. భావాల ద్వారా కాక, సూటిగా మనలను తాకుతుంది.

ఇచ్ఛను జయించడానికి మతం కూడా ముఖ్యమైన మార్గం. షోపెన్‌హూవర్ దృష్టిలో క్రైస్తవంకంటె తదితర మతాల కంటె, హిందూమతం, బౌద్ధమతం— వాటి దర్శనాలకు సంబంధించినంతవరకు— గొప్పవి.

## మాయా యవనిక

సమస్త ప్రాణులు, సకల మానవులు స్వభావతః ఒకటే. ఆత్మవత్సర్వ భూతాని. ఎవడు తనలో సమస్త భూతకోటిని, సమస్త భూతకోటిలో తనను చూసుకుంటాడో అతడిని మోహం, శోకం బాధించవు.

"ప్రపంచమంతా నా భావం" అని షోపెన్‌హూవర్ అన్నాడు. అంటే ఈ ప్రపంచం మన భావంగా మాత్రమే వున్నదని అర్థం. షోపెన్‌హూవర్ 'భావం' అన్నదాన్నే హిందూ వేదాంతులు మాయ అన్నారు. మనల్ని మాయ ఆవరించడంవల్లనే ప్రపంచపు అసలు స్వభావాన్ని తెలుసుకోలేకపోతున్నాము. కఠోర నియమబద్ధమైన జీవితం ద్వారా, సర్వసంగ పరిత్యాగంద్వారా, సంసార వైముఖ్యం ద్వారా, ఈ మాయా యవనికను ఛేదించడం, సత్యాన్ని దర్శించడం సాధ్యం. అప్పుడు ఇచ్ఛ నశిస్తుంది.

అది నిర్వాణానికి మార్గమని హిందూ, బౌద్ధ దర్శనాలు ఉపదేశిస్తున్నాయి. నిర్వాణం అంటే ఆరిపోవడం, లేకపోవడం. అయితే, అది శూన్యస్థితి కాదు. అది ఇచ్ఛారాహిత్య స్థితి, జీవన్ముక్త స్థితి. అందుచేత కేవలం ఆనంద స్థితి. దాన్ని వర్ణించడానికి మాటలు, భావాలు చాలవు. అది అన్నిటికీ అతీత స్థితి.

## విమర్శ

హిందూ, బౌద్ధ దర్శనాల అధ్యయనం ద్వారా షోపెన్‌హూవర్ ప్రవచించిన ఈ సిద్ధాంతాన్ని సంపూర్ణ నిరాశావాదంగా పలువురు పాశ్చాత్య వ్యాఖ్యాతలు విమర్శించారు, నిరసించారు. షోపెన్‌హూవర్‌కు వ్యక్తిగత జీవితంలో తటస్థించిన అనుభవాలు అతడిని ఇంత నిరాశావాదిగా చేశాయన్నారు. అతడికి తిండికి లోటు లేదు. పనిపాటు లేదు. హాయిగా తిని కూర్చునేవాడు. ఒంటరిగా వుండేవాడు. ఎప్పుడూ తన ఆలోచనలలో మునిగి తేలేవాడు. ఈ విధమైన జీవితం గడపడం వల్లనే అతనిలో నిరాశావాదం బయలుదేరింది. పైగా ఆ రోజులలో యూరప్‌లోని దుర్భరజీవిత పరిస్థితులు, ముఖ్యంగా నెపోలియన్ దండయాత్రల బీభత్సంవల్ల ఏర్పడిన నైరాశ్యం కూడా అతని నిరాశావాదానికి కారణమని విల్ డ్యూరాంట్ వ్రాశాడు.

కోరికవల్ల దుఃఖం కలగవచ్చు. కాని, అంతమాత్రాన ప్రపంచం దుఃఖమయం

మాత్రమేనని అనడం అంగీకరించరానిది. లేనిదాన్ని పొందడంలో కంటె, పొందడానికి చేసే ప్రయత్నంలోనే మానవుడు జీవిత సాఫల్యం పొందుతాడని డ్యురాంట్ అంటాడు.

ఇచ్ఛవల్ల దుఃఖం మాత్రమే కలుగుతుందని చెప్పడం సరికాదని బెర్ట్రాండ్ రసెల్ విమర్శించాడు. అసలు ఆశావాదం, నిరాశావాదం రెండూ శాస్త్రీయ దృష్టి నుంచి సమర్థించదగినవి కావు. ఆశావాది ప్రపంచం తన సుఖంకోసమే పుట్టిం దనుకుంటాడు. నిరాశావాది ప్రపంచం తనకు దుఃఖం కలిగించడా నికే వున్న దనుకుంటాడు. నిజానికి, ప్రపంచం మన ఆశా, నిరాశావాదాలతో ప్రమేయం లేనిది. ఆశా, నిరాశలు మన చిత్తవృత్తిని బట్టి వుంటాయి.

## ప్రశంస

ఈ విధంగా పలువురు విమర్శించినప్పటికి—షోపెన్‌హూవర్ లేవనెత్తిన ఇచ్ఛా వాదానికి వారు పాశ్చాత్య తత్వ శాస్త్రంలో ఒక ప్రముఖ స్థానం ఇచ్చారు. అతనికి ముందు తత్వవేత్తలు బుద్ధికి, హేతువుకు అగ్రస్థానం ఇచ్చారు. మానవుడు బుద్ధిజీవి, వివేచనాశీలి అన్నారు. కాని, షోపెన్‌హూవర్ మొదటిసారిగా మానవ ప్రకృతిలోని రెండవ వైపును చూపించాడు. ఇచ్ఛ, ఉద్రేకం. సహజాతం (Instinct). సహజజ్ఞానం (Intuition)—ఇవి కూడా మానవ ప్రకృతిలో ముఖ్యమన్న విషయాన్ని షోపెన్ హూవర్ సిద్ధాంతీకరించాడు. ఈ వాదంవల్ల ప్రభావితులైనవారే నీషే, బెర్గ్‌సన్, జేమ్స్ మొదలైన తాత్వికులు.. ఆధునిక మనస్తత్వ శాస్త్రంపై కూడా ఈ వాద ప్రభావం ఎంతో వున్నది. చారిత్రికంగా అతని సిద్ధాంతం తత్వ శాస్త్ర ప్రగతికి చాలా దోహదం చేసిందనడంలో సందేహం లేదు.



# 30
# జిగీషావాది నీషే

"దేవుడు చనిపోయాడు" – గాడ్ ఈజ్ డెడ్ -

ఆస్తికులకు ఆగ్రహం, దైవభక్తులకు ఉలికిపాటు తెప్పించగల ఈ వాక్యం ప్రకటించినవాడు జర్మన్ తత్వవేత్త ఫ్రీడ్రిక్ విల్హెల్మ్ నీషే. తాను వ్రాసిన "దజ్ స్పేక్ జరతూస్త్ర" అనే గ్రంథంలో ప్రాచీనకాలపు పర్షియన్ ప్రవక్త జరతూస్త్ర నోట ఈ మాట పలికించాడు నీషే.

అతడు ఏది వ్రాసినా, సమకాలికులను షాక్ చేయడానికి వ్రాసినట్టు కనిపిస్తుంది. నిజంగానే అతని వ్రాతలకు 19వ శతాబ్దపు యూరప్ షాక్ అయింది; 20 వ శతాబ్దపు యూరప్ సర్వనాశనానికి చేరువైంది.

సమకాలికులను షాక్ చేయడం అతని ఉద్దేశం కావచ్చు; కాని ఆలోచింపజేయడం కూడా అతని లక్ష్యం. అతని రచనలు గుండె లోతులలో నుంచి, జీవితపు చీకటి కోణాల నుంచి చీల్చుకు వెలువడ్డాయి.

తన కాలపు పండితులు, పామరులు, మతాధిపతులు, రాజ్యాధినేతలు తిరుగులేనివిగా భావించే విలువలను, విశ్వాసాలను నీషే తలక్రిందులుగా నిలబెట్టాడు.

"ఇవా మీరు నమ్మే విలువలు ? ఇవా మిమ్మల్ని రక్షించే విశ్వాసాలు?" అని లోకం అదిరిపడే కేకలు వేశాడు.

నీషే సాధారణార్థంలో తాత్త్వికుడు కాడు. అతడు తార్కికంగా, హేతుబద్ధంగా తన వాదాన్ని నిర్మించలేదు. ఒక మత ప్రవక్తవలె, శాస్తవలె తాను కనుగొన్న సత్యాలను ఉన్మీలనం చేశాడు. కవితామయంగా, మార్మికంగా, మహోవేశంతో "నేను చెబుతాను. మీరు వినండి" అని జబర్దస్తీగా తన విచిత్ర తత్త్వ చింతనను ఆవిష్కరించాడు. ఆనాటి యూరప్ నోరు వెళ్లబెట్టి విస్తుపోయింది. "ఎవరీతడు? ఏమిటీ ఉన్మత్త ప్రేలాపన? ఎందుకీ గర్వాలాపన?" అని ఆశ్చర్యపడింది, ఆగ్రహపడింది.

## సగం కవిత్వం, సగం తత్వం

అతని రచనలు సగం ఉత్తమ కవిత్వం, సగం ఉన్మత్త తత్వం. మంచికో, చెడుకో—బహుశా మంచి కంటె చెడుకే ఎక్కువగా— అవి యూరప్‌ను ప్రభావితం చేశాయి.

"ఏది నీవు కాదో, అదే దైవం, అదే ఆదర్శం—" ఇది జరతూష్ట్ర నోట నీషే పలికించిన మరొక సూక్తి. ఈ సూక్తికి సజీవ నిదర్శనం నీషే జీవితం.

నీషే ప్రష్యాలోని రాకెన్‌లో 1844 అక్టోబరు 15 వ తేదీన జన్మించాడు. అది అప్పటి ప్రష్యారాజు ఫ్రీడ్రిక్ విల్హెల్మ్ (IV) పుట్టిన రోజు. రాజు పేరే తండ్రి తన కుమారునికి పెట్టాడు. చిత్రంగా, ఆ తర్వాత రాజుకు మతి చలించింది. నీషే తండ్రికి మతి పోయింది. నీషే జీవితపు ఆఖరి దశాబ్దమంతా పిచ్చాసుపత్రులలో గడిపాడు.

ఒకరోజు రాత్రి నీషే తండ్రి ఇంటి మెట్లు ఎక్కుతూ, తూలి వెనక్కి పడ్డాడు. తల నేలకు కొట్టుకుని మెదడు దెబ్బతిన్నది, మతిస్తిమితం కోల్పోయి ఒక ఏడాదిపాటు తీసుకుని చనిపోయాడు. తండ్రి బాధలు, మరణం, ఖననం అప్పటికి ఏడేళ్లు కూడా లేని నీషే మనస్సులో గాఢంగా నాటుకున్నాయి.

నీషే తండ్రి మతోద్యోగి. తండ్రి వైపు, తల్లివైపు కొన్ని తరాలవారు చర్చి ఉద్యోగులు. తండ్రి మరణం తర్వాత నీషే, అతని చెల్లెలు దైవ విశ్వాసం గల నలుగురు స్త్రీల చేతులలో పెరిగారు. ఒకరు తల్లి, మరొకరు ముత్తవ, ఇరువురు పిన తల్లులు. వారు ఎంతగా మత విశ్వాసం నూరిపోయినా నీషే పెరిగి పెద్దవాడైన తర్వాత నాస్తికుడయ్యాడు.

## నిత్య రోగిష్ఠి

అతడు శారీరకంగా దుర్బలుడు, రోగిష్టి. ఎప్పుడూ తలపోటు, ఏదో కంటి జబ్బు. వెలుగును చూడలేకపోయేవాడు. జీవితాంతం అనారోగ్యం నీడలా వెన్నాడింది. నరాల బలహీనత వల్ల సుకుమారంగా, అబలాత్వం-మూర్తీభవించినట్టుండేవాడు. ఎక్కువగా చెల్లెలుతో ఆడుకునేవాడు. లేదా పుస్తకాలలో తల దూర్చేవాడు. తోటి మగ పిల్లలతో కలిసేవాడు కాడు.

బాల్యంలో ఫోర్టా స్కూలులో చదువుకున్నాడు. అతని పాఠ్యాలు కవిత్వం, సైన్సు, గ్రీక్, లాటిన్. స్కూలు తరవాత బాన్‌లో యూనివర్శిటీలో చదివాడు. ఆ రోజులలోనే పురుష లక్షణంగా మద్యపానం అలవాటు చేసుకున్నాడు. బూతు కవిత్వం చెప్పేవాడు. వేశ్యాగృహాలకు వెళ్లేవాడు. సిఫిలిస్ అంటించుకున్నాడు. తరువాత కాలంలో అతని మతిభ్రమణానికి అదొక కారణమంటారు. త్వరలోనే ఆ బ్రతుకుపై రోతపుట్టి వ్యసనాలకు స్వస్తి చెప్పాడు. అనారోగ్య కారణంగా సెక్సుపట్ల విరక్తి పుట్టింది. సెక్సును పాపంగా భావించిన సన్యాసులు శారీరకంగా అశక్తులై వుండాలని, తమ బలహీనతనే ఒక సుగుణంగా వారు ప్రచారం చేశారని అనుకున్నాడు. మతంపట్ల ఆ రోజులలోనే అతనికి వైముఖ్యం ఏర్పడింది.

బాన్ తర్వాత లీప్జిగ్ యూనివర్శిటీలో చేరి భాషా శాస్త్రం అభ్యసించాడు. శారీరక బలం కోసం పరితపించిపోయేవాడు. తాను పుట్టడమే వృద్ధుడుగా పుట్టినట్టు అనిపించేది. జీవితాన్ని అనుభవించలేక పోతున్నానని కుంగిపోయేవాడు.

## షోపెన్‌హూవర్ ప్రభావం

ఆ రోజులలోనే షోపెన్‌హూవర్ గ్రంథం "ది వర్ల్డ్ యాజ్ విల్ అండ్ ఐడియా" యాదృచ్ఛికంగా అతని కంటపడింది. షోపెన్‌హూవర్ నిరాశావాదం అతని శారీరక మనస్తత్వానికి సరిపోయింది. షోపెన్‌హూవర్ అతడిని విపరీతంగా ప్రభావితం చేశాడు.

జీవనేచ్ఛ ప్రపంచపు మూలసూత్రం. అయితే ఆ ఇచ్ఛ దుఃఖానికి కారణం. కనుక జీవనేచ్ఛ మరణేచ్ఛగా మారాలని షోపెన్‌హూవర్ అన్నాడు. కాని నీషే దీనితో విభేదించి, జీవనేచ్ఛ మానవుడిని నడిపించాలన్నాడు. మరణంపట్ల అతనికి విపరీతమైన భయం.

ఆరోగ్యం సరిగా లేకపోయినా, చూపు బాగాలేదని చెప్పినా అధికారులు అతడిని సైన్యంలోకి నిర్బంధంగా రిక్రూట్ చేశారు. ఒక రోజున గుర్రపు

స్వారీ చేస్తూ కిందపడ్డాడు. ఛాతీపై బలమైన దెబ్బ తగిలింది, సైన్యం నుంచి విడుదల చేశారు. బ్రతుకు జీవుడా అని బయటపడ్డాడు.

అప్పటికే అతని ప్రతిభా వైదుష్యాలను యూనివర్సిటీల అధికారులు గుర్తించారు. డాక్టరేట్ థీసిస్ పూర్తిచేయకముందే స్విట్జర్లెండ్‌లోని బేసిల్ యూనివర్శిటీలో ప్రొఫెసరుగా ఉద్యోగమిచ్చారు. అప్పటికి అతనికి ఇరవై అయిదేళ్లు కూడా లేవు.

ఇంతలో ఫ్రాన్సు, జర్మనీల మధ్య యుద్ధం బద్ధలైంది. వీథులలో సైనిక విన్యాసాలు చూస్తుండగా అతనికి మెరుపులా ఒక ఆలోచన తట్టింది. అది అతని తత్వచింతనకు మూలసూత్రమైంది.

## శక్తిసాధనేచ్ఛ

షోపెన్‌హావర్ జీవనేచ్ఛ ప్రపంచాన్ని నడిపిస్తున్న దన్నాడు. కాని, జీవనేచ్ఛ అంటే ఏదో వూరికే మనుగడ సాగించాలన్న కోరిక కాదు. అది శక్తి సాధనేచ్ఛ– విజయేచ్ఛ– విల్ టు పవర్, విల్ టు ఓవర్‌పవర్.

శక్త్యైష – జిగీష – అదీ జీవిత మూలసూత్రం.

షోపెన్‌హావర్ ఇచ్ఛవల్ల దుఃఖం కలుగుతుందని నిరాశావాది అయ్యాడు. నీషే ఇచ్ఛవల్ల శక్తి కలుగుతుందని ఆశావాది అయ్యాడు.

జీవితం దుఃఖమయమే. కాని, దుఃఖానికి జీవితంలో ప్రధాన స్థానం వున్నది, బాధానుభవం మనిషికి అవసరం. మానవునిలోని గొప్ప గుణాలు బాధలో నుంచే బహిర్గతా లవుతాయి. ముఖ్యంగా జీవనేష, విజిగీష.

ఈ విషయానికి ఉదాహరణగా గ్రీకుల విషాంత నాటకాలను తీసుకుని నీషే ఒక గొప్ప సిద్ధాంత గ్రంథం రచించాడు. గ్రీకు ట్రాజెడీలలో హీరోలను దేవతలు భయంకరంగా శిక్షిస్తారు. ధీరోదాత్తులైన గ్రీకు హీరోలు శిక్షలు అనుభవిస్తారుగాని దేవతలకు తల ఒగ్గరు. విధిని ఎదిరించి తల ఎత్తుకుని సగర్వంగా నిలబడతారు. గ్రీకు హీరోల ధీరోదాత్తతకు పరమోదాహరణ ప్రొమీథియస్. అతడు దేవతల నుంచి అగ్నిని దొంగిలించి మానవులకు అందజేస్తాడు. ఈ నేరానికి అతడిని దేవతలు శిక్షిస్తారు. అతడు చిరంజీవి అయి శాశ్వతంగా ఘోర హింస అనుభవిస్తూ వుంటాడు తప్ప, పశ్చాత్తాపం చెందడు.

## తిరుగుబాటు తత్వం

మానవుడు కూడా అంతే. విధిని, దేవుడిని ఎదిరించి, తిరుగుబాటుచేసి

స్వేచ్ఛ సాధించాలి. బాధలవల్లనే మనిషి బలవంతుడు అవుతాడు. బాధల కొలిమిలో కాలి, మనిషి ఇచ్ఛ శక్తిమంత మవుతుంది. బాధల నుంచి, పోరాటం నుంచి, తిరుగుబాటు నుంచి శక్తి పొందాలి. జీవితంతో రాజీపడేవారు, సుఖాన్ని కామించేవారు మూర్ఖులు, బానిసలు.

గ్రీకులకు ఇరువురు దేవత లున్నారు. ఒకడు డయనీసస్. ఇతడు మానవ ప్రకృతిలోని ఉద్రేకానికి, కాంక్షకు, తృష్ణకు, సౌఖ్యకామనకు ప్రతీక. సంగీతానికి, నాటకానికి అధిదేవత. రెండవ దేవత అపోలో. అతడు ఆలోచనకు, ధీరోదాత్తతకు ప్రతీక. సాహిత్య, శిల్పాది కళలకు అధిదేవత. ఈ రెండు దేవతా ప్రతీకల సమ్మేళనం నుంచి గ్రీకు ట్రాజెడీ పుట్టిందని నీషే భావించాడు. గ్రీకులకు జీవిత దుఃఖం తెలుసు, కాని జీవనానందం కూడా తెలుసు.

డయనీసస్‌నే బాకస్ అని కూడా అంటారు. అతడు షోపెన్‌హూవర్ చెప్పిన ఇచ్ఛకు ప్రతీక. భావానికి అపోలో ప్రతీక. జీవితాన్ని ఈ రెండింటి కలయికగా, శక్తికి, ఆనందానికి సమన్వయంగా చూడాలి. కేవలం దుఃఖమయంగా చూడడం షోపెన్‌హూవర్ చేసిన పొరపాటు.

## వాగ్నర్‌తో స్నేహం

నీషే ఎప్పుడూ ఒంటరిగానే గడిపేవాడు. అతనికి ఒకే ఒక్క స్నేహితుడుండేవాడు. బేసిల్ యూనివర్సిటీలో పనిచేసే రోజులలో అతనికి రిచర్డ్ వాగ్నర్‌తో పరిచయమైంది. వాగ్నర్ కవిగా సంగీతకారుడుగా, సంగీతరూపక స్రష్టగా అప్పటికే యూరప్‌లో సుప్రసిద్ధుడు. పైగా షోపెన్‌హూవర్ తత్వచింతన ప్రభావం అతనిపై చాలా వుంది. బహుశా ఈ కారణం వల్లనే వాగ్నర్, నీషే పరస్పరాభిమానులై వుంటారు.

నీషే నిత్య వ్యాధిగ్రస్తుడు. తలనొప్పి తరచుగా వచ్చేది. బేసిల్ యూనివర్సిటీలో ఉద్యోగానికి రాజీనామా ఇచ్చాడు. ఒకచోటి నుంచి ఒకచోటికి మకాం మార్చేవాడు. ఒక ఆస్పత్రినుంచి మరొక ఆస్పత్రికి తిరిగేవాడు. ఎక్కడా అతనికి ఉపశాంతి లభించలేదు. 1879 లో అతని వ్యాధి మరీ ముదిరిపోయింది. అంతిమ ఘడియలు ఆసన్నమైనాయనే అనుకున్నాడు. అప్పటికి అతనికి 35 ఏళ్లు. తన తండ్రి 35 వ ఏటనే మరణించాడు. తాను కూడా అంతేననుకున్నాడు. చెల్లెలుతో చెప్పాడు—తాను చనిపోతే తన శవపేటిక వద్దకు మిత్రులను తప్ప క్రైస్తవ మత గురువులను రానివ్వవద్దని, మతలాంఛనాలు లేకుండా ఖననం చేయాలని.

## భగ్నప్రేమ

కాని, అతడు భయపడినట్టుగా చనిపోలేదు. ఆరోగ్యం నెమ్మదిగా కుదుట

పడింది. కొండలలో తిరిగాడు, రోమ్‌లో కొన్నాళ్ళున్నాడు. అక్కడ ఫిన్లెండ్‌కు చెందిన లూవాన్ సెలోమీ అనే అందాలరాశి, అతని అభిమానురాలు తటస్థ పడింది. ఆమెను ప్రేమించాడు. పెళ్ళి చేసుకుంటా నన్నాడు. కాని, ఆమె అతని రచనలను తప్ప అతడిని ప్రేమించలేక పోయింది. ఎంత గొప్ప తత్వవేత్త అయినా రోగిష్ఠిని ఎవరు పెళ్ళి చేసుకుంటారు? చివరికి ఆమె తత్వశాస్త్రపు ఓనమాలు కూడా తెలియని ఒక యువకుడిని పెళ్ళి చేసుకుంది. దానితో అతడు మానసికంగా క్రుంగిపోయాడు. ఆడజాతిని నమ్మరాదనుకుని వారిని ఘాటుగా విమర్శిస్తూ సుభాషితాలు వ్రాసేవాడు.

చివరికి అతనికివున్న ఒకే ఒక్క స్నేహితుడైన వాగ్నర్‌తో కూడా తగాదా పెట్టుకున్నాడు. అప్పటిలో వాగ్నర్ నాస్తికత్వం నుంచి క్రమంగా ఆస్తికత్వం వైపు మారుతున్నాడు. దేవుడిపై, క్రీస్తు ఉపదేశాలపై, చర్చిపై అతనికి నమ్మకం కలుగుతున్నది. మారిన విశ్వాసాలు ఆధారంగా తాను వ్రాస్తున్న "పార్సిఫాల్" అనే సంగీత రూపకం గురించి నీషేకి వాగ్నర్ చెప్పాడు. దానితో నీషే వున్నట్టుండి వాగ్నర్ సాంగత్యం వదిలేశాడు. మళ్ళీ అతనితో మాట్లాడలేదు, పైగా వాగ్నర్‌పై తీవ్ర విమర్శలు ప్రచురించాడు.

క్రమంగా నీషే భావాలు క్రైస్తవ మతానికి, విలువలకు వ్యతిరేకంగా మారడం ప్రారంభించాయి. అతని ఈ అంతర్మథనం నుంచి జనించిన ఉద్గ్రంథమే "దజ్ స్పేక్ జరతూస్త్ర". నీషే పెక్కు రచనలు చేశాడు. అన్నిటిలోకి బహుళ ప్రచారం పొంది, బహుధా ప్రభావం ప్రసరించింది ఈ గ్రంథమే. 1883 లో ఆ గ్రంథం వెలువడింది. అది తత్వశాస్త్రం కాదు. ఒక దర్శనం. ద్రష్టగా, కవిగా, గొప్ప కవితా సౌందర్యాత్మకంగా నీషే ఆ గ్రంథం వ్రాశాడు. 19 వ శతాబ్దపు మహా గ్రంథాలలో ఒకటిగా దాన్ని పండితులు పరిగణించారు. అతని తత్వచింతన సారాంశమంతా దానిలో నిక్షిప్తమైంది. ఆ తర్వాత నీషే అనేక గ్రంథాలు వ్రాశాడు. కాని, అవన్నీ ఆ గ్రంథానికి భాష్య ప్రాయమైన రచనలే.

"దజ్ స్పేక్ జరతూస్త్ర" అంటే "జరతూస్త్ర ఇలా అన్నాడు" అని అర్థం.

## నీషే అధిమానవ వాదం

జరతూస్త్ర ప్రాచీన కాలపు పర్షియన్ మత ప్రవక్త. క్రీస్తుపూర్వం పన్నెండవ శతాబ్ది వాడని ప్రతీతి. అతడినే జొరాస్టర్ అని కూడా అంటారు. అతని పేరుమీదుగా విలసిల్లినదే జొరాస్ట్రియన్ మతం.

తన ఇరవైయవ ఏట జొరాస్టర్ ఇల్లు విడిచి ఒక పర్వత శిఖరానికి వెళ్లి పదేళ్లపాటు తపస్సు చేశాడు. ఒక దేవదూత వచ్చి అతడిని దేవుని వద్దకు తీసుకువెళ్లాడు. దేవుడు అతనికి జ్ఞానబోధచేసి, దాన్ని ప్రపంచంలో వ్యాప్తిచేయవలసిందిగా, ప్రజలను తరింపచేయవలసిందిగా ఆజ్ఞాపించాడు.

పర్షియాలో మహమ్మదీయ మత వ్యాప్తితో జొరాస్ట్రియన్ మతం అంతరించింది. కొంతమంది జొరాస్ట్రియన్‌లు మాత్రం పర్షియానుంచి కాందిశీకులుగా భారతదేశం వచ్చి స్థిరపడ్డారు. వారే ఈనాటి పార్సీల పూర్వులు.

"దజ్ స్పేక్ జరతూస్త్ర"లో నీషే ఆ మత ప్రవక్త పేరును మాత్రం వాడుకున్నాడు. ఆనాటి జొరాస్టర్ బోధలకు, నీషే తన గ్రంథంలో జరతూస్త్ర నోట పలికించిన బోధలకు పోలిక లేదు. అవన్నీ నీషే భావాలే.

నీషే గ్రంథంలోని జరతూస్త్ర కూడా ఇల్లు విడిచి పర్వత శిఖరం మీదికి వెళ్లి ధ్యానసమాధిలో నిమగ్నుడవుతాడు. తన ముప్పదవయేట క్రిందికి దిగి వస్తాడు. తాను కనుగొన్న సత్యాన్ని ప్రజలకు బోధించా లనుకుంటాడు.

దారిలో ఒక సాధువు ఎదురవుతాడు. వారిద్దరిమధ్య సంభాషణ జరుగుతుంది. ప్రజలకు జ్ఞానబోధ చేయడం దండుగ అని సాధువు అంటాడు. దేవుని ప్రసక్తి కూడా తెస్తాడు. తిరిగి అడవులలోకి పొమ్మంటాడు. అతని మాటలకు జరతూస్త్ర ఆశ్చర్యపడతాడు. "ఈ సాధువు మూఢుడిలా వున్నాడే. దేవుడు మరణించిన సంగతి ఇతడింకా వినలేదు కాబోలు" అనుకుంటాడు. ముందుకు సాగిపోతాడు.

జరతూస్త్ర ఒక పట్టణానికి వెడతాడు. అక్కడ జనం గుమిగూడి ఒకడు తాడుమీద ఎక్కి గడసాము చేస్తుంటే చూసి వినోదిస్తుంటారు. వారి వద్దకు వెళ్లి జరతూస్త్ర తన సందేశం వినిపిస్తాడు. వారు వినిపించుకోరు. అయినా, అతడు పట్టుదలగా చెప్పుకుపోతుంటాడు.

## నూతన సందేశం

నరులు వానరులవలె బ్రతుకుతున్నారు. మానవుడు అధిమానవుడు కావాలి. భూలోకానికి అర్థం మానవుడు. ఉన్నదంతా ఇహలోకం ఒక్కటే. పరలోకం లేదు. జీవితాన్ని ప్రేమించాలి. ఒకప్పుడు దేవుడిని నిందించడం పాపం. ఇప్పుడు భూలోకాన్ని, జీవితాన్ని నిందించడం పాపం. న్యాయం, హేతువు, దయ, మంచితనం ఇలాంటి భావాలతో జీవితాన్ని కలుషితం చేయరాదు. మానవుడు జీవితాన్ని అర్థవంతం చేసుకోవాలి.

ఈ సందేశం విని జనం జరతూష్ట్రను ఈసడిస్తారు, ఏడిపిస్తారు. "గడ సాము ఆటగాడు రావాలి" అని కేకలు పెడతారు. వారికి బోధ చేయడం వృథా అని జరతూష్ట్ర గ్రహిస్తాడు.

ఆటగాడు గడసాము చేస్తుండగా, హాస్యగాడు వాడిని తాడుమీదనుంచి తోసి వేస్తాడు. ఆటగాడు కిందపడి గాయపడి చనిపోతాడు. వాడు కొన ఊపిరితో వుండగా జరతూష్ట్ర ఓదారుస్తాడు—మృత్యువు భయపడదగింది కాదు. ఎందుకంటే నరకం లేదు, సైతాను లేదు. దేహంతోపాటు ఆత్మకూడా చనిపోతుంది—అని చెబుతాడు.

జనం నెమ్మదిగా నిష్క్రమిస్తారు. చీకటి పడుతుంది. హాస్యగాడు మళ్లీ వస్తాడు. "నీ బోధలకు జనానికి కోపం వచ్చింది. ఇక్కడ వుండడం క్షేమం కాదు. వెళ్లిపో" అని జరతూష్ట్రతో చెబుతాడు.

జరతూష్ట్ర ఆటగాడి శవాన్ని తీసుకుని అడవిలోకిపోయి ఆ రాత్రంతా శవజాగరణ చేస్తాడు. తెల్లవారిన తర్వాత దాన్ని పాతిపెడతాడు. అతనికి ఒక విషయం తెలిసివస్తుంది : జనానికి నేరుగా సత్యబోధ చేయరాదు. నూతన జ్ఞానాన్ని సహృదయంతో అవగాహన చేసుకోగలవారికే చెప్పాలి. కొద్దిమంది శిష్యులను చేర్చుకోవాలి.

## జరతూష్ట్ర ఉవాచ

నీషే ఈవిధంగా కథ ప్రారంభించి జరతూష్ట్రచేత వందలాదిగా తన సుభాషితాలు పలికిస్తాడు. ఆ గ్రంథాన్ని 1883 లో ప్రచురించినప్పుడు ఎవరూ పట్టించుకోలేదు. నలభై కాపీలు అమ్ముడు కావడం గగనమైంది. కాని, క్రమంగా అది బహుళ ప్రాచుర్యం పొంది ప్రపంచపు ఉత్తమ గ్రంథాలలో ఒకటిగా పేరు పొందింది. దానిలో నీషే తన అధిమానవవాదాన్ని ఆవిష్కరించాడు. అధిమానవుడు అంటే సూపర్‌మాన్ (Superman). మానవుడు తన ప్రస్తుత స్థితిని అతిగమించి అధిమానవుడు కావాలని నీషే దానిలో బోధిస్తాడు.

మచ్చుకు దానిలో ఒక ఖండిక :

"దేవతలందరు మరణించారు. ఇప్పుడు మనం అధిమానవుడిని ఆవాహన చేద్దాము."

మీకు అధిమానవుడిని గురించి ఉపదేశిస్తాను. మానవుడు అతిగమించదగినవాడు (to be surpassed.) మానవుడిని అతిగమించడానికి మీరు ఏం చేశారు?

మానవుడిలో గొప్పదనం ఏమిటంటే, అతడు లక్ష్యం కాదు; వంతెన. అతనిలో ప్రేమించదగింది ఏమైనా వుంటే అది అతడు సంధి దశ కావడం, అంతిమదశ కావడం.

వినాశనంలోనే తప్ప జీవించడం ఎరుగని వారిని నేను ప్రేమిస్తాను. ఎందు కంటే వారే అవతలి తీరానికి వెడతారు.

ద్వేషించే వారిని నేను ప్రేమిస్తాను. వారే ఆరాధించేవారు. అవతలి తీరాన్ని చేరగోరే బాణాలు వారు.

వినాశనం కావడానికి, బలి కావడానికి కారణంకోసం నక్షత్రాలకు అవ తలివైపు చూడని వారిని నేను ప్రేమిస్తాను. భూలోకం ఏదో ఒకనాడు అధిమానవుడికి ఆవాసం కావడంకోసం తమను తాము త్యాగం చేసుకొనే వారిని నేను ప్రేమిస్తాను.

నరుడు తన లక్ష్యాన్ని నిర్దేశించవలసిన సమయం ఆసన్నమైంది. తన అత్యు న్నత ఆదర్శబీజాన్ని నాటవలసిన అదను వచ్చింది.

చెప్పండి, సోదరులారా! మానవజాతి లక్ష్యహీనమైతే మానవజాతే హీనమై పోదా?

"అంతిమ మానవునిపట్ల ప్రేమ పొరుగువాడిపై ప్రేమకంటే గొప్పది."

## అధిమానవు డెవరు?

ఎవరు అధిమానవుడు ? అతడు ఏం చేస్తాడు ? షోపెన్‌హావర్ జీవనేచ్ఛయే చోదకశక్తి (driving force) అన్నాడు. కాని, అసలైన చోదకశక్తి అధిక్యాన్ని, అధివత్యాన్ని, ఔన్నత్యాన్ని-ఒక్క మాటలో శక్తిని కోరడం (Will to Power).

శక్తికోసం మానవుడు ఏదైనా చేస్తాడు, చేయాలి. అది తోటి మానవు లపై అధిక్యం కావచ్చు; ప్రకృతిపై కావచ్చు: దుఃఖంపై, బాధలపై, జీవితంపై, మృత్యువుపై కావచ్చు; మొత్తంపై అధిక్యసాధన-అదీ చోదకశక్తి. ఇతరులతో పోటీ—కళలలో, యుద్ధంలో, అధికారంలో, మేధాశక్తిలో, ఇంద్రియ నిగ్రహంలో, బాధాసహిష్ణుతలో అధిక్యం—అదీ చోదకశక్తి (driving force).

ప్రాణికి మనుగడకోసం పోరాటం (struggle for existence) సహజం అన్నాడు డార్విన్. అంటే ప్రాణి తన పరిసరాలకు అనుగుణంగా పరిణామం చెందడా నికి ప్రయత్నిస్తుంది. అలా పరిసరాలకు అనుగుణంగా వున్న ప్రాణులనే ప్రకృతి వర్ధిల్లజేస్తుంది. అటువంటి ప్రాణులే కొనసాగుతాయి.

కాని, ఇది సరికాదు. మనుగడకోసం పోరాటం అంటే పరిసరాలపై పోరాటం. ప్రాణి తాను పరిసరాలకు అనుగుణంగా వుండడానికి కాక, తనకు అనుగుణంగా పరిసరాలను మార్చుకొనడానికి పోరాటం సాగిస్తుంది. అలా పోరాడి విజయం పొందిన ప్రాణులే జీవించడానికి అర్హమైనవి. ఏ ప్రాణీ ప్రకృతి దయవల్ల బ్రతకదు. ఏది బ్రతకాలని కోరుకుంటుందో, దేనిలో జీవనేచ్ఛ బలంగా వుంటుందో అదే బ్రతుకుతుంది.

## పరిణామక్రమం

ప్రపంచం పరిణామ శీలం. ఆ పరిణామం వర్తులాకారం (Circular)గా కాక, ఆవర్తాకారం (spiral) గా జరుగుతుంది. మానవుడి నుంచి అతనికంటె అధిక శక్తిగల అధిమానవుడు రావాలి. ఇంకా బలంగా, ఉద్రేకంగా, సంపూర్ణంగా, విశాలంగా జీవించగల అధిమానవుడు రావాలి. ఎంత సుఖం అనుభవించగలడో, అంత బాధ అనుభవించగల శక్తి, ధైర్యం కలవాడు రావాలి.

సౌఖ్యంకాదు ముఖ్యం. ఆధిక్యం. అదీ ముఖ్యం. శక్తికోసం-సృజనాత్మక శక్తికోసం-సుఖాలను కాలదన్నగలగడం ముఖ్యం. అది ఎంత బాధ, దుఃఖం కలిగించినా, చివరికి అదే నిజమైన ఆనందం కలిగిస్తుంది. బాధారాహిత్యం సుఖం కాదు. బాధలనుంచి శక్తిని సాధించడం ఆనందం కలిగిస్తుంది. కన్నీళ్లు, త్యాగం, బాధలు, ఆత్మహింస, ఆత్మత్యాగం, ఆత్మ నిగ్రహం - అవే ఆనందం కలిగిస్తాయి.

అధిమానవుడు (superman) భౌతిక, నైతిక, ఆత్మిక బలహీనతలను ద్వేషిస్తాడు. తన ఉద్రేకాలను ఉన్నమితం (sublimate) చేసి, వాటిని సృజనాత్మకంగా ఉపయోగిస్తే మానవుడు అధిమానవుడు అవుతాడు.

అలాంటి అధిమానవుడు రావాలంటే మానవజాతి తన ఇప్పటి విలువలన్నిటిని వదలివేయాలి. కొత్త విలువలను సృష్టించుకోవాలి.

## క్రైస్తవ నీతి

ఇప్పటి విలువలు (Values) యూదులనుంచి, క్రైస్తవ మతంనుంచి వచ్చినవి. ఈ నైతిక మూల్యాలు శతాబ్దాలుగా మానవులను నిర్వీర్యులుగా చేశాయి. క్రైస్తవ నీతి బానిసల నీతి, జీవితాన్ని యథాతథంగా ఎదుర్కొనలేని బలహీనుల నీతి, జీవితాన్ని అనుభవించలేని, ఆనందించ లేనివారి నీతి, జీవితపు అపాయాల సుడిగుండాలను చూసి భయపడేవారి నీతి. అంతే కాదు. బలవంతులనుంచి తమ్ము తాము రక్షించుకొనడానికి సృష్టించుకున్న నీతి.

వినమ్రత, విధేయత, శరణాగతి, ఈ చెంపపై కొడితే ఆ చెంపను చూపడం, జాలి, దయ, ప్రేమ ఇవన్నీ బలహీనులైన బానిసలు తమ రక్షణ కోసం కల్పించుకున్న నీతులు. అధికసంఖ్యాకులైన బలహీనులు అల్ప సంఖ్యాకులైన ప్రభువులను అణచివేసి, వారిని కూడా తమవలె నిర్వీర్యులుగా చేయడానికి వారికి కూడా ఈ నీతులను బోధించారు. సుఖంగా వుండడం, ఆనందించడం, జీవితాన్ని అనుభవించడం, శక్తిని, ఆధిక్యాన్ని సాధించడం పాపమని, నేరమని వారు ఉపదేశించారు. బలవంతులను లొంగదీసుకొనడానికే వారు పాప పుణ్యాలను, స్వర్గ నరకాలను, దేవుడు విధించే శిక్షను కల్పించారు. ముఖ్యంగా అధిక కాలం బానిసలుగా బ్రతికిన యూదులు తమను అణచివేసినవారి ఆధిక్యాన్ని సహించలేక, అసలు ఆధిక్యేచ్ఛనే పాపమని నిర్ణయించారు. యూదుల నుంచి ఆ నీతి క్రైస్తవ మతానికి అంటుకుంది. "బలహీనులకే స్వర్గరాజ్యం లభిస్తుంది. Blessed are the meek : for they shall inherit the earth" అన్నది క్రైస్తవ సూత్రం. అది పిరికివారి నీతి.

అంతరాత్మ (Conscience)ను, అంతర్వాణిని కూడా బలహీనులే కనిపెట్టారు. అది సమాజాన్ని నిర్వీర్యం చేసింది.

నిజానికి బలవంతులే రాజ్యానికి అర్హులు. రాజ్యం వీరభోజ్యం. బలహీనులకే నీతి, అవినీతి, న్యాయం, అన్యాయం అనే విచక్షణ. బలవంతుడి నీతి మంచి, చెడులకు అతీతం.

"దజ్ స్పేక్ జరతూస్త్ర", ఆ తర్వాత వ్రాసిన మరికొన్ని గ్రంథాలలో నీషే వెల్లడించిన ఈ అభిప్రాయాలు దాదాపు నూరేళ్ల తర్వాత ఇప్పటికి కూడా ఇంత కర్ణకఠోరంగా వుంటే, ఆ రోజులలో అతని సమకాలికులకు ఎంత దారుణంగా వినిపించివుంటాయో ఊహించుకోవచ్చు. అతని అభిమానులకు, స్నేహితు లనదగినవారికి కూడా అవి రుచించలేదు. చివరికి అతనికి సన్నిహితులంటూ ఎవరూ మిగలలేదు. అందరూ అతడిని వదలివేశారు. అతడిని అంతకాలం కనిపెట్టుకునివున్న ఒక్క సోదరి కూడా యూదు విద్వేషిగా పేరుపొందిన ఒకడిని పెళ్లిచేసుకుని పరాగ్వే వెళ్లిపోయింది.

## ఒంటరితనం

నీషే ఒంటరివాడయ్యాడు. అతడికి ప్రజాస్వామ్యంపట్ల బొత్తిగా నమ్మకం లేదు. అల్పసంఖ్యాకులైన యోధులకు, శక్తిమంతులకు వారి శక్తిసామర్థ్యాలను ప్రస్ఫుటింపజేయడానికి ఉపయోగపడడం తప్ప అధిక సంఖ్యాకులైన సామాన్య ప్రజలకు వేరే వ్యక్తిత్వం వుండకూడదని అతని మతం. అయితే, అతనికి జాతి విచక్షణపట్ల, విద్వేషంపట్ల నమ్మకం లేదు. యూదులపట్ల వ్యతిరేకత లేదు.

జాతివాదాన్ని, జాతీయవాదాన్ని కూడా నీషే అంగీకరించలేదు. అన్ని జాతులవారు సమానులేనని, అధిమానవులు ఏ జాతిలోనైనా ఉద్భవించవచ్చునని అతని విశ్వాసం. అందుచేతనే తన సోదరి ఒక యూదు విద్వేషిని వివాహం చేసుకోనడం అతనికి చాలా మనస్తాపం కలిగించింది.

క్రమంగా అతని ఆరోగ్యం క్షీణించింది. బాల్యం నుంచి అంతంతమాత్రమైన కంటి చూపు బాగా మందగించింది. మనస్సు ఎంత చురుకుగా, తీక్షణంగా, ప్రతిభా వంతంగా ప్రజ్వలిస్తూ వుండేదో శరీరం అంతగా జర్జరితమైపోయింది. చివరికి అతని ప్రజ్ఞా తీక్షణత మెదడును కూడా కాల్చివేసింది.

అప్పటికి అతనికి 45 సంవత్సరాల వయస్సు. 1889 జనవరిలో ఉన్మాదం ఆవహించింది. పదేళ్లపాటు పిచ్చాసుపత్రులలో గడిపాడు. ప్రపంచ చరిత్రాకాశం మీద నూతన శతాబ్ది ఉదయిస్తుండగా-1900 లో అంతిమ శ్వాస విడిచాడు.

## వ్యక్తిగా నీషే

వ్యక్తిగా నీషే చీమను కూడా చంపడానికి చేతులు రానంతటి సుకుమార మనస్తత్వం కలవాడు. క్రౌర్యాన్ని, హింసను అతడు సహించలేకపోయేవాడు. అయినా, తన తత్వచింతనలో మాత్రం శౌర్య, ధైర్యవంతుడైన వాడికి, బలోపేతుడైనవాడికి సాధారణ నీతి నియమాలేవీ అడ్డురావని, రాకూడదని ప్రబోధించాడు. శక్తి సాధనే మానవ ధ్యేయమని ప్రవచించాడు.

శారీరకంగా అతడు దుర్బలుడు; మానసికంగా కూడా బలహీనుడు. కనుకనే, ఆ దౌర్బల్యాన్ని అధిగమించడానికి ఒక మార్గంగా అతడు శక్తిని, ధైర్యసాహసాలతో కూడిన జీవితాన్ని, అన్ని నీతినియమాలకు అతీతమైన అధిమానవత్వాన్ని ఆరాధించాడని అర్థం చేసుకోవలసి వుంటుంది. తన బలహీనత నుంచి తనకే మానసిక రక్షణగా శక్తిని ఉపాసించాడని అనుకోవలసివస్తుంది.

ఆధునిక మనస్తత్వ శాస్త్రవేత్తలలో అగ్రగణ్యులలో ఒకడైన ఆల్ఫ్రెడ్ యాడ్లర్ (Adler) పై నీషే ప్రభావం చాలా వున్నది. తాను అల్పుడనని, అధముడనని న్యూనతాభావం (inferiority feeling) తో తనకే తెలియకుండా బాధపడే వ్యక్తి ఆ భావంనుంచి రక్షణగా ఒక ఆధిక్య భావాన్ని (superiority feeling) పెంపొందించుకుంటాడని, న్యూనతాభావం దౌర్జన్యపూరితమైన ఆధిక్యభావంగా బహిర్గత మవుతుందని యాడ్లర్ సిద్ధాంతీకరించాడు. ఈ సిద్ధాంతీకరణ నీషేకి అతికినట్టు సరిపోతుంది.

## నాజీజం

నీషే తత్వసిద్ధాంతాలను నాజీలు, ఫాసిస్టులు స్వప్రయోజనాలకు వాడుకు

న్నారు. ముఖ్యంగా నాజీలు అతడిని తమ అధికార తత్వవేత్తగా పరిగణించారు. హిట్లర్ అధికారానికి వచ్చిన తర్వాత వీమర్ నగరంలో నీషే మరణించిన గృహానికి వెళ్లి నీషే స్మృతికి జోహారు లర్పించాడు. ఆ సందర్భంలో నీషే సోదరి హిట్లర్‌కు స్వయంగా స్వాగతం చెప్పింది. నీషే భావాలలో కొన్ని నాజీజంను సమర్థిస్తున్నట్టు కనబడవచ్చు. కాని, నాజీల ప్రధాన సూత్రాలైన ఆర్యజాతి ఆధిక్యం, యూదు విద్వేషం నీషేలో మచ్చుకైనా కనబడవని గుర్తుంచుకోవాలి. సమకాలికమైన యూరోపియన్ సమాజంలో క్రైస్తవ నీతి పేరిట వ్యాప్తమైన కృత్రిమత్వాన్ని, ఆధునిక నాగరికతలోని వంచనా శిల్పాన్ని తూర్పారపట్టడానికి నీషే తన అధిమానవ వాదాన్ని ప్రయోగించాడు. అయితే, అతనిలో ఆ వాదం "అతి" అయింది. అతడు అతిశయోక్తులతో తన వాదాన్ని ప్రబోధించాడు. అది నాజీజం వంటి అమానుష సిద్ధాంతానికి దారితీసింది.

ఈ విషయంలోనే కాక, తత్వశాస్త్రానికి సంబంధించిన మరి పెక్కు సాంకేతిక విషయాలలో కూడా నీషే భావాలను పలువురు వ్యాఖ్యాతలు తీవ్రంగా విమర్శించారు.

అదే సమయంలో పాశ్చాత్య తత్వశాస్త్రంలో అతని చింతన ఒక మైలురాయిగా, జర్మన్ భాషలో అతని కవితాగంధి వచనం శిఖరాయమానమైనదిగా కీర్తించారు. గ్రీకు విషాదాంత నాటకాలకు అతడు చేసిన భాష్యం నేటికీ శిరోధార్యంగా భావిస్తున్నారు. కృత్రిమమైన బూర్జువా విలువలను చీల్చి చెండాడిన వాడుగా పరిగణిస్తున్నారు.

మానవ ప్రవర్తనకు శక్తిసాధనేచ్ఛయే చోదక శక్తి అని నీషే చేసిన సిద్ధాంతం మానవ ప్రకృతిలోని రహస్య ప్రదేశాలపై కొత్త వెలుగు ప్రసరించింది. దయ, జాలి, ప్రేమ మొదలైన నైతిక మూల్యాల అడుగున గల ప్రేరణలను అతడు కొత్త దృష్టి నుంచి పరిశీలించాడు. అయితే, అతని భావాలకు అతివ్యాప్తి దోషం కలదనడంలో- అతడు తాను చెప్పదలచినదాన్ని అతిశయోక్తిగా చెప్పాడని అనడంలో - వీసమైనా సందేహం లేదు. అందుచేత అతడి చింతనలో ఎక్కువ భాగాన్ని తిరస్కరించవలసి వుంటుంది.



# 31
# అస్తిత్వవాద పితామహుడు కీర్క్‌గార్డ్

తత్వశాస్త్రం పట్ల ప్రత్యేకాభిరుచి లేనివారిలో కూడా అస్తిత్వ వాదం గురించి వినని వారు, ఎంతోకొంత తెలియనివారు వుండరు. ద్వితీయ ప్రపంచ యుద్ధ కాలంలోను, ఆ తర్వాతను పాశ్చాత్య దేశాలలో అదొక ఫ్యాషన్ అయింది. అస్తిత్వవాదం గురించి క్లబ్బులలో, రెస్టారెంటులలో, ఇతర సమావేశ స్థలాలలో మాట్లాడుకోవడం, చర్చించుకోవడం రచయితల, మేధావుల అభిరుచికి ఒక చిహ్నం అయింది. 1950 ప్రాంతాలలో అస్తిత్వవాదం తెలుగు రచయితలను, మేధావులను కూడా ఆకర్షించింది.

అస్తిత్వవాదపు ఈ ప్రాచుర్యానికి కారణం ఫ్రెంచి రచయిత, తత్వవేత్త జాఁ పాల్ సార్త్రె. ఆయన తన కథలు, నవలలు, నాటకాలు, వ్యాసాలు, తత్వ గ్రంథాల ద్వారా దాన్ని ఒక ఉద్యమ స్థాయికి తీసుకువెళ్లాడు. ద్వితీయ ప్రపంచ యుద్ధకాలంలో నాజీలు, ఫాసిస్టుల క్రౌర్యం, దారుణ దురంతాలవల్ల జనించిన నిరాశా, నిస్పృహల వాతావరణం కూడా అస్తిత్వవాదంపట్ల ఆకర్షణకు కారణమైంది.

సాధారణార్థంలో అస్తిత్వ వాదం ఒక తాత్విక వ్యవస్థ– ఫిలసాఫికల్ సిస్టమ్- కాదు. ఎందుకంటే తత్వశాస్త్రానికి తర్క నిరూపణ, హేతుబద్ధత జీవగర్ర. వస్తు పరత్వం- ఆబ్జక్టివిటీ- దానికి ముఖ్యం. కాని అస్తిత్వ వాదం వీటికి వ్యతిరేకంగా, అతితంగా ఆత్మాశ్రయతను-- సబ్జక్టివిటీని- ఆధారం చేసుకున్నది. నిజానికి, దాన్ని యాంటీ ఫిలాసఫీగా,-- ఫిలాసఫీ ఆఫ్ ది అబ్సర్డ్‌గా- పేర్కొంటారు. హేతుపరత్వానికి- రేషనలిజమ్‌కు– అది విరుద్ధం.

## శాఖాభేదాలు

అదికాక, అస్తిత్వవాదంలో ఎన్నో శాఖాభేదా లున్నాయి. అస్తిత్వవాదులలో కొందరు ఆస్తికులైతే, కొందరు నాస్తికులు. మళ్లీ వారిలోను, వీరిలోను కూడా ఎవరివాదం వారిది, ఎవరి ధోరణి వారిది.

అయినా, మొత్తంమీద కనిపించే సామాన్య లక్షణాలనుబట్టి హస్సెర్ల్, హైడెగ్గర్, యాస్పర్స్, మార్సెల్, సార్త్రె మొదలైన వారిని స్థూలంగా అస్తిత్వవాదులని పేర్కొంటారు. వీరిలో కొందరు తాము అస్తిత్వవాదులమని అంగీకరించరు. అయినా, అస్తిత్వవాద లక్షణాలు వారి చింతనలో వ్యక్తమైన మేరకు వారిని అస్తిత్వ వాదులుగానే పరిగణించాలి.

అస్తిత్వవాదం అంటే ఏమిటి? "ఎగ్జిస్టెన్స్" అంటే అస్తిత్వం, ఉనికి, ఉండడం. దానికి సంబంధించిన వాదం "ఎగ్జిస్టెన్షలిజం"- తెలుగులో అస్తిత్వ వాదం.

## హేతువాదం

ప్లేటోనుంచి తీసుకుంటే తాత్వికులలో ఎక్కువమంది హేతువాదులు. అంటే ఈ విశ్వం హేతుబద్ధ మైనదని విశ్వసించినవారు. కొన్ని సూత్రాలకు, నియమాలకు కట్టుబడి విశ్వం నడుస్తున్నది. కనుకనే దాన్ని మానవుడు హేతువు (reason) ద్వారా అర్థం చేసుకో గలుగుతున్నాడు. మనిషి స్వతహాగా బుద్ధిజీవి, హేతువాది (rational being).

మానవుడిలో హేతు వ్యతిరేకత (Irrationalism), దానివల్ల జనించే ఉద్రేకాలు, ఉద్వేగాలు, ఉన్మాదాలు లేకపోలేదు. కాని, వాటిని బుద్ధిబలంతో అణచివేసి మనిషి హేతుబద్ధంగా జీవించాలి. హేతు వ్యతిరేకతకు కారణం అవిద్య, అజ్ఞానం.

హేతువాదం హెగెల్‌లో పరాకాష్ఠకు వెళ్లింది. విశ్వానికి మూలసూత్రం హేతుబద్ధత అన్నాడు. వాస్తవ మైనదంతా హేతు బద్ధం, హేతుబద్ధ మైనదంతా వాస్తవం అని హెగెల్ నిర్వచించాడు.

అలాగే నీతి-ఏథిక్స్. వ్యక్తినీతి అనేది లేదు. ఉన్నదంతా సంఘనీతి-మనిషికొక నీతి చొప్పున వుండదు. నీతి విశ్వజనీనమైనది. నీతిసూత్రాలు మానవులందరికీ సమానంగా వర్తిస్తాయి. కాంట్ కాటిగారికల్ ఇంపరేటివ్ను—అసందిగ్ధ, సార్వజనీన కర్తవ్యాన్ని- ప్రవచించాడు. మనకు ఏదైనా ఒక సందర్భంలో ఏది కర్తవ్యం, ఏది నీతి అని ధర్మమీమాంస వచ్చినప్పుడు మనం అనుసరించదలచిన మార్గం మానవులందరు అనుసరించదగినది అవునా, కాదా అని ఆలోచించాలి.

## వైయక్తిక వాదం

అస్తిత్వవాదులు ఈ వాదాన్ని తిరస్కరించారు. దానికి ఎదురు తిరిగారు. వైయక్తిక వాదాన్ని ఉపదేశించారు.

హేతువాదులు, భావవాదులు ప్రతిదాన్ని సాధారణీకరించారు. ఉదాహరణకు ప్రపంచం, మానవజాతి, సంఘం, రాజ్యం, మతం, చరిత్ర, సైన్సు, మానవ స్వభావం, ఇవన్నీ సాధారణీకరణాలు; సామస్త్యాన్ని (Totality) ప్రాతిపదికగా తీసుకున్న భావాలు. వీటిలో మానవ వ్యక్తికి (human individual) స్థానం ఎక్కడ? మానవ జాతిలో, మందలో ఒకడుగా మాత్రమే వ్యక్తికి అత్యల్ప స్థానం ఇచ్చారు. ఈ సాధారణీకరణాల మధ్య వ్యక్తి ఒక చిన్న నలుసైపోయాడు. దీన్ని అస్తిత్వవాదులు వ్యతిరేకించారు.

అస్తిత్వవాదులు చెప్పేది ఇది : మానవజాతిలో నీవు, నేను చిన్న నలుసులం. మానవ స్వభావం అనే సాధారణీకృత భావం నీ స్వభావానికి, నా స్వభావానికి, అందరి స్వభావానికి వర్తిస్తుంది అని కొందరు అంటారు.

కాని, ఈ వర్గీకరణ సరైనదేనా? నీకు, నాకు తేడా లేదా? నీవు, నేను ఒకటి ఎలా అవుతాము? నీవు నీవే, నేను నేనే. మనం మానవులమే. కాని, నీలోని మానవుడు వేరు. నాలోని మానవుడు వేరు. అలాగే మరొకనిలోని మానవుడు వేరు. బయటినుంచి చూస్తే, అందరం ఒక విధంగానే కనిపించవచ్చు. కాని, నాలోకి నేను చూచుకున్నప్పుడు, నేను నన్ను ఎలా అర్థంచేసుకుంటానో, నీవు నన్ను అలా అర్థం చేసుకోలేవు. అలాగే నేను నిన్ను అర్థం చేసుకోలేను. సామూహిక హేతువాదంలో వ్యక్తికిగల వ్యక్తిత్వాన్ని విస్మరించడం జరుగుతుంది. అది తప్పు.

## మానవుని అద్వితీయత

నాకు నేను అద్వితీయుడిని. అంటే నా వంటివాడు ప్రపంచంలో మరొ

కదు లేదు. నా ప్రత్యేకత నాదే. ఇది ఎంత అల్పజీవికైనా వర్తిస్తుంది. కనుక వ్యకిత్వపు అద్వితీయత (uniqueness of individual) ప్రపంచానికి మూల సూత్రం. అందుక్కే అసిత్వ వాదానికి మూల పురుషుడైన కీర్క్_గార్డ్ "నేను తత్వశాస్త్రంలో ఒక పేరాగ్రాఫ్ కావడానికి అంగీకరించను" అన్నాడు.

సోరెల్ అబ్యే కీర్క్_గార్డ్ 1813 మే 5వ తేదీన డెన్మార్క్ రాజధాని కోపెన్ హేగన్‌లో జన్మించాడు. తండ్రి మైకేల్ పెడెర్సెన్ కీర్క్_గార్డ్ మొదట నిరుపేద. తర్వాత వర్తక వ్యాపారాలు చేసి బాగా ధనం ఆర్జించాడు. అతడు ప్రొటెస్టెంట్లలో లూథరన్ వర్గానికి చెందినవాడు. అతడు చిన్నతనంలో ఒకసారి తన దారిద్ర్య బాధలను ఓర్చుకోలేక ఒక కొండపైకి వెళ్లి దేవుడిని దూషించాడట. ఆ తర్వాత పశ్చాత్తాపపడ్డాడు. దైవదూషణ చేశానన్న పాప భావం (Sense of guilt) అతడిని జీవితాంతం వెన్నాడుతూనే వుంది. ఎప్పుడూ దిగులుగా, తప్పు చేశానన్న భావంతో కుంగి పోయేవాడు. భార్య చనిపోవడం, ఏడుగురు సంతానంలో అయిదుగురు వరసగా పోవడం తన దైవదూషణ ఫలితమేనని, తనది శాపగ్రస్త కుటుంబమని బాధపడేవాడు.

కీర్క్_గార్డ్ తన 17 వ ఏట కోపెన్‌హేగన్ యూనివర్శిటీలో చేరాడు. మొదట థియాలజీ చదివాడు. తరువాత తత్వశాస్త్రం, సాహిత్యం తీసుకున్నాడు.

తండ్రి 1883 లో చనిపోయాడు. ఆయన ఇచ్చిపోయిన బోలెడు ఆస్తితో పాటు ఆయన దిగులు, పశ్చాత్తాప భావం కూడా కుమారుడికి వారసత్వంగా వచ్చాయి. ఎప్పుడూ విచారంగా వున్నట్టు వుండేవాడు. అయితే, పైకి మాత్రం విచార భావాన్ని కప్పిపుచ్చుకుంటూ ఉల్లాసంగా కనబడడానికి ప్రయత్నించేవాడు.

రెగిన్ ఓల్సెన్ అనే యువతిని గాఢంగా ప్రేమించాడు. ఆమె కూడా అతడిని ప్రేమించింది.

అప్పటికి అతనికి 28 ఏళ్లు. పెళ్లి నిశ్చయమైంది. అయితే, కొన్నాళ్లు అటూ ఇటూ ఊగిసలాడి, చివరికి పెళ్లి నిర్ణయం మార్చుకున్నాడు. అయినా, ఆమె అతడిని పట్టుకుని వదలలేదు. ఏమైనాసరే, పెళ్లి జరగవలసిందేనని పట్టుపట్టింది. కాని, అతడు అంగీకరించలేదు. అయితే, ఆమె ప్రతిష్ఠను కాపాడడానికి ఒక నాటకం ఆడాడు. పెళ్లి నిర్ణయం మార్చుకున్నది తానుకాదని, తాను వట్టి దగుల్బాజీ కనుక ఆమెయే తన్ను పెళ్లాడడానికి నిరాకరించిందని ఒక కట్టుకథ ప్రచారం చేశాడు. చివరికి నిశ్చితార్థం తెగతెంపులైంది.

రెగిన్‌ను కీర్క్_గార్డు పెళ్లి చేసుకొని వుండవచ్చు. సుఖంగా అందరివలెనే

సంసారం చేసి వుండవచ్చు. కాని, తన భావ పరిణతి వేరు, తన ఉద్విగ్నత వేరు. తనకు వివాహ యోగం లేదు. తనను పెళ్లాడి ఆమె సుఖపడలేదు. అందుకే అతడు పెళ్లి నిర్ణయాన్ని మార్చుకున్నాడు. "ఆమెకంటె నేను వెయ్యేళ్ల వృద్ధుడిని" అని డైరీలో వ్రాసుకున్నాడు.

## ప్రధాన ఘట్టం

ఈ ఉదంతం– ప్రేమించడం, పెళ్లి చేసుకోవా లనుకోవడం, చివరికి నిర్ణయం మార్చుకోవడం– కీర్క్‌గార్డ్ జీవితంలోని ప్రధాన ఘట్టటం. అది అతడిని అమితంగా ప్రభావితం చేసింది. ముఖ్యంగా అతడిని రచనా వ్యాసంగానికి పురి కొల్పింది. అతని రచన లన్నిటిలోను ఎక్కడో ఒక చోట రెగిన్ ఓల్సెన్‌తో ప్రేమ వ్యవహారం ప్రసక్తి వస్తూనే వుంటుంది.

కొన్నాళ్లు బెర్లిన్‌లో గడిపి, కోపెన్‌హేగన్ తిరిగి వచ్చాడు. అతని తొలి గ్రంథం 1843 లో - అతని 30 వ ఏట- వెలువడింది. దానిపేరు "ఎయిదర్ / ఆర్" అంటే "అది గాని / ఇది గాని". దాన్ని మారుపేరుతో వ్రాశాడు. కీర్క్‌గార్డ్ దాదాపుగా తన రచనలన్నీ మారు పేర్లతోనే వ్రాశాడు. ఒక సారి ఉపయోగించిన కలం పేరు మరొకసారి ఉపయోగించలేదు. ఒక పేరుతో ఒక గ్రంథం వ్రాస్తే, మరొక పేరుతో వ్యాఖ్యానం వ్రాసేవాడు. ఇది ఆ రోజులలో అందరికి తెలిసిన బహిరంగ రహస్యం.

# చీకటిలో ఏకాకి పొలికేక

రెగిన్ ఓల్సెన్‌తో ప్రేమ వ్యవహారం కీర్క్‌గార్డ్ చింతనా సర్వస్వాన్ని ప్రభావితం చేసింది. ఆమెను పెళ్లి చేసుకొనడానికి మొదట నిర్ణయించుకున్నాడు. తర్వాత పెళ్లి చేసుకోరాదని నిర్ణయించుకున్నాడు.

ఈ నిర్ణయం అతనికి తీవ్ర బాధాకరంగా పరిణమించింది. ఇదేకాదు. మానవుడు నిత్యజీవితంలో చేయవలసివచ్చే ప్రతి నిర్ణయం బాధా పూరితమైనదే; బాధ్యతతో కూడినదే. దీనినుంచే కీర్క్‌గార్డ్ తన చింతన (thought)ను రూపొందించుకున్నాడు.

ఎయిదర్ / ఆర్. ఇదిగాని, అదిగాని. ఇది చేయడమా అది చేయడమా? ఈ సమస్య మానవుడికి ప్రతి ఘట్టంలోను ఎదురవుతుంది. అంటే జీవితం "ఛాయిస్"-నిర్ణయం చేయవలసిన అవసరం-రూపంలో మానవుడిని సవాలు చేస్తుంది. ఆ సవాలుకు జవాబు ఇవ్వడంలో–రెండు ప్రత్యామ్నాయాలు తనను

ఎదుర్కొన్నప్పుడు దేనినో ఒకదాన్ని ఎంచుకోవడంలో– మానవుని అస్తిత్వం వాస్తవ రూపం ధరిస్తుంది.

## నిర్ణయ స్వేచ్ఛ

అస్తిత్వం అనేది ఎక్కడో ఏదో భావ లోకంలో లేదు. దానికి శాశ్వత నిర్దిష్ట రూపం లేదు. అది ప్రతి క్షణం- ఇప్పుడు, ఇక్కడ, వ్యక్తిచేసే నిర్ణయంలో ఆచరణలో నిహితమై వుంది. అటువంటి నిర్ణయం చేసే స్వేచ్ఛ (free will) మానవుడికి వుంది.

ఈ నిర్ణయ స్వేచ్ఛ భీతి (dread)తో, కంపన (trembling)తో కూడినది. ఎందుకంటే ఒక ప్రత్యామ్నాయాన్ని కాదని మరొకదాన్ని ఎంచుకోవడంలో వ్యక్తి ఒకానొక అజ్ఞాత భవిష్యత్తమస్సులోకి దూకుతున్నా డన్నమాట. ఆ నిర్ణయం ఫలితాలు ఎలా వుంటాయో, సుఖమిస్తాయో, దుఃఖమిస్తాయో తెలియదు. అజ్ఞాతంపట్ల ఇట్టిభీతితో అతడు నిర్ణయాలు చేస్తాడు. నిర్ణయ బాధ్యత, నిర్ణయ ఫలితాల బాధ్యత అతనిదే. విధి పైకి, నీతి సూత్రాల పైకి, ఇతరులపైకి బాధ్యత త్రోసివేయడానికి వీలులేదు. కనుకనే వ్యక్తి అస్తిత్వానికి వాస్తవతా రూపం ఇచ్చేది ఈ నిర్ణయ స్వేచ్ఛ- ఛాయిస్.

హెగెలియన్ తత్వ సిద్ధాంతంమీద కీర్క్‌గార్డ్ కత్తి దూశాడు. అంటే అది బుద్ధివాదం మీద, భావవాదం మీద దూసిన కత్తి. హెగెల్ మొత్తం అస్తిత్వాన్ని తత్వ శాస్త్రపు ఇరుకు చట్రంలో ఇరికించడానికి ప్రయత్నించాడు. అది తప్పు. అస్తిత్వం హెగెల్ చెప్పినట్టు స్తబ్ధమైంది కాదు. పూర్వనిర్దిష్ట నియమానుసారంగా ప్రవర్తించేది కాదు. అది క్షణక్షణ పరివర్తనా (becoming) స్వభావం కలిగినది.

## ఆత్మపరత్వం

హెగెలియనిజమ్‌లో మానవుడు ఒక ప్రత్యేక వ్యక్తికాడు. ఒక భావం మాత్రమే. మానవుడు మందలో ఒకడు. అంతే తప్ప అనుక్షణం హృదయం స్పందించే, జీవించే, అనుభవించే జీవి కాడు. భావ వాదంలో వ్యక్తికి పరిగణన లేదు. చరిత్ర, దేశకాలాలు వ్యక్తిలో ప్రతిబింబించవచ్చు కాని, అతని వ్యక్తిత్వం వాటికి అతీతమైంది. వ్యక్తి వ్యక్తే తప్ప అపరిమితుడు కాడు. మొత్తం వాస్తవత్వపు భారాన్ని ఏ ఒక్క వ్యక్తి మోయలేడు. తనంతట తనకు మాత్రమే అనుభవైక వేద్యం అయ్యే తన పరిమిత అస్తిత్వంలోనే వ్యక్తి వుంటాడు. అతడు ఏకాకి. మనిషి వ్యక్తిగా జన్మించి, వ్యక్తిగా పెరిగి, వ్యక్తిగా ప్రవర్తించి, వ్యక్తిగా

బాధలు అనుభవించి, వ్యక్తిగా మరణిస్తాడు. కనుక ఆత్మపరత్వం (Subjectivity) ఒక్కటే నిజం. వస్తుపరత్వం (Objectivity) మిథ్య.

అస్తిత్వవాదులలో ఈశ్వరవాదులు, నిరీశ్వరవాదులు కూడా వున్నారని ఇంతకుముందు తెలుసుకున్నాము. కీర్క్‌గార్డ్ ఈశ్వరవాది. మానవునికి దేవునితో సంబంధం వుంది. దేవుడు అనంతుడు. వ్యక్తి పరిమితుడు. తన పరిమితత్వం (finiteness) వల్ల దేవునికి దూరమై దుఃఖానుభవం పొందుతాడు. ఈ వియోగం (alienation) వల్ల మానవునికి ఆందోళన (anxiety) కలుగుతుంది. దానివల్ల నిస్పృహ (despair) జనిస్తుంది. అది మృత్యువులో పర్యవసించే నిస్పృహ (sickness unto death).

## మూడు దశలు

నిస్పృహనుంచి విముక్తుడు కావడానికి వ్యక్తికి నైతిక జీవనం, ఆధ్యాత్మిక జీవనం తోడ్పడుతాయి. మానవ జీవనయాత్రలో పరివర్తన మూడు దశలలో జరుగుతుంది. మొదటిది సౌందర్యోపాసన, కళాత్మకత (aesthetic way), సుఖానుభవం మొదలైన వాటికి చెందిన దశ. రెండవది నైతిక నిష్ఠకు, కర్తవ్య, పాలనకు చెందిన దశ. మూడవది దివ్య జీవన మార్గం, ఆధ్యాత్మిక దశ. మొదటి దశకు డాన్ యువాన్, రెండవ దశకు సోక్రటీస్, మూడవ దశకు అబ్రహాం (ఓల్డ్ టెస్టమెంట్) ప్రతీకలు.

ఒక దశనుంచి మరొకదశకు పరివర్తన అనేది వ్యక్తి స్వేచ్ఛగా, తనంతట తాను చేసే నిర్ణయాల ద్వారా జరుగుతుంది. వీటిలో మూడవ దశకు చేరడం ఐచ్ఛిక నిర్ణయమయినా అది చీకటిలోకి, అజ్ఞాతంలోకి సాహసంతో, కేవలం విశ్వాస బలంతో వేసిన గంతు (leap into the dark) వంటిది. ఆ దశలో మానవుడు దేవునితో ముఖాముఖి నిలబడతాడు. అది తాత్విక నిర్వచనానికి లొంగని అనుభవైకవేద్యమైన పరివర్తన. ఆ దశలో మానవుడు తన నిజస్వరూపాన్ని తనకు తాను సిద్ధింపజేసు కుంటాడు. అది అనిర్వచనీయమైన ఆధ్యాత్మిక (mystical) అనుభవం. అది అపరోక్షానుభూతి.

జీవితంలో అధికభాగం హెగెలియనిజమ్‌పై తిరుగుబాటులో గడిపిన కీర్క్‌గార్డ్ చివరిదశలో తన సమకాలీన క్రైస్తవ మత వ్యవస్థపై, చర్చిపై అంతే తీవ్ర దృక్పథంతో దాడిచేస్తూ గడిపాడు. చర్చి అనే వ్యవస్థ మానవుడిని ఎలా అస్వతంత్రుడిని, అవ్యక్తిని చేస్తున్నదో చూపిస్తూ పుంఖానుపుంఖంగా రచనలు చేశాడు. "ది మొమెంట్" అనే పత్రిక స్థాపించాడు. దాని సంచికలలో అన్నీ

అతని రచనలే. మతాధికారుల ప్రాబల్యాన్ని హేళన మేళవించిన కర్కశ విమర్శలతో చీల్చి చెండాడాడు. అతడు వస్తుతః దైవ విశ్వాసి. క్రైస్తవుడు, అసలైన క్రైస్తవ మతం ఏదో తెలియజెప్పడానికి రచనలు చేశాడు. ఈ ప్రయత్నంలో అతడిని క్రైస్తవ విరోధిగా, నాస్తికుడుగా కొందరు పరిగణించడం జరిగింది.

## అవసానదశ

ఏకాకిగా, చర్చికి వ్యతిరేకిగా నడిపిన తిరుగుబాటు ఉద్యమంలో కీర్క్‌గార్డ్ శారీరకంగాను, ఆర్థికంగాను బలహీనపడి పోయాడు. ఆరోగ్యం, ఆదాయం రెండూ క్షీణించాయి. "ది మొమెంట్" పత్రిక పదవ సంచికతో అతడు పూర్తిగా దివాళా తీశాడు.

ఒకరోజున కోపెన్ హేగన్ వీథులలో నడుస్తూ, నడుస్తూ పడిపోయాడు. ఎవరో తీసుకువెళ్లి ఆస్పత్రిలో చేర్చారు. నెలరోజుల తర్వాత–1855 నవంబరు 11వ తేదిన– శాశ్వతంగా కన్నుమూశాడు.

అప్పటికి అతనికి 42 ఏళ్లు మాత్రమే. ఒకనాటి అతని ప్రేయసి రెగిన్ ఓల్సెన్ అప్పటికి డేనిష్ వెస్టిండీస్ గవర్నరును పెళ్లాడి సుఖంగా వుంటున్నది. కీర్క్‌గార్డ్ చనిపోవడానికి ముందు తనవద్ద మిగిలిన కొద్దిపాటి విలువైన వస్తువులను ఆమెకు చెందాలని వ్రాసి ఇచ్చాడు.

## పెరిగిన ఆసక్తి

అస్తిత్వవాద పితామహుడైన కీర్క్‌గార్డ్ వ్యథాభరిత జీవిత కథ ఆ విధంగా ముగిసింది. అతని సమకాలికులు అతడు రేకెత్తించిన సమస్యల ప్రాముఖ్యాన్ని గుర్తించలేదు. జర్మన్ భాషలో అతని రచనల అనువాదాలు వెలువడ్డాయి. ముఖ్యంగా ఈ శతాబ్దిలో రెండు ప్రపంచ యుద్ధాల మధ్యకాలంలో అతని రచనలను లోతుగా అధ్యయనం చేయడం ప్రారంభమైంది. ద్వితీయ ప్రపంచ యుద్ధం తర్వాత అస్తిత్వవాదం ఒక ఉద్యమస్థాయికి వెళ్లిన రోజులలో అతని కీర్తి మరింతగా పెరిగింది. అతడు, తనను తాను అస్తిత్వవాదిగా చెప్పుకొనకపోయినా, అతడిని ఆధునిక అస్తిత్వవాదానికి అంకురారోపణ చేసినవాడుగా గుర్తించారు.

## అనుక్షణికం

అస్తిత్వవాదం ఇంతకు ముందు చెప్పినట్లు మానవుడికి ప్రాధాన్యమిస్తుంది. అయితే, మానవుడంటే విశ్వజనీన మానవుడని కాదు. అనుక్షణం స్పందించే,

అనుభవించే, జీవించే, మరణించే వ్యక్తి. నీవూ, నేనూ, అతడు, ఆమె– ఇలా అనబడే వ్యక్తి; ప్రతిక్షణం బాధాభరిత, బాధ్యతాయుత, నైతిక నిర్ణయాలు చేసే వ్యక్తి; తనలోని తనకే తెలిసిన వ్యక్తి. ఆ వ్యక్తికి, అతని వైయక్తికత్వానికి, క్షణక్షణ నిర్ణయ స్వేచ్ఛలో రూపుదిద్దుకునే అతని అస్తిత్వానికి అస్తిత్వవాదం నీరాజనం పడుతుంది. అది నిర్జీవ తర్క శాస్త్రానికి, హేతుబద్ధ తత్వశాస్త్రానికి అతీతమైన వాదం. అందుచేతనే దాన్ని సాంప్రదాయకమైన అర్థంలో తత్వవాదంగా పరిగణించరు. అపారమైన అస్తిత్వవాద తాత్విక సారస్వతం లేకపోలేదు గాని, ఆ వాదాన్ని ఎక్కువగా సృజనాత్మక కళా రూపాలలోనే– నవలలు, నాటకాలు మొదలైన వాటిలోనే–వ్యక్తం చేయడానికి వీలున్నదని అంటారు. ఇందుకు జాఁ పాల్ సార్త్రి, ఆల్బర్ట్ కామూ మొదలైన వారి రచనలు ప్రముఖోదాహరణలు.

"థియేటర్ ఆఫ్ ది అబ్సర్డ్" పేరుతో ప్రసిద్ధమైన ఆధునిక నాటక ప్రక్రియాశాఖకు ప్రేరణ ఇచ్చిన తాత్విక దృక్పథాలలో అస్తిత్వవాదం కూడా ఒకటి.



# 32
# కమ్యూనిస్టు ప్రవక్త కారల్ మార్క్స్

"ఇప్పటి వరకు నడిచిన సమాజ చరిత్ర అంతా వర్గ సంఘర్షణల చరిత్ర!"

ఇది ప్రపంచ ప్రసిద్ధమైన వాక్యాలలో ఒకటి. దీని కర్తలు ఇరువురు జర్మన్ తత్వవేత్తలు. ఒకరు కారల్ మార్క్స్, రెండవవారు ఫ్రెడరిక్ ఎంగెల్స్. వారు 1848 లో ప్రచురించిన "కమ్యూనిస్టు మ్యానిఫెస్టో" అనే చిన్న పుస్తకంలోని ప్రారంభ వాక్యం అది.

అంతే సుప్రసిద్ధమైన ఈ క్రింది వాక్యాలతో ఆ పుస్తకం ఆఖరవుతుంది :

"కమ్యూనిస్టులు తమ అభిప్రాయాలను, ఆశయాలను దాచుకోవడానికి ఇష్ట పడరు. తమ లక్ష్యాలు వర్తమాన సాంఘిక వ్యవస్థను బలప్రయోగంతో పడగొ డితేనే సిద్ధిస్తాయని వారు బహిరంగంగా ప్రకటిస్తున్నారు. రానున్న కమ్యూనిస్టు విప్లవంపట్ల భయంతో పాలక వర్గాలు వణికిపోవాలి. కార్మికులకు పోయేదేమీ లేదు- తమ సంకెళ్లు తప్ప. ఒక వినూత్న ప్రపంచం వారిది కాబోతున్నది. దేశ దేశ కార్మికులారా! ఏకం కండి!"

కమ్యూనిస్ట్ మ్యానిఫెస్టో ఆ వాక్యంతో ప్రారంభమై, ఈ వాక్యాలతో అంతం కావడం యాదృచ్ఛికంగా జరిగింది కాదు. మార్క్స్, ఎంగెల్స్ రూపొందించిన చారిత్రిక భౌతిక వాదానికి (హిస్టారికల్ మెటీరియలిజం) ఆ ప్రారంభవాక్యం కీలకమైన వాక్యం. కమ్యూనిజానికి అది సిద్ధాంత ప్రాతిపదికను సమకూరుస్తుంది. మానవ చరిత్రను అర్థం చేసుకునే పద్ధతిని అది సూచిస్తుంది.

కాగా, "దేశ దేశ కార్మికులారా ! ఏకం కండి !" అని చివర పేర్కొన్న వాక్యం కార్మికులను కార్యాచరణకు పురికొల్పే వాక్యం.

## విప్లవ సిద్ధాంతం

ఒకటి సిద్ధాంత వాక్యం, అంటే థియరీ. రెండవది ఆచరణాత్మక వాక్యం. అంటే ప్రాక్టీస్.

వాగర్థాలకువలె సిద్ధాంతానికి, ఆచరణకు (థియరీ, ప్రాక్టీస్‌లకు) మార్క్సిజంలో అభేదం వున్నది. ఆ రెండింటికి సమాన ప్రాధాన్యం వున్నది. ఒకటి లేకుండా మరొకటి లేదు. వాటి ఏకత్వాన్ని మార్క్సిజం నొక్కి వక్కాణిస్తున్నది.

"విశ్వదర్శనం"లో ఇంతవరకు మనం చదువుకున్న సిద్ధాంతాలన్నీ ఒక ఎత్తు. మార్క్సిజం ఒక్కటీ ఒక ఎత్తు. ప్రాచీనకాలపు గ్రీకు తత్త్వవేత్తలతో "విశ్వదర్శనం" ప్రారంభించాము. రెండు వేల ఏళ్లకు పైగా ఆయా ప్రాచీన, ఆధునిక తత్త్వవేత్తలు ఒకరి సిద్ధాంతాన్ని మరొకరు ఖండించడంతోనే సరిపోయింది.

చాలా చిత్రం ! ఉన్నది ఒకటే విశ్వం. దాన్ని ఒక్కొక్కరు ఒక్కొక్క విధంగా దర్శించారు.

ఈ వివిధ దర్శనాలతోను, విభిన్న సందర్శనాలతోను విసిగిపోయినందునే కావచ్చు- కార్ల్ మార్క్స్ ఒకచోట ఇలా వ్రాశాడు :

"తత్త్వవేత్తలు ప్రపంచాన్ని రకరకాలుగా వ్యాఖ్యానించారు. కాని, అసలు విషయం దాన్ని మార్చడం."

(Philosophers have variously interpreted the world. The point however, is to change it.)

సాధారణంగా ప్రతి తత్త్వవేత్త తన సమకాలిక సాంఘిక వ్యవస్థతో రాజీ పడలేక అంతకంటె ఉత్తమ వ్యవస్థకోసమే తత్త్వచింతన ప్రారంభిస్తాడు. కాని చివరికి-లక్ష్యసాధనకు జరగవలసిన కృషి విషయం మరిచిపోయినట్టు- తాను నిర్మించిన తత్త్వచింతనా దంతగోపురంలోనే కూర్చుండి పోతాడు. మార్క్స్,

ఏంగెల్స్ అలా కాక- తత్వ శోధనతో సమానంగా, దాని కన్న మిన్నగా— లక్ష్య సాధనకు, కార్యాచరణకు ప్రాముఖ్యం ఇచ్చారు. వారు సిద్ధాంతకారులే కాదు, విప్లవకారులు కూడా!

## క్రియకు మార్గదర్శకం

మనం నివసిస్తున్న ప్రపంచాన్ని అర్థం చేసుకోవడం అవసరమే. కాని, అంతటితో ఆగిపోకూడదు. ప్రపంచాన్ని ఎలా మార్చాలో తెలుసుకోవాలి. అలా మార్చడానికి చేయవలసిన సమస్తం చేయాలి. తత్వాన్వేషణ లక్ష్యం సత్య సందర్శన మాత్రమే కారాదు. తత్వశాస్త్రం కార్యాచరణకు మార్గదర్శకం కావాలి.

కనుకనే, మార్క్స్, ఎంగెల్స్ తమ కమ్యూనిస్టు మ్యానిఫెస్టోను— "ఇప్పటి వరకు నడిచిన సమాజ చరిత్ర అంతా వర్గ సంఘర్షణల చరిత్ర" అంటూ ప్రారంభించారు. నడిచిన చరిత్రను, నడుస్తున్న చరిత్రను సమీక్షించారు. ఆ చరిత్ర ఏ దిశగా అనివార్యంగా నడుస్తున్నదో శాస్త్రీయ సూత్రబద్ధంగా కను గొన్నారు. ఆ దిశగా సమాజాన్ని మరింత త్వరగా నడిపించడానికి ఉద్యుక్తులు కావలసిందిగా— అందుకు అర్హత కలదిగా తాము భావించిన కార్మిక వర్గాన్ని — ఉద్బోధించారు.

కమ్యూనిస్టు మ్యానిపెస్టోలోని ప్రారంభ వాక్యానికి, అంతిమ వాక్యానికి అదీ అర్థం. అదీ వాటి సార్థకత.

## మార్క్స్ పేరిట మార్క్సిజం

నేడు మనం మార్క్సిజం అని వ్యవహరిస్తున్న సిద్ధాంత వ్యవస్థకు మార్క్స్, ఎంగెల్స్ ఇరువురు మూల పురుషులే. ఇరువురు కలిసి కొన్ని గ్రంథాలు వ్రాశారు. విడివిడిగా మరికొన్ని వ్రాశారు. ఎంగెల్స్ మార్క్స్‌తో సమాన మైన ప్రతిభా సంపత్తి కలవాడు. అయినా మార్క్స్‌ను తనకంటె ఉన్నతుడుగా, తన నాయకుడుగా అంగీకరించాడు. మార్క్స్‌కు సహచరుడుగా, సహకారుడుగానే తన చారిత్రికపాత్ర అని భావించాడు. ఆ కారణంగానే వారిరువురు జంటగా రూపొందించిన సిద్ధాంత వ్యవస్థ మార్క్స్ పేరు మీదుగానే మార్క్సిజం అని చెలామణీలోకి వచ్చింది.

## మత గ్రంథాలు

మార్క్స్, ఎంగెల్స్ గ్రంథాలు ప్రపంచపు కమ్యూనిస్టులకు వేదాలతో సమానం. కమ్యూనిస్టు మ్యానిఫెస్టో భగవద్గీత అయితే, "దస్ క్యాపిటల్" బైబుల్. మతా

నికి వారిరువురు బద్ధ వ్యతిరేకులే కాని, తను రచనలు తమ అనుయాయులచే మత గ్రంథాల స్థాయికి తీసుకుపోబడకుండా వారు నివారించలేకపోయారు. ఒకానొక సందర్భంలో మార్క్స్ ఎవరిమీదనో విసుగుపుట్టి "నేను మార్క్సిస్టును కాను— (I am not a Marxist)" అని మందలించవలసివచ్చిందట. సాధారణంగా మత గ్రంథాలకు భాష్య భేదాలుండవచ్చు తప్ప అవి మౌలికంగా ప్రశ్నించడానికి వీలులేనివి. అలాగే కమ్యూనిస్టులు అధికారికంగా ఆమోద ముద్ర వేసిన గ్రంథాలు వారి దృష్టిలో ప్రశ్నలకు అతీతమైనవి.

ఇరువురు గ్రంథాలలో కనీసం కొన్ని అయినా తర్జుమా కాని ప్రధాన ప్రపంచ భాషలంటూ లేవు. దేశం తర్వాత దేశాన్ని, తరం తర్వాత తరాన్ని అంతగా ప్రభావితం చేసిన సిద్ధాంతం కూడా — ప్రపంచ పరివ్యాప్త మతాలను మినహాయిస్తే—మరొకటి లేదేమో. మొదటిసారిగా కమ్యూనిస్టు మ్యానిఫెస్టోను చదువుతున్న యువకులకు నెత్తురు ఉడుకెత్తుతుంది. మరో ప్రపంచపుపిలుపు పిడుగులా మేలుకొలుపుతుంది. "పదండి ముందుకు, పడండి త్రోసుకు, పోదాం పోదాం పైపైకి..." అన్న ప్రబోధం చురకలు వేసి ఉరకలు పెట్టిస్తుంది. దానిలో అంతటి ఆలోచనతోపాటు అంత అపారమైన ఆవేశాన్ని, ఉద్వేగాన్ని మార్క్స్, ఎంగెల్స్ తుపాకి మందులా దట్టించారు.

## అనుకున్న దొకటీ...

మార్క్స్, ఎంగెల్స్ తమ గ్రంథాలన్నీ జర్మన్ భాషలో వ్రాశారు. "దస్ క్యాపిటల్" ప్రథమ అనువాదం రష్యన్‌లో జరిగింది. తాము కలలుకన్న కమ్యూనిస్టు విప్లవం, సోషలిస్టు రాజ్య స్థాపన మొదటగా పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన—అంటే కార్మిక వర్గం గణనీయమైన సంఖ్యలో గల ఇంగ్లండు వంటి పశ్చిమ యూరోపియన్ రాజ్యాలలో జరగగలదని మార్క్స్, ఎంగెల్స్ ఊహించారు. కాని, వారి ఊహలకు భిన్నంగా, పారిశ్రామికంగా వెనుకబడిన— కార్మికవర్గం గణనీయంగా లేని— రష్యాలో మొట్టమొదటి కమ్యూనిస్టు విప్లవం జరిగింది.

ప్రథమ ప్రపంచ సంగ్రామం జరుగుతున్న సమయంలో-1917 నవంబరు 7 వ తేదీన రష్యాలో లెనిన్ నాయకత్వాన కమ్యూనిస్టు విప్లవం జరిగింది. కాగా, ద్వితీయ ప్రపంచయుద్ధం ముగిసిన సమయంలో తూర్పు యూరప్‌లోని కొన్ని దేశాలు సోషలిస్టు రాజ్యాలుగా అవతరించాయి. ఆ తర్వాత కొద్ది ఏళ్లకే — 1949 లో — ప్రపంచంలోకెల్లా అత్యధిక జనసంఖ్యగల చైనాలో కమ్యూనిస్టు విప్లవం జరిగి అది కూడా సోషలిస్టు రాజ్యమైంది. ఆ పిదప క్యూబా, మరి కొన్ని లాటిన్ అమెరికన్ దేశాలు, ఆఫ్రికన్ దేశాలు, ఇండోచైనా దేశాలు కమ్యూనిస్టుల హస్తగతాలైనాయి.

అయితే, కమ్యూనిజం ఎంత చరచరా వ్యాపించిందో, అంత త్వర త్వరగా విఫలమైపోయింది. ఇరవైయవ శతాబ్దపు ఆఖరి దశాబ్దం సమీపిస్తుండగా, తూర్పు యూరప్ రాజ్యాలతో సహా సోవియెట్ యూనియన్‌లో కమ్యూనిస్టు వ్యవస్థ పేకమేడలా కుప్పకూలిపోయింది.

చరిత్రలో మొట్టమొదటిసారిగా సమ సమాజ స్థాపనకోసం పెద్ద ఎత్తున జరిగిన గొప్ప ప్రయోగం నేలపాలైంది. టి. ఎస్. ఎలియట్ వేరే సందర్భంలో

This is the way the world ends.
This is the way the world ends.
This is the way the world ends.
Not with a bang but a whimper.

అని వాపోయినట్టు, ఒక గొప్ప ఆదర్శం నిశ్శబ్దంగా, చడీ చప్పుడు లేకుండా, ఎవరికంటా ఒక్క కన్నీటిబొట్టు రాలకుండా, ఎవరూ అయ్యో అని ఒక్క నిట్టూర్పు కూడా విడవకుండా చల్లగా, మెల్లగా, కల్లగా మారిపోయింది.

నిజానికి, సోవియెట్ యూనియన్‌లో కమ్యూనిజం తన వైఫల్యాన్ని తనతో తానే వెంటపెట్టుకుని వచ్చింది. వ్యక్తి స్వేచ్ఛ అనేది బూర్జువా వర్గపు కుటిల వాదమని, అది పెట్టుబడిదారీ దోపిడీ విధానానికి మారు పేరు అని కమ్యూనిస్టులు నమ్మారు. వ్యక్తికి, సమిష్టికి సమన్వయాన్ని సాధించడానికి బదులు, వ్యక్తిని అణగద్రొక్కి సమిష్టికి ప్రాధాన్యం ఇచ్చారు. సమిష్టి పేరుతో పార్టీ, పార్టీ పేరుతో కొద్దిమందితో కూడిన పాలకమండలి, ఆ మండలి పేరుతో ఒక వ్యక్తి నియంతృత్వం చెలాయించడం, అలా చెలాయించే అవకాశాన్ని కమ్యూనిస్టులు కల్పించడం జరిగింది. దానితో సోవియెట్ ప్రయోగం విఫలం కాక తప్పలేదు. టొటాలి టేరియన్ నియంతృత్వంలో తప్ప కమ్యూనిజం వర్ధిల్లలేదని సోవియెట్ యూనియన్‌లో రుజువైంది. కమ్యూనిజానికి మానవ ముఖాన్ని తగిలించాలన్న గ్లాస్‌నోస్త్, పెరిస్త్రోయికా ప్రయోగాలు వృథా ప్రయత్నాలుగా మిగిలిపోయాయి.

కాని, కమ్యూనిజం సాధనకు సోవియెట్ ప్రయోగం ఒకటే మోడల్ కాదని, మరొక రూపంలో అది ముమ్ముందు వచ్చి తీరుతుందని కమ్యూనిస్టులు నమ్ముతారు. ఈ నమ్మకాన్ని భవిష్యత్తుకు వదిలివేసి, ప్రపంచ తత్వశాస్త్ర చరిత్రలో ఒక ప్రముఖ స్థానం సంపాదించుకున్న మార్క్సిజం గురించి ఇప్పుడు తెలుసుకుందాము.

## యుటోపియన్‌లు

మార్క్స్ ఒకానొక ఆదర్శ సమాజాన్ని ఊహించాడు. ఒక వ్యక్తిని మరొక

వ్యక్తి, ఒక జాతిని వేరొక జాతి పీడించే సాంఘిక ధర్మం ఇకపై సాగని మరో ప్రపంచాన్ని సంభావించాడు.

కాని, ఇలా ఊహించడంలో విశేషం ఏమీ లేదు. ఎందరో తత్వవేత్తలు, రచయితలు ఇలా ఊహించినవారే. అలా ఊహించడం రచయితలలో ఒక ఫ్యాషన్ కూడా. ఉదాహరణకు క్రీస్తుకు పూర్వమే ప్లేటో తన "రిపబ్లిక్"లో అలాంటి ఆదర్శ సమాజాన్ని వర్ణించాడు. అలాంటి దాన్ని వాస్తవంగా స్థాపించడానికి ఒక విఫలయత్నం చేశాడు కూడా.

ఆ పిదప ప్లేటో ఒరవడిలో ఎందరో ఆదర్శ రాజ్యాలను చిత్రిస్తూ గ్రంథాలు వ్రాశారు.

ఆధునిక యుగ ప్రారంభంలో సర్ థామస్ మోర్ "యుటోపియా" అని ఒక గ్రంథం వ్రాశాడు. ఈ మాటకు అర్థం "ఎక్కడా లేనిది" అని. ఒక ఊహా ద్వీపానికి ఆయన "యుటోపియా" అని పేరు పెట్టాడు. అందులో ఒకరకమైన కమ్యూనిజం అమలులో వుంటుంది. అక్కడ అంతా శ్రమిస్తారు. ఎవరి అవసరాన్నిబట్టి వారు వస్తువులను తీసుకుంటారు.

అలాగే తొమాసో క్యాంపనెలా (1568-1639) అనే ఇటాలియన్ క్రైస్తవ సన్యాసి, తత్వవేత్త "సిటీ ఆఫ్ ది సన్" అనే పేరుతో ఒక ఆదర్శ రాజ్యాన్ని వర్ణిస్తూ వ్రాశాడు. అందులోనూ అంతే, ప్రజలు చీకు చింతా లేని సుఖ జీవితాలు గడుపుతారు. ప్రయివేట్ ఆస్తి అనేది లేదు. సంపద అందరికి చెందినది. అలాగే భార్యలు కూడా ఉమ్మడి భార్యలు. పిల్లల పెంపకం బాధ్యతను ప్రభుత్వమే వహిస్తుంది.

## ఎరిహోన్

ఇంకా రేబిలే, బేకన్, వోల్టేర్, ఇటీవలి కాలంలో వెల్స్ వంటి ఎందరెందరో సమకాలిక రాజకీయ, సామాజిక వ్యవస్థలను చీల్చి చెండాడడానికి ఆదర్శ రాజ్యాలను ఊహించడానికి గ్రంథాలు వ్రాసి చదువరుల నోళ్లూరించారు. జొనాథన్ స్విఫ్ట్ "గలివర్స్ ట్రావెల్స్" ఏమిటి? తన కాలపు బ్రిటిష్ వ్యవస్థను విమర్శించడానికి వ్రాసిన వ్యంగ్య గ్రంథమే కదా? అలాగే శామ్యూల్ బట్లర్ (1835-1902) వ్రాసిన "ఎరిహోన్" అనే వ్యంగ్య నవల కూడా పేర్కొనదగింది. Nowhere (ఎక్కడా లేనిది) అనే మాటను తిరగేస్తే Erehwon అవుతుంది. ఆ మాటనే తన ఊహా ద్వీపానికి పేరుగా బట్లర్ ఉపయోగించాడు. తన సమకాలపు సమాజాలలోని మోసాన్ని, మూర్ఖత్వాన్ని బట్టబయలు

చేయడానికి ఈ నవలను బట్లర్ వ్రాశాడు— ఉదాహరణకి ఆ నవలలోని రాజ్యంలో ప్రజలు వ్యాధిగ్రస్తులు కావడం శిక్షార్హమైన నేరం కాగా, అవినీతికి పాల్పడడం జాలిపడదగిన దౌర్బల్యం. 1872 లో వ్రాసిన ఈ నవలలోని కథను పొడిగిస్తూ 1901 లో "ఎరిహోన్ రీ విజిటెడ్" అనే మరో వ్యంగ్య నవలను కూడా బట్లర్ వ్రాశాడు.

## ఆదర్శ వాదులు

వీరందరూ కేవలం రచనలో యుటోపియన్‌లు కాగా, ఆచరణలో యుటోపియన్‌లు అయినవారు కూడా పలువురు వున్నారు. అంటే తమచుట్టూ వున్న దారుణ సామాజిక అన్యాయాలను సహించలేక భూలోకంలోనే స్వర్గ ఖండాలను సృష్టించడానికి కృషి చేసినవారు. ప్లేటో స్వయంగా అటువంటి ప్రయత్నం చేసి విఫలుడయ్యాడని ఇంతకుముందు చదువుకున్నాము. కాగా, ఆధునిక కాలంలో అటువంటి ప్రయత్నం స్వయంగా చేసిన ప్రాతఃస్మరణీయుడు రాబర్ట్ ఓవెన్.

ఇతడు 1771 లో వేల్స్‌లో నిరుపేద కుటుంబంలో జన్మించాడు. కేవలం స్వీయ ప్రతిభా విశేషాలతో అపారంగా ధనం ఆర్జించాడు. స్కాట్లెండ్‌లో న్యూలానార్క్ అనేచోట అతడు ఓ ఆదర్శ సమాజాన్ని నిర్మించాడు. 1815-1825 సంవత్సరాల మధ్య భూలోక స్వర్గంగా ప్రపంచ ప్రఖ్యాతి పొందిన ఆ ప్రదేశానికి యూరప్ నలుమూలలనుంచి రాజు, రారాజులు, రాణులు, రచయితలు, తత్వవేత్తలు, సంఘ సంస్కర్తలు వందలాదిగా వచ్చి చూసి ఒకే ఒక వ్యక్తి ఇంత అద్భుత కృషి ఎలా చేశాడని ఆశ్చర్యపోయేవారు. ఆ రోజులలో పారిశ్రామికంగా పురోభివృద్ధి చెందుతున్న బ్రిటన్‌లో కార్మికుల జీవన పరిస్థితుల దుర్భరత వర్ణించనలవి కానిది. ముక్కుపచ్చలారని ఏడెనిమిదేళ్ళ బాలబాలికల చేత కూడా కర్మాగారాలలో పనిచేయిస్తూ వుండేవారు. పనిచేయలేక అలసటతో ఒక నిమిషం ఆగినవారినైనా సరే కొరడాలతో చావగొట్టేవారు. రోజుకు 16 గంటల పైగా పనిచేయించేవారు. పెట్టుబడిదారీ వ్యవస్థలోని దానవత్వం అంతా రూపుదాల్చినట్టు వుండేవి ఆ రోజులలో బ్రిటిష్ కర్మాగారాలు.

## ఓవెన్ ప్రయోగం

రాబర్ట్ ఓవెన్ ఆ పరిస్థితులను కళ్లారా చూసి విచలితుడయ్యాడు. నిరుపేదగా జీవితం ప్రారంభించి న్యాయమార్గంలోనే లక్షాధికారి అయ్యాడు. తన లక్షలతో ఆదర్శ కర్మాగారాలను స్థాపించాడు. తీర్చిదిద్ది ఎంతో పరిశుభ్రంగా వున్న ఇళ్లను నిర్మించి కార్మికులకు ఇచ్చాడు. వారి పిల్లల విద్యాబుద్ధులకు ఆదర్శ పాఠశాలలు నిర్మించాడు. తాను స్వయంగా పెట్టుబడిదారు అయివుండి, తన లాభాలలో

పీసమైనా కోల్పోకుండానే కార్మికులకు న్యాయం చేకూర్చవచ్చునని- పరిమిత స్థలంలో పరిమిత కాలంలోనే అయినా-- అక్షరాలా నిరూపించాడు. దేశ దేశాల వారి జోహార్లు అందుకున్నాడు. అయినా, అతని ఆదర్శ ప్రయోగం ఎక్కువ కాలం సాగలేదు. అలాంటి స్వాప్నిక ప్రయోగాలన్నిటి వలెనే త్వరలోనే అది కూడా అంతమైంది.

## యుటోపియన్ సోషలిస్టులు

అలాగే ఈ సందర్భంలో-- అంటే మార్క్స్, ఎంగెల్స్ తమ సైంటిఫిక్ సోషలిజాన్ని ప్రచారం చేయడానికి ముందు రోజులలో-- పేర్కొనదగిన యుటోపియన్ సోషలిస్టులు మరి ఇద్దరున్నారు. వారిలో ఒకరు 1760-1825 మధ్యకాలంలో జీవించిన ఫ్రెంచి సంస్కర్త, రచయిత సెయింట్ సిమోన్. 1772-1837 మధ్య కాలానికి చెందిన మరొక ఫ్రెంచి సంస్కర్త చార్లెస్ ఫ్యూర్యర్. బ్రిటిష్ జాతీయుడయిన రాబర్ట్ ఓవెన్ జీవిత చరిత్ర చూస్తేనే అతనిలో వేపకాయ కంటె ఒకరవ్వ పెద్ద సైజులోనే వెర్రితనం వుందనిపిస్తుంది. కాగా, ఈ ఇరువురు ఫ్రెంచి సంస్కర్తలు తమ కాలంనాటి పారిశ్రామిక వ్యవస్థలోని లోపాలను సంస్కరించడానికి, ఘోరాలను రూపుమాపడానికి తయారుచేసిన ప్రణాళికలను చూస్తే వారి తలలలో తాటికాయలంత చాదస్తం గూడు కట్టుకున్నదని, వారు వేసిన ఆదర్శ ప్రణాళికలను ఈ భూలోకంలో అమలు జరపడం అసాధ్యమని గ్రహిస్తాము.

రాబర్ట్ ఓవెన్, సెయింట్ సిమోన్, చార్లెస్ ఫ్యూర్యర్ వంటి వారు చాదస్తులైనా వ్యక్తులుగా ఉన్నతులే, సహృదయులే, ఆదర్శవాదులే. సమకాలిక సమాజాన్ని సముద్ధరించడానికి ఏది ఉత్తమ మార్గం అని బుర్రలు బద్దలు కొట్టుకుని ఆలోచించి, ఏవేవో ప్రణాళికలు రచించి చేతనైన వరకు ఆచరించడానికి ప్రయత్నించినవారే. కాని, వారి సోషలిజం కేవలం యుటోపియన్ సోషలిజం. అంటే ఎక్కడా లేని--వుండడానికి వీలులేని-- సోషలిజం. అందుచేత వారి సోషలిస్టు ప్రణాళికలు విఫలం కావడంలో ఆశ్చర్యం లేదు. వాటికి శాస్త్రీయమైన పునాది లేకపోవడమే అసలైన లోపం.

## సైంటిఫిక్ సోషలిజం

ఈ లోపాన్ని పరిహరించి శాస్త్రీయమైన పునాదులపై సోషలిజాన్ని నిర్మించడానికి "బ్లూ ప్రింట్" ను తయారు చేసిన సాంఘిక తత్వవేత్తలు, విప్లవకారులు మార్క్స్, ఎంగెల్స్. సంస్కరణవాదంవల్ల ప్రయోజనం లేదు. "సర్వేజనా స్సుఖినో భవంతు" అన్నట్టు, "రామాయ స్వస్తి రావణాయ స్వస్తి" అన్నట్టు,

కలవాడు. సంపన్ను డనడానికి వీలులేదు కాని, పేదవాడు కూడా కాడు. వృత్తికి లాభిస్తుందని యూదుమతాన్ని వదలుకుని ప్రొటెస్టెంట్ క్రైస్తవ మతాన్ని స్వీకరించాడు. అతని ఏడుగురు సంతానంలో మూడవవాడు కార్ల్. ఆరవ ఏట అతడిని కూడా బాప్టయిజ్ చేశారు.

తనవలె కార్ల్ కూడా న్యాయవాద వృత్తి స్వీకరించాలని హైన్రిక్ మార్క్స్ ఆశించాడు. తండ్రిపట్ల కార్ల్‌కు అపార గౌరవం. ఆయన ఒత్తిడివల్ల, ఇష్టం లేకపోయినా ఆయన మాట కాదనలేక,తన 17 వ ఏట- 1835 లో బాన్ యూనివర్సిటీలో లా కోర్సులో చేరాడు. చిన్నతనంలో కుర్రకారు చేసే అల్లరంతా చేసేవాడు. తాగి, తందనాలాడి, ఒకసారి ఎవరితోనో ఏదో గిల్లికజ్జా పెట్టుకుని అరెస్టు అయి, ఒక రోజంతా జైలులో గడిపాడు.

కొడుకు వరస నచ్చక, ఒక ఏడాది గడిచాక తండ్రి అతడిని బెర్లిన్ యూనివర్సిటీకి తరలించాడు. అక్కడ అతడు తన అభిమాన విషయాలుగా తత్వశాస్త్రం, చరిత్ర, సాహిత్యం తీసుకున్నాడు. అల్లరి మానేసి బుద్ధిమంతుడయ్యాడు. పుస్తకాల పురుగులా శ్రద్ధగా, తదేకంగా చదివాడు.

ఆ రోజులలో జర్మనీలో అందరు నెత్తిన పెట్టుకుని గౌరవిస్తున్న తత్వ సిద్ధాంతం హెగెలియనిజం. నెపోలియన్ మీద జర్మన్‌ల కోపం ఫ్రెంచి తత్వవేత్తలైన వోల్టేర్, రూసోలమీద కూడా ప్రసరించినట్టుంది. వారికి తమవాడైన హెగెల్ ఆరాధ్య తత్వశాస్త్రాచార్యుడయ్యాడు.

## మిత, అతివాదులు

అప్పటికి హెగెల్ (1770-1831) చనిపోయి కొద్ది సంవత్సరాలైంది. ఆయన శిష్యులు, అభిమానులు రెండు వర్గాలుగా విడిపోయారు. ఒకరు మితవాదులు, మరొకరు అతివాదులు. హెగెల్ చెప్పినదాన్ని ఒక్క ముక్క కూడా మార్చకుండా యథాతథంగా అంగీకరించాలని మితవాదుల వాదన. అలా కాదు, హెగెల్ చెప్పిందంతా వేదం కాదు. అందులో పనికి వచ్చేదాన్నే దీసుకుని మిగతాదాన్ని చెత్తబుట్టలో పారేయాలని అతివాదుల వాదం. ఈ అతివాదులనే "యంగ్ హెగెలియన్‌లు" అనే వారు. వారికి బ్రూనో బాయర్ నాయకుడు.

కారల్ మార్క్స్ బెర్లిన్ వస్తూనే యంగ్ హెగెలియన్ వర్గంలో చేరాడు. హెగెల్ గ్రంథాలను అపోశన పట్టాడు. రాత్రింబవళ్లు అదే పని. హెగెల్ ప్రభావం మార్క్స్‌పై ఇంతింత అనరానిది. అతని తత్వచింతనకు పునాది చేకూ

ర్చింది హెగెలియనిజమే. అయితే పోనుపోను హెగెల్ తత్వంపట్ల వ్యతిరేకతా భావమే ఎక్కువైంది.

హెగెల్ సిద్ధాంత వ్యవస్థను గతితార్కిక భావవాదం అంటారు. దేవుడు, ఆత్మ, మనస్సు, భావం మొదలైన వివిధ పదజాలం ఏదైతే సత్యాన్ని నిర్దేశిస్తున్నదో అదే అసలైన, కేవలమైన సత్యమని హెగెల్ ప్రవచించాడు. అటువంటి కేవలభావం (Absolute Idea) అనాదిగా తనను తాను వాస్తవీకరించుకొనడానికి చేసే ప్రయత్నమే - ఆ ప్రయత్న పురోగమనమే—విశ్వ చరిత్ర అని హెగెల్ అన్నాడు. అంటే విశ్వంలో కేవలభావం తప్ప మరేమీ లేదు. కేవలభావమే ప్రపంచం. బాహ్య ప్రకృతిగా మనం చూసేదంతా కేవల భావానికి బాహిరీకరణ (Externalisation) మాత్రమే.

ఈ భావ బాహిరీకరణాన్ని భావ పురోగమనాన్ని, అవగాహన చేసుకొనడానికి ఉపయోగపడే సాధనమే గతితర్కం (డయలెక్టిక్స్).

అటు భావ ప్రపంచంలోగాని, ఇటు బాహ్య ప్రపంచంలోగాని పురోగతి అనేది గతితార్కికంగా జరుగుతుంది. గతి తర్కంలో మూడు దశలు వుంటాయి. మొదటిది వాదం (థీసిస్). రెండవది ప్రతివాదం (యాంటీ థీసిస్). మూడవది సమన్వయ వాదం (సింథెసిస్.)

## గతితర్కం

మొదట వాదం వుంటుంది. అయితే. వాదంతోపాటే - దానికి వ్యతిరేకంగా - ప్రతివాదం కూడా బయలుదేరుతుంది. అప్పుడు ఆ రెండింటి మధ్య అనివార్యంగా సంఘర్షణ జరుగుతుంది. ఆ సంఘర్షణ ఫలితంగా వాద ప్రతివాదాలలోని ప్రగతిశీల లక్షణాలను పుణికి పుచ్చుకొని సమన్వయ వాదం బయలుదేరుతుంది.

తిరిగి ఆ సమన్వయ వాదం కొత్తవాదం అవుతుంది. దానికి ప్రతివాదం పుడుతుంది. ఆ రెండింటి సంఘర్షణ నుంచి నూతన సమన్వయ వాదం వస్తుంది. అది తిరిగి మరొక నూతన వాదం అవుతుంది.

ఈ విధంగా వాద, ప్రతివాద, సమన్వయ వాదాల గతితర్క పద్ధతిలో భావ ప్రపంచమే కాదు, దాని ప్రతిబింబం అయిన బాహ్య ప్రపంచం కూడా మును ముందుకు— ఉన్నతోన్నత దశలకు - పురోగమిస్తుంది. ఈ పురోగమన యాత్ర అనాదిగా జరుగుతూనే వుంది.. ఇదీ క్లుప్తంగా హెగెల్ వాదం.

ఇది మార్క్స్‌ను ఆకర్షించింది. అయితే, తిరస్కారభావం కూడా కలిగింది. ఆకర్షణ - తిరస్కారభావం రెండూ ఒకేసారి మార్క్స్‌ను లోగొన్నాయి.

హెగెల్ సిద్ధాంతం శీర్షాసనం వేసిందని మార్క్స్ భావించాడు. శీర్షాసనం మంచిదే కావచ్చుగాని, ప్రపంచం తల్లకిందులుగా కనిపిస్తుంది. అందుచేత హెగెల్ సిద్ధాంతాన్ని దాని కాళ్ల మీద దాన్ని నిలబెట్టడం తన జీవిత లక్ష్యంగా మార్క్స్ భావించాడు.

హెగెల్ కేవలభావం మాత్రమే యథార్థం అన్నాడు. మార్క్స్ అది వట్టి నాన్సెన్స్ అని కొట్టివేశాడు. "పదార్థం - అదే యథార్థం" అని సూత్రీకరించాడు. భావం అంటే ఐడియా. హెగెల్‌ది ఐడియలిజం, పదార్థం అంటే మేటర్. మార్క్స్‌ది మెటీరియలిజం.

## భౌతికవాదం

ప్రపంచ పరిణామక్రమాన్ని (World process) కనుగొనడానికి ఏకైక సాధనం గతితర్కం అని హెగెల్ కనుగొన్నాడు. దానితో మార్క్స్ ఏకీభవించాడు. హెగెల్ భావవాదాన్ని తిరస్కరించి అతని గతితర్కాన్ని మాత్రం మార్క్స్ తీసుకున్నాడు. హెగెల్ భావం— ఐడియా—అన్నదాన్ని మార్క్స్ పదార్థం—మేటర్— అన్నాడు. దాంతో హెగెల్ గతితార్కిక భావవాదం కాస్తా మార్క్స్ చేతిలో గతితార్కిక పదార్థవాదం— లేదా గతితార్కిక భౌతికవాదం—అయింది.

అదేవిధంగా తన గతితార్కిక భౌతికవాదాన్ని మానవ సమాజాల చరిత్రకు మార్క్స్ అన్వయించి చూశాడు—మానవ సమాజ పురోగతికి మూలప్రేరణ (Motive force) హెగెల్ పేర్కొన్న భావం, మనస్సు, చైతన్యం వగైరా లేవీ కావని, కేవలం వస్తూత్పత్తి శక్తులమధ్య అనివార్యంగా సంభవించే సంఘర్షణేనని కనుగొన్నాడు.

చరిత్రకు అందినంత వెనుకటివరకు వెళ్లి చూస్తే మానవ సమాజం ఎల్లప్పుడు రెండు పరస్పర విరుద్ధ వర్గాలుగా చీలిపోయి వుంది. ఒకటి దోపిడీ చేసే వర్గం. మరొకటి దోపిడీ చేయబడే వర్గం. వస్తూత్పత్తి ఈ రెండు విరుద్ధశక్తుల ద్వారానే జరుగుతుంది. వాటిమధ్య ఘర్షణ కూడా అనివార్యం. చివరికి పురోగామివర్గం గెలుస్తుంది. రెండవదైన తిరోగామివర్గం అంతరిస్తుంది. ఆ విధంగా సమాజం మరొక ఉన్నత దశకు పయనిస్తుంది. ఈ గతితర్కాన్ని మానవ సమాజానికి వర్తించినప్పుడు అది చారిత్రిక భౌతికవాదం (Historical Materialism) అయింది.

యంగ్ హెగెలియన్‌లకు నాయకుడైన బ్రూనో బాయర్‌తో మార్క్స్ మొదట బాగా సన్నిహితంగా వుండేవాడు. అలాగే మరొక యంగ్ హెగెలియన్

ఫ్యూయర్‌బాక్‌ను, అతని భౌతికవాదాన్ని కూడా మార్క్స్ చాలా అభిమానించాడు. నిజానికి మార్క్స్ తన గతితార్కిక వాదాన్ని హెగెల్ నుంచి, భౌతిక వాదాన్ని ఫ్యూయర్‌బాక్ నుంచి స్వీకరించి ఆ రెండింటిని మేళవించి ఒక నూతన వాదాన్ని– గతితార్కిక భౌతికవాదాన్ని-నిర్మించాడు.

## డాక్టరేట్

మార్క్స్ 1841 లో - తన 23 వ ఏట-ప్రాచీన గ్రీకు భౌతిక తత్వవేత్తలైన డెమొక్రిటస్, ఎపిక్యురస్‌ల సిద్ధాంతాల మధ్య పోలికలను, తేడాలను విశదీకరిస్తూ ఒక థీసిస్ వ్రాశాడు. దానికి యేనా యూనివర్శిటీ నుంచి డాక్టరేట్ పొందాడు. అక్కడే అధ్యాపకుడుగా ఉద్యోగం చేయా లనుకున్నాడు. కాని, అతని తీవ్రవాద భావాలు గిట్టని యూనివర్శిటీ అధికారులు ఉద్యోగమివ్వడానికి నిరాకరించారు.

అప్పుడు మార్క్స్ జీవనోపాధి కోసం ఫ్రీ లాన్స్ పత్రికా రచయిత అయ్యాడు. కలోన్ పట్టణంలోని "రెయినిష్ జీటుంగ్" అనే పత్రికకు రచనలు పంపేవాడు. తర్వాత దానికి తానే సంపాదకు డయ్యాడు. పేదలపట్ల అధికారుల జులుంను నిరసిస్తూ సంపాదకీయాలు వ్రాసేవాడు. ప్రభుత్వపు అక్రమాలను ఖండించేవాడు. అతని తీవ్రభావాలకు అధికారులు ఆగ్రహించారు. వారి ఒత్తిడివల్ల 1843 లో ఆ పత్రికను మూసివేయవలసి వచ్చింది. పారిస్‌కు ప్రవాసిగా వెళ్లాడు.

## వివాహం

అయితే, ఒంటరిగా కాదు, జంటగా వెళ్లాడు. అప్పటికే అతనికి వివాహమైంది. జన్మస్థలమైన ట్రియర్‌లో మార్క్స్ కుటుంబం పొరుగున వెస్ట్‌ఫేలెన్ అనే కుటుంబం వుండేది. అది ప్రభు వంశానికి చెందిన భాగ్యవంతుల కుటుంబం: బ్యారన్ లుడ్విగ్ వాన్ వెస్ట్‌ఫేలెన్ ప్రభుత్వాధికారి, అతనికి ·రల్ మార్క్స్ అంటే వల్లమాలిన అభిమానం. అతనిచేత గ్రీకు ట్రాజెడీలు, హోమర్ ఐతిహాసిక కావ్యాలు, డాంటే, షేక్‌స్పియర్ రచనలు చదివించాడు. సభున్నవర్గం వాడైనా లిబరల్‌వాది, మానవతావాది.

అతని కుమార్తె జెన్నీ వెస్ట్‌ఫేలెన్ అందాలరాశి. ట్రియర్ పట్టణంలో చాలామంది యువకులు ఆమెకోసం బెంగెట్టుకునేవారు. ఆమె పాణిగ్రహణానికై ఉవ్విళ్లూరేవారు. అలాంటి వారిలో ఆమెకంటె నాలుగేళ్లు చిన్నవాడైన కారల్ మార్క్స్ ఒకడు. ఆమెకు కూడా కారల్ పట్ల చెప్పలేనంత అనురాగం. ఇరువురూ వలపుల వలలో చేపలవలె చిక్కుకున్నారు. అంతస్తుల తేడా

వల్ల పెద్దలు అంగీకరించరేమోనని భయపడ్డారు. కాని, లుడ్విగ్ వెస్ట్‌ఫేలెన్‌కు అలాంటి భేషజాలేమీ లేవు. ఇటు కారల్ తండ్రికి కూడా కులీనుల పిల్లతో కొడుక్కి వివాహం కావడం కంటె కోరదగిన దేముంటుంది? ఎవరికిష్టమైనా, కాకపోయినా, అసలు వారిద్దరూ ఇష్టపడ్డారు-- మాదేముంది అన్నారు. నిశ్చితార్థం కూడా జరిగింది.

అయితే, అప్పటికింకా కారల్ మార్క్స్ విద్యార్థి. చదువు పూర్తి అయి, ఏదో ఒక జీవనోపాధి సంపాదించుకునేవరకు--అంటే ఏడేళ్లు—ఆగవలసివచ్చింది. ఆ ఏడేళ్లు ఉభయులూ విరహ వీణాతంత్రులు మోగించుకుంటూ కాలక్షేపం చేశారు. కారల్ మార్క్స్ ఓ పక్కన హెగెల్ గతితార్కిక వాదపు ఇనప గుగ్గిళ్లను హరాయించు కొనడానికి ప్రయత్నిస్తూనే, మరో పక్క ప్రియురాలిని ఉద్దేశించి మూడు సంపుటాల ప్రేమగీతాలు గిలికాడు. ఏమైతేనేం ఏడేళ్ల విరహ నిరీక్షణానంతరం 1884 లో - బాల్య సఖి జెన్నీని వివాహం చేసుకున్నాడు.

అప్పటిలో పారిస్ యూరోపియన్ సోషలిస్టులకు కేంద్రం. ఆ నగరంలో ప్రేయసితో ప్రవాసిగా వుండే రోజులలో మార్క్స్‌కు చాలామంది సోషలిస్టు మేధావులతో పరిచయమైంది—అతని ఇంటిలో ఫ్రెంచి, జర్మన్ కార్మిక నాయకుల సమావేశాలు జరుగుతూ వుండేవి. అప్పుడప్పుడు ప్రసిద్ధ జర్మన్ అభ్యుదయ కవి హైన్రిక్ హైన్ వచ్చి కబుర్లు చెప్పి వెడుతూ వుండేవాడు.

ఆ రోజులలోనే 1844 లో-మార్క్స్‌కు ఫ్రెడరిక్ ఎంగెల్స్ అనే జర్మన్ యువకునితో పరిచయమైంది. ఆ పరిచయం యావజ్జీవ స్నేహంగా పరిణమించి పరిపక్వమైంది. ఇరువురికి అన్నిటిలోను ఏకీభావమే. వారి మొదటి సంభాషణ పదిరోజులు ఏకధాటిగా సాగిందట. మార్క్స్‌వలె ఎంగెల్స్‌కూడా హెగెల్ అభిమాని. అయితే, హెగెల్ భావవాదాన్ని ఎంగెల్స్ కూడా తిరస్కరించాడు. గతితార్కిక భౌతికవాదానికి ఒక నిర్దిష్టరూపం కల్పించడంలో, దాని ఆధారంగా కమ్యూనిస్టు సిద్ధాంత వ్యవస్థకు ప్రాణప్రతిష్ఠ చేయడంలో మార్క్స్‌తో అతడు జీవితాంతం సహకరించాడు. తాను స్వయంగా ప్రతిభాశాలి అయినా మార్క్స్‌కు "సెకండ్ ఫిడిల్"గా వుండడానికి మన సారా అంగీకరించాడు. వారి మైత్రి వంటిది ప్రపంచంలో చాలా అరుదుగా ఉంటుంది.

... మార్క్స్ కుటుంబ స్థితిగతులు ఒక మోస్తరువి. కాని, ఎంగెల్స్ కుటుంబం సంపన్నమైనదే. అతని తండ్రి కాస్పర్ ఎంగెల్స్ ప్రష్యాలోని బార్మెన్‌లో ఒక వస్త్ర కర్మాగారానికి అధిపతి. అయనకు ఇంగ్లండులోని మాంఛెస్టర్‌లో కూడా ఒక జౌళి మిల్లు వుండేది. ఫ్రెడరిక్ 1820 లో జన్మించాడు. మార్క్స్

కంటె రెండేళ్లు చిన్నవాడు. చదువు పూర్తయ్యాక ఫ్రెడరిక్ కూడా కవిత్వంపట్ల కాస్త అభిరుచి చూపించడం మొదలు పెట్టాడు. కవిత్వంలో పడితే చెడిపోతాడని తండ్రి భయపడి మాంచెస్టర్‌లోని తన జౌళి మిల్లుకు గుమాస్తాగా పంపించేశాడు. ఆ తర్వాత అతడు అక్కడే తన తండ్రికి ప్రతినిధిగా పనిచేశాడు.



సంపన్న కుటుంబంలో పుట్టినా, చేతి నిండా పుష్కలంగా డబ్బు ఆడుతున్నా, స్వయంగా బూర్జువా నిహో అయినా, మరొక ప్రక్క విలాస జీవితం గడిపే అవకాశం వున్నా ఎంగెల్స్ హృదయం, మేధ కూడా కార్మికవర్గం పట్లనే పక్షపాతం వహించాయి. కమ్యూనిజం అతడివి ఆకర్షించింది- అతని తండ్రి కరుడుకట్టిన కాల్వినిస్టు కాగా ఫ్రెడరిక్ పరమ భౌతికవాది అయ్యాడు. ఆ రోజులలోనే (1844) అతడు ఇంగ్లండులోని కార్మికుల దుర్భర జీవన స్థితిగతులను కనులారా చూసి, మన సారా బాధపడి, పెట్టుబడిదారీ వ్యవస్థలోని అమానుషత్వాన్ని నిశితంగా విమర్శిస్తూ ఒక గ్రంథం రచించాడు. అది అతనికి యూరప్ అంతటా పేరు తెచ్చిపెట్టింది. మార్క్స్ కూడా అది చదివి ప్రభావితుడై ఎంగెల్స్‌తో చెలిమికి ఉబలాటపడ్డాడు.

మార్క్స్ పారిస్‌లో 1845 ప్రారంభంవరకు వున్నాడు. అక్కడ వుండగానే ఎంగెల్స్ తరుచు వచ్చి కలుసుకుంటూ వుండేవాడు. ఎంగెల్స్ ద్వారానే మార్క్స్ ఇంగ్లండులోని కార్మికుల యాతనామయ జీవితాలను గురించి వింటూ తెలుసుకుంటూ వుండేవాడు. యాడం స్మిత్, డేవిడ్ రికార్డోలవంటి క్లాసికల్ ఆర్థిక శాస్త్రవేత్తల సిద్ధాంతాలను అధ్యయనం చేశాడు. వారు బూర్జువా ఆర్థికవేత్తలైనా, వారి ఆర్థిక విశ్లేషణ ప్రభావం మార్క్స్‌పై చాలా వుంది.

పారిస్‌లో మార్క్స్ ఒక జర్మన్-ఫ్రెంచి పత్రికకు సహసంపాదకుడుగా పని చేశాడు. ఎంగెల్స్‌తో కలిసి కొన్ని రచనలు చేశాడు. వాటిలో ఒకటి 1845 లో వెలువడిన "హోలీ ఫ్యామిలీ" తనకు ఒకనాటి గురుతుల్యుడైన బ్రూనో బాయర్‌పై ఘాటైన విమర్శ అది. ఆ పిదప "జర్మన్ ఐడియాలజీ" అనే మరొక పుస్తకం వెలువడింది.

పారిస్‌లో మార్క్స్ విప్లవ కార్యకలాపాలు సహించలేని ప్రష్యన్ ప్రభుత్వం ఫ్రెంచి ప్రభుత్వంపై ఒత్తిడి తేవడంతో అతడు అక్కడి నుంచి మకాం ఎత్తేయవలసివచ్చింది. 1845 ఫిబ్రవరిలో బ్రస్సెల్స్ చేరుకున్నాడు. తన ప్రష్యన్ పౌరత్వాన్ని పరిత్యజించాడు. అక్కడ మూడేళ్లు నివసించాడు. ఆ కాలంలోనే ఆర్థిక-రాజకీయ సిద్ధాంత గ్రంథం ఒకటి వ్రాయడానికి ప్రణాళిక వేసుకుని ఒక ప్రచురణకర్తతో ఒప్పందం కుదుర్చుకోవడమే కాదు—బజానా కూడా తీసుకున్నాడు. కాని, ఒప్పందం ప్రకారం వ్రాయలేకపోయాడు.

## మ్యానిఫెస్టో రచన

ఇలా వుండగా లండన్‌లో 1847 జూన్ నెలలో "లీగ్ అఫ్ ది జస్ట్" అనే ఒక రహస్య సంస్థ సమావేశమైంది. దానిలో సభ్యులెవరంటే జర్మనీలో జీవనోపాధి కోల్పోయిన చేతి వృత్తుల వారు. వారి ఆహ్వానంపై మార్క్స్ ఆ సంస్థలో సభ్యుడుగా చేరాడు. ఆ తర్వాత దాని పేరు "కమ్యూనిస్టు లీగ్" అని మారింది. ఆ సంస్థ వారు మార్క్స్‌ను తమ ఆర్థిక-రాజకీయ విప్లవ సిద్ధాంతాలను స్పష్టంగా, సరళంగా, గ్రంథస్థం చేయవలసిందిగా కోరారు. ఎంగెల్స్‌తో కలసి 1847 డిశంబరులో మొదలుపెట్టి 1848 జనవరి ఆఖరు నాటికి సంస్థవారు కోరిన గ్రంథాన్ని పూర్తి చేశాడు. ఆ పుస్తకం పేరే ప్రపంచ ప్రసిద్ధమైన "కమ్యూనిస్టు మ్యానిఫెస్టో". లీగ్ వారు దాన్ని తమ సంస్థ కార్యాచరణ ప్రణాళికగా కళ్లకద్దుకుని స్వీకరించారు. మార్క్స్ ఆ తర్వాత ఎన్నో గ్రంథాలు రచించాడు. ఎన్ని వ్రాసినా అన్నీ "కమ్యూనిస్టు మ్యానిఫెస్టో"కి వివరణలు, విస్తరణలు, భాష్యాలేనని పండితులు పేర్కొంటారు.

ఫ్రాన్సు, ఇటలీ, ఆస్ట్రియా, జర్మనీ మొదలైన యూరోపియన్ దేశాలలో 1848 లో వున్నట్టుండి విప్లవ జ్వాలలు చెలరేగాయి. వాటిలో మార్క్స్, ఎంగెల్స్ చురుకుగా పాల్గొన్నారు. తాము కలలుకన్న కమ్యూనిజం నిజం కాబోతున్నది, ఒక నూతన వ్యవస్థ పురిటి నొప్పులు పడుతున్నదని వారు ఆశపడ్డారు. కాని ఆ విప్లవాలు ఎంత గొప్పగా ప్రారంభమయ్యాయో అంత చప్పగా విఫలమయ్యాయి. మార్క్స్, ఎంగెల్స్‌కు ఆశాభంగమే మిగిలింది.

ఆ విప్లవ సందర్భంగా కలోన్ మొదలైన జర్మన్ పట్టణాలకు వెళ్లిన మార్క్స్‌ను ప్రష్యన్ ప్రభుత్వం మళ్లీ బహిష్కరించింది. పారిస్ వచ్చాడు. కాని అక్కడనుంచి కూడా అతడికి ఉద్వాసన జరిగింది.

ఎట్టకేలకు మార్క్స్ 1849 ఆగస్టులో సకుటుంబంగా లండన్ చేరాడు. ఇక అంతే, లండన్‌ను విడిచిపెట్టలేదు. జీవితాంతం వరకు—సుమారు మూడు

ర్నర దశాబ్దాలపాటు లండన్‌లోనే ప్రవాసిగా నివాసం చేశాడు. కమ్యూనిస్ట్ లీగ్‌లో తిరిగి సభ్యుడయ్యాడు. కాని, సిద్ధాంత విభేదాలు తల ఎత్తాయి. విప్లవాన్ని తక్షణం ప్రారంభించాలనే వారికి, మార్క్స్‌కు పేచీలు పొడచూపాయి. క్రమంగా తోటివారికి దూరమయ్యాడు. ఎక్కువగా ఒంటరిగానే గడిపేవాడు.

## కటిక పేదరికం

ఒకవైపు ఒంటరితనం, మరొకవైపు పేదరికం. 1850 నుంచి 1864 వరకు దుర్భర దారిద్ర్యంలో గడిపాడు. ఎప్పుడూ తనకో, కుటుంబంలోని మరొకరికో అనారోగ్యమే. తాను లివర్ వ్యాధితోను, వంటినిండా కురుపులతోను బాధపడేవాడు. మొదటి ఆరేళ్లు సోహోలోని రెండు చిన్న గదులలో కాలక్షేపం చేశాడు. రొట్టె, బంగాళాదుంపలు—ఇవే ఆహారం. ఒక్కొక్కసారి రెండు పూటలా కాల్చుకు తినడానికి బ్రెడ్ కూడా కరువయ్యేది. దారిద్ర్యం మాత్రం ప్రతిరోజూ అతడిని కాల్చుకు తినేది.

ఎడాపెడా అప్పులు. ఇటుచూస్తే అప్పులవాళ్లూ, అటు చూస్తే బిడ్డల ఆకలి, ఒక్కొక్కసారి అప్పుల వాళ్ల బాధ పడలేక తను ఇంట్లోనే వుండే, లేడని పిల్లలచేత చెప్పించేవాడు. ఎప్పుడూ ఇంట్లో నుంచి ఏదో వస్తువు తీసుకువెళ్లి తాకట్టుపెట్టి డబ్బు తెచ్చుకుని పూట గడుపుకోవడమే. భార్య జెన్నీకి హిస్టీరియా జబ్బు వుండేది. పేదరికమే ఒక వ్యాధి రాగా, దానికితోడు ఆమెకు నరాల జబ్బు. పుట్టిన పిల్లలు పుట్టినట్టే పోయేవారు. సరైన ఆహారం లేక, సుస్తీచేస్తే సరైన మందులు పడక, అపరిశుభ్రమైన పరిసరాలలో నివసించవలసిరావడంచేత పిల్లలు బతకలేదు. అతని నాల్గవబిడ్డ మృత శిశువుగా పుట్టింది. ఎడ్గార్ అనే కుమారుడు ఎనిమిదవ ఏట క్షయతో మృతి చెందాడు. ఒక పిల్ల ఏడాదిపాటు బ్రతికి చనిపోయింది. ఆ పిల్లకు శవపేటిక కావలసివచ్చి, జెన్నీ చేతిలో పెన్నీ కూడా లేక, ముక్కూ ముఖం ఎరగని ఒక ఫ్రెంచివాడి వద్ద సిగ్గువిడిచి, నోరుతెరిచి చేబదులు అడిగి తీసుకోవలసివచ్చిందంటే మార్క్స్ కుటుంబ దారిద్ర్యం ఎటువంటిదో ఊహించకోవచ్చు. చివరికి వారికి మిగిలింది ముగ్గురే ముగ్గురు ఆడపిల్లలు.

## రెండు వెలుగు రేకలు

కాని, అంత నరక సదృశమైన దారిద్ర్యంలోను, అనారోగ్యంలోను మార్క్స్ జీవితాకాశంలో రెండే రెండు వెలుగు రేకలు. ఒక కాంతి కిరణం భార్య జెన్నీ ప్రణయం. మరొక ఆశా కారణం ఎంగెల్స్ స్నేహం.

బాల్య సఖులైన మార్క్సు, జెన్నీల అన్యోన్యానురాగం ఏళ్లు ముదిరి కీళ్లు సడలు తున్నా, పేదరికపు రక్కసి కోరలు చాచి పొంచి వున్నా, వీసమైనా, లేశమైనా తగ్గలేదు. ఎప్పటివలె ప్రేమానురాగాల పూల పందిరిలోనే వారు గడిపేవారు. వారిది నిజంగానే అపూర్వమైన దాంపత్యం. ఇక మార్క్సుకు తన సంతానం పట్ల అనురాగం చెప్పనలవి కానిది. వారి సన్నిధానంలో తడు అపార సౌఖ్యం అనుభవించేవాడు. మిగిలిన ఆ ముగ్గురు ఆడపిల్లలను ఎంతో ప్రేమగా చూసుకునేవాడు. కష్టాలన్నీ మరిచి వారితో సరదాగా కాలక్షేపం చేసేవాడు. రకరకాల ఆటలు ఆడి మురిపించే వాడు. ఏవో గాథలు చెప్పి బాధలు మరి పించేవాడు.

ఇక మార్క్సు, ఎంగెల్స్‌ల మైత్రి చరిత్ర ప్రసిద్ధమైంది, అపూర్వమైంది. నిజానికి వారి వ్యక్తిత్వాలలో చాలా తేడా వుంది. అయనొకరకం. ఈయనొక రకం. వారి మధ్య అంత గాఢమైత్రి ఏర్పడి కొనసాగడమే విశేషమని చరిత్రకారు లంటారు.

మార్క్సు కొంచెం ముదురు రంగు మనిషి. అతనికి "మూర్" అని అతని పిల్లలే నిక్‌నేమ్ పెట్టారు. మనిషి కాస్త లావుగా, దిట్టంగా వుండేవాడు. తీక్షణ మైన చూపులతో సీరియస్‌గా వుండేవాడు. బవిరి గడ్డం, రేగిన జుట్టు, ఎప్పుడూ మాసి నలిగిపోయిన దుస్తులు ధరించేవాడు. ఇక ఇల్లు చూస్తే ఎప్పుడూ దరిద్రం ఓడుతూ వుండేది. ఎక్కడ పడితే అక్కడ పుస్తకాలు చిందరవందరగా పడి వుండేవి.

## లైబ్రరీలో కాలక్షేపం

అతడు ఏదైనా వ్రాయవలసివస్తే—అది ఎంత సాధారణ విషయమైనా, గహన విషయమైనా, ప్రతి చిన్న వివరం సేకరించేవాడు. ప్రతి వాక్యం ఆచి తూచి వ్రాసేవాడు. లండన్‌లో అతని కార్యక్రమం ప్రతిరోజూ క్రమం తప్ప కుండా పొద్దున పదింటికి బ్రిటిష్ మ్యూజియం లైబ్రరీకి వెళ్లడం. సాయంత్రం ఏడు వరకు కూర్చుని పుస్తకాలు, డాక్యుమెంట్లు తీసుకుని చదివేవాడు. దీక్షగా నోట్సు వ్రాసుకునేవాడు. "దస్ క్యాపిటల్"కు ఇలాగే వివరాలు సేకరించాడు.

## కారల్ మార్క్సు కడపటి రోజులు

ఎంగెల్స్ మరోతరహా మనిషి. అతడు అచ్చంగా బూర్జువా వర్గపు కులాసా విలాస పురుషుడిలాగా వుండేవాడు. మనిషి తెల్లగా, పొడుగ్గా వుండేవాడు. మహా పండితుడు. దాదాపు ఇరవై భాషలు నేర్చుకున్నాడు. పాండిత్యంలో, ప్రతిభలో

విప్లవభావ తీవ్రతలో మార్క్సుకు తీసిపోడు. కాని వివరాలమీద మార్క్సుకు న్నంత శ్రద్ధ లేదు. మార్క్స్ ఆచి తూచి వ్రాస్తే, ఎంగెల్స్ ఎంత క్లిష్ట విషయమైనా అవలీలగా, అలవోకగా బరికిపారేసేవాడు. మార్క్సులో గాఢత్వం వుంది. ఎంగెల్స్‌లో విస్తృతి వుంది. అయినా మార్క్స్ నిస్సందేహంగా ఎక్కువ జీనియస్ అన్నదే చరిత్రకారుల ఏకగ్రీవాభిప్రాయం.

మార్క్స్ పేదరికం దుర్భరంగా వుండే దన్నమాట నిజమేకాని, చాలవరకు అది వున్న డబ్బును ఎలా మేనేజ్ చేయాలో తెలియక కొనితెచ్చుకున్న పేద రికం. మార్క్స్ డబ్బు దుబారా చేసేవాడు. చేసిన అప్పులు నిప్పుల్లాగ మండిస్తూ వుండేవి తప్ప, చలికాలంలో ఇంటిని వెచ్చగా వుంచుకొనడానికి కావలసిన కట్టెలకైనా డబ్బు వుండేది కాదు. మరో ప్రక్కన అంత పేదరికంలోను పిల్లలపట్ల అపార ప్రేమతో వారికి సంగీతం పాఠాలు చెప్పించేవాడు.

## విలేఖక వృత్తి

మరి ఆ పేదరికంలో అతడిని కొంతవరకు ఆదుకున్నది పత్రికా రచనా వృత్తి. 'న్యూయార్క్స్ ట్రిబ్యూన్' అనే అమెరికన్ పత్రికకు యూరోపియన్ విలేఖకుడుగా మార్క్స్ పనిచేసేవాడు. ఆ పత్రిక మేనేజింగ్ ఎడిటర్ ఛార్లెస్ ఎ. డానా. అతడు వామపక్ష భావాలు కలవాడు. ఫూర్యర్ అభిమాని. ఒకసారి కలోన్‌లో మార్క్సును కలుసుకొని తన పత్రికకు రచనలు పంపమని కోరాడు. మార్క్స్ యూరప్ పరిస్థితిపై వ్యాసాలు, వ్యాఖ్యలు వ్రాసి పంపేవాడు.

కాని, వరస తప్పకుండా వ్రాయలేక పోయేవాడు. అలాంటి సమయాలలో ఎంగెల్సే తానే మార్క్స్ పేరుతో ఏదో వ్రాసి పంపేవాడు. ఒక్కొక్క వ్యాసానికి రెండేసి పౌనుల ఆదాయం వచ్చేది. అదే అతనికి నమ్మకంగా వచ్చే ఆదాయం. 1851 నుంచి 1862 వరకు మార్క్స్ అలాగ 500 వ్యాసాలు, సంపాదకీ యాలు పంపించాడు. 1862 లో చార్లెస్ డానాకు, పత్రిక యాజమాన్యానికి కలతలు వచ్చాయి. డానా ఉద్యోగం పోయింది. దానితో మార్క్స్ ఉద్యోగం కూడా ఊడిపోయింది. నమ్మకమైన ఆదాయ మార్గం కాస్తా పోయింది.

మార్క్స్ ఒకే ఒక్కసారి ఒక ఉద్యోగానికి ప్రయత్నం చేశాడు. రైల్వేలో ఏదో గుమాస్తా ఉద్యోగానికి దరఖాస్తు పెట్టాడు. కాని, అతడు దస్తూరీ తిలకం కాదు, రాత చీకిరి బాకిరిగా వుండేది. అందుచేత ఆ ఉద్యోగం రాలేదు. పొట్టగడవక వెండి, కాస్త విలువైన వస్తువులు తాకట్టుపెట్టి డబ్బు తెచ్చుకునేవాడు. అప్పుడు కోటు, కాలిజోళ్లు కూడా తాకట్టుపెట్టి, బయటికి వెళ్లడానికి వీలులేక ఇంటిలోనే వుండిపోయేవాడు. ఒక్కొక్కసారి వ్రాసిన రచ నలు పోస్టు చేయడానికి స్టాంపులకు కూడా చేతిలో డబ్బుండేది కాదు.

ఒకసారి మార్క్స్ ఎంగెల్స్‌కు ఇలా వ్రాశాడు :

"నా భార్య జెన్నీకి సుస్తీ, కుమార్తె జెన్నీకి సుస్తీ. లెంచెన్ (పనిమనిషి)కు ఏదో జ్వరం. డాక్టర్‌ని పిలుద్దామంటే చేతిలో పెన్నీ లేదు. ఎనిమిది, పది రోజులుగా రొట్టె, బంగాళ దుంపలు ఇవే- ఆహారం. ఇప్పుడు అవీ దొరికేటట్టు లేదు. ఈ బాధలతో డానాకు (న్యూయార్క్ ట్రిబ్యూన్‌కు) ఏమీ వ్రాయలేకపోయాను. ఈ అవస్థల నుంచి ఎలా బయట పడడం? కిందటి వారంలో గావును ఎవరో కార్మికులనుంచి కొన్ని షిల్లింగులు, పెన్నీలు చేబదులు తీసుకున్నాను. అది తప్పే.కాని, తప్పలేదు. లేకపోతే మలమల మాడిపోయేవాళ్లం..."

## ఎంగెల్స్ సహాయం

పాపం-ఎంగెల్స్ ఎన్నిసార్లు ఆర్థికంగా మార్క్స్‌ను ఆదుకొన్నాడో లెక్కలేదు. అడిగినప్పుడల్లా, అడిగినదే తడవుగా డబ్బు పంపించేవాడు. తొలిరోజులలో తన పరిస్థితి కూడా అంతంత మాత్రంగానే వుండేది. అయినా, వున్నంతలో సర్దుబాటు చేసేవాడు. చివరికి 1864 లో తన తండ్రి ఫ్యాక్టరీలో తాను భాగస్వామి అయ్యాడు. దానితో ఆదాయం పెరిగి చేతిలో బాగా డబ్బులు ఆడేవి. మరింత ఉదారంగా మార్క్స్‌కు సహాయం చేసేవాడు. మార్క్స్ పట్ల అతనికి గురుభావం. ఎంగెల్స్ పట్ల మార్క్స్‌కు వాత్సల్యభావం. అయితే మార్క్స్‌కు స్వాతిశయం ఎక్కువ అని, కోపిష్టి అని, తననెంతో గౌరవంతో చూసుకొనే ఎంగెల్స్‌పట్ల చులకన భావంతో ప్రవర్తించేవాడని అనేవారు కూడా లేకపోలేదు. మార్క్స్‌తో ఎంగెల్స్ అంతకాలం అలా వేగాడంటే అతనికి మార్క్స్‌పట్ల ఆరాధనా భావమేకాక, కమ్యూనిస్టు ఉద్యమంపట్ల గల ఏకాగ్రత కూడా కారణమని కొందరు చరిత్రకారులు పేర్కొన్నారు.

భార్య జెన్నీకి 1856 లో ఏదో వారసత్వపు ఆదాయం వచ్చింది. దాంతో ఆర్థిక పరిస్థితి కాస్త మెరుగైంది. హాంప్‌స్టెడ్ హీత్ వద్ద ఎనిమిది గదుల పెద్ద ఇంటిలోకి మారారు.

మార్క్స్- ఎప్పటికప్పుడు అదుగో కమ్యూనిస్టు విప్లవం వస్తోందని, ఇదుగో తన కల నిజమవుతుందని ఎదురు చూసేవాడు. ఇంతలో ఆశాభంగం చెందేవాడు. ఈ ఆశా నిరాశా తరంగాలమధ్య ఊగులాడుతూనే, "క్యాపిటల్" గ్రంథ రచన, దానికి విషయ సేకరణ చేస్తూ వుండేవాడు. చివరికి 1867 లో దాని ప్రథమ భాగం పూర్తి అయింది. మొదట దాన్ని ఎవరో కొద్దిమంది అభిమానులు, స్నేహితులూ తప్ప పెద్దగా పట్టించుకున్నవారు లేరట.

## పేరు ప్రఖ్యాతులు

అయితే, అతని కల కొద్దికాలంపాటే అయినా ఒక్కసారి నిజమైంది. పారిస్‌లో 1871 లో విప్లవ ఫలితంగా కమ్యూన్ ఏర్పడింది. దాన్ని ఆచరణలో మార్క్సిజంగా, కార్మికవర్గ నియంతృత్వం (డిక్టేటర్‌షిప్ ఆఫ్ ప్రోలిటేరియట్) అన్న మార్క్సిస్టు సూత్రానికి ఉదాహరణగా పలువురు భావించారు. అది రెండు నెలల కంటె ఎక్కువ కొనసాగకపోయినా, పారిస్‌కమ్యూన్‌తో మార్క్స్‌కు అంతర్జాతీయ ఖ్యాతి వచ్చింది. యూరప్‌లో అతని పేరు మారుమ్రోగింది. నిజానికి పేరుకోసం ఎన్నడూ ప్రాకులాడకపోవడం మార్క్స్ వ్యక్తిత్వంలోని గొప్ప విశేషం.

అప్పటికి అతనికి 54 ఏళ్లు. ఈలోగా మరేదో వారసత్వపు ఆదాయం కలిసొచ్చి పేదరికం బాధ మరికొంత తీరింది. మరికొంత పెద్ద ఇంటిలోకి మారారు. దాదాపు బూర్జువాలాగా జీవిక గడపడానికి వీలైన పరిస్థితి ఏర్పడింది. అయితేనేం, డబ్బు చేతిలో ఆడుతుంటే, దాన్ని ఎలాగో అలా వదిలించుకునే దాకా మార్క్స్‌కు తోచేది కాదు. దానితో తానూ, తన పేదరికం మళ్లీ తయారు.

"క్యాపిటల్" రెండవ ముద్రణ 1871 లో వెలువడింది. ఆ మరుసటి సంవత్సరమే దాని రష్యన్ అనువాదం వచ్చింది. (రష్యాలో అతని అభిమానులు ఎక్కువ) తర్వాత అది ఫ్రెంచిలోకి తర్జుమా అయింది.

మార్క్స్ సేకరించిన సమాచారం మరి రెండు సంపుటాలకు సరిపడినంత మిగిలింది. కాని, ఆ సమాచారం నోట్స్ రూపంలో చిత్తు ప్రతులుగానే వుండిపోయింది. సాపు రచన చేద్దామంటే ఓపిక లేదు. ఆరోగ్యం శిథిలమవుతున్నది. అతని జీవిత కాలంలో "క్యాపిటల్" రచన పూర్తిచేయలేక పోయాడు. అతని మరణానంతరం ఎంగెల్స్ 1885 లో రెండవ భాగాన్ని, 1894 లో మూడవ భాగాన్ని ఎడిట్‌చేసి సరిచూసి ప్రచురించాడు.

మార్క్స్‌కు మిగిలిన ముగ్గురు కుమార్తెలైన జెన్నీ, లారా, ఎలియనార్‌లలో మొదటి ఇరువురికి పెళ్లిళ్లు అయ్యాయి. అన్ని కష్టాలలోను అతనిపట్ల ఏమాత్రం ప్రేమ తగ్గని భార్య 1881 లో దీర్ఘ వ్యాధిగ్రస్తురాలై క్రుంగి, కృశించి శాశ్వతంగా కన్నుమూసింది. చిర సహచరి మరణంతో మార్క్స్ తానూ మానసికంగా క్రుంగిపోయాడు. మరొకప్రక్క అనారోగ్యంతో భౌతికంగానూ క్రుంగిపోయాడు. ఆ మరుచటి సంవత్సరం (1882) మరొక ఎదురుచూడని దెబ్బ తగిలింది. పెద్ద కుమార్తె జెన్నీ జబ్బుచేసి చనిపోయింది. ఆ దుర్ఘటనతో ఇంకా క్రుంగిపోయాడు. తనకు బ్రాంకైటిస్ వ్యాధి పట్టుకుంది. ఆ మరుచటి సంవత్సరం (1883) మార్చి 14వ తేదీన ప్రశాంతంగా అంతిమ శ్వాస విడిచాడు. అతడిని

లండన్ సమీపాన హైగేట్ సిమెటరీలో సమాధి చేశారు. ఆ స్థలం మార్క్స్ అభిమానులకు నేటికీ యాత్రాకేంద్రంగా కొనసాగుతున్నది. కాని, ఆనాడు మాత్రం "నీవు చనిపోతే ఎవరు దుఃఖించారులే నేస్తం, ఏదో నేమా ఆరు గురు స్నేహితులూ తప్ప..." అన్నట్టు ఎంగెల్స్, మరికొద్ది మంది మిత్రులు, అభిమానులు మాత్రం అతని అంత్యక్రియలకు హాజరయ్యారు.

మార్క్స్‌తో ఒక మహావ్యక్తి, యుగకర్త మరణించాడని ఆనాడు ఎవరూ గ్రహించినట్టు లేదు. లండన్ టైమ్స్‌తో సహా పత్రిక లేవీ ఆ వార్తను వెంటనే ప్రచురించలేదట. మార్క్స్ మరణానంతరమే అతని ప్రబావం దేశ దేశాలకు వ్యాపించింది. చరిత్ర గతిని మార్చిన మహాపురుషులలో ఒకడుగా యశశ్శరీ రంతో నేటికీ అతడు సజీవుడే.

## గతితార్కిక భౌతికవాదం

పునరుక్తి అయినా, మార్క్సిజానికి పునాది అయిన గతితార్కిక భౌతిక వాదాన్ని (డయలెక్టికల్ మెటీరియలిజం) గురించి మరింత వివరంగా ఇక్కడ తెలుసుకుందాము. మార్క్స్ హెగెల్‌నుంచి గతితార్కిక వాదాన్ని (డయలెక్టి క్‌ను) తీసుకున్నాడు. ఫ్యూయర్‌బాక్‌నుంచి భౌతిక వాదాన్ని స్వీకరించాడు. ప్రపంచాన్ని అవగాహన చేసుకుని, మార్చడానికి గతి తార్కిక భౌతిక వాదాన్ని ఒక సాధనంగా మలచుకున్నాడు.

## అంతా భావమయం

హెగెల్ గతి తర్కం ప్రకారం ప్రపంచమంతా భావమయం. ఉన్నది ఒకటే యాథార్థ్యం (రియాలిటీ). అది కేవలభావం [ఎబ్సొల్యూట్ ఐడియా]. దాన్నే మనం దేవుడని, ఆత్మ అని, మనస్సు అని, చైతన్యమని రకరకాల పేర్లతో వ్యవహరి స్తున్నాము. మరి ఈ భౌతిక ప్రకృతి అంతా ఏమిటి? అంటే, అదంతా కేవల భావానికి బాహిరీకరణమే అన్నాడు హెగెల్. "కేవల భావం" తనకోసం, తనను తాను సాక్షాత్కరించుకొనడానికి చేసే ప్రయత్నమే చరిత్ర అన్నాడు.

ఈ ప్రయత్నం ఎలా జరుగుతుంది? హెగెల్ దృష్టిలో యాథార్థ్యం అనేది ఎప్పుడూ స్తబ్దంగా వుండదు. అది నిత్య చలనశీలం, పరిణామశీలం. అది ఒక క్రమం—ప్రాసెస్. ఈ పరిణామక్రమం ఒక పద్ధతి ప్రకారం—ఒక తర్కం ప్రకారం— జరుగుతుంది. దాన్నే గతితర్కం అని హెగెల్ పేర్కొన్నాడు.

గతి తర్కం త్రయీ విధానంలో వ్యక్తమవుతుంది. మొదట వాదం (థీసిస్)

వుంటుంది. కాని, ప్రతి వాదం పుడుతూనే తన ప్రతివాదాన్ని (యాంటీ థీసిస్) సృష్టిస్తుంది. ఈ వాద, ప్రతివాదాల, మధ్య అనివార్యంగా సంఘర్షణ జరుగుతుంది. ఆ ఘర్షణ ఫలితంగా వాద ప్రతివాదాలమధ్య వైరుధ్యాలు తొలగిపోయి, సమన్వయవాదం (సింథెసిస్) ఏర్పడుతుంది.

వాదంకంటె ప్రతివాదం ఉన్నతదశ. ఎందుకంటే వాదంలోని చెడును పరిహరించడానికే ప్రతివాదం బయలుదేరుతుంది. ఈ రెండింటికంటె ఈ రెండింటి సమన్వయవాదం ఉన్నతదశ. ఈ విధంగా వాద, ప్రతివాద, సమన్వయవాదాల త్రయీ పద్ధతిలో "కేవల భావం" క్రింది దశలనుంచి పై దశలకు పురోగమిస్తుంది.

ఇది వట్టి భావానికి (ఐడియాకు) మాత్రమే సంబంధించింది కాదు. భావానికి ప్రతిరూపమే బాహ్య ప్రకృతి. కనుక భావ పురోగమనం బాహ్య ప్రకృతిలో కూడా పురోగమనంగా వ్యక్తమవుతుంది. ఆ పురోగమనమే ప్రపంచచరిత్ర.

## హెగెల్‌తో పేచీ

హెగెల్ ప్రవచించిన ఈ గతి తార్కిక వాదం మార్క్స్‌ను ఆకర్షించింది. కాని, ఒక ముఖ్య విషయంలో అతడు విభేదించాడు. గతితార్కిక పురోగమనానికి ఏది చోదక శక్తి? అది కేవలభావం (ఎబ్సొల్యూట్ ఐడియా, సోల్, మైండ్, గాడ్) అనే హెగెల్ భావాన్ని మార్క్స్ తిరస్కరించాడు. ఈ తిరస్కృతిలోనే ఫ్యూయర్ బాక్ ప్రభావం మార్క్స్‌పై వున్నది.

ప్రపంచ పురోగమనానికి చోదకశక్తి (motive force) చలనశీలమైన భౌతిక పదార్థం (matter in motion) అని మార్క్స్ అన్నాడు. అందుచేతనే మార్క్సిజానికి గతి తార్కిక భౌతికవాదం అనే పేరు వచ్చింది. జడపదార్థం అనేది లేదు. పదార్థం (మేటర్) అంతా చలన స్వభావం కలిగినదే. చలనం లేనిదే పదార్థం లేదు. చలనానికి, పదార్థానికి అవినాభావ సంబంధం వున్నది. కనుక పదార్థం స్వభావతః పురోగమిస్తుంది.

## తిరగేసిన వాదం

హెగెల్ వాదాన్ని తిరగేసి దాని కాళ్లమీద దాన్ని నిలబెట్టానని మార్క్స్ చెప్పుకున్నాడు. మొదట ఒకానొక భౌతిక పరిస్థితి వుంటుంది. అది అనివార్యంగా దాని వ్యతిరేక పరిస్థితి ఆవిర్భావానికి కారణ మవుతుంది. ఆ రెండు విరుద్ధ పరిస్థితుల మధ్య సంఘర్షణ జరుగుతుంది. ఆ ఘర్షణ ఫలితంగా ఆ రెండింటిలోని ప్రగతిశీల లక్షణాలను పుణికి పుచ్చుకుని సమన్వయ పరిస్థితి

ఏర్పడుతుంది. అట్టి సమన్వయ పరిస్థితి మొదటి పరిస్థితికంటె ఉన్నతస్థాయిలో వుంటుంది.

ఘర్షణవల్ల వినాశం కూడా సంభవించవచ్చు. అంటే చరిత్ర అప్పుడప్పుడు వెనక్కి పోతుంది. లేదా, వెనక్కి పోయినట్టు కనిపిస్తుంది. కాని, మొత్తంపై సృష్ట్యాది (అనేది వుంటే) నుంచి విశ్వ చరిత్రను పరిశీలిస్తే, ఎన్ని అవాంతరా లెదురైనా క్రింది దశలనుంచి పై దశలకు పురోగమనమే కనిపిస్తుంది. ఈ పురోగమనం భౌతికపదార్థ పరిణామానికి, జీవ పరిణామానికి, మానవ పరిణామానికి, మానవ సమాజపరిణామానికి-సమస్తానికి వర్తిస్తుంది. ఒక మార్పు పురోగమన కారకమైతే, మరొకటి తిరోగమన కారకం కావచ్చు. కాని, మొత్తంపై గతి తార్కిక పద్ధతిలో జరిగే చలనం, మార్పు స్థూలంగా ఉన్నతోన్నత దశలకు పురోగమనంగా వ్యక్తం కావడమే కనిపిస్తుంది. వర్తమానం అనే శిఖరాగ్రం నుంచి కిందికి చూస్తే, అంత కంతకు ఉన్నతాలైన దశలకు జరిగిన జగత్పురోగమనమే చూపట్టుతుంది.

## అనివార్య ప్రగతి

ప్రత్యేకించి మానవ చరిత్రనే తీసుకున్నప్పటికి మానవుడు అదిమ, ఆటవిక జీవన విధానంనుంచి నేటి నాగరిక జీవన విధానంవైపు అనివార్యంగా ప్రగతియాత్ర చేశాడు. దీన్ని సత్యకాలంనుంచి తిరోగమనంగా ఏవగించుకునేవారు కూడా లేకపోలేదు. అయితే, నరజాతి చరిత్రలో ప్రతి ప్రధాన దశ అంతకుముందు దశకంటె ఉన్నత స్థాయిలో వుంటుంది. అదే సమయంలో ఆ ఉన్నత దశలోని అంతర్గత వైరుధ్యం (Internal contradiction) కూడా వ్యక్తమవుతుంది. దానితో సంఘర్షించి, దాన్ని తొలగించుకుని సమాజం మరొక ఉన్నతదశలోకి పోతుంది. తిరిగి వైరుధ్యం... తొలగింపు...సమన్వయం...ఈ విధంగా ఎప్పటికప్పుడు సాక్షాత్కరించే వైరుధ్యాల సమన్వయం లోనే సమాజ పురోగమనం నిక్షిప్తమైవుంటుంది. ఈ ప్రక్రియ సృష్ట్యాది అనేది వుంటే అప్పటినుంచి జరుగుతున్నది. సృష్ట్యంతం అనేది వుంటే అంతవరకు జరుగుతుంది. ఇది అనంతం.

## హెగెల్ స్వాతిశయం

హెగెల్ ఒక పొరపాటు అభిప్రాయానికి వచ్చాడు. వాద, ప్రతివాద, సమన్వయ వాదాల త్రయీ వలయం తన గతితార్కిక భావవాదంతో అంతమైనట్టు భావించాడు. అలాగే మానవ సమాజ పురోగమనం తన కాలం నాటి ప్రష్యన్ రాజరిక వ్య వ స్థ తో పరిపూర్ణమై పోయినట్టు తలచాడు. దీన్ని మార్క్స

వంటి యంగ్ హెగెలియన్‌లు తిరస్కరించారు. గతి తార్కిక పురోగమనం మూసుకుపోయిన వలయం (Closed circle) లాంటిది కాదు. గడియారపు స్ప్రింగ్ వలె తెరుచుకున్న స్పైరల్ వలయాకృతిలో అనంతంగా సాగుతుంది. అందుచేత మానవ సమాజ పురోగతి కూడా ఇంతటితో– ఫలానా ఘట్టంతో – పరిపూర్ణత చెంది ఆగిపోతుందని చెప్పలేము. అది అనంతంగా కొనసాగుతూనే వుంటుంది.

గతి తార్కికంగా పరిణామం చెంది పురోగమించేది హెగెల్ చెప్పినట్టు కేవలభావం (Absolute Idea) కాదని, చలన సహిత పదార్థం (Matter in motion) అని మార్క్స్ భావించినట్టు తెలుసుకున్నాము. అంటే హెగెల్ "కేవల భావాని" కిచ్చిన స్థానాన్ని మార్క్స్ భౌతిక పదార్థాని కిచ్చాడు. కనుక, మార్క్స్ దృష్టిలో భౌతిక పదార్థం (మేటర్) ప్రాథమికం (Primary) కాగా, మనస్సు, చైతన్యం (Consciousness), భావం అనబడేవి ద్వితీయక (Secondary) మైనవి. భావానికి బాహ్యరూపం ప్రకృతి అని హెగెల్ సిద్ధాంతం. కాగా, ప్రకృతికి అంతరరూపం భావమని మార్క్స్ సిద్ధాంతం.

## ఆర్థిక వ్యవస్థ పునాదిపై సమాజ జీవితం

పదార్థం ప్రాథమికమైనది. అంటే అది అనాదిగా, స్వతస్సిద్ధంగా, స్వయంభువంగా వున్నది. అది గతి తార్కిక ప్రక్రియలో పరిణామం చెందుతూ అంతకంతకు ఉన్నతోన్నత రూపాలు చెందింది. ఒకానొక దశలో అది సేంద్రియ (Organic) పదార్థంగా మారి జీవకోటి ఉదయించింది. జీవరాశి కూడా ఉన్నతోన్నత దశలను అందుకుంటూ చివరికి మానవుడు అవిర్భవించాడు. మానవుని మెదడు భౌతిక పదార్థం పొందిన అత్యున్నత రూపం. ఈ మెదడే మన చైతన్యానికి, ఆలోచనకు, సమస్త మనో వ్యాపారానికి అధారభూతమైన ఇంద్రియం.

భావవాదులు చెబుతున్నట్టు మన మనస్సు బాహ్య ప్రపంచానికి కర్త కాదు. పదార్థమే మన మనస్సును సృజించింది. బాహ్య ప్రపంచాన్ని మనం తెలుసుకొనడానికి ఉపయోగపడే సాధనమే మన మనస్సు. మన ఆలోచనలలో బాహ్య ప్రపంచం అద్దంలో మాదిరిగా ప్రతిఫలిస్తుంది. అద్దం ఎంత లోపరహిత మైనదైతే అంత బాగా ప్రతిబింబం వుంటుంది. అందుచేత మనస్సు లేకపోయినా, చైతన్యం లేకపోయినా పదార్థం వుంటుంది కాని, పదార్థం లేనిదే మనస్సు లేదు.

హెగెల్ మన భావాలు గతి తార్కికంగా పురోగమిస్తాయి కనుక, వాటి ప్రతిబింబమైన ప్రపంచం కూడా గతి తార్కికంగా పురోగమిస్తుం దనుకున్నాడు.

ఇది తప్పు. ప్రపంచం, దాని చరిత్ర గతి తార్కికంగా పురోగమిస్తున్నాయి కనుకనే, వాటి ప్రతిరూపాలైన మన భావాలు, ఆలోచనలు, సిద్ధాంతాలు అన్నీ గతి తార్కిక పద్ధతిలో పురోగమిస్తున్నాయి. మన భావాలు గతి తార్కికంగా ఎందుకున్నాయి? ప్రపంచం గతి తార్కికంగా ప్రవర్తిస్తున్నది కనుక ! ఇది పాదార్థిక ప్రపంచానికి (Material world) వలె మానవ సమాజ చరిత్రకు కూడా వర్తిస్తుంది.

## ఏది పునాది ?

అందుచేత మనం ప్రారంభించవలసింది మన భావాలతోను, సిద్ధాంతాల తోను కాదు. వాటికి ఆధారమైన మానవ సమాజాన్ని, దాని చరిత్రను పరిశీలించడంతో ప్రారంభించాలి. మానవ సమాజానికి ఆర్థిక వ్యవస్థ పునాది. దానిపై నిర్మితమైన సౌధం (Super structure) మన భావవ్యవస్థ. ఏ కాలం లోనైనా మానవ సమాజం ఏ ఆర్థిక దశలో వున్నదో ఆ దశను ఆనాడు ప్రబలంగా ప్రచలితమయ్యే రాజకీయ వ్యవస్థ, సిద్ధాంత వ్యవస్థ, మతం, కళలు, సంస్కృతి ఇవన్నీ ప్రతిఫలిస్తాయి తప్ప నిర్ణయించవు. నిర్ణాయకపాత్ర ఆర్థిక వ్యవస్థది. అది ఏ అభివృద్ధి దశలో వున్నదో ఆ దశది. దీన్నే చారిత్రక భౌతిక వాదం (హిస్టారికల్ మెటీరియలిజం) అంటారు.

మార్క్స్ 1859 లో వ్రాసిన ఒక గ్రంథంలో ఇలా వివరించాడు :

"మానవులు సామాజికంగా వస్తువులను ఉత్పత్తి చేసేటప్పుడు తమ ఇష్టాని ష్టాలతో నిమిత్తం లేకుండా అనివార్యంగా కొన్ని పరస్పర సంబంధాలకు లోన వుతారు. ఈ ఉత్పత్తి సంబంధాలు ఆ కాలపు ఉత్పత్తి శక్తుల అభివృద్ధి దశకు అనుగుణంగా వుంటాయి. ఈ ఉత్పత్తి సంబంధా లన్నిటినీ కలిపి తీసుకుని చూస్తే, అవే ఆ సమాజపు ఆర్థిక వ్యవస్థగా భాసిస్తాయి. అవే అసలు పునాది."

"అంటే ఆర్థికమైన కట్టడమే అన్నిటికి ప్రాతిపదిక. ఆ పునాదిపైనే మన శాసన, రాజకీయ వ్యవస్థలు ఉపరిసౌధంవలె లేస్తాయి. ఆ పునాదికి అనుగు ణమైన నిర్దిష్ట రూపాలనే మన సామాజిక స్పృహ (social consciousness) పొందుతుంది. భౌతిక జీవితానికి అవసరమయిన వస్తువులను ఉత్పత్తిచేసే విధా నమే సాంఘిక, రాజకీయ, ఆధ్యాత్మిక, జీవిత విధానాలను స్థూలంగా నిర్ణయి స్తుంది. మానవుల మనుగడ పద్ధతిని నిర్ణయించేది వారి మనోవ్యాపారం కాదు. నిజానికి వారి సాంఘిక జీవన విధానమే వారి చైతన్యాన్ని నిర్ణయిస్తుంది(It is not the consciousness of men that determines their existence, but, on the

contrary, their social existence that determines their consciousness) ఒకానొక అభివృద్ధి దశను చేరుకునేసరికి సమాజంలోని భౌతిక వస్తూత్పత్తి శక్తులు అప్పటికి అమలులోవున్న ఉత్పత్తి సంబంధాలతో- అంటే న్యాయశాస్త్ర పరిభాషలో చెప్పాలంటే- అంతవరకు తాము ఏ ఆస్తి సంబంధాల పరిధిలో పనిచేస్తున్నాయో ఆ ఆస్తి సంబంధాలతో సంఘర్షిస్తాయి. ఈ సంబంధాలు ఉత్పత్తి శక్తులను అభివృద్ధి చేసే సాధనాలు కావడానికి బదులు వాటికి శృంఖలాలుగా తయారవుతాయి. అప్పుడు సాంఘిక విప్లవ శకం వస్తుంది. ఆర్థికమైన పునాది మారడంతో దానిపై నిర్మించిన బ్రహ్మాండమైన సౌధం కూడా అతి త్వరితంగా పరివర్తన చెందుతుంది.

"ఈ మార్పులను పరిశీలించేటప్పుడు ఒక తేడా గుర్తుంచుకోవాలి. ఉత్పత్తికి సంబంధించిన ఆర్థికపరిస్థితులలో వచ్చే భౌతికమైన మార్పులను మనం శాస్త్రీయంగా, ఖచ్చితంగా లెక్కకట్టవచ్చు. కాని, పరిస్థితులతో వచ్చే సంఘర్షణ, పోరాటం మానవుల మనస్సులలో ఏ న్యాయశాస్త్ర, రాజకీయ, మత, కళా, తాత్వికరూపాలలో వ్యూహాలోకి ప్రవేశిస్తాయో వాటినిమాత్రం అంత ఖచ్చింతగా మనం లెక్కకట్టలేము."

## కీలక వాక్యాలు

ఇందులో కీలకమైన వాక్యాలు-"మానవుల మనుగడ పద్ధతిని నిర్ణయించేది వారి మనో వ్యాపారం కాదు. వారి సాంఘిక జీవిత విధానమే వారి చైతన్యాన్ని నిర్ణయిస్తుంది" అనేది.

మానవుల మనుగడ-సాంఘిక జీవన విధానం అంటే ఏమిటి? మానవులు జీవించడానికి ఆహారం, నివాసం, దుస్తులు మొదలైన కొన్ని ప్రాథమిక అవసరాలున్నాయి. వీటిని ఏ ముడివస్తువులతో, ఏ సాంకేతిక పద్ధతిలో, అంటే ఏ యంత్రాలతో, ఏ రకమైన శ్రామిక శక్తితో ఉత్పత్తిచేస్తారో అవి. అవే ఉత్పత్తి శక్తులు (Productive Forces).

ఉత్పత్తి శక్తులు రెండు రకాలుగా వుంటాయి. ఒకటి-ఉత్పత్తి సాధనాలు, రెండు-వాటిని ఉత్పత్తిచేసి, పని చేయించే నిపుణులైన కార్మికవర్గం. ఈ రెండు రకాలు కలిస్తేనే ఉత్పత్తి శక్తులు అవుతాయి.

## ఉత్పత్తి సాధనాలు

ఉదాహరణకు ఒకానొక కాలంలో పొలాలనన్నీ హలాలతో దున్నేవా రనుకోండి. నాగలి ఆనాటి ఒక ఉత్పత్తి సాధనం. ఆధునిక కాలంలో ట్రాక్టర్లు

వాడుకలోకి వచ్చాయి. అవి ఈనాటి ఉత్పత్తి సాధనాలు. అలాగే వడ్లను దంచడానికి ఉపయోగించే రోకలి, రోలు ఒకనాటి ఉత్పత్తి సాధనాలు. కాగా నవీన కాలపు మిల్లులు ఇప్పటి ఉత్పత్తి సాధనాలు. ఇవి ఆర్థిక వ్యవస్థలో కీలక ప్రాధాన్యం కలిగినట్టివి.

అయితే ఉత్పత్తి సాధనాలు వాటంతట అవి లభించవు. వాటిని ఉత్పత్తి చేయడానికి సాంకేతికంగా నిపుణులైన కార్మికులు అవసరం. అలాగే తయారైన ఉత్పత్తి సాధనాల చేత పని చేయించడానికి వాటి సాంకేతిక పరిజ్ఞానాన్ని ఆకళించుకున్న కార్మికులు అవసరం. ఉత్పత్తి సాధనాలు, కార్మికవర్గం కలిసి ఉత్పత్తి శక్తులు ఏర్పడుతాయి.

మరి ఉత్పత్తి సంబంధాలంటే ఏమిటి? ఉత్పత్తి శక్తులను పని చేయించే క్రమంలోమానవులు కొన్ని నిర్దిష్ట సంబంధాలకు లోనవుతారు, లేదా తమలో తాము నిర్దిష్ట సంబంధాలు ఏర్పరచుకుంటారు. నాగలి ఉత్పత్తి శక్తి. దాని యజమానికి అది సొంత ఆస్తి. నాగలితో పనిచేసేవాడు పాలేరు కనుక నాగలి కారణంగా ఇరువురు మానవుల మధ్య యజమాని, పాలేరు అనే ఉత్పత్తి సంబంధాలు విధిగా ఏర్పడుతాయి.

ఉత్పత్తిశక్తుల స్థాయినిబట్టి ఉత్పత్తి సంబంధా లుంటాయి. చేమగ్గం భూస్వామ్య వ్యవస్థ కాలానికి చెందినది. ఆధునిక మైన జౌళిమిల్లు పెట్టుబడిదారీ వ్యవస్థకు చెందినది. ఒక సమాజం భూస్వామ్య విధానంలో వుందా, మరొక విధానంలో వుందా అనేదాన్నిబట్టి– అంటే ఆర్థిక వ్యవస్థ పునాదిపై-తక్కిన సమాజ జీవిత విధానమంతా ఆధారపడి వుంటుంది, నిర్ణయమై వుంటుంది.

## పొరపాటు అవగాహన

అయితే, మార్క్సిజంలో చాలమంది తప్పుపట్టే విషయమే ఇది : సమాజ జీవితంలో మొత్తం అన్నిటిని ఆర్థిక వ్యవస్థ (ఎకనామిక్ స్ట్రక్చర్) అనేది నిర్ణయిస్తుందా? అలా అనుకోవడం పొరపాటని పలువురు ఖండిస్తారు. నిజానికి ఈ సూత్రానికి అతివ్యాప్తి దోషం వున్నదనడంలో సందేహం లేదు. మొత్తంగా ప్రతిదాన్ని– మత విశ్వాసాలు, తత్వశాస్త్రం, కళలు, న్యాయశాసనాలు, రాజకీయ వ్యవస్థ అన్నిటిని- ఆర్థిక, ఉత్పత్తి సంబంధాల దృష్టినుంచి, వర్గసంఘర్షణల దృష్టి నుంచి చూడడం తప్పు అని చెప్పాలి. ఉదాహరణకు ఒక వ్యక్తి ఏ వర్గంవాడైతే ఆ వర్గానికి సంబంధించిన స్వభావం విధిగా కలిగి వుంటాడా? ఆ వర్గ విశ్వాసాలన్నీ తనవైపోతాయా? ఒకడు బూర్జువా వర్గం వ్యక్తి అయితే అతని ఆలోచనా విధానమంతా బూర్జువా వర్గం ఆలోచన అయివుంటుందా?

మరి బూర్జువా వర్గ వినాశనాన్ని కోరుకుని, దానికోసం జీవితమంతా పోరాడిన- మార్క్స్, ఎంగెల్స్, మరెందరో మహామహులు కార్మికవర్గం వారు కారే? బూర్జువా వర్గం నుంచి, ఇతర ఉన్నత వర్గాలనుంచి వచ్చిన వారేనే?

అంటే-మార్క్స్ ఆర్థిక వ్యవస్థకు ప్రాథమిక ప్రాధాన్యం (Primaey) ఇచ్చాడే తప్ప, జీవితంలో ప్రతి చిన్న విషయాన్ని, ప్రతి ఆలోచనను అదే నిర్ణయిస్తుందని చెప్పలేదని అతని అభిమాను లంటారు. భౌతిక పదార్థంనుంచి మనస్సు, చైతన్యం పరిణామం చెందాక వాటికి ఒక స్వతంత్రమైన మనుగడ సిద్ధిస్తుంది. వాటి మూనాన అవి అభివృద్ధి అవుతాయి. అవి తిరిగి తమ సృష్టికి కారణమైన భౌతిక ప్రపంచంపై, మానవ సమాజంపై, ఆర్థిక వ్యవస్థపై ప్రభావం కనబరుస్తాయి. వాటిని మార్చడానికి ప్రయత్నిస్తాయి.

అంటే పదార్థం ప్రాథమికం. అది మనస్సును సృష్టిస్తుంది, ప్రభావితం చేస్తుంది. అలాగే ఒకసారి సృష్టి అయ్యాక మనస్సు అనేది పదార్థాన్ని ప్రభావితం చేస్తుంది, మార్చి వేస్తుంది.

## పారస్పర్యం

ఎందుకంటే కార్య కారణాల మధ్య పారస్పర్యం (Reciprocity) వుంటుంది. కారణంనుంచి కార్యం సిద్ధిస్తుంది. తిరిగి కార్యం కారణాన్ని ప్రభావితం చేస్తుంది. ప్రపంచంలో జరిగే సంఘటనలు మనస్సును ప్రభావితం చేస్తాయి. అలాగే మనస్సు ప్రపంచ సంఘటనలను ప్రభావితం చేస్తుంది. పదార్థం, మనస్సు పరస్పర ప్రభావితాలు, పరస్పరాధారితాలు.

## పిడివాదం కాదు

అందుకే ఫ్యూయర్‌బాక్‌పై ఎంగెల్స్ విమర్శా గ్రంథానికి తన వ్యాఖ్యలను జోడిస్తూ ఒకచోట మార్క్స్ ఇలా అంటాడు : "తత్వవేత్తలు ప్రపంచాన్ని రకరకాలుగా వ్యాఖ్యానించారు. కాని, అసలు జరగవలసింది ప్రపంచాన్ని మార్చడం."

దీని అర్థం ఏమిటి? ప్రపంచాన్ని మార్చగల శక్తి-తమను, తమ జీవిత విధానాన్ని, ఆలోచనలను శాసిస్తున్న భౌతిక పరిస్థితులను మార్చగల శక్తి-మానవులకు కలదని మార్క్స్ అంగీకరిస్తున్నా డన్నమాట. లేకపోతే ఆయన ఉద్బోధించిన కమ్యూనిస్టు విప్లవానికి అర్థమే లేదు. సమాజ చరిత్ర అంతా వర్గ సంఘర్షణల చరిత్ర కదా? అయినా, ఆ వర్గ సంఘర్షణలలో పాల్గొనేది మానవులే; విప్లవ భావాల ప్రభావాలకు లోనైన మానవులే. అందుచేత మార్క్స్ చారిత్రిక భౌతికవాదం కేవలం యాంత్రిక భౌతికవాదం (Mechanical

Materialism) కాదు. పైగా అటువంటి భౌతికవాదాన్ని అతడు ఖండించాడు. అతనిది వట్టి డిటర్మినిజం కాదు- విధివాదం, పిడివాదం- కాదు.

అంత మాత్రాన గతితార్కిక ప్రక్రియలోని అనివార్యత(Inevitability)ను కాదనడానికి వీలులేదు. ప్రపంచ పురోగమనాన్ని ఏ సూత్రాలు స్థూలంగా నిర్దేశిస్తున్నాయో గ్రహించిన తర్వాత, వాటి ప్రకారం ప్రపంచం ఏ దిశగా పురోగమిస్తున్నదో మనం తెలుసుకోవచ్చు.

## మార్క్స్ ఊహించిన భావికాల స్వర్గం

మానవ సమాజం- చరిత్రకు అందినంత వెనుకటివరకు వెళ్లి చూస్తే రెండు వర్గాలుగా చీలిపోయి వుంది. ఆ వర్గాలమధ్య సంబంధాలు మారినప్పటికీ వాటి మౌలిక స్వభావం మారలేదు. ఒకటి దోపిడీ చేసే వర్గం. రెండవది దోపిడీ చేయబడే వర్గం. మొదటగా యజమానులు, బానిసలు; తర్వాత భూస్వాములు, సెర్ఫ్‌లనబడే పాలెగాళ్లు; ఇప్పుడు పెట్టుబడిదారులు, కార్మికులు. ఉత్పత్తి శక్తులకు అనుగుణంగా ఉత్పత్తి సంబంధాలు మారాయి. కాని, వర్గమౌలిక స్వభావం మారలేదు. దోపిడీ అంతం కాలేదు.

ఇప్పుడు చివరికి పెట్టుబడిదారీ విధానం అమలులోకి వస్తూనే తనను అంతం చేసే వైరుధ్యాలను వెంటపెట్టుకుని వచ్చింది. ఉదాహరణకు పెట్టుబడిదారీ విధానంలో కొద్దిమంది పెట్టుబడిదారులు, పెక్కుమంది కార్మికులు వుంటారు. సాంకేతికాభివృద్ధి కారణంగా ఉత్పత్తిశక్తుల స్వభావం మారడంతో, పెట్టుబడి దారుల మధ్య పోటీ పెరగడంతో, పెద్ద చేపలు చిన్న చేపలను మింగేసినట్టు, పెద్ద పెట్టుబడిదారులు చిన్నవారిని కబళిస్తారు. అలా వ్యాపారచ్యుతులైన వారు క్రమంగా, దశలవారీగా కార్మిక వర్గంలో చేరిపోతారు. ఆ విధంగా పెట్టుబడి దారుల సంఖ్య రాను రాను తగ్గిపోతుంటే కార్మికుల సంఖ్య పోను పోను పెరిగిపోతూ వుంటుంది.

పెట్టుబడిదారీ సమాజంలో పెట్టుబడిదారులు, కార్మికులు—ఈ రెండు వర్గాల వారే కాదు; ఇంకా ఇతర వర్గాలవారు, కర్షకులు, వ్యవసాయ కూలీలు, వర్తకులు, దుకాణదారులు, మేధావులు, గుమాస్తాలు, లాయర్లు, ఉపాధ్యాయులు, రచయితలు, కళాకారులు, ఇలా ఇంకా ఎన్నో చిల్లర మల్లర వర్గాలవారు వుండ వచ్చు, వుంటారు కూడా. కాని, ఆ వర్గాలకు నిర్ణాయక ప్రాధాన్యం లేదు. సమాజ స్వభావాన్ని నిర్ణయించడంలో వాటి పాత్ర లేదు. ప్రధాన వర్గాలు రెండే రెండు. వాటిలో నిర్ణాయక పాత్ర కలిగిన ఒక వర్గం బూర్జువా, లేదా పెట్టుబడిదారీ వర్గం. రెండవది ప్రోలిటేరియట్ లేదా కార్మికవర్గం. ఒకటి దోచుకునేది, రెండవది దోచుకోబడేది.

## అదనపు విలువ

బూర్జువా వ్యవస్థలో దోపిడీ అనేది పువ్వులోంచి తుమ్మెద తేనెను దొంగిలించినంత సుతారంగా, సున్నితంగా, ఎవరికీ తెలియకుండా, చట్టసమ్మతంగా జరిగిపోతుంది. "అదనపు విలువ" అనే దాని ద్వారా ఈ దోపిడీ జరుగుతుంది.

మార్క్స్ తన పూర్వులైన తత్వవేత్తల నుంచి ముఖ్యంగా హెగెల్, ఫ్యూయర్ బాక్‌ల నుంచి కొంత అరువు తెచ్చుకున్నాడు. అలాగే యాడం స్మిత్, రికార్డోలవంటి ఆర్థికవేత్తలనుంచి కొన్ని విషయాలను అరువు తీసుకున్నాడు. కాని, ప్రపంచ తాత్విక, ఆర్థిక శాస్త్రాలకు అతడు స్వతంత్రంగా ప్రసాదించిన విషయాలు రెండున్నాయి. ఒకటి ఇంతకుముందు మనం చెప్పుకున్న చారిత్రిక భౌతికవాదం. రెండవది అదనపు విలువ సిద్ధాంతం- "థియరీ ఆఫ్ సర్‌ప్లస్ వేల్యూ."

ఒక వస్తువుకు విలువ (వేల్యూ) అనేది ఎలా వస్తున్నది? దాన్ని ఉత్పత్తి చేయడానికి సాంఘికంగా అవసరమైన శ్రమవల్ల వస్తున్నది. ఒక వస్తువు ఉత్పత్తిలో ఎంత సాంఘిక శ్రమ నిక్షిప్తమై వుందో తెలుసుకోవాలి. ఆ శ్రమ ఖరీదును బట్టి వస్తువుకు విలువ ఏర్పడుతుంది. అంటే వస్తువును ఉత్పత్తిచేసే కార్మికుడు కొనప్రాణంతో కదలుతూనైనా బ్రతికివుంటూ సంతానాన్ని కనడానికి తగినంత శక్తిని సంతరించుకుంటూ వుండడానికి ఎంత కనీసపు ఖర్చు (subsistence wage) అవుతుందో దాన్నిబట్టే అతని శ్రమ ఖరీదు నిర్ణయమవుతుంది.

కార్మికుడు అలా తాను బ్రతికి వుండడానికి కావలసిన కనీసపు వేతనాన్ని రోజుకు ఆరు గంటలు పనిచేస్తే సంపాదించుకోగల డనుకోండి. అంటే అతడు రోజుకు ఆరుగంటల చొప్పున పనిచేస్తే తనకు రావలసిన కనీసపు ప్రతిఫలాన్ని సంపాదించుకోగలడు కాని, బూర్జువా వ్యవస్థలో కార్మికుల పనిగంటలు ఆరు కాక, ఎనిమిది, పది, పన్నెండు, పధ్నాలుగు గంటల వరకు ఎంతైనా వుండవచ్చు.

మార్క్స్ రోజులలో కార్మికుల పని గంటలు మరీ దారుణంగా, అమానుషంగా వుండేవి. సామాజికంగా, సామూహికంగా వస్తూత్పత్తి చేయడానికి ఉదాహరణకు-ఆరు గంటలు అవసరమైతే దానికి రెట్టింపు గంటల చొప్పున పెట్టుబడిదారులు తమ కార్మికులచేత పని చేయిస్తారు. ఇది చట్టబద్ధంగానే, కార్మికుల సమ్మతితోనే జరుగు తుంది. అంటే కార్మికులు అదనంగా మరొక ఆరు గంటలు పనిచేస్తారు. ఆ అదనపు ఆరు గంటలలో వారు అదనపు ఉత్పత్తిని సాధిస్తారు. దాని అమ్మకంవల్ల వచ్చే రాబడిలో వారికి పైసా కూడా వాటా రాదు. వస్తూత్పత్తి సాధనాలు పెట్టుబడిదారు సొంత ఆస్తి

(ప్రయివేట్ ప్రాపర్టీ) కనుక వాటినుంచి కార్మికుడు ఉత్పత్తి చేసే అదనపు ఉత్పత్తి యావత్తు పెట్టుబడిదారుకే చెందుతుంది. అంటే వచ్చే లాభాలన్నీ పెట్టుబడిదారుకే.

## దోపిడీ వ్యవస్థ

ఈ విధంగా అదనపు గంటలు పనిచేసి అదనపు ఉత్పత్తి చేయడంవల్ల సిద్ధించే అదనపు విలువను పెట్టుబడిదారు హరించడాన్నే దోపిడీ (Exploitation) అంటారు. అంటే కార్మికుడి శ్రమకు తగ్గ ఫలితాన్ని అంతా అతనికి దక్కకుండా పెట్టుబడిదారు తాను కొంత హరించడం మీదనే మొత్తం బూర్జువా వ్యవస్థ అంతా ఆధారపడి వుంది. ఇది మార్క్స్ మొదటిసారిగా, స్వతంత్రంగా కనుగొన్న శాస్త్రీయ సూత్రం.

పెట్టుబడిదారీ సమాజంలో ధనికులు మరింత ధనికులుగా, పేదలు మరింత పేదలుగా మారడం అనివార్యం. వారి సంఖ్య తగ్గిపోవడం, వీరి సంఖ్య పెరగడం కూడా అనివార్యమని మార్క్స్ భావించాడు. చివరికి—పెట్టుబడిదారుల, కార్మికుల మధ్య వైరుధ్యం కారణంగా—సంఘర్షణ కూడా అనివార్య మవుతుంది. తక్కిన దళిత వర్గాలవలె కాక కార్మికులు సంఖ్యలోను, సంఘటనలోను గణనీయమైన బలం కలిగివుంటారు కనుక వారే విప్లవానికి సుముఖులుగాను, అర్హులుగాను వుంటారు. వారే విప్లవానికి కారకు లవుతారు. వారి విప్లవం సమాజ స్వరూపాన్ని సమూలంగా మార్చివేస్తుంది. అదే అంతిమ విప్లవం—అంటే సమాజంలో అనాదిగా వున్న వర్గ విభజనను, వర్గ సంఘర్షణను, దోపిడీని శాశ్వతంగా అంతం చేసే విప్లవం—అవుతుంది. ఎందుకంటే ఇంతకుముందు జరిగిన విప్లవాలన్నీ మరొక వర్గాన్ని దోపిడీ చేయడానికి అవకాశం కల అభ్యుదయ వర్గాల తిరుగుబాటు ద్వారా జరిగాయి. కాగా, దోపిడీ చేయబడే వర్గాలలో కార్మిక వర్గమే ఆఖరిది. కార్మికులు దోచుకొనడానికి మరొక వర్గం అంటూ వుండదు. అందుచేత కార్మిక వర్గ విప్లవంతో వర్గాలు అంతరిస్తాయి. వర్గరహిత సమాజం ఏర్పడుతుంది. దోపిడీ చేసేది, చేయబడేది అనే వర్గాలు వుండవు.

## కార్మిక వర్గ నియంతృత్వం

అయితే, ఇది ఒక్కసారిగా జరగదు. విప్లవం తర్వాత యథాపూర్వ స్థితిని పునరుద్ధరించడానికి కార్మికేతర వర్గాలు, ముఖ్యంగా పెట్టుబడిదారులు ప్రయత్నిస్తారు. అందుచేత విప్లవానంతరం కార్మికులు ప్రభుత్వాన్ని స్వాధీనం చేసుకొని తమ వర్గ నియంతృత్వాన్ని (డిక్టేటర్‌షిప్ ఆఫ్ ప్రోలియేరియట్‌ను) స్థాపిస్తారు. తక్కిన వర్గాలను (వ్యక్తులను కాదు) రూపుమాపి మొత్తం అందరిని కార్మికులుగా మారుస్తారు.

ఆ పని పూర్తి అయి వర్గరహిత సమాజం (classless society) అనేది కూడా క్రమంగా అంతరిస్తుంది. రాజ్యం అంటే ఏమిటి? అది ఎందుకు ఇంతకాలం అవసరమవుతూ వచ్చింది?

సమాజంలో దోపిడీ వర్గం, దోపిడీ చేయబడే వర్గం వున్నాయి. దోపిడీ చేసే వర్గం కరాలలో ఉత్పత్తి పరికరా లున్నాయి. అవి ఆ వర్గానికి సొంత ఆస్తి. దాని పరిరక్షణ కోసం, అసంతృప్తి వర్గాల తిరుగుబాటు నుంచి రక్షణ కోసం, రాజ్యయంత్రాంగం (State machinery) అంతా అవసరమైంది. కాని, అలా రక్షణ కోరే వర్గమే లేనప్పుడు రాజ్యం అవసరం కూడా అంతరిస్తుంది. రాజ్యమే అంతరిస్తుంది. (State will wither away). అప్పుడు కమ్యూనిజం అన బడే ఆదర్శ సమాజం అవతరిస్తుంది.

## కమ్యూనిజం అంటే?

కమ్యూనిజం అంటే ఏమిటి? ఆ సమాజం ఎలా వుంటుంది? దీన్ని గురించి మార్క్స్‌కు కూడా స్పష్టమైన అభిప్రాయాలు లేవు. మార్క్సిజం ప్రకారం అలా స్పష్టమైన అభిప్రాయాలు వుండడం తప్పు కూడా. ఎందుకంటే యుటోపియన్ సోషలిస్టులు భావి సమాజం ఏ విధంగా వుండాలో ఊహించి, తమకు ఇష్టమైన ఆదర్శాలకు అనుగుణమైన, అందమైన "బ్లూ ప్రింట్లు" తయారుచేశారు. దీన్ని మార్క్స్ ఈసడించాడు.

చరిత్ర మన భావాలకు, ఆదర్శాలకు అనుగుణంగా జరుగుతూ పోదు. దాని సూత్రాల ప్రకారం అది నడుస్తుంది. ఆ సూత్రాలను కనుగొనగలిగిన మేరకు చరిత్ర ఏ దిశగా పురోగమిస్తున్నదో మనం తెలుసుకోగలము. అయితే చారిత్రిక సూత్రాలు సాదాగా, సీదాగా, సాఫీగా వుండవు. సంక్లిష్టంగా వుంటాయి. అందు చేత చారిత్రక సూత్రాలను ప్రతి చిన్న వివరంతో సహా కనుగొనడం అసాధ్యం. స్థూలంగా కనుగొనవచ్చు. అందుకే గత చరిత్ర పరిశీలన తర్వాత మానవ సమాజం కమ్యూనిజం దిశగా—సొంత ఆస్తిలేని, దోపిడీలేని వర్గరహిత వ్యవస్థ దిశగా—పురోగమిస్తున్నదని చెప్పడానికి మాత్రం వీలు కలిగింది. అంతే.

అయినా, మార్క్స్, ఎంగెల్స్ తమ రచనలలో—నిజంగానే నిఖిల లోకం నిండు హర్షం వహించే భావికాలాన్ని గురించి, దారుణ ద్వేషాగ్ని పెంచే దాన వత్వం నశించే వ్యవస్థను గురించి—కొన్ని తీయని ఊహాగానాలు చేయకపోలేదు.

## ఎలియనేషన్

—పెట్టుబడిదారీ సమాజం శ్రమ విభజన ప్రాతిపదికపై నడుస్తుంది. దీని

వల్ల కార్మికులు యంత్రాలకు ఉపయంత్రాలుగా తయారై తమ మానవత్వాన్ని కోల్పోతారు. మార్క్స్ తన తొలి రచనలలో "ఎలియనేషన్" అనే మాటను విరివిగా వాడాడు. కార్మికులకు తాము ఉత్పత్తి చేసే వస్తువులపై ఈషణ్మాత్రమైనా ఆధిపత్యం లేనందున తమ శ్రమపట్ల, ఉత్పత్తిపట్ల, జీవితంపట్ల నిరాసక్తి ఏర్పడుతుంది. వారిలో వైమనస్యం-ఎలియనేషన్-ప్రబలుతుంది. గాంధీ వంటి వారు అందుకే శ్రమ విభజనకు — డివిజన్ ఆఫ్ లేబర్‌కు—దారితీసే యంత్రీకరణ (మెకనైజేషన్)కు విముఖులయ్యారు. "మోడరన్ టైమ్స్" చిత్రంలో చార్లీ చాప్లిన్ దీన్నే ఘాటుగా విమర్శించాడు.

మార్క్స్ ఊహాగానం ప్రకారం రానున్న కమ్యూనిస్టు సమాజంలో శ్రమ. విభజన వుండదు. ఉన్నా అది ఎలియనేషన్‌కు దారి తీయదు. "ఒకడు పొద్దున వేటాడ వచ్చు. మధ్యాహ్నం చేపలు పట్టవచ్చు. సాయంత్రం పశు పోషణ చేయవచ్చు. రాత్రి డిన్నర్ తర్వాత కళా, సాహిత్య విమర్శ చేయవచ్చు. అతని ఇష్ట ప్రకారం ఏది కావాలంటే అది చేయవచ్చు. అంతమాత్రాన అతడిని వేటగాడని, బెస్తవాడని, పశుపోషకుడని, విమర్శకుడని వేరు చేసి వేరుపెట్టి పిలవనక్కరలేదు..." అని మార్క్స్ "జర్మన్ ఐడియాలజీ" అనే పుస్తకంలో వ్రాశాడు.

## తత్వశాస్త్ర చరిత్రలో మార్క్స్ స్థానం

ప్రస్తుత సమాజంలో వ్యష్టి ప్రయోజనాలకు, సమష్టి ప్రయోజనాలకు మధ్య పెద్ద అగాధం వున్నది. ఈ అగాధం ఎందువల్ల ఏర్పడుతున్నది? సమాజం విభిన్న ప్రయోజనాలు కల వర్గాలుగా విడిపోవడం వల్ల ఏర్పడుతున్నది. ఒకప్పుడు ఆస్తి, సంపద అనేవి సంఘపరంగా వుండేవి. అప్పుడు శ్రమ విభజన— డివిజన్ ఆఫ్ లేబర్ - అనేది లేదు. అందరూ అన్నీ చేసేవారు. ఆనాటి ఆదిమ సమాజంలో ప్రిమిటివ్ కమ్యూనిజం లాంటిది అమలులో వుండేది.

కాని, ఉత్పత్తి శక్తులు అభివృద్ధి కావడంతో సమాజం వర్గాలుగా విడిపోయింది. సొంత ఆస్తి ఏర్పడింది. శ్రమవిభజన, దోపిడీ వ్యవస్థ అమలులోకి వచ్చాయి. దానితో వ్యష్టి, సమష్టి వైరుధ్యం వచ్చింది. సొంత ఆస్తి రక్షణకు రాజ్య యంత్రాంగం ఏర్పడింది. వ్యక్తి స్వేచ్ఛా పరిరక్షణ పేరుతో సమష్టి ప్రయోజనాలను, లేదా బహుజన హితాన్ని అలక్ష్యం చేయడం జరిగింది. పెట్టుబడిదారీ వ్యవస్థ వచ్చేసరికి శ్రమశక్తి (లేబర్ పవర్)తో సహా అన్నీ విక్రయ వస్తువులుగా (కమోడిటీస్‌గా) మారిపోయాయి. మనిషికి, మనిషికి మధ్య స్వార్థపు అడ్డుగోడలు లేచాయి. ద్రవ్య సంబంధం (cash nexus) తప్ప మరొకటి లేకుండాపోయింది.

సొంత ఆస్తిని రద్దుచేస్తే వ్యష్టి, సమష్టి వైరుధ్యం పోతుంది. కాని, అప్పుడు కూడా స్వార్థం వుండవచ్చు. కొందరు పనిచేయకుండా వస్తు సంపదను అనుభవించడానికి, తమ శ్రమకు మించి ప్రతిఫలాన్ని గుంజుకొనడానికి యత్నించవచ్చు.

అందుచేత స్వార్థం అనేది పోవాలి. స్వార్థం పోవాలంటే మానవ స్వభావం మారవలసిందే. నిజమే. కాని, మానవ స్వభావం నిజంగా మారుతుందా?

## మానవతానీతి

మానవ స్వభావాన్ని నిర్ణయించేది మతం, శాస్త్రం, కళలు, తాత్విక విశ్వాసాలు, సంస్కృతి మొదలైనవి కావు. ఆర్థికమైన వునాదే మానవ నైజాన్ని ప్రధానంగా నిర్ణయిస్తుంది. ఆ వునాదిని మారిస్తే మానవ స్వభావం కూడా మారిపోతుంది. దురాశ, అత్యాశ, అహంభావం, అసూయలాంటివి మానవ స్వభావంలో సహజ భాగాలు కావు. సొంత ఆస్తిని, ఉత్పత్తి సాధనాలపై వ్యష్టి యాజమాన్యాన్ని రద్దుచేసి, సంపదను, ఉత్పత్తి శక్తులను సంఘపరంచేస్తే స్వార్థానికి, అసూయకు స్థానం వుండదు. వ్యక్తులు సంఘ సంక్షేమానికి పనిచేయడమే తమ సంక్షేమానికి మార్గమని గ్రహిస్తారు. వ్యక్తి కోసం సమాజం, సమాజం కోసం వ్యక్తి అనే భావం పెంపొందుతుంది. వర్గ సమాజంలో వుండేది వర్గనీతి. వర్గరహిత సమాజంలో వుండేది మానవనీతి, మానవతానీతి.

కమ్యూనిస్టు సమాజంలో ఉత్పత్తి శక్తులు పూర్తిగా అభివృద్ధి అవుతాయి. అందుచేత ఉత్పత్తి పుష్కలంగా జరుగుతుంది. దానితో పంపిణీ పద్ధతి కూడా మారుతుంది. తమ సామర్థ్యాన్ని బట్టి పంపిణీచేసే పద్ధతి నుంచి అవసరాలనుబట్టి వస్తువులను పంపిణీ చేసే పద్ధతికి మానవ సమాజం ఎదుగుతుంది. దీన్నే From each according to his ability to each according to his needs అని సూత్రీకరించారు.

## రాజ్యాంతం

వస్తువుల పుష్కలత, మానవ స్వభావంలో మార్పువల్ల రాజ్యపాలనా యంత్రాంగం (state) వాడి వడిలిన పువ్వులాగా రాలిపోతుంది. అయితే వెంటనే అంతరించదు. కార్మికవర్గం మొదట విప్లవం ద్వారా ప్రభుత్వాన్ని స్వాధీనం చేసుకుని, ఇతర వర్గాలపై తమ ఆధిపత్యాన్ని నెలకొల్పుకుంటుంది. ఇతర వర్గాలను అణచివేయడానికి రాజ్యాధికారం అవసర మవుతుంది. అది సోషలిస్టుదశ-సంధి దశ. ఆ తర్వాత ఉత్పత్తి శక్తుల అభివృద్ధి కారణంగా, పంపిణీ

వ్యవస్థలో మార్పు కారణంగా, వర్గరహిత సమాజం ఏర్పాటుతో రాజ్యాధికారం అంతరిస్తుంది. కేవలం ఉత్పత్తిని, పంపిణీని క్రమబద్ధంచేసి మేనేజ్ చేయ టానికి మాత్రం ఉద్యోగ వ్యవస్థ అవసర మవుతుంది. అది కమ్యూనిస్టు దశ. ఆ దశలో మానవులు తమ అంతిమ లక్ష్యమైన సంపూర్ణ స్వాతం త్ర్యాన్ని సాధించుకుంటారు. మానవ సమాజం సుఖ సంతోష సమానత్వాలలో ఓలలాడుతుంది.

ఇదీ మార్క్సు, ఎంగెల్స్ ఊహించిన భావికాలపు వ్యవస్థ. వారు అక్కడక్కడ చూచాయగా వ్రాసిన ఇలాంటి కొన్ని విషయాలు, జోస్యాలు చదువుతుంటే వారు హేళన చేసిన యుటోపియాకు, వారి ఊహాలోకంలోని కమ్యూనిజానికి తేడా ఏమి టనిపిస్తుంది. తమది శాస్త్రీయమైన సిద్ధాంతమని వారు చెప్పకున్నారు కనుక దీన్ని సైంటిఫిక్ స్వప్నంగా వర్ణించవచ్చు.

## మార్క్సు జోస్యాలు

మార్క్సు కొన్ని జోస్యాలు చెప్పాడు. పెట్టుబడిదారులకు, కార్మికులకు మధ్య అగాధం పోనుపోను పెరుగుతుందన్నాడు. పెట్టుబడిదారుల సంఖ్య రానురాను తగ్గి కార్మికవర్గం సంఖ్య పెరుగుతుందన్నాడు. - కార్మికులకు - ఎన్ని సంస్కరణలు జరిగినా - ఎప్పుడూ ప్రాణాలు నిలుపుకొనడానికి అవసరమైనదానికంటె ఎక్కువ జీతాలు ఎన్నడూ లభించవన్నాడు. పెట్టుబడిదారీ వ్యవస్థ దాని అంతర్వైరుధ్యాల కారణంగా త్వరలో పడిపోక తప్పదన్నాడు. కార్మిక విప్లవాలు పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన దేశాలలోనే ముందుగా వస్తాయన్నాడు. కమ్యూనిస్టు వ్యవస్థలో సంకుచిత జాతీయవాదం వస్తుందని, విశాల అంతర్జాతీయవాదం నశిస్తుందని అన్నాడు. ఇలాగే మరెన్నో జోస్యాలు చెప్పాడు.

కాని, ఇవేవీ నిజం కాలేదు. ఉదాహరణకు పారిశ్రామికంగా బాగా అభివృద్ధి చెందిన దేశాలలో కార్మిక విప్లవాలు రాలేదు. వెనుకబడిన రష్యా, చైనా వంటి దేశాలలోనే విప్లవాలు వచ్చాయి. సంపన్న దేశాలలో బూర్జువా, కార్మిక వర్గాల ఆదాయాల మధ్య అగాధం పెరగలేదు. పైగా తగ్గింది. ఆ దేశాలలో కార్మి కులకు తమ నిత్య జీవితా వసరాలకు అవసరమైన దానికంటె చాల ఎక్కువ వేతనాలే లభిస్తున్నాయి. పైగా అక్కడ కమ్యూనిస్టు విప్లవోద్యమాలు బలపడు తున్న లక్షణాలు మచ్చుకైనా కనబడడం లేదు. సంపన్న దేశాలు అప్పుడప్పుడు ఆర్థిక సంక్షోభాలను ఎదుర్కొన్నా, వాటి తీవ్రత పూర్వం కంటె తగ్గింది.

అయితే, ఒక సిద్ధాంతంగా మార్క్సిజం శక్తిని, ప్రభావాన్ని తక్కువ అంచనా వేయలేము. మార్క్సు తర్వాత మానవాళి ఆలోచనా సరళి మారిపోయింది; ప్రపంచాన్ని, చరిత్రను అర్థం చేసుకునే పద్ధతి మారిపోయింది.

మార్క్స్ ప్రతిపాదించిన చారిత్రిక భౌతికవాదం ప్రభావం సంఘ జీవితంలో ప్రతి అంశంపైన నేడు ప్రసరిస్తున్నది. మతం, కళలు, శాస్త్రం, వీటన్నిటికి పునాది ఆర్థికశక్తులని, వాటిదే ప్రధాన నిర్ణాయక పాత్ర అని మార్క్స్ చెప్పిన దాన్ని ఆయన వ్యతిరేకులు సయితం అంగీకరిస్తున్నారు. అలాగే మానవ స్వభావంపై పరిసరాల ప్రభావం, ముఖ్యంగా ఆర్థిక పరిస్థితుల ప్రభావం ఎంతగా వుంటుందో ఆయనే మొదటగా వివరించారు.

## ఆ ద ర్శ వా ది

మార్క్స్ ప్రధానంగా మానవతావాది, ఆదర్శవాది. ఎంత రియలిస్టో, మెటీరియలిస్టో అంత రొమాంటిసిస్టు. తన కాలంలో జర్మనీ, ఫ్రాన్స్, ఇంగ్లండు మొదలైన యూరపియన్ దేశాలలో పేద ప్రజల దారుణ, దుర్భర జీవన పరిస్థితులను చూసి ఆయన చలించిపోయాడు. సమాజంలోని అసమానత్వాన్ని, అన్యాయాలను, అక్రమాలను చూసి– మహాకవి వర్డ్స్‌వర్త్ ఒక గీతంలో "Have I not reason to lament what man has made of man" అని వాపోయినట్టు–వాపోతాడు. అయితే, అవే పరిస్థితులను చూసి షోపెన్‌హావర్ పరమ నిరాశావాది అయి, ఒకానొక నిరాశాతత్వాన్ని ప్రవచించాడు. కాగా, అవే పరిస్థితులకు ప్రతిస్పందించి ఒక విప్లవ సిద్ధాంతాన్ని తిరుగుబాటు తత్వాన్ని మార్క్స్ ప్రతిపాదించాడు. ఆచరణలో మార్క్స్ సిద్ధాంతం అనివార్యంగా విఫలమైనప్పటికీ, ఒక తాత్విక వ్యవస్థగా మానవుల ఆలోచనా సరళిపై దాని ప్రభావం కొనసాగుతూనే వుంటుంది.



# 33
# ప్రాగ్మాటిజం ప్రవక్త విలియం జేమ్స్

"విశ్వదర్శనం"లో ఇప్పటివరకు మనం పరామర్శించిన వారందరు యూరోపియన్ తాత్వికులే. ఈ పరంపరకు భిన్నంగా ఇప్పుడు వ్రాయబోతున్నది అమెరికన్ తత్వవేత్త విలయంజేమ్స్ గురించి. అమెరికన్ దార్శనికులు జార్జి శాంతాయన వంటి పలువు రున్నప్పటికి, అందరిలోకి అచ్చంగా, అక్షరాలా "అమెరికన్" దార్శనికుడుగా పేర్కొనదగినవాడు విలియం జేమ్స్. పుట్టుక చేతనేకాక, స్వభావతః కూడా అతడు "అమెరికన్" తత్వవేత్త. అతని చింతన అమెరికన్ జీవన దృక్పథంలో ప్రతిబింబించింది. అలాగే అమెరికన్ జాతి జీవన దృక్పథం అతని చింతనలో ప్రతిఫలించింది.

* * *

"ఏది సత్యం, ఏది అసత్యం?" అన్నది అనాదిగా పండితులకు, పామరులకు అందరికి ఆసక్తి కలిగిస్తున్న ప్రశ్న. ఈ ప్రశ్నకు సమాధానం కనుగొనడానికి వివిధ దేశాలలో, వివిధ కాలాలలో మేధావులు చేసిన ప్రయత్నమే తత్వశాస్త్రం—ఫిలాసఫీ.

ఒక్కొక్క మేధావి సత్యాన్ని ఒక్కొక్క రకంగా దర్శించాడు, నిర్వచిం

చాడు. ఒకరి నిర్వచనం మరొకరికి రుచించలేదు. ఒకరు చెప్పినదాన్ని ఒకరు ఖండించారు. అందుకే ఎవరి దర్శనం వారిదైంది. "ఏకం సత్ విప్రా బహుధా వదంతి" అన్నట్టు సత్యం ఒక్కటే అయినా, ఎవరి సత్య నిర్వచనం వారిదైంది, ప్రపంచ తత్వశాస్త్రమంతా ఈ సత్యాన్వేషణ యాత్ర చరిత్రే.

సత్యానికి మిగిలినవారి కంటె విభిన్నంగా వేరొక అర్థం చెప్పడానికి ప్రయత్నించిన తత్వవేత్త విలియం జేమ్స్. ఈయన అమెరికన్ జాతీయుడు. ఆయన తత్వచింతన అమెరికా గడ్డ పెళ్లగించుకుని వచ్చింది.

యూరోపియన్‌లది చాలవరకు ఆదర్శవాదంతో, భావవాదంతో కూడిన తత్వచింతన. ఇంగ్లీషు ఎంపిరిసిస్టులు కాని, జర్మన్ ఐడియలిస్టులు కాని అందరూ భావవాదులే. మార్క్స్ ప్రవచించిన గతితార్కిక భౌతికవాదం కూడా జర్మన్ ఐడియలిజంలో నుంచి దానికి ప్రతివాదంగా ప్రభవించినట్టిదే.

కాగా, అమెరికన్ తాత్విక దృక్పథానికి కేంద్రం వాస్తవిక వాదం. దానికి వారు పెట్టిన పేరు "ప్రాగ్మాటిజం". అంటే "ఫలితాత్మకవాదం". (కుప్పైంప్వా మయ్యార్ మేడ్డిఫికల్ట్ లాంటి ఈ మాటను తర్వాత విడగొడదాము.)

అమెరికా ఖండాన్ని క్రిస్టఫర్ కొలంబస్ కనుగొన్నప్పటి నుంచి క్రమంగా యూరోపియన్ జాతుల వారనేకులు అక్కడికి వలసవెళ్ళి స్థిరపడ్డారు. అమాయకులైన అక్కడి ఆదిమ వాసులను నిర్దాక్షిణ్యంగా, అమానుషంగా దాదాపుగా నిర్మూలించి, దుర్గమారణ్యాలు, పర్వతాలు, క్రూరజంతువులతో నిండిన ఆ ఖండాన్ని వాసయోగ్యంగా చేసుకుని, అక్కడ ఒక కొత్త నాగరికతను నెలకొల్పారు. అనేక జాతుల సంస్కృతీ సమ్మేళనం నుంచి, అక్కడి భౌగోళిక, నైసర్గిక, శీతోష్ణ పరిస్థితుల నుంచి ఒక కొత్త సంస్కృతి పుట్టుకు వచ్చింది. వారిది నూటికి నూరు పాళ్ళు వ్యక్తివాదం. వస్తువాదం, వాస్తవిక వాదం, విస్తరణ వాదం, పారిశ్రామిక వ్యాపార వాదం, దానిపై ఆధారపడిన ప్రజాస్వామ్య వాదం. నేల విడిచి సాము వారి తత్వంలో లేదు. వారి ఆకాశహార్మ్యాలు ఊహాల గాలిమేడలు కావు, నేలమేడలే. స్వాప్నికత వారి నిఘంటువులోనే లేదు. "ఇక్కడ, ఇప్పుడు"—హియర్ అండ్ నౌ— అన్నది వారి తత్వం. యూరోపియన్ ప్రభావం నుంచి బయటపడి కొన్ని తరాలు గడిచిన తర్వాత పూర్తిగా "అమెరికన్" అనదగిన జీవన విధానం, సాహిత్యం, సంస్కృతి పెంపొందాయి. వ్యక్తి స్వేచ్ఛావాదంపై ఆధారపడిన అమెరికన్ ప్రజాస్వామ్యాన్ని సగర్వంగా గానం చేసిన మహాకవి వాల్ట్ విట్మన్ కాగా, తాత్విక రంగంలో అచ్చగా అమెరికన్ చింతన అనదగిన "ప్రాగ్మాటిజం"ను ప్రవచించినవాడు విలియం జేమ్స్.

అమెరికన్ జీవన విధానం ప్రభావం జేమ్స్‌పై ఎంతో వున్నది. అలాగే జేమ్స్ చింతన ప్రభావం అమెరికాపై ఎంతో వున్నది. విట్మన్ అమెరికా జాతీయ కవి అయితే, జేమ్స్ అమెరికా జాతీయ తాత్త్వికుడు.

## జేమ్స్ జీవిత విశేషాలు

విలియం జేమ్స్ 1842 జనవరి 9 వ తేదీన న్యూయార్కు నగరంలో జన్మించాడు. తాత ఐర్లెండు నుంచి అమెరికా వచ్చి స్థిరపడ్డాడు. తండ్రి హెన్రీ జేమ్స్. అతని అయిదుగురు సంతానంలో అగ్రజుడు విలియం జేమ్స్. అతని తమ్ముని పేరు కూడా హెన్రీయే.

వారిది బాగా ధనిక కుటుంబం. తండ్రి హెన్రీ మేధావి, రచయిత; ముఖ్యంగా తత్వశాస్త్ర ప్రియుడు. ప్రముఖ రచయిత, కవి, తాత్త్వికుడు అయిన రాల్ఫ్ వాల్డో ఎమర్సన్‌కు మిత్రుడు. ఏమీ తోచనప్పుడల్లా సకుటుంబంగా యూరప్ యాత్రకు బయలుదేరేవాడు.

విలియం తత్వవేత్తగా పేరుపొందితే, అతని తమ్ముడు హెన్రీ నవలా రచయితగా గొప్ప పేరు సంపాదించుకున్నాడు. అయితే, విలియం జేమ్స్ తన తత్వశాస్త్ర, మనస్తత్వశాస్త్ర గ్రంథాలను నవలలంత ఆసక్తికరాలుగా వ్రాశాడని, హెన్రీ జేమ్స్ తన నవలలను మనస్తత్వశాస్త్ర, తత్వశాస్త్ర గ్రంథాలంత సంక్లిష్టంగా వ్రాశాడని విమర్శకులు వ్యాఖ్యానిస్తూ వుంటారు.

అన్నదమ్ము లిరువురు పుస్తకాల పురుగులు. కనబడిన పుస్తకమల్లా చదివేవారు. విలియం జేమ్స్ మరీని. ఒక పద్ధతి, ప్రణాళిక లేకుండా అడ్డమైన పుస్తకాలు చదివేవాడు. అతని మనస్సుకు నిలకడలేదు. దేన్నీ స్పెషలైజ్ చేసే ఓర్పు లేదు. ఏ విషయం తీసుకున్నా అతనికి ఆసక్తే కలిగించేది. అన్నిటి మీద మోజే. ఏది తనకు కావాలో తేల్చుకోలేకపోయేవాడు. బయాలజీ, అనాటమీ, ఫిలాసఫీ, సైకాలజీ, కెమిస్ట్రీ, ఫిజిక్స్— ఆఖరికి చిత్రకళ కూడా అభ్యసించాడు.

అంతటి పుస్తక ప్రియుడైనా, మళ్లీ సాయిలా పాయిలాగా, జల్సారాయుడుగా తిరిగేవాడు. నగరాలలో చెలరేగిన జనసమ్మర్దం, సందులలో సందడి, స్నేహితులతో సరదాలు, చర్చలు ఇష్టపడేవాడు.

తండ్రి ఎప్పుడు యూరప్ వెళ్లినా తనతో విలియంను తీసుకువెళ్లేవాడు. లండన్, పారిస్, జెనీవా, బాన్‌లలో విద్యాభ్యాసం చేశాడు. ఎన్నిరకాల సైన్సులు చదివినా, కళలు నేర్చినా, జీవికకు ఏదో ఒక వ్యాపృతి, వ్యాసంగం ఎంచుకోవాలి కదా? సైన్సా? సాహిత్యమా? కళలా?

చివరికి సైన్సులో ఎక్కువ సెన్సు కనబడింది. అయితే ఏ సైన్సు? కెమిస్ట్రీ? మెడిసిన్? హార్వర్డ్ మెడికల్ స్కూలులో చేరి వైద్య విద్యాభ్యాసం చేశాడు. డిగ్రీ చేతికి రాగానే మొగం మొత్తింది. "నేచురల్ హిస్టరీ" పట్టుకుని తీసుకున్నాడు. తర్వాత అదీ వదిలేసి ఫిలాసఫీ ఎంచుకున్నాడు.

ఇంతలో అతనికి సుస్తీ చేసింది. మానసికంగా క్రుంగిపోయాడు. డిప్రెషన్ జబ్బు ఆవహించింది. ఆలోచనలు ఆత్మహత్యవైపు ప్రసరించాయి కూడా.

ఆరోగ్యం కోసం మళ్లీ యూరప్ వెళ్లాడు. కొన్ని నెలల గాలి మార్పుతో ఆరోగ్యం బాగుపడి తిరిగి స్వదేశం వచ్చాడు. హార్వర్డ్ కాలేజీలో శరీరశాస్త్రం (ఫిజియాలజీ) ఉపాధ్యాయుడుగా ఉద్యోగంలో చేరాడు. దాని నుంచి మనస్తత్వశాస్త్రం (సైకాలజీ)లోకి మారాడు. అదీ నచ్చక చివరికి తత్వశాస్త్రం (ఫిలాసఫీ)లో కుదురుకుని స్థిరపడ్డాడు. తండ్రి కుదిర్చిన సంబంధానికి ఒప్పుకుని యాలిస్ గిబ్బన్స్ అనే అమ్మాయిని వివాహం చేసుకున్నాడు. అతడు మొదటి నుంచి దృఢమైన ఆరోగ్యం కలవాడు కాడు. కాని, పెళ్లి అయినప్పటి నుంచి అతని ఆరోగ్యం బాగువడింది. హార్వర్డ్‌లో 1873 నుంచి 1907 వరకు విలక డగా అధ్యాపక వృత్తిలో గడిపాడు.

ఒక ప్రత్యేక శాస్త్రంగా మనస్తత్వశాస్త్రానికి ఆద్యులలో విలియం జేమ్స్ ఒకడు. అమెరికాలోని మొదటి మనస్తత్వశాస్త్ర ప్రయోగశాల (లెబొరేటరీ)ను 1880 లో అతడే నెలకొల్పాడు. తన 48 వ ఏట 1890 లో తన రచనలలో మొదటిది, ముఖ్యమైనది అయిన "ప్రిన్సిపుల్స్ ఆఫ్ సైకాలజీ" అనే గ్రంథం వ్రాశాడు. తన మొదటి తాత్విక గ్రంథం "విల్ టు బిలీవ్"ను 1897 లో వ్రాశాడు. కాని, అతని కీర్తికి మూలస్తంభమైన గ్రంథం "ప్రాగ్మాటిజం". అది 1907 లో వెలువడింది. ఆ సంవత్సరంలోనే అతని ఆరోగ్యం మళ్లీ చెడింది. ఆరోగ్యాన్వేషణలో తిరిగి యూరప్ వెళ్లాడు. ప్రశాంతంగా, అజ్ఞాతంగా వుంటూ స్వాస్థ్యం కోలుకోవాలని అతని ఉద్దేశం. కాని, అతని కోర్కె నెరవేరలేదు. అతడు ఎక్కడకు వెళ్లినా యూరపియన్‌లు బ్రహ్మరథం పట్టారు. ఆ సన్మాన సంరంభ శ్రమ అతని ఆరోగ్యాన్ని మరీ క్రుంగదీసింది. స్వదేశానికి తిరుగుముఖం పట్టాడు. న్యూయార్కు సమీపిస్తుండగా ఓడలో కుర్చీలో కూర్చున్నవాడు కుర్చీ లోనే ఒరిగి కన్నుమూశాడు.

ఇదీ క్లుప్తంగా విలియం జేమ్స్ జీవితకథ. ఇప్పుడు ఆయన తత్వచింతనకథ..

మళ్లీ "ఏది సత్యం, -ఏది అసత్యం?" అనే మౌలిక పురాతన ప్రశ్న వద్దకు వద్దాము. దీనికి విలియం జేమ్స్ తనదైన పద్ధతిలో ఇచ్చిన సమాధానం చూద్దాము.

# ప్రాగ్మాటిజం : సత్యం అనేకత్వం

విలియం జేమ్స్‌ను "ప్రాగ్మాటిజం" ప్రవక్తగా పరిగణిస్తారు. ఈ మాటను "ఫలితాత్మకవాదం" అని అనువదించాను. అంటే ఫలితాలతో కూడిన వాదం. ఫలితాలే ముఖ్యమని భావించే వాదం, ఏది మనం కోరిన ఫలితం ఇస్తుందో అదే సరైన విధానమని తెలియజెప్పే వాదం.

ఒక భావం, ఒక సిద్ధాంతం, ఒక సూత్రం, ఒక వాదం, ఒక ప్రతిపాదన, ఒక విశ్వాసం—ఏదైనా సరే ఆచరణ సాధ్యమైనదా కాదా, ఉపయోగకరమైనదా కాదా, సరైన ఫలితమిస్తుందా లేదా అని ఆలోచించాలి. ఈ ప్రశ్నలకు "అవును" అని సమాధానం వస్తే ఆ భావం, ఆ సిద్ధాంతం, ఆ సూత్రం, ఆ వాదం, ఆ ప్రతిపాదన, ఆ విశ్వాసం సరైనదేనని, అదే సత్యమని నిర్ధారించుకోవాలి. లేకపోతే అది నిరుపయోగమని, దండుగమారి ప్రతిపాదన అని నిర్ణయించుకుని బుట్టదాఖలు చేయాలి.

అంటే ఒక సిద్ధాంతం ఎవరో చెప్పారని కాక, సంప్రదాయసిద్ధంగా, అనూచానంగా వస్తున్నదని కాక, శాస్త్రంలో వున్నదని కాక—మనంతట మనమే దాని నిజానిజాల నిగ్గు తేల్చుకోవాలి. దాని ఉపయోగిత్వాన్ని (యుటిలిటీ), ఫలప్రదత్వాన్ని (యూజ్‌ఫుల్‌ సెన్స్) నిర్ధారణ చేసుకోవాలి. అలా చేసుకున్న తర్వాతనే, అది మనకు సంతృప్తికరం అయితేనే, దాన్ని సత్యమైనదిగా అంగీకరించి, స్వీకరించాలి. అలా సంతృప్తికరంకాని దాన్ని అసత్యమైనదిగా త్రోసివుచ్చాలి.

ఈ వాదానికే ప్రాగ్మాటిజం అనే పేరు వచ్చింది. ఏదైనా ఒక విధానం— అది రాజకీయం కానివ్వండి, ఆర్థికం కానివ్వండి— విజయవంతమైతే స్వీకారయోగ్యం, లేకపోతే కాదు. ఇది సాధారణార్థం. దీన్ని తాత్విక స్థాయికి తీసుకువెళ్లి సమస్త సత్యశోధన వ్యాసంగానికి అన్వయించినవాడు విలియం జేమ్స్.

అయితే, అతనికి ముందు ప్రాగ్మాటిస్టు సిద్ధాంతచ్ఛాయలు అసలు లేవని కాదు. ఉదాహరణకు చార్లెస్ డార్విన్ "సర్వైవల్ ఆఫ్ ది ఫిట్టెస్ట్" అని సూత్రీకరించాడు. అంటే ఏ జీవజాతి మనుగడ కొనసాగించడానికి అన్ని విధాల అనువైన లక్షణాలు కలిగివుంటుందో అదే కొనసాగుతుంది. అట్టి లక్షణాలు లేనిది అంతరించిపోతుంది. దీన్ని తిరగేసి చెప్పాలంటే—ఒక జీవజాతి అంతరించిందంటే అది మనుగడకు అనర్హం, అసమర్థం అన్నమాట. (ఈ విధంగా భూలోకంలో ప్రాణి పుట్టుక తర్వాత ఎన్నో లక్షల జీవ జాతులు మనుగడకు అనర్హమై అంతరించాయి) కనుక డార్వినిజంలో ప్రాగ్మాటిజంకు ముఖ్యమైన ఉపయోగితావాదం, ఫలితాత్మకవాదం గర్భితమై వున్నాయని చెప్పవచ్చు.

ఇంగ్లీషు తాత్వికుడు జెరెమీ బెంథామ్ (1748-1832) కూడా సిద్ధాంతాల మీద మోజులేనివాడు. సిద్ధాంతం ముఖ్యం కాదు. అది ఎంత ఎక్కువ మందికి ఎంత ఎక్కువ సౌఖ్యం ఇస్తుందనేది ముఖ్యం. The greatest happiness of the gretest number is the measure of right or wrong.–ఇది బెంథామ్ వాదం. దీన్ని యుటిలిటేరియనిజం—ఉపయోగితావాదం— అంటారు. ప్రపంచ రాజకీయ శాస్త్రాన్ని, ముఖ్యంగా బ్రిటిష్ రాజకీయ సిద్ధాంతాలను ఈ వాదం ఎంతో ప్రభావితం చేసింది.

దీనికి, జేమ్స్ వాదానికి కొన్ని పోలికలున్నా, బెంథామ్ ప్రధానంగా రాజకీయ, ఆర్థిక సంస్కర్త. అతని వాదం ఆ సంస్కరణ ప్రయోజనాలకే పరిమితం. కాగా, జేమ్స్ వాదం విశ్వజనీనం, విశ్వవిస్తృతం అయిన సత్య సంశోధనకు మార్గదర్శకంగా ఉద్దేశించినట్టిది.

ఇంకా ఇలాగే యూరోపియన్ మేధావులలో ఉపయోగితావాదాన్ని అభిమానించి, ప్రతిపాదించిన వారు మరి కొందరున్నప్పటికి అందరిలోకి జేమ్స్‌ను ప్రభావితుడిని చేసినవాడు ఛార్లెస్ పెయిర్స్ (Charles Sanders Peirce, 1839-1914) అనే అమెరికన్ వైజ్ఞానిక—తాత్వికుడు. విలియం జేమ్స్ ప్రాగ్మాటిజం పితామహుడైతే, పెయిర్స్ ప్రపితామహుడు. సిద్ధాంతాలను, విశ్వాసాలను గురించి చర్చించే ముందు వాటిని గురించి సరైన, స్పష్టమైన అవగాహన ఏర్పరుచుకోవాలంటాడు పెయిర్స్. ఒక వస్తువు గురించి మన అభిప్రాయం ఆచరణలో ఆ అభిప్రాయం ఏ విధమైన ఫలితాలను కలగజేస్తుందో దానిపై ఆధారపడివుంటుంది. ఒక విషయం గురించి సంపూర్ణావగాహనకు రానిదే దాన్ని గురించి ఏ అభిప్రాయానికి మనం రాకూడదు—ఇది పెయిర్స్ ప్రధాన సూత్రం.

పెయిర్స్ 1878 లో "పాప్యులర్ సైన్స్ మంత్లీ" అనే పత్రికలో "మన భావాలలో స్పష్టత సాధించడం ఎలా?" (How to Make Our Ideas Clear) అనే వ్యాసం వ్రాశాడు. అది విలియం జేమ్స్ చదివి దారీ తెన్నూ లేకుండా కొట్టుకుపోతున్నవాడికి ఒక దిక్సూచి దొరికినట్టుగా అనుభూతి పొంది ఒక స్పష్టమైన దృక్పథం రూపొందించుకున్నాడు. పెయిర్స్‌కు, జేమ్స్‌కు ఆ తర్వాత కాలంలో సిద్ధాంతరీత్యా విభేదాలు వచ్చినా, పెయిర్స్ ప్రభావంలోనే జేమ్స్ తన "ప్రాగ్మాటిజం" సిద్ధాంతానికి రూపకల్పన చేసుకున్నాడు. అయితే, పెయిర్స్ తన సిద్ధాంతాన్ని—భావాలకు, మాటలకు స్పష్టమైన అర్థాన్ని (Theory of Meaning) అన్వేషించే సాధనంగా ఉద్దేశించగా, జేమ్స్ తన వాదాన్ని ఒక సత్యశోధన సిద్ధాంతంగా (Theory of Truth) విస్తరించాడు.

పాశ్చాత్య తత్వశాస్త్రంలో ఒక ముఖ్యవాదం ఎంపిరిసిజం అనబడే అనుభూతివాదం. దీనికి ఆద్యులు లాక్, బెర్క్లీ, హ్యూమ్. వీరిని గురించి ఇంతకుముందు చదివాము. మన జ్ఞాన సమస్తానికి ఇంద్రియానుభవమే ఆధారభూతమన్నది వీరి వాదం. అనుభవం (experience) లేనిదే జ్ఞానం (knowledge) లేదని వీరు అంటారు. దీన్ని జేమ్స్ అంగీకరించాడు. కాని కొన్ని ముఖ్య విషయాలలో దానితో విభేదించాడు. ఇంద్రియానుభవం వేర్వేరు ముక్కలు (bits) గా మన మనస్సులలోకి ప్రవేశిస్తుందని బ్రిటిష్ ఎంపిరిసిస్టులు అంటారు. అంటే అనుభవం అనేది ప్రాథమిక స్థాయిలో శకలితం (atomised)గా వుంటుం దన్నమాట. ఈ భిన్న శకలాల సమూహమే మన జ్ఞానం, మన చేతన (Consciousness).

జేమ్స్ ఈ వాదాన్ని తిరస్కరించాడు. అనుభవం శకలితంగా వుండదు. మన చేతన, లేదా చైతన్యం వేర్వేరు ఇంద్రియానుభవాల శకలాలతో కూర్చినది కాదు. అది అవిచ్ఛిన్నమైనది. ఒక ఎడతెగని ప్రవాహం లాంటిది. అంటే మన అనుభవం ఒక చైతన్య స్రవంతి (stream of consciousness) అన్నమాట. ఆ తర్వాత కాలంలో ఈ సమాసం ఇంగ్లీషు సాహిత్యంలో జేమ్స్ జాయిస్, వర్జీనియా వుల్ఫ్ మొదలైనవారి రచనలద్వారా చాలా ప్రాచుర్యం పొందింది. దానికి ఆద్యుడు విలియం జేమ్స్. చేతన–కాన్షస్‌నెస్–శకలితం (యాటమైజ్‌డ్)గా వుంటుందని బ్రిటిష్ ఎంపిరిసిస్టులు ప్రతిపాదిస్తే, అది ప్రవాహ సదృశంగా వుంటుందని జేమ్స్ అంటాడు. ఒక పుస్తకం వున్న దనుకోండి. దాని మందం, ఆకారం, నునుపుదనం, గట్టిదనం, చల్లదనం, రంగు, వాసన, ఇత్యాది వేర్వేరు భావశకలాలు దేనికదిగా మన చేతనలోకి ప్రవేశించవు. అవన్నీ ఒకేసారిగా, వాటి మధ్య గల పరస్పర సంబంధాలతోసహా ప్రవేశించి పుస్తకం అనే అనుభవాన్ని చేతనకు అందిస్తాయి. అలాగే ప్రతి వస్తువు దాని పరిసరాలతో పారస్పర్యం పొంది మన చేతనకు అందుతుంది. ఏ వస్తువు దానికదిగా మనజాలదు. ఇతర వస్తువుల మధ్యనే దాని ఉనికి వుంటుంది. అంటే మన అనుభవ సామస్త్యం, దాన్ని ప్రతిఫలించే మన చైతన్య సామస్త్యం వస్తువుల మధ్యగల పరస్పర సంబంధాల వ్యవస్థగా వుంటుంది. అది అవిచ్ఛిన్న స్రవంతిగా మన అనుభవంలోకి వస్తుంది. దాని మధ్య అతుకులు, బొతుకులు వుండవు. ఏ అనుభవ శకలం స్వయం సంపూర్ణం కాదు. ప్రతిది తన పొరుగు అనుభవ శకలాలలోకి ప్రవహిస్తుంది.

ఆలోచన (Thought) అనేది వేర్వేరు భావశకలాల పరంపర కాదు. అది భావాల పరస్పర సంబంధాల వ్యవస్థ. ఏ భావం స్వయం సంపూర్ణం కాదు. ప్రతి భావం పాక్షికం (Partial), సాపేక్షికం (relative). అలాంటి అనంత

సాపేక్ష, పాక్షిక భావాల మధ్యగల సంబంధాలే మనకు అనుభవగోచర మవుతున్న ఈ సమస్త ప్రపంచం.

ఇంద్రియ-మనోగోచర జగతికి అతీతంగా సత్యపదార్థం అనేది వేరే ఏమీ లేదు. అనుభవాలను దాటి అవాఙ్మానస గోచరమైన సత్యం లేదు. అది నిరపేక్షం కాదు. "శ్రీ కైవల్య పదంబు" లాంటిది లేదు. కేవలత్వం అనేది లేదు. సత్యం అనేది మానవుల ప్రాపంచిక అవసరాలపై ఆధారపడినట్టిదే.

ప్రకృతి సూత్రాలు (laws of nature) కేవల సత్యాలు (absolute truths) అని మామూలుగా మనం అనుకుంటాము. అవి అనుభవాత్పూర్వమైన (a priori)వని కొందరు తాత్వికులు భావించారు. కాని, అవన్నీ అనుభవ జన్యాలైనవేనని జేమ్స్ వాదం. అనుభవానికి మించిన ప్రకృతి సూత్రాలు, కేవల సత్యాలు లేవు. అయా సూత్రాలు మనకు ఉపయోగ్యమైనవి కనుకనే సత్యాలయ్యాయి. మన వాస్తవానుభవాలకు ఆ సూత్రాలు హ్రస్వ లిపి (short hand) లాంటివి.

అనుభవం (experience) ఎప్పటికీ సంపూర్ణం కాదు కనుక, సత్యం కూడా సంపూర్ణం కాదు. అది నిత్య అసంపూర్ణం. అది ఎప్పటికప్పుడు సంపూర్ణత్వాన్ని సమీపిస్తూ వుంటుంది. అది ఒక పరివర్తన క్రమం. ఒక ప్రాసెస్ (process.)

సత్యం వలెనే లోకం కూడా. లోకం ఒక సంపూర్ణ పదార్థం కాదు. నిత్యపరివర్తన శీలమైనది లోకం. ఆ పరివర్తన క్రమంలో మనం కూడా మన పాత్ర నిర్వర్తిస్తాము.

ఈ సూత్రం నుంచే జేమ్స్ తన అభ్యుదయ వాదాన్ని—meliorism—ఆవిష్కరించాడు. ప్రపంచం సర్వసంపూర్ణం కాదు, నిర్దుష్టం కూడా కాదు. లోకంలో ఎంతో దుర్మార్గం వుంది. గుణ దోషాల సమ్మిశ్రమమే లోకం. అందుచేత దాన్ని బాగుపరచడానికి, సంస్కరించడానికి వీలున్నది.

ప్రపంచం నిజంగా నిర్దుష్టమై, సంపూర్ణ సద్గుణ శోభితమై వుంటే ఇక మానవుడు చేయవలసిన దేముంటుంది? చేతులు ముడుచుకుని కూర్చోవాలి. అది స్తబ్ధలోకం, మృత ప్రపంచం అవుతుంది. నిజానికి, ప్రపంచం అలా లేదు. అది దోషభూయిష్ఠమైన లోకం. దాన్ని మెరుగుపరచవలసిన బాధ్యత ప్రతి ఒకనిపై వుంది.

ప్రపంచం పూర్తిగా బాగుపడి, సంపూర్ణంగా నిర్దుష్టం కావడం అసంభవం

కావచ్చు. కాని, దోషాలను తగ్గించడానికి మాత్రం వీలున్నది. మానవుని కృషి అందుకు దోహదం చేస్తుంది. తన కృషి ఫలిస్తుందన్న ఆశ మనిషిని ఉత్తేజపరిచి, ముందుకు తీసుకుపోతుంది.

ఒక్కొక్క వ్యక్తి ఒక్కొక్క దృక్పథం నుంచి లోకాన్ని చూస్తాడు. ఒక్కొక్కరికి ఒక్కొక్క విధంగా సత్యం దర్శన మిస్తుంది. అందుచేత లోకంలో ఏకత లేదు, అనేకత వుంది. లోకాన్ని జేమ్స్ uni-verse గా కాక, multiverseగా దర్శించాడు. సత్యం కూడా అంతే. సత్యంలో అనేకత్వం వుంది. వ్యక్తులు ఎవరి దృష్టినుంచి వారు సత్యాన్ని దర్శించి, దాని ప్రకారం లోకాన్ని మరమ్మతు చేయడానికి ప్రయత్నించాలి. ఈ విధమైన కృషి వైవిధ్యం వల్లనే లోకం ముందుకు సాగుతుంది.

ఈ కృషి విడి విడి వ్యక్తుల విషయంలో విఫలమైనా, దాని సామూహిక ఫలితంవల్ల లోకం శ్రేయోభిముఖంగా పురోగమిస్తుంది. ఇందులో దేవుని సహాయం కూడా మానవునికి లభిస్తుందని జేమ్స్ అంటాడు. అతనికి ఒకే దేవునిపై విశ్వాసం లేదు. అసలు ఏకత్వం అనేదానిపైనే నమ్మకం లేదు. ఒకటి అనే అంకెపై అంత నమ్మకం దేనికి అని అతడు ప్రశ్నిస్తాడు. సత్యం లేదా లోకం, లేదా దైవం ఒకటిగానే ఎందుకుండాలి? నలభై మూడుగానో, ఇరవై లక్షల పదిగానో ఎందుకు వుండరాదు? అని ప్రశ్నిస్తాడు.

అలాగే విశ్వసృష్టికి కారణభూతులైన దేవుళ్లు అనేకు లుండవచ్చు. అంటే, ఒక్కొక్క వ్యక్తికి ఒక్కొక్క దైవంపై- తన లోకాభ్యుదయ కృషిలో సహాయపడే దైవంపై—నమ్మకం వుండవచ్చు. అంటే సత్యంవలె, లోకంవలె, దైవం కూడా బహుధాత్వం (pluralism) కల భావమన్నమాట.

ఈ భావం—ప్రతి వ్యక్తికి అతని కృషిలో సహాయపడే దైవం ఒకడు వున్నాడనే భావం—హేతువాద విరుద్ధ మన్నమాట నిజమే. అది తర్కానికి నిలవదు. కాని, లోకం మన తర్కంపై ఆధారపడి నడవదు. మన విశ్వాస బలంపై, మన ఇచ్ఛా శక్తిపై ఆధారపడి పురోగమిస్తుంది. అందుచేత మనకు సహాయపడే దైవంపై మనం విశ్వాసం పెంచుకుని లోక కల్యాణానికి ఎవరి కృషి వారు చేయాలి. దీనికోసం జేమ్స్ "విశ్వసించాలనే ఇచ్ఛ"—will to believe అవసరమని ప్రబోధించాడు.

## పునరవలోకనం

ఇప్పుడు ఒక్కసారి జేమ్స్ సిద్ధాంత వ్యవస్థను సింహావలోకనం చేద్దాము. ఆ వ్యవస్థలో మూడు విస్పష్టమైన అంశాలు కనిపిస్తాయి. మొదటిది అయన

ప్రవచించిన ప్రాగ్మాటిజం. జర్మన్ తత్వవేత్త కాంట్ భౌతిక ప్రపంచానికి (Phenomenal world) ఆధారభూతమైన పారభౌతిక ప్రపంచం (Noumenal world) వేరే వున్నదని, అది అననుభూతమైనదని (Thing-in-itself) భావించాడు. ఈ వాదాన్ని జేమ్స్ తిరస్కరించాడు. అననుభూతమైన–అంటే అనుభవంలోకి రాని, రాజాలని--ప్రపంచం అటూ వేరే లేదని, అనుభూత(Experienced) ప్రపంచమే సత్యమైనదని అతని వాదం. అందుచేత ఈ భౌతిక ప్రపంచంమీదనే మన దృష్టిని కేంద్రీకరించాలని, భౌతికానుభవం ద్వారానే సమస్త జ్ఞానం లభిస్తుందని అతడు అంటాడు.

రెండవ అంశం : ఈ ప్రపంచమే నిజమైంది, ఈ ప్రపంచానుభవమే వాస్తవమైనదీ అయినప్పుడు, ఈ ప్రపంచం నిర్దుష్టమైనది కాదు కనుక దాన్ని మెరుగు పరచడమే మన లక్ష్యం కావాలి. అందుకోసం కృషి చేయాలి. ఈ ప్రపంచాన్ని మెరుగు పరచడానికి, మానవజాతి శ్రేయస్సును వృద్ధిపరచడానికి, లోపాలను తొలగించడానికి అవకాశం తప్పకుండా వున్నది. ప్రతి వ్యక్తి ఇందులో ఒక చెయ్యి వెయ్యాలి. ప్రపంచాభ్యుదయ కృషిలో ప్రతి ఒక్కడూ పాత్రధారి కావాలి. ఎవరి దృక్పథం వారిది. ఎవరి సత్యం వారిది. ఆ దృక్పథం నుంచి, ఆ సత్యదర్శనం నుంచి కృషి చేయడంలో పరస్పర సంఘర్షణ సంభవించవచ్చు. కానీ ఆ సంఘర్షణలో నుంచే అభ్యుదయం సిద్ధిస్తుంది.

మూడవది : "ఏకం సత్ విప్రా బహుధా వదంతి" అని పలువురు తాత్వికులు భావించినప్పటికి సత్యం ఏకం కాదు, అనేకం. బహుధాత్వం దాని లక్షణం. మనది బహుధాత్వ (pluralistic) ప్రపంచం. మరి దీన్ని మెరుగుపరచి అభ్యుదయం వైపు పురోగమింపచేయడానికి ఏ మార్గం అనుసరణీయం? లోకంలో అనేకత్వం (plurality) వున్నది కదా? ఎవరి సత్యం వారిది కదా? ఏది ఆదరణీయం? ఏది ఆచరణీయం? అంటే--ఏ మార్గం ఆశించిన సత్ఫలితాలను ఇవ్వగల సామర్థ్యం కలిగినదై వుంటుందో అదే సత్యం. ఒక విధానం, ఒక విశ్వాసం, ఒక సిద్ధాంతం, ఒక భావం సత్యమైనదో కాదో ఆచరణలో తేలుతుంది. అనుభవంలో విదిత మవుతుంది. ఫలితాన్ని బట్టి నిర్ధారిత మవుతుంది. సిద్ధాంతం, లేదా విశ్వాసం మంచిది కనుక, సత్యమైంది కనుక సత్ఫలితం సిద్ధిస్తుం దనుకోరాదు. సత్ఫలితం సిద్ధించింది కనుకనే, లేదా సిద్ధించే అవకాశం కలదని గాఢ వివేచనానంతరం తేల్చుకున్నాము కనుకనే అది సరైన, సత్యమైన సిద్ధాంతం అవుతుంది. అంటే సత్యనిర్దేశానికై అట్నించి కాక, ఇట్నించి నర్ఘుక్కు రావాలన్నమాట. ప్రథమ సూత్రాలు (First Principles) లేవు. అంతిమ సూత్రాలే (Last principles) వున్నాయి. దీన్నే ఫలితాత్మకవాదం--ప్రాగ్మాటిజం-- అంటారు.

అందుకే సత్యం అనేది సార్వకాలికం కాదు, సార్వజనీనం కాదు. నిరపేక్షం కాదు. అది నిరంతర పరిణామ శీలం, పరివర్తన శీలం కలది. ఒక విధానం, ఒక విశ్వాసం ఒక కాలంలో, ఒక పరిస్థితిలో సత్యం కావచ్చు. కాలం మారి, పరిస్థితి మారిపోతే అది అసత్యం కావచ్చు. అంటే సత్యం సాపేక్షం, బహుళం, అదొక నిరంతర క్రమం (Eternal process) "నిన్న స్వప్నం నేడు సత్యం" అన్నాడు కవి. కాని "నిన్న సత్యం నేడు స్వప్నం" కూడా. సత్యాన్ని ఎప్పటికప్పుడు అన్వేషించడమే కాదు, నిరంతరం మనమే దాన్ని సృష్టించాలి. సత్యం వేరే ఎక్కడో పారభౌతికంగా, పారలౌకికంగా లేదు. మనమే దాన్ని మన అవసరాలకు, పరిస్థితులకు అనుగుణంగా సృష్టిస్తాము.

ఇదీ ఈ శతాబ్దపు తొలి దశకాలలో ముఖ్యంగా అమెరికాను, కొంతవరకు పాశ్చాత్య తత్వచింతనను, విశేషంగా ప్రభావితం చేసిన విలియం జేమ్స్ ప్రాగ్మాటిస్టు చింతనాస్రవంతి.



# 34
# చైతన్య ప్రవంతి వాది బెర్గ్‌సన్

ఎందరో తత్వవేత్తలు, అందరికీ వందనములు. ఏ తత్వవేత్త వేసినా అవే ప్రశ్నలు. ఉపనిషత్తులు క్రీస్తు పూర్వం ఎన్నివందల ఏళ్ల నాటివో తెలియదు కాని, నాటినుంచి నేటి వరకు అవే ప్రశ్నలు.

కేనోపనిషత్తు ప్రారంభ శ్లోకంలో శిష్యుడు గురువును అడుగుతాడు :

కేనేషితం పతతి ప్రేషితం మనః<br>
కేనప్రాణః ప్రథమః ప్రైతియుక్తః<br>
కేనేషితం వాచమిమాం వదన్తి<br>
చక్షుశ్శ్రోత్రం క ఉ దేవో యునక్తి

"ఎవరి అనతి వల్ల ఈ మనస్సు ఆలోచిస్తోంది? ఎవరివల్ల ఈ ప్రాణం ప్రేరణ పొందుతోంది? ఎవరి ప్రేరణ వల్ల వాక్కు, చక్షువులు, శ్రవణేంద్రియం ఇవన్నీ పనిచేస్తున్నాయి.

అలనాటి కేనోపనిషత్తులోని అజ్ఞాత శిష్యుడే కాదు, అనాటి నుంచి ఈనాటి వరకు ఏ తత్వవేత్త అడిగినా కొద్ది తేడాలతో ఇవే ప్రశ్నలు.

అయితే సమాధానాలలోనే విభేదాలు, ఒక తత్వవేత్త చెప్పిన సమాధానం మరొకరికి రుచించదు. అందరూ చూసేది ఒక ప్రపంచాన్నే. అయినా, దృగ్భేదంవల్ల ఒక్కొక్కరికి ప్రపంచం ఒక్కొక్క విధంగా కనిపిస్తుంది. ప్రపంచ మౌలిక ప్రశ్నలకు ఒక్కొక్క తత్వవేత్త చెప్పిన సమాధానాలలోని మేధావ దసాధారణత్వాన్ని చూస్తే ఆశ్చర్యం కలుగుతుంది. మానవ మేధా యాగఫలం ప్రపంచ తత్వశాస్త్రం.

ఇది ఒక నిరంతర స్రవంతి కూడా. చిత్రం ఏమిటంటే, ప్రతి తత్వవేత్త తాను పరమ సత్యాన్ని కనుగొన్నట్టే, తనకు సంపూర్ణ సత్య దర్శనమైనట్టే భావిస్తాడు.

ఇంతవరకు "విశ్వదర్శనం"లో మనం చూసిన పాశ్చాత్య తత్వవేత్తలు ప్లేటో, అరిస్టాటిల్, కాంట్, హెగెల్, బెర్క్లీ ఇంకా ఎందరో మహానుభావులు తమ సత్యాన్వేషణ ఫలించినట్టే భావించారు. ఇదీ సత్యం ఇదే సత్యం అని చాటుకున్నారు. హెగెల్ తన సిద్ధాంతంతో తత్వశాస్త్రం పరిపూర్ణత చెందినదని, అది అంతిమత్వాన్ని చేరుకున్నదని చెప్పుకున్నాడు. కాని, ఆ పిదప ఏమైంది? హెగెల్ సిద్ధాంత వ్యవస్థ నిటారుగా కాక, తలకిందులుగా నిలబడివుందని కార్ల్ మార్క్స్ భావించాడు. తాను దాన్ని తిరిగి దాని కాళ్ళమీద నిలబెడుతున్నట్టు చెప్పి ఒక కొత్త సిద్ధాంతాన్ని ప్రవచించాడు. అయినా, అక్కడితో కూడా తత్వచింతనా స్రవంతి ఆగిపోలేదు. ఇంకా ముందుకు సాగిపోతూనే వుంది.

ఆలోచిస్తుంటే, అసలు ఏ తత్వవేత్త సత్యదర్శనమైనా సమగ్రమా, సంపూర్ణమా, అంతిమమా? సంపూర్ణ సత్యదర్శనం ఏ ఒక్క మానవుడికైనా, ఎందరు మానవులకైనా సాధ్యమా? అనే ప్రశ్నలు, సందేహాలు బయలుదేరుతాయి. ఈ ప్రశ్నలకు వ్యతిరేక సమాధానాలు రావడంవల్లనే ఎప్పటికప్పుడు ఒక కొత్త తత్వవేత్త వచ్చి, సరికొత్తగా సత్యనిరూపణం చేయడానికి ప్రయత్నించడం జరుగుతున్నది. దానితో తత్వశాస్త్ర స్రవంతి మరికాస్త ముందుకు సాగుతున్నది. శతాబ్దాలుగా అది ముందుకు సాగుతూనే వుంది. అయినా, అది చేరవలసిన సముద్రం ఇంకా ఇంకా వెనక్కి పోతూనే వుంది.

అయితే, మరి మానవుడు ఎన్నటికీ పరమ సత్యాన్ని కనుగొనలేడా? అసలు పరమ సత్యం, సంపూర్ణ సత్యం అనే ఒక ముద్దలాంటి సర్వ సమగ్ర పదార్థం ఏదైనా వుందా? వెనకటి కొకడు తత్వశాస్త్రాన్ని "ఒక గుడ్డివాడు కటిక చీకటి గదిలో లేని నల్లటి పిల్లిని వెదకడం"తో పోల్చాడు. మరి ఈ శ్రమ, ఈ అన్వేషణ అంతా వృథాయేనా? ఈ దండుగమారి పని మానేసి ఎవడి సంగతి

వాడు చూసుకోవడం, హాయిగా ఏ ఆలోచనలు పెట్టుకోకుండా ఎవడి బతుకు వాడు బతకడమే మంచిదా?

కాని, ఇలా విస్పృహ చెందడం కూడా సమర్థనీయంకాదు. మానవుడు బుద్ధిజీవి, మేధాశాలి. Man does not live by bread alone అన్నారు. మనిషి పొట్టకే కాదు. మెదడుకు కూడా మేత కావాలి. ప్రపంచం అనే క్షేత్రాన్ని కుతూహలం అనే హాలంతో అతడు దున్నుతాడు; ఏదో అందని దానికోసం అర్రులు చాస్తాడు. వైఫల్యం ఎదురైనా వెనుదీయడు. నిత్యాన్వేషణ అతని ఊపిరి. తత్వ నిరూపణ అతని వాపిరి. అందుచేత అతని మేధా కృషి నిరంతరం సాగుతూనే వుంటుంది.

సంపూర్ణ సత్య స్వరూపాన్ని--అంటే నూటికి నూరుపాళ్ల సత్యాన్ని--కనుగొనడం మానవ సాధ్యం కాకపోవచ్చు కాని, సత్యం అనేదాన్ని ఒక మహా కాంతి పుంజం లాంటిదిగా భావిస్తే, ఒక్కొక్క తత్వవేత్త దర్శించినట్టిది దానిలోని ఒక్కొక్క కిరణ లేశం లాంటిదవుతుంది. ప్రతి కిరణంలోను కొంత కాంతిమత్వం, కాంతి తత్వం వుంటుంది. ప్రతి ఒక్కరూ సత్యపదార్థంలో నుంచి ఒక్కొక్క శకలాన్ని పట్టుకుంటున్నారు. ఎటొచ్చీ,-ఏనుగు, ఆరుగురు గుడ్డివాళ్ల కథలో ఒకడు తొండం పట్టుకుని ఏనుగంటే పాములాంటిదని, మరొకడు తోక పట్టుకుని అది తాడులాంటిదని, వేరొకడు చెవి పట్టుకుని అది చేటలాంటిదని రకరకాలుగా వర్ణించినట్టు--ప్రతి తత్వవేత్త తనదే అసలు సత్యం అని ప్రగల్భించడంలోనే చిక్కంతా వస్తోంది. మొత్తం ఏనుగంతా కలిపి ఏనుగు తప్ప దానిలోని ఏ ఒక్క భాగమూ ఏనుగు కాదు; అన్ని భాగాల సమూహమూ కాదు. ఏనుగు అనేది దృగ్గైకవేద్యం. అలాగే తత్వవేత్తలు పట్టుకున్న ఏ ఒక్క సత్య శకలం కాని, అన్ని సత్య శకలాల సమూహం కాని : సమగ్ర సత్యం కాబోదు.

అయితే, ప్రతి తత్వవేత్త కనుగొన్న సత్యశకలంలోను సత్యతత్వం కొంత వుంటుంది. కొంత కాంతిమత్వం వుంటుంది. అది ప్రపంచంమీద, వాస్తవం మీద ఏ కొంతో వెలుగును ప్రసరిస్తుంది. దాంతో ప్రపంచం అదివరకు కంటె మరికొంత ఎక్కువగా మనకు అర్థం అయినట్టు అనిపిస్తుంది. సత్య సముద్రాన్ని మనం మరికొంత సమీపించినట్టు అనిపిస్తుంది. తత్వశాస్త్రంలో కాని, విజ్ఞాన శాస్త్రంలో కాని ఆవిష్కృతమయ్యే ప్రతి కొత్తవాదం, ప్రతి కొత్త సిద్ధాంతం సత్యంవైపు మనల్ని మరొక అడుగు ముందుకువేయిస్తుంది. సత్యం అనబడే పదార్థంలో మనం అంతవరకు చూడని ఒక కొత్త భాగాన్ని చూపిస్తుంది.

ఆ విధంగా తత్వశాస్త్ర చరిత్రలో మరొక సత్య శకలాన్ని పట్టుకుని ఆవిష్కరించిన మహనీయుడు ఫ్రెంచి తత్వవేత్త హెన్రీ బెర్గ్‌సన్. ఒక్కొక్క కాలంలో ఒక్కొక్కరి ఫిలాసఫీ— తత్వచింతన—బాగా ప్రచారంలోకి వస్తుంది; ఎందరినో ప్రభావితం చేస్తుంది. కొన్నాళ్ల తర్వాత అది మరుగున పడి, మరొకటి పైకి వస్తుంది. వేషధారణలోవలెనే తత్వశాస్త్రంలో కూడా ఫ్యాషన్‌లు మారుతూ వుంటాయేమో ననిపిస్తుంది.

యూరపులో మధ్యయుగాలలో "ది ఫిలాసఫర్" అనే మాటకు అర్థం అరిస్టాటిల్—మనకు కవికుల గురువు అంటే కాళిదాసు అయినట్టు. అలాగే ఒకప్పుడు జర్మనీలో హెగెల్ భావవాదం ఫ్యాషన్. కార్ల్‌మార్క్స్ కూడా చిన్నప్పుడు హెగెల్ అభిమాని.

ద్వితీయ ప్రపంచ యుద్ధం తర్వాత పాశ్చాత్య తత్వశాస్త్రంలో సార్త్రి ప్రవచించిన- అస్తిత్వవాదం ఎగ్జిస్టెన్షలిజం—ఒక ఫ్యాషన్. అలాగే అంతకు ముందు ఈ శతాబ్దపు మొదటి రెండు దశాబ్దాలలోను యూరపులో బాగా ప్రసిద్ధికెక్కి ప్రచారమైన తత్వ సిద్ధాంతం "బెర్గ్‌సోనిజం". అంటే హెన్రీ బెర్గ్‌సన్ సిద్ధాంతం. ఆ రోజులలో యూరప్‌లో ఏ పుస్తకాల షాపులో చూసినా బెర్గ్‌సన్ రచనలు, వాటిపై భాష్యాలు, వ్యాఖ్యానాలు విరివిగా కనిపించేవట. బెర్గ్‌సన్‌తో ప్రపంచ తత్వశాస్త్రంలో నూతన భానూదయం అయిందని, అనేక జటిల తాత్విక సమస్యల పొగమంచు విచ్చిపోయిందని కొందరు భావించారట.

బెర్గ్‌సన్ తత్వచింతన ప్రభావం ఒక విధంగా కాదు, ఒక రంగంలో కాదు— భిన్న, విభిన్న రంగాలపై ప్రసరించిది. ఆ రోజులలో ఆయన సిద్ధాంతాలు పలువురిని ఆకర్షించాయి. తత్వవేత్తలపై సరేననుకోండి. క్రిందటి అధ్యాయంలో మనం చదివిన విలియం జేమ్స్‌పైన, జార్జి శాంతాయన, ఎ. ఎన్. వైట్‌హెడ్ వంటి వారిపైన—బెర్గ్‌సన్ ప్రభావం వుంది. ఫ్రెంచి ఇంప్రెషనిస్టు చిత్రకారుడు క్లాడ్ మోనే, ఫ్రెంచి సంగీతకారుడు క్లాడ్ డెబుస్సీ, సిండికలిస్టు విప్లవవాది జార్జెస్ సోరెల్ వంటివారిపై బెర్గ్‌సన్ ప్రభావం వుంది.

ఇక సాహిత్యం సంగతి చెప్పనక్కరలేదు. ఆ రోజులలో మేధావుల గోష్ఠులలో లైఫ్‌ఫోర్స్, ఇలాన్ వైటల్, క్రియేటివ్ ఇవల్యూషన్, స్ట్రీమ్ ఆఫ్ కాన్షస్‌నెస్, డ్యూరేషన్, రియల్‌టైమ్, ఇన్‌ట్యూషన్ లాంటి బెర్గ్‌సోనియన్ పడికట్టు మాటలు తరచుగా వినబడేవి.

"స్ట్రీమ్ ఆఫ్ కాన్షస్‌నెస్"—"చైతన్య స్రవంతి"—అనే సమాసాన్ని కల్పించింది విలియమ్ జేమ్స్ అయినా, దానికి సిద్ధాంత ప్రాతిపదిక వేసింది బెర్గ్‌సన్.

ఈ చైతన్య స్రవంతివాద ప్రభావంలో జేమ్స్ జాయిస్, వర్జీనియా వుల్ఫ్‌లాంటి వారు కొందరు ఒక విలక్షణ, వినూతన సాహిత్యం సృష్టించారు. బెర్నార్డ్ షా నాటకాలలో ప్రసిద్ధమైన "మ్యాన్ అండ్ సూపర్ మ్యాన్" బెర్గ్‌సన్ రచనలకు ముందుదే కాని, "బ్యాక్ టు మెతూసెలా" అనే నాటక పంచకంపై మాత్రం బెర్గ్‌సన్ లైఫ్ ఫోర్సు సిద్ధాంత ప్రభావం వుంది.

అందరిలోకి బెర్గ్‌సన్ సిద్ధాంత ప్రభావానికి అధికంగా లోనైనవాడు ఫ్రెంచి రచయిత మార్సెల్ ప్రూస్ట్ (1871-1922). ఫ్రెంచి సారస్వతంలో ప్రూస్ట్‌ది అద్వితీయ స్థానం. అతనిది విచిత్ర జీవితగాథ. తన జీవిత కాలంలోనే "లిజెండరీ" వ్యక్తిగా మారాడు. మొదట అందరిలాగానే జీవితం ప్రారంభించినా, రాను రాను ఏకాంత జీవితాన్ని అలవరచుకున్నాడు. జనానికి, లోకానికి దూరంగా గదిలో తలుపులు బిడాయించుకుని జీవించాడు. ఆఖరికి చిన్న ధ్వనిని, సన్నని వెలుగును కూడా భరించలేకపోయేవాడు. మసక వెలుగులో కూర్చుని, 1913 లో ప్రారంభించి 1922 లో చనిపోయేవరకు ఆ ఏకాంతవాసంలో పదహారు బృహత్సంపుటాల మహా నవల ఒకటి ప్రూస్ట్ వ్రాశాడు. దాని ఫ్రెంచి పేరును ఇంగ్లీషులోకి అనువదిస్తే "Quest for Lost Time" (గత కాలానికై గవేషణ). ఇంగ్లీషులో ఆ నవల "Remembrance of Things Past" (గత సంఘటనల స్మృతులు)అనే పేరుతో తర్జుమా అయింది. ఆ నవలలో కథానాయకుడు తన గత జీవితపు చెరిగిపోయిన జ్ఞాపకాలను నెమరు వేసుకోవడం ప్రధానేతివృత్తం. జాయిస్ నవలలవలె అది కూడా ప్రయోగాత్మక నవల. దానికి ప్రేరణ బెర్గ్‌సన్ ప్రతిపాదించిన "కాలజ్ఞాన" సిద్ధాంతం.

ఆధునిక కాలంలో పాశ్చాత్య తత్వశాస్త్రానికి పితామహుడు దేకార్త్ అని ఇంతకుముందు చదివాము. దేకార్త్ ద్వైతవాది. మనస్సు, శరీరం—ఈ రెండూ దేనికది స్వతంత్ర అస్తిత్వం కల రెండు విభిన్న, విరుద్ధ వస్తువులని, ఒకదానికొకటి సమానాంతరంగా వుంటాయి తప్ప అవి పరస్పర ప్రభావం కలవి కావని అతని సిద్ధాంతం. అతనితోనే ఆధునిక పాశ్చాత్య తత్వశాస్త్రంలో అసలు గొడవ అంతా ప్రారంభమైంది. అతడి వాదాన్ని ఆలంబనంగా చేసుకుని పాశ్చాత్య దార్శనికులలో కొందరు భావవాదులు (ఐడియలిస్టులు)గాను, కొందరు భౌతికవాదులు (మెటీరియలిస్టులు)గాను విడిపోయారు. వీరి మధ్య నాటినుంచి నేటివరకు ఎడతెగని వివాదం సాగుతూనే వుంది.

ఈ వివాదంలో భౌతికవాదాన్ని, దానితో పాటు డార్వినిజాన్ని వ్యతిరేకించి, తనదైన ఒక విలక్షణ భావవాదాన్ని వెలయించినవాడు బెర్గ్‌సన్. భావవాదు లందరు ఒక రకంగా ఆలోచించరు. అలాగే భౌతికవాదులు కూడా. వారిలో

వారికి ఎన్నో వాద భేదాలున్నాయి. బెర్గ్‌సన్ మొగ్గు భావవాదం వైపు అయినా, అతని ప్రత్యేక వాదం "ఇలాన్ వైటల్–లైఫ్‌ఫోర్స్ (ప్రాణశక్తి) అనబడే విశ్వ వ్యాప్త సూత్రంపై ఆధారపడినట్టిది. విశ్వానికి మూలం జడ పదార్థం కాదు; ప్రాణశక్తి. అదే సమస్తానికి ఆధారం.

## భౌతిక వాదాన్ని తిరస్కరించిన బెర్గ్‌సన్

"అనగనగా ఏ వెయ్యి కోట్ల సంవత్సరాలనాడో, ఇంకా ముందో ప్రస్తుతపు విశ్వ పరిణామానికి పూర్వ దశలు ప్రారంభమైనాయి. ఆ తర్వాత, వాయు–ధూళి మేఘాలు కుదించుకోగా, అసంఖ్యాక నక్షత్రాలు, గ్యాలక్సీలు, సూర్యుడు, అతని గ్రహ కుటుంబం, దానిలో భూమి ఏర్పడ్డాయి. భూమిమీద అనుకూల పరిస్థితులు రాగానే, అత్యంత సంకీర్ణమైన జీవ పదార్థాలు ఏర్పడ్డాయి. అవి అంతకంతకు సంకీర్ణ దశలకు పురోగమిస్తూ పోగాపోగా, చివరకు మానవ రూపం అవతరించింది..."

ఇవి నేను వ్రాసిన "నరావతారం"లోని చివరి అధ్యాయంలోని వాక్యాలు. భౌతిక విశ్వం ఏ విధంగా పరిణామం చెందిందో వివరిస్తూ వ్రాసిన "విశ్వ రూపం", జీవ పరిణామం, మానవ పరిణామం ఏ విధంగా, ఏ దశలలో జరిగిందో వివరిస్తూ వ్రాసిన "నరావతారం" అనే రెండు గ్రంథాల సారాంశాన్ని "కట్టె, కొట్టె, తెచ్చె" అన్నట్టుగా మూడు ముక్కలలో ఇమిడ్చి చెప్పడానికి ఆ మూడు వాక్యాలు వ్రాయడం జరిగింది.

ఇది ఈనాడు భౌతిక– విశ్వ శాస్త్రజ్ఞులలో, జీవశాస్త్రజ్ఞులలో అధిక సంఖ్యాకులు అంగీకరిస్తున్న సిద్ధాంతం. జీవ పదార్థం మొదటి నుంచి లేదు. నిర్జీవ, భౌతిక పదార్థంలో ఒకానొక దశలో వచ్చిన అనుకూల పరిస్థితుల సహాయంతో భౌతిక పదార్థంనుంచే జీవోత్పత్తి జరిగింది. అంతేకాదు, భౌతిక పదార్థమే జీవపదార్థంగా మారింది. జీవం కొన్ని వందల కోట్ల ఏళ్ల పాటు చెందిన పరిణామం ఫలితంగా ఈనాటి వివిధ రూపాలలో ప్రాణికోటి అవతరించింది. ఈ అభిప్రాయాన్ని ఆశ్రయించుకుని రూపొందించే తాత్విక భౌతికవాదం (Philosophical Materialism).

అయితే, భౌతిక–ఖగోళ–విశ్వ శాస్త్రజ్ఞులందరు, లేదా జీవశాస్త్రజ్ఞులు, జీవ పరిణామ వాదులందరు విధిగా భౌతికవాదులై వుండనక్కరలేదు. కారు కూడా. వారిలో పలువురు భావవాదులు, అంటే అనాదిగా ఏదైతే వున్నదో, ఏదైతే విశ్వానికి ఆధారభూతంగా వున్నదో అది భౌతిక పదార్థం కాదు. మనస్సు (మైండ్),

చైతన్యం (కాన్షస్‌నెస్), ప్రాణం (లైఫ్), భావం, (ఐడియా)—ఇవే అన్నిటికి ఆద్య పదార్థాలు. ఇవే అంతిమ సత్యాలు. అంతిమ సత్యం భౌతికం (మెటీరియల్, ఫిజికల్) కాదు; అభౌతికం (నాన్-మెటీరియల్)--అని ఈ విధంగా విశ్వసించేవారు, దీనికి తగిన తార్కిక వాదం చేసేవారు భౌతిక, జీవ శాస్త్రజ్ఞులలో కూడా ఎందరో వున్నారు. వీరు భావవాదులు(ఐడియలిస్టులు). వీరు తమ భావవాదానికి సాక్ష్యాలను భౌతిక, తదితర విజ్ఞాన శాస్త్రాల నుంచే తీసుకువస్తారు. నిజానికి అధునిక విజ్ఞాన శాస్త్రాలు భావవాదాన్నే బలపరుస్తున్నాయని కూడా కొంధరు సైంటిస్టులు అంటున్నారు.

భౌతిక వాదులకు, భావవాదులకు మధ్య ఈ సంఘర్షణ అది నుంచి వున్నది. అధునిక యుగంలో యూరోపియన్ తత్వశాస్త్రంలో అది ప్రధాన సమస్య కూడా. చైతన్యమా, భౌతిక పదార్థమా? మైండ్, అర్ మేటర్? ఏది ముందు? ఏది ప్రథమం? ఏది ప్రాథమికం?

ఈ సమస్యను తిరగదోడి మొదటికి తెచ్చినవాడు హెన్రీ బెర్గ్‌సన్. భౌతిక వాదులు చెప్పేదాన్ని కాకమ్మ కథగా కొట్టేశాడు. ఎప్పుడో ఊహాకందని కొన్నికోట్ల ఏళ్లనాడు ఒక వాయు--ధూళి మేఘం ఉండేదట. అది స్వీయ గురుత్వాకర్షణశక్తి కారణంగా తనలోకి తాను కుదించుకు పోగా, పోగా, కాలక్రమాన గ్యాలక్సీలు, నక్షత్రాలు, సూర్యుడు, గ్రహాలు, భూమి ఏర్పడ్డాయట. అ భూమిపై నిర్జీవ పదార్థంలోనుంచి జీవం యాదృచ్ఛికంగా, ఉద్భవించిందట. అ జీవం తిరిగి యాదృచ్ఛికంగా, యాంత్రికంగా అనేక రూపాలు ధరించి, చివరకు మానవుడు అవతరించాడట. ఇది కట్టుకథ కాక మరేమిటి? అని బెర్గ్‌సన్ ప్రశ్నించాడు.

పదార్థం (మేటర్) భౌతికమైనది (ఫిజికల్). ప్రాణం (లైఫ్) అభౌతికమైనది (నాన్-ఫిజికల్). భౌతికమైనది అభౌతికమైనదానికి ఎలా కారణ మౌతుంది? భౌతికం నుంచి అభౌతికం ఎలా ఉద్భవిస్తుంది? లూయీపాశ్చర్ అనేక ప్రయోగాలు చేసి నిర్జీవ పదార్థం నుంచి జీవం సృష్టికాదని, జీవంనుంచే జీవం సృష్టి అవుతుందని నిరూపించలేదా?

అలాగే, మెదడు (బ్రెయిన్) అనేది అలోచించే అవయవమని, మనస్సు (మైండ్) అనేది వేరే లేదని, మెదడే మనస్సు అని భౌతికవాదులు వాదిస్తారు. ఇదీ కట్టుకథే. మెదడు ఒక మాంసపు ముద్ద; భౌతిక పదార్థం. మనస్సు, ఆలోచన, భావం. చైతన్యం అభౌతికమైనవి. భౌతికమైన మెదడు అనే శరీరభాగం నుంచి అభౌతికమైన ఆలోచన ఎలా సృష్టి అవుతుంది? మెదడుకు, మనస్సుకు మధ్య సంబంధం ఉండవచ్చు, అవి పరస్పరాశ్రితాలు కావచ్చు.

కాని, మెదడే మనస్సు కాదు. మెదడులో జరిగే ప్రతి మార్పును భౌతిక శాస్త్రం ప్రకారం గుణించవచ్చు; "క్వాంటిఫై" చేయవచ్చు. దానికి విస్తృతి (extension) వుంటుంది. భౌతిక పదార్థానికి వర్తించే ప్రకృతి సూత్రాలన్నీ దానికి వర్తిస్తాయి. కాని, కేవల ఆలోచనకు విస్తృతి వుంటుందా? దానికి భౌతిక సూత్రాలు వర్తింపజేయగలమా? ప్రేమ అనే భావాన్ని, లేదా సౌందర్యాస్వాదన అనే అనుభూతిని "క్వాంటిఫై" చేయగలమా? ప్రేమకు, సౌందర్య భావానికి పొడుగు, వెడల్పు, మందం లాంటి కొలతలు వుంటాయా? అలాగే చైతన్యం (కాన్షస్‌నెస్) కూడా భౌతికమైన కొలతలకు ఎలా అందుతుంది? "నేను" అనే అహంకారానికి ఒక భౌతిక పదార్థం ఎలా ఆధారం, కారణం అవుతుంది? మెదడు అనే అవయవాన్ని మనస్సు, ఆలోచన, చైతన్యం,. అహంకారం అనేవి తమకు ఒక వాహనంగా, ఒక సాధనంగా చేసుకోవచ్చు. కాని, మెదడే మనస్సు కాదు. అలాగే జీవం అనేది భౌతిక పదార్థాన్ని తనకు ఆధారంగా చేసుకోవచ్చు. కాని, భౌతిక పదార్థమే జీవానికి, ప్రాణోత్పత్తికి కారణం కాదు.

భౌతికవాదం నియతి వాదానికి (డిటర్మినిజం) దారి తీస్తుంది. అంటే విశ్వంలో ప్రతిదీ నియంత్రితమై వుంటుందని భౌతికవాదం చెబుతుంది. ఒకానొక కారణం ఒకానొక ఫలితానికి దారితీస్తుంది. అది మరొక దానికి కారణమవుతుంది. అది వేరొక దానికి కారణ మవుతుంది. ఈ విధంగా కారణ–కార్యహారం (Chain of cause and effect) అనంతంగా సాగుతుంది. ఇందులో యాదృచ్ఛికత (chance)కు తావు లేదు. స్వతంత్రేచ్ఛ (free will)కు అసలే స్థానం లేదు. ప్రపంచంలో ప్రతిదీ అంతకు ముందున్న దానిచే నియంత్రితమైతే, సృజనాత్మకతకు (creativity) అవకాశం ఎక్కడ?

ప్రతిది మరొక దాని ఫలితం, మరొక దాని పర్యవసానం అయితే, అలా వెనక్కి పోగాపోగా, చివరికి అన్నిటికి మూల కారణం నిర్జీవం, భౌతికం అయిన ఆదిమకాలపు వాయు–ధూళిమేఘం (Primaeval gas-dust cloud) కావాలి. అంటే షేక్‌స్పియర్ వ్రాసిన హామ్లెట్, ఒథెల్లో వంటి మహా నాటకాలు, వాటిలో ఆయన చూపిన కవితా ప్రతిభ, శిల్పం–అన్నిటికి ఆది కారణం ఒకానొకనాటి నిర్జీవ, భౌతిక వాయు–ధూళి మేఘం కావాలి. అంటే, ఇన్ని వేల కోట్ల ఏళ్ల తర్వాత, ఇన్ని పరిణామ దశల ఫలితంగా ఒకానొక కాలంలో షేక్‌స్పియర్ అనే వాడు జన్మిస్తాడని, అతడు ఫలానా నాటకాలు వ్రాస్తాడని, ఫలానా విధంగా వ్రాస్తాడని ఆనాడే, ఆనాటి వాయు–ధూళి మేఘంలోని మార్పులలోనే నిర్ణయమైంది దన్న మాట. నియతి వాదాన్ని, కార్య–కారణ సూత్రాన్ని విశ్వసిస్తే,

అదే సత్యమైతే, అంతే మరి. కాని, ఇది అసంభావ్యమైన, అసంబద్ధమైన, అవిశ్వసనీయమైన కల్పన కాదా?

ఈ విధమైన భౌతికవాదాన్ని బెర్గ్‌సన్ తిరస్కరించాడు. విశ్వానికి మూల కారణం భౌతిక, నిర్జీవ పదార్థం కాదు; ప్రాణశక్తి, లైఫ్ ఫోర్స్! ఇలాన్ వైటల్ (Elan Vital)! ఆ ప్రాణ శక్తే అసంఖ్యాక రూపాలు ధరించింది. పరిణామం చెందింది అదే. పరిణామమే అది. భౌతిక పదార్థాన్ని తనకు వాహిక (వెహికిల్)గా చేసుకుని నిరంతర సృజనాత్మకతతో ముందుకు సాగిపోతున్నది ఈ ప్రాణశక్తే. డార్విన్ చెప్పినట్టు జీవపరిణామం యాంత్రికంగా గాని, యాదృచ్ఛికంగా గాని జరగలేదు. ప్రపంచానికి ఆధార సూత్రం అంధశక్తి (Blind force) కాదు; అది నిత్య సృజనాత్మకమైన ప్రాణశక్తి. అదే విశ్వ పరిణామానికి, జీవ పరిణామానికి కారణం. బెర్గ్‌సన్ సిద్ధాంతం ప్రకారం అసలు సత్యం ప్రాణశక్తే. అందుచేత ఒక విధంగా అతడు అద్వైతి (monist). అయితే మరి, భౌతిక పదార్థం ఎక్కడినుంచి వచ్చింది? మేటర్‌ను బెర్గ్‌సన్ తిరస్కరించలేదు. ప్రాణశక్తే భౌతిక పదార్థాన్ని తన అవసరం నిమిత్తం సృజించింది. భౌతిక ప్రపంచం అంతా ప్రాణశక్తి లీల. అందుచేత మరొక విధంగా బెర్గ్‌సన్ ద్వైతి (dualist) కూడా. అయితే, అతడిని ఒకరకం "విశిష్టాద్వైతి"గా వర్ణించాలి.

ఇది బెర్గ్‌సన్ తాత్విక సిద్ధాంతంలోని ఒకానొక ముఖ్యాంశం. పరిణామం అంధ శక్తిచేత చోదితమయినది కాదని, ప్రాణశక్తిచేత ప్రేరితమని, అది యాంత్రిక మయిన పరిణామం కాక, అడుగడుగునా నూతనత్వాన్ని ఆవిష్కరించే సృజనాత్మక పరిణామమని అతడు భావించాడు. కనుకనే, అతని సిద్ధాంతాన్ని సృజనాత్మక పరిణామ వాదం (creative evolution) అంటారు.

## జీవిత విశేషాలు

బెర్గ్‌సన్ 1859 లో పారిస్‌లో జన్మించాడు. అతని తండ్రి పోలిష్ జాతీయుడు, యూదు మతస్థుడు. తల్లి ఐరిష్ జాతీయురాలు, కాథలిక్ మతస్థురాలు. తండ్రి సంగీతకారుడు. ధనిక కుటుంబానికి చెందినవాడు.

హెన్రీ బెర్గ్‌సన్ చిన్నతనంలో విద్యాభ్యాస మంతా పారిస్‌లోనే సాగింది. తన 19 వ ఏట ఇకోల్ నార్మెల్ సుపీరియర్ అనే విద్యాసంస్థలో విద్యార్థిగా చేరాడు. అది టీచర్లకు శిక్షణ ఇచ్చే సంస్థ. 1878 నుంచి 1881 వరకు అక్కడ విద్యార్థిగా వున్నాడు. అతనికి ఆసక్తిలేని విషయం లేదు. సైన్సులు, కళలు, సాహిత్యం అన్నీ ఇష్టమే. గణితశాస్త్రంలో అతడిని జీనియస్‌గా పరిగణించేవారు. గ్రీకు, లాటిన్ సాహిత్యాలు కాచి వడపోశాడు.

ఆ విద్యా సంస్థలో పట్టభద్రుడైన తర్వాత 1881 నుంచి 1883 వరకు ఫ్రాన్సులో వేర్వేరుచోట్ల ఉపాధ్యాయుడుగా పనిచేశాడు. 1883 నుంచి 1888 వరకు క్లెర్మాంట్--ఫెరాండ్ అనే పట్టణంలో ఒక సంస్థలో లెక్చరరుగా కుదురుకున్నాడు. ఆ సంస్థలో పని చేస్తుండగానే అతనిలో పరివర్తన కలిగింది.

అప్పటివరకు అతడు బ్రిటిష్ తాత్వికుడైన హెర్బర్ట్ స్పెన్సర్ అభిమాని; భౌతిక వాది. కాని, ఆలోచించినకొద్దీ అతనిలో భౌతికవాదంపట్ల విశ్వాసం సడలిపోసాగింది. సందేహాలు పీడించసాగాయి. అతడు వున్నది చిన్న పట్టణం. ఊరి వెలుపల ప్రశాంత ప్రకృతి పరిసరాలలో ఒంటరిగా చాలా దూరం నడుస్తూ వుండేవాడు. అతనిది ద్వంద్వ ప్రవృత్తి. అతడు సగం కవి, సగం శాస్త్రజ్ఞుడు. "టూ కల్చర్స్" అనే తన గ్రంథంలో సి.పి.స్నో సాహిత్యం, విజ్ఞాన శాస్త్రం రెండు వేర్వేరు ప్రపంచాలని, దానికి, దీనికి పొసగదని, సాహిత్యకారులకు, శాస్త్రకారులకు మధ్య పరస్పరావగాహన కుదరని వ్యవహారమని వాదించాడు.

కాని, హెన్రీ బెర్గ్‌సన్‌కు ఈ వైరుధ్యం వర్తించదు. అతనిలో కవి లక్షణాలు, శాస్త్రజ్ఞుడి లక్షణాలు సమానంగా వున్నాయి. అతడు గొప్ప భావుకుడు. అదే సమయంలో గొప్ప మేధానైశిత్యం, విశ్లేషణ శక్తి కల హేతువాది, తార్కికుడు.

ఒంటరిగా, ఆలోచనలలో మునిగి నడుస్తున్నప్పుడు, చుట్టూ పరుచుకున్న ప్రకృతి రామణీయకాన్ని చూసి అతడు కవి వలె పరవశించేవాడు. ఇలా పరవశించే గుణం, ఈ సౌందర్యాస్వాదన శక్తి కేవలం భౌతిక అణువుల కలయికతో ఏర్పడిన మానవునికి, అతని మెదడుకు ఎలా కలిగింది? సూర్యాస్తమయ సమయంలో ఆకాశం అంత అందంగా ఎందుకుంటుంది? ఈ కొండలు, చెట్లు, పచ్చని పచ్చిక, కిలకిలా రావాలు చేసే పక్షులు, సెలయేటి ముర్మర సంగీతం--ఇవన్నీ ఏమిటి? ఈ సుందర ప్రకృతి అంతా కేవలం అణువుల కలయికతో ఏర్పడినదేనా! అస్తమయ సూర్యుని రంగుల హొరంగును శాస్త్రజ్ఞుడు విశ్లేషిస్తే ఏమి మిగులుతుంది? అవి వేర్వేరు పొడుగులలో వున్న విద్యుదయస్కాంత తరంగాలు (electro-magnetic waves) అని మాత్రం తేలుతుంది. ఆ తరంగాలకు అందం ప్రసక్తి ఎక్కడ? గులాబీ పువ్వు అంత అందంగా ఎందుకుంటుంది? దాని అందం ఎక్కడున్నదో చూడాలని, రేకులన్నీ తుంచి చూస్తే చివరికి గులాబీ పువ్వే మిగలదు. మధురగానాన్ని శాస్త్రరీత్యా విశ్లేషిస్తే పొట్టి, పొడుగు శబ్ద తరంగాలు మాత్రమే మనకి లభిస్తాయి. మాధుర్యం మాయమైపోతుంది. మైక్రోస్కోపు క్రింద ఒక పురుగును పెట్టి చూస్తే దాని ప్రతి అవయవం కొన్ని రెట్లు పెద్దగిగా కనిపిస్తుంది తప్ప దాని అసలు రూపం కనబడదు. మైక్రోస్కోపును అవతలపెట్టి చూస్తేనే పురుగు మొత్తంగా కనిపిస్తుంది.

విజ్ఞానశాస్త్రం చేసే పని ఇదే. ఏ వస్తువును సంపూర్ణ స్వరూపంతో చూపించదు. ఏ భాగానికి ఆ భాగాన్ని వేరుచేసి, దాన్ని మాత్రం పరీక్షించి చూపిస్తుంది. సైన్సు పద్ధతి విభజన, వేరుసేత– abstraction. అది వస్తువును మొత్తంగా చూపదు; భాగాలుగా చూపిస్తుంది. అందుచేత అసలు వస్తువును తెలుసుకొనడానికి విజ్ఞాన శాస్త్రం సరైన మార్గం కాదు. విజ్ఞానశాస్త్రం బుద్ధి (intellect)తో, హేతువు (reasoning)తో పనిచేస్తుంది. సత్య దర్శనానికి ఇవి పనికిరావు. వస్తువును మొత్తంగా చూసి స్వీకరించాలి. అది "అంతర్బుద్ధి" (intuition) వల్లనే సాధ్యమవుతుంది.

క్లెర్మాంట్–ఫెరాండ్ అనే పట్టణంలో పనిచేస్తున్న రోజులలో బెర్గ్‌సన్ ఇటువంటి భావాలకు లోనై తన భౌతికవాదాన్ని, సంశయవాదాన్ని (skepticism) విడనాడి, క్రమంగా భావవాదిగా మారిపోయాడు. ఆ తర్వాత కొద్దికాలానికే-1889లో- అతడు "టైమ్ అండ్ ఫ్రీ విల్" (Time and Free will) అనే సిద్ధాంత గ్రంథం వ్రాశాడు. దానితో అతనికి డాక్టరేట్ వచ్చింది. పారిస్ తిరిగివచ్చాడు. 1891 లో అతడు ఇంతకుముందు పేర్కొన్న ప్రఖ్యాత నవలా రచయిత మార్సెల్ ప్రూస్ట్ దగ్గరి బంధువు ఒకామెను వివాహం చేసుకున్నాడు. తన మొదటి గ్రంథంలోని సిద్ధాంతాన్ని విపులీకరిస్తూ 1891 లో "మేటర్ అండ్ మెమొరీ"(Matter and Memory) అనే గ్రంథం వ్రాశాడు. తాను చిన్ననాడు చదువుకున్న ఇకోల్ నార్మల్ సుపీరియర్‌లో 1897 లో ఆచార్యుడుగా చేరాడు. ఆ పిదప 1900 లో ఆనాడు ఫ్రాన్సులో కెల్లా గొప్ప విద్యా సంస్థగా పేరొందిన కాలేజ్ డి ఫ్రాన్స్‌లో ఆచార్యత్వం స్వీకరించాడు. నాటినుంచి సుమారుగా 1914 వరకు యూరోపియన్ తాత్విక ప్రపంచంలో బెర్గ్‌సన్ శకం. అతడు మహావక్త. ఎంత సంక్లిష్ట విషయమైనా సరళ శైలిలో, సుందరంగా విశదీకరించేవాడు. అతనిది అనర్గళ వాగ్ధోరణి. ఉపమాలంకారాలు, దృష్టాంతాలు ఒక వరద వలె వాటంతట అవి వచ్చిపడేవి. అందమైన సమాసాల కల్పనలో అతడు అందె వేసిన చేయి. అతడు పాఠాలు చెబుతుంటే విద్యార్థులు, ఉపన్యాసాలిస్తుంటే సభాసదులు మంత్రముగ్ధసర్పాలవలె మైమరచిపోయి వినేవారట. భాషపై, భావ వ్యక్తీకరణపై అతని ప్రభుత్వం అటువంటిది. అతని గ్రంథా లన్నిటిలోకి ముఖ్యమైనది "క్రియేటివ్ ఇవల్యూషన్" (Creative Evolution) 1907 లో వెలువడింది. (దాని ప్రభావంతోనే బెర్నార్డ్ షా తన ప్రఖ్యాత నాటక చక్రం (Back to Methuselah) వ్రాశాడని ఇంతకుముందు పేర్కొనబడింది.)

అతడు తాత్వికుడైనా, తత్వ శాస్త్రాధ్యాపకుడైనా లౌకిక వ్యవహారాలలో

ఆసక్తిని వదలుకోలేదు. ప్రథమ ప్రపంచ యుద్ధకాలంలో ఫ్రెంచి ప్రభుత్వం పుర మాయించగా కొన్ని దౌత్య వ్యవహారాలు నడిపాడు. ఆ సందర్భంలో అమెరికా కూడా వెళ్లాడు. 1915 లో అతడు ఫ్రెంచి అకాడెమీ సభ్యుడయ్యాడు. 1927 లో అతనికి నోబెల్ సాహిత్య బహుమతి లభించింది. అతని తాత్విక గ్రంథాలు ఎంత సాహిత్య గౌరవం సంపాదించుకున్నాయో దీన్నిబట్టే గ్రహించవచ్చు.

ద్వితీయ ప్రపంచ యుద్ధ కాలానికి అతడు బాగా వృద్ధుడైపోయాడు. అతనికి కాథలిక్ మతంపై నమ్మకం కలిగింది. ఆ మతం స్వీకరించా లనుకున్నాడు గాని, ఆ రోజులలో ఫ్రాన్సు నాజీ ఆక్రమణ క్రింద వున్నది. యూదులపై హింసాకాండ ముమ్మరంగా జరుగుతున్నది. అది తప్పించుకొనడానికే మతం మార్చుకున్నాడనే అపనింద తనకు రాగలదనే భయంతో చివరివరకు అతడు యూదుగానే వుండిపోయాడు. అతడు మరికొన్ని వారాలకు చనిపోతాడనగా యూదు మతస్థులైన ప్రొఫెసర్లను ఆనాటి విచీ ప్రభుత్వం ఉద్యోగాలకు రాజీనామా ఇవ్వాలని శాసించింది. కాని, ప్రపంచ ప్రఖ్యాతిపొందిన బెర్గ్‌సన్‌ను మాత్రం ఈ శాసనం నుంచి మినహాయించారు. అయినా, ఈ మినహాయింపును అతడు నిరాకరించి తాను కూడా రాజీనామా చేశాడు. పూర్ణ వృద్ధాప్యంలో 1941 లో అతడు కన్నుమూశాడు.

# బెర్గ్‌సన్ నిర్వచించిన కాలజ్ఞానం

బెర్గ్‌సన్‌ను "ఫిలాసఫర్ ఆఫ్ ప్రొసెస్" అంటారు. "ప్రొసెస్" అంటే ఇక్కడ 'పరివర్తన క్రమం'. అతనిది పరివర్తన వాదం (Philosophy of Change.)

తత్వవేత్తలలో అధిక సంఖ్యాకులు "సత్" (being)ను గురించే వివేచించారు. ప్రపంచంలో మార్పువున్న మాట నిజమే. మార్పు లేనిదే ప్రపంచం లేదు. ప్రతిదీ మారుతున్నది; క్షణక్షణం మారుతున్నది.

అయితే, నిరంతరంగా జరిగే ఈ మార్పునకు ఆధారభూతంగా మార్పులేనిది, మారనిది ఏదో వుంది. అది తాను మారకుండా, మార్పునకు కారణమవుతున్నది. అదే "సత్" (Pure being, Pure existence). దానికోసమే తత్వవేత్తల నిరంతరాన్వేషణ.

సత్‌ను, లేదా అన్నిటికి ఆధారభూతమైన అంతిమ సత్యాన్ని పాశ్చాత్య తత్వవేత్తలలో ఒక్కొక్కరు ఒక్కొక్క విధంగా భావించారు, దర్శించారు. వారి విభిన్న దర్శనాలను "విశ్వదర్శనం"లోని వివిధ అధ్యాయాలలో తెలుసుకున్నాము. ఉదాహరణకు ఒకరు అన్నిటికి మూలం నీరు అన్నారు. మరొకరు వాయువు

అన్నారు. ఒకరు అగ్ని అన్నారు. ఒకరు కేవల భావం అన్నారు. ఇలా ఎన్నో విభిన్న వాదాలు!

బెర్గ్‌సన్ ఈ వాదాలన్నిటికి వ్యతిరేకి. నిత్య, నిరంతర పరివర్తన అడుగున పరివర్తనకు అతీతమైన "సత్" పదార్థం ఏదో వున్నదనే వాదాన్ని అతడు తిరస్కరించాడు.

ప్రపంచంలో మార్పు తప్ప మరేమీ లేదని, మార్పు ఒక్కటే సత్యమని అతని వాదం. అతని దృష్టిలో ఒక వస్తువు మరొక వస్తువుగా మారడం అనేది లేదు. పరివర్తన చెందే వస్తువు, పరివర్తిత వస్తువు—మారేది, మార్పించేదీ—అంటూ లేవని బెర్గ్‌సన్ అంటాడు. ఉన్నదల్లా మార్పు ఒక్కటే. "బీయింగ్" (being) అనేది లేదు. "బికమింగ్" (becoming) ఒక్కడే వుంది.

ఇది కొంచెం విచిత్రమైన వాదమే. వితండ వాదంగా కూడా కనిపిస్తుంది. మారే వస్తువు లేకుండా మార్పు మాత్రమే వుండడం ఎలా సాధ్యం?

అయితే, ఇది "సత్" అనే భావం కంటె విచిత్రం కాదేమో ! సత్ అంటే "ప్యూర్ ఎగ్జిస్టెన్స్" (Pure existence). అంటే ఉనికి గల వస్తువనేది లేకుండా కేవలమైన ఉనికి, అనపేక్షమైన అస్తిత్వం. కొందరి దృష్టిలో ఇటువంటి "సత్" సాధ్యమైనప్పుడు, బెర్గ్‌సన్ చెప్పిన కేవలమైన, అనపేక్షమైన పరివర్తన (Pure becoming) వుండడం ఎందుకు సాధ్యం కాదు?

ఇటువంటి సిద్ధాంతమే పూర్వకాలంలో గ్రీకు తత్వవేత్త హెరాక్లిటస్ చేశాడని ఇంతకు ముందు 6వ అధ్యాయంలో చదివాము. మరొక గ్రీకు తత్వవేత్త పార్మెనిడీస్ (7వ అధ్యాయం) లోకంలో మార్పు, చలనం అనేవి లేవని, నిత్య, స్తబ్దత మాత్రమే సత్యమని వాదించాడు. కాగా, హెరాక్లిటస్ ఆ వాదాన్ని ఖండిస్తూ మార్పు (change) మాత్రమే నిత్యమని, సత్యమని ప్రతిపాదించాడు. ఏ వ్యక్తీ ఒకే నదిలో రెండుసార్లు స్నానం చేయలేడన్నది అతని ప్రసిద్ధ వాక్యాలలో ఒకటి. నది నిరంతరం ప్రవహిస్తూనే వుంటుంది. మొదట స్నానం చేసినప్పటి నీరు కొట్టుకుపోయి, దాని స్థానంలోకి కొత్తనీరు వచ్చి చేరుతుంది. ఎప్పటి కప్పుడు నీరు మారిపోతుంది. అంటే నది మారిపోతుంది. అంటే ఇంతకు ముందు స్నానం చేసిన నది ఇప్పుడు లేదు. ఒకవేళ ఆ నీరు కదలనట్టు కనిపించినా, మొదటిసారి స్నానం చేసినప్పటికి, రెండవసారి చేసినప్పటికి, కొంతకాలం గడిచింది కదా? అందుచేత మొదటిసారి స్నానం చేసిన నది కొంతకాలం క్రిందటిది. రెండవసారి స్నానం చేసినది కొంతకాలం తర్వాతది. ఆ రెండూ ఒకటి కావు.

ఈ వాదాన్నే బెర్గ్‌సన్ అనుసరించాడు. మారేదీ మార్పించేదీ లేదని, మార్పు మాత్రమే వుందని అంటూ మార్పును ప్రవాహం (flux, flow)తో పోల్చాడు.

అయితే, మరి మనచుట్టూ ప్రపంచం మారనట్టుగా కనిపిస్తుందేం? నేను కూర్చున్న కుర్చీ, నా ఎదుట బల్ల నిన్న ఎలా వున్నాయో నేడూ అలాగే వున్నాయి. అలాగే నా చుట్టూ ప్రకృతి, సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు--ఇవన్నీ ఏ కొద్దిగానో మారినా, తాము తాముగానే కొనసాగుతున్నాయి కదా అని ప్రశ్నించవచ్చు.

దానికొకటే కారణం : మనం ప్రపంచాన్ని స్థానిక దృష్టి (spatial terms)తో చూస్తున్నాము. కాని, స్థలం (space) ఎంత నిజమో, కాలం (time) కూడా అంతే నిజం. స్థలంలో మార్పు లేనట్టు, చలనం లేనట్టు కనబడవచ్చు. కాని, కాలంలో మార్పు స్పష్టంగా కనిపిస్తుంది. కాలం నదీ ప్రవాహం లాంటిది. అది క్షణక్షణం మారుతుంది, ముందుకు సాగుతుంది; గడుస్తుంది, నడుస్తుంది. ఈ మార్పే కాలం. కాలమే మార్పు.

ఈ కాలం రెండు రకాలయినది. ఒకటి బాహిరమైన, భౌతికమైన కాలం. రెండవది ఆంతరమైన, మానసికమైన కాలం. మొదటి రకం కాలం గడియారంలో ముల్ల కదలికనుబట్టి తెలుస్తుంది. లేదా రాత్రింబవళ్ల మార్పు, ఋతుచక్ర భ్రమణంవల్ల తెలుస్తుంది. అది సైంటిఫిక్ టైమ్, మేథమేటికల్ టైమ్, మెకానికల్ టైమ్. అది మనం కృత్రిమంగా గంటలు, నిమిషాలు, సెకండ్లు అని విభజించిన కాలం. అది వట్టి కల్పితకాలం. ఎందుకంటే--మన నిత్య వ్యవహారం కోసం ఇది ఒక సెకండు, ఇది రెండవ సెకండు, ఇది మూడవ సెకండు అని మనం కాలాన్ని ముక్కలుగా విడగొడుతున్నాము. నిజానికి ఒకటవ సెకండుకు, రెండవ సెకండుకు మధ్య ఏమున్నది? అర సెకండు వున్నది. ఒకటవ అర సెకండుకు, రెండవ అర సెకండుకు మధ్య? పావు సెకండు. ఇలా సెకండును అంతంగా విభజించుకుంటూ పోవచ్చు. (పార్మెనిడీస్ శిష్యుడు జీనో ఇలాగే ప్రపంచంలో చలనం అనేది లేదని వాదిస్తూ కదులుతున్న బాణం కదలడం లేదని నిరూపించడానికి ప్రయత్నించాడు) నిజానికి అది శుష్క ప్రయాస. కాలం అనేది ఒక నైరంతర్యం, (Continuity), ఒక ప్రవాహం (flux). అది 'ఎప్పుడు నెడతెగకపారు' ఏరులాంటిది.

అందుచేతనే గంటలు, నిమిషాలు, సెకండ్లు, రోజులు, సంవత్సరాలు మొదలైనవిగా మనం విభజించే కాలం కృత్రిమమైనది, కల్పితమైనది. అది

అసలు కాలం కాదు. కాలాన్ని అవిచ్ఛిన్నమైనదిగా భావించుకుంటే మనకు దైనం దిన వ్యవహారాలు జరగవు. కనుక, మన అవసరార్థం ఈ కృత్రిమ విభజన చేసుకున్నాము.

అసలైన కాలం (real time) అంతర్గతమైనదని బెర్గ్‌సన్ అంటాడు. అది మానసికం కూడా. అంటే అది మన మనస్సుకే అనుభవైకవేద్యమైన కాలం. అదే మనకు "గడుస్తూండడం" గా అనుభవంలోకి వస్తుంది. దానికి బెర్గ్‌సన్ డ్యూరేషన్ (duration) అని పేరు పెట్టాడు. దీనికి సరియైన తెలుగు మాట నాకు తోచినంతవరకు "కాల గమనం". అంటే "కాలం గడుస్తూ వుండడం". దాన్ని "అవిరామత్వం" అని కూడా అనవచ్చు. అందులో ఫుల్‌స్టాపులు, సెమికోలన్లు, కామాలవలె, గంటలు, నిమిషాలు, సెకండ్లు మొదలైన విరామ చిహ్నాలు లేవు. ఆ విధంగా దాన్ని విభజించడానికి వీలులేదు. అది ప్రవాహ సదృశం, అవిచ్ఛిన్నం, అవిభాజ్యం.

అయితే, అది ఉపరితలం మాత్రమేవున్న నదిలాంటిది కాదు. కాలప్ర వాహం అంటే ఇప్పుడు ఈ క్షణంలో నడుస్తూ వుండడం, గడుస్తూ వుండడం ఒక్కటే దాని లక్షణం కాదు. దాని అడుగున నదీ గర్భం (river bed) వలె గతించిన కాలం అంతా రాశీభూతం (accumulation)గా నిక్షిప్తమై వుంటుంది. కాలం గతిస్తున్నకొద్దీ కాలరాశి (accumulated time) పెరుగుతుంది. అందుచేత భూతకాలం (past) అంటే రాశీభూత కాలం (accumulated time) కూడా.

ఈ రాశీభూతకాలం జ్ఞాపకాల (memory) రూపంలో భద్రపరచబడి వుంటుంది. బాహిరమైన యాంత్రిక కాలంలో జ్ఞాపకం అనేది వుండదు. ఒక క్షణం తర్వాత మరొక క్షణం వస్తుంది. భౌతిక కాలం (physical time) అనేది క్షణాల పరంపర, క్షణాల దొంతర. అది వింటికి సంధించిన బాణం వలె (arrow of time) ఒకే దిశలో ముందుకే పోతుంది. "గతము గతంబె ఎన్నటికి కన్నుల గట్టదు." అన్నట్టు పోయిన క్షణాలు వెనక్కి తిరిగి రావు. కాని, మానసిక కాలం (mental time) అలా కాదు. అది జ్ఞాపకాల రూపంలో వెనక్కి, ఊహల రూపంలో ముందుకు, డ్యూరేషన్ రూపంలో వర్తమానంలోకి, ఎటుపడితే అటు కదులుతుంది. మనం మనస్సు అట్టడుగు పొరలలో వున్న జ్ఞాపకాలనైనా సరే, మన నిత్య వ్యవహారానికి అవసరమైన ప్పుడు, అవసరమైనవాటిని, పైకి తవ్వి తీసుకువచ్చి ఉపయోగించుకుంటాము.

బెర్గ్‌సన్ మార్పు అనేదాన్ని అంతిమ, పరమ సత్యంగా భావించాడని అను కున్నాము కదా? ఈ మార్పు అవస్థా భేదాన్ని బట్టి విభిన్న విధాలుగా

వ్యక్తమవుతుంది. నిరంతరం మారుతూవుండేది కాలం. కనుక మార్పేకాలం, లేదా డ్యూరేషన్. మనస్సు (mind) అంటే ఆలోచనల సమూహం. అది ఎప్పుడూ నిశ్చలంగా వుండదు. అందుచేత మార్పు అనేది మనస్సు కూడా. మనస్సు పనిచేస్తున్నంతసేపు చైతన్యం (consciousness) వుంటుంది. అంటే "నేను" అనే స్పృహ వుంటుంది. అందుచేత మార్పే చైతన్య ప్రవంతి. కనుక మార్పు, కాలం, కాలగమనం (డ్యూరేషన్) మనస్సు, చైతన్యం ఇవన్నీ ఒకటే. వీటిని బుద్ధి (intellect) ద్వారా, లేదా వివేచన (reasoning) ద్వారా, తర్కం (logic) ద్వారా తెలుసుకోలేము. నేరుగా ప్రత్యక్ష జ్ఞానం ద్వారానే, అపరోక్షానుభూతి ద్వారానే తెలుసుకుంటాము. ఈ ప్రత్యక్ష జ్ఞానాన్నే బెర్గ్‌సన్ "ఇంట్యూషన్" (intuition) అన్నాడు. అంతిమ సత్యమైన మార్పును ప్రత్యక్ష జ్ఞానం ద్వారానే తెలుసుకుంటాము కనుక, ప్రత్యక్ష జ్ఞానం–ఇంట్యూషన్– కూడా మార్పు యొక్క మరొక రూపమే.

మార్పు యొక్క వేరొక రూపం జీవశక్తి (Life Force). దీన్నే బెర్గ్‌సన్ "ఇలాన్ వైటల్" (Elan Vital) అన్నాడు. ఇది కూడా నిరంతర ప్రవాహ సదృశమైనది. అది నిత్య పరిణామ స్వభావం కలిగినది. అందుచేత జీవశక్తి కూడా అంతిమ సత్యం, కేవల సత్యం. నిజానికి అదే అన్నింటికి ఆధారభూతమైన సత్యం.

మరి ఈ పరిణామ స్వభావంగల జీవశక్తి (Life Force) ఒకటే సత్యమైనప్పుడు ఈ భౌతిక ప్రపంచం అంతా ఎక్కడినుంచి వచ్చింది? ఎలా వచ్చింది? మన భౌతిక కాయం, ఇతర మానవుల భౌతిక కాయాలు, మన చుట్టూ వున్న ఈ భౌతిక వస్తువులు, కొండలు, నదులు, సూర్య, చంద్ర, నక్షత్రాలు- ఈ ప్రకృతి- ఇదంతా ఏమిటి? ఇవన్నీ మాయా? భ్రమా?

ఇవన్నీ మన బుద్ధి (intellect) కల్పించినవే నంటాడు బెర్గ్‌సన్. అయితే, బుద్ధిచేత కల్పితమైనవే అయినా, అవన్నీ నిజంగా వున్న వంటాడు.

బెర్గ్‌సన్ దృష్టిలో జీవశక్తి అనేది ప్రాథమికం (primary). భౌతిక పదార్థం (మేటర్) అనేది ద్వితీయకం (secondary). జీవశక్తి నిరంతర సృజనాత్మక పరిణామ శీలమైనది. అది తన ఆత్మ సాక్షాత్కారం కోసం, స్వేచ్ఛ (freedom) కోసం ఒక సాధనంగా, తనకు ఒక వాహనం (vehicle)గా భౌతిక పదార్థాన్ని సృష్టించింది. బహుశా హెగెల్ చెప్పిన డయలెక్టికల్ పద్ధతిలో– ప్రతివాదం (థీసిస్) తనకు విరుద్ధమైన ప్రతివాదాన్ని (యాంటీ థీసిస్) సృష్టించుకున్నట్టు– జీవశక్తి తనకు విరుద్ధమైన భౌతిక పదార్థాన్ని సృష్టించుకుని వుండాలి. ఈ

రెండింటి మధ్య వైరుధ్యమే (contradiction) సృజనాత్మక పరిణామంగా భాసి స్తుంది. అందుచేత నాణానికి ఒకవైపు జీవశక్తి అయితే, రెండవవైపు భౌతిక పదార్థం. నాణానికి ఒకేవైపు వుండడం అసంభవమైనట్టు జీవశక్తి, భౌతిక పదార్థం రెండూ మొదటి నుంచి వుండే వుండవచ్చు. ఆ రెండింటి మధ్య నిరంతర సంఘర్షణే సృజనాత్మక పరిణామం.

# సృజనాత్మక పరిణామ వాదం

"ఏకాకి న రమతే – స ద్వితీయ మైచ్ఛత్..." అని బృహదారణ్యకోపనిషత్తు.

ఒంటరిగా వున్నవాడు సుఖించలేడు. జంటను కోరుతాడు.

బెర్గ్‌సన్ వాదం ప్రకారం ఉన్నది జీవశక్తి–ఇలాన్ వైటల్–ఒక్కటే. అది తప్ప మరేమీ లేదు.

కాని, "ఇలాన్" అంటే అసలు అర్థం బలంగా ముందుకు చొచ్చుకుపోయే శక్తి. "ఇలాన్ వైటల్" అంటే జీవం ఇంకా ఇంకా ముందుకు, పైపైకి చొచ్చుకుని, ఛేదించుకుని, పెల్లుబుకుతూ, పురోగమించే శక్తి. "ఇలాన్ వైటల్"ను ఇంగ్లీషులో "లైఫ్ ఫోర్స్" అని మనం తెలుగులో "జీవశక్తి" అని తర్జుమా చేస్తున్నప్పటికి ఆ మాటకు సరైన తర్జుమా "జీవోద్గమన శక్తి" అంటే జీవం బలంగా ముందుకు, పైకి చొచ్చుకుని, చేదించుకుని రావడం.

అలా చొచ్చుకుపోవడం మామూలుగా, అప్రయత్నంగా జరిగే పని కాదు కదా? దానికి శక్తిని ఉపయోగించాలి. శక్తిని ఎప్పుడు ఉపయోగిస్తాము? ప్రతిఘటించేది ఏదో వున్నప్పుడే శక్తిని ఉపయోగిస్తాము? కనుక జీవోద్గమనాన్ని ప్రతిఘటించేది ఏదో వున్నదన్నమాట. అదే భౌతిక పదార్థం (మేటర్) జీవం తన ఉద్గమనానికి అడ్డుపడే వస్తువును తొలగించుకుని, తన శక్తిని, తన స్వేచ్ఛను నిరూపించుకొనడానికి గాను తానే– మనం భౌతిక పదార్థంగా వ్యవహరించే ప్రతిఘటనను సృష్టించుకున్నది. ఆ విధంగా తనకు ప్రతిఘటనను తానే సృష్టించుకోవడం జీవశక్తి మౌలిక స్వభావంగా మనం భావించవచ్చు. ప్రతిఘటన లేవిదే ముందుకు చొచ్చుకుని (thrusting forward) పోలాలనే ఇచ్ఛ నెరవేరదు. ఆ ఇచ్ఛాపూర్తి కోసం జీవశక్తి జడపదార్థాన్ని (inert matter) సృష్టించింది. అంటే జీవశక్తి ఎప్పుడైతే వుందో దానికి విరుద్ధ (anti thesis) స్వభావం గల జడపదార్థం కూడా అప్పుడే వున్నదన్నమాట. దానివలె ఇది కూడా అనాది.

ఆ రెండింటి మధ్య– జీవశక్తి, దాన్ని ప్రతిఘటించే జడపదార్థం మధ్య–

సంఘర్షణ కూడా అనాది. తనను ప్రతిఘటించే జడపదార్థపు సంకెళ్లనుంచివిము క్తమై సంపూర్ణ స్వేచ్ఛ పొందాలని జీవశక్తి నిరంతరం ప్రయత్నిస్తూ వుంటుంది. ఆ ప్రయత్నం పూర్తిగా సఫలం కాలేదనడానికి నిదర్శనం మనచుట్టూ వున్న స్తబ్ధ, భౌతిక ప్రపంచం. అయితే, ఆ ప్రయత్నం పూర్తిగా విఫలం కూడా కాలేదనడానికి నిదర్శనం నిర్జీవ, భౌతిక పదార్థాన్ని పెళ్లగించుకుని అనంతమైన వైవిధ్యంతో అవిర్భవించిన జీవరాసులు. అవి అంతకంతకు ఉన్నతమైన దశలకు పరిణామం చెందడం, ఆ పరిణామంలో భాగంగా ఒకవైపు సహజాతాలను (instincts), మరొక వైపు బుద్ధి (Intellect)ని పెంపొందించుకోవడం, ఈ రెండింటి సహాయంతో తన నిరంతర పురోగమన యాత్రను సాగించడం జీవశక్తి విజయానికి నిదర్శనాలు.

## అగ్ర తాంబూలం

అయితే, సహజాతం (instinct), బుద్ధి (Intellect) అనే రెండింటిలో బెర్గ్‌సన్ సహజాతానికే అగ్రతాంబూలమిచ్చాడు. దానికంటె తక్కువ స్థాయికి చెందినది బుద్ధి. నిత్య వ్యవహారంలో బుద్ధి అవసరమైనప్పటికీ, ఉపయోగకరమైనప్పటికీ, అది సంపూర్ణ సత్య సందర్శనకు అనువైన సాధనం కాదు. పైగా అది సంపూర్ణ సత్యాన్ని మరుగు పరుస్తుంది. బుద్ధి అసలుసత్యాన్ని మనకు కనబడనివ్వదు.

ఏది అసలు సత్యం అంటే ఇంతకు ముందు మనం చెప్పుకున్న నిరంతర పరివర్తన, చైతన్య స్రవంతి. ఈ స్రవంతిని బుద్ధి స్తబ్ధ స్థితులుగా విడగొట్టి చూపిస్తుంది. చైతన్య ప్రవంతిని, లేదా జీవశక్తిని మనం ప్రత్యక్షజ్ఞానం (intuition) ద్వారా గ్రహిస్తాము. కాగా, దానికి వ్యతిరేకమైన బాహ్య, భౌతిక ప్రపంచాన్ని స్తబ్ధ స్థితులుగా, జడ పదార్థాలుగా వివిధ, విభిన్న వస్తువులుగా విడగొట్టి ఒక భ్రాంతిమయ దృశ్యాన్ని చూపించేది బుద్ధి.

## సినీ కెమేరా

బుద్ధిని బెర్గ్‌సన్ సినీ కెమేరాతో పోల్చాడు. సినీ కెమేరా కదులుతున్న వస్తువులను ఫోటో తీస్తుంది. వస్తు చలనాన్ని సెకండుకు పదహారు ఫ్రేములుగా విడగొట్టి పదహారు ఫోటోలు తీస్తుంది. ఏ ఒక్క ఫ్రేమును చూచినా దానిలో మనకు వస్తు చలనం కనిపించదు. కదలని బొమ్మ మాత్రమే కనిపిస్తుంది. కాని, అదే ఫిలిమ్‌ను సినీ ప్రొజెక్టరు మీదికి ఎక్కించి, సెకండుకు పదహారు

ఫ్రేముల వేగంతో తిరిగేటట్టు చేసి, తెరపై బొమ్మ పడేటట్టు ఫోకస్ చేస్తే తిరిగి వస్తు చలనం కనిపిస్తుంది. కదిలే బొమ్మలు కనిపిస్తాయి.

ఇందులో ఏది నిజం? వస్తు చలనమా, చలన రాహిత్యమా?

వస్తు చలనమే నిజం. చలిస్తున్న వస్తువునే సినీ కెమేరా ఫోటోలు తీసింది. అయితే, వస్తు చలనాన్ని కొన్ని స్తబ్ధ స్థితులుగా విడగొట్టి ఫోటో తీసింది. తిరిగి ప్రొజెక్టరు ద్వారా చలనం కలిగిస్తే ఆ స్తబ్ధ దృశ్యాలు చలనచిత్రాలుగా ప్రత్యక్షమవుతాయి.

బుద్ధి అనేది సినీ కెమేరాను పోలినది. చలనం, మార్పు తప్ప మరేమీ లేని జీవశక్తిని బుద్ధి స్తబ్ధ, జడపదార్థంగా, ఆ పదార్థాన్ని విభిన్న వస్తువులుగా పృథక్కరించి (Separate) చూపిస్తుంది.

జీవశక్తి నిత్య పరిణామశీలమైనది కదా? దాని పరిణామానికి స్తబ్ధ, భౌతిక పదార్థం అడుగడుగునా అడ్డు తగులుతుంది. జీవశక్తి పురోగమన స్వభావం కలిగినది. కాగా, జడ పదార్థం తిరోగమన స్వభావం కలిగినది. జీవశక్తి ముందుకుపోతుంటే, జడ పదార్థం వెనక్కి లాగుతుంది. జీవశక్తి పైకి పోతుంటే, జడపదార్థం కిందికి గుంజుతుంది. ఈ నిత్య సంఘర్షణలో నుంచే జీవ పరిణామం సిద్ధిస్తుంది.

బెర్గ్‌సన్ వస్తుతః శాస్త్రవేత్త అయినా, తన తత్వ సిద్ధాంతాలను వివరించడానికి ఎన్నుకున్న దృష్టాంతాలన్నీ తర్కేతర కావ్య భాషలో వుంటాయి. అతని ఫ్రెంచి శైలి సౌందర్యాన్ని, భావనాశక్తిని మెచ్చుకోని వ్యాఖ్యాత లేడు. అతని సిద్ధాంతాలను కొంచెమైనా అంగీకరించలేని వారు కూడా భాషపై, భావనపై అతని ప్రభుతకు జోహార్లు పలుకుతారు.

బెర్గ్‌సన్ తన భావాలను ఎక్కువగా ఉపమాలంకారాల సహాయంతో వివరిస్తాడు. ఉదాహరణకు జీవ పరిణామాన్ని బెర్గ్‌సన్ జలయంత్రం (fountain) తో పోలుస్తాడు. జలయంత్రంలో నీరు పైకి ఎగజిమ్ముతుంది. పైకి ఎగసిన నీరు కొంత దూరం పోయి, తిరిగి తుంపురులుగా కిందికి పడుతుంది. పైకి పోతున్న నీరు జీవశక్తి. క్రింద పడుతున్న నీరు భౌతిక పదార్థం. ఈ రెండింటి కలయిక లేదా సంఘర్షణ - లేదా వైరుధ్యం (contradiction) ద్వారానే జీవ పరిణామం ముందుకు సాగుతుంది.

## రెండు వాదాలు

ప్రపంచంలో జీవరాసులు ఎప్పుడూ ఇదే విధంగా లేవని, జీవరాసులు యుగ

యుగాలుగా, భిన్న జాతులుగా పరిణమిస్తూ వచ్చి వచ్చి, ఇప్పటి రూపాలు పొందాయని చెప్పే పరిణామ వాదం పందొమ్మిదవ శతాబ్దంలో స్థిరపడింది. పరిణామ వాదాన్ని దాదాపుగా శాస్త్రజ్ఞులు అందరూ అంగీకరించారు.

అయితే, ఆ రోజులలో రెండు రకాల పరిణామ వాదాలు సంఘర్షిస్తూ వుండేవి. డార్విన్ నాచురల్ సెలెక్షన్ సూత్రాన్ని ప్రతిపాదించాడు. తన పరిసరాలకు అనుగుణమైన అవయవ నిర్మాణం ఏ జీవికైతే వున్నదో ఆ జీవి మాత్రమే జీవన సమరంలో గెలుపొంది, మనుగడ కొనసాగించి, తన సంతతిని వృద్ధి చేసుకుంటుంది. పరిసరాలకు అనువైన అవయవ నిర్మాణం జీవికి యాదృచ్ఛికంగా లభిస్తుంది. ఇది డార్వినిజం.

కాగా, డార్విన్ కంటె ముందువాడైన ఫ్రెంచి జీవ శాస్త్రవేత్త లామార్క్ ప్రతిపాదన ప్రకారం ప్రతి జీవి తన పరిసరాలకు అనుగుణమైన అవయవాలను పెంపొందించుకొనడానికి ప్రయత్నిస్తుంది. తనను తాను పరిసరాలకు అనువుగా పరిణామం (adaptation) చెందించు కోజూస్తుంది. ఆ విధంగా తాను పొందిన మార్పులను తన సంతతికి వారసత్వంగా అందజేస్తుంది. అలా అందజేయడంలో కృతకృత్యమైన జీవజాతే వృద్ధి అవుతుంది.

డార్వినిజం ప్రకారం జీవ పరిణామం గుడ్డిగా, యాదృచ్ఛికంగా జరుగుతుంది. అది భౌతిక వాదానికి దారి తీసింది.

లామార్క్విజం ప్రకారం జీవ పరిణామం ఒక ప్రయోజనాన్ని ఆశించి, ఆ ప్రయోజనం దిశగా జరుగుతుంది. ఈ వాదాన్ని వైటలిజం అంటారు.

ఈ రెండు వాదాలు నియతి వాదానికే (డిటర్మినిజం) దారి తీస్తాయి. రెండింటి లోని జీవ పరిణామాన్ని నిర్ణయించేది పరిసరాలే. ఒకదానిలో పరిణామం గుడ్డిగా జరుగుతుంది. మరొకదానిలో గుడ్డిగా కాకపోయినా, పరిసరాలకు అనుగుణంగా, పరిసరాల నియంత్రణకు లోనై జరుగుతుంది.

ఈ రెండింటిని బెర్గ్‌సన్ తిరస్కరించాడు. అయితే, ఈ రెండింటిలోను వైటలిజంలో జీవశక్తి ప్రమేయం వున్నది కనుక అతని మొగ్గు దానివైపే.

కాగా, బెర్గ్‌సన్ ప్రతిపాదించినది సృజనాత్మక పరిణామ వాదం (క్రియేటివ్ ఇవల్యూషన్). అంటే అతని పరిణామ వాదం డార్వినిజం వలె యదృచ్ఛ (accident) పై ఆధారపడింది కాదు. లామార్క్విజం వలె యాంత్రిక (mechanical) మైనది కాదు; అది సృజనాత్మకమైనది. అందులో జీవశక్తి సంపూర్ణ స్వాతం

త్ర్యంతో, యథేచ్ఛగా పనిచేస్తుంది. అడుగడుగునా అది నూతనత్వాన్ని అన్వేషిస్తూ, నూతనత్వాన్ని సృజిస్తూ ముందుకు పోతుంది.

# జీవ పరిణామ క్రమం

బెర్గ్‌సన్ ప్రతిపాదించిన పరిణామ వాదం ఒక కళాకారుని సృజనాత్మకత (creativity) ను పోలినది. ఒక చిత్రకారుడున్నా డనుకోండి. చిత్రం గీయడం ప్రారంభించడానికి ముందు స్థూలంగా అతని మనస్సులో ఒక ఇతివృత్తం మెదులుతున్నప్పటికీ, దాని సంపూర్ణ స్వరూపం మాత్రం అతని మనస్సులో వుండదు. తాను గీయదలచిన బొమ్మ చివరికి ఏ రూపంలో గీయబడనున్నదో ప్రతి వివరంతో సహా ముందుగానే అతని మనస్సులో రూపు దిద్దుకున్నదని అనుకుంటే ఆ చిత్రం తయారుకాకముందే తయారైందని భావించవలసివస్తుంది. అది అసంబద్ధం, స్వయంవిరుద్ధం. ఒక వస్తువు తయారు కాకముందే ఎలా తయారవుతుంది? చిత్రకారుడు స్థూలంగా తన ఇతివృత్తాన్ని నిర్ణయించుకుని, ప్రతి వివరాన్ని అప్పటికప్పుడు సృష్టిస్తాడు. అతని సృష్టి నిత్యనూతనంగా వుంటుంది, అపూర్వంగా వుంటుంది. అది పూర్తిగా అతని స్వతంత్రేచ్ఛపై (free will) ఆధారపడి వుంటుంది.

అలాగే ఒక గాయకుడు ఒక రాగం ఆలపిస్తుంటే, అతడు నిజంగా సృజనాత్మక ప్రతిభ కలవాడైతే, అతడు రాగాలాపన సందర్భంలో వేసే ప్రతి సంగతి నూతన సృష్టిగానే భాసిస్తుంది. ప్రతిభ కల ఏ గాయకుడైనా - గ్రామ్‌ఫోన్ రికార్డులోవలె - క్రిందటి కచేరీలో వేసినచోట వేసిన సంగతినే మరొకసారి మరొక కచేరీలో వేయడు. కొత్త సంగతులను అప్పటికప్పుడు సృష్టిస్తాడు.

అలాగే ఒక కవి, ఒక నవలా రచయిత తమ ఇతివృత్తాలను స్థూలంగా ముందుగానే ఎంచుకున్నప్పటికీ, ఇతర వివరాలన్నిటిని వాస్తవంగా రచనాక్రియ సందర్భంలోనే నింపుతారు. అది నూతన సృష్టి అవుతుంది. అందులోనే సృజనాత్మకత ద్యోతకమవుతుంది.

అటువంటి నిత్యనూతన సృజనాత్మకతను పోలిన జీవ పరిణామ వాదాన్ని బెర్గ్‌సన్ ప్రతిపాదించాడు. పరిసరాలకు అనుగుణంగా మార్పు చెందడమే పరిణామం లక్ష్యమైతే, జీవ పరిణామం ఎప్పుడో ఆగిపోయివుండవలసింది. అలాకాక పరిణామం ఇంకా ఇంకా ఉన్నతోన్నత దశలకు పురోగమించిందంటే అటువంటి పురోగమనం జీవశక్తి సహజ స్వభావమై వుండాలి.

జీవశక్తి పురోగమనానికి అంతిమ గమ్యం అంటూ లేదు. అంతిమ గమ్యం వుంటే అది స్వేచ్ఛాయుత పరిణామక్రమాన్ని నియంత్రించినట్టు, ఆ గమ్యాన్ని వెదుక్కుంటూ జీవశక్తి విధిగా పురోగమిస్తున్నట్టు అవుతుంది. అది జీవశక్తి స్వేచ్ఛకు సంకెల అవుతుంది. అలాగే, జీవశక్తి పురోగమనం గుడ్డిగా జరుగుతున్నదని వాదించడం కూడా అర్థంలేనిది. జీవ పరిణామ క్రమాన్ని చూస్తే ఒక నిత్యనూతనత్వం, ఒక క్రమం, ఒక సృజనాత్మకత కనిపిస్తున్నాయి. అందుచేత అవన్నీ అంధ పరిణామ ఫలితాలని అనుకోవడానికి వీలు లేకుండా పోతున్నది. కనుక జీవశక్తి కేవలం తన స్వభావమైన సృజనేచ్ఛ (creative urge) ప్రోద్బలంతో ఎప్పటికప్పుడు కొత్త పుంతలు తొక్కుతూ పురోగమిస్తున్నదని బెర్గ్‌సన్ అంటాడు.

## పరిణామ క్రమం

బెర్గ్‌సన్ పరిణామ వాదం స్థూలంగా ఇలా వుంటుంది :

జీవ పరిణామం రెండు ప్రధాన మార్గాలలో జరిగింది. ఒకటి వృక్ష మార్గం. రెండవది జంతు మార్గం.

వృక్ష మార్గాన్ని మొదటగా ఎన్నుకున్న జీవశక్తి తన శక్తిని వృక్షాలలో నిక్షిప్తం చేసి పదిలపరచడానికే తన పరిణామాన్ని పరిమితం చేసుకుంది.

వృక్షాలవలె స్థావరంగా వుండే జీవితంలో భద్రత వున్నా, స్వేచ్ఛ లేదు. అది తృప్తి కలిగించలేదు. కనుక జీవశక్తి జంగమ జీవితంవైపు పురోగమించింది. వృక్షాలు నిల్వ వుంచుకున్న శక్తిని ఉపయోగించుకున్న జీవులు జంగమ జంతువులైనాయి.

అవి నేలపైన, నీటిలోను చలన స్వేచ్ఛ (freedom of movement)ను సంపాదించుకున్నాయి. స్వేచ్ఛా చలనం పక్షులలో పరాకాష్ఠ పొందింది.

జంతు ప్రపంచంలో పరిణామం తిరిగి రెండు మార్గాలలో పురోగమించింది. ఒకటి సహజాతం, లేదా సహజ జ్ఞానం (instinct). ఇది పుట్టుకతోనే జీవికి వచ్చే జ్ఞానం. దీనివల్ల జీవి అప్రయత్నంగా, తన జీవిత యాత్రను సాగించగలుగుతుంది. ఇది చీమలు, తేనెటీగలు మొదలైన కీటక జాతులలో పరాకాష్ఠ అందుకున్నది.

అయితే ఈ సహజ జ్ఞానంలో జీవికి స్వాతంత్ర్యం లేదు; స్వ స్వరూప

జ్ఞానం లేదు. పరిణామ క్రమంలో ఈ సహజ జ్ఞానమే మానవునిలో ప్రత్యక్ష జ్ఞానం (intuition) గా రూపొందింది. దీనిలో మానవుని స్వేచ్ఛ (free will) అత్యుచ్ఛ స్థితిని అందుకున్నది. తన్ను తాను తెలుసుకోగలిగిన (self-consciousness) సహజాతమే (instinct) ప్రత్యక్ష జ్ఞానం (intuition).

కాగా, జంతు ప్రపంచంలో పరిణామం అనుసరించిన రెండవ మార్గం బుద్ధి (Intellect). ఇది ఆలోచన, వివేచన, విశ్లేషణ, తర్కం ద్వారా పరిసర ప్రపంచాన్ని అవగాహన చేసుకొనడానికి ఉపయోగపడే సాధనం. ఇది మానవునిలో పరాకాష్ఠను అందుకున్నది.

కాని, సత్యదర్శనంలో బుద్ధికిగల పాత్ర ప్రత్యక్షజ్ఞానం (intuition) పాత్ర కంటె చాలా తక్కువ అని బెర్గ్‌సన్ అభిప్రాయపడ్డాడు. బుద్ధి బాహ్య, భౌతిక ప్రపంచానికి సంబంధించిన సత్యాన్ని మాత్రమే అన్వేషిస్తుంది. అసలు అందు కోసమే జీవశక్తి బుద్ధిని సృజించింది. ఆ ప్రయోజనానికే బుద్ధి పరిమితమైంది కూడా. అంటే అది తెలుసుకోగలిగింది నిత్య జీవితంలో ఉపయోగపడే పాక్షిక సత్యాన్ని మాత్రమే. కాని, సంపూర్ణ సత్యాన్ని తెలుసుకోగలిగిన శక్తి ప్రత్యక్ష జ్ఞానం (ఇంట్యూషన్) వల్లనే సిద్ధిస్తుంది.

## ఇర్రేషనలిజం

యూరోపియన్ తత్వవేత్తలలో రెండు రకాల వారున్నారు. ఒక రకం తత్వవేత్తలు బుద్ధివాదులు (rationalists). బుద్ధి ద్వారానే తర్కం, వివేచన, విశ్లేషణ ద్వారానే అంతిమ సత్యాన్ని తెలుసుకొన గలమని వీరు విశ్వసిస్తారు. దెకార్త్, స్పినోజా, లైబ్నిజ్ వంటివారు ఈ రకానికి చెందినవారు.

మరొక రకం వారు బుద్ధివ్యతిరేకవాదులు (irrationalists). వీరిని ఇచ్ఛా వాదులు, హృదయవాదులు, అనుభూతి (feeling) వాదులు అని వ్యవహరించ వచ్చు. రూసో, షోపెన్‌హావర్, నీషే, బెర్గ్‌సన్ మొదలైనవారు ఈ శ్రేణిలోకి వస్తారు. బుద్ధి తెలుసుకోగలిగింది పరిమిత సత్యాన్నే అని, కాని, ప్రత్యక్ష జ్ఞానం (ఇంట్యూషన్) ద్వారా సంపూర్ణ సత్యం తెలుసుకోగలమని వీరు అంటారు. వీరు బుద్ధిని చిన్నచూపు చూస్తారు.

నిజానికి ఈ రెండు వాదాల మధ్య పరస్పర వైరుధ్యం వుండవలసిన అవసరం లేదు. అవి ఒకదానికొకటి సంపూరక (complementary) మైనవి. బుద్ధి (ఇంటలెక్ట్), ప్రత్యక్షజ్ఞానం (ఇంట్యూషన్) రెండూ మానవునికి అవ

సర్థమే. ఒకదాని పని రెండవది చేయలేదు. ఉదాహరణకు కేవలం ప్రత్యక్ష జ్ఞానం ద్వారా భౌతిక ప్రపంచానికి సంబంధించిన వైజ్ఞానిక సత్యాలను కనుగొనలేము. వాటిని వివేచన ద్వారా తెలుసుకోవలసిందే. అలాగే, సుఖం, దుఃఖం, ప్రేమ, దయ, జాలి, న్యాయం, అన్యాయం, పాపభీతి, దైవభక్తి మొదలైన అనుభూతులను వివేచన ద్వారా, తర్కం ద్వారా ఎంత ప్రయత్నించినా అవగతం చేసుకోలేము. అవి వైయక్తిక అనుభూతికి మాత్రమే అందుతాయి.

## విపరీతవాదాలు

అటు రేషనలిస్టులు, ఇటు ఇర్రేషనలిస్టులు కూడా ఏదో ఒక సిద్ధాంతాన్ని పట్టుకుని దానిని విపరీత స్థాయికి తీసుకుపోయి విస్తరించడంలోనే చిక్కంతా వస్తున్నది. బెర్గ్సన్ చేసిన పని అదే. అతడు బుద్ధిని తిరస్కరించి జీవశక్తికి, ఇచ్ఛకు, ప్రత్యక్ష జ్ఞానానికి మాత్రమే ప్రాధాన్యమిచ్చాడు. సత్యం ఆత్మాశ్రయ (subjective) మైంది మాత్రమే కాదు. అది వస్త్వాశ్రయ (objective) మైంది కూడా.

అయితే, పందొమ్మిదవ శతాబ్దపు యూరప్‌లో యంత్ర నాగరికతకు పునాదులు పడి, దాని ప్రభావం తత్వవివేచనపై కూడా పడింది. ఒక విధమైన యాంత్రిక భౌతిక (mechanical materialism) వాదం, యాంత్రిక బుద్ధివాదం తత్వశాస్త్ర రంగంలో రాజ్యం చేస్తున్న రోజులలో బెర్గ్సన్ వచ్చి తిరిగి సత్య దర్శనానికి మరొక మార్గం కూడా వున్నదని ఉద్ఘాటించాడు. సత్యం కేవలం భౌతికమైనదే కాక, అభౌతికమైనది, చైతన్యపూరితమైనది అని చాటి చెప్పాడు. భౌతిక విజ్ఞాన శాస్త్రాలకు అందని చైతన్య స్ఫూర్తిని, జీవశక్తి సూత్రాన్ని అతడు ప్రవచించాడు. అందుకే అతని చింతన అతని సమకాలీన మేధావులపై అంత విశేష ప్రభావం ప్రసరించింది. యూరోపియన్ తత్వశాస్త్రం అతని చింతనతో మరికొన్ని అడుగులు ముందుకు నడిచిందని వ్యాఖ్యాతలు పేర్కొంటున్నారు.



# 35
# బెర్ట్రాండ్ రస్సెల్

ఈ శతాబ్దంలో రస్సెల్‌ను పోలిన మేధావులు పలువు రుండవచ్చుగాని, అతనివలె ఎంత సంక్లిష్ట విషయమైనా అంత సరళ సుందరంగా చెప్పిన తత్వవేత్తలు చాలా కొద్దిమంది వుంటారు. చాలామంది దార్శనికులు తమ చింతనను క్లిష్టంగా చెబుతారు. సరళంగా చెబితే అది తత్వశాస్త్రం కాదని భావించేవారు కూడా వుండవచ్చునేమో. జర్మన్ ఐడియలిస్టు తత్వవేత్తలపై, ముఖ్యంగా కాంట్ వంటి వారిపై ఒక జోక్ ఇంతకు ముందొకసారి పేర్కొన్నాను. వారి రచనలు-- ఒక విషయాన్ని కష్టంగా చెప్పడానికి వీలున్నప్పుడు తేలికగా ఎందుకు చెప్పాలి అన్నట్టుగా వుంటాయట. ఈ విషయంలో రస్సెల్ తన మిత్రుడు, సహ రచయిత అయిన ఎ.ఎన్.వైట్‌హెడ్‌కు పూర్తిగా భిన్నం. వైట్‌హెడ్ కూడా ఈ శతాబ్దపు గొప్ప దార్శనికులలో ఒకడు. అయన తత్వ చింతన అతి జటిలమైనది. సి.ఇ.ఎం. జోడ్ ఒకచోట వ్రాశాడు-- జాటిల్యం రెండు రకాలుగా వుంటుంది : ఒకటి obscurity of expression--అభివ్యక్తి జటిలత. అంటే సులభంగా చెప్పడం కుదరక కొందరు విషయాన్ని గజి బిజి చేస్తారు. ఒకసారి శ్రీశ్రీ చెప్పినట్టు కష్టంగా రాయడమంత సులభం లేనట్టు,

సులభంగా రాయడమంత కష్టం లేదు. అదికాక మరో రకం– expression of obscurity–జటిలతాభివ్యక్తి అంటే విషయ జటిలతవల్ల వచ్చే అభివ్యక్తి జటిలత. అంటే క్లిష్ట విషయాన్ని క్లిష్టంగా తప్ప మరొకలా చెప్పడానికి వీలు లేకపోవడంవల్ల వచ్చే ఇబ్బంది.

ఉదాహరణకు ఐన్‌స్టయిన్ సాపేక్ష సిద్ధాంతాన్ని ప్రతిపాదించినప్పుడు దాన్ని అర్థం చేసుకున్నవారు చాలా తక్కువమంది వుండేవారట. ఎందుకంటే ఆ సిద్ధాంతం అటువంటిది. మామూలుగా ఏదైనా కొత్త విషయం విన్నప్పుడు దాన్ని అదివరకే తెలిసిన దానితో పోల్చుకొని మనస్సులో ఒక బొమ్మ గీసుకుని అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తాము. కాని, సాపేక్ష సిద్ధాంతం అలా అర్థం చేసుకోవడానికి అతీతమైనది. అది కేవలం గణిత పరిభాషకే అందే సిద్ధాంతం. ఉదాహరణకి స్థలం (space) లేదా స్థల-కాలం (space-time) వంకర తిరగడం ఏమిటి? ఏదైనా వస్తువైతే వంకర తిరుగుతుంది. స్థల-కాలం ఎలా వంకర తిరుగుతుంది? అది ఊహకి అందని గణిత ప్రతిపాదన, భౌతికశాస్త్ర సత్యం. దాన్ని అలాగే స్వీకరించాలి. అందుచేత జటిల విషయాన్ని జటిలంగా తప్ప మరొకలా చెప్పడానికి వీలులేకపోతే అందులో తప్పులేదు. కాని, జటిల విషయాన్ని కూడా సులభంగా చెప్పగలిగితే అది మరీ గొప్ప. అయితే, సౌలభ్యం, కాఠిన్యం కూడా సాపేక్ష విషయాలే. ఒకరికి సులభంగా కనిపించేది మరొకరికి కఠినంగా కనిపించవచ్చు. అలాగే ఒకరికి కఠినమైనది మరొకరికి సులభంగా కనిపించవచ్చు. అంతే కాదు, సౌలభ్య, కాఠిన్యాలు అభిరుచిపై ఆధారపడి వుంటాయి.

రస్సెల్ భాషలో, భావనలో, అభివ్యక్తిలో స్పష్టతకోసం జీవితమంతా శ్రమించిన మనీషి. అది అటుంచి, ఆయన కేవలం తత్వవేత్త మాత్రమే కాదు. బహుముఖ ప్రజ్ఞాశాలిత అనేదానికి మూర్తీభావం లాంటివాడు ఆయన. బహుశా అన్ని విషయాలపై, అంత విస్తృతంగా వ్రాసినవారు చాలా అరుదుగా వుంటారు. తన సుదీర్ఘ జీవిత కాలంలో ఆయన దాదాపు 70-80 గ్రంథాలు రచించాడు. ఎప్పుడు చూసినా ఆయన పుస్తకాలు దాదాపు నలభై వరకు మార్కెట్‌లో వుండేవట.

ఆయన గ్రంథాలు ఒక విషయంపై కాదు. తత్వశాస్త్రం, తర్కశాస్త్రం, భౌతికశాస్త్రం, నీతిశాస్త్రం, సాంఘికశాస్త్రం, విద్యా విధాన సంస్కరణలు, వివాహ వ్యవస్థ సంస్కరణలు, మతం, రాజకీయాలు, చరిత్ర, స్వీయచరిత్ర-- ఇంకా ఎన్నో ఎన్నో విషయాలపై ఆయన పుంఖానుపుంఖంగా రచించాడు.

సాధారణంగా తత్త్వశాస్త్రవేత్తలు, మేధావులు ఐవరీ టవర్‌లో ఈజీ చెయి ర్‌లో పడుకుని పగటి కలలతో పోల్చదగిన తత్త్వశాస్త్రపు "ఎయిరీ ఫెయిరీ స్వీట్ నథింగ్స్"ను ఊహిస్తూ, మెట్ట వేదాంతం వ్రాస్తూ లోకానికి, లోక సమస్యలకు దూరంగా జీవిస్తారని ఒక ప్రథ. అలాంటివారు కొందరుండవచ్చు కాని, పాశ్చాత్య తత్త్వవేత్తలలో చాలామంది క్రియాత్మక జీవితం గడిపినవారే. తమ తత్త్వచింతనను ప్రపంచ సంస్కరణకు, సంఘం మరమ్మతుకు ఉద్దేశించి నవారే. మార్క్స్ కూడా "తత్త్వవేత్తలు ప్రపంచానికి రకరకాలుగా భాష్యం చెప్పారు. కాని అసలు జరగవలసింది ప్రపంచాన్ని మార్చడం" అన్నప్పటికీ, ప్రపంచాన్ని ఏ విధంగా మార్చాలన్నదాన్ని నిర్దేశించడానికి ఆయన కూడా తత్త్వ విచారం చేయక తప్పలేదు. ఆయన కార్యశూరుడు, మేధాశూరుడు కూడా. తత్త్వచింతన ఆచరణకు మార్గదర్శనం (Philosophy must be a guide to action) కావాలని ఆయన భావించాడు.

అలాగే రస్సెల్ కూడా ఎంత రచనాశూరుడో అంత కార్యశూరుడు కూడా. నిజానికి రస్సెల్ ఒకడు కాదని, ఇద్దరని విల్ డ్యురాంట్ పేర్కొన్నాడు. ఒక రస్సెల్ తార్కికుడు, రెండో రస్సెల్ సంఘ సంస్కరణకు, ప్రపంచాన్ని మరమ్మతు చేయడానికి, లోకకల్యాణానికి జీవితాన్ని అంకితం చేసినవాడు, ఉద్యమాలలో పాల్గొన్నవాడు, వాటిని నడిపినవాడు.

అయితే, తొలినాళ్ల రస్సెల్ కేవలం తాత్త్వికుడు, తార్కికుడు. అతనికి తర్క శాస్త్రమే తత్త్వశాస్త్రం. అంతేకాదు, అతనికి గణిత శాస్త్రమే తర్క, తత్త్వ శాస్త్రాలు కూడా. వీటికి అతడు అభేదం చేశాడు. గణితం వేరు, తర్కం వేరు కావని అతడి అభిప్రాయం. గణితశాస్త్రపు యౌవనం తర్కశాస్త్రమని, తర్కశాస్త్రపు నడి వయస్సు గణిత శాస్త్రమని అతడి చమత్కారింపు. అంటే తొండ ముదిరి ఊసరవిల్లి అయినట్టు తర్కం ముదిరి గణితం అవుతుందన్నమాట.

"దిగిరాను దిగిరాను దివినుండి భువికి" అన్న కవిలాగా, ఒక వయస్సు వచ్చేవరకు గణిత-- తర్క (మేథమేటికల్ లాజిక్) దంత గోపురంలో కాపురం చేసిన రస్సెల్, ఆ పిదప మామూలు మానవ లోకంలోకి దిగివచ్చాడు. ఊరికే దిగిరావడం కాదు-- "I hurt myself from the heights of poetry to the depths of communism" అన్న మయకోవ్‌స్కీలాగా గణిత తర్క శిఖరాల నుంచి సాధారణ మానవుల ఈతిబాధల, నీతి బాధల అగాధాలలోకి రస్సెల్ తన్ను తాను విసిరేసుకున్నాడు. ముఖ్యంగా ప్రథమ ప్రపంచ సంగ్రామ సంవత్సరాలలో అతనిలో ఒక మార్పు వచ్చింది. పై వాక్యంలో మయకోవ్‌స్కీ కవితా వాక్యాన్ని

ఉదాహరించడం పూరికే జరగలేదు. బెర్ట్రాండ్ రస్సెల్ కొన్నాళ్లపాటు కమ్యూనిజంలో నిజం అన్వేషిస్తూ తిరిగాడు. అందుకే అతనికి ఆ రోజుల్లో "రెడ్ రస్సెల్" అనే నిక్‌నేమ్ వచ్చింది.

అయితే, కమ్యూనిజంతో అతని ప్రేమాయణం ఎక్కువ రోజులు సాగలేదనుకోండి. త్వరలోనే అతనికి దానిపై మొగం మొత్తింది. అతడు ప్రధానంగా మానవతావాది. అతనికి మతంమీద—అంటే సాధారణంగా మతం అని మనం వ్యవహరించే దానిమీద—అణుమాత్రమైనా విశ్వాసం లేదు. మానవతావాదమే అతనిమతం. వ్యక్తి స్వేచ్ఛావాదం, ఉదారవాదం అతని ఉచ్ఛ్వాస నిశ్వాసాలు. వాస్తవిక వాదం (రియలిజం), తార్కికనిశ్చయత అతని తాత్విక విశ్వాసాలు. అజ్ఞేయవాదం (Agnosticism) అతని ఆలోచనా లోచనం.

తొలినాళ్ల రస్సెల్ మూర్తీభవించిన తత్వశాస్త్రం. మలినాళ్ల రస్సెల్ పుంభావ మానవతావాదం. అడే తన గురించి తాను స్వీయచరిత్ర అవతారికలో ఇలా చెప్పుకున్నాడు :

"నా జీవితాన్ని మూడే మూడు ఉద్వేలమైన ఉద్వేగాలు – అతి సామాన్యమైనవి, అదే సమయంలో అతి బలీయమైనవి—ఆవేశించాయి. ఒకటి ప్రేమకోసం ఆరాటం; రెండవది విసుగు ఎరగని, విరతి లేని విజ్ఞానాన్వేషణ; మూడవది దుఃఖిత మానవాళిపై భరించలేనంత అనుకంప. ఈ మూడు ఉద్వేగాలు ఝంఝూ ప్రభంజనాలవలె నన్ను అటూ ఇటూ విసిరేశాయి; ఏవేవో సంకీర్ణ, సంక్లిష్ట మార్గాలలోకి తీసుకుపోయాయి; ఆవేదనా సముద్ర తరంగాల మీదుగా నిరాశా నిస్పృహల కొసలవరకు తీసుకుపోయాయి."

నేను ప్రేమకోసం అర్రులు చాచాను. ఎందుకంటే ప్రేమాతిరేకంలో నాకు లభించే తన్మయీభావం ఎంత గాఢమైనదంటే కొన్ని గంటల ప్రేమానుభూతి కోసం నా శేష జీవితమంతా త్యాగం చేయా లనిపించేది. అంతేకాదు; అది ఒంటరితనం నుంచి—ఈ నిర్జీవ భౌతిక ప్రపంచపు శిఖరాంచలాన నిలబడి వణికిపోతూ క్రిందికి తొంగిచూసే ఏకాకిచేతన యొక్క పైయక్తి కైకాంతం నుంచి—మానవుడిని విముక్తుడిని చేస్తుంది. ఇంకా చెప్పాలంటే, ప్రేమ భావ తాదాత్మ్యంలో నేను ఋషులు, కవులు ఊహించిన స్వర్గానందాన్ని సూక్ష్మ మార్మిక రూపంలో దర్శించాను. అది మానవుడు కోరదగని వరమే కావచ్చుగాని, దాన్ని నేను అన్వేషించాను, సాధించాను.

అంతే అభినివేశంతో నేను జ్ఞానాన్వేషణ కూడా చేశాను. మానవ హృదయ రహస్యాలను అర్థం చేసుకోవాలని ఆరాటపడ్డాను. నక్షత్రాలు

లక్షకాంతులతో ఎందుకు ప్రకాశిస్తున్నాయో తెలుసుకొనడానికి ప్రయత్నించాను. పితాగరస్ ప్రవచించిన ఏ శక్తితో ప్రవాహ నిరంతరత్వాన్ని సంఖ్య—అంకె--ఛేదిస్తున్నదో అవగాహన చేసుకోవాలని అవస్థపడ్డాను. ఈ నా ప్రయత్నం కొంచెంగానే ఫలించింది.

ప్రేమ, జ్ఞానం నాకు లభ్యమైనంత వరకు నన్ను ఆకాశ వీధులలోకి తీసుకుపోయాయి. కాని, మానవ కారుణ్య భావన నన్ను ఎప్పటికప్పుడు దివినుంచి భువికి లాక్కువస్తూనే వుంది. బాధా సర్పదష్టుల గాథాక్రందనలు నా హృదయ కుహరంలో ప్రతిధ్వనిస్తాయి. కరవు రక్కసి కోరలలో చిక్కిన చిన్నారి పాపలతో, నియంతల చేతులలో చిత్రహింస లనుభవించే అభాగ్యులతో, కొడుకులకు కూడా బరువైపోయి దిక్కూ, మొక్కూ లేని దీనవృద్ధులతో నిండిన ఈ శోకపు లోకంలో భరించరాని ఒంటరితనం, నిరుపేదరికం, రంపంలా కోసే బాధ—ఇవన్నీ మానవ జీవితాన్ని వికటాట్టహాసంతో వెక్కిరిస్తాయి. నేను ఈ దుఃఖ తిమిరాలను ఏ కొంచమైనా పారద్రోలాలని ఆరాటపడతాను. కాని, ఈ కన్నీటి సముద్రాలను తుడవడం ఎవరితరం? చివరికి నిస్సహాయంగా నా బాధావిల హృదయం విలవిలలాడి ఓడిపోతుంది.

ఇది నా జీవిత గాథా బాధ. అయినా, జీవితం జీవించ దగిందిగానే నాకు సాక్షాత్కరించింది. నాకే అవకాశం వస్తే సంతోషంగా మళ్లీ ఇదే జీవితం జీవిస్తాను."

# మనిషిగా మనీషిగా రస్సెల్

బెర్ట్రాండ్ రస్సెల్ జీవితం రెండు (19వ, 20వ) శతాబ్దాల మధ్య వారధి; వైజ్ఞానిక-మానవతా వాదానికి ఎత్తిన హారతి.

"కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేచ్ఛతగ్ం సమాః" (మానవుడు విధ్యుక్త కర్మలు ఆచరిస్తూ నూరేళ్లు జీవించాలన కోరుకోవాలి) అని ఈశావాస్యోపనిషత్తు ఉద్బోధిస్తున్నది. అలాగే బెర్ట్రాండ్ రస్సెల్ రెండేళ్లు తక్కువగా సరిగ్గా నూరేళ్లు జీవించాడు. చెట్టులా, గట్టులా కాదు, లోక సంగ్రహార్థమైన కర్మలు చేస్తూ జీవించాడు. అతడు 1872 మే 18 వ తేదీన జన్మించి, 1970 ఫిబ్రవరి 2వ తేదీన కన్నుమూశాడు. లోతుకుపోయిన కళ్లు. పీక్కుపోయిన దవడలు, ముడతలు పడిన ముఖంతో అర్భకంగా, నిత్య రోగగ్రస్తుడి వలె. ఉఫ్ఫంటే ఎగిరిపోయేటట్టు కనబడే రస్సెల్‌ను విల్ డ్యురాంట్ వర్ణిస్తూ "1914 లో రస్సెల్ కొలంబియా యూనివర్సిటీలో ఉపన్యసిస్తుంటే అతడు తన ఉపన్యాస

విషయమైన ఎపిస్టెమాలజీ (జ్ఞాన శాస్త్రం) వలె బక్క పలచగా, పీలగా, పాలిపోయి ఎప్పుడైనా మరణించవచ్చు ననిపించేటట్టు కనబడ్డాడు... కాని, పదేళ్ల తర్వాత అదే వ్యక్తి 52 ఏళ్ల వయస్సులో సంపూర్ణారోగ్యంతోనే కాక తుళ్లుతూ, పేలుతూ, ఉరకలు వేస్తూ, తిరగబడే ఉత్సాహంతో ప్రత్యక్షం కావడం ఎంతో సంతోషం కలిగించింది. ఆ పదేళ్లు ఎటువంటివి? అతని ఆశలు, ఆదర్శాలు నేలపాలైనాయి; స్నేహితులకు, ఒకప్పటి అతని సుఖమయ జీవితానికి దూరమైపోయాడు. అయినా, అతడు క్రుంగిపోకపోవడం ఆశ్చర్యం..." అని వ్రాశాడు.

రస్సెల్ పూర్తిపేరు బెర్ట్రాండ్ ఆర్థర్ విలియం రస్సెల్. అతనిది ఇంగ్లండులోనే కాక యూరప్‌లో కూడా పరిచితమైన, ప్రసిద్ధమైన పురాతన ప్రభు వంశం. బెర్ట్రాండ్ తాత లార్డ్ జాన్ రస్సెల్ లిబరల్ పార్టీకి చెందినవాడు; రెండుసార్లు (1846-52) సంవత్సరాలలోను, 1865-66 సంవత్సరాలలోను) బ్రిటన్‌కు ప్రధానమంత్రిగా పనిచేసి, పార్లమెంటరీ సంస్కరణలకు కారకుడైన వాడు. తండ్రి వైకౌంట్ అంబర్లీ కూడా లిబరల్ పార్టీ సభ్యుడు. ఆయన రెండవ సంతానం బెర్ట్రాండ్.

బెర్ట్రాండ్ రెండవ ఏట తల్లి మరణించింది. ఆ పిదప ఏడాదిన్నరకే తండ్రి మరణించాడు. బెర్ట్రాండ్‌ను, అతని అన్నను మత విశ్వాసాలకు దూరంగా, లిబరల్, అభ్యుదయ భావ వాతావరణానికి దగ్గరగా పెంచాలని తండ్రి వీలునామా వ్రాశాడు. కాని, దాన్ని కోర్టులు కొట్టివేశాయి. అన్నదమ్ము లిద్దరు తమ ముత్తవవద్ద పెరిగారు. తండ్రి ఇష్ట ప్రకారం కాక, వారిని ప్యూరిటన్ మత విశ్వాసాలతో, కట్టుదిట్టమైన క్రమశిక్షణతో ఆమె పెంచింది.

బెర్ట్రాండ్ చిన్నతనంలో పాఠశాలలకు వెళ్లి చదువుకోలేదు. ప్రయివేటుగా ఇంటివద్దనే అతడి విద్యాభ్యాసం జరిగింది. అతడి పెంపకం సాంప్రదాయిక పద్ధతులలో జరిగినా, ఆ పద్ధతుల పట్ల అతనికి విశ్వాసం, గౌరవం కుదిరినట్టు లేదు. పదకొండవ ఏటనే మతం పట్ల విశ్వాసం సడలింది. మతం వల్ల, మిస్టిసిజం వల్ల ప్రపంచానికి అనేక అనర్థాలు వాటిల్లాయని అతడి విశ్వాసం.

చిన్నతనం నుంచే బెర్ట్రాండ్‌కు గణితశాస్త్రం పట్ల అభిమానం ఏర్పడింది. గణితం, తర్కం, సైన్స్ ఇవే అతని దైవాలు. అతని సంశయ వాదానికి (స్కెప్టిసిజం) కూడా బాల్యంలోనే బీజాలు పడ్డాయి. యూక్లిడియన్ జ్యామెట్రీని అప్పటిలోనే అతడు ప్రశ్నించేవాడు. సోక్రటీస్ ఊత పదం "లెటజ్ ఇన్వెస్టిగేట్" (దీన్ని మనం పరిశోధిద్దాం). అలాగే రస్సెల్ కూడా ప్రతిదాన్ని

పెద్దలు చెప్పారని, ఇంకెవరో చెప్పారని కాక స్వయంగా పరిశోధించి, పరిశీలించి, నిగ్గు తేల్చుకోవాలని, గుడ్డిగా దేన్నీ నమ్మరాదని, అన్నిటిని ప్రశ్నించాలని భావించేవాడు.

పద్దెనిమిదవ ఏట (1890) రస్సెల్ కేంబ్రిడ్జి యూనివర్సిటీకి చెందిన ట్రినిటీ కాలేజీలో చేరాడు. అతడి మేధాశక్తిని అందరు అనాడే గుర్తించారు. 1893 లో లెక్కల అనర్సు పరీక్షలో ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణుడయ్యాడు. ఆ తర్వాత ఫిలాసఫీని అభిమాన విషయంగా తీసుకుని 1894 లో పట్టభద్రుడ య్యాడు.

ఆ రోజులలో అతని ఆరాధ్య తత్వవేత్తలు కాంట్, హెగెల్. నిజానికి బ్రిటిష్ తాత్విక సంప్రదాయం వేరు, హెగెలియన్ తాత్విక సంప్రదాయం వేరు. బ్రిటిష్ వారిది ఫ్రాన్సిస్ బేకన్, హాబ్స్ మూల పురుషులుగా, లాక్, బెర్క్లీ, హ్యూమ్‌లు "ఋషిత్రయం"గా గల ఎంపిరిసిస్టు సంప్రదాయం. కాగా, యూరప్ సంప్రదాయానికి చెందినది హెగెలియన్ ఐడియలిజం. అయినా, ఆనాటి ప్రముఖ తత్వవేత్త ఎఫ్. హెచ్. బ్రాడ్లీ కేవల భావవాదాన్ని (absolute idealism) అభిమానించాడు. బ్రాడ్లీ ద్వారా ఆ వాదం బ్రిటన్‌లో కొన్నాళ్లు ఫ్యాషన్ అయింది.

అయితే, రస్సెల్‌కు హెగెలియనిజంపట్ల మోజు ఎక్కువ కాలం నిలవలేదు. అతని సహాధ్యాయి, మరొక ప్రముఖ తత్వవేత్త జి. ఇ. మూర్ ప్రభావంతో హెగెలియనిస్టు భావవాదంపై తిరుగుబాటు చేశాడు. ఎంపిరిసిస్టుగా, పాజిటివి స్టుగా, ఫిజికల్ రియలిస్టుగా మారిపోయాడు.

నిజానికి బెర్ట్రాండ్ రస్సెల్‌పై ఆ తర్వాత కాలంలో ఒక ప్రథ ప్రచారం లోకి వచ్చింది. అతడు తన తాత్విక విశ్వాసాలను త్వర త్వరగా మార్చు కుంటాడని, ప్రతి కొన్ని సంవత్సరాలకు ఒక కొత్త తాత్విక సిద్ధాంతాన్ని లేవదీస్తాడని అనేవారు. అసలు అతనికొక ఫిలాసఫీ కాక, చాలా ఫిలాసఫీ లున్నా యని కూడా ఆరోపణ. దీనికి మొదటిదాఖలా అతడు హెగెల్ ప్రవచించిన కేవల భావవాదాన్ని (absolute idealism) వదలి పాజిటివిస్టుగా మారిపోవడమే.

ఫిలడెల్ఫియాకు చెందిన ఎలైన్ పియర్‌సాల్ స్మిత్‌ను అతడు 1894 లో వివాహం చేసుకున్నాడు. అమెరికాలో 1894 నుంచి 1896 వరకు నాన్-యూక్లి డియన్ జ్యామెట్రీపై ఉపన్యాసాలిస్తూ నివసించాడు. యూక్లిడియన్ రేఖాగణిత సూత్రాల పట్ల అతనికి పరమ జుగుప్స. రెండువేల ఏళ్లపాటు ఆ సూత్రాలను యూరప్ గుడ్డిగా నమ్మి చెడిపోయిందని అతని వాదం. ఇప్పటికీ యూక్లిడ్

గ్రంథాన్ని థేమ్సులో తొక్కక, పాఠశాలలలో బోధించడం అన్యాయమని అతని భావన. పాత సూత్రాలను త్రోసివుచ్చడం వల్లనే ఆధునిక గణిత శాస్త్రం అభివృద్ధి అయిందని, స్వయంసిద్ధ సత్యాలు (self-evident truths) అనేవి ఏవీ లేవని అతని వాదం. ప్రతిదీ తార్కికంగా రుజువు కావలసిందేనని అతడు అనేవాడు.

గణితం అతని అభిమాన విషయం. దానిలో సత్యమే కాక సౌందర్యం కూడా వుందంటాడు. అది పరిపూర్ణమైన సైన్సు అని, అదొక లలిత కళ అని అతని విశ్వాసం.

జర్మన్ తత్వవేత్త లైబ్నిట్‌పై 1900 లో "ది ఫిలాసఫీ ఆఫ్ లైబ్నిజ్" (The Philosophy of Leibniz) అనే ఉద్గ్రంథం వ్రాశాడు. దానితో రస్సెల్‌కు తాత్విక ప్రపంచంలో మంచి పేరు వచ్చింది.

ఆ పిదప 1903 లో "ది ప్రిన్సిపుల్స్ అఫ్ మేథమేటిక్స్" (The Principles of Mathematics) అనే మరొక ఉద్గ్రంథం వ్రాశాడు. దానిలో అతడు గణితానికి, తర్కానికి భేదం లేదని ప్రతిపాదించాడు. తర్కంలో ఉపయోగించే భాష గణితానికి కూడా వర్తిస్తుందని, అందుచేత ఆ రెండూ ఒకటేనని అతని సిద్ధాంతం.

కాని, అతనికి తత్వవేత్తగా, తర్కవేత్తగా శాశ్వత కీర్తి తెచ్చి పెట్టింది, అతని రచనా జీవితానికి మకుటాయమానమైనదని చెప్పదగింది "ప్రిన్సిపియా మేథమేటికా" అనే మూడు సంపుటాల బృహద్గ్రంథం. తన ఒకనాటి గురువైన ప్రఖ్యాత తత్వవేత్త ఎ.ఎన్. వైట్‌హెడ్‌తో కలిసి రస్సెల్ ఆ గ్రంథాన్ని 1910, 1912, 1913 సంవత్సరాలలో వ్రాశాడు. యూరపియన్ తర్క, గణిత శాస్త్రాలపై ఆ గ్రంథ ప్రభావం అమేయమని, అపారమని ప్రతీతి.

1907 లో రస్సెల్ స్త్రీలకు ఓటింగ్ హక్కు ఇవ్వాలని కోరుతూ (ఆధునిక ప్రజాస్వామ్యానికి పుట్టినిల్లు అని చెప్పుకునే బ్రిటన్‌లో అప్పటికింకా స్త్రీలకు రాజకీయమైన హక్కులు లేవు) పార్లమెంటుకు పోటీచేసి ఓడిపోయాడు.

విలియం జేమ్స్ మానవులను రెండు రకాలుగా విభజించాడు. ఒక రకం వారు మృదుస్వభావులు (tender-minded), మరొక రకంవారు కఠిన స్వభావులు (tough-minded). రస్సెల్‌ది మృదు స్వభావం. అందుకే దాన్ని తొక్కిపట్టి, పైకి కఠిన తార్కికుడుగా కనిపించడానికే సంశయ వాదాన్ని (స్కెప్టిసిజం) స్వీకరించాడని కొందరు అంటారు. అయినా, అతడు ఎంత కఠిన స్వభా

వుడుగా కనిపించ గోరినా, ఎప్పటికప్పుడు అతని మృదు స్వభావం పెల్లుబికి పైకి వస్తూనే వుండేది. హింసకు, నిరంకుశత్వానికి, నియంతృత్వానికి అతడు వ్యతిరేకి. అతడు ఉదారవాది, వ్యక్తి స్వేచ్ఛావాది. 1910 ప్రాంతాల నుంచి యుద్ధానికి పూర్తి వ్యతిరేకిగా, అహింసావాది (Pacifist) గా మారాడు.

1914 లో ప్రథమ ప్రపంచమహా సంగ్రామం ప్రారంభమైనప్పుడు రస్సెల్ దాన్ని వ్యతిరేకించాడు. సాధారణంగా అందరు right or wrong - my country (తప్పో, ఒప్పో ముందుగా నా దేశం) అంటారు. రస్సెల్ అలా కాక, సామ్రాజ్యం పోయినా సరే బ్రిటన్ యుద్ధంలోకి దిగరాదని వాదించేవాడు. దీనితో అతనికి ట్రినిటీ కాలేజీ ఉద్యోగం కాస్తా ఊడిపోయింది. నాటి నుంచి ప్రపంచమే అతని కాలేజీ, అతని యూనివర్శిటీ అయింది.

నిర్బంధ సైనిక సమీకరణ వ్యతిరేకసంస్థ (No-Conscription Fellowship) లో అతడు 1916 లో చేరాడు. యుద్ధ వ్యతిరేక ప్రచారం చేశాడు. ప్రభుత్వం అతడిని ప్రాసిక్యూట్ చేసింది. కోర్టు అతనికి నూరు పౌనుల జరిమానా విధించింది. అతని వద్ద వసూలు చేయడానికి డబ్బు లేకపోతే, అతని వస్తువులను, అమూల్య పుస్తక భండారాన్ని ప్రభుత్వం స్వాధీనం చేసుకుంది. ఆ పిదప 1918 లో అతడికి ఆరునెలల కారాగార శిక్ష కూడా పడింది. జైలులో వుండగానే రస్సెల్ "ఇంట్రడక్షన్ టు మేథమేటికల్ ఫిలాసఫీ" (Introduction to Mathematical Philosophy) వ్రాశాడు.

1914 లోనే అతడు లిబరల్ పార్టీ క్రియాశూన్యమై, వట్టిపోయిందని భావించి దానికి గుడ్‌బై చెప్పి, లేబర్ పార్టీలో చేరాడు. అప్పటిలో అతడు వామపక్ష భావాల వైపు మొగ్గు చూపాడు. అంతకు ముందే అతడు అమెరికా నుంచి తిరిగి వచ్చిన తర్వాత జర్మనీలో అర్థిక శాస్త్రం అభ్యసించాడు. జర్మన్ సోషల్ డెమొక్రాట్స్ ద్వారా మార్క్సిజం ప్రభావం అతనిపై పడింది.

మానవ సమాజపు అనర్థాలన్నిటికి కారణం సొంత ఆస్తి అన్న సిద్ధాంతంపై అతనికి నమ్మకం కుదిరింది. ఆ అనర్థాలకు నివారణోపాయం సోషలిజం, కమ్యూనిజం. ఆస్తిని దొంగతనం (Property is theft) గా ఫ్రెంచి అనార్కిస్టు తత్వవేత్త ప్రూధాన్ (Proudhan) నిర్వచించాడు. రస్సెల్ ఆ నిర్వచనంతో ఏకీభవించాడు. హింస, దోపిడీ వీటితోనే సొంత ఆస్తి ఏర్పడుతుంది. దాని రక్షణ కోసం రాజ్యం (State) అనేది ఏర్పడుతుంది. అందుచేత రాజ్యం (ప్రభుత్వం అనే అర్థంలో) దుర్మార్గమైంది. రాజ్యాధికారాన్ని సహకార సంఘాలు, సిండికేట్లు నిర్వహించాలి. పరిశ్రమలలో గిల్డ్ సోషలిజంను రస్సెల్ అభిమానించాడు. అంటే

కార్మికులే సంఘాలుగా ఏర్పడి పరిశ్రమలను నిర్వహించాలి. భూమిని సొంత ఆస్తిగా పరిగణించకూడదు. దాన్ని వ్యక్తి నుంచి లాగివేసుకుని న్యాయమైన పరిహార మివ్వాలి.

అయితే, యథాప్రకారంగా ఈ అభిప్రాయాలపై రస్సెల్ మోజు ఎంతో కాలం నిలవలేదు. స్వతహాగా అతడు ఉదారవాది, లిబరల్. మానవుని అంతిమ లక్ష్యం స్వేచ్ఛ. అది లేనిదే వ్యక్తికి వికాసం లేదు. ముఖ్యంగా అభిప్రాయ స్వాతంత్ర్యం వుండితీరాలని అతడు విశ్వసించాడు.

1920 లో రస్సెల్ లేబర్ పార్టీ ప్రతినిధి వర్గంతోపాటు అతిథి హోదాలో సోవియెట్ యూనియన్‌లో పర్యటించాడు. క్రెమ్లిన్‌లో లెనిన్‌ను కలుసుకుని సంభాషణలు జరిపాడు. ట్రాట్‌స్కీని కూడా పరిచయం చేసుకున్నాడు. రష్యా నుంచి తిరిగివచ్చిన తర్వాత "ప్రాక్టీస్ అండ్ థియరీ ఆఫ్ బోల్షివిజమ్ (The Practice and Theory of Bolshevism) అనే పుస్తకంలో బోల్షివిజంను తీవ్రంగా విమర్శించాడు.

## రస్సెల్ వివాదగ్రస్త జీవితం

విశ్వాసాలను రోజుకొక రకంగా మార్చుకోవడం ఎంత హాస్యాస్పదమో, అవసరమైనప్పుడు కూడా విశ్వాసాలను అసలు మార్చుకొనకుండా, జీవితాంతం వాటినే పట్టుకుని వేళ్లాడడం కూడా అంతే పరిహాసాస్పదం. ఒకప్పుడు ఎంతో గాఢంగా నమ్మిన విషయం, సంపూర్ణ సత్యంగా కనబడిన విషయం మరొకప్పుడు కేవలం పొరపాటు అభిప్రాయమని అనిపించవచ్చు. అటువంటప్పుడు మొదటి అభిప్రాయాన్ని, లేదా సిద్ధాంతాన్ని, విశ్వాసాన్ని మార్చుకోవడమా? లేక తనను చంచలచిత్తుడని, స్థిర విశ్వాసాలు లేనివాడని ఇతరులు ఎక్కడ అనుకుంటారోనని భయపడి వాటినే నమ్ముతున్నట్టు నటించడమా?

స్వీయ విశ్వాసాల ప్రకారం జీవించడానికి ఎంత ధైర్యం కావాలో, అవసరమైతే వాటిని విడనాడడానికి కూడా అంతే ధైర్యం కావాలి. అటువంటి ధైర్యం వుంది కనుకనే బెర్ట్రాండ్ రస్సెల్ తన సుదీర్ఘ జీవిత కాలంలో పలుసార్లు విశ్వాసాలను, సిద్ధాంతాలను అవలీలగా మార్చుకున్నాడు.

కనుకనే కొంతకాలం కమ్యూనిజంవైపు మొగ్గిన రస్సెల్ ఆ తర్వాత కాలంలో ఆచరణలో దాని లోటుపాట్లను గమనించి దానిపట్ల విశ్వాసాన్ని వదలుకొనడానికి వెనుకాడలేదు. అలాగే శాంతివాదిగా, యుద్ధ వ్యతిరేకిగా జీవితాన్ని ప్రారంభించి, జీవితాంతం శాంతివాదిగా, యుద్ధ వ్యతిరేకిగానే ఉండిపోయిన రస్సెల్

మధ్యలో ద్వితీయ ప్రపంచ యుద్ధ కాలంలో నాజీజంను నిర్మూలించడం అన్నిం టికంటె ముఖ్య కర్తవ్యం కనుక, ఆ యుద్ధాన్ని సమర్థించాడు. అలాగే ఆయన తన తాత్విక సిద్ధాంతాలను కూడా-ఉదాహరణకు తన లాజికల్ యాటమిజంను- మార్చుకున్న సందర్భాలున్నాయి.

రష్యా పర్యటన తర్వాత 1921 లో డోరా బ్లాక్ అనే యువతితో చైనా వెళ్లాడు. (మొదటి భార్య ఎలైస్‌కు 1911 లోనే విడాకులిచ్చాడు.) చైనా పర్యటన తర్వాత డోరాను వివాహం చేసుకున్నాడు. ఆమెతో కలిసి ప్రయోగాత్మ కంగా ఒక పాఠశాల నడిపాడు. దానిలో 4-11 సంవత్సరాల మధ్య వయస్సుగల ఇరవైమంది బాలబాలిక లుండేవారు. విద్యా విధానం గురించి తన ఆశయా లను, ఆదర్శాలను వారితో ఎక్స్‌పెరిమెంట్ చేశాడు. పిల్లలకు సంపూర్ణ స్వేచ్ఛ ఇవ్వాలి. అప్పుడు కాని వారి వ్యక్తిత్వం పూర్తి వికాసం చెందదు. అయితే స్వేచ్ఛ విశృంఖలత్వానికి దారితీయరాదు. క్రమశిక్షణతోనే పిల్లలను పెంచాలి. పిల్లలు కలిసి మెలిసి స్నాన భోజనాదులు చేయాలి. దిగంబరంగా పరుగులు తీయాలి. వారికి మతాన్ని బోధించరాదు. కాని నైతిక విధులను శైశవం నుంచే బోధించాలి. ఇటువంటి విశ్వాసాలతో ఆ పాఠశాల నడిపాడు. కాని, ఆ ప్రయోగం విజయవంతం కాలేదు. రస్సెల్ డోరా బ్లాక్‌కు 1935 లో విడాకు లిచ్చాడు. ఆమె 1939 వరకు ఆ పాఠశాలను కొనసాగించింది. 1936లో అతడు పెట్రీషియా స్పెన్స్ అనే వనితను వివాహం చేసుకున్నాడు.

రస్సెల్ అన్న 1931 లో మృతి చెందగా ప్రభు బిరుదం అతనికి వాస్త వంగా సంక్రమించింది. అతడిని (మూడవ) ఎర్ల్. రస్సెల్‌గా వ్యవహరించేవారు. అయినా, వారసత్వంగా లభించే ధన, పదవీ, గౌరవాలపట్ల రస్సెల్‌కు ఎన్నడూ వ్యామోహం లేదు. వాటిని తృణప్రాయంగా అతడు పరిగణించేవాడు. మాన వుడు కష్టించి పనిచేసి తన జీవనోపాధిని తాను సంపాదించుకోవాలన్నది అతని మతం. తన జీవితమంతా ఆ విధంగానే అతడు నడుచుకున్నాడు.

1938 - 39 సంవత్సరాలలో రస్సెల్ అమెరికాలో లెక్చరర్‌గా పర్య టించాడు. న్యూయార్క్‌లోని సిటీ కాలేజీ పాలకవర్గం అతడిని ఆహ్వానించి అధ్యాపక ఉద్యోగమిచ్చింది. కాని, అతడి పద్ధతులు, విశ్వాసాలు గిట్టనివారు ఆ నియామకాన్ని సవాలుచేస్తూ దావా వేశారు. 1929 లో "మ్యారేజ్ అండ్ మోరల్స్" (Marriage and Morals) అనే గ్రంథంలో భార్యాభర్తలకు దాంప త్యేతర లైంగిక సంపర్కాలకు స్వేచ్ఛ వుండాలని అతడు వ్రాశాడు. అతడు నైతికంగా భ్రష్టుడని, వ్యభిచారాన్ని, సెక్సు విశృంఖలతను ప్రోత్సహించాడని, మతానికి విరోధి అని అభియోగం మోపబడింది. దాన్ని పురస్కరించుకుని అతడి నియామకాన్ని కోర్టు రద్దు చేసింది.

1944 లో రస్సెల్ స్వదేశం తిరిగి వచ్చాడు. తిరిగి తన పాత కాలేజీ ట్రినిటీలో లెక్చరర్‌గా చేరాడు. 1950 లో అతనికి నోబెల్ సాహిత్య బహుమతి లభించింది.

అంతర్జాతీయ రాజకీయాల పట్ల రస్సెల్‌కు చాలాకాలంగా ఆసక్తి, అభిరుచి వుండేవి. ముఖ్యంగా ద్వితీయ ప్రపంచ యుద్ధం తర్వాత నుంచి అమెరికా, రష్యాల మధ్య ప్రచ్ఛన్న యుద్ధం, అణ్వస్త్రాల నిర్మాణంలో పోటీ, ప్రపంచం అణ్వస్త్ర యుద్ధ ప్రమాదం దిశగా పోవడం అతనికి చాలా ఖేదం కలిగించాయి. అణ్వస్త్ర పాటవ పరీక్షల మూలంగా వాతావరణం కలుషితమైపోయి, అవి అలాగే కొనసాగితే కొంత కాలానికి భూగోళం ప్రాణికోటికి నివాసయోగ్యం కాకుండా పోతుందన్న శాస్త్రవేత్తల హెచ్చరికలకు అతడు కూడా గొంతుకలిపాడు. 1954 లోనే అతడు ఐన్‌స్టయిన్ వంటి నోబెల్ బహుమతి పొందిన ప్రముఖ శాస్త్రవేత్తలను కలుపుకుని అణ్వస్త్ర వ్యతిరేక ప్రకటన చేశాడు. 1957 లో కెనడాలోని పగ్వాష్ గ్రామంలో అణ్వస్త్ర వ్యతిరేకులైన శాస్త్రవేత్తల ప్రథమ సమావేశం ఏర్పాటుచేసి, దానికి తాను అధ్యక్షత వహించాడు. 1958 లో తాను అధ్యక్షుడుగా అణ్వస్త్ర విసర్జనోద్యమ సంఘం స్థాపించాడు. చివరికి ఇవన్నీ కాదని 1960 లో అణ్వస్త్ర పాటవ పరీక్షల నిషేధాన్ని కోరుతూ "శత సభ్య సంఘం" స్థాపించాడు. "కమిటీ ఆఫ్ వన్ హండ్రెడ్"గా అది ప్రపంచ విఖ్యాతి పొందింది. 1961 లో ఆ సంఘం తరపున పదివేలమంది అభిమానులతో రస్సెల్ పార్లమెంటు ఎదుట (గాంధీజీ వలె) శాసనోల్లంఘన ప్రదర్శనలు చేశాడు. రస్సెల్ ప్రభు వంశీకుడైనప్పటికీ, అతడు మొదటినుంచి "ఎస్టాబ్లిష్‌మెంట్"కు, సంప్రదాయానికి విరోధిగానే వుంటూ వచ్చాడు. బ్రిటన్‌లో ఏ పార్టీ అధికారంలో వున్నా ప్రభుత్వానికి, అతడికి ఎప్పుడూ పడలేదు. అతడి వ్యతిరేకాభిప్రాయాలను బ్రిటిష్ ప్రభుత్వాలు, పాలక పక్షాలు ఎప్పుడూ ఏవగించుకుంటూనే వుండేవి. అతడు, అతడి నాల్గవ భార్య [1952లోనే రస్సెల్ తన మూడవ భార్య పెట్రీషియా స్పెన్స్‌కు విడాకులిచ్చి అమెరికన్ వనిత ఎడిత్ ఫించ్‌ను వివాహం చేసుకున్నాడు. ఆమె అతని నాల్గవ భార్య] శాసన ధిక్కారానికి పాల్పడినందుకు గాను వారిని ప్రభుత్వం అరెస్టు చేసింది. కోర్టు ఆరు వారాల జైలు శిక్ష విధించింది. అప్పటికి అతని వయస్సు దాదాపు 90 ఏళ్లు వారి అనారోగ్య కారణాలవల్ల రస్సెల్ దంపతులను ప్రభుత్వం ఒక వారం రోజులలోనే జైలునుంచి విడుదల చేసింది.

తుది శ్వాస వరకు ప్రపంచ శాంతి, నిరాయుధీకరణ, అణ్వస్త్ర పాటవ పరీక్షల నిషేధం, అణ్వస్త్రాల విసర్జన, వివిధ దేశాల మధ్య సామరస్యం, సహ

కారం మొదలైన తన ఆదర్శాల కోసం రస్సెల్ విసుగులేని కృషి చేస్తూనే గడిపాడు. 1962 నాటి క్యూబా మిసిల్స్ సంక్షోభం, ఇండియా-చైనా యుద్ధం మొదలైన సందర్భాలలో కూడా అతను తన ఆందోళనను వ్యక్తం చేస్తూ జోక్యం చేసుకున్నాడు. వియత్నాం అంతర్యుద్ధంలో అమెరికా తలదూర్చి ఉత్తర వియత్నాంను మరుభూమిగా మార్చడాన్ని అతడు తొలినుంచి తీవ్రంగా వ్యతి రేకిస్తూనే వచ్చాడు. వియత్నాం యుద్ధంలో అమెరికా పాత్ర పట్ల ఆనాడు బ్రిటన్‌లో అధికారంలో వున్న హెరాల్డ్ విల్సన్ లేబర్ ప్రభుత్వపు ఉదాసీన వైఖరికి నిరసనగా తాను 51 ఏళ్లుగా సభ్యుడుగా వున్న లేబర్ పార్టీకి రాజీ నామా ఇచ్చాడు కూడా. ఫ్రెంచి తత్వవేత్త సార్త్రె మొదలైన వారితో కలిసి "వియత్నాం యుద్ధ నేరస్తుల విచారణ ట్రిబ్యునల్"ను ఏర్పాటు చేశాడు. అది ఆ రోజులలో పత్రికలలో ప్రముఖంగా ప్రచారం పొంది ప్రపంచం దృష్టిని ఆకర్షించిన ఉదంతం.

రస్సెల్ తత్వవేత్తగా జీవితం ప్రారంభించాడు. ఆ రోజులలో తత్వ, తర్క, గణిత శాస్త్రాలే అతని జీవిత సర్వస్వం. కాని, మానవ జీవితంతో, మానవుడి దైనందిన సుఖదుఃఖాలతో, అతడి ఆశలతో, ఆశయాలతో, బాధలతో, భయా లతో సంబంధంలేని తర్క, గణిత, తత్వ శాస్త్రాలు వృథా అని, మానవజాతి కళ్యాణానికి దోహదం చేయని తత్వ చింతన నిరుపయోగమని అతడు త్వరలోనే గ్రహించాడు. అందుచేతనే, ఒక వైపు తాత్వికలోక విహారం చేస్తూనే, మరొక వైపు లోక కళ్యాణ కృషికి తన జీవితాన్ని అంకితం చేశాడు. అతని సుదీర్ఘ కర్మణ్య జీవితం 98 వ ఏట – 1970 ఫిబ్రవరి 2 వ తేదీన ముగిసింది. చివరవరకు అతడు వివిధ అంతర్జాతీయ రాజకీయ సంఘటనల పట్ల ఆసక్తి చూపడం, ఆయా ఉద్యమాల్లో ప్రత్యక్షంగా పాల్గొనడం, వాటిపై పత్రికలకు వ్యాసాలు, లేఖలు వ్రాయడంతో పాటు, అతని సాహిత్య కృషి కూడా నిరం తరాయంగా కొనసాగింది. అంతిమ సంవత్సరాలలో తన నిరంతర సాహిత్య కృషీవలత్వానికి పరమ సాఫల్యంగా మూడు సంపుటాలలో తన స్వీయ జీవిత చరిత్ర రచించాడు. తుదివరకు అతని రచనలలో అతనికి సహజ సిద్ధమైన వ్యంగ్యం, హాస్య చాతుర్యం, తర్క నైపుణ్యం, శైలీ సారళ్యం, భావ తారళ్యం తొణికిస లాడుతూనే వుండేవి.

## తార్కిక విశ్లేషణ

పాశ్చాత్య తత్వవేత్తలను రెండు రకాలవారుగా రస్సెల్ విభజించాడు. ఒక రకంవారు గణిత శాస్త్రజ్ఞులు. వారు గణిత - తర్క శాస్త్ర సహాయంతో ప్రపంచాన్ని విశ్లేషించి అర్థం చేసుకోవడానికి యత్నించినవారు.

ప్రాచీన కాలపు గ్రీకు తత్వవేత్త పితాగరస్ గణిత పండితుడే. అసలు ఈ ప్రపంచమే సంఖ్యామయమని అతడి విశ్వాసం. ఆ తర్వాత ప్లేటో, కాంట్, లైబ్నిజ్ మొదలైనవారు కూడా గణితశాస్త్ర సూత్రాల నేపథ్యంలో ప్రపంచ విశ్లేషణ చేసిన వారే. వీరిని మేథమేటికల్ ఫిలాసఫర్స్ అంటారు.

వీరిది బుద్ధివాదం (రేషనలిజం). సత్యాన్ని గురించిన జ్ఞానానికి ఇంద్రియానుభవం అక్కరలేదని వారు అంటారు. రెండు రెళ్లు నాలుగు అని తెలుసుకొనడానికి బాహ్య లోకంతో ఎలా పని లేదో మిగిలిన సత్యాల నిరూపణకు కూడా అంతే. ఇలాగే ఇంకొక ఉదాహరణ : "ఎ లన్నీ బి లై, ఎక్స్ ఎ అయితే, ఎక్స్ బి అవుతుంది. ఇందులో ఎ అనేది ఏ వస్తువైనా, ఈ సూత్రానికి భంగం రాదు. ఇది సార్వత్రిక సూత్రం. ప్రపంచంలోని ప్రత్యేక వస్తువులన్నీ అంతరించిపోయినా, వాటికి సంబంధించిన సార్వత్రిక (యూనివర్సల్స్) సూత్రాలకు విప్రతిపత్తి లేదు. తాత్విక సిద్ధాంతాలు కూడా ఇంత నిశ్చయతతో కూడినవై వుండాలని రస్సెల్ కోరాడు.

పైగా ఇంద్రియానుభవం ద్వారా లభించే జ్ఞానం నిర్దుష్టం కాకపోవచ్చు. కాని, కేవలం బుద్ధి ద్వారా, వివేచన ద్వారా లభించేది నిశ్చయ జ్ఞానం (certain knowledge) అయివుంటుంది. గణితం అనుభవాత్పూర్వ శాస్త్రం (a priori). తత్వ శాస్త్రం కూడా అంతే. కాంటినెంటల్ తత్వవేత్తలు ఎక్కువగా ఈ విధమైన బుద్ధివాదాన్ని ఆశ్రయించిన వారు.

కాగా, బ్రిటన్‌లో ఇందుకు భిన్నమైన అనుభూతివాదం (ఎంపిరిసిజం) వెలసింది. ఫ్రాన్సిస్ బేకన్ ఇండక్టివ్ పద్ధతి దీనికి ప్రేరణ. డిడక్టివ్ పద్ధతిలో మౌలిక సత్యాల నుంచి ప్రత్యేక సత్యాలను ఆవిష్కరించడం జరుగుతుంది. కాగా, ఇండక్టివ్ పద్ధతిలో ప్రత్యేక సత్యాలను గమనించి, పరిశీలించి, తర్కించి, మౌలిక, సాధారణీకృత సత్యాలను ఆవిష్కరించడం జరుగుతుంది. ఇది ఇంద్రియానుభవంపై ఆధారపడిన వివేచన. ఇది బ్రిటిష్ ఎంపిరికల్ తత్వవివేచనకు మార్గదర్శకమైంది. బ్రిటిష్ ఎంపిరిసిజానికి మూల పురుషులు లాక్, బెర్క్లీ, హ్యూమ్.

రస్సెల్ ప్రధానంగా, ప్రథమంగా గణితవేత్త, తర్క పండితుడు. అతనిది మేథమేటికల్ లాజిక్. అతనికి మొదటగా పేరు తెచ్చిన "ప్రిన్సిపియా మేథమేటికా" (వైట్‌హెడ్‌తో కలిసి చేసిన రచన) వంటి గ్రంథాలలో గణిత-తర్క స్వభావాన్ని వివరించాడు. తర్కంలో ఉపయోగించే పరిభాష గణితానికి కూడా వర్తిస్తుందని, అసలు తర్కం, గణితం వేర్వేరు కావని, వాటి ఆధారంతో తత్వ సత్యాలను నిరూపించ వచ్చునని ఆ గ్రంథాలలో వాదించాడు.

అయితే, రస్సెల్‌లో బ్రిటిష్ తత్వశాస్త్రంలో అనుస్యూతంగా వస్తున్న అనుభూతివాద ధోరణి కూడా ప్రబలంగా ఉంది. అందుచేత అటు గణిత-తర్కం, ఇటు అనుభూతివాదం-ఈ రెండింటి సమ్మేళనం ద్వారానే తత్వ సత్యాలు పరిపూర్ణం అవుతాయని, ఆధునిక విజ్ఞాన శాస్త్రాలు తెలియచేసే విషయాలను అలక్ష్యం చేసి తత్వవివేచన పురోగమించలేదని, తత్వ శాస్త్రాన్ని ఆధునిక విజ్ఞాన శాస్త్రాలకు దగ్గరగా తీసుకురావడమే తాత్వికుల కర్తవ్యమని అతడు అంటాడు.

రస్సెల్ సుదీర్ఘ జీవితంలో అతని తత్వ వివేచన బహుముఖంగా సాగింది. తన జీవితపు వివిధ దశలలో అతడు విభిన్న వాదాలను చేపట్టాడు. అందుచేత అతని చింతనలో వైరుధ్యాలు కనిపిస్తాయని విమర్శకులు అంటారు. ఈ కారణం చేత అతని చింతనను క్లుప్తీకరించి చెప్పడం కష్టసాధ్యమని కూడా అంటారు. అయితే ఆ క్లుప్తీకరణను ఆయనే స్వయంగా తన "పాశ్చాత్య తత్వశాస్త్ర చరిత్ర" గ్రంథంలో చేశాడు.

రస్సెల్ సిద్ధాంతాన్ని "ఫిలాసఫీ ఆఫ్ లాజికల్ ఎనాలిసిస్" తర్క విశ్లేషణ వాదం అంటారు. అతనిపై తొలి రోజులలో సహాధ్యాయి మూర్, ఆ తర్వాత వైట్‌హెడ్. ఆ పిదప తన శిష్యుడైన విట్‌జెన్‌స్టయిన్, ఇంకా అంతకు ముందు కాంటర్, ఫ్రెజ్, ష్రోడర్, సీనో మొదలైనవారి ప్రభావాలున్నాయి. ఆ పిదప అతని గణిత-తర్క విశ్లేషణ ప్రభావం యూరపియన్ తత్వవేత్తలపై ఎక్కువగా పడింది. ఈ శతాబ్దంలోనే కాక అరిస్టాటిల్ తర్వాత అంతటి తార్కికుడు మరి లేడని పేరు పొందాడు. అంతేకాదు; అరిస్టాటిల్ తన డిడక్టివ్ లాజిక్ (నిగమన తర్కం)లో చేసిన తప్పులను, వైరుధ్యాలను పరిష్కరించినవాడుగా కీర్తి గడించాడు.

రస్సెల్ తర్కంలో "థియరీ ఆఫ్ టైప్స్" (వర్గాల వాదం) అనబడేది ఆసక్తి కరమైంది. ఈ వాదం ప్రకారం "ఒక సమూహం మొత్తానికి, లేదా వర్గం మొత్తానికి వర్తించే ఏ ప్రతిపాదన ఆ సమూహంలో, వర్గంలో భాగమై ఉండరాదు." అంటే ఒక ప్రతిపాదన ఇతర విషయాలకు వర్తించవలసిందే తప్ప తనకు వర్తించరాదు. దీనికి ఉదాహరణగా క్రీట్ ద్వీప రాజ్యానికి చెందిన ఎపిమెనిడీస్ వాక్యంలోని వైరుధ్యాన్ని సాధారణంగా పేర్కొంటారు.

"All Cretans are always liars".

"క్రీటన్ జాతివారందరు ఎప్పుడూ అబద్ధాలాడుతారు" అన్నది ఆ వాక్యం. ఆ వాక్యంలోని ప్రతిపాదన నిజమా కాదా?

అలాగే ఒకడు "నేను అబద్ధం ఆడుతున్నాను" అంటాడనుకోండి. ఆ మాటను మనం నమ్మాలా, అక్కరలేదా? అతడు చెప్పింది నిజమైతే ఆ వాక్యం అబద్ధం. అతడు అబద్ధం చెబుతుంటే ఆ వాక్యం నిజం. అంటే ఆ వాక్యం నిజమైతే అబద్ధం, అబద్ధమైతే నిజం. ఇది ఎలా పొసగుతుంది? ఎంత ప్రయత్నించినా ఈ వైరుధ్యం నుంచి, విషవలయం నుంచి బయటపడ లేము. దీన్ని పరిష్కరించడానికి రస్సెల్ "ఏ ప్రతిపాదనను అది ఉద్దేశించిన విషయానికి తప్ప తనకు తనను వర్తింపజేయరాదు" అని సూత్రీకరించాడు. అలా ఒక వాక్య ప్రతిపాదనను దానికి దాన్ని వర్తింపజేస్తే అది అర్థరహితమవు తుంది. ముఖ్యంగా "ఏ ప్రతిపాదన అయినా" అని గాని, "అన్ని ప్రతిపాదనలు" అని గాని సాధారణీకరించడం అర్థం లేదని. దాని బదులు "కొన్ని ప్రతిపాద నల సమూహాలు" అని వ్యవహరించాలి. "నేను అబద్ధమాడుతున్నాను" అనే వాక్యాన్ని అదే వాక్యానికి వర్తింపజేయరాదు. ఆ వాక్యం అటువంటి ఇతర ప్రతిపాదనల సమూహానికి వర్తిస్తుంది.

ఇది కాక రస్సెల్ తర్క సిద్ధాంతాలలో మరొక ఆసక్తికరమైనది "థియరీ ఆఫ్ డిస్క్రిప్షన్స్" : వర్ణనా సిద్ధాంతం. ఇది నిత్య వ్యవహారంలో వాడుకలో వున్న వాక్యాల విశ్లేషణకు సంబంధించింది. కొన్ని వాక్యాల నిర్మాణం వల్ల ఆ వాక్యాలలోని వస్తువులకు అస్తిత్వం కలదని సూచితమవుతుంది. దీనికి రస్సెల్ ఇచ్చిన ఉదాహరణలలో ఒకటి "బంగారపు కొండ అనేది లేదు" (The golden mountain does not exist). అంటే బంగారపు కొండ అనే లేని వస్తువు ఉందని అర్థం. ఈ విధంగా లేని వస్తువుల అస్తిత్వపు సమస్యను పరిష్కరించడానికి తన వర్ణనా సిద్ధాంతాన్ని (థియరీ ఆఫ్ డిస్క్రిప్షన్స్) రస్సెల్ ప్రవేశపెట్టాడు. ఇందుకు రస్సెల్ ఇచ్చిన మరొక ఉదాహరణ "Scott was the author of Waverly" వేవర్లీ నవల రచయిత స్కాట్ అనే వాక్యం. (ఇంగ్లీషు రచయిత సర్ వాల్టర్ స్కాట్ మారు పేరుతో వేవర్లీ అనే నవల వ్రాశాడు. ఆ సంగతి ఆ తర్వాత కొంతకాలానికి కాని బయటపడలేదు.) ఆ వాక్యానికి అర్థం "ఒకే ఒక వ్యక్తి వేవర్లీ నవల వ్రాశాడు. అతని పేరు స్కాట్." ఈ వాక్యాన్ని ఇలా విశ్లేషించాలని రస్సెల్ అంటాడు : "సి అనే శాల్తీ ఎటువంటిదంటే 'వేవర్లీ నవలను ఎక్స్ వ్రాశాడు' అనే వాక్యం ఎక్స్ సి అయితేనేం నిజం. కాకపోతే అబద్ధం. సి అంటే స్కాట్." (There is an entity C such, that the statement 'X wrote Waverly' is true if X is C and false otherwise; moreover C is Scott.) ఈ వాక్య విశ్లేషణ వల్ల వేవర్లీ వ్రాసిన రచయితకు అస్తిత్వం కలదని తెలుస్తుంది. ఇదే విశ్లేషణను బంగారపు కొండ ప్రతిపాదనకు ఇలా వర్తింపజేయాలి: "సి అనే శాల్తీకి అస్తిత్వం ఏ విధంగా లేదంటే 'ఎక్స్' అనేది

'బంగారంతో కూడిన కొండ' అనే వాక్యం ఎక్స్ సి అయితేనే నిజం, లేకపోతే కాదు." ("There is no entity C such, that X is golden and mountainous, is true if X is C but not otherwise.")

"వాక్యాలను ఈవిధంగా విశ్లేషించడం వల్ల ప్లేటోతో ప్రారంభమై రెండు వేల ఏళ్లపాటు వస్తువుల అస్తిత్వం గురించి తాత్విక లోకంలో పాతుకుపోయి వున్న గందరగోళం తొలగిపోతున్నది" అని రస్సెల్ అంటాడు.

రస్సెల్ గణిత–తర్క సిద్ధాంతాలు ప్రత్యేకంగా తర్క విద్యార్థులకే ఎక్కువ ఆసక్తి కలిగిస్తాయి. అవి పూర్తిగా సాంకేతికమైన సిద్ధాంతాలు. సాధారణ పాఠకుల అవగాహనకు అంత తేలికగా అందనట్టివి. అయినా రస్సెల్ తత్వచింతన ఏ విధంగా వుంటుందో సూచించదలచినప్పుడు అతని తర్క పద్ధతిని ఈ మాత్రమైనా ప్రస్తావించకపోవడం భావ్యం కాదని పై ఉదాహరణలను పేర్కొనవలసి వచ్చింది.

## రస్సెల్ వైజ్ఞానిక తత్వం

బెర్ట్రాండ్ రస్సెల్ తాత్విక సిద్ధాంతాలు తరచుగా మారుతూ వుండేవన్న ప్రథ గురించి ఇదివరకు తెలుసుకున్నాము. ఆయన 1959 లో ప్రచురించిన "మై ఫిలసాఫికల్ డెవలప్‌మెంట్" అనే గ్రంథంలో ప్రపంచం గురించిన అప్పటి తన విశ్వాసాలను, దృక్పథాన్ని వివరిస్తూ ఒక ప్రకరణం వ్రాశాడు. దాని ప్రకారం రస్సెల్‌ది ప్రధానంగా వైజ్ఞానిక దృక్పథం అని గ్రహించవచ్చు.

నిజానికి రస్సెల్‌ది మొదటి నుంచి వైజ్ఞానిక తత్వమే (సైంటిఫిక్ ఫిలాసఫీ). అంటే అతనివి విజ్ఞాన శాస్త్రాల పరిశోధనలు, పరిశీలనలపై ఆధారపడి నిర్మించుకున్న తాత్విక విశ్వాసాలు. ముఖ్యంగా నాలుగు వేర్వేరు విజ్ఞాన శాస్త్రాల - ఫిజిక్స్ (భౌతికశాస్త్రం), ఫిజియాలజీ (శరీర శాస్త్రం), సైకాలజీ (మనస్తత్వ శాస్త్రం) మేథమేటికల్ లాజిక్ (గణిత తర్కం) - సమన్వయం నుంచి తన ప్రపంచ తత్వ విచారం బయలుదేరుతుందని ఆయన అంటాడు. విజ్ఞాన శాస్త్రాలను, ముఖ్యంగా భౌతిక శాస్త్రాన్ని, దాని పరిశోధనలను కాదని తత్వ శాస్త్రం పురోగమించలేదని రస్సెల్ భావించాడు. ఇది బుద్ధివాదుల విశ్వాసానికి భిన్నమైనది. బుద్ధివాదులు బాహ్య ప్రపంచ పరిశోధనతో నిమిత్తం లేకుండానే మనం కేవలం వివేచనద్వారానే సత్యదర్శనం చేయగలమని అంటారు. దీన్ని రస్సెల్ కొంతవరకే అంగీకరించాడు. దాన్ని అనుభవవాదంతో సమన్వయించడానికి ప్రయత్నించాడు.

న్యూటన్ కాలంలో ఫిజిక్స్‌కు ఒక స్పష్టత, నిశ్చయత వుండేది. రానురాను, స్పష్టత, నిశ్చయత తగ్గిపోయాయి. ఉదాహరణకు న్యూటన్ స్థలం, కాలం, పదార్థం, శక్తి-ఇవన్నీ వేర్వేరు కేవల (absolute) విషయాలని భావించాడు. కాని, ఆధునిక భౌతిక శాస్త్ర ప్రకారం స్థలం, కాలం కలిపి "స్థలకాలం" (Space-Time) అనే ఒకే భావంగా మారిపోయాయి. అలాగే పదార్థం, శక్తి భిన్నమైనవి కావని తేలిపోయింది. అసలు పదార్థం అనేదే అదృశ్యమవుతూ వచ్చి వచ్చి కేవలం సంఘటనల (Events) పరంపర మాత్రమే మిగిలింది.

అందుచేత ఫిజిక్స్-భౌతిక శాస్త్రం-రాను రాను గందరగోళంగా తయారైందని రస్సెల్ అంటాడు. అంతమాత్రాన ఫిజిక్స్ పనికిమాలిన శాస్త్రమైపోలేదు. ఆధునిక భౌతిక శాస్త్రాన్ని అలక్ష్యం చేయలేమని, ఏ దేశమైనా అలా అలక్ష్యం చేస్తే శత్రురాజ్యం దాన్ని మాడు పగలగొడుతుందని, ఆధునిక శాస్త్రజ్ఞుని చేతిలో అపారమైన శక్తి కేంద్రీకృతమై వుందని రస్సెల్ హెచ్చరిస్తాడు.

భౌతిక శాస్త్రం పదార్థాన్ని (మేటర్) సంఘటనలుగా మార్చివేసింది. ఆ సంఘటనలు మన అనుభవంలోకి వచ్చినప్పుడే వాటి యథార్థ స్వభావం మనకు తెలుస్తుంది. అవే సంఘటనలు మనకు వెలుపల జరిగితే వాటి ఆంతర స్వభావం మనకు తెలియదు. అనుమాన ప్రమాణం (inference) ద్వారా దాన్ని ఊహించవలసిందే. భౌతికశాస్త్రం మనకు వెలుపల జరిగే సంఘటనలను గురించి గణిత సూత్రాల రూపంలో తెలియజేస్తుంది. కాని, ఆ గణిత సూత్రాలనుబట్టి సంఘటనల యథార్థ స్వభావాన్ని ఊహించలేము.

దీనికి రస్సెల్ కొన్ని ఉదాహరణ లిచ్చాడు :

రాత్రిపూట ఒకచోట ఒక కెమేరాలో ఫొటోగ్రాఫిక్ ప్లేటుపెట్టి నక్షత్రాలతో కూడిన ఒక ఆకాశ భాగాన్ని ఫొటో తీస్తామనుకోండి. అప్పుడు జరిగేది ఏమిటి? నక్షత్రాల ఛాయా చిత్రాన్ని ఫొటోగ్రాఫిక్ ప్లేటు రికార్డు చేస్తుంది. ఈ మధ్యలో ఏమి జరుగుతుంది? నక్షత్రాలున్నచోట జరిగే సంఘటనలు బయలుదేరి కెమేరా వద్దకు ప్రయాణం చేసి వస్తున్నాయి. అలా బయలుదేరి వచ్చేదాన్ని కాంతి అంటున్నాము. కాంతి తరంగాలుగా ప్రయాణం చేస్తుందని ఇదివరకు అనుకునేవారు. ఇప్పుడు క్వాంటం సిద్ధాంతం వచ్చిన తర్వాత కాంతి ఫొటాన్లు అనబడే సూక్ష్మ విద్యుదయస్కాంతశక్తికణాల రూపంలో ప్రయాణం చేస్తుందని తెలియవచ్చింది.

నక్షత్రం నుంచి బయలుదేరిన ఫొటాన్లు మార్గమధ్యంలో పెద్దగా మార్పులకు లోనుకాకుండానే ప్రయాణం చేస్తాయి. కాని, అవి మన వాతావరణం వద్దకు వచ్చే సరికి చాలా మార్పులు జరుగుతాయి. ఆ ఫొటాన్లను మబ్బులు

అడ్డుకోవచ్చు. లేక మన వాతావరణంలోకి వచ్చేసరికి అవి బలహీన పడవచ్చు. ఫోటోగ్రాఫిక్ ప్లేటుపై పడితే ఒక నల్లని చుక్కవలె ఒక ఛాయా చిత్రం ఏర్ప డవచ్చు. దాన్ని ఆ, నక్షత్రపు ఛాయగా ఖగోళవేత్త గుర్తించి పరిశీలిస్తాడు. అలాకాక మన కంటిపై పడవచ్చు. అప్పుడు మరికొన్ని విచిత్రాలు జరుగు తాయి. వాటిని శరీర శాస్త్రజ్ఞుడు పరిశోధిస్తాడు. కంటి పైభాగంపై పడి కంటి నరాలలో కదలికలు పుట్టించగా, ఆ కదలికలు మెదడులో చూపునకు సంబంధించిన భాగాన్ని చేరడం జరుగుతుంది. ఆ మెదడు ఎవరిదో ఆ వ్యక్తి నక్షత్రం అనే వస్తువును చూస్తున్నానని భావిస్తాడు.

అయితే, నక్షత్రం నుంచి కాంతి ఫోటాన్‌ల రూపంలో బయలుదేరిన దగ్గర నుంచి మనం నక్షత్రాన్ని చూస్తున్నామని భావించేవరకు, ఈ మధ్య కాలంలో జరిగే అనేక సంఘటనలకు అసలు నక్షత్రానికి ఎక్కడా పోలిక లేదు. నక్షత్రం వున్నచోట నిశ్చయంగా ఏదో జరుగుతున్నది. అలాగే మన మెదడులో దృష్టికి సంబంధించిన భాగంలో ఏదో జరుగుతున్నది. ఈ రెండింటికి మధ్య జరిగే భౌతిక ప్రక్రియలకు మనం చూసే నక్షత్ర దృశ్యానికి పోలిక లేదు. ఆ ప్రక్రియలను కేవలం ఫోటాన్లకు సంబంధించినంతవరకు భౌతిక శాస్త్రజ్ఞుడు, కంటిలో, మెదడులో జరిగే ప్రక్రియలకు సంబంధించినంతవరకు శరీర శాస్త్ర జ్ఞుడు పరిశోధిస్తారు. ఆ పరిశోధనా ఫలితాలకు, నక్షత్ర దృశ్యానికి పోలిక వుండదు. అయినా ఆ ప్రక్రియలు జరగనిదే నక్షత్ర దృశ్యం కనబడదు.

అలాగే రేడియోలో ఒక వక్త ప్రసంగిస్తున్నా డనుకోండి. అది మనం వింటు న్నాము. వక్త ప్రసంగానికి, దాన్ని మనం వినడానికి మధ్య జరిగే ప్రక్రియలన్నీ విజ్ఞాన శాస్త్రాలకు సంబంధించినవి. వాటిని గణితసూత్రాల (ఈక్వేషన్స్) ద్వారానే తెలుసుకోగలము. శబ్ద తరంగాలు రేడియో తరంగాలుగా, తిరిగి అవి శబ్ద తరంగాలుగా మారి మన శ్రవణేంద్రియం ద్వారా మెదడుకు చేరి మనం వినడం జరుగుతుంది. ఆ ప్రసంగానికి, ఆ తర్వాత జరిగే భౌతిక ప్రక్రియలకు ఏ పోలిక వుండదు. అయినా, ఆ ప్రక్రియలకు ఆ ప్రసంగం కారణమైనట్టే, ఆ ప్రక్రియలు జరగనిదే ఆ ప్రసంగాన్ని మనం వినడం జరగదు.

దీన్నిబట్టి మనకు వెలుపల జరిగే సంఘటనలు, భౌతిక ప్రక్రియలు అను మాన ప్రమాణం (inference) పై ఆధారపడినవని రస్సెల్ అంటాడు. అంటే ఫిజిక్సు చెప్పే సంఘటనలు, వాటికి సంబంధించిన గణిత సూత్రాలు మన అనుభవ పరిధిలోకి వచ్చేవి కావు. ఉదాహరణకు ఫోటాన్లు, ఎలక్ట్రాన్‌లు, ప్రోటాన్‌లు న్యూట్రాన్లు మొదలైన వస్తువుల అస్తిత్వం అనుమాన ప్రమాణంపై ఆధారపడినట్టిది. అవి నిజంగా ఏ రూపంలో వున్నాయనేది, వాటి ఆంతర

స్వభావం ఎటువంటిది అనేది మనకు తెలియదు. ఒకానొక శాస్త్రీయ ప్రయోజనాన్ని తీర్చడానికి వాటిని ప్రతిపాదిస్తాము. ఉదాహరణకు ఎలక్ట్రాన్ అనేదాని శాస్త్రీయావసరాన్ని తీర్చే ఏ పదార్థాన్ని అయినా మనం ఎలక్ట్రాన్ అని పిలవచ్చు. అది లేదని మనం అనలేము. కాని, దాని అసలు స్వభావాన్ని మనం తెలుసుకోలేము.

అయితే, మొత్తం విశ్వమంతా అనుమాన ప్రమాణంపై ఆధారపడింది కాదు. మనం కొన్ని వస్తువులను సైన్సు సహాయం లేకుండా మనంతట మనం నేరుగా గ్రహించగలము. మన అనుభవ పరిధిలోకివచ్చే విషయాలన్నీ అటువంటివే. ఉదాహరణకు- మనకు చల్లగా వున్నదన్నా, వేడిగా వున్నదన్నా సైన్సు ప్రమేయం లేకుండానే అది అవగతమవుతుంది. అలాగే మనం నేరుగా మన జ్ఞానేంద్రియాలతో తెలుసుకునే విషయాలు కూడా సైన్సు ప్రమేయం లేకుండా మన అనుభవంలోకి వచ్చేవే.

అందుచేత తన సిద్ధాంతం ప్రకారం గణిత- భౌతిక శాస్త్రం బాహ్య ప్రపంచం గురించి చెప్పే విషయాలు గణిత సూత్రాలకు సంబంధించినవేతప్ప వాటితోనే ప్రపంచం నిర్మితమైందని చెప్పలేమని అంటాడు రస్సెల్. అవి అనుమాన ప్రమాణంపై ఆధారపడినవి. అలాకాక, అనుమాన ప్రమాణంతో ప్రమేయం లేకుండా మనం చూసే ప్రపంచం మన స్వీయ, వైయక్తిక ప్రపంచమని, ఈ విషయంలో తాను బెర్క్లీతో ఏకీభవిస్తున్నానని అంటాడు రస్సెల్. ఈ వాదం ప్రకారం మన నేత్రేంద్రియం ద్వారా చూసే నక్షత్ర ఖచిత గగనం మనలోనే వున్నట్లు అవుతుంది. కాగా, మనకు వెలుపలగల నక్షత్రాకాశం అనుమాన ప్రమాణంపై ఆధారపడింది అవుతుంది.

రస్సెల్ తాత్విక విశ్వాసాలలో ముఖ్యమైనది "న్యూట్రల్ మోనిజం"— తటస్థ అద్వైతవాదం. పాశ్చాత్యదార్శనికులు పలువురు మనస్సు, పదార్థం ఏ సంబంధంలేని రెండు విభిన్న విషయాలని భావించారు. దీన్ని రస్సెల్ అంగీకరించలేదు. మనస్సుకీ, పదార్థానికి ఒకే మూలాధారం వుందని, ఆ మూలాధారం అటు మనస్సు లక్షణాలుకాని, పదార్థం లక్షణాలుకాని లేని తటస్థ వస్తువని, దానినుంచే మనస్సు, పదార్థం వచ్చాయని అతడు ప్రతిపాదించాడు.

ఆధునిక భౌతికశాస్త్రం మనస్సును పోనుపోను అమానసిక పదార్థంగా చేస్తుంటే, ఆధునిక మనస్తత్వశాస్త్రం పదార్థాన్ని పోనుపోను అభౌతికంగా చేస్తున్నదని రస్సెల్ అంటాడు. అంటే మనస్సు, పదార్థం అటునుంచి ఒకటి, ఇటునుంచి ఒకటి పరస్పరం సమీపిస్తున్నాయి. బహుశా రెండింటికి ఆధారమైన తటస్థ మౌలిక తత్వం వేరే వుండి వుండాలి.

పోతే, తత్వశాస్త్రంలో ఒక ముఖ్యమైన విభాగం విజ్ఞానశాస్త్ర విశ్లేషణకు అందని దని రస్సెల్ అంగీకరిస్తాడు. అది విలువలకు (values) సంబంధించిన రంగం. మంచి, చెడు, న్యాయం, అన్యాయం, సుందరం, వికృతం మొదలైన విలువలు విజ్ఞాన శాస్త్ర విచార పరిధిలోకి రావు. ఉదాహరణకు ఒక జీవిని మరొక జీవి క్రూరంగా హింసించి పొందే ఆనందం చెడ్డదని సైన్సు ద్వారా నిరూపించలేము. అది సైన్సు పరిధిలోకి వచ్చే అంశం కాదు. అది నైతికమైన విలువలకు సంబంధించిన ప్రశ్న.

ప్రపంచానికి సంబంధించిన భౌతిక విజ్ఞానమంతా సైన్సు ద్వారానే మనం సంపాదించగలము. కాని, అనుభూతికి (feeling) సంబంధించిన విలువలు సైన్సుకు అతీతం.

తత్వశాస్త్రంలో రెండు ముఖ్య విభాగాలున్నాయి. ఒకటి - ఈ ప్రపంచపు తత్వం ఏమిటి, దాని యాథార్థ్యం ఏమిటి అనేది. రెండవది - ఏది ఉత్తమ జీవితం, ఏది విలువైనది, కోరదగినది అనే ప్రశ్న.

ప్లేటోనుంచి విలియం జేమ్స్ వరకు తత్వవేత్తలు విశ్వ స్వభావం గురించిన తమ అభిప్రాయాలను ఏది ఉత్తమ జీవితం అనే ప్రశ్నపై తమ అభిప్రాయాలతో ముడిపెట్టారని రస్సెల్ విమర్శిస్తాడు. ఏ సూత్రాల ప్రకారం నడుచుకొంటే మానవులు సత్ప్రవర్తనులవుతారో ఆ సూత్రాలు అనుష్ఠించదగినవేకాక, తార్కికంగా కూడా అవి తిరుగులేని సార్వత్రిక సత్యాలని రుజువు చేయడానికి ఆయా తత్వవేత్తలు ప్రయత్నించారు. కాని, వారి వాదాలు నైతిక దృష్టినుంచేకాక, తార్కిక దృష్టినుంచి కూడా తప్పు అని రస్సెల్ అభిప్రాయపడ్డాడు.

తత్వవేత్త ప్రధాన కర్తవ్యం సత్యాన్వేషణ, తత్వ నిరూపణ. దానికి తప్ప మరొకదానికి తన తర్క శక్తిని ఉపయోగించరాదు. అలా ఉపయోగించడం తత్వ శాస్త్రాన్ని పక్కదారి పట్టించడమే. ఏది సత్యం, ఏది అసత్యం అనే విషయాన్ని నిష్పాక్షికంగా, వస్తుగతంగా దర్యాప్తు చేయకముందే కొన్ని విశ్వాసాలు సార్వత్రిక సత్యాలని వాదించడం పొరపాటు అంటాడు రస్సెల్.

తత్వశాస్త్ర విచారం మత విశ్వాసాలను సత్యాలుగా నిరూపించలేదు, అసత్యాలుగా నిరాకరించనూ లేదు. కాని, ప్లేటోతో మొదలుపెట్టి పలువురు తత్వవేత్తలు దేవుడు వున్నాడని, ఆత్మ నిత్యమని నిరూపించడానికి సాక్ష్యాలుగా వివిధ వాదాలను సృష్టించారు. కాని, వారు ఒకరి వాదాన్ని ఒకరు ఖండించుకోవడంతోనే సరిపోయింది. ఖండించడంతో సరిపెట్టక, తమ విశ్వాసాలను తమ అంతరజ్ఞానం (intuition) తో సాధించినవిగా భ్రమపడి, భయపెట్టడానికి ప్రయత్నించారు.

దీన్ని తన తర్క విశ్లేషణ - లాజికల్ ఎనాలిస్ - వాదంతో రస్సెల్ తిరస్కరిస్తాడు. కేవలం మానవ మేధ మానవ జీవితానికి సంబంధించిన అనేక ముఖ్య ప్రశ్నలకు సమాధానం కనుగొనలేనిమాట నిజమే. కాని, అందుకు వేరే ఏదో ఉన్నతమైన, సర్వాతీతమైన మార్గం వుందని, పూర్వ తత్వవేత్తలు నమ్మారు. నిజానికి అటువంటి మార్గం ఏమీ లేదు. కాగా, తర్క విశ్లేషణ (లాజికల్ ఎలాలిసిస్) వాదం సత్య నిరూపణకు ఒక నిర్దుష్ట ప్రక్రియను మాత్రం సమకూరుస్తున్నదని, దాని సహాయంతో అనేక తాత్విక సమస్యలను పరిష్కరించవచ్చునని రస్సెల్ అంటాడు. ఉదాహరణకు - స్థలం, కాలం అంటే ఏమిటి? సంఖ్య అంటే ఏమిటి? మనస్సు అంటే, పదార్థం అంటే ఏమిటి? వీటికి తక్షణం సమగ్ర సమాధానాలు చెప్పలేక పోవచ్చుగాని సమాధానాలను అన్వేషించడానికి ఒక పద్ధతిని, ప్రక్రియను తర్క విశ్లేషణ వాదం కనుగొన్నదని, దాని సహాయంతో సత్యాన్ని పూర్తిగా చేరుకోలేకపోయినా, క్రమక్రమంగా సమీపించవచ్చునని రస్సెల్ అంటాడు. తర్క విశ్లేషణ అనే ఆ ప్రక్రియలో కేవల విశ్వాసానికి (డాగ్మా) తావు లేదు. అది సొంత పైత్యాలకు అవకాశం ఇవ్వక, పరిశీలనకు, అనుమాన ప్రమాణం (inference) పై ఆధారపడిన నిర్ధారణకు మాత్రమే విలువ ఇస్తుంది.

తొలి రోజులలో రస్సెల్ శివం (good), సుందరం (beauty) వంటి విలువలు వస్తుగతమని భావించేవాడు. తర్వాత రోజులలో ఆ వాదం మార్చుకుని, అవి వస్త్వాశ్రయమైనవి కావని, మానవుని కామన (desire) పై ఆధారపడినవని అన్నాడు. విలువలకు బాహ్య, భౌతిక ప్రపంచంలోను, దాన్ని అవగాహన చేసుకునే విజ్ఞాన శాస్త్రంలోను స్థానం లేదు. అలాగే సైన్సులో మతానికి తావు లేదు. దేవుని ఉనికిని, ఆత్మ శాశ్వతత్వాన్ని సైన్సు అంగీకరించదు. అయినా, శివం, సుందరం వంటి విలువలకు మానవ జీవితంలో ప్రధాన స్థానం కలదని రస్సెల్ అంటాడు. నైతిక జీవితం, నైతికమైన విలువలు మత ప్రవక్తలు చెప్పారనికాక, సంప్రదాయ సిద్ధమైనవికాక, మానవ జీవితానుభవంలో నుంచి పుట్టుకురావాలని అతని విశ్వాసం.

బాహ్య విశ్వానికి మానవుని బాగోగులతో, యోగ క్షేమాలతో నిమిత్తం లేదు. అయినా, మానవుడు ఒంటరిగా నిలబడి నిర్భయంగా, స్వేచ్ఛ, న్యాయం, శాంతి, ప్రగతి మొదలైన ఉత్తమ జీవితపు విలువలకోసం నిరంతర కృషి సాగించాలి. తోటివారి కష్ట సుఖాలలో పాలుపంచుకోవాలి. కేవలం మేధావాదిగా, కఠోర తార్కికుడుగా కనిపించే రస్సెల్ మరొకవైపు మానవ జీవితానికి సార్థకత చేకూర్చే నైతిక మూల్యాలకు కూడా తన తర్క విశ్లేషణా, సత్యాన్వేషణకు ఇచ్చినంత విలువ ఇవ్వక తప్పలేదు.



# 36
# అస్తిత్వవాది జీన్ పాల్ సార్త్రె

"విశ్వదర్శనం"లో ఇప్పటవరకు, ప్రాచీనకాలపు గ్రీకు తత్వవేత్తలతో మొదలుపెట్టి, ఇటీవలి బెర్ట్రాండ్ రస్సెల్ వరకు ఎందరెందరి తత్వసిద్ధాంతాలనో స్థాలీపులాకంగా పరామర్శించాము. ఇప్పుడు ఈ "విశ్వదర్శన" యాత్ర పాశ్చాత్య విభాగంలో ఆఖరి మజిలీ చేరుకున్నాము. ఈ చివరి మజిలీకి నేను ఎంచుకున్న దార్శనిక సిద్ధాంతం "అస్తిత్వ వాదం" (Existentialism) అందులోను—

"ఝాఁపోల్ సార్త్రె సాండించిన
ఎగ్జిస్టెన్షియాలిజం
జీవన మరణ నరక నాక
పట్ సూపర్ రియాలిజం"— (శ్రీ శ్రీ)

ఎందుకంటే అస్తిత్వవాదం ఒకే ఒక సిద్ధాంతం కాదు. ఆ పేరుతో విభిన్న సిద్ధాంతాలు వున్నాయి. వాటిని Existentialist Philosophies లేదా Philosophies of Existence అని అంటారు. నిజానికి అస్తిత్వవాదులు ఎందరున్నారో అన్ని అస్తిత్వ వాదాలున్నాయి. వీరిలో కొందరు నిరీశ్వర వాదు (atheists) లైతే,

మరికొందరు ఈశ్వర వాదులు (theists). నిజానికి వారిలోను, వీరిలోను కూడా తాము అస్తిత్వ వాదుల (Existentialists) మనే విషయం కొందరు ఒప్పుకోరు.

అసలు అస్తిత్వవాదం అనే తాత్విక వ్యవస్థ (Philosophical system) లేదని, అస్తిత్వవాద ధోరణి, అస్తిత్వవాద దృక్పథం మాత్రమే వున్నాయని కొందరు అంటారు. ఫిలాసఫీ అనగానే దానికొక తర్క నిరూపణ, సమగ్ర వివేచన వుండాలి. అటువంటిది దీనిలో ఏమీ లేదని, అసలు దాన్ని వ్యవస్థీకరించడం కష్టమని కొందరి భావం. కనుకనే అస్తిత్వ వాదాన్ని ఒక తాత్విక సిద్ధాంతంగా కాక, మానవుడి పరిస్థితిని (human situation) ప్రతిబింబించే ఒక దృక్పథంగా పరిగణించాలని, అందుచేతనే అది తాత్విక గ్రంథాలలో కంటె కథలు, నవలలు, నాటకాల వంటి సృజనాత్మక సాహిత్యంలో చక్కగా భాసిస్తుందని అంటారు.

అయినా, అస్తిత్వ వాదం అనే తాత్విక సిద్ధాంతం (Philosophy) నిస్సందేహంగా వున్నదని తత్వశాస్త్ర చరిత్రకారులు పేర్కొన్నారు. ఆధునిక కాలంలోనే ఈ వాదం బాగా ప్రచారంలోకి వచ్చినప్పటికి దీని ఛాయలు ఓల్డ్ టెస్టమెంట్‌లోని "సామ్స్" (Psalms) గీతాలలో కనబడతాయని అంటారు. "మానవుడే అన్నిటికి కొలమానం" (Man is the measure of all things) అన్న ప్రాచీనకాలపు గ్రీకు సోఫిస్టు తత్వవేత్త ప్రోటాగరస్ సూక్తిలో అస్తిత్వవాద బీజాలున్నాయని, "నిన్ను నీవు తెలుసుకో" (know thyself) అన్న సోక్రటీస్ సూక్తిలో అస్తిత్వ వాదం నీడ లున్నాయని కూడా అంటారు. అలాగే భగవంతుడిని వివేచన ద్వారా కాక హృదయం ద్వారా చేరుకోవాలని విశ్వసించిన పదిహేడవ శతాబ్దపు ఫ్రెంచి భౌతిక-గణిత శాస్త్రవేత్త తత్వవేత్త బ్లేస్ పాస్కల్ భావాలలో అస్తిత్వ వాదం పోలికలు కలవని, రూసో రచనలలో కూడా కనిపిస్తాయని చెబుతారు.

అయితే, ఆధునిక కాలంలో అస్తిత్వవాదానికి గట్టి పునాదులు వేసినవాడు డేనిష్ తత్వవేత్త సోరెన్ కీర్క్‌గార్డ్. ఈయన గురించి 31 వ అధ్యాయంలో వివరించాను. అతని తర్వాత ఎడ్మండ్ హుస్సెర్ల్, కార్ల్ యాస్పర్స్, మార్టిన్ హైడెగ్గర్, పాల్‌టిల్లిక్ మొదలైన జర్మన్ తత్వవేత్తలు, గేబ్రియల్ మార్సెల్ వంటి ఫ్రెంచి తత్వవేత్తలు అస్తిత్వవాదంలో విభిన్న శాఖలకు ఆచార్యులయ్యారు.

కాని వీరందరికంటె ప్రసిద్ధుడు, ఒక తత్వ సిద్ధాంతంగా అస్తిత్వ వాదానికి ప్రపంచ మంతటా అపార ప్రచారం కల్పించి అసంఖ్యాకులకు అభిమాన తత్వవేత్త, అభిమాన రచయిత అయినవాడు జీన్ పాల్ సార్త్రె.

ఒక్కొక్క కాలంలో ఒక్కొక్క తాత్విక సిద్ధాంతం విశేష ప్రచారం పొందుతుందని ఇంతకుముందు బెర్గ్‌సన్ గురించిన అధ్యాయంలో వ్రాశాను. బెర్గ్‌సన్

సృజనాత్మక పరిణామ వాదం ఈ శతాబ్దపు మొదటి రెండు, మూడు దశాబ్దాలలో ఎంతో ప్రచారం పొంది, ఎందరో రచయితలను ప్రభావితం చేసిందని కూడా అందులో పేర్కొన్నాము.

కాగా, జీన్ పాల్ సార్త్రె ప్రతిపాదించిన అస్తిత్వ వాదం ద్వితీయ ప్రపంచ యుద్ధానంతర సంవత్సరాలలో ఫ్రాన్స్‌లోనే కాక, మిగిలిన యూరోపియన్ దేశాలలోను, అమెరికాలోను చాలా ప్రచారం పొందింది. ఆ రోజులలో సార్త్రెయన్ అస్తిత్వ వాదం గురించి రచయితలు, కళాకారులు, ఇతర మేధావులు సాహిత్య గోష్ఠులలో, కాఫీ క్లబ్బులలో చర్చించుకోవడం, తాము అస్తిత్వ వాదులమని చెప్పుకోవడం ఒక ఫ్యాషన్‌గా మారింది. అస్తిత్వవాదం మానవుడి పరిస్థితిని (human situation) గురించి వితర్కించిన సిద్ధాంతం. అందుచేత అది రచయితలను విశేషంగా ఆకర్షించడంలో ఆశ్చర్యంలేదు.

అస్తిత్వవాదంలో ఎన్ని శాఖాభేదాలున్నా అన్నిటికి సమానమైన లక్షణాలు, సామాన్యాంశాలు కొన్ని వున్నాయి. మానవుడు సర్వ స్వతంత్రుడు. అతనికి నిర్ణయ స్వేచ్ఛ (free will, freedom of choice) అనేది వుంది. జీవితంలో అడుగడుగున ద్వంద్వ ప్రశ్నల రూపంలో సమస్యలు ఎదురైనప్పుడు--అంటే ఏది కర్తవ్యం అనే సమస్య తటస్థించినప్పుడు— ఏదో ఒక మార్గాన్ని ఎంచుకునే సంపూర్ణ స్వేచ్ఛ మానవుడికి వుంది. ఈ స్వేచ్ఛ మానవుడికి ప్రకృతి సిద్ధంగా లభించిన వరం, లేదా శాపం. ఈ నిర్ణయ స్వేచ్ఛ వుండడంవల్ల, ఏది తన కర్తవ్యం అని నిర్ణయించుకునే సందర్భంలో మానవుడు ఎంతో ఆవేదన (anguish) కు లోనవుతాడు. తన నిర్ణయ ఫలితాల అనిశ్చయత పట్ల అతనికి భయం (dread) కలుగుతుంది. నిస్పృహ (despair) కలుగుతుంది. మానవ జీవితం – మానవజీవితమే కాదు, అసలు మొత్తం అస్తిత్వం (existence) సమస్త ప్రపంచం అర్థ రహితమైనది (meaningless), అసంబద్ధమైనది (absurd). ప్రపంచంలోను, జీవితంలోను హేతుపరత్వం (rationality) లేదు. హేతు విరుద్ధత (irrationality) వుంది. మానవ స్వభావం (human nature) అనేది ప్రత్యేకించి లేదు. ఇదీ మానవ స్వభావం అని సర్వ కాలాలకు, సర్వమానవులకు వర్తించే నిర్వచనం ఏదీ లేదు. ప్రతి మానవ వ్యక్తి (human individual) తాను చేసే పనులద్వారా తన స్వభావాన్ని అప్పటికప్పుడు సృష్టించుకుంటూ పోతాడు. మనిషి అంటే అతని గత కర్మల సంపుటం...ఈ విధమైన భావ పరంపర అస్తిత్వ వాదంలో ముఖ్యమైన అంశం. అందులోను కేంద్రస్థానంలో వున్న సూత్రం ప్రపంచం అసంబద్ధమైన దనేది. దీన్నే ఫ్రెంచిలో "ఎల్ అబ్సూర్దితే" (absurdite) అని, ఇంగ్లీషులో "ది అబ్సర్డ్" (The absurd) అని అంటారు.

ఇది ద్వితీయ ప్రపంచ యుద్ధపు రోజులలోను, ఆ తర్వాత సంవత్సరాలలోను మేధావులను, ముఖ్యంగా రచయితలను విశేషంగా ఆకర్షించింది. ఆ యుద్ధంలో కొన్ని కోట్ల మంది ప్రజలు అర్థం పర్థం లేకుండా మరణించారు. మానవుడు తోటి మానవుని పట్ల ఎంత రాక్షసంగా, భయంకరంగా ప్రవర్తించగలడో నాజీ చెరసాలలు, కాన్‌సెంట్రేషన్ క్యాంపులు ప్రపంచానికి చాటి చెప్పాయి. తమ నాగరికత ప్రపంచ చరిత్రకే మకుటాయమానమైనదని గర్వంగా చెప్పకునే యూరోపియన్లు తమ నాగరికతలో నుంచే, తమ జీవన విధానంలో నుంచే పుట్టిన నాజీజం, ఫాసిజంలను చూసి సిగ్గుపడిపోయారు, అపారమైన ఆవేదనకు లోనయ్యారు. ఆ లజ్జావేదనల మానసిక స్థితిలో వారికి అస్తిత్వవాదంలో, ముఖ్యంగా సార్త్రె అస్తిత్వవాదంలో ఒక ఊరట, ఒక మానసిక ఉపశాంతి లభించింది. ప్రపంచం, మానవ జీవితం నిజంగానే అర్థరహితం, అసంబద్ధమైనవని వారికి అనిపించింది. అందుకే ఆ రోజులలో సార్త్రె రచనలు, సిద్ధాంతాలు ఎంతో ప్రచారం పొందాయి.

సార్త్రె స్వయంగా నవలా రచయిత. తన తాత్విక గ్రంథాలలోనే కాక, నవలలు, కథానికలు, నాటకాల ద్వారా కూడా తన భావాలను అతడు ప్రచారం చేశాడు. అతనితోపాటు ఆల్బర్ట్ కామూ అనే మరొక ఫ్రెంచి తత్వవేత్త కూడా తన నవలలు, ఇతర రచనల ద్వారా అస్తిత్వవాదానికి ప్రచారం కల్పించాడు. నిజానికి సార్త్రె కంటె అతడు మరింతగా కరడు కట్టిన అస్తిత్వవాది.

మొత్తంపై ఆ రోజులలోనే అస్తిత్వవాద ప్రధాన సూత్రమైన అసంబద్ధత (absurdity) అనే దానికి ఎవరూ ప్రచారం చేయకుండానే ప్రాచుర్యం కలిగే సాంఘిక, రాజకీయ వాతావరణం వుంది. దాని ప్రభావంలో బయలుదేరిన సాహిత్య ఉద్యమమే అసంబద్ధ సాహిత్యం (absurd literature). సార్త్రె, కామూ రచనలు కాక, శామ్యూల్ బెకెట్, యూజీన్ అయనెస్కో, ఆర్థర్ ఆడమోవ్ వంటి గొప్ప రచయితలు తమ నాటకాల ద్వారా "థియేటర్ ఆఫ్ ది అబ్సర్డ్" అనే ఒక కొత్త ప్రక్రియను సృష్టించారు. నోబెల్ సాహిత్య బహుమతి గ్రహీత శామ్యూల్ బెకెట్ "వెయిటింగ్ ఫర్ గాడో" అనే నాటకాన్ని పలువురు పాఠకులు చదివే వుంటారు. అసంబద్ధ నాటక సాహిత్యానికి అది పరాకాష్ఠ.

## సార్త్రె ధీరోదాత్త జీవితం

జీన్ పాల్ సార్త్రెకు, సోక్రటీస్‌కు కొన్ని పోలిక లున్నాయి. మానవ వ్యక్తికి, నైతిక మూల్యాలకు ప్రాధాన్య మివ్వడంలోనే కాదు; తాము నమ్మిన జీవితాదర్శాలను జీవించడంలోనే కాదు. రూపంలో కూడా పోలిక లున్నాయి.

సోక్రటీస్ జీవితం ఎంత ఉదాత్త సుందరమైనదో, అతని ఆకారం అంత వికారమైనది. వామన రూపం, బాన పొట్ట, మిడి గుడ్లు - అయినా, అతని 'సన్నిధాన దివ్య క్షణాన' అతని అంతస్సౌందర్యం తప్ప, బాహ్య రూపం ఎవరికీ స్ఫురణలో ఉండేది కాదట.

అలాగే సార్త్రె కూడా. అతడు కూడా వామనుడే; పైగా కుడి కన్ను మెల్ల. కంటి గుడ్డు ముందుకు పొడుచుకుని వచ్చినట్టు వుబ్బి వుండేది. అయినా, అతని మహోన్నత వ్యక్తిత్వం ముందు, మహా మనీషి ముందు అతని బాహ్య రూపం ఎలా వుంటేనేం?

సార్త్రె 1905 జూన్ 21 తేదీన పారిల్‌లో జన్మించాడు. అతడు పుట్టిన కొద్ది కాలానికే తండ్రి చిన్న వయస్సులోనే మరణించాడు. సార్బోన్ యూనివర్శిటీలో జర్మన్ ఆచార్యుడైన మాతామహుడు కార్ల్ ష్వైట్సర్ వద్ద పెరిగాడు. సుప్రసిద్ధ క్రైస్తవ ప్రచారకుడు, వైద్యుడు, రచయిత, సంగీత విద్వాంసుడు, 1952 లో నోబెల్ శాంతి బహుమతి గ్రహీత అయిన ఆల్బర్ట్ ష్వైట్సర్ సార్త్రెకు కజిన్.

మాతామహుని ఇంట పెరిగిన సార్త్రెకు చిన్నతనం ఏమంత సుఖంగా గడిచినట్టు లేదు. దానికితోడు అనాకారితనం. తన బాల్య జీవితం గురించి విపులంగా వ్రాసిన "వర్డ్స్" అనే పుస్తకంలో సార్త్రె తన బాల్యాన్ని, దాని అవశేషాలను తాను ఎల్లప్పుడు ఏవగించుకుంటానని వ్రాశాడు. (ఈ గ్రంథానికే 1964 లో సార్త్రెకు నోబెల్ సాహిత్య బహుమతి వచ్చింది. దాన్ని అతడు తిరస్కరించాడు.)

ఆ గ్రంథంలో తాను ఫ్రెంచి భాష చదవడం, వ్రాయడం ఎలా నేర్చుకున్నదీ హృదయంగమంగా, మరొకవైపు సున్నితమైన హాస్యంతో అతడు వివరించాడు. తాత రచయిత కనుక, ఇంటిలో బోలెడు పుస్తకాలు వుండేవి. మొదటిసారి ఒక పుస్తకం అక్షరాలు కూడబలుక్కుంటూ చదవడం పూర్తిచేసినప్పుడు తాను పొందిన ఆనందాన్ని అతడు ఎంతో హృద్యంగా వర్ణిస్తాడు. అలాగే తన తల్లి తనకు ఛందస్సు నేర్పగా పద్యాలు అల్లడం, తాతకు పద్యాలలో జాబులు వ్రాయడం ఆసక్తికరంగా వివరించాడు.

అతడు తన ఏడవ -- లేదా ఎనిమిదవ ఏట మొదటి నవల వ్రాశాడట. దాని పేరు "సీతాకోక చిలక కోసం" (For a butterfly). ఒక ఎక్సర్‌సైజు నోట్ బుక్‌లో వ్రాసిన ఆ నవలలో ఒక ప్రొఫెసరు, అతని కుమార్తె, ఒక యువ శాస్త్ర పరిశోధకుడు అమెజాన్ నదిపై ప్రయాణం చేస్తూ అపురూపమైన జాతికి చెందిన సీతాకోక చిలక కోసం అన్వేషించడం కథా వస్తువు. అది అతని సొంతం కాదు. పాత్రల పేర్లు మాత్రం మార్చి ఎవరిదో ప్లాటు, కథా

సంవిధానం కాపీ కొట్టాడు. అలాగే ఇతరుల నవలల నుంచి ప్లాట్లు కొట్టేసి తాను ఆ వయస్సులోనే చాలా నవలలు వ్రాశాడట. ఆ ఎనిమిదేళ్ల వయస్సు లోనే పెద్దవాళ్లలాగా వ్రాస్తూ వ్రాస్తూ, మధ్యలో ఆపి, కనుబొమలు ముడిచి, ఏవో శూన్య దూరాలకు సాలోచనగా చూస్తూ, మహా రచయిత అయిపోయి నట్టు ఫోజు పెట్టేవాడట.

అతని చిన్నతనపు అనుభవాల ప్రభావం అతని భావాలపై, స్వభావంపై పడి వుంటుంది. ముఖ్యంగా అతని వికార రూపం చూపరులలో కలిగించే ఏవగింపు అతడిని బాధించేది. అందుకే అతడు సాధారణంగా పుస్తకాలలో తలదూర్చి ఒంటరిగా గడిపేవాడు. తాను పొట్టివాడు కనుక, తాను చదివిన నవలలలోని వీరాధి వీరులవలె తాను కూడా వీరుడై దుష్టులను శిక్షించి, శిష్టులను రక్షించడానికి ఎన్నో సాహసాలు చేసినట్టు పగటి కలలు కనేవాడు. చెత్తనవలలు చదివి వాటి అనుకరణలు వ్రాసేవాడు. హ్యూగో కాలంలో లాగానో, మరొక కాలంలోనో వున్నట్టుగా ఈ రోజులలో పోరాడడానికి తగిన ఆదర్శాలు లేవే అనుకునేవాడట.

ఒక్కొక్కసారి తనకు 50 ఏళ్లు వచ్చేసరికి తాను ప్రఖ్యాత రచయిత అయి పోయి నట్టు పగటి కలలు కనేవాడు. మొదట్లో తన నవలలను ఎవరూ ప్రచురించడానికి ముందుకు వచ్చేవారు కారట. ఈ ఊహకు రెండు రకాల ముగింపులు వుండేవి. అందరూ తనను నిరాదరించి, ద్వేషించి దూరంగా తోసే సరికి, అవసాన దశలో ఒక ఇనుప మంచంపై పడుకుని నిరాశతో కుమిలి, క్రుంగి, కృశించి, నశించిపోతున్నట్టు, ఇంతలో అతడి గొప్పదనాన్ని ప్రపంచం గుర్తించినట్టు ఒక ముగింపు. మరో ముగింపు ప్రకారం అతనికి 50 ఏళ్ల వయస్సు వచ్చేసరికి ఒక నవల తన పేరుతోనే వ్రాస్తాడు. అది ఎక్కడో పోతుంది. చాలా రోజులకు ఎవరికో దొరుకుతుంది. దాన్ని ఒక ప్రముఖ సంస్థ ప్రచురిస్తుంది. పెద్ద సక్సెస్ అవుతుంది. రెండు రోజులలో 10 వేల కాపీలు అమ్ముడుపోతాయి. అందరూ ఎంతో పశ్చాత్తాపపడతారు--ఇంత గొప్ప రచయితనా మనం ఇంతకాలం నిరాదరించింది అని. అప్పుడు ఓ వందమంది ప్రెస్ రిపోర్టర్లు నాలుగు మూలలా తనకోసం వెదుకుతారు. తాను అజ్ఞాతంగా వుండిపోతాడు. ఈ ఊహ ముగింపును అతడు రకరకాలుగా మార్చాడట. ఒక ముగింపు ప్రకారం అతడు ఒక బార్‌లోకి వెళ్లి ఒక గ్లాసు మద్యం ఆర్డరు ఇస్తాడు. పక్క బల్లవద్ద కొందరు యువతులు కూర్చుని సరదాగా కబుర్లు చెప్పుకుంటూ వుంటారు. మధ్యలో తన ప్రస్తావన వస్తుంది. ఒకామె అంటుంది : "ఆయన ముసిలివాడైతే అయ్యాడు. కురూపి అయితే అయ్యాడు. అయితే నష్టం ఏమిటి? అతనికి భార్యనయ్యే అదృష్టం

కోసం నేను మరో 30 ఏళ్లు పెద్దదాన్ని కావడానికైనా సిద్ధపడతాను!" అది విని సార్త్రె ఆమెకేసి గర్వంగాను, కొంచెం జాలిగాను చూస్తాడు. ఆమె అతడిని గుర్తించి నట్టు సంభ్రమాశ్చర్యాలతో చూస్తుంది. ఇంతలో తాను అక్కడినుండి చల్లగా జారుకుంటాడు.

ఈ ఊహలన్నీ అతని ఎనిమిదవ ఏట ! మనిషిని అతడి బాల్యం నిర్ణయి స్తుందంటాడు సార్త్రె. "చైల్డ్ ఈజ్ ది ఫాదర్ ఆఫ్ ది మ్యాన్" అని వర్డ్స్ వర్త్ అన్నట్టు. ఆ రోజులలో సార్త్రె తాతగారు, తల్లి నివసించేది పారిస్‌లో ఒక పెద్ద మేడలోని ఆరవ అంతస్తు వాటాలో. సాధారణంగా కిందికి దిగివచ్చే పని వుండేది కాదు. ఎటుచూసినా ఇళ్ల కప్పులే కనబడేవి. ఆ తర్వాత చాలా కాలం వరకు లోయలు, మైదానాల పరిసరాలు తనకు వదేవి కావని సార్త్రె అంటాడు.

తల్లి అతడిని వెంటపెట్టుకుని తరచుగా ఆ సమీపంలోని లక్సెంబూర్ గార్డెన్స్‌లోకి షికారుకి తీసుకెళ్లేది. అక్కడ అతని ఈడు పిల్లలు ఆటలాడుకుంటూ వుండేవారు. సార్త్రె కూడా వారిలో కలవాలని ఆశపడేవాడు. కాని, వారు ఇతనికేసి చూడనైనా చూసేవారు కారు. ఆ పార్కులోని ఒక్కొక్క చెట్టువద్దకూ వెళ్లి పిల్లలతో చేరాలని చూసేవాడు. కాని, వారు రానిచ్చేవారు కారు. తనయుడు, అంతకంటె ఎక్కువగా తల్లి ఎంతో అవమానంతో కుంచించుకుపోయేవాడు. తల్లి యాన్ మేరీ అందగత్తె, పొడగరి. ఇతడు పొట్టి, కురూపి. ష్వైట్జర్లు అందరూ పొడగర్లు కాగా, సార్త్రెలు పొట్టివారట. తండ్రి పోలిక తనకు వచ్చిందని సార్త్రె అంటాడు.

అతని బాల్య విద్యాభ్యాస మంతా పారిస్‌లోను, లా రోషెల్‌లోను సాగింది. ఆ పిదప సుప్రసిద్ధ విద్యా సంస్థ "ఇకోల్ నార్మేల్ సుపీరియర్"లో విద్యాభ్యాసం చేసి 1929 లో తత్వశాస్త్ర పట్టభద్రుడయ్యాడు. పెళ్లి చేసుకోలేదు. కాని, విద్యార్థిగా వుండగానే సైమన్ డి బొవాయిర్ అనే యువతితో స్నేహమైంది. ఆమె ఆ తర్వాత కాలంలో ఫ్రాన్సులోని అగ్రశ్రేణి రచయిత్రులలో, మేధావులలో ఒకతెగా కీర్తి గడించింది. సార్త్రె, డి బొవాయిర్ కలిసి జీవించారు. వారి సహజీవనం యావజ్జీవితం కొనసాగింది.

ఇకోల్ నార్మేల్ సుపీరియర్‌లోను, సార్బొన్ యూనివర్శిటీలోను వుండగా సమకాలిక ప్రథమ శ్రేణి రచయిత లెందరితోనో సార్త్రెకు స్నేహం కలిగింది. 1931 నుంచి లీ హావర్, లావోన్, పారిస్‌లలో ప్రభుత్వ యాజమాన్యంలో నడిచే సెకండరీ స్కూల్స్ (లైసీలు)లో అతడు టీచరుగా పనిచేశాడు. మధ్యలో

ఒక ఏడాది జర్మనీ వెళ్లి పెద్ద చదువు చదివి వచ్చాడు. మళ్లీ సెకండరీ స్కూల్ టీచర్‌గానే ఉద్యోగం సాగించాడు.

ఇంతలో ద్వితీయ ప్రపంచ యుద్ధం బద్దలైంది. అతడిని సైన్యంలోకి రిక్రూట్ చేశారు. మేగినాట్ లైన్ వద్ద సైనికుడుగా కొంత కాలం వున్నాడు. అతడిని జర్మన్‌లు పట్టుకున్నారు. నాజీ కారాగారాలలో తొమ్మిది నెలలు గడిపాడు.

నాజీ ఖయిదు నుంచి విడుదల అయ్యాక ఫ్రాన్సుకు తిరిగివచ్చి అప్పటికే నాజీల అక్రమణ నుంచి విముక్తికై సాగుతున్న ప్రతిఘటనోద్యమంలో చేరాడు. ఊరికే చేరడం కాదు, క్రియాశీలక సభ్యుడుగా పనిచేశాడు. ఆ రోజులలోనే మరొక ఫ్రెంచి అస్తిత్వ వాద రచయిత ఆల్బర్ట్ కామూ సంపాదకత్వాన "కాంబాట్" (యుద్ధం) అనే అండర్ గ్రౌండ్ పత్రిక వెలువడుతూ వుండేది. దానికి సార్త్రి రచనలు పంపి సహకరించాడు. వారిద్దరు అప్పటిలో మిత్రులు. అయితే ఆ తర్వాత కమ్యూనిజం గురించిన వివాదంతో వారిద్దరికి చెడింది.

సార్త్రి మొదటి నవల (7వ ఏట, 8వ ఏట వ్రాసినవి వదిలేస్తే) అతడు లీ హోవర్‌లో టీచరుగా వుండగా 1938 లో వెలువడిన "నాసియా" (Nausea). అది డైరీ రూపంలో వ్రాసిన స్వీయ కథాత్మక నవల. అందులో తన శరీరంపై తనకే జుగుప్సతో బాధపడే నాయక పాత్ర రాకెంటిన్ తానే నంటాడు సార్త్రి. దానిలో అతడి అస్తిత్వవాద సిద్ధాంతానికి బీజాలు పడ్డాయి. దానితో రచయితగా అతనికి గొప్ప పేరు వచ్చింది.

అయితే, అసలైన అతని సిద్ధాంత గ్రంథం "అస్తిత్వం, నాస్తిత్వం" (దీని ఫ్రెంచి పేరు L'etre et le neant - ఎల్ అత్ర ఎల్, లీ న్యంత్ -, ఇంగ్లీషులో ఇది Being and Nothingness - ఉండడం, లేకపోవడం - గా అనువాదమైంది.) 1943 లో వెలువడింది. ఇది అధునిక అస్తిత్వ వాదులకు బైబిల్‌లాంటి బృహత్ గ్రంథం. చాలా క్లిష్టమైన గ్రంథం కూడా. ఇందులో being అంటే Thing-ness వస్తుత్వం. Nothingness అంటే అవస్తుత్వం, అంటే మానవ చైతన్యం - కాన్షస్‌నెస్ (consciousness), మానవ చేతన వస్తువు కాదు, పదార్థం (మేటర్) కాదు. కనుక అది నియతమైనది (determined) కాదు. అది నిత్య పరిణామ శీలమైనది.

ఈ గ్రంథంతో తాత్వికుడుగాను, రచయితగాను సార్త్రి ఫ్రెంచి సాహిత్యంలో స్థిరపడ్డాడు. యుద్ధానంతరం అతడు టీచరు వృత్తి మానివేసి తన పూర్తి కాలాన్ని రచనా వ్యాసంగానికే వినియోగించాడు. 1945 లో తన సిద్ధాంతాలు

ఆధారంగా ఒక నవలా చతుష్కం మొదలుపెట్టాడు. కాని, చివరికి మూడు నవలలే వ్రాయగలిగాడు. మొదటిది "ఏజ్ ఆఫ్ రీజన్" (1945), రెండవది "ది రిప్రీవ్" (1947), మూడవది "ఐరన్ ఇన్ ది సోల్" (1949). 1946 లో అతని మరొక సిద్ధాంత గ్రంథం "ఎగ్జిస్టెన్షలిజం ఈజ్ ఎ హ్యూమనిజం" వెలువడింది.

మానవుడిని యథాతథంగా, ఎవరూ అడ్డం లేకుండా అద్దంలో మాదిరిగా చూపించా లంటే నవల కంటె నాటక ప్రక్రియ మేలని భావించి సార్త్రె వరసగా పెక్కు నాటకాలు వ్రాశాడు. వాటిలో మొదటిది "ది ఫ్లయిస్" (The Flies) 1943 లో వెలువడింది. ఆ పిదప వరసగా ఎన్నో నాటకాలు వ్రాశాడు. అతని రచనలలో నిరాశాతత్వం (పెసిమిజం) పాలు ఎక్కువన్న ఆరోపణ వుంది. అయితే మానవునికి వేదన నుంచి విముక్తి సాధ్యమన్న ఆశాసందేశం కూడా వాటిలో కనిపిస్తుంది.

ఇక సాహిత్య విమర్శా గ్రంథాలలో సార్త్రె గత శతాబ్దపు మహాకవి బోదిలేర్ గురించి వ్రాసినది ప్రసిద్ధమైనది.

యుద్ధానంతరం సార్త్రె, బోవాయిర్ కలిసి "లే టెంప్స్ మోడర్న్స్" (Les Temps Modernes - మోడర్న్ టైమ్స్) అనే మాస పత్రిక చాలా కాలం నిర్వహించారు. దానిలో తన సిద్ధాంత వ్యాసాలు, రాజకీయ, సాహిత్య, తాత్విక వివాద వ్యాసాలు ప్రచురించేవాడు.

అతనిపై తొలి నుంచి మార్క్సిజం ప్రభావం వుండేది. యుద్ధ కాలం లోను, యుద్ధానంతర కాలంలోను అతడు కమ్యూనిస్టులతో సన్నిహితంగా కలిసి పనిచేశాడు. అతడిలో వామపక్ష భావాలు, సోవియెట్ అభిమానం పెరిగాయి. ఆ రోజులలో పశ్చిమ యూరప్‌లో కల్లా బలీయమైనది ఫ్రెంచి కమ్యూనిస్టుపార్టీయే. సార్త్రె దానిలో చేరలేదు కాని, ఫెలో ట్రావెలర్‌గా వుండేవాడు. 1954 లో రష్యాలో పర్యటించాడు. ఆ పిదప అమెరికా, క్యూబాలు సందర్శించాడు. క్రమంగా అతడికి కమ్యూనిజంపై మొగం మొత్తింది. 1956 లో హంగరీలో రష్యా సేనల జోక్యంతో అతనికి రష్యా పట్ల భ్రమలు తొలగిపోయాయి. సోవియెట్ చర్యను, దానిపట్ల ఫ్రెంచి కమ్యూనిస్టు పార్టీ వైఖరిని విమర్శిస్తూ వ్రాశాడు. ఆధునిక కాలానికి మార్క్సిజం తప్ప గత్యంతరంలేదని అంగీకరిస్తూనే సోవియెట్ యూనియన్‌లో దాని ఆచరణ తీరును తిరస్కరించాడు.

1963 లో సార్త్రె "లే మాట్స్" (Les Mots) అనే పేరిట స్వీయ చరిత్ర వ్రాశాడు. (ఫ్రెంచిలో Mot - మో - అంటే మాట. ఫ్రెంచి భాష

తెలుగులోంచే వచ్చిందనేవా రుండరు గదా!) ఇంగ్లీషులో అది "వర్డ్స్" (Words) గా అనూదితమైంది. దానికి 1964 లో నోబెల్ కమిటీ సాహిత్య బహుమతి ఇవ్వగా సార్త్రి నిరాకరించాడని ఇంతకుముందు తెలుసుకున్నాము. అటువంటి బహుమతులు రచయిత వ్యక్తిత్వానికి గుదిబండలుగా తయారవుతాయని, అవి తెచ్చిపెట్టే గౌరవానికి తగినట్టుగా నడుచుకోవాలి కనుక క్రియాస్వేచ్ఛ తగ్గిపోతుందని సార్త్రి అభిప్రాయపడ్డాడు. పైగా రచయితకు ఎటువంటి లేబుల్ అతికించ రాదంటాడు. "జీన్ పాల్ సార్త్రి అని సంతకం పెట్టడానికి, జీన్‌పాల్ సార్త్రి - నోబెల్ బహుమతి గ్రహీత అని సంతకం పెట్టడానికి తేడా వుంది" అని అతడు పేర్కొన్నాడు.

అంతకుముందు — 1946 లో — ద్వితీయ ప్రపంచ యుద్ధ కాలంలో నాజీ సేనల ప్రతిఘటనోద్యమంలో (Underground resistence movement) పని చేసినందుకు ఫ్రాన్సులోని ఉన్నతశ్రేణి బిరుదులలో ఒకటైన "లీజియన్ ఆఫ్ ఆనర్" అతనికి ఫ్రెంచి ప్రభుత్వం ఇవ్వబోగా దాన్ని కూడా ఇలాగే తిరస్కరించాడు.

1960 నుంచి 71 వరకు సార్త్రి గత శతాబ్దపు మహా రచయిత గుస్తావ్ ఫ్లాబేర్ (మదాం బోవరీ నవలాకర్త)పై నాలుగు సంపుటాల ఉద్గ్రంథం వ్రాయదలచి రెండు సంపుటాలకే 2130 పేజీలు రాగా, దాన్ని ఆపుచేశాడు. ఆ తర్వాత అసలు రచనా వ్యాపృత్తికే స్వస్తిచెబుతున్నట్టు, క్రియారంగంలోకి దిగుతున్నట్టు ప్రకటించాడు. రచయితలు రచనాశూరులే కాక, కార్యశూరులుగా వుండాలని అంటూ వీధులలోకి పోయి ఉద్యమాలలో పాల్గొనాలని, వామపక్ష సాహిత్యం అమ్మాలని తనకు కోరికగా వుందని చెప్పేవాడు.

అల్జీరియా స్వాతంత్ర్య సమర సమయంలో ఫ్రెంచి సేనలో చేరడానికి నిరాకరించిన యువకులకు సార్త్రి ప్రోత్సాహమిచ్చాడు. ఈ ప్రభుత్వ ద్రోహానికి అతడిని అరెస్టు చేయాలని కొందరు ప్రెసిడెంట్ డీగోల్‌కు సూచించగా, ఆ సలహాను డీగోల్ తిరస్కరిస్తూ "సార్త్రి కూడా ఫ్రాన్సే" (Sartre is also France) అన్నాడట.

ఫ్రెంచి ప్రభుత్వం పంపించగా 1946 లో అమెరికాలో హార్వర్డు, కొలంబియా, యేల్, ప్రిన్స్‌టన్ యూనివర్శిటీలలో ఉపన్యాసాలు ఇచ్చిన సార్త్రి 1964 లో అమెరికా నుంచి మరొక ఆహ్వానం రాగా దాన్ని తిరస్కరించాడు. వియత్నాం యుద్ధంలో అమెరికా జోక్యాన్ని అమెరికన్ ప్రజలు ఆమోదించినందుకు నిరసనగా ఆ చర్య తీసుకున్నాడు.

రచయితగా జీవితం ప్రారంభించినవాడు రచనల నుంచి శాశ్వతంగా విరమించడం సాధారణంగా జరగదు. రచన విరమిస్తున్నట్టు ప్రకటించినా అతడు త్వరలో మళ్లీ రచనలు ప్రారంభించాడు. "నా జీవితం పుస్తకాల మధ్య ప్రారంభమైంది. పుస్తకాల మధ్యనే అంతమవుతుంది" అని అతడు అనేవాడు.

"వ్రాయడం నా అలవాటు, నా వృత్తి కూడా. చాలాకాలంపాటు నా కలాన్ని కత్తిగా ఉపయోగించాను. ఇప్పుడు తెలుస్తోంది మనం ఎంత నిస్సహాయులమో. అయినా ఫరవాలేదు. నేను వ్రాస్తూనే వుంటాను. అది అవసరం. సంస్కృతి అనేది దేన్నీ రక్షించదు. ఎవరినీ రక్షించదు. కాని, అది మానవుని ఉత్పత్తి. దాని ద్వారా మనిషి తన్నుతాను వ్యక్తం చేసుకుంటాడు; తన్ను తాను గుర్తుపడతాడు. అదొక్కటే అతడి ప్రతిబింబాన్ని అతడికి చూపిస్తుంది... ..."

చివరివరకు రాజకీయ, సాహిత్య, తాత్విక వివాదాలలో మునిగి తేలి, రచనలు సాగిస్తూ, ఉద్యమాలలో పాల్గొంటూ సార్త్రె 1980 ఏప్రిల్ 15వ తేదీన 75 వ ఏట తనువు చాలించాడు.

# వ్యక్తికి పట్టం కట్టిన అస్తిత్వవాదం

అస్తిత్వవాదం అంటే ఏమిటి? దానికి ఆ పేరు ఎందుకు వచ్చింది?

– ఇంగ్లీషులో ఎగ్జిస్టెన్షలిజం అనే మాటకు తెలుగు అస్తిత్వవాదం.

ఎగ్జిస్టెన్స్ అంటే ఉనికి, ఉండడం, అస్తిత్వం. దానికి సంబంధించిన సిద్ధాంతం కనుక ఎగ్జిస్టెన్షలిజం-- అస్తిత్వవాదం--అనే పేరు వచ్చింది.

ఇది భావవాదంపై తిరుగుబాటుగా తలెత్తిన సిద్ధాంతం.

భావవాదం - ఐడియలిజం - ప్లేటోతో ప్రారంభమైంది. భౌతిక ప్రపంచాన్ని ప్లేటో ఒక ఆభాస (appearance) గా పరిగణించాడు. భావం (idea) అనేది యథార్థం, అదే సత్యం. భావానికి భౌతిక రూపమే వస్తువు. ఉదాహరణకు భౌతిక శరీరధారి అయిన మానవుడు ఆభాస. ఎందుచేత? భౌతిక శరీరం అశాశ్వతం, నశ్వరం, అసంపూర్ణం, లోప భూయిష్ఠం. అందుచేత అది సత్యం కాదు. భౌతిక శరీరధారి అయిన మానవుడు శాశ్వతుడు కాడు కనుక, పరిపూర్ణుడు కాడు కనుక అతడు సత్యం కాడు.

మరి ఏది సత్యం? మానవుడు అనే భావం సత్యం. మానవ భావానికి- ఏదైతే మానవుడిని మానవుడుగా చేస్తున్నదో ఆ భావానికి- నాశనం లేదు. ఏ భావమైతే మానవత్వానికి పరిపూర్ణత చేకూరుస్తున్నదో ఆ భావం నశించదు. అది నిత్యం. అందుచేత అది సత్యం. అలాగే మిగతా వస్తువులు కూడా.

ఉదాహరణకు నేనిప్పుడు కూర్చున్న కుర్చీ కొంత కాలానికి నశిస్తుంది. కనుక అది అనిత్యం, అసత్యం. కాని, కుర్చీని ఏ భావమైతే, లేదా ఏ అకృతి అయితే కుర్చీగా చేస్తున్నదో ఆ భావానికి, ఆ అకృతియొక్క భావానికి నాశనం లేదు. అందుచేత భౌతిక రూపంలో వున్న కుర్చీకంటె భావరూపంలో వున్న కుర్చీ నిత్యం, సత్యం. ఆ భావానికి భౌతికమైన కుర్చీ మిథ్యా ప్రతిబింబం మాత్రమే.

భౌతిక ప్రపంచంలో పరిపూర్ణత్వం వుండడానికి వీలు లేదు. ఇది భౌతిక వస్తువులకే కాదు. భౌతిక సంఘటనలకు కూడా వర్తిస్తుంది. నూటికి నూరు పాళ్లు అదర్శప్రాయుడు, పరిపూర్ణుడు, లోప రహితుడు అయిన మానవుడంటూ లేడు. కాని, అటువంటి మానవుడిని మనస్సు ద్వారా మనం ఊహించుకోవచ్చు. అలాగే నూటికి నూరుపాళ్లు లోపరహితమైన కుర్చీ ప్రపంచంలో లేదు. కాని, దాన్ని మనస్సులో ఊహించుకోవచ్చు. అలాగే మనం ఎంత ప్రయత్నించినా నూటికి నూరుపాళ్లు లోపరహితమైన వృత్తాన్ని (circle) గీయలేము. అటువంటి లోపరహిత వృత్తం భావ ప్రపంచంలోనే వుంటుంది.

లోకంలో నూటికి నూరుపాళ్లు న్యాయం అని చెప్పదగింది లేదు. అలాగే సౌందర్యం, మంచితనం మొదలైనవి కూడా. పరిపూర్ణమైన న్యాయం, సౌందర్యం, మంచితనం మొదలైనవి భావ లోకానికి మాత్రమే చెందినవి. భౌతిక లోకంలో మనకు ఇంద్రియ గోచరం, అనుభవవేద్యం అవుతున్న వస్తువులు, సంఘటనలు మొదలైనవన్నీ అసత్యాలు, అనిత్యాలు, అపరిపూర్ణాలు, లోపభూయిష్ఠాలు. అసలైన, నూటికి నూరుపాళ్లు సత్యం, నిత్యం, పరిపూర్ణం అయినవి వాటియొక్క భావాలు (ideas) మాత్రమే. ఆ భావాలకు ఆభాసలు, మిథ్యా ప్రతిబింబాలు మాత్రమే ఈ భౌతిక వస్తువులు, భౌతిక సంఘటనలు.

ఇదీ ప్లేటోనిక్ భావవాద సారాంశం. పాశ్చాత్య చింతనపై ప్లేటో ప్రభావం ఇంతిం తనరానిది. అది వివిధ తత్వవేత్తల సిద్ధాంతాలలో అంతర్వాహినిగా రకరకాల రూపాలలో ప్రముఖంగా, ప్రబలంగా ఇన్ని శతాబ్దాలుగా వుంటూనే వచ్చింది.

ప్లేటోనిక్ ఐడియలిజాన్ని ఎస్సెన్షలిజం (essentialism) అని కూడా అనవచ్చు. ఎస్సెన్స్ (essence) అంటే ఒక వస్తువుయొక్క సారం, భావం, స్వభావం, సత్యం, తత్వం. ఉదారహణకు కుర్చీ యొక్క ఎస్సెన్స్ ఏమిటి? నాలుగు కాళ్లు, సీటు, అనుకునేందుకు చెక్క మొదలైన లక్షణాలు కల ఒక వస్తుత్వం కుర్చీ ఎస్సెన్స్.

ఇది భౌతిక ప్రపంచంలోని ప్రాణులకు, అప్రాణులకు అన్నిటికి వర్తించే

సిద్ధాంతం. ఒక వస్తువును ఏ యే లక్షణాలతో నిర్వచిస్తామో ఆ నిర్వచనమే దాని ఎస్సెన్స్.

దీనికి, అంటే ఈ ప్లేటోనిక్ భావవాదానికి, లేదా వివిధ మత భేదాలతో ప్రవర్తిల్లిన వివిధ భావవాదాలకు ఒక సవాలుగా, ఒక తిరుగుబాటుగా తలెత్తిన ట్టిదే ఎగ్జిస్టెన్షలిజం- అస్తిత్వవాదం. అస్తిత్వవాదులు ప్లేటోనిజానికి బద్ధవైరులు. ప్లేటోనిజంలో నిజం లేదని వారి వాదం.

ఎందుకంటే, భావవాదంలో భావానికి తప్ప వస్తువుకు, ముఖ్యంగా ప్రత్యేక వస్తువుకు స్థానం లేదు. మానవుడినే తీసుకోండి. ప్లేటోనిజం ప్రకారం మానవ భావం, మానవజాతి, మానవ స్వభావం (human nature) మానవత్వం (human essence) ఇవే సత్యం. కాగా, మానవుడు మిథ్య, భౌతిక శరీర ధారియై, సుఖదుః ఖాలకు, కష్టనిష్ఠురాల తాకిడికి లోనయ్యే ప్రత్యేక మానవుడు ఆభాస మాత్రమే.

ఇది దారుణమైన భ్రమాప్రమాదజనిత సిద్ధాంతమని, ప్రమాదజనక సిద్ధాంత మని కూడా అస్తిత్వవాదులు అంటారు. అసలు సత్యం మానవ స్వభావంగాని, మానవత్వ భావం గాని కాదు; మానవుడు ! శ్రీ శ్రీ మాటలలో చెప్పాలంటే "మానవుడే నా సందేశం, మనుష్యుడే నా సంగీతం" అంటుంది అస్తిత్వవాదం.

ఏ మానవుడు? అని భావవాది ప్రశ్నిస్తాడు. ప్రతి మానవుడు అని అస్తిత్వవాది సమాధానమిస్తాడు. ప్రతి మానవుడు అంటే? అని తిరిగి ప్రశ్న. ప్రతి మానవుడు అంటే ప్రతి మానవుడు - ప్రపంచంలోని ప్రతి ఒక్క మానవుడు – అని అస్తిత్వవాది సమాధానం. అయితే, మానవుడిని సాధార ణీకరించడానికి వీలులేదా? మానవుడు ఈ విధమైన ఆకారం కలిగివుంటాడు, ఈ లక్షణాలు కలిగివుంటాడు అని జనరలైజ్ చేయడానికి వీలులేదా? లేదు. ఎందుకంటే ఎంత జనరలైజ్ చేసినా నిర్వచనానికి అందని ప్రత్యేక మాన వుడు ఇంకా మిగిలే వుంటాడు అని అస్తిత్వవాది జవాబిస్తాడు. అస్తిత్వవాద పితామహుడని పేరుపొందిన కీర్క్ గార్డ్ "I refuse to become a paragraph in a system"- ఏ సాధారణీకృత వ్యవస్థలోను ఒక పేరా గ్రాఫును కావడానికి నేను అంగీకరించను" అన్నది ఇందుకే.

దీని అర్థం మానవుడు, మానవ వ్యక్తి (human individual) అద్వితీయుడు అనే. "ఏకమేవా ద్వితీయం" అన్నారు ఋషులు. ఇది మానవ వ్యక్తికి కూడా వర్తిస్తుంది. ఏ మానవ వ్యక్తిని సాధారణీకరించడానికి, ఫలానా సాధారణ లక్ష ణాలు కలవాడని నిర్వచించడానికి వీలు లేదు. నేను, నీవు, ఆమె, అతడు-ప్రతి ఒక్కరు ఎవరికి వారే; ఎవరి ప్రత్యేక వ్యక్తిత్వం వారిదే. నీవు స్త్రీవా?

నీలాంటి స్త్రీలు చాలామంది వున్నారు. నీవు సన్నగా, నాజూగ్గా వున్నావా? అలా వుండే స్త్రీలు చాలామంది వున్నారు. నీవు తెలివైనదానివా? తెలివైన స్త్రీలు చాలామంది వున్నారు. నీవు క్షమా స్వభావం కలదానివా? అలాంటివారు ఎందరో వున్నారు. ఇలాగ ఎన్ని లక్షణాలతో, సాధారణీకరణాలతో ఒక వ్యక్తిని నిర్దేశించడానికి ప్రయత్నించినా ఆ ప్రత్యేక వ్యక్తిని మనం నిరూపించడం అసంభవం, అసాధ్యం. ఆ ప్రత్యేక వ్యక్తి ఆ ప్రత్యేక వ్యక్తే.

అక్కడే, అందుకే ప్లేటో, తదితర భావవాదులు పప్పులో కాలేశారని అస్తిత్వవాదులు అంటారు. మానవ భావం మిథ్య. మానవ వ్యక్తి సత్యం. వృక్ష భావం మిథ్య. ప్రత్యేక వృక్షం సత్యం. గోత్వం అసత్యం. ప్రత్యేక గోవు మాత్రమే నిజంగా వున్నది.

మామూలుగా తత్వశాస్త్రం అని మనం అనుకునేది మానవస్వభావం, వస్తు స్వభావం మొదలైన సాధారణీకరణాలతో వ్యవహరిస్తుంది. అలాగే అన్ని శాస్త్రాలు సైన్సులు, ఇవన్నీ సాధారణీకరిస్తాయి. సాధారణ సూత్రాలను (general laws) సృష్టించుకుని పనిచేస్తాయి. కాని, ఈ సాధారణ, సార్వత్రిక సూత్రాలన్నీ అబద్ధాలు, అసంబద్ధాలు. ఏది నిజం అంటే, ప్రత్యేకత--particularity--మాత్రమే సత్యం.

తత్వశాస్త్రం సాధారణీకరణాలతో పనిచేస్తుంది కనుకనే, సాధారణీకరణాలను అంగీకరించని అస్తిత్వవాదాన్ని తత్వశాస్త్రంగా కొందరు ఒప్పుకోరు. నిజానికి దాన్ని యాంటీ ఫిలాసఫీగా - తత్వశాస్త్ర వ్యతిరేక సిద్ధాంతంగా - ఈసడించినవా రున్నారు.

అయినా, అస్తిత్వవాదం పాశ్చాత్య తత్వచింతనలోని ఒక ముఖ్య సిద్ధాంతం. అది ప్రధానంగా ఒక నైతికదర్శనం (ethical philosophy). అందుచేత అది మానవునికి, మానవ జీవితానికి, మానవుని అస్తిత్వానికి సంబంధించిన సిద్ధాంతం. ఏ మానవుడు అని ప్రశ్నిస్తే తిరిగి ప్రతి ఒక్క మానవుడు అనే సమాధానం చెప్పవలసి వుంటుంది.

ఇది ఎలా సాధ్యం? ప్రపంచంలో కొన్ని వందలకోట్ల మానవులున్నారు. వారిలో ప్రతి ఒక్క మానవుని జీవిత సత్యాన్ని ఏ తత్వశాస్త్రమైనా ఎలా వివేచిస్తుంది?

నిజమే. అటువంటి తాత్విక వివేచన సాధ్యం కాదు గాని, ఇతర విధాలుగా, ప్రత్యేక మానవ వ్యక్తుల జీవిత సత్యాలను మనం ఆవిష్కరించవచ్చు.

ముఖ్యంగా, సృజనాత్మక సాహిత్యం (creative literature) ఇందుకు మంచి సాధనం. కనుకనే, అస్తిత్వవాదులలో పలువురు నవలలు, నాటకాలు, కథానికలు వంటి సాహిత్య ప్రక్రియలను తమ సిద్ధాంత వ్యక్తీకరణకు ఎంచుకున్నారు. నవలలు, నాటకాలలో ప్రత్యేక వ్యక్తుల పాత్రల ద్వారా వారి వ్యక్తిత్వాలను ఆవిష్కరించవచ్చు. వ్యక్తిని లోపలినుంచి తెలుసుకోవచ్చు. జీన్ పాల్ సార్త్రె. ఆల్బర్ట్ కామూవంటి అస్తిత్వ వాదులు సిద్ధాంత గ్రంథాలే కాక నవలలు, కథలు, నాటకాల వంటి ప్రక్రియలలో సాహిత్య సృష్టి చేశారు. వారి ప్రభావం 1940 లలో, 1950 లలో పలువురు రచయితలపై ప్రసరించింది. దాని ఫలితమే శామ్యూల్ బెకెట్, యూజీన్ అయనెస్కో వంటివారి అసంబద్ధ నాటక సాహిత్యం (Theatre of the Absurd).

భావవాదం మానవుడిని మానవజాతి అనే మందలో ఒకడుగా పరిగణిస్తుంది. కాగా, అస్తిత్వ వాదం మానవుడికి (ప్రతిమానవుడికి) ప్రత్యేక, విశిష్ట స్థానం ఇచ్చి, గౌరవిస్తుంది. అదొక నూత్న మానవతావాదం.

అస్తిత్వవాదంలో ప్రధానసూత్రం Existence precedes essence అనేది. అంటే అస్తిత్వం ముందు, ఆ తర్వాతనే భావం. మానవ భావం కంటె మానవ అస్తిత్వం ముందు. మానవుడు ముందుగా వున్న తర్వాతనే అతని స్వభావం నిర్ణయ మవుతుంది.

ఆధునిక కాలంలో పాశ్చాత్య తత్వశాస్త్ర పితామహుడుగా పేరుపొందిన దెకార్త్ I think, therefore I am అన్నాడు. అంటే "నేను ఆలోచిస్తున్నాను, కనుక వున్నాను" అని అర్థం. దెకార్త్ సూత్రాన్నిబట్టి, ఏది నిశ్చయంగా వున్నది అని ప్రశ్నపై ప్రశ్న వేసుకుంటూపోతే ఏదీ మిగలదు. బాహ్య ప్రపంచం వున్నట్టు నిశ్చయంగా చెప్పలేము. కాని, నేను నా మనస్సుతో ఆలోచిస్తూ వుండడం మటుకు నిశ్చయం. ఒకవేళ ఈ విషయమై కూడా సందేహం కలిగినా అలా సందేహం కలగడం కూడా నేను ఆలోచిస్తున్నా ననడానికి నిదర్శనం. అందుచేత ఏది వున్నా లేకపోయినా, నేను వున్నా నన్నది నిశ్చయం.

ఈ కార్టీజియన్ సిద్ధాంతాన్ని సార్త్రె పూర్వపక్షం చేశాడు. నేను ఆలోచిస్తున్నాను అంటే దేన్ని గురించి ఆలోచిస్తున్నాను? ఆలోచన గురించి ఆలోచిస్తున్నానా? ఆ ఆలోచన దేన్ని గురించి? ఆలోచిస్తున్నాననే ఆలోచన గురించా?- ఈ విధంగా ఎంత వెనక్కి వెళ్లినా ఒక విషవలయంలో చిక్కుకుని బయటపడలేము.

నిజానికి ఆలోచన అనేది ఏదో ఒక వాస్తవ విషయం గురించి, వస్తువు

గురించే అయి వుంటుంది. ఆలోచన, చేతన అనేది వున్నమాట నిజమే. కాని, దానికి ఒక వస్తువు కావాలి. అంటే ఆలోచించడానికి, చేతనతో గ్రహించడానికి ఒక యథార్థ వస్తువు కావాలి. All consciousness is consciousness of something చేతన అనేది శూన్యం. ఆ శూన్యాన్ని నింపడానికి ఏదో ఒక వస్తువు కావాలి. ఈ పద్ధతిలోనే మనం మనస్సుతో, ఆలోచనలతో బాహ్య ప్రపంచాన్ని గ్రహిస్తాము.

సార్త్రి అస్తిత్వవాదాన్ని ప్రపంచించే గ్రంథం "బీయింగ్ అండ్ నథింగ్ నెస్". బీయింగ్ అంటే అస్తిత్వం, నథింగ్‌నెస్ అంటే నాస్తిత్వం, శూన్యం. కాని, శూన్యత అంటే లేకపోవడం అయినా, లేకపోవడం అనేదానికి కూడా ఒక అస్తిత్వం వున్నది. దీనికి సంబంధించిన తాత్విక విచారమే సార్త్రి గ్రంథం.

## చీలుదారుల చీకటిలో మనిషి

అస్తిత్వం మూడు రకాలుగా వుంటుందని సార్త్రి తన గ్రంథంలో పేర్కొన్నాడు. Being for itself (ఫ్రెంచిలో etre pour soi) అంటే తనకొరకు తాను అయిన అస్తిత్వం. ఇది మానవ చేతన. లేదా మన మనస్సు. దీన్నే శూన్యత Nothing-ness అని సార్త్రి భావించాడు. ఎందుకంటే తాను వున్నానని తెలిసివుండడమే చేతన consciousness. చైతన్యం కలిగి వుండడమే చేతన అయినప్పుడు దేన్ని గురించిన చేతన అని ప్రశ్న వస్తుంది. ఈ ప్రశ్నకు సమాధానం అస్తిత్వపు రెండవ రూపం. అది Being-in-itself ఫ్రెంచిలో etre en soi అంటే తన లోపల తాను అయిన అస్తిత్వం. ప్రపంచంలోని అచేతన వస్తువులు unconscious things, తాము వున్నామని తమకు తెలియని వస్తువులు, తాము వున్నామని తెలిసినా అలా తెలిసినట్టు తెలుసుకోలేని జంతువులు, ఈ అస్తిత్వ శ్రేణిలోకి వస్తాయి.

మూడవరకం అస్తిత్వం Being-for-others ఈ శ్రేణిలోకి మనలను పోలిన—మన వలెనే తాము వున్నామన్న విషయం తెలిసి వుండడమే కాక, అలా తెలుసునన్న విషయం కూడా తెలిసిన తోటి మానవులు వస్తారు.

మొదటిరకం అస్తిత్వం అంటే కేవల శుద్ధచైతన్యం (pure consciousness) శూన్యమైనది. అది నథింగ్‌నెస్. అది ఎరుక (awareness). అయితే దేన్ని గురించిన ఎరుక? బాహ్య ప్రపంచం, దానిలోని వస్తువులు, జీవకోటి (పూర్ణమైన స్వీయచేతన లేనంతవరకు ఇతర జీవులు కూడా అచేతన వస్తువులతో సమానమే.) రాజకీయ, ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక వ్యవస్థలు—వీటన్నిటిని గురించిన ఎరుక. అలాగే మనవంటి, మన తోటి మానవుల గురించిన ఎరుక.

ఈ విధంగా మొదటి శ్రేణి అస్తిత్వం (మానవ చేతన) రెండవ, మూడవ శ్రేణుల అస్తిత్వం (బాహ్య ప్రపంచం)తో సంబంధం పెట్టుకుంటే తప్ప మానవ వునికి సంపూర్ణత లేదు. అంటే మానవ చేతన బాహ్య ప్రపంచంగా మారిపోతుంది. మానవ చేతనలో బాహ్య ప్రపంచం భాగమైపోతుంది.

దీనికి తాత్విక పర్యవసానం (Philosophical consequence) ఏమిటి? మానవ చేతన (human consciousness) శూన్యతతో కూడినట్టిది. దాన్ని మానవుడు తన చర్యలతో, ఆలోచనలతో, అనుభవాలతో, వస్తుత్వం (thingness) తో నింప గోరుతాడు. శూన్యచేతన లేకపోతే మానవుడు బాహ్య ప్రపంచాన్ని గుర్తించడం గాని, అనుభవంలోకి తెచ్చుకోవడం గాని జరగదు. ఈ కార్యక్రమంలో అతడు తాను చేసే పనుల ద్వారా, తాను గుర్తించి సంబంధాలు పెట్టుకునే విషయాల ద్వారా తన స్వభావాన్ని నిర్ణయించుకుంటాడు. అప్పటివరకు అతనిది శూన్య చేతన. బాహ్య ప్రపంచంతో సంబంధం పెట్టుకుని ఏయే చర్యలద్వారా, ఏయే విషయాలను ఎంచుకోవడం ద్వారా తన శూన్యచేతనను నింపుకోదలచుకుం టాడో వాటి ద్వారా అతని వ్యక్తిత్వం, స్వభావం నిర్ణయమవుతాయి.

దీని అర్థం ఇది : మానవ స్వభావం, మానవ వ్యక్తిత్వం ఆది నుంచి తనంతట తాము నిర్ణయమైనవి కావు. బాహ్య పరిస్థితుల, ఇతర మానవుల ఒత్తిడి ద్వారా, నిర్ణయమైనవి కూడా కావు. మానవుడు తన చర్యల ద్వారా ఆలోచనల ద్వారా, ఎప్పటి కప్పుడు తన వ్యక్తిత్వాన్ని, స్వభావాన్ని నిర్ణయిం చుకుంటాడు, నిర్మించుకుంటాడు. ఆ విధంగా అతడు స్వతంత్రుడు. తన వ్యక్తిత్వ, స్వభావాలను తానే నిర్ణయించుకునే సంపూర్ణ స్వాతంత్ర్యం అతనికి వున్నది.

"మానవుడు సర్వ స్వతంత్రుడు"–Man is free అనేది సార్త్రి అస్తిత్వ వాదానికి మూలకందమైన సూత్రం.

అంతే కాదు. మానవుడు స్వతంత్రుడుగా తప్ప మరొకలా వుండలేడు. అతని స్వేచ్ఛ, అతని స్వాతంత్ర్యం అతడిని నీడ లాగా వెన్నాడుతూనే వుంటాయి. Man is condemned to be free– "మానవుడు స్వేచ్ఛా శాపగ్ర స్తుడు" అని సార్త్రి అంటాడు.

మానవుడు స్వతంత్రుడు కనుక తన స్వభావాన్ని (essence) తానే నిర్ణ యించుకుంటాడు. ఉదాహరణకు ఏ మనిషీ స్వతః పిరికివాడు కాడు, ధైర్యశాలీ కాడు. ఒక సందర్భంలో ఒకడు పిరికిగా ప్రవర్తించవచ్చు. మరొక సందర్భంలో ధైర్యంగా ప్రవర్తించవచ్చు. పిరికిపని చేసినప్పుడు పిరికివాడు అనిపించుకుంటాడు.

ధైర్యంగా ప్రవర్తించినప్పుడు ధైర్యశాలి అనిపించుకుంటాడు. అందుచేత స్వత స్సిద్ధంగా ఏ మనిషిని ధైర్యశాలి అనిగాని, పిరికివాడు అని కాని ముద్ర వేయలేము. మనిషి చేసే పిరికిపనుల వల్లనే అతడు పిరికివాడు అనిపించుకుం టాడు, అలాగే సాహస కృత్యాల వల్లనే ధైర్యశాలి అనిపించుకుంటాడు.

దీనికి కారణం, సార్వకాలిక, సార్వజనీన, సార్వత్రిక మానవ స్వభావం అనేది లేకపోవడమే. మానవుడు రెడీమేడ్‌గా లోకంలోకి రాడు. మానవుడు నిత్య పరివర్తన శీలి. ఎప్పటికప్పుడు తన స్వభావాన్ని తాను నిర్మించుకుంటూ వుంటాడు. అతని పనులే అతని స్వభావాన్ని నిర్ణయిస్తాయి. అతని ఈ నిత్య పరివర్తనకు కారణం అతనికి గల నిర్ణయస్వేచ్ఛ (freedom of choice).

మానవుడికి ఈ నిర్ణయ స్వేచ్ఛ ఎక్కడినుంచి వస్తున్నది? మానవ జీవితం అనేక అవకాశాల (possibilities) రూపంలో వుంటుంది. అదొక శృంగాటకం వంటిది. చీలుదారుల కూడలివంటిది. కూడలిలో నిలబడిన మానవుడు విధిగా ఏదో ఒక దారిని ఎంచుకోవలసి వుంటుంది. ఒకే దారి వుంటే నిర్ణయ స్వేచ్ఛ అనే దానికి అవకాశం వుండదు. కాని, పెక్కు దారులు వుండడంవల్ల విధిగా ఏదో ఒకదాన్ని ఎంచుకొనక తప్పదు.

అలా ఎంచుకునే బాధ్యత మానవుడిదే. ఫలానా దారిని వెడితే ప్రయో జనం చేకూరుతుందని, అది నైతికమని, విధ్యుక్త ధర్మమని సలహా ఇచ్చే వారికి కొరతలేదు. మతవిశ్వాసాలు, నైతిక సూత్రాలు, గురువుల ఉపదేశాలు, నిపుణుల నిర్ణయాలు, ఆప్త వాక్యాలు, స్నేహితుల సూచనలు— ఇలా ఎన్నో విధాలుగా అతనికి సలహాలు అందుతాయి. కాని, వీటిలో దేన్ని అనుసరించాలన్నది నిర్ణయించుకునే బాధ్యత తిరిగి వ్యక్తిదే. జీవితం అవకాశాల (possibilities) పుట్ట. కనుకనే మానవుడికి నిర్ణయ స్వేచ్ఛ లభిస్తున్నది.

ఈ నిర్ణయ స్వేచ్ఛ వల్ల మనిషి తను చేసే ప్రతి పనికి తానే బాధ్యుడు. మానవుడి నిర్ణయ స్వేచ్ఛను నిత్యం నీడలా వెన్నంటి వుండేది ఈ బాధ్యత.

"ద్వేషం అనేది మానవ స్వభావంలోనే వుంది. అందుచేత నేను ద్వేషిం చక తప్పలేదు. అందులో నా తప్పలేదు" అని వ్యక్తి తప్పుకోవడానికి వీలు లేదు. మానవ స్వభావం అనేది పూర్వ నిర్దిష్టమై లేదు. ఎప్పటి కప్పుడు మానవుడుచేసే పనుల వల్లనే అది నిర్ణయ మవుతుంది. అలాగే "ప్రేమిం చడం మానవ స్వభావం కనుక నేను ప్రేమిస్తున్నా"నని అనడానికి వీలు లేదు. ఎందుకంటే ప్రేమించడం అనే పని వల్లనే మానవుని ప్రేమిక స్వభావం నిర్ణయ మవుతున్నది తప్ప, పూర్వ నిర్దిష్ట మానవ స్వభావం వల్ల ప్రేమించడం జరగదు.

"దేవుడు ఇలా రాసిపెట్టాడు కనుక నేను ఫలానా విధంగా ప్రవర్తించాను. నా తప్పేమీ లేదు" అనడానికి వీలు లేదు. ఎందుకంటే దేవుడనేవాడు లేడు. నీషే "God is dead—దేవుడు చనిపోయాడు" అని అన్నాడు. సార్త్రె అస్తిత్వ వాదంలో ఈ నిరీశ్వరవాదం ఒక ముఖ్యాంశం. దేవుడు వుంటే ఆయనపై భారం వేసి "అలా చెయ్యడం ఈశ్వరేచ్ఛ, లేదా ఈశ్వరాజ్ఞ. కనుక అలా చేశాను" అని తప్పించు కోవచ్చు. కాని, మానవుడికి గల నిర్ణయస్వేచ్ఛ కారణంగా దేవుని అవసరం లేకుండా పోతున్నది. దైవ శాసనం నిర్దిష్ట విధంగా వుండేటట్టయితే మానవుడు ఎంచుకొనడానికి ఇన్ని మార్గాలుండవు. దేవుడనేవాడుంటే బాగుండేదే. కాని, మానవుడి దురదృష్టవశాత్తు దేవుడు లేడు.

అలాగే మనుధర్మశాస్త్రం ఇలా చెప్పిందనో, భగవద్గీత ఇలా చెప్పిందనో, మరొక మత గ్రంథం ఇలా చెప్పిందనో, సంఘనీతి ఫలానా విధంగా వుందనో, ప్రభుత్వం ఫలానా విధంగా శాసించిందనో, స్నేహితులు, బంధువులు ఫలానా విధంగా ఒత్తిడి చేశారనో చెప్పి మానవుడు తను స్వీయ నిర్ణయ స్వేచ్ఛ నుంచి తప్పించుకోవడం కుదరదు. ఎందరు ఎన్ని రకాలుగా చెప్పినా, ప్రతి ప్రత్యేక సందర్భంలోను ఏదో ఒకదాన్ని నిర్ణయించుకునే బాధ్యత—ఏదో ఒక దాన్నే ఎంచుకునే బాధ్యత—మనిషిదే.

ఈ నిర్ణయ స్వేచ్ఛ (free choice) పర్యవసానం ఏమిటంటే మానవుడు తాను చేసే ప్రతి నిర్ణయాన్ని చాలా బాధ్యత (responsibility) తో చేయవలసి వుంటుంది. ఎందుకంటే ఒక సందర్భంలో ఒక నిర్ణయం చేశామంటే దాని ఫలితాలు ఎలా వుండబోతున్నాయో మనకు తెలియదు. ఇదివరకు ఇలాంటిదే ఒక సందర్భంలో ఫలానా విధంగా చేస్తే ఫలానా మంచి ఫలితం వచ్చింది కనుక, ఇప్పుడూ అలాగే చేయవచ్చునని అనుకోవడానికి వీలు లేదు. "చరిత్ర చర్విత చర్వణం కాదు— "History never repeats itself." ప్రతి సన్నివేశం కొత్తదే. అందుచేత ప్రతి నిర్ణయం ఎప్పటికప్పుడు కొత్తగానే చేయాలి. అందుచేత—ఏ నిర్ణయం వల్ల ఏ ఫలితాలు వస్తాయో తెలియదు కనుక— చాలా జాగ్రత్తగా, బాధ్యతగా ఆచి తూచి నిర్ణయం చేయాలి."

అంతేకాదు మనం ఒక పని చేశామంటే, ఒక నిర్ణయం చేశామంటే అది మన ఒక్కరి పక్షానే కాదు, మొత్తం మానవజాతి పక్షానే చేస్తున్నామని అర్థం. మనం ఒక నిర్ణయం ఎందుకు చేస్తాము? అది విలువైన నిర్ణయం, ప్రయోజనకరమైన నిర్ణయం అనే కదా! అందుచేత ఆ నిర్ణయాన్ని ఇతరులు కూడా గుడ్డిగా అనుసరించే ప్రమాదం వుంది. కనుక, మనం సరైన నిర్ణయం చేయకపోతే ఇతరులను కూడా తప్పు దారి పట్టించినవారమవుతాము.

ఇంత బరువైన బాధ్యత మనిషి మీద వుంటె కనుక, ఏమో ఈ నిర్ణయం తప్పేమో. సరైంది కాదేమో, దీని ఫలితాలు ఎలా వుంటాయో అనే అందోళన (anxiety- జర్మన్‌లో angst) మనిషికి విధిగా కలుగుతుంది. భయం (dread) కలుగుతుంది. ఆవేదన (anguish) కలుగుతుంది. ఇదంతా నిర్ణయ స్వేచ్ఛ వల్ల మానవుడి నెత్తిమీదపడే బాధ్యత కారణంగా కలిగే ఫలితం. అస్తిత్వవాదంలో అందోళన, అవేదన, భీతి- ముఖ్యాంశాలు.

ఇవి ప్రతి మానవుడికి తప్పనిసరిగా కలిగే అనుభూతులు (feelings). వీటి నుంచి ఏ వ్యక్తీ తప్పించుకోలేడు. జీవితంలో ఎప్పుడు ఏ ముఖ్య నిర్ణయం చేయవలసి వచ్చినా ఈ అనుభూతులు – భీతి, అందోళన, ఆవేదన– అతడిని వెన్నాడుతాయి.

ప్రపంచంలో మానవుడు ఏకాకి. చీకటిలో చీలుదారుల నడుమ నిలబడి ఎవరికీ వినబడని కేకలు వేసే ఏకాకి. "అంతరాళ భయంకర ప్రాంతరాలలో" తన ముళ్ళదారి తానే వెదుక్కునే ఏకాకి. అతనికి దారి చూపేవారు ఎవరూ లేరు.

ఇదీ మానవుడి పరిస్థితి (Human situation) దీనికి సార్త్రి చెప్పిన ఒక ఉదాహరణ అస్తిత్వవాద సాహిత్యంలో సుప్రసిద్ధమైనది. ద్వితీయ ప్రపంచ యుద్ధ సమయంలో ఒక యువకుడు సార్త్రి వద్దకు సలహా కోసం వచ్చాడు. స్వదేశ రక్షణకు నాజీ మూకలతో పోరాడడానికై సైన్యంలో చేరాలని అతనికి బలమైన కోర్కె కలిగింది. అతనిలో దేశభక్తి పెల్లుబికింది. తోటివారితోపాటు తాను సైన్యంలో చేరి మాతృదేశాన్ని రక్షించుకోవాలని, అది తన విధి అని అతడు భావిస్తున్నాడు. కాని, అతనికి ఒక ముదుసలి తల్లి వున్నది. అతడొక్కడే ఆమెకు దిక్కు. అతడే ఆమె సర్వస్వం. అతడినే ఆమె నమ్ముకుని వుంది. అతడు సైన్యంలో చేరితే ఆమె దిక్కులేని దీనురాలు అవుతుంది. ఆమె వద్ద వుండి పరిచర్యలు చేయడం కుమారుడిగా తన కనీసపు కర్తవ్యం.

ఈ రెండు ప్రత్యామ్నాయాల మధ్య, కర్తవ్య కర్తరిద్వయం మధ్య, అడ కత్తెరలో పోక చెక్కలా అతడు నలిగిపోతున్నాడు. దేశ రక్షణ కోసం తల్లిని విడిచిపెట్టి సైన్యంలో చేరడమా, తల్లి పోషణకోసం దేశం ఏమైపోయినా నా కేమిలే అని ఇంటివద్ద వుండిపోవడమా? "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి" – అంటే "జనని, జన్మభూమి స్వర్గం కంటె గొప్ప"– అన్నారు పెద్దలు. అది మంచి సుభాషితమే. కాని, జననికి, జన్మభూమికి మధ్య సందిగ్ధత ఏర్పడి ఒక్కరినే నిర్ణయించుకోవలసి వస్తే ఏమి చేయడం?

మాతృసేవ కోసం ఇంటివద్దనే వుండడం కుమారుని విధి అని చెప్పడానికి ఎన్ని బలవత్కారణాలుంటాయో, అంతకంటె బలవత్తర కారణాలు మాతృదేశ సేవకోసం ఇల్లువిడిచి వెళ్లాలనడానికీ వుంటాయి. తల్లిని దిక్కులేనిదాన్ని చేసిపో వడం ఎంత అనైతికమో, దేశం పిలుపు వినిపించుకోకపోవడం అంతే అనైతికం. చివరికి ఆ యువకుడు తనకు ఏది కర్తవ్యమో తానే నిర్ణయించుకోవాలంటాడు సార్త్రె.

## అడుగడుగున అస్తిత్వవాద సమస్యలు

సమస్త సృష్టిలో మానవుని కొక్కడికే తనకు కావలసినదాన్ని ఎంచుకునే స్వేచ్ఛ (free will, freedom of choice) ఉన్నాయి. నిర్ణయ స్వేచ్ఛ అనేది మాన వునికి మాత్రమే ప్రకృతి ప్రసాదించిన వరం.

జంతువులకు కూడా చైతన్యం ఉంది. తాము వేరు, తక్కిన ప్రపంచం వేరు, అనే జ్ఞానం వుంది. ఎంతో కొంత ఆలోచనా శక్తి వుంది, అయినా, వాటికి మానవుని తార్కిక వివేచన శక్తి, మంచీ చెడు, పాపం పుణ్యం. న్యాయం అన్యాయం మొదలైన ద్వంద్వాలను విడమరిచి, విశ్లేషించి, విచక్షణ చేయగల శక్తి లేదు. అవి తమ చర్యలకు, ప్రవర్తనకు హేతుత్వంపై కంటె సహజ జ్ఞానం (instincts)పై ఎక్కువగా ఆధారపడతాయి. ఇక వృక్షాలను తీసుకుంటే అవి ప్రాణులే అయినా, స్వస్వరూప జ్ఞానం లేని ప్రాణులు. ఇక జడ పదార్థాల సంగతి చెప్పనక్కరలేదు. అవి కేవలం వస్తువులు, వాటికి అస్తిత్వం ఉంది. కాని, అవి తమ అస్తిత్వం తాము ఎరగనివి.

మానవుడు తప్ప మిగిలిన చరాచర ప్రకృతి అంతా సంపూరిత పదార్థాలం (completed things) తో కూడినట్టిది. మానవుడు మాత్రమే అసంపూరిత, నిత్య పరివర్తన-నిత్య పరిణామశీలం గల జీవి. అతనికి మాత్రమే స్వతంత్రేచ్ఛ ఉంది.

మానవునికి గల ఈ ఇచ్ఛా స్వాతంత్ర్యం వల్ల ఏది నీతి, ఏది కాదు, ఏది ధర్మం, ఏది కాదు, ఏది కర్తవ్యం, ఏది కాదు అని నిర్ణయించుకోవలసి వచ్చినప్పుడు అతనికి భీతి, ఆందోళన, ఆవేదన కలుగుతాయని ఇంతకుముందు తెలుసుకున్నాము.

వీటినుంచి తప్పించుకోడానికి అతడు ప్రయత్నం చేస్తాడు. ఆ ప్రయత్నంలో అతడు bad faithకు లోనవుతాడని - అంటే ఆత్మవంచనకు, నిజాయితీ లేమికి పాల్పడుతాడని—సార్త్రె అంటాడు. తన నిర్ణయస్వేచ్ఛ అంతులేనిదని, తన చర్య

లకు బాధ్యత తన ఒక్కడిదేనని, తాను లోకంలో ఒంటరినని, శాస్త్రాలు, మతం, విశ్వాసాలు తనకు తోడు లేవని తెలుసుకున్నప్పుడు అతనికి భయం కలిగి తాను నిజంగా అంత స్వతంత్రుడిని కానని తనను తాను వంచించుకుంటాడు.

ఆత్మవంచన-bad faith-రెండు రకాలైనదని సార్త్రె అంటాడు. ఒకటి : మనిషి తాను నిజంగా స్వతంత్రుడిని కానని భావిస్తాడు. తనకు మార్పులేని, పూర్వ నిర్దిష్ట, పరంపరాగత స్వభావం వుందని, దానినుంచి తాను తప్పించు కోలేనని అనుకుంటాడు. తాను ఇలా తప్ప మరోలా ప్రవర్తించలేనని, తనకు పుట్టుకతో వచ్చిన స్వభావమో, గత చర్యలవల్ల అలవడిన స్వభావమో నిర్ది ష్టమై వుంది కనుక అలాగే ప్రవర్తిస్తానని, తనను తాను నమ్మించుకుంటాడు. అది అబద్ధమని, ఆత్మవంచన అని తెలిసి కూడా నిర్ణయ స్వేచ్ఛా బాధ్యత (responsibility of choosing) నుంచి తప్పించుకునే నిమిత్తం అలా భావిస్తాడు. తానొక అచేతన వస్తువులాంటి వాడినని, గాలి ఎటు వీస్తే అటు ఎగిరిపోయే కాగితం ముక్కలాంటివాడినని తలుస్తాడు.

ఈ సందర్భంలో సార్త్రె (తన "బీయింగ్ అండ్ నథింగ్‌నెస్"లో) ఒక ఉదాహరణ ఇస్తాడు : ఒక యువకునితో ఒక అమ్మాయి మొదటిసారిగా ఏ రెస్టారెంట్‌కో వెళ్లడానికి ఒప్పుకుంటుంది. ఆ యువకునికి తనపట్ల ఏ ఉద్దేశం వుందో ఆమెకు తెలుసు. ఇప్పుడే కాకపోయినా, మరి కాసేపటికి తాను ఏదో ఒక నిర్ణయానికి రాక తప్పదని కూడా తెలుసు కాని, అంత త్వరగా నిర్ణయా నికి రావలసిన అవసరం ఏమీ లేదని ఆమె భావిస్తుంది. తన స్నేహితుని ప్రవర్తన మర్యాదగా వుందా లేదా అన్నదే ఆమె గమనిస్తూ వుంటుంది. అతని మాటలలో తనపట్ల గౌరవం, మర్యాదలకు మించి మరేమైనా వున్నాయా లేదా అన్న విషయం పట్టించుకొనడానికి నిరాకరిస్తుంది. "నీవు చాలా అందంగా వున్నావు సుమా!" అని అతడు అంటే, అందులో సెక్సు సంబంధమైనదేమీ లేదని నమ్మాలని ఆమె అనుకుంటుంది. అతని ప్రవర్తనలో, మాటలలో పైకి కనబడే అర్థం తప్ప, అంతరార్థం ఏమీ లేదని కూడా అనుకుంటుంది. ఎందు కంటే ఆమెకు తనకేమి కావాలో తనకే తెలియదు. తాను అతనిలో బలమైన కోర్కె కలిగిస్తున్నానని ఆమెకు తెలుసు. కాని, అటువంటి కోర్కె ఎవరికైనా తన పట్ల వుండడం అవమానకరంగా భావిస్తుంది. కాని, అదే సమయంలో అతడు తనను కేవలం ఒక స్నేహితురాలుగా మాత్రమే పరిగణిస్తున్నాడని తెలిస్తే చాలా కోపం వచ్చేస్తుంది. ఆమెకు పూర్తి సంతృప్తి కలగాలంటే అతని వైఖరి తన పూర్తి వ్యక్తిత్వాన్ని, తన వ్యక్తిగత స్వేచ్ఛను గుర్తించేదిగా వుండాలి. అదే సమయంలో ఆ వైఖరిలో తన శరీరం పట్ల కోర్కె కూడా మిళితమై వుండాలి.

ఇంతలో అతడు ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుంటాడు. దానితో ఆమె వెంటనే ఏదో ఒక నిర్ణయానికి రావలసిన అవసరం ఏర్పడుతుంది.ఆ చేతిని అలాగే అతని చేతిలో వదిలేస్తే అతని కోర్కెను అంగీకరించినట్టు అవుతుంది. లాగేసుకుంటే తమ ఇరువురి మధ్య నడుస్తున్న అనిశ్చిత పరిస్థితిలోని సందిగ్ధతా మాధుర్యం కాస్తా ఎరిగిపోతుంది. అందుచేత ఆమె ఏదో ఒక నిర్ణయానికి రావలసిన ముహూర్తాన్ని వీలైనంత వాయిదా వేయడానికి నిర్ణయించుకుంటుంది. తన చేతిని అతని చేతిలో వదిలేస్తుంది. కాని, ఆ విషయం ఆమె గమనించదు. పైగా, ఏవో ఉదాత్త, గంభీర విషయాలను గురించి, జీవితం గురించి, తన జీవితం గురించి ఎంతో ఇంటలెక్చువల్‌గా మాట్లాడడం ప్రారంభిస్తుంది. తానొక ప్రత్యేక వ్యక్తినని, తన చైతన్యం, తన వ్యక్తిత్వం తనవేనని నిరూపించాలని ఆమె తాపత్రయం. ఆ ప్రయత్నంలో ఆమె శరీరం, మనస్సు వేరైపోయి, అతని చేతుల మధ్య ఆమె చేయి, అంగీకార–అనంగీకారాల అనిశ్చిత స్థితిలో కేవలం ఒక అచేతన వస్తువులా మిగిలిపోతుంది.

ఇది సార్త్రె చిత్రీకరించిన bad faith-ఆత్మవంచనకు ఒక ఉదాహరణ. మరొక రకమైన ఆత్మవంచనకు ఉదాహరణగా సార్త్రె ఒక కెఫేలోని వెయిటర్‌ను వర్ణిస్తాడు. వెయిటర్ అందరిలాంటి వ్యక్తే. కాని, వెయిటర్ విధి నిర్వహణలో అతని మానవ వ్యక్తిత్వం మరుగైపోతుంది. మనం కూర్చున్న బల్లవద్దకు గబగబ, చకచక అడుగులు వేస్తూ వస్తాడు. అతి వినయంగా, అవసరమైన దాని కంటె ఎక్కువగా వంగి మన ఆర్డరు తీసుకుంటాడు. మన పట్ల ఎక్కడలేని గౌరవం, విధేయత ఒలకబోస్తాడు. అంతా కృత్రిమంగా, నటనగా ఉంటుంది. అంటే ఇతరులు వెయిటర్ ఎలా వుండాలని కోరుతారో అలా నటిస్తాడు. తనకు వేరే అస్తిత్వం, నిర్ణయ స్వేచ్ఛ లేనట్టు ప్రవర్తిస్తాడు. ఎందుకంటే మరోలా ప్రవర్తిస్తే ఇతరులకు అతడు వెయిటర్ అనిపించడు.

కాని, వెయిటర్‌కు తెలుసు తాను ఉద్యోగరీత్యా మాత్రమే వెయిటర్‌నని, తన అసలు వ్యక్తిత్వం వేరే వుందని. అయినా, ఆ వ్యక్తిత్వాన్ని చంపుకుని తాను కేవలం ఒక వస్తువు (being- in-itself) అయినట్టు నటిస్తాడు. అది తప్ప విసరి నటన అని నమ్ముతాడు కూడా. అదీ bad faith-ఆత్మ వంచన.

నిజానికి, అతడు కావాలంటే మరొకలా వుండగలడు. అంత వినయం నటించ నక్కరలేదు. ఉదయమే అయిదింటికి లేవనక్కరలేదు. కెఫేను శుభ్రం చేయనక్కరలేదు. కాఫీ తయారు చేయనక్కరలేదు. కాఫీ తీసుకు రమ్మంటే తీసుకురానక్కరలేదు. కావాలంటే పొగరుగా సమాధాన మివ్వవచ్చు. అలా చేస్తే అతని ఉద్యోగం పోతుంది. కాని, అతను కోరుకుంటే ఉద్యోగం పోయే

టుట్టు ప్రవర్తించే స్వేచ్ఛ అతనికి వుంది. ఉద్యోగం పోతే జీవనోపాధి పోయి, పేదరికంతో భార్యా, పిల్లలు మగ్గిపోతారు. తనకేమని నిర్లక్ష్యంగా వుండే స్వేచ్ఛ అతనికి వుంది. కాని, అలా ఆ స్వేచ్ఛను ఉపయోగించడం వల్ల వచ్చే బాధలు అతనికి తెలుసు. అందువల్ల ఆ స్వేచ్ఛను వదులుకొని వెయిటరుతనాన్ని అలవరచుకుంటాడు. అదీ తన నిర్ణయమే. అంటే స్వేచ్ఛను వదులుకోవడం కూడా అతని స్వేచ్ఛలోని భాగమే. అందుచేతనే స్వేచ్ఛ మానవుడిని నిరంతరం వెన్నాడుతూనే వుంటుంది. వంచన ద్వారా, ఆత్మ వంచన ద్వారా తాను స్వతంత్రుడను కానని తనను తాను వంచించుకోవడం ద్వారా స్వేచ్ఛావిముక్తుడు కావడానికి మనిషి ప్రయత్నించడం కూడా స్వేచ్ఛా నిర్ణయమే. అందుకే తిరిగి ఆవేదన తప్పదు; నిస్పృహ (despair) తప్పదు.

ఈ నిస్పృహ మానవుని అస్తిత్వంలోనే వుంది. అందుకే అస్తిత్వవాదానికి ఒక రకం నిరాశావాదం అని పేరు వచ్చింది. అది మానవుడిని భయంకరమైన, అవతలి చివర వెలుగురేక అయినా కనబడని నిరాశావాదపు సొరంగంలోకి నెట్టుతుందని విమర్శించారు.

కాని, ఈ విమర్శను సార్త్రి ఒప్పుకోలేదు. అస్తిత్వవాదం అచ్చమైన ఆశావాదం అంటాడు అతడు.

ఎందుకంటే మానవుడు స్వేచ్ఛాజీవి, సంపూర్ణ స్వతంత్రుడు. అతని స్వభావం పూర్వ నిర్దిష్టమైంది కాదు. శాశ్వతంగా నిర్ణయమైపోయినట్టిది కాదు. అలాగే అతని భవిష్యత్తు కూడా. అది కూడా పూర్వ నిర్దిష్టం, నియతం అయినట్టిది కాదు. అది గతానుగతికం కాదు.

అందుచేత మనిషి తన భవిష్యత్తును తాను స్వేచ్ఛగా నిర్ణయించుకుని, తీర్చిదిద్దుకోగలడు. అవినీతి పనులవల్ల అవినీతిపరుడుగా పేరు పడినా, అతడు ఏ క్షణంలోనైనా నీతి మార్గాన్ని ఎంచుకోగలడు. మనిషి తాను పాపినని, దుర్మార్గుడినని, అసమర్థుడనని, అప్రయోజకుడనని, తన స్వభావం నుంచి తప్పించుకోలేని నిస్సహాయుడనని క్రుంగిపోనక్కరలేదు. మానవ స్వభావం నిరంతర పరివర్తన శీలం కలది. అది నిత్యం becoming—పరివర్తన—అనే స్థితిలోనే వుంటుంది. అతడు సిరాబుడ్డి లాంటివాడు కాదు. సిరాబుడ్డి ఎప్పటికీ సిరాబుడ్డిగానే వుంటుంది. కాని, భీరువుగా ప్రవర్తించే వ్యక్తి ఎప్పటికీ భీరువుగానే వుండ నక్కరలేదు. ధీరుడుగా తనను తాను మలచుకోవచ్చు. అవినీతిపరుడు నీతిపరుడుగా మారవచ్చు. దుర్మార్గుడు సన్మార్గుడుగా నూతన జీవితం ప్రారంభించవచ్చు. మానవుడు తనకు గల సంపూర్ణ (total) మైన, అవధులులేని

(boundless), అనంత (infinite) మైన నిర్ణయ స్వేచ్ఛ (freedom of choice) వల్ల తన భవిష్యత్తును ఎలా కావాలంటే అలా మార్చుకోవచ్చు. ఇది సకల చరాచర జగత్తులో మానవుడికి ఒక్కడికే ప్రకృతి ప్రసాదించిన వరం. నాణానికి ఒకవైపు శాపమైతే, మరొకవైపు వరం.

ఒక మనిషి ఏ పని అయినా ఎందుకు చేస్తాడు? ఉన్న పరిస్థితిని మార్చడం కోసం, భవిష్యత్తును తన ఇష్టప్రకారంగా తీర్చిదిద్దడం కోసం. మనిషి ఒక నిర్ణయం చేశాడంటే, ఒక పని చేశాడంటే అతడు భవిష్యత్తును తనకు అనుకూలమైన వర్తమానంగా మార్చుతున్నా డన్నమాట. ఎలా ఏ పని చేస్తే భవిష్యత్తు తనకు అనుకూలంగా మారుతుందో అలా ఆ పనే చేసే స్వేచ్ఛ అతనికి వుంది.

ఇది వ్యక్తికి వలె, సంఘానికి, జాతికి కూడా వర్తిస్తుంది. మొత్తం మానవాళికే వర్తిస్తుంది. వ్యక్తి, సంఘం, మానవాళి తమ భవిష్యత్తును తామే నిర్ణయించుకోవాలి. ఆ నిర్ణయ స్వేచ్ఛ వారికి వుంది. ఇటువంటి ఆశను మానవునిలో, సమాజంలో పురికొల్పుతుంది కనుకనే అస్తిత్వవాదం ఆశా వాదం కూడా, ద్వితీయ ప్రపంచ యుద్ధ కాలంలో సార్త్రె, కామూ (Albert Camus) వంటి అస్తిత్వవాదుల రచనలు నాజీ దురాక్రమణ ప్రతిఘటనోద్యమం (underground resistence movement) లో ప్రముఖ పాత్ర వహించాయి. ఆనాటి నిరాశామయ పరిస్థితులలో ఫ్రెంచివారికి ఊరట కలిగించాయి. ధైర్యం ప్రబోధించాయి. కర్తవ్యోన్ముఖులను చేశాయి.

అస్తిత్వ వాదంలో నిరాశావాదం గర్భితమై వుందన్న విమర్శకు ఒక కారణం జీవితం నిజంగా ఎంత సంక్లిష్ట వ్యాపారమో గుర్తించలేకపోవడమేనని సార్త్రె అంటాడు. ప్రతి మానవుడు స్వాతంత్ర్యాన్నే కోరుతాడు. తన భవిష్యత్తును తానే నిర్ణయించుకోగోరుతాడు. అయితే, ఆ నిర్ణయ స్వేచ్ఛను వెన్నంటి వచ్చే బాధ్యత ఎంత భయంకరమైనదో నిర్ణయం చేయవలసి వచ్చేదాకా అతడు గుర్తించలేడు. తాను కోరకుండానే తనకు నిర్ణయ స్వాతంత్ర్యం జన్మతః లభించిందని, దానినుంచి తనకు విముక్తి లేదని తెలుసుకున్నప్పుడు, ఆ స్వాతంత్ర్య బాధ్యత తనకు ఒక వంకెల వంటిదని గ్రహించినపుడు మనిషి ఆవేదనకు, ఆందోళనకు లోనవుతాడు. ఎందుకంటే మనిషి వివిధ ప్రత్యామ్నాయాలలో ఒక దాన్ని ఎంచుకునేటప్పుడు తన పక్షాననే కాదు, సమస్త మానవాళి పక్షాన నిర్ణయం చేసినవాడు (legislating for all mankind) అవుతున్నాడు. అందుకనే అంత ఆందోళన. అందుకే వ్యక్తి ఆచి తూచి అమిత జాగ్రత్తతో నిర్ణయం చేయవలసి వుంటుంది.

సార్త్రి కాంట్ తాత్విక సిద్ధాంతాలకు వ్యతిరేకి. కాంట్ భావవాది, సార్త్రి అస్తిత్వవాది. అయినా, అతని వివేచన పద్ధతిపై హెగెల్ గతితార్కికవాద ప్రభావం ఎంతగా వుందో, అతని నైతిక సూత్రంపై కాంట్ ప్రభావం అంతగా వుందనిపిస్తుంది. ఉదాహరణకు, కాంట్ "క్యాటిగారికల్ ఇంపరేటివ్" అనే నైతిక సూత్రాన్ని ప్రవచించాడు. "నీ కర్తవ్యం ఏది అన్న ప్రశ్న వచ్చినప్పుడు, ఏ కర్తవ్యమైతే నీవు సార్వజనీన నైతిక సూత్రం కావాలని కోరుకోగలవో, అదే నీ కర్తవ్యం అవుతుంది"— అంటే నీకొక కర్తవ్యం, ఇతరులకు మరొక కర్తవ్యం అనేది వుండదు. అందరు ఆచరించి తీరాలన్న నీతి సూత్రాన్ని మాత్రమే నీ కర్తవ్యంగా చేసుకోవాలి. దీనికీ సార్త్రి ప్రబోధించిన legislating for all mankind అన్న సూత్రానికి తేడాలేదు.

సార్త్రి అస్తిత్వవాదంలోను, అసలు అన్ని రకాల అస్తిత్వవాదాలలోను, కొన్ని లోపాలు లేకపోలేదు; అతివ్యాప్తి, అవ్యాప్తి, అతిశయోక్తి దోషాలు లేకపోలేదు. అయినా, ఒకందుకు మాత్రం అస్తిత్వవాదం పాశ్చాత్య తత్వ దర్శనాలలో కెల్లా విశిష్టమైంది. అది ఎక్కువమందికి సన్నిహితంగా వస్తుంది. చల్లగా పలకరిస్తుంది. వ్యక్తితో పాటు కన్నీరు కారుస్తుంది. వ్యక్తి కన్నీరు తుడుస్తుంది. వ్యక్తి కన్నీటికి భాష్యం చెబుతుంది, తరణోపాయం చూపిస్తుంది. వ్యక్తికి—మానవ వ్యక్తికి— మానవుని స్వేచ్ఛకు పట్టాభిషేకం చేస్తుంది. మానవుడి నుంచి అతని స్వేచ్ఛను, అతని human dignity ని ఎవరూ వేరుచేయలేరని అభయమిస్తుంది.

అస్తిత్వవాదం గత శతాబ్దంలో కీర్క్‌గార్డ్‌తో ప్రారంభమైన సిద్ధాంతమైనా, అది మానవునికి ఎప్పుడూ పరిచితమైనదే. ఒక తత్వ దర్శనంగా అది కొత్తది కావచ్చు. ప్రతి మానవుడూ ఎగ్జిస్టెన్షలిస్టు కాడు. కాని, ప్రతి మానవుడు ఎప్పుడూ—ముఖ్యంగా వివిధ ప్రత్యామ్నాయాలు మసక చీకటిలో అస్పష్టాకారాల్లాగా చుట్టూ మూగి అతని కళ్లల్లోకి సూటిగా చూస్తున్న ప్రతిసారి అస్తిత్వ సమస్యా పరిస్థితిలోనే ("existential situation"లో) వుంటాడు.

శ్రీరాముడు జనాపవాదానికి వెరచి సీతను పరిత్యజించడమా, మానడమా అని సంశయాకులితుడైనప్పుడు—

అర్జునుడు పాండవ, కౌరవ సేనల మధ్య రథం నిలిపి, యుద్ధం చేసి బంధు మిత్రులను వధించడమా, యుద్ధం మాని వెనుదిరిగిపోవడమా అని కింకర్తవ్యతా విమూఢుడైనప్పుడు—

సిద్ధార్థుడు జీవితపరమార్థాన్ని అన్వేషిస్తూ రాజ్యాన్ని, భార్యాపుత్రులను

వదలి మహాభినిష్క్రమణం చేస్తూ (తిరుపతి వెంకట కవులు బుద్ధ చరిత్రలో "ఒక కొంతేగును, సంశయించును, సముద్యుక్తత్వమున్ చెందు, వేరొక కొంతేగు, యథాస్థితింగను, నిరుద్యోగంబు వాటించు..." అని వర్ణించినట్టు) డోలాందోళితుడైనప్పుడు—

హామ్లెట్ "To be or not to be that is the question" అని మథనపడినప్పుడు-

టి. ఎస్. ఇలియట్

"Between the idea
And the reality
Between the motion
And the act
Falls the shadow"

అని వాపోయి నప్పుడు—

"ఏది పుణ్యం, ఏది పాపం,
ఏది సత్యం, ఏదసత్యం,
ఏది నీతి, ఏది నేతి,
ఏది మంచి, ఏది చెడువు"

ఓ మహాత్మా...

అని శ్రీశ్రీ ద్వంద్వ ప్రత్యామ్నాయాల కోరల మధ్య చిక్కుకుని ప్రశ్నించినప్పుడు-

అస్తిత్వవాద ప్రతిధ్వని వినిపిస్తుంది. అంతేకాదు.

సంశయాంధ్య సంవృతమైన లోకంలో ఏకాకిగా నిలబడి సోక్రటీస్ తన అభిమానులు, శిష్యులు దేశం విడిచిపొమ్మని సలహా ఇచ్చినా పెడచెవిన పెట్టి విషపాత్ర స్వీకరించడానికే స్వచ్ఛందంగా నిర్ణయించుకున్నప్పుడు—

మనిషి ఎటువంటివాడైనా, A man's a man for a' that అని వ్యక్తిని స్కాటిష్ కవి రాబర్ట్ బర్న్సు కీర్తించినప్పుడు—

డాస్టొయెవ్‌స్కీ తన "క్రైం అండ్ పనిష్మెంట్" నవలను "But that is the beginning of a new story, the story of the gradual rebirth of a man, the story of his gradual regeneration, of his gradual passing from one world to another, of his acquaintance with a new and hitherto unknown reality" (అది ఒక నూతన కథకు ప్రారంభం. అది నెమ్మది నెమ్మదిగా మానవుని పునర్జననా

నికి, పునరుజ్జీవనానికి, ఒక ప్రపంచం నుంచి మరో ప్రపంచానికి మారడానికి, ఇంతవరకు తెలియని ఒక నూతన సత్యంతో అతని పరిచయానికి, సంబంధించిన కథ) అనే వాక్యాలతో ముగించినప్పుడు–

చెకోవ్ "చెర్రీ ఆర్చర్డ్" నాటకంలో "And yet, always, every movement of the day and night my soul has been filled with such marvellous hopes and visions, I can see happiness, Amia, I can see it coming..." (రాత్రి పగలు ప్రతి క్షణం ఏవో అద్భుత ఆశలతో, స్వప్నాలతో నా మనస్సు నిండి పోతున్నది. నాకు ఏదో ఆనందం కనిపిస్తోంది, అది రావడం కనిపిస్తోంది...) అని ఒక పాత్రచేత అనిపించినప్పుడు–

గోర్కీ "లోయర్ డెప్త్స్" అనే నాటకంలో "Man alone exists- everything else is the creation of his brain ! Man ! It is glorious ! It sounds - oh - so big Man must be respected- not degraded with pity - but respected, respected ! Let us drink to man..." ("మనిషి మాత్రమే వున్నాడు. మిగిలిన దంతా అతడు తన మెదడుతో సృష్టించినదే. మనిషి ! అద్భుతం ! ఎంత గొప్ప మాట ! మనిషిని గౌరవించాలి. జాలితో కించపరచరాదు. గౌరవించాలి, గౌరవించాలి. మనిషి గౌరవార్థం, మధువు సేవిద్దాం...") అని ఒక పాత్రచేత పలికించినప్పుడు–

అంగ్ల కవి విలియం హెన్లీ Invictus అనే కవితలో
"I am the master of my fate :
I am the captain of my soul"
అని వ్యక్తి స్వేచ్ఛను సగర్వంగా ప్రకటించినప్పుడు–
కృష్ణశాస్త్రి
"ఇది మాత్రం నిజమనవోయ్ !
మకుటధారి మానవుడని..."
అని మనిషిని కీర్తించినప్పుడు–
శ్రీశ్రీ
"మనుష్యుడే నా సంగీతం,
మానవుడే నా సందేశం"
అని ప్రస్తుతించినప్పుడు–

అప్పుడు కూడా అస్తిత్వవాదంలో నిక్షిప్తమైన ఆశావాద వీణావాదనం వినిపిస్తుంది.



# తత్వశాస్త్ర పదకోశం

## (Philosophical Terms)

| | | |
|---|---|---|
| అంతర్బుద్ధి | : | Intuition |
| అంతః ప్రబోధం | : | „ „ |
| అంతరజ్ఞానం | : | „ „ |
| .అంతసూత్రం | : | Inner Principle |
| అంతిమ కారణం | : | Final Cause |
| అజ్ఞేయం | : | Unknowable |
| అజ్ఞేయవాదం | : | Agnosticism |
| అణువు | : | Atom |
| అతీత భావ వాదం | : | Transcendental Idealism |
| అదనపు విలువ | : | Surplus Value |
| అనంతత్వం | : | Infinity |
| అనుభవ వాదం | : | Empiricism |
| అనుభూతి వాదం | : | „ „ |
| అనుభవాత్పూర్వం | : | A Priori |
| అనుభవానంతరం | : | A Posteriori |
| అనుమాన ప్రమాణం | : | Inference |
| అభివ్యక్తం | : | To be Manifest |
| అభివ్యక్తత | : | Realization, Manifestation |
| అభ్యుదయ వాదం | : | Meliorism |
| అభౌతికం | : | Non - material |
| అమానసికం | : | Non - mental |
| అమూర్తత | : | Abstraction |
| అవగాహన | : | Understanding |
| అవిచ్ఛిన్నత | : | Continuity |
| అవిభాజ్యం | : | Indivisible |
| అసంబద్ధత | : | Absurdity |
| అస్తిత్వం, ఉనికి, యాథార్థ్యం | : | Being, Existence, Reality |
| అస్తిత్వవాదం | : | Existentialism |
| ఆంగికం | : | Organic |
| ఆంతర వివేచనం | : | Inner Reasoning |

| | | |
|---|---|---|
| ఆందోళన | : | Anxiety, Angst |
| ఆకృతిక కారణం | : | Formal Cause |
| ఆకృతులు | : | Forms |
| ఆగమనం | : | Induction |
| ఆత్మపరత్వం | : | Subjectivity |
| ఆత్మవంచన | : | Bad Faith |
| ఆదర్శం | : | Ideal |
| ఆదికారణం | : | First Cause |
| ఆభాస | : | Appearance, Phenomenon |
| ఆభాసిక గుణాలు | : | Secondary Qualities |
| ఆభాసిక ప్రపంచం | : | Phenomenal World |
| ఆవశ్యకత | : | Necessity |
| ఆవృత్తం | : | Cycle |
| ఆవేదన | : | Anguish |
| ఇంద్రియ సంవేదనలు | : | Sense Impressions, Sensations |
| ఇంద్రియానుభవం | : | Sensory Experience |
| ఇంద్రియానుభూతి | : | Perception |
| ఇచ్ఛ | : | Desire, Will |
| ఉత్పత్తి సాధనాలు | : | Implements of Production |
| ఉన్నమితం | : | Sublimation |
| ఉపయోగితావాదం | : | Utilitarianism |
| ఎరుక | : | Awareness |
| ఏకసత్తావాదం | : | Monism |
| ఐంద్రియజగత్తు | : | Sensible World |
| కార్యకారణత్వం | : | Causality |
| కార్మిక వర్గం | : | Proletariat |
| కాలగమన స్థితి | : | Duration |
| కేవల భావం | : | Absolute Idea |
| కేవల భావవాదం | : | Absolute Idealism |
| గతి తర్కం | : | Dialectics |
| గతి తార్కిక భావవాదం | : | Dialectical Idealism |
| గతి తార్కిక భౌతికవాదం | : | Dialectical Materialism |
| గర్భిత స్థితి | : | Potentiality |
| గుణాలు | : | Qualities |

| | |
|---|---|
| గోత్వం | : Cowness |
| గోభావం | : Idea of a Cow |
| చలనం | : Motion |
| చిచ్ఛక్తి బిందువులు | : Monads |
| చిత్తు | : Consciousness |
| చైతన్య ప్రవంతి | : Stream of Consciousness |
| జీవశక్తి | : Elan Vital, Life Force |
| జ్ఞానశాస్త్రం | : Epistemology |
| తటస్థ అద్వైతవాదం | : Neutral Monism |
| తత్వ విచారం | : Philosophical Enquiry |
| తత్వ వివేచన | : Philosophical Reasoning |
| తత్వశాస్త్రం | : Philosophy |
| తత్వాన్వేషణ | : Philosophical Quest |
| తర్క విశ్లేషణవాదం | : Philosophy of Logical Analysis |
| తర్కశాస్త్రం | : Logic |
| తాత్వికుడు | : Philosopher |
| తార్కికుడు | : Logician |
| తార్కిక పర్యవసానం | : Logical Conclusion |
| త్రికతర్కం, త్రయీతర్కం | : Syllogism |
| ద్రవ్యం | : Matter, Substance |
| ద్వంద్వాలు | : Duality |
| ద్వంద్వతర్కం | : Dialectic |
| ద్వితీయకగుణాలు | : Secondary Qualities |
| ద్విసత్తావాదం | : Dualism |
| నాస్తిత్వం | : Nothingness |
| నిగమనం | : Deduction |
| నిమిత్తకారణం | : Efficient Cause |
| నియతివాదం | : Determinism |
| నిరంతరత్వం, నైరంతర్యం | : Continuity |
| నిరవధికం | : infinite |
| నిరపేక్షం | : Absolute |
| నిర్ద్వంద్వ కర్తవ్యం, అవశ్య కర్తవ్యం, అసందిగ్ధ కర్తవ్యం | : Categorical imperative |
| నిర్ణయస్వేచ్ఛ | : Free will |
| నిర్దుష్టం | : Perfect |

నిశ్చితత్వం : Certainity
నిశ్చయజ్ఞానం : Certain Knowledge
నిస్పృహ : Despair
నైతిక సంకల్పం : Moral Will
పరిమితత్వం : Finiteness
పరివర్తన : Becoming, Change
పారభౌతిక శాస్త్రం : Metaphysics
పారస్పర్యం : Reciprocity
ప్రజల ఒప్పందం : Social Contract
ప్రతిబింబాలు : Impressions
ప్రతివాదం : Antithesis
ప్రత్యేక వస్తువులు : Particulars
ప్రాథమిక భావాలు : Simple Ideas
ఫలితాత్మకవాదం : Pragmatism
బహుసత్తావాదులు : Pluralists
బాహుళ్యం : Multiplicity
భయం, భీతి : Dread
భావాలు : ideas
భావవాదం : Idealism
బుద్ధి : Intellect, Intelligence
బుద్ధివాదం, బౌద్ధికవాదం : Rationalism
భౌతిక కారణం : Material Cause
భౌతికవాదం : Materialism
బౌద్ధికం : Rational
మానసిక స్థితులు : Mental States
మేధావ్యాపారం : Intellectual Activity
మౌలికగుణాలు : Primary Qualities
యదృచ్ఛ : Accident, Chance
యథార్థం : Reality
యథార్థజగత్తు, వాస్తవజగత్తు : Noumenal World, Real World
లక్షణాలు : Attributes
వర్గం : Class
వర్గరహిత సమాజం : Classless Society
వర్గాలు, తత్వాలు : Categories
వర్గీకరణ : Classification

| | | |
|---|---|---|
| వాదం | : | Thesis, Argument |
| వాస్తవత్వం, వస్తుపరత్వం | : | Objectivity |
| వాస్తవీకరణ | : | Objectification |
| విరోధాభాస | : | Paradox, Antinomy |
| విరుద్ధ ప్రతిపాదన | : | Antinomy |
| వివేచన | : | Reasoning |
| విస్తృతి | : | Extension |
| విషయ జగత్తు, దృగ్విషయ జగత్తు | : | Phenomenal world |
| వైమనస్యం, పరాయీకరణ | : | Alienation |
| శుద్ధసత్ | : | Pure existence |
| శుద్ధచిత్ | : | Pure consciousness |
| సంకల్పం | : | Will |
| సంక్లిష్ట భావాలు | : | Complex Ideas |
| సంవేదన | : | Sensation |
| సంశయవాదం | : | Skepticism |
| సంశ్లేషణాత్మక ప్రతిపాదన | : | Synthetic Judgment |
| సత్ | : | Existence |
| సత్తా | : | Being |
| సమన్వయవాదం | : | Synthesis |
| సరుకులు | : | Commodities |
| సహజజ్ఞానం, సహజాతం | : | instinct |
| సృజనాత్మక పరిణామవాదం | : | Creative Evolution |
| సాధారణీకరణం | : | Generalisation, |
| | : | Universalisation |
| సామస్త్యం | : | Totality |
| సార్వత్రికత | : | Universality |
| స్వతంత్రేచ్ఛ | : | Free Will |
| స్వతస్సిద్ధ భావాలు | : | innate ideas |
| స్వయంసిద్ధ సత్యం | : | Self - evident Truth |
| సూక్ష్మజగత్తు | : | Microcosm |
| స్థూలజగత్తు | : | Macrocosm |
| హేతుపరత్వం | : | Rationality |
| హేతువిరుద్ధం | : | irrationality |

# విశ్వదర్శనం ఆధార గ్రంథావళి

## (Bibliography)


1. History of Philosophy — Frank Thilly
2. A History of Philosophy — Fuller/Mc Murrin
3. History of Western Philosophy — Bertrand Russell
4. Our knowledge of External World — Bertrand Russell
5. My Philosophical Development — Bertrand Russell
6. The Story of Philosophy — Will Durant
7. Guide to Philosophy — C. E. M. Joad
8. Great Philosophers — Thomas & Thomas
9. 100 Great Thinkers — Jay E. Greene
10. Philosophy — Nicholas A. Horwath
11. Introduction to Philosophy — H. Gene Blocker & William Hannaford
12. The Worldly Philosophers — Robert Heilbromer
13. Masters of Political Thought
    a) Vol. 1. Michael B. Foster
    b) Vol. 2. W. T. Jones
    c) Vol. 3. Lane W. Lancaster
14. 19th Century Philosophers — Ed. Patrick E. Gardiner
    a) Berkely — J. O. Urmson
    b) Hume — A. J. Ayer
    c) Kant — Roear Scruton
    d) Marx — Peter Singer
15. The World's Great Thinkers (4 vols.) — Ed. Saxe Commins & Robert N. Linscott
16. The Communist Manifesto — Marx & Engels
17. Anti - Duhring — F. Engels
18. The Philosophy of Schoepenhauer — Ed. Irwin Edman
19. Science & the Modern World — A. N. Whitehead
20. The Problem of Knowledge — A. J. Ayer
21. The Central Questions of Philosophy — A. J. Ayer
22. Existentialism — Mary Warnock
23. Being & Nothingness — Jean Paul Sartre
24. Words — Jean Paul Sartre
25. Encyclopaedia Britannica–

# పుట్టపర్తి నారాయణాచార్యుల వారి అభిప్రాయం

## మాన్యమిత్రులు శ్రీ నండూరి రామమోహనరావు గారికి-
## పుట్టపర్తి నారాయణాచార్యుల ఆశీస్సులు !

నా జాబు మీకు ఆశ్చర్యాన్ని కలిగిస్తుందనుకుంటాను. విజయవాడ నుండి వచ్చినప్పటి నుండి యేదో ఒక రీతిగా అనారోగ్యంతో బాధపడ్తున్నాను.

మీరు నాకు యిచ్చిన "విశ్వదర్శనం" ఆషామాషీగా చదివే పుస్తకం కాదు. జాగ్రత్తగా అధ్యయనం చేయవలసిన గ్రంథం. అసలది జ్యోతి పత్రికలో వచ్చేటప్పుడే ఆ వ్రాతలు నన్ను ఎంతో ఆకర్షించినాయి. ఇప్పుడు ఒక పుసక్తంగా చదివే భాగ్యం ఏర్పడింది.

వాస్తవానికి మీ విశ్వదర్శనం వైజ్ఞానిక లోకానికి గొప్ప కానుక. ఈ కాలంలో యింత కష్టపడి గ్రంథాన్ని తయారు చేశారంటే, మీ ఓర్పు, పట్టుదల యెంతో శ్లాఘింప దగినది.

ఈ గ్రంథం చదివేటప్పుడు అడుగడుగునా ఎంత సంతోష పడినానంటే చెప్పడానికి వీల్లేదు. నిగూఢ భావాలను కూడా సరసంగా చెప్పగలిగిన మీ వచనం ఎంతో సంతోష పరిచింది.

థెలీస్ మొదలుకొని జాన్‌పాల్ సాత్రే వరకు యెంతో ఆసక్తితో పుస్తకాన్ని చదివినాను. ఆర్యుల అరణ్యాల్లో వలెనే గ్రీకు వేదాంతుల ఆలోచనలు కూడా నదీ తీరాల్లోనే వుద్భవించి, ప్రవృద్ధమైనాయి.

గ్రీకు వేదాంతుల్లో తొలినాళ్ళ వారే ప్రాచ్య దేశాల్లో పర్యటించినట్లు తామే ఒక చోట చెప్పినారు. కనుక ఆదాన ప్రదానాలు తప్పక జరిగే వుంటాయి. ఉపనిషత్తుల కాలాల్ని గురించిన వాదాలు ఇప్పటికీ వున్నాయి కదా!

మనం ఆనాడు మాట్లాడుకోవడంలో గ్రీకు వేదాంతుల విషయం వచ్చి, వాళ్ళు ఒరిజినల్‌గానే థింక్ చేసినారేమో మీ అభిప్రాయం - రాయండి అన్నారు. అప్పుడే నేను ఏమి చెప్పలేక పోయినాను. మీ గ్రంథం చదివేటప్పుడు పరస్పర ఆదాన ప్రదానం జరిగివుంటుందనే అభిప్రాయం దృఢమైంది.

అసలు గ్రీకు వేదాంతుల కాలం నాటికే మన దేశంలో బుద్ధుడు, మహావీరుడు జన్మించినారు. వైదిక మతం యొక్క వున్నతి, అవనతి అంతకు ముందే జరిగి

పోయాయి. అనేక మూసాలుగా బ్రహ్మవాదం చోటు చేసుకున్నది. మరి, ఈ ఇన్‌ఫ్లూయన్స్‌లు అన్నీ గ్రీకు వేదాంతులపై పడి వుంటాయికదా!

నీరు, నిప్పు, గాలి విశ్వానికి కారణాలనే వాదాలతో పాటూ "విశ్వం పాంచ భౌతిక"మని, పరిణత స్వరూపం కూడా ఉపనిషత్‌లలో కనబడుతుంది కదా!

డయలెక్టిక్స్ కూడా మన శాస్త్రాల్లో వుండేదే! దీన్ని అంగీకృత్య ఖండనము అంటారు. హిడోనిజమ్ కూడా మనకు కొత్తది కాదు. సోక్రటీస్, ప్లేటో, కారల్ మార్క్స్, సార్త్రే, జేమ్స్ మొదలగు వాళ్ళయొక్క సంగ్రహ జీవిత చరిత్రలు కూడా మీ పుస్తకంలో యిచ్చారు. దానితో వారి వాదాలన్నీ యింకా వుజ్జ్వలంగా చేసినట్లయింది.

గతి తార్కికాన్ని వివరిస్తూ వాదం-ప్రతివాదం-సమన్వయం అని వ్యాఖ్యానించారు. ఈ వివరణ చాలా బాగుంది. ఈ వాదాలన్నీ శాస్త్రాల్లో వుండేటివే! ఈ ఛాదస్త పండితులు వాటిపై దృష్టి పెట్టకుండా యేదో పిడివాదాలు చేస్తుంటారు.

ప్లేటో రాసిన రిపబ్లిక్ అనే గ్రంథము చాలా సంవత్సరాల క్రిందట చదివాను. ఆనాడు అది నాకు అర్థం కాలేదు. మరలా ఆ పుస్తకం ఎక్కడైనా దొరికితే బాగున్ను అనిపిస్తుంది. సోక్రటీస్ వాదమంటే నాకు అభిమానము. ఆయన జీవితము అన్నా గొప్ప గౌరవము. అందుకే నా "మేఘదూతము"లో సోక్రటీస్ ప్రస్తావన తెచ్చాను.

ఇంకా ఎన్నో విషయాలు ఈ గ్రంథం చదివేటప్పుడు మొదట్లో తోచినాయి. కానీ విషయాల గుర్తు చేసుకోవడానికి చేతకావడం లేదు. వేళ్ళు వణుకుతాయి.

మీరు యిలాగే, అరవిందులు, జిడ్డు కృష్ణమూర్తి, మాస్టర్ సి.వి.వి., త్రిమతాలు, వల్లభము, భాస్కరాచార్య మొదలైన వాళ్ళ అభిప్రాయాలు వివరిస్తే అప్పటికి మీ కావ్యం సంపూర్తి అవుతుంది. ఆ క్షణాలు ఎప్పుడు వస్తాయోనని యెదురు చూస్తూవున్నాను.

నేను మీకు రాసిన ఈ రాత మీ గ్రంథం చదివేటప్పుడు పొందిన ఆనందానికి రేఖామాత్రమే ! మీ కృషికి ఎంతో సంతోషము.

ఇట్లు

**పుట్టపర్తి నారాయణాచార్యులు**

30-8-1989